# సి. పి. బ్రౌన్

**(1798 – 1884)**

"సూర్లార్లు లెక్కచేయక
పేర్లందిన విబుధవరులఁ బిలిపించుచు వే
మార్లర్థ మిచ్చు వితరణి
చార్లీసు ఫిలిప్పు బ్రౌను సాహెబు కరుణన్"

కొత్తపల్లి వీరభద్రరావు

**C. P. BROWN** (1798–1884)
(A Biography of Charles Philip Brown, a British Civilian of the East India Company in the Madras Presidency who was also a Telugu Scholar)

By Dr. KOTTAPALLI VEERABHADRA RAO

First Edition 1963 XXIII + 279 (A.P. Sahitya Akademi Publication)
Second Edition 1988 XVI + 488 + XXIV
(Thoroughly Revised and Enlarged)

Price : Rs. 80/- $10 £8

**Printed in India**

CHARY & CO.,
Secunderabad

GAYATHRI ART PRINTERS
Hyderabad.

Published by the Author at
179, West Nehrunagar, Secunderabad. (A.P.)

FOR COPIES

**Smt. K. LALITA.,** M.A.,
179, West Nehrunagar,
Secunderabad–500 026. INDIA.

రాజమండ్రిలో నున్నప్పటి బ్రౌనుదొర హస్తాక్షరములు

# విషయ సూచిక

## మహారాజశ్రీ బ్రౌనుదొర గారికి

మధువైరికిన్ వనమాలికిఁ గౌస్తుభ
హారునకును సంశ్రితావనునకు
రాధికాప్రియునకు రామసోదరునకు
జగదీశునకు దయా సాగరునకు
శ్రీనాథునకును రక్షిత దేవ సమితికిఁ
ప్రౌఢభావునకు నారాయణునకు
సురగేంద్రతల్పున కరి శంఖ ధరునకుఁ
దొగల రాయని గేరు మొగము దొరకు
రణనిహత దుష్టరాక్షస రమణునకును
గానమోహిత వల్లవీకాంతునకును
రిపు విదారికి హరికి శ్రీ కృష్ణునకును
కిల్బిషారికి నే నమస్కృతి యొనర్తు.

పిండిప్రోలి లక్ష్మణకవి

పై పద్యమును పిండిప్రోలి లక్ష్మణకవి బ్రౌనుదొరను కలిసి నప్పుడు చెపి నట్లు తెలియుచున్నది.

లక్ష్మణ కవినిగూర్చి బ్రౌనుదొర "Pindiprolu Luschmana Kavi. at Kuyyuru in Dracsharama, a Curnum Mirasidar is a noble poet" అని వ్రాసిపెట్టుకొనెను.

బ్రౌనుదొర రాజమహేంద్ర వరములో మొట్ట మొదటిసారి 1825 లో కలక్టరు-మేజిస్ట్రేటునకు హెడ్డుఅసిస్టెంటుగాను, రెండవసారి, 1829లో అసిస్టెంటు జడ్జి-జాయంటు క్రిమినలు జడ్జిగాను, మూడవసారి 1833-1834 లో ఆక్టింగు జడ్జిగాను పనిచేసెను.

'రావణ దమ్మీయము' అను నామాంతరము గల 'లంకా విజయము' ను, తాను "కల్యబ్దములు 4898 ... .... ఇంగ్లీషు సంవత్సరంబులు 1797......అగు పింగల సంవత్సర శ్రావణ మాసములో రచింప నుద్యోగించి యున్నట్లు లక్ష్మణకవి కావ్యావతారికలో వ్రాసికొనెను. లక్ష్మణకవి బ్రౌనుదొరను 1825 లోగాని, 1829లో గాని 1834లో గాని కలిసియుండుననవచ్చును.

# మున్నుడి

'సి. పి. బ్రౌన్' (1798-1884) జీవిత చరిత్ర పుస్తక రూపమున మొట్టమొదట 1963 లో వచ్చినది. ఆనాడి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారు దానిని ముద్రించిరి. గ్రంథరచన 1960-1961 లో జరిగినది. ఈ రచనకు కావలసిన సామగ్రి సేకరణ, 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' అను విషయముపై, ఆంధ్రవిశ్వవిద్యాలయము వారి డాక్టరేటు పట్టమునకై 1950 నుండి నాలుగైదు సంవత్సరములు నేను పరిశోధన చేయుచుండిన కాలమందు చేయుట జరిగినది. ఆ పరిశోధనకు బ్రౌనుదొర తెలుగు భాషా సాహిత్యములకు చేసిన సేవ ప్రధాన విషయము కాకున్నను; పాశ్చాత్యులు మన భాషా సాహిత్యములకు చేసిన సేవ, దాని ప్రభావము అను వాటిని గూర్చి వ్రాయునప్పుడు ఆయన కృషి ప్రాముఖ్యము తేటతెల్లమయ్యెను. బ్రౌనుదొర కృషిని వివరింపకుండ పందొమ్మిదవ శతాబ్ది తెలుగుభాషా సాహిత్యముల వికాసమును, తెలుగు ప్రజల పునరుజ్జీవనమును వ్యక్తము చేయుట అసాధ్యము బ్రౌనుదొర కృషి - తెలుగు భాషా సాహిత్యముల అధ్యయనమున ఆధునికతకు పునాదులు వేసినది. ఆనాడే (1950) బ్రౌనుదొర జీవిత చరిత్ర పుస్తక రూపమున వెలువరింప వలెనను సంకల్పము కలిగినను, ఆనాటి ప్రణాళికలో బ్రౌనుదొర కృషి వివరణకు పరిమిత స్థానము మాత్రమే యుండుటచే, ఆ సిద్ధాంత గ్రంథమున, అంత మాత్రమునకే స్థానము లభించి 1960-1961 వరకు బ్రౌనుదొర జీవిత చరిత్ర రచన ప్రారంభము కాలేదు. నాటికి మన గ్రంథాలయములలో ఉపలభ్యమానమైన సామగ్రితో - ఆయన అచ్చువేసిన పుస్తకములు, సేకరించిన జాబులు, వార్తాపత్రికలు, తాళ పత్ర గ్రంథములు మొదలైన వాటి సాహాయ్యమున ; ఆనాటికి బ్రౌనుదొరపై తెలుగు విద్వాంసులు వివిధ పత్రికలలో ప్రచురించిన వ్యాసాదులను, నాటి కచ్చయి లభించిన **'Some Account of the Literary Life of C. P. Brown'** అను దానిని గ్రహించియు -రచన సాగించితిని.

ఆ సంవత్సరమే అమెరికాలోని 'విస్కాన్ సిన్ విశ్వవిద్యాలయము' వారి ఆహ్వానము మీద తెలుగున కాచార్యునిగ 'ఇండియన్ స్టడీస్ డిపార్ట్‌మెంట్' నకు పోవుట జరిగినది. పాశ్చాత్య దేశములలో లభించెడి అదనపు సామగ్రితో బ్రౌనుదొర

పరిష్కృతము విపులీకరింప వలెనను తలంపుతో లిఖిత ప్రతిని నాతో తీసికొని పోయితిని. ఈ విపులీకరణకు కావలసిన సామగ్రిని - అమెరికాలోని వివిధ గ్రంథాలయముల నుండియు, లండనులోని వివిధ గ్రంథాలయములనుండియు - పీలుకుబట్టి-సేకరించి గ్రంథమును విపులీకరించి తిరిగి వ్రాసితిని. దీనినే 1968 లో ప్రథమ ముద్రణముగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారు ముద్రించిరి.

బ్రౌనుదొర భాషాసాహిత్య సేవ మన పండితులకు తెలియనిది కాదు. పందొమ్మిదవ శతాబ్ది చివరి దశాబ్దులలో తెలుగు కవులను, కావ్యములను గూర్చి వ్రాసినవారి కందరికి ఆయన కృషి, దాని విలువ తెలియును. ఈ పండిత పరిశోధకులలో కందుకూరి వీరేశలింగం పంతులుగారి వంటి వారు చాల మంది కలరు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రమునకు మద్రాసు రాజధాని గనుక, మన విద్యావంతులకు మద్రాసుతో సంబంధ మేర్పడుటయు, అచ్చటి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునకు మన పండిత పరిశోధకుల రాకపోకలు సాగించుటయు సహజవిషయములే! అందడుగు పెట్టిన వారికి అడుగడుగున బ్రౌనుదొర కృషి కనబడుటయు సహజమే! అయినను, ఆయన కృషి ఫలితములను వినియోగించుకొన్న వారందరు కంఠోక్తిగ ఆ విషయమును చెప్పిరనలేము! చెప్పిన వారు కొందరున్నట్లే చెప్పని వారును చాలమంది కలరు, చెప్పని వారిని గూర్చి తరువాతి వారు చెప్పి సత్యమును వెల్లడించుటయును కలదు.

ఇరువదవ శతాబ్దిలో ప్రముఖులైన విద్వాంసులు, సాహిత్యవేత్తలు, పండిత పరిశోధకులు, ప్రచురణకర్తలు — అందరు — బ్రౌనుదొర కృషిని పైతృక సంపత్తిగా వాడుకొనిరనుట పరమ సత్యము. ఆయన కృషిని మెచ్చుకొని వ్రాసిన వారిలో -కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు (1862-1938), గిడుగు వేంకట రామమూర్తి పంతులు గారు (1863-1940), వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (1888-1950) నిడుదవోలు వేంకటరావు పంతులుగారు (1903-1982) మొదలైన వారెందరో కలరు. బ్రౌనుదొర కృషిని గూర్చి, ఆయన సాహిత్య జీవితమునుగూర్చి ఆయన అచ్చొత్తించిన గ్రంథములను గూర్చి వ్యాసాదులు వ్రాసిన వారు చాలమందికలరు. ఆయన సేకరించిన లేఖలను లఘువివరణలతో ప్రకటించిన వారును కలరు. వీరి రచనలను- ఆంధ్రపత్రిక, భారతి, త్రిలింగ, సరస్వతి మొదలైన పత్రికలు ప్రకటించెను.

కాని, ఈ పెద్దలెవ్వరును - ఆయన జీవిత చరిత్రను, భాషాసాహిత్యములకు ఆయన చేసిన సేవను, తెలుగు ప్రజలతో ఆయనకున్న సంబంధమును, విషయానుసారము వర్గీకరించి అధ్యాయములుగ విభజించి పుస్తక రూపమున వ్రాయలేదు. ఆ విధముగ వ్రాసెడి భాగ్యము మొట్ట మొదట నాకు కలిగినది. బ్రౌనుదొర తండ్రియైన రివరెండు డేవిడ్ బ్రౌన్ (1762 - 1812) జీవిత చరిత్రను కూడ విపులముగ తెలుగులో మొట్టమొదట వ్రాసి దీనిలో చేర్చెడి అవకాశము కూడ నాకు కలిగినది. బ్రౌనుదొర చిత్రపటము కొరకు కూడ కొంత ప్రయత్నము చేసితిని గాని అది లభింపలేదు.

ఈ పుస్తకపు ప్రథమ ముద్రణము (1963) ముగిగిన తరువాత, ఈ రంగములో గణనీయమైన కృషి పలువురు చేసిరి. ఈ 25 సంవత్సరములలో ఈ రంగములో జరిగిన కృషికి తలమానికమైనది శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయపు తెలుగుఅధ్యయన శాఖలో బ్రౌన్‌పరిశోధన విభాగము ఆచార్య జి. ఎన్. రెడ్డిగారి పర్యవేక్షణమున, బండి గోపాలరెడ్డిగారు (బంగోరె) నిర్వహించిన సంశోధన. ఈ ద్వితీయ ముద్రణమున వీరికృషినాకు చాల సాయపడినది. పరిశోధన ప్రక్రియ నిశ్రేణిక వంటిది. విషయ పరిగ్రహణ విషయమున పై పైకి పోవుటకు ప్రతిశ్రేణియు ముఖ్యమైనదే

ఆధునికులలో కవులు, సాహిత్యవేత్తలు, విమర్శకులు అయిన - ఆరుద్ర కె వి. రమణా రెడ్డి గార్ల వంటి వారు బ్రౌనుదొరను గూర్చి చాల విషయములు మనకు తెలిపిరి. ఇవన్నియు నాకు పనికి వచ్చెను. కడపలో 'సి పి. బ్రౌన్ మెమోరియల్ టస్ట్' వారు చేయుచున్న కృషి, కడప జిల్లా రచయితల ఎనిమిదవ మహాసభలు (1984 డిసెంబరు 15, 16 తేదీలలో) జరిగినప్పుడు వెలువడిన "సి.పి. బ్రౌన్-వేమన" ప్రత్యేక సంచిక కూడ నాకు చాల సాయపడినవి.

ఈ గ్రంథ ముద్రణమునకు ప్రారంభములో హైదరాబాదు విశ్వవిద్యాలయము వారు కొంత సాహాయ్యము చేసిరి. నా శ్రేయోభిలాషులు, మాన్యమిత్రులు లోకసభ సభ్యులు శ్రీ బెజవాడ పాపిరెడ్డిగారు, రాజ్యసభ మాజీ సభ్యులు శ్రీ అల్లూరిసర్వారాయచౌదరి గారు ద్రవ్య రూపమున సాయము చేసి గ్రంథ ముద్రణము పూర్తి అగుటకు తోడ్పడిరి, అందరికి నా కృతజ్ఞతలు. ముద్రణ సందర్భమున నేను పేర్కొనవలసిన వారు-నా పూర్వ విద్యార్థులు, ఆత్మీయులు శ్రీ. ఎన్. సి. వీరాచారి, బి.ఇ; శ్రీ ఎన్. వెంకటరావు, ఎమ్.ఏ., ఎమ్., ఫిల్. గారలు. వీరికి నా శుభాకాంక్షలు.

చరిత్రను విపులీకరింప వలయునను తలంపుతో లిఖిత ప్రతిని నాతో తీసికొని పోయితిని. ఈ విపులీకరణకు కావలసిన సామగ్రిని - అమెరికాలోని వివిధ గ్రంథాలయముల నుండియు, లండనులోని వివిధ గ్రంథాలయములనుండియు - పిలుచుకట్టి-సేకరించి గ్రంథమును విపులీకరించి తిరిగి వ్రాసితిని. దీనినే 1968 లో ప్రథమ ముద్రణముగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారు ముద్రించిరి.

బ్రౌనుదొర భాషాసాహిత్య సేవ మన పండితులకు తెలియనిది కాదు. పంతొమ్మిదవ శతాబ్ది చివరి దశాబ్దములో తెలుగు కవులను, కావ్యములను గూర్చి వ్రాసినవారి కంటపడితే ఆయన కృషి, దాని విలువ తెలియును. ఈ పండిత పరిశోధకులలో కందుకూరి వీరేశలింగం పంతులుగారి వంటి వారు చాల మంది కలరు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రమునకు మద్రాసు రాజధాని గనుక, మన విద్యావంతులకు మద్రాసుతో సంబంధము ఉండుటయు, అచ్చటి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునకు మన పండిత పరిశోధకులు రాకపోకలు సాగించుటయు సహజవిషయములే! అందడుగు పెట్టిన వారికి అడుగడుగున బ్రౌనుదొర కృషి కనబడుటయు సహజమే! అయినను, ఆయన కృషి ఫలితములను వినియోగించుకొన్న వారందరు కంఠోక్తిగ ఆ విషయమును చెప్పినవారు! చెప్పిన వారు కొందరున్నట్లే చెప్పని వారును చాలమంది కలరు, చెప్పని వారిని గూర్చి, తరువాతి వారు చెప్పి సత్యమును వెల్లడించుటయును కలదు.

ఇరువదవ శతాబ్దిలో ప్రముఖులైన విద్వాంసులు, సాహిత్యవేత్తలు, పండిత పరిశోధకులు, ప్రచురణకర్తలు — అందరు — బ్రౌనుదొర కృషిని పైతృక సంపత్తిగా వాడుకొనిరనుట పరమ సత్యము. ఆయన కృషిని మెచ్చుకొని వ్రాసిన వారిలో -కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు (1862-1938), గిడుగు వేంకట రామమూర్తి పంతులు గారు (1863-1940), వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (1888-1950) నిడుదవోలు వేంకటరావు పంతులుగారు (1903-1982) మొదలైన వారెందరో కలరు. బ్రౌనుదొర కృషిని గూర్చి, ఆయన సాహిత్య జీవితమునుగూర్చి ఆయన అచ్చొత్తించిన గ్రంథములను గూర్చి వ్యాసాదులు వ్రాసిన వారు చాలమంది కలరు. ఆయన సేకరించిన లేఖలను లఘువివరణలతో ప్రకటించిన వారును కలరు. వీరి రచనలను- ఆంధ్రపత్రిక, భారతి, త్రిలింగ, సరస్వతి మొదలైన పత్రికలు ప్రకటించెను.

కాని, ఈ పెద్దలెవ్వరును - ఆయన జీవిత చరిత్రను, భాషాసాహిత్యములకు ఆయన చేసిన సేవను, తెలుగు ప్రజలతో ఆయనకున్న సంబంధమును, విషయానుసారము వర్గీకరించి అధ్యాయములుగా విభజించి పుస్తక రూపమున వ్రాయలేదు. ఆ విధముగ వ్రాసెడి భాగ్యము మొట్టమొదట నాకు కలిగినది. బ్రౌనుదొర తండ్రియైన రివరెండు డేవిడ్ బ్రౌన్ (1762 - 1812) జీవిత చరిత్రను కూడ విపులముగ తెలుగులో మొట్టమొదట వ్రాసి దీనిలో చేర్చెడి అవకాశము కూడ నాకు కలిగినది. బ్రౌనుదొర చిత్రపటము కొరకు కూడ కొంత ప్రయత్నము చేసితిని గాని అది లభింపలేదు.

ఈ పుస్తకపు ప్రథమ ముద్రణము (1963) జరిగిన తరువాత, ఈ రంగములో గణనీయమైన కృషి పలువురు చేసిరి. ఈ 25 సంవత్సరములలో ఈ రంగములో జరిగిన కృషికి తలమానికమైనది శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయపు తెలుగుఅధ్యయన శాఖలో బ్రౌన్‌పరిశోధన విభాగము ఆచార్య జి. ఎన్. రెడ్డిగారి పర్యవేక్షణమున, బండి గోపాలరెడ్డిగారు (బంగోరె) నిర్వహించిన సంశోధన. ఈ ద్వితీయ ముద్రణమున వీరికృషినాకు చాల సాయపడినది. పరిశోధన ప్రక్రియ నిశ్శేణిక వంటిది. విషయ పరిగ్రహణ విషయమున పై పైకి పోవుటకు ప్రతిశ్రేణియు ముఖ్యమైనదే

ఆధునికులలో కవులు, సాహిత్యవేత్తలు. విమర్శకులు అయిన - ఆరుద్ర కె వి. రమణా రెడ్డి గార్ల వంటి వారు బ్రౌనుదొరను గూర్చి చాల విషయములు మనకు తెలిపిరి. ఇవన్నియు నాకు పనికి వచ్చెను. కడపలో 'సి పి. బ్రౌన్ మెమోరియల్ ట్రస్ట్' వారు చేయుచున్న కృషి, కడప జిల్లా రచయితల ఎనిమిదవ మహాసభలు (1984 డిసెంబరు 15, 16 తేదీలలో) జరిగినప్పుడు వెలువడిన "సి.పి. బ్రౌన్-వేమన" ప్రత్యేక సంచిక కూడ నాకు చాల సాయపడినవి.

ఈ గ్రంథ ముద్రణమునకు ప్రారంభములో హైదరాబాదు విశ్వవిద్యాలయము వారు కొంత సాహాయ్యము చేసిరి. నా శ్రేయోభిలాషులు, మాన్యమిత్రులు· లోకసభ సభ్యులు శ్రీ బెజవాడ పాపిరెడ్డిగారు, రాజ్యసభ మాజీ సభ్యులు శ్రీ అల్లూరిసర్వారాయచౌదరి గారు ద్రవ్య రూపమున సాయము చేసి గ్రంథ ముద్రణము పూర్తి అగుటకు తోడ్పడిరి, అందరికి నా కృతజ్ఞతలు. ముద్రణ సందర్భమున నేను పేర్కొనవలసిన వారు-నా పూర్వ విద్యార్థులు, ఆత్మీయులు శ్రీ. ఎన్. సి. వీరాచారి, బి.ఇ; శ్రీ ఎన్. వెంకటరావు, ఎమ్.ఏ., ఎమ్.. ఫిల్· గారలు. వీరికి నా శుభాకాంక్షలు.

# C. P. Brown (1798-1884) and his Literary Pursuits

"To revive the literature of a language was an arduous task for one man and he a foreigner"

—C. P. Brown

Telugu literature was "just glimmering in the socket", and C.P. Brown relumed its light with the promethean heat of his ardour and sacrifice He did it single handed and accomplished something remarkable in the manner of Dr. Johnson who compiled his famous dictionary single-handed.

Brown successfully battled against native pedantry and prejudice, against the initial difficulties of mastering a foreign language, against the dishonesty of his own countrymen, and the apathy of the College Board, against the professional jealousy of rivals: bore cheerfully the orb of official duties without neglecting his research, stuck to his Telugu Studies despite multifarious activities and pursuits, and remained contendedly poor. "Want of leisure so often lamented in India", he says, "usually denotes want of inclination. I have always had leisure", only a person with undeviating will to create opportunities for himself for study could have remarked so hopefully.

Referring to the rough sketch of the English-Telugu Dictionary he says, "This work may render English literature accessible to all the Hindus who fill the Indian Peninsula. I did not labour for one tribe alone". But, he did labour and do yeoman service for one tribe-the Telugu speaking people who are now, according to the census next only to the Hindi-speaking people in numbers in India. Whether the native Pandits knew anything about Brown or not, they could not ignore his dictionaries It is no exaggeration to say that every dictionary published after Brown's dictionaries, drew its inspiration to some extent and material to a large extent from his disctionaries. Practically every Telugu classical poem, now read with delight by the Telugu people, was copied on good paper from the old palm-leaf

manuscript at Brown's instance and commented upon by his pandits at his expense. He spent his money and used his influence as an officer of the East India Company to collect manuscripts from remote corners of the Telugu Country. He had in his pay, " .........ten to twenty ...employed in transcribing native authors, in preparing correct editions, in framing indexes and commentaries". Brown's works may be superseded by the works of Telugu scholars of succeeding generations, like the dictionary of Dr. Johnson by the great Oxford volumes of the New Dictionary but they remain as unfading monuments to a great man of letters. And more than that: his dictionaries are still usable with great profit.

A character in Eliot's play 'The Family Reunion' observes;

"And people to whom nothing has ever happened
Cannot understand the unimportance of events".

There was nothing exciting about Brown's life. He began his career at Cuddapah and then continued working in various capacities in the Judicial and Revenue departments of the East India Company in the Madras Presidency for over thirty five years, before leaving to England in 1855 on health grounds. Most of his time in India was spent in the Telugu area which gave him an opportunity to study and appreciate the Telugu people and their literature. After completing his services in India, he accepted a professorship of Telugu in the London University, and engaged himself in Telugu Studies till he died in 1884 Very few civil servants, then or now, can point to a life consumed in great undertakings, apart from the wooden mechanical round of officialdom. But those were spacious days and there were civil servants who were crusaders for a cause.

### Early Training

Brown's father, Rev. David Brown (1763-1812) was a wellknown figure in the Christian circles at Calcutta. He was for sometime Provost at Fort. William College and a Chaplain to the Brigade stationed there. In the words of a contemporary "With the Society for Promoting Christian Knowledge, he nearly began his career of

ministerial labour; with the British and Foreign Bible Society, he closed it". He was a close friend of all the distinguished missionaries who visited Calcutta in those days, and received almost all of them as a host when they first arrived in Bengal. He was a scholar himself and knew many Indian languages. It was his desire to give to his children the same bent of mind. "He intended they should be well grounded in the languages". In the words of his son Charles Philip Brown; "He wished to give us a learned education; We were taught the elements (and little more) of Hebrew and Syriac Arabic and Persian Greek and Latin". This was the home atmosphere of Charles Philip Brown who later on distinguished himself as a great scholar in many Indian and European languages, and particularly Telugu.

Charles Philip Brown was born in Calcutta in the year 1798 when his father was at the zenith of his popularity and fame as a scholar and as a good Christian, among the European people at Calcutta. C. P. Brown was in India till his father's death in 1812, and later when his family moved to London was educated at Haileybury to take up service in the in the East India Company. He returned to India in 1817 and landed at Madras to take up a job in the Civil Service. Almost at the same time, his two brothers were placed in the Bengal Civil Service. It is a matter for 'curious' reflection that he never heard of Telugu before he came to Madras.

His final examination took place in the presence of Sir Thomas Munro who was then the Governor of Madras. He exhorted the Junior Civil Servants to learn the languages of the people to enable the officers to understand the people of the 'Country' and their problems, better. This impressed C. P. Brown who began studying Telugu earnestly. His first appointment at Cuddapah under one Mr. Hunbury who spoke Telugu fluently, strengthened his resolve. "Impelled by zeal as well as necessity, in two years ", he became very fluent in Telugu and excelled Mr. Hunbury in Telugu scholarship. But it was only from the time he was in Masulipatam that he began acquiring real taste for Telugu literature and deep scholarship in the language. He says of this thus ; "In 1824 when

I already talked Telugu easily, I was induced to commence a regular study of some Telugu poems".

Brown has some interesting observations to make about the pedantry of the learned native instructors. All that was ordinary, natural and in daily use, he writes, they despised, one of his tutors made him break his shins on a crabbed treatise on Telugu grammar. The pandits placed emphasis on "learning by rote". We hear it remarked even today that the pandits are amazing instances of a type of scholarship which has amazing demerits also. Brown mentions an assistant who was an aged poet, who spent his youth in Benaras and was quite familiar with Sanskrit grammar but was helpless about problems of syntax in his mother tongue. It is sometimes observed that fine Greek scholars are not equally fine writers in English.

**Unhelpful Commentaries**

When Brown began studying the Telugu Classics the commentaries that were available did not help him much because they were just pegs for the critics to hang their noisy erudition on. But some of them applied to him for instruction and liked Robinson Crusoe, the Pilgrim's Progress and the Bible. At the desire of Mr. Wilson, he undertook to write an explanation of the Yoga Sastra. But no two books agreed and no two readers gave the same interpretation. "So I dismissed my Guru", he remarks, reminding one of what Chesterfield's mystagogue thought of the herald. "I find this silly fellow does not understand his own silly trade".

On one occasion a learned assistant mystified Brown by giving him several meanings of a difficult word each contradicting the other and when remonstrated with, replied; "Perhaps the word in question is unknown to me or I recollect no equivalent". When Brown was studying 'Ramastavarajam', the pandit, failing to explain a mystical passage and unheeding Brown's advice to give it up, turned up a week later with a trumped-up commentary unrelated to the text.

In the course of thus equipping himself he made an excellent

observation, particulary interesting to a student of languages. Language is primarily what is spoken; literature is what is written. Sounds stand for ideas and letters represent sounds; thus they are at a second remove from the real thing. This was what he said; "Books alone will not teach the living language. I used the everyday dialect in the Police Office. There cannot be a better school. Whenever I had a conversation with a plaintiff, witness or prisoner, with a learned native judge, or an ignorant menial; everyone became my teacher for the time".

Though he did not spare the vain pedantry of the pandits, he is not without a word of appreciation. "I discovered some excellent scholars, poets, grammarians and critics, half of whose learning I never attained, living in poverty mere mendicants and they were glad to be thus employed on wages as moderate as those we pay to our menial servants".

If we turn to his labours in rescuing Telugu classics and publishing them or compiling his own famous dictionaries or grammar or his translation of the Bible or his study of Hindu Chronology, we notice how he started with a scratch and piled Ossa on Pelion of achievement. In this connection we have to note two things :

(1) His method of deciding the texts (scuh a vexing problem in the study of Shakespeare); and (2) the innovations brought by him in actually printing the Telugu script.

**Printing Problems**

Two long extracts from his writings reveal to us his methodical and scientific bibliographical procedure and his keen awareness of the problems involved in printing

In his great undertaking, it is imperative to notice, he was hampered by the prejudices of the pandits and the ignorance of his countrymen. He found that "the Hindus are jealous of lending manuscripts and are shocked at the idea of selling them ; but when they find us punctual in restoring volumes lent, they will freely aid us". He wrote letters to distant villages for manuscripts and secured

them through gentle persuasion. He came to know that the Hindus regarded the printing of their authors a profanation. Such were the hurdles.

The way in which he settled the text of a classic is interesting. "Before studying a poem I had it copied in a clear hand, on English paper, numbering the verses to facilitate reference The manuscripts were full of errors. My learned assistants adjusted them by guess as they went along; but having read of the processes used by Lambinus, Erasmus, Heinsius, Casanbon, Kennicott and other restorers of learning, I followed their example so as to elicit an authentic text". Telugu and Tamil poems were then being published by the Madras College Board. But the Board could not print them without errors and this state of affairs continued for 20 years. The Board failed, in the words of Brown, because "every manuscript was faulty, and the members were not aware of the methods whereby the learned in Italy and Germany had elicited a pure Greek text out of defective manuscripts; just as a judge frames a decree out of conflicting evidence". Brown deviced a plan to tackle the problem and it was this ;

"I first had a copy made from any manuscript of tolerable accurancy, the alternate pages being left blank, and the verses duly numbered; then the volume was bound. I collected twelve or fifteen other manuscripts (few of them complete), lent me by various natives. A clerk sat with the newly-written copy ready . and before him were two each having charge of five or six manuscripts, the oldest I could discover. Three professors sat by, masters of grammar and prosody, both Sanskrit and Telugu ; but the others knew only their mother tongue. Each assistant in turn read a stanza, which thus was recited ten or twelve times ; the scribe recorded every deviation ; the pandits formed their judgements on each line, and then one of them taking the blotted copy, selected the pure text, and dictated it to a reader".

### Scientific Attitude

Brown took such pains to get a correct text of our famous poem 'Manucharitra'. Just as in days of old Krishnaraya presided over scholars' meetings to find the merit of a great work, Brown in his

days presided over scholars' disputations to renovate a great book. We find in all such things the scientific attitude of the Westerner operating amidst difficult oriental conditions.

The following extract of his shows the innovations he introduced in printing. "In those days Telugu printing was tedious because the (crara) letter 'R' was shaped as a cup containing another letter. (క్ర) To remedy this I invented two substitutes, one resembling a rectangle-like "L" (క్ర)the other like the numeral "9" (క్ర).The compositors found that this contrivance removed the difficulty. Numerals of pages, running titles, printers' stops, divisions of chapters, and in a slight degree) spaces between words, all these and other innovations are coming more and more into vogue, as I perceive in the Telugu volumes printed in 1860, and 1870."

"The Hindus read their national poems with delight : yet the printing of their authors was regarded as a profanation. I knew that this literature would never flourish until the book-sellers took it up as a profitable business. I now see my advice is followed, and in 1866 the Telugu printing trade is as fairly established as the Bengali was eighty years before, and the Tamil earlier still."

All this was a labour of love. He was not the richer by a penny. His books never brought him money "By some I lost the money I expended", he says cheerfully, "but I looked for this result and was satisfied."

Even when he was on Government furlough the visits, jaunts, sightseeing and tours left him daily leisure which he spent on his dictionary and grammar. "To benefit the Hindus", he observes. "was always my primary object. My leisure for these pursuits was chiefly between five and ten in the morning, six days every week" It is not surprising if the people with whom he worked, remarked that Brown had the Bible Shakespeare, and Milton by heart. And they were engaged in three separate sets under his roof which people called "Brown's College".

These labours were sometimes defeated by ignorance. For instance the Bible Society–Committee rejected the first specimens which he prepared because the members knew nothing of Telugu. Referring to the purge of the system of college examination, he says

that his style in Telugu teaching (as also in the dictionary and the grammar) was considored too high; others blamed it as too low and draws the quaint and admirable conclusion ; so probably it was right. I disregarded idle cavil and every diligent student found in me a true friend". He prevailed on the Board to permir native tutors to sit by while he examined the candidates. This publicity put an end to slanders about his austerity

He opened free schools–two at Cuddapah (Kadapa), two at Masulipatam and one at Madras. They were conducted for seven years well and later handed over to the Rev. Christian Arulapen because of his inability to superintend their working.

His labours were not confined to Telugu alone or to classics like Vemana, whose poems he published with English translation in 1829. He caused a new and complete edition to be prepared of 'Saudá', the best poet in Hindustani and presented the copy to the India House library. In February 1830 he printed in Madras a statement in a newspaper regarding trade which he discovered twenty years later in an American edition of Miss Robert's *Characteristics of Hindustan.* He was busy about a Dictionary of Mixed Telugu, explaining the modern phrases, chiefly Arabic. In this the Telugu alphabet is used. In a fourth volume, called the Zillah Dictionary, he gives in the English characters all the words that occur in the 'zillah business' in India.

He did all this without mixing with Hindus For such social gatherings, perhaps, he had no time. He had few acquaintances and was rarely visited by Indians. His pluralism might have, to a considerable extent, hampered his activities, though he explicitly tells us that he had always leisure. He held the office of the Post–Master General, was Telugu translator to the Government after Morris' resignation, was nominated member of the Council of Education, Government Director of the Madras Bank and the Curator of Manuscripts in the Madras College Library Later, when invited, he accepted Professorship of Telugu in the London University.

The surprise is that he did so much and failed so little He does not complain against his duties, as Arnold does that his official duties were "a dance with death". Brown reminds one of an Elizabethan – in his daring, achievement, multiplicity of interests

and a buccaneering raid on the argosis of the mind in the unchartered seas of a foreign tongue. The legacy of Brown to Andhras is "what he might have done". What he did – a foreigner – is a pointer and an exhortation and perhaps an accusing finger. "The undone vast" is a richer legacy and a greater responsibility entrusted to all lovers of Telugu literature.

The achievement of Brown, in spite of 'vexatious' failures, can be summed up in his own words, which have the least savour of exaggeration. "I have done what I could to awaken the Telugus to the advantages of printing and after more than twenty years' exhortation they are following my leading. When I began these tasks, Telugu literature was dying out . The Madras College, founded in 1813, preserved a little spark, but the pandits expressed to me their grief that the ruling powers regarded them as useless pensioners The ancient Telugu classics were in a deplorable state like that of Greek and Latin authors before the invention of printing, but a version made in my house grounded on a collation of manuscripts has successfully reproduced the leading Telugu poems in a pure and complete state. These have been printed and to these are added many Sanskrit volumes in the Telugu character. With these facilities I think Telugu will no longer be considered the most dificult language in India".

He had the genuine scholar's humility. "Certainly I have printed a good deal but I preceive in every page things which I could amend" he says. He had tolerance and sympathetic understanding He removed an attack on Hinduism when he was printing 'Nistara Ratnakaram'–a short account of Christianity in Telugu metre -and reflects admirably : "The Apostles taught Christianity without reviling idols. Why should not modern teachers imitate this courteous method ?" –a remark which demands daily practice by the fanatics of any religion or of any doxy.

Throughout his life he preferred "the European method of study". Thus C. P. Brown was the first man, and perhaps the only notable foreigner, who paved the way for "the European method of study" in Andhra for subsquent generations of writers and critics to follow. Now, it is for us to appreciate and emulate his selfless and devoted work.

# పూర్వరంగము : సామాజిక రాజకీయ పరిస్థితులు

భారతదేశ చరిత్రలో అత్యంత ప్రాముఖ్యముగల కాలమున 'బ్రౌను కుటుంబము'నకు మనదేశముతో సంబంధముండెను. ఛార్లెసు ఫిలిప్పు బ్రౌను (**Charles Philip Brown**) తండ్రియైన రివరెండు డేవిడ్ బ్రౌను (**Reverend David Brown**) 1786 లో మనదేశమునకు వచ్చి (కలకత్తా, వంగరాష్ట్రము), 1812 లో ఇచ్చటనే చనిపోవువరకు, తన వృత్తిని కొనసాగించెను. కుమారుడైన బ్రౌనుదొర 1798 లో కలకత్తాలో పుట్టిపెరిగెను. తండ్రి మరణానంతర మాతడు విద్యాభ్యాసమునకై ఇంగ్లండు వెళ్ళినను; 1817 లో మనదేశమునకు తిరిగివచ్చిన (మద్రాసు రాష్ట్రము) నాటినుండి 1855 లో స్వదేశమునకు తిరిగిపోవువరకు ప్రత్యక్షముగను, తరువాత 1884లో చనిపోవువరకు పరోక్షముగను అతనికి మన దేశముతో సంబంధముండెను. ఈ విధముగా 'బ్రౌను కుటుంబము'నకు ఇంచుమించు నూరు సంవత్సరములు (1786-1884) మనదేశముతో - ముఖ్యముగా వంగ మద్రాసు రాష్ట్రములతో - సంబంధముండెను. ఈ కాలము, ఇంగ్లండు భారతదేశముల చరిత్రలో విశేష ప్రాముఖ్యము గలది. ఈ కాలముననే, ఈస్ట్ ఇండియా కంపెనీ (**The East India Company**) మన దేశములో సామ్రాజ్యమును స్థాపించి, అత్యున్నత స్థానమును ఇంగ్లండునందును పొంది; 1857 తరువాత కాలగతి నొందుటయు జరిగినది. 1855 వరకు మనదేశమున కంపెనీ ఉద్యోగిగా వ్యవహరించిన ఛార్లెసు ఫిలిప్పు బ్రౌను, కంపెనీ ఉచ్చస్థితియందు మన దేశముననుండెను. ఆతని తండ్రి, కంపెనీకి వంగరాష్ట్రము వశమైన (ప్లాసీ యుద్ధము - 1757) తరువాత మనదేశమునకు వచ్చి, కంపెనీ జయించిన భారత భాగమున విశృంఖలముగ, ఉద్యోగులు విహరించుచున్న దినములలో నుండెను నాటికింకను భారతదేశము పూర్తిగా కంపెనీకి లోబడకున్నను, అట్లు జరుగునను విషయమున సంశయమెవరికినిలేదు. కొడుకు కాలమునాటికి కంపెనీ ప్రభుత్వము సుస్థిరమగుటయే గాక, పరిపాలనమును కొంతవరకు క్రమబద్ధముగ నుండెను. కనుక, నాటి సాంఘిక రాజకీయపరిస్థితులను గమనింపనిచో, ఈ ఇద్దరి వ్యక్తిత్వములు, విశిష్టగుణములు, మనకు పూర్ణముగా అవగతము కావు. కుమారుడైన బ్రౌనుదొర ప్రత్యేకత,

అతని భాషా కృషి ప్రధానమే, మనకు – ఈ పరిశీలనములేని నాడు – గోచరించుట కష్టము. గోచరించినను, అతని కృషిని పూర్ణముగా మెచ్చుకొనలేకపోయెదము. ఎట్టి పరిస్థితులలో అతడు, ఎంతటి కృషిచేసెనో తెలిసికొనిననాడు; అతని కృషి గొప్పదనము ఇనుమడించును! కనుక, ఈ పరిస్థితుల పరిశీలనము, అతని కృషి చిత్రణమునకు మంచి నేపథ్యము (Back ground) కాగలదు. ఇట మనము పరిశీలింపవలసినవి (1) కంపెనీ ఏర్పడునాటికి పాశ్చాత్యదేశముల – ముఖ్యముగా ఇంగ్లండు దేశము పరిస్థితి (2) భారతదేశ స్థితి, (3) భారతదేశములో ఇంగ్లీషువారి పరిస్థితి – అనునవి. ఈ మూడు విభాగములును పరస్పర సంబంధము లేనివి కావు. వీనికి పరస్పరము సంబంధముండుటయే గాక, ఒక దానిపై నొకటి ఆధారపడి యున్నది కూడ.

పాశ్చాత్యదేశము లన్నియు, ఇంచుమించుగా, నాలుగు అవస్థా భేదములలో తమ తమ రాజకీయ సామాజిక జీవితములను నడుపుకొన్నవి. గ్రీకు - రోమను కాలమున, యూరపు నాగరకతా సంస్కృతులకు నగరము (City) కేంద్రము. దీని చుట్టు ఆనాటి జన జీవితము గూడు కట్టుకొని యుండెను. ఈ వ్యవస్థ సుమారు పండ్రెండు వందల సంవత్సరములు (800 B. C. నుండి 400 A. D. వరకు) శక్తిమంతముగ నుండెను. రెండవ అవస్థ జాతులుగా (Tribes) యూరపువాసులు, ప్రభుత్వములను ఏర్పాటు చేసినది. ఇది నాలుగు వందల సంవత్సములు మాత్రమే (500 A. D. నుండి 900 A. D. వరకు) తన ప్రభావమును చూపగలిగెను. మూడవది ఫ్యూడలు (Feudal) అవస్థ. ఇది తొమ్మిదవ శతాబ్దిలో ప్రారంభమై, పరిణామములను పొంది పదుమూడవ శతాబ్ది నాటికి పూర్ణవికాసమును పొందెను. పదుమూడవ శతాబ్ది నుండి, యూరపులోని ప్రజలు ఫ్యూడలు వ్యవస్థ నుండి క్రమపరిణామము పొందుచు స్వతంత్ర రాజ్యములను (Nation-States) ఏర్పరచుకొనిరి. ఇది క్రమముగా వ్యాపారము అధికమగుటకు అవకాశములు కల్పించెను. వాణిజ్య రాజ్యములుగ దేశములు మార్పును పొందుట మొదలిడెను. ఈ మార్పులు క్రమక్రమముగ, పారిశ్రామిక విప్లవమునకు (Industrial Revolution) దారితీసెను. ఈ విప్లవముతో, ఫ్యూడలు వ్యవస్థ అడుగంటెను. ఈ నాశనము, ఒక్కొక్క దేశములో ఒక్కొక్క శతాబ్దిలో జరిగినది. ఇంగ్లండులో ఇది పదునేడవ శతాబ్దిలో, ఫ్రాన్సులో పదునెనిమిదవ శతాబ్ది తుదను, జర్మనీ, రష్యాలలో ఇంకను తరువాతను; ఈ వ్యవస్థలో మార్పు వచ్చెను. ఈ విధముగా

రివరెండ్ డేవిడ్ బ్రౌన్, పదునెనిమిదవ శతాబ్ది తుదను మన దేశములో అడుగు పెట్టు నాటికి, ఇంగ్లండు పారిశ్రామిక వ్యవస్థకు మారుచు; తాను ఉత్పత్తి చేయుచున్న సరుకులను అమ్ముటకు వెనుకబడిన దేశములను, ముడిపదార్థములు చవుకగా లభించు దేశములను ; తన ప్రభావములోనికి, అధికారములోనికి. తెచ్చుకొనుచుండెను. భారతదేశములో అప్పటికప్పుడే; మిగిలిన పాశ్చాత్య వాణిజ్య సంఘములు రంగములో నుండి తప్పుకొనుటయు, ఈస్ట్ ఇండియా కంపెనీ ఏకైక పాశ్చాత్య వాణిజ్య సంఘ మగుటయేకాక, భారతీయ రాజకీయములలో ప్రముఖ పాత్ర వహించుటయు జరిగినది.

ఇంగ్లండునకు ఇటు ఇండియా, అటు అమెరికా (1776 వరకు); తన సరకుల నమ్ముకొనుటకు లభించుటతోడనే, వాణిజ్య రంగమున ఆ దేశము విజృంభించెను. దానితో వర్తకుల ప్రభావము 'ఇంటా-బయటా' కూడా అధికమైనది. ఈ వర్తకులకు రాజకీయ బలము కూడ లభించుటతోడనే; వెనుకబడిన వారిని కొల్లగొట్టుట-స్వదేశమునను, పరదేశములలోను సమముగా సాగినది. అప్పుడప్పుడు మతము దీనికి 'చేదోడు-వాదోడు' గా నుండుటయు జరిగినది.

నాడు, భారత దేశములోని పరిస్థితులును విషమముగనే యుండెను. మొగలు చక్రవర్తి ఔరంగజేబు మృతి (1707) తరువాత, మొగలు చక్రవర్తుల ప్రభుత్వము నిస్సారమై అంతఃకలహములకులోనై; దేశమునుగాని ప్రజలను గాని రక్షింపగలుగు స్థితిలో లేకుండెను. సామంతులందరు ఇంచుమించుగా స్వతంత్రులవలె మెలంగజొచ్చిరి. దక్షిణమున, పశ్చిమమున, మొగలు చక్రవర్తుల ప్రభావము నామమాత్రమైనది. వంగ దేశములో 'దివాను'లుగా ఉన్న వారందరు క్రమక్రమముగా స్వతంత్రులై, మొగలు చక్రవర్తులకు పేరునకు మాత్రము 'కప్పము' చెల్లించుచుండిరి. ఉత్తరదేశము ఆఫ్గనుల దండయాత్రలలో నలిగిపోవుచుండెను. ఈ పరిస్థితులలో వంగ దేశమున కూడ, నవాబైన అలీవర్దీఖాన్ మృతి (1756) తో, అరాజకము ప్రబలునట్లుండెను. ఆతని మనుమడైన సిరాజిద్దౌలా, అనుభవములేని యువకుడగుటయు, పరిస్థితులను మెరుగు చేయలేదు. వంగ దేశమున-కొంతవరకు భారతదేశ మందంతటను-ఇంగ్లీషువారు ప్రబలులగుటకు తగిన వాతావరణమంతయు ఇట్లు సుముఖముగా నుండెను. ఇది 1756 నాటి స్థితి.

పొంగి దెబ్బ నెదుర్కొని దెబ్బతిన్న కంపెనీ వారు, తగిన అదను చూచి దెబ్బతీయవలెనని పొంచి యుండుటచే; సిరాజిద్దౌలా నవాబగుటతోడనే కార్య రంగమునకు దిగిరి. అప్పటి కప్పుడే క్లైవు మద్రాసులో ప్రముఖుడై వంగ దేశములోని ఇంగ్లీషు వారికి, నవాబు నెదుర్కొను విషయమున సాయము చేయ గలిగి యుండెను. క్లైవు మద్రాసు సేనతో వంగదేశమున అడుగిడుటతోడనే, పరిస్థితులు విషమించెను. ఒకప్పుడు మొగలు చక్రవర్తికి "పాదరేణువు"ను నేనని, వంగ దేశములోని ఇంగ్లీషు స్థావరముల గవర్నరు జాన్ రసెల్ వ్రాయవలసివచ్చెను.[1] అట్టి కంపెనీవారు, ఇరువది ముప్పది సంవత్సరములలో దేశమున ప్రబలులగుట జరిగినది. దక్కనులో జయములను పొందిన క్లైవు, వాట్సన్ లు; ఆ విజయ గర్వముతో 'సిరాజిద్దౌలా' కు వ్రాసిన లేఖలు నాటి వంగదేశ స్థితిని మన కనుల ఎదుట పెట్టగలవు.[2]

ప్లాసీ యుద్ధము(1757)లో సిరాజిద్దౌలా ఓడిపోయెను. ఇంగ్లీషువారికి ఒక్కసారిగా స్వర్ణఖనియైన వంగదేశము వశమయ్యెను. ప్లాసీ యుద్ధములో నవాబు ఓడిపోవుటకు ; అంతఃకలహములు, అనైక్యము కారణములు. ప్లాసీ యుద్ధముతో

---

1. "...the supplication of John Russell who is as the minutest grain of sand and whose forehead is the tip of his foot-stool who is absolute monarch and prop of the Universe..." (British India. its Races and its History by J. M. Ludlow; Cambridge, 1858. Vol. I; Page-139).

2. క్లైవు నవాబున కిట్లు వ్రాసెను : "Your Excellency will hear from others what force is come to Bengal. Such a force was never seen before in your province. When your Excellency comes to hear all those things and to consider seriously of them I hope you will have so great a regard for yourself, for us, and for the trade of your province, as to give the company full satisfaction for all the losses they sustained", (Bengal in 1756-57 by S.C Hill, Vol II, Page-73).

   వాట్సన్ వ్రాసిన లేఖలోని భాగము : "I will kindle such a flame in your country as all the water in the Ganges shall not be able to extinguish". (Ibidem)

ఇంగ్లీషు వారికి అధికారము హస్తగతమయ్యెను.[3] బక్సారు యుద్ధము (1764)తో దేశమున హక్కులు సంక్రమించెను. మొగలు చక్రవర్తి ఇచ్చిన ఫర్మానాతో కంపెనీ వారికి-బీహారు, బెంగాలు, ఒరిస్సా రాష్ట్రములలో 'దివాని' హక్కులు వచ్చెను.

పరిపాలన, కంపెనీ హస్తగతమగు నాటికి దేశీయమైన పరిపాలనయు బాగుగాలేదు. నవాబు యొక్క అధికారి వర్గము ప్రజలను పీడించి డబ్బు గుంజుటయు, దానిని విలాసములకై వెచ్చించుటయు, ఆదర్శముగా కలిగియుండెను. వారికి నైతిక భీతిగాని, న్యాయదృష్టిగాని లేవు. మతమును వారు పేద వారిని కొల్లగొట్టుటకై వాడిరి. కనుక ప్రజలు జాతీయదృష్టితో నవాబు వెనుకనిలువలేదు[4]. స్వార్థపరులైన సేనానులు ఆపత్కాలమున యుద్ధ విముఖు లగుటయు కలదు.

భారతీయ సమాజము కూడ హీనస్థితిలోనే యుండెను. కులమత కక్షలు ప్రజలకు సామూహిక జీవితము లేకుండ చేసెను. సంఘములో ఉన్నత కక్ష్యలలో ఉన్నవారు, తమ విజ్ఞానమును సామాన్య ప్రజలతో పంచుకొనక, వారికి దూరముగా నుండిరి. సామాన్య ప్రజలు సమస్తములైన మూఢ విశ్వాసములతో మునిగి తేలుచుండిరి. దేశమంతయు ఒకటి, మన మందరము దేశ క్షేమమునకై కలిసి పనిచేయవలెను—అను భావము ప్రజలలో వ్యాపింపలేదు. సమాజ వ్యవస్థయే ప్రజలలో చీలికలను పెంపొందించు నట్లుండెను.

కంపెనీ ఉద్యోగులు కూడ ఏమంత ఉన్నత నైతిక జీవనము కలవారు కాకున్నను, వారి సేనలును అంత ఎక్కువగా సామరస్యము కలవి కాకపోయినను-

---

3. సిరాజిద్దౌలా రాజ్యమునకు వచ్చినప్పటి స్థితి :

**"...came to his long-assigned throne in a house divided against itself, with a hostile faction in the army and a disaffected subject population." (History of Bengal by Jadunath Sarkar: Vol II, Page—470).**

4. శ్రీ జదునాథ సర్కార్ నాటి భారతీయాధికారులనుగూర్చి ఇట్లు వ్రాసెను: **"......a small, selfish proud and unworthy ruling class."**

ఈ అధికారులవలన, **"...the purity of domestic life was threatened...Religion had become the handmaid of vice and folly"...(Ibidem)**

వారి జయమునకు ముఖ్య కారణములు-శిక్షణ,[5] లక్ష్యశుద్ధి. ఇవి భారతీయులలో కొరవడి యుండెను. దీనికి తోడు ఏకోన్ముఖమైన కృషితో ఏకాదర్శము గల నాయకులును దేశమున లేకుండిరి. పదునెనిమిదవ శతాబ్దిలో మన పరిస్థితు లిట్లుండెను.

రివరెండ్ డేవిడ్ బ్రౌన్, కలకత్తా వచ్చునప్పటికి, మత విషయమున పాశ్చాత్యులలో గల పరిస్థితు లిట్లు చక్కగా చెప్పబడినవి :

> **"But, to speak in the mildest manner, Mr. Brown found, on his arrival at Calcutta in 1786, that a deep ignorance on religious subjects, and a careless indifference to Christian duties, were but too generally prevalent there..."[6]**

ఈ పరిస్థితులే రాజకీయ, సామాజిక రంగములలోను కలవు.

సృష్టిలో ఎన్ని లోపములు మానవులలో ఉండుట కవకాశములు గలవో, ఇంచుమించుగా, అన్నియు; నాటి కంపెనీ ఉద్యోగులలో, నూటికి తొంబదిమంది యందు కలవు. డబ్బు చేసికొనుట వారి ముఖ్యోద్దేశము కంపెనీ ఉద్యోగులలో చాలమందికి; పాశ్చాత్య నాగరకతా సభ్యతలుగాని, ధార్మిక నైతిక విషయములు గాని పట్టలేదు. చాలమందికవి తెలియవు. యోగ్యులైన కంపెనీ ఉద్యోగులు, 'కొంగలలో హంసలవలె', మౌనముగా నుండవలసివచ్చెను. వా రల్ప సంఖ్యాకు లగుటయు, వారును కాల ప్రభావమునకు లోనగుటయు కూడ ఈ మౌనమునకు కారణములుగా చెప్పవచ్చును.

ఆ కాలమున ఇంగ్లండే, గొప్పగొప్ప మార్పుల సుడుల నడుమ నుండెను. ఇంగ్లీషు సమాజము ఫ్యూడలు (Feudal) వ్యవస్థ నుండి, పారిశ్రామిక

---

5. కారన్ వాలిస్ సేనలిట్లుండె నట — "...very inferior quality especially as regards the 6,000 Europeans of the Company's army, the riff-raff of the London streets and the gleanings of the jails, officered by ruined youths or greedy seekers for money." (A Constitutional history of India by A. B. Keith: 1937 edition; Page-104.)

6. Christian Biography, Page-82

(Industrial) వ్యవస్థకు మారుచుండెను. అందులకు కావలసిన పెట్టుబడి, ఇండియా నుండి పిండబడుచుండెను. ఇట్లు వచ్చిన డబ్బుతో, ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లు స్వదేశమున కూడ ప్రముఖ స్థానముల నాక్రమించి, కంపెనీ యొక్క "లాభము"లను రక్షించుకొనుచుండిరి. ఈ విధముగా, నాటి స్థితి విషమ చక్రమువలె నుండెను. ఇంగ్లండులోని వర్తకులకును ఇది అనుకూలముగ నుండుటచే, దీనిని ప్రతిఘటించు వారు లేరైరి. డబ్బుతో ఇహలోకమున పరలోకమున కూడ "సుఖము"ను కొనవచ్చునను నమ్మకము, ఇంచుమించుగా, సర్వసమ్మతమై యుండెను. దీనికి; నైతిక బలమును, ధార్మిక మార్గమును 16వ శతాబ్దిలో యూరపులో బయలుదేరిన మతోద్యమము లు సమకూర్చి పెట్టెను. మత గ్రంథములలో చెప్పబడిన నైతిక సూత్రముల ప్రభావము, ఈ నూతనోద్యమముల ప్రభావము వలన తగ్గుచువచ్చెను. నవ్యవ్యాఖ్యలు బయలుదేరెను[7]. యూరప్‌లో బయలుదేరిన ఈ ఉద్యమముల ప్రభావము ఇంగ్లండు నందును వ్యాప్తిని పొంది; మత సంస్థలకు మానవుల వాణిజ్య సంబంధములైన వ్యాపారములలోని నీతి అవినీతి విషయములపై నిర్ణయించు అధికారములేదను భావము స్థిరపడెను[8]. క్రొత్తగా ప్రాచ్యదేశములలో వాణిజ్య సంబంధములైన హక్కులను పొంది, ఆ దేశముల ప్రజలను కొల్లగొట్టి ధనరాశులను స్వదేశములకు చేర్చుచున్న పాశ్చాత్య వాణిజ్య సంఘములకు, వాటి అధిపతులకు, ఈ "నవ్యభావములు"- ధైర్యమును కలిగించెను. తృప్తినిచ్చెను.

ధనముతో ప్రపంచములోని వస్తువులనేగాక, స్వర్గమునుకూడ కొనవచ్చునను భావము; పాశ్చాత్య దేశములలో, పాశ్చాత్య వర్తకులలో పదునైదవ

---

7. ఈ నూతనోద్యమములలో ఒకదానికి ప్రవర్తకుని చెప్పదగు John Calvin, "లాభ సంపాదన" చేయుటనుగూర్చి ఇట్లొకచోట చెప్పెను: "What reason is there, why the income from business should not be larger than that from land-owning? Whence do the merchant's profits come, except from his own diligence and industry?" (As quoted from 'Religion and the Rise of Capitalism' by Prof. R.H. Tawney A Mentor Book, New York 1961, Page-98.)

8. "But in England there were all three, and, from the beginning of the last quarter of the Sixteenth century, ecclesiastical authorities who attempted to enforce traditional morality had to reckon with a temper which denied their right to exercise any jurisdiction at all above all any jurisdiction interfering with economic matters". (Ibidem)

శతాబ్దినుంచి ప్రబలుచు వచ్చెను[9], మతసంస్థలు "మానవులు సోదరులు" అని చెప్పుచు వచ్చి, మానవుని మానవుడు కొల్లగొట్టకుండ చూడవలెనని తలంచినను: సామ్రాజ్యవాదము పాశ్చాత్య దేశములలో వ్యాపించుచు వచ్చిన ఆ రోజులలో, "వర్ణవిభేదము లేకుండ మానవులందరు సోదరులే, కనుక నైతిక దృష్టి ముఖ్యమైన"దని- ఈ సంస్థలు ధైర్యముగా చెప్పి తమ ప్రభావమును చూపలేక పోయినవి[10]. అందువలన మతమునకు సామాజిక వ్యవస్థను శాసించు అధికారము లేదనియు, అది ఆధ్యాత్మిక విషయములను గూర్చియే ఆలోచింపవలెననియు ధనవంతులు, ధనము సంపాదించుచున్నవారు అగు వర్తకులు ఇంగ్లండులో నిర్ణయమునకు వచ్చిరి. ఈ నిర్ణయానుసారము, మత సంస్థలకు సామాజిక సంస్థల యొక్క విషయములలో జోక్యము కలుగచేసికొను హక్కు లేదని, ఇంగ్లీషు పార్లమెంటులో తీర్మానింపబడినది[11]. దీని తరువాత వర్తకులు ఏవిధమైన "నైతిక భయము" లేకుండ, వాణిజ్య వ్యాపారములలో తమ ఇష్టము వచ్చినట్లు, 'ధనసంపా

---

9. అమెరికాను కనుగొన్న కొలంబస్ (**Columbus**) అను పోర్చుగీసు నావికుని (**Portuguese sailor**) వాక్యములు: **"Gold constitutes treasure, and he who possesses it has all he needs in the world as also the means of rescuing souls from Purgatory and restoring them to the enjoyment of Paradise."** (రామకృష్ణ ముఖర్జీ వ్రాసిన 'The Rise and Fall of the East India Company, Berlin-1958; నుండి సంగ్రహీతము. **Page** - 5.)

10. **"It (the Church) had insisted that all men were brethren. But it did not occur to it to point out that, as a result of the new economic Imperialism which was beginning to develop in the seventeeth century, the brethren of the English merchant were the Africans whom he kidnaped for slavery in America, or the American Indians whom he stripped of their lands, or the Indian craftsmen from whom he bought muslins and silks at starvation prices".** (Religion and the Rise of Capitalism. **Pages,** 156-157.)

11. **"Then came the Long Parliament, the fierce denunciations in both Houses of the interference of the clergy in civil affairs, and the legislation abolishing the Court of High Commission, depriving the ordinary ecclesiastial Courts of penal jurisdiction, and finally with the abolition of episcopacy, sweeping them away altogether".** (Ibidem. **Page** - 158.)

ధనమే ముఖ్యమను దృష్టితో, ప్రవర్తింపజొచ్చిరి. మత సంస్థలు మానవులలో నైతిక దృష్టిని, ఆధ్యాత్మిక జీవనమును పెంపొందింపవలెనని ప్రయత్నించినను, 'లాభదృష్టి'గల వర్తకులు వాటిని గణింపలేదు. క్రమక్రమముగా వాటి బలము తగ్గిపోయినది. ఇండియాలో, ఈస్టిండియా కంపెనీ బలపడు నాటికి ఇంగ్లండులో సామాజిక వ్యవస్థ ఇట్లుండెను. ఇంగ్లండులోనే మానవుల సోదరత్వమునందు నమ్మకము-ధనార్జన యొక్క ప్రసక్తి వచ్చినప్పుడు-తగ్గినప్పుడు; ఆ ఇంగ్లీషు వర్తకులకు భారతీయుల ఎడల అట్టి భావముండునని యూహించుటకును అవకాశము తక్కువ గదా! ఉన్నవారసలు లేకపోలేదని కాదు. తప్పక ఉన్నారు కూడ. కాని, వారు తమ ప్రభావమును చూపగలిగినంత మంది లేరు. రివరెండ్ డేవిడ్ బ్రౌన్, భారతదేశములో అడుగుపెట్టు నాటికి ఇంగ్లండులోని స్థితి ఇది. ఇండియాలోని ఇంగ్లీషు కంపెనీ ఉద్యోగుల స్వరూప స్వభావములును దీనికి తగినట్లే ఉన్నవి.

ఇండియాలో, కంపెనీ ఉద్యోగులుగా ఉన్నవారిలో చాలమంది, కంపెనీ డైరెక్టర్ల సిఫార్సు మీద వచ్చినవారగుటచే, వారికి తమ పనులు ఇంగ్లండులో విమర్శింపబడునను భయమావంతయు లేకుండెను. కనుక కలక్టర్లు, జడ్జీలు- వీరు వారననేల, ఇంచుమించుగా అందరు- సొంత వ్యాపారములు సాగించుకొనుచుండిరి[12]. ఇది వీలుకానప్పుడు తమ బంధువుల పేరనో, మిత్రుల పేరనో-ఇవే వియు కుదురనప్పుడు-ఎవరో ఒక భారతీయుని పేరుమీదనో, వాణిజ్యము చేయుచుండిరి. దీనివలన కంపెనీకి లాభములు తగ్గుటయేగాక, న్యాయవిచారణయు సరిగా జరుగకుండెను ఈ పరిస్థితులలో గవర్నరు జనరలు కూడ ఏమియు చేయలేక, 'బోర్డ్ ఆఫ్ కంట్రోల్' (Board of Control) నకు చెందిన ఒకనికి

---

12. "I am sorry to say that I have every reason to believe that at present almost all the collectors are, under the name of some relation or friend, deeply engaged in commerce, and by their influence as judges and collectors or Adaulat, they become the most dangerous enemies to the Company's interests and the greatest oppressors of the manufacturers." (ఇది లార్డ్ కారన్ వాలిస్, మిస్టర్ డన్డస్‌నకు వ్రాసిన లేఖలోని భాగము. Sir J. W Kaye వ్రాసిన Lives of Indian Officers (New Edition) London, 1904 నుండి గ్రహింపబడినది. Pages - 94, 95.)

వ్రాసికొనవలసి వచ్చినది! 1784 లో వచ్చిన ఇండియా బిల్లు, ఈ ప్రైవేటు వ్యాపారమును అరికట్టెంచినను పూర్తిగా జయమును పొందలేక పోయినది.

వారికి నిర్ణయమైన కంపెనీ పనిలో ఈ ఉద్యోగులు చిత్తశుద్ధితో నిమగ్నులై యున్నారా? అన్నచో, ఏ కొద్దిమందియో తప్ప. మిగిలిన వారందరు పనులను ఎగవేసి, తమ క్రింది భారతీయోద్యోగులచేత ఆ పనులు చేయించి, పెత్తనము చేసెడివారు[13]. 1757 లో ప్లాసీ యుద్ధము తరువాత వంగరాష్ట్రము నాక్రమించుకొనిన ఇంగ్లీషు వారు; 1765 లో మొగలాయి చక్రవర్తి దగ్గరనుండి ఫర్మానా సంపాదించుకొని, రాష్ట్రమునకు పాలకులైరి. వర్తకులే పాలకులగుటచే, రాజకీయ బలము నుపయోగించి తమకు కావలసిన రీతిగా వస్తువుల ధరలను నిర్ణయించికొని, ఉత్పత్తిదారులను హింసింప మొదలిడిరి[14]. వంగరాష్ట్రము స్వాధీనము కాకపూర్వమును వారు వస్తువులను చవుకగా కొనుటకు "హక్కు" లను సంపాదించిరి[15] వంగరాష్ట్రము స్వాధీనమైన తరువాత, వస్తువుల ధరలను వారే నిర్ణయించుచు వచ్చి ఉత్పత్తిదారుని బాధించి హింసింప మొదలిడిరి. ఈ మార్గమునే, వారు స్వాధీనముచేసికొనిన ఇతర భారతదేశభాగములందు అవలంబించిరి.

---

13. "It was not then the fashion to fatigue ourselves with hard labour; there were abundance of native scribes in all the offices to do the drudgery, and our taskmasters were not strict." (కంపెనీ ఉద్యోగి, రాబర్ట్ లిండ్సే వ్రాసిన జాబులోని భాగము. Ibidem. Page-92)

14. "The merchants were now rulers. Thus, being 'favourably placed in relation to the individual producer, whether weaver or peasant, to dictate terms favourably to himself,' the company was now 'able to throw the sword into the scales to secure a bargain which abandoned all pretence of equality of exchange.' The policy of the Company was established to extract from the Indian producers as much as possible, and to give them in return virtually nothing..............." (The Rise and Fall of the East India Company by Ramakrishna Mukherjee, Berlin, 1958. Page-301.)

15. "....in the pre-conquest days, while the "Concessions" helped the Company much in "buying cheap", still its business had to be conducted mainly in exchange for silver" (Ibidem, Page, 301.)

దీనితో-భారతీయ వర్తకులు, వ్యవసాయదారులు, పేద రైతులు, కార్మికులు; సమస్తమైన వారును. కంపెనీ ఉద్యోగుల యొక్క ఇనుప పాదముల క్రింద నలిగి పోజొచ్చిరి. ప్రభుత్వ యంత్రమును చిక్కించుకొనిరి. ఈ ఉద్యోగుల ప్రవర్తనను గూర్చి జేమ్సు మిల్ (James Mill) అను ఆంగ్లేయుడిట్లు వ్రాసెను:

**"The conduct of the company's servants,.........furnishes one of the most remarkable instances upon record, of the power of interest to extinguish all sense of justice, and even of shame.[16]"**

తన కాలమున ఇట్టి నిరంకుశత్వమునకు, లంచగొండితనమునకు, స్వార్థపరత్వమునకు ప్రాతినిధ్యము వహించిన 'లార్డ్ క్లైవ్' (Lord Clive) వంటివాడు కూడ; కంపెని ఉద్యోగులు - వంగ రాష్ట్రమునకు నవాబయిన 'మీర్ కాశిం' రోజులలో, చేసిన పనులను గూర్చి ఇట్లు వ్రాసెను:

**"The trade has been carried on by free merchants, acting as 'gomastas' to the Company's servants, who under the sanction of their names, have committed actions which make the name of the English stink in the nostrils of a Hindu or a Mussulman; and the Company's servants themselves have interfered with the revenues of the Nawab, turned out and put in the officers of the government at pleasure, and made every one pay for their preferment."[17]**

ఈ విధముగా నవాబులను, ప్రజలను సమానముగనే పీల్చి పిప్పి చేసిన కంపెనీ ఉద్యోగులు, భారతదేశమున-వారికి స్వాధీనమైన భాగమున, ముఖ్యముగా వంగ రాష్ట్రమున-విశృంఖల విహారముచేయుచున్న దినములలో, గవర్నరు కౌన్సిలు సభ్యుడైన వారన్ హేస్టింగ్సు (**"I mean the oppression commited under the sanction of the English name."**)కూడ గవర్నరునకు కంపెనీ ఉద్యోగుల

---

16. The History of British India by James Mill, London, 1858. Vol. III; Page-234.

17. Life of Robert Lord Clive by Sir John Malcolm. London, 1836. Vol. II. Page-379.

చర్యలను గూర్చి ఖండించుచు వ్రాసిన దినములలో; నైతిక సూత్రముల, ధార్మిక పద్ధతుల విషయమున విచికిత్స అనావశ్యకము గదా! రివరెండ్ డేవిడ్ బ్రౌన్, 1786లో కలకత్తాలో అడుగుపెట్టు నాటికికూడ కంపెనీ ఉద్యోగులలో మార్పం తగా రాలేదు. దేశమును న్యాయసమ్మతముగ పరిపాలింపవలసిన బాధ్యత వారి కున్నను, లాభములను సంపాదించుకొను వాణిజ్య సంస్థయొక్క ప్రతినిధుల మన స్తత్వమే వారి కుండెను. రాజకీయ బలమును, లాభములను తీయుటకు వినియో గింపవలెనను కుతూహల మున్నంతగా, మంచి ప్రభుత్వమును ప్రజల కీయవలెనను వాంఛ, కంపెనీ ఉద్యోగులకు నాడు లేదు.

భారతదేశములోని పాశ్చాత్యుల నైతిక జీవనము, వారి వాణిజ్యజీవనము కంటె, ఏమంత ఉన్నతముగా లేదు. వెఱ్ఱితలలు వేసిన విషయవాంఛలు[18], వాటిని సహించి ఊరకొనిన-అప్పుడప్పుడు నీతి బోధచేయుచు వచ్చినను-ధార్మిక సంస్థలు, విశృంఖలతను పట్టించుకొనని సమాజము-ఇవి నాటి పాశ్చాత్యుల జీవితము లందు ముఖ్య పాత్ర వహించెను. మోసముచేనైనను, ఈ వాంఛలను తీర్చుకొనుటకు కావలసిన ధనమును సంపాదింపవలెనను, తహతహ! ఇది లేనివారు, సాధ్యమైనంత తక్కువ కాలములో, వీలైనంత ఎక్కువ ధనమును సంపాదించి స్వదేశమునకు పోవలెనను ఉత్కంఠ కలవారు!

త్రాగుడు, జూదము, వీటి వలన వచ్చు ఇతర వ్యసనములు-ఇండియాలోని నాటి పాశ్చాత్య సమాజమున, ఇంచుమించుగా, సర్వసామాన్య మనవచ్చును. అవివాహితులైన పాశ్చాత్యులందరు, (నాడు వివాహితుల సంఖ్య చాల తక్కువ) మన దేశమున ఉంపుడు కత్తెలతో నివసించుచుండిరి. ఇది

---

18. "At Tranquebar, H. Meyer, Esq., aged sixty-four, to Miss Casina Couperas, a very accomplished youg lady of sixteen, after a courtship of five years". (Late 18th Century notice in Bombay newspaper as quoted by Hilton Brown in 'The Sahibs', London, 1948. Page-146.)

నాడందరు అంగీకరించినదే! బహిరంగముగా జరిగినదే![19] దీనికి కంపెనీ వారి "ఆశీస్సులు" కలవు!

ఇండియాలోని పాశ్చాత్య సమాజములో ప్రముఖస్థానము నాక్రమించిన 'వారన్ హేస్టింగ్స్' (Warren Hastings) మొదలైనవారి కుటుంబజీవనము, విమర్శ కతీతము కాదన్నచో, ఇతరుల సంగతి చెప్పనక్కరలేదు గదా![20] మత ప్రచారకులు, మతోద్యోగులు, నైతికముగ జీవించవలసిన వారును నాటి పాశ్చాత్య

---

19. Drunkenness, gambling and profane swearing were almost universally practiced. The public journals testify to the absence of "decency and propriety of behaviour" in social life."

"Nearly all the unmarried Europeans-and few were married in those days - lived in acknowledged concubinage with native women. In 1810, a work, called The East Indian Vade Mecum, was published by Captain Thomas Williamson. It was intended to contain a compendium of information valuable to persons about to settle in India and was dedicated to the Honorable Court of Directors of the East India Company, as designed particularly to be a guide to young gentlemen in their service. In this work concubinage is regarded as a matter of ordinary necessity, and advice is given as to the female establishment a young man should set up, its proper cost, &c." (The Good old days of Honorable John Company by W H. Carey. Simla 1382. Vol. II. Pages - 63, 64. ఈ రచయిత; సుప్రసిద్ధ బాప్టిస్టు మిషనరీ, బహుభాషాకోవిదుడు, తెలుగునకు 1814 లో ఇంగ్లీషున వ్యాకరణము రచించినవాడునైన. డాక్టర్ విలియమ్ కెరే (Dr. William Carey) యొక్క మనుమడు.

20. "...in the days of Warren Hastings it was a faux pas to invite "Mr. So-and-so and his wife" - you referred tactfully to Mr. So-and-so's "Lady", Hickey was not married to his Charlotte, and indeed the exact legal relationship between Hastings himself and his adored (second) wife the ex-Baroness Imhoff remained open to some question" (The Sahibs. Edited by Hilton Brown. London, 1948. His introduction to the chapter - 'Some Morals, Modes And Custom's. Page 142)

సమాజముపై తగినంత ప్రభావము చూపలేకపోవుచుండిరి ! వారిలో కొందరు కాలప్రభావమునకు కొంత లోనగుటయు కలదు ![21]

సర్వసాధారణముగా, ఇండియాలోనున్న నాటి పాశ్చాత్యులలో చాల మందికి మతమందు పట్టుదల తక్కువగానుండెను. వారి విషయాసక్తి తమ మత ప్రచారమునకు ముఖ్యమైన అడ్డుగా నున్నదని నమ్మకము మత ప్రచారకులలో నాడు ప్రబలియుండెను.[22] చిత్తశుద్ధితో క్రైస్తవ మత ప్రచారము చేయుచున్న మిషనరీలకు తమ దేశీయులే అయిన పాశ్చాత్యులు విషయలంపటులగుట మత ప్రచారమునకు అడ్డుగా బాధగానుండెను. కాని, నాటి లౌకికజీవితమును శాసింపగల శక్తి వారికి తక్కువగా నుండెను. చిత్తశుద్ధితో మతప్రచారము చేయుచు, నైతిక జీవనమునకు తన జీవితమే ఆదర్శమగునట్లు జీవించుచు, నాటివారిచే మన్ననలను పొందిన రెవరెండ్ డేవిడ్ బ్రౌన్‌వంటి సత్పురుషుడుకూడ, నాటి మతోద్యోగులలో

---

21. "The chaplains who had been sent out in the latter part of the eighteenth century were, with a few exceptions, men who, if they did not disgrace their religion by their immorality, degraded it by the worldliness of their lives. The prevailing taint of cupidity was upon them as upon their brother settlers, and they grew rich like the rest. It is not uncharitable to surmise that men who, after a few years of ecclesiastical service in India, carried home with them considerable fortunes, did not derive their wealth from the legitimate gains of the ministry. It has been stated, on credible authority, that one chaplain, Mr. Blanshard, after a service of little more than twenty years, carried home a fortune of £ 50,000; that another, Mr. Johnson, after thirteen years' service, took with him from Calcutta £ 35,000; and that a third, Mr. Owen, at the end of ten years, had amassed £ 25,000." (Lives of Indian Officers by Sir J.W. Kaye. London, 1904. Page-499)

22. "......there had been no greater obstacle to the diffusion of Christianity among the heathens than the ungodly lives which were commonly led by professing christians." (Ibidem, Page - 502.)

కొందరిని సమర్థింపవలసి వచ్చెనన్నచో, వారి జీవిత విధాన మెట్లుండెనో వ్రాయ నక్కరలేదు గదా ! 23

లౌకికులైన కంపెనీ ఉద్యోగులలో చాలమందికి, మతమందు నమ్మకము గాని, నైతిక జీవనమునందు విశ్వాసముగాని లేకపోవుటచే మతమునుగూర్చి పట్టించుకొనుట వారికి చాందసత్వమనిపించినది.24 మతసంబంధములేని 'నీతి', వారికి హాస్యాస్పదముగను అర్థమనిపించినది. అందుచే విదేశీయులైన వారు, నీతిబాహ్యులైరి.

'భారతదేశములోని ప్రజలలో అధిక సంఖ్యాకులు క్రైస్తవులు కారు గనుక, మనము వారికి నైతిక జీవనమున ఉదాహరణ ప్రాయముగా కానక్కరలేదను భావము, నాటి కంపెనీ ఉద్యోగులలో - పాశ్చాత్యులలో సాధారణముగ - ప్రబలి యుండెను[25]. మతానుసారముగ పవిత్రదినమైన ఆదివారమునాడు, 'గుర్రపు పందెములు' మొదలైన వాటిలో పాల్గొనుటయు, కంపెనీ ఉద్యోగులలో ప్రబలి యుండెను. ఈ పరిస్థితులను చక్కదిద్దుటకై, కంపెనీ డైరెక్టర్లు, ఇంగ్లండునుండి

---

23. "Mr. Brown concluded a letter to a correspondent in England with the words,'I might finish with giving you some account of our wicked chaplains Out of nine (the full complement), four are grossly immoral characters, and two more have neither religion nor learning'. (Ibidem Page-500).

24. Religion was at a low ebb in Calcutta during the last century ("18 వ శతాబ్ది" - రచయిత). Even in high quarters there was not only no respect to outward religious observances. but there was a want of even common morality. It was reckoned unfashionable to attend church on Sundays " (The Good old days of Honorable John Company by W H, Carey. Simla, 1882. Page - 65 )

25. "It was frequently urged, that there could be no use in keeping holy the seventh day in a heathen country; since the common people not being, as in England, Christians, the example was not needed!".
(Memoir of the Rev. David Brown; The Asiatic Journal. November, 1819; Page - 419 London.)

ఆదేశమును పంపవలసి వచ్చినదన్నచో, మనకు నిజస్థితి స్పష్టముగ గోచరించును.[26] ఈ ఆదేశమున, మతోద్యోగులును పేర్కొనబడిరి !

నాటి పాశ్చాత్యులు-ఇంగ్లీషు, డచ్చి, పోర్చుగీసు, డేనిష్, ఫ్రెంచి మొదలైనవారు— భారతీయులను బానిసలుగ అమ్ముట, కొనుట మొదలైన

---

26. "In May 1798, the Court of Directors addressed a letter to the Governor General of India, in which attention was called to the flagrant profanation of the Lord's day by the officers of Government, and general neglect of public worship was severaly censured:- "We have now before us", wrote the Honorable Court, "a printed horse racing account, by which it appears, that not less than eight matches were run at Chinsurah, in one day, and that on Sunday. We are astonished and shocked at this wide deviation from one of the most distinguished and universal institutions of Christianity. We must suppose it to have been so gradual, that transitions from one step to another have been little observed; but the stage at which it is now arrived, if our information be true, must appear to every reasonable person highly discreditable to our Government, and totally incompatible with the religion we profess. We enjoin that all such profanations of the sabbath as have been mentioned be forbidden and prevented; and that divine service be regularly performed, as in England, every Sunday at all the millitary stations, and all European officers and soldiers, unless hindered by sickness or actual duty, are required punctually to attend, for which such an hour shall be fixed as shall be most suitable to the climate. The Chaplains are to be positively ordered to be regular and correct in the performance of their duty: and if any one of them neglect it, or by his conduct bring discredit on his profession, we direct that he be dismissed from our service."

(The Good old days of Honorable John Company by W.H. Carey. Simla, 1882. Page-121.)

"లాభదాయకము"లైన పనులలో కూడ నిమగ్నులై యుండిరి. పదునెనిమిదవ శతాబ్దిలో భారతదేశమున పాశ్చాత్యులు బానిసవ్యాపారము బాగుగ సాగించిరి. మతప్రచారకులు, సర్వమానవ సౌభ్రాత్రమును గూర్చి ఉపన్యసించుచు కూడ, బానిసల విషయమై "శీతకన్ను" వేసినట్లున్నది! పోర్చుగీసు పాదరీలే కొందరు, బానిస పనివాండ్రను పెట్టుకొనుచుండిరి! 'వికార్' (Vicar) హోదాలోనున్న, వారి మతోద్యోగులు, బానిసల నమ్ముచుండిరి![27]

నాడు కంపెనీ పరిపాలన క్రింద ఉన్న భారత భూభాగమున, బానిస వ్యాపారము చాలవిరివిగా జరుగుచుండెను. ఇంగ్లీషువారేగాక, మిగిలిన పాశ్చాత్యు లందరును కూడ దీనియందు పాల్గొనుచు లాభములను పొందుచుండిరి. ఒక్కొక్క బానిస, ఈస్టిండియా కంపెనీకి, నాలుగు రూపాయల నాలుగణాలు సుంకము చెల్లించుచుండెనట![28] ఇంత "లాభసాటి బేరము" మానుట పాశ్చాత్యులకును, మానిపించుట కంపెనీ వారికిని కష్టమగుచువచ్చినది. కాని, సర్ విలియమ్ జోన్స్

---

27. **"During the last century** ("18 వ శతాబ్ది" - రచయిత.) **the generality of Europeans in Calcutta kept slave boys to wait on them at table. Slavery was a recognized institution, and as the following advertisement, taken from a Calcutta paper of 1781, shows, the trade was openly carried on even by persons holding holy orders:- "To be sold by private sale; Two Coffree boys, who play remarkably well on the French horn; about eighteen years of age; belonging to a Portuguese Padrie lately deceased. For particulars enquire of the Vicar of the Portuguese Church."** (Ibidem. **Page**-78.)

28. **"Slaves were regularly purchased and registered in the kutcherry or court house, and in 1752 we find each slave paid a duty of four rupees and four annas to the East India Company for such registry"** (Ibidem. Page, 71.)

(Sir William Jones 1746-1794) వంటి ఉదారులైన పాశ్చాత్యోద్యోగులు,[29] బానిసత్వము యొక్క ఘోరములను చూచిన వారగుటచే, దానిని ఖండించుటయు కలదు. కాని వీరి సంఖ్య స్వల్పము. అయినను, విశిష్టమైనది.

కాని, ఈ అల్ప సంఖ్యాకులే భారతీయులలో భాషావిప్లవము తెచ్చినవారు. తమ తోడి ఉద్యోగులలో అధిక సంఖ్యాకులు ధన సంపాదనమున, విలాసజీవనమున కాలము గడుపుచుండగా; వీరు భారతీయ భాషలు నేర్చుకొనియు, భారతీయుల ప్రాచీన నాగరకతా సంస్కృతుల నర్థము చేసికొనుటకు ప్రయత్నించియు, మన దేశములో కొంత చైతన్యము తెచ్చుటకు ప్రయత్నించిరి. మరుభూములలో మంచినీటి బావులవలె, ఈ పాశ్చాత్యులు నాటి సమాజమున తప్ప బుట్టిన వారన వచ్చును. వీరిలో తలమానికమగు వ్యక్తి సర్ విలియమ్ జోన్స్. ఈతని ప్రోత్సాహమువనే, "ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్" 1784 లో, జనవరి 15వ తేదీని స్థాపింపబడినది. అప్పుడు గవర్నర్ జనరల్ అయిన వారన్ హేస్టింగ్స్ దీనికి

---

29. "Sir William Jones, in a Charge to the Grand Jury ag Calcutta, in 1785, described the miseries of slavery existin, at that period, even in metropolis of British India—"I am assured from evidence which, though not all judicially taken has the strongest hold on my belief, that the condition of slaves within our jurisdiction is, beyond imagination, deplorable; and that cruelties are daily practised on them, chiefly on those of the tenderest age and the weaker sex, which, if it would not give me pain to repeat and you to hear, yet for the honour of human nature I should forbear to particularise ... ... ... ... ... Hardly a man or woman exists in a corner of the populous town, who hath not at least one slave child either purchased at a trifling price, or saved perhaps from a death that might have been fortunate, for a life that seldom fails of being miserable. Many of you, I presume, have seen large boats filled with children coming down the river for open sale at Calcutta. Nor can you be ignorant that most of them were stolen from their parents, or bought, perhaps for a measure of rice in a time of scarcity." (Ibidem. Page–74.)

అధ్యక్షునిగ ఉండుట కంగీకరింప కుండుటచే, కలకత్తా సుప్రీంకోర్టు జడ్జి అయిన సర్ విలియమ్ జోన్స్, తానే దీనికి మొదటి అధ్యక్షుడయ్యెను. బహు భాషాకోవిదుడు విశాల హృదయుడు, మానవతావాది అయిన ఈతడు సంస్కృత భాషలో కూడ మంచి పాండిత్యమును సంపాదించి, అభిజ్ఞాన శాకుంతలాది బహు గ్రంథముల నాంగ్లీకరించి, సంస్కృత భాష యొక్క ఘనతను [80] ప్రపంచమునకు చాటినాడు. ఈతడు ఫార్సీ భాషలోను గొప్పపండితుడు. ఆ భాష కాతడు వ్రాసిన వ్యాకరణము చాల గొప్పది. పాశ్చాత్యులు సంస్కృత భాషను గ్రహించుటలో, భాషాశాస్త్ర పఠనమువనే గొప్ప విప్లవమువచ్చినది. నాటి సంస్కృతభాషా పఠనము, నేటి భాషాశాస్త్ర వికాసమునకు పునాది వేసినది. [81]

పదునెనిమిదవ శతాబ్ది ఉత్తరార్ధములోనే-పందొమ్మిదవ శతాబ్దిలో భారతీయుల, సహృదయులైన పాశ్చాత్యుల నాయకత్వమున జరిగిన భారతీయసమాజములోని భావవిప్లవమునకు, బీజములు పడెను. ఒకవంక దురాశాపూరితులైన కంపెనీ ఉద్యోగుల జులుము సాగుచుండగనే, రెండవ వంక ప్రతిభావంతులైన పాశ్చాత్యోద్యోగుల ప్రభావమున, శతాబ్దులుగ నిర్జీవమైయున్న భారతజాతి మేల్కొనుచుండెను. ఈ జాగృతికి, రాజా రామమోహనరాయల (1774-1833) వంటి ప్రతిభావంతులైన భారతీయుల సాహాయ్యమును కారణము. ఇదంతయు ముఖ్యముగా పందొమ్మిదవ శతాబ్దికి సంబంధించినది.

---

80. **"The Sanskrit language, whatever be its antiquity, is of a wonderful structure, more perfect than Greek, more copious than Latin and more exquisitely refined than either, yet bearing to both of them a stronger affinity, both in the roots of verbs and in the forms of grammar, than could possibly have been produced by accident; so strong indeed that no philologer could examine them all three, without believing them to have sprung from some common source."**
(2-2-1786 న, సర్ విలియమ్ జోన్స్ ఇచ్చిన ఉపన్యాసమునుండి.)

81. **"It was largely due to the rediscovery of Sankrit by Sir William Jones and others towards the close of the Century (18th) that this Latin domination was shaken, that the ancient Indo-European languages were re-constructed, and that the modern science of linguistics was initiated." (Language in the Modern World by Simeon Potter (A Pelicon Book, 1960. Pages-12, 13.)**

ఛార్లెస్ విల్కిన్స్ (Charles Wilkins : 1750 – 1836), హెన్రీ థామస్ కోల్‌బ్రూక్ (Henry Thomas Colebrooke : 1765 – 1837) మొదలైన ప్రతిభావంతులైన పాశ్చాత్యులు; సంస్కృతాది భారతీయ భాషలలో పండితులై; వాటిని గూర్చి పాశ్చాత్యులకు చెప్పి సహృదయులైన పాశ్చాత్యులనుండి భారతీయుల ఎడగల దురభిప్రాయములను, తొలగించుటకు ప్రయత్నించుచుండిరి. ఈ ప్రయత్నములు, భారతీయులలో ప్రతిభావంతులైన వారియందు ఆత్మవిశ్వాసమును పెంచి, వారు తమ జాతీయ జీవనమునగల మంచిచెడ్డలను పరిశీలించి చెడ్డను విసర్జించునట్లు చేయుటకు చాల తోడ్పడెను. వారన్ హేస్టింగ్స్, తన పరిపాలనమున చేసినమార్పులు ; కంపెనీ డైరెక్టర్లు జానిః వ్యాపారమును, తమ ప్రభుత్వముగల భారత భాగమున, నిషేధించుచు చేసిన ఉత్తర్వులు మొదలైనవి పనిచేసి, 1800 నాటికి దేశమున కొంత వరకు శాంతిభద్రతలు ఏర్పడినవి. కంపెనీ ఉద్యోగులును కొంతకు కొంత మారుచు వచ్చిరి. ఎన్ని మార్పులు వచ్చినను; వా జీవిత విధానమునగాని,[32] భారతీయుల ఎడల, అధిక సంఖ్యాకులైన ఉద్యోగులకు వారిభాగ్యలకుగల భావములలోగాని[33], ఆకస్మిక పరివర్తనమురాలేదు. ఈ పరివర్తనము, కొంతైనను వచ్చుటకు, ఇంకను చాల సంవత్సరములు (పందొమ్మిదవ శతాబ్ది రెండు మూడు దశలవరకును), ఆగవలసి యుండెను. అప్పటికిని పూర్తిగా వచ్చినదని చెప్పలేము ![34]

---

32. "One hundred and 10 servants to wait upon a family of 4 people. Oh monstrous ! and yet we are economists......" (The Sahibs. London, 1948. Page-211.)

    "Every horse has a man and a maid to himself the maid cuts grass for him; and every dog has a boy. I inquired whether the cat had any servants..." (Ibidem, Page-212 )

33. "She knows a good deal of the gossip of the Europeans, but little of the ways and habits of the natives." (Ibidem, Page-117 : Mrs. Sherwood-1809.)

34. "I asked one lady what she had seen of the country and the natives since she had been in India, "oh, nothing !" said she; "thank goodness, I know nothing at all about them, nor do I wish to; really I think the less one sees and knows of them the better." (Ibidem, Page-225 : Letters from Madras, 1837.)

## బ్రౌన్ తల్లిదండ్రులు - వంశాదికము

ఆంధ్ర భాషాభివృద్ధికై తన జీవితకాలమంతయు కృషిచేసిన ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ (Charles Philip Brown: 1798-1884) యొక్క తండ్రి, రివరెండ్ డేవిడ్ బ్రౌన్ (Rev. David Brown: 1762-1812). కుమారునిపై తండ్రి యొక్క ప్రభావము చాలగలదు గనుక, తండ్రిని గూర్చియు, అతని పూర్వులను గూర్చియు మనము కొంత తెలిసికొనవలసియున్నది. ఇదిగాక, రివరెండ్ బ్రౌన్ యొక్క జీవితములో చాల భాగము, పదునెనిమిదవ శతాబ్దిలో భారతదేశమున (1786 నుండి 1812 వరకు) గడచుటచే, అతని జీవితచరిత్ర; పందొమ్మిదవ శతాబ్దిలో ఇంచుమించుగా నలుబది సంవత్సరములు (1817 నుండి 1855 వరకు) మనదేశమున ఉద్యోగము చేసిన అతని కుమారుడైన బ్రౌన్ దొరయొక్క కృషికి చక్కని నేపథ్యము (Background) కాగలదు. రివరెండ్ బ్రౌన్ జీవితము; ఇరువదవ శతాబ్ది వరకు ఇంగ్లీషువారి పరిపాలనకు కేంద్రమైన, కలకత్తాలో గడచినది. పదునెనిమిదవ శతాబ్దిలో కలకత్తాకు, ఇంగ్లీషువారి పాలనమున విశేషమైన ప్రాముఖ్యము, స్థానము కలదు. వారి సాంస్కృతిక, రాజకీయ జీవితమునకు కలకత్తా కేంద్రము.[1] క్రైస్తవమత ప్రచారమునకు కూడ, కలకత్తాయు, తత్పరిసరములును ముఖ్యకేంద్రములు.

తండ్రి జీవిత మిట్లు వంగదేశమున - ముఖ్యముగా కలకత్తాలో - గడవగా, పని జీవితములో నలుబది సంవత్సరములు మద్రాసు ప్రెసిడెన్సీలో గడచినది. ఈ రెండు ప్రెసిడెన్సీలును నాడు ఇంగ్లీషువారి పాలనమున, చాల ప్రాముఖ్యమును గన్నవే! తండ్రి కాలమునాడు కంపెనీ పరిపాలన, ఇంకను

---

1 **"We must not quit Calcutta, the Athens of the East..." (Rev. David Brown in 'The Memorial Sketches', London, 1816. Page—89.)**

బాగుగ స్థిరపడలేదు. ఆ రోజులు కంపెనీ యొక్క ప్రభుత్వమున ప్రారంభదశలు. కుమారుని కాలమునాటికి, కంపెనీ ప్రభుత్వము సుస్థిరమై. పరిపాలన క్రమబద్ధమైనది. ఇదిగాక, తండ్రి ఉద్యోగము మతసంబంధమైనది కుమారునిది లౌకికము. తండ్రియొక్క ఆదర్శములు- క్రైస్తవ మతప్రచారము; దాని వ్యాప్తి. కుమారుని ఆశయములు - న్యాయసమ్మతమైన పరిపాలన, భాషా సేవ. ఈ ఆశయ భేదములు; వ్యక్తుల మానసికావస్థలను బట్టియే గాక, వారు జీవించిన శతాబ్దులను బట్టియు, సామాజిక రాజకీయ పరిస్థితులను బట్టియు కూడ; వచ్చినవే. తండ్రి కొడుకులలో, ఏ ఇరువురి నడమ ఇంత వైవిధ్యయుక్తమైన భేదము గాని, అంతర్వాహినిగా ఇన్ని పోలికలు గాని సామాన్యముగా నుండవనవచ్చును. పోలికలలో ముఖ్యమైనవి - వారి భాషాభిమానము, భారతీయుల ఎడ సహనముతో కూడిన స్నేహభావము, భారతీయులనుండికూడ నేర్చుకొనవలసినవి కొన్ని యున్నవను విశాలదృష్టి - అనునవి.ఈ సద్గుణములు తండ్రినుండి కుమారునకు సంక్రమించినవి. అనగా,కేవలమివి పుట్టుకతో వచ్చినవని కాదు! సహజముగ బ్రౌను దొరలోని ప్రతిభ; తండ్రి ప్రోత్సాహమున, శిక్షణమున, వికసించెనని చెప్పుట. కుమారుని మనోవికాసమునకు తగిన వాతావరణము తండ్రి కల్పించెను. కుమారుడు తన ప్రతిభ ననుసరించి, దానిని వినియోగించుకొనెను.

ఇట్లు కుమారునిపై తన ప్రభావమును నెరపి, మన భాషాభివృద్ధికి పరోక్షముగతోడ్పడిన రివరెండ్ డేవిడ్ బ్రౌన్, 1762 చివరి భాగమున, 'యార్క్‌షైర్' లోని 'హాల్' (Hull in York-shire) నకు సమీపమున పుట్టెను. అతని తల్లిదండ్రులు, సోదరులు కూడ వ్యవసాయము వృత్తిగాగల సంపన్నులు. బాల్యమునుండియు కూడ రివరెండ్ బ్రౌన్; తన సౌజన్యము చేతను, విద్యాసక్తితోను తాత్త్వికదృష్టితోను, తల్లిదండ్రులను, ఇరుగుపొరుగు వారిని ఆకర్షించెను. పదునొకండు సంవత్సరముల ప్రాయమున; అతని నొక క్రైస్తవ మతాధికారి చూచి, ఆ బాలునకు ఏ పనికై శిక్షణ ఇచ్చెదరని తల్లిదండ్రుల నడిగెను. అతనికి వ్యవసాయమన్న అంత ఇష్టములేదు గనుక; ఏ వర్తకుని యొద్దనో, ఏ వైద్యుని యొద్దనో పనినేర్చుకొనుటకై పెట్టెదమని వారు సమాధానము చెప్పిరి. అందులకా మతాధికారి; బాలుడు తెలివి తేటలు గల వాడు గనుక, అతనిని తన కప్పగించినచో ఒకటి రెండు సంవత్సరములు విద్యనేర్పి, తరువాత చర్చి ఉద్యోగియగుటకు తగిన

శిక్షణ నిప్పింతునని చెప్పెను.[2] తల్లిదండ్రులందుకు సంతోషించి, డేవిడ్ బ్రౌన్‌ను అతని కప్పగించిరి. డేవిడ్ బ్రౌన్ అతనితో 'స్కార్‌బరో' (Scarborough) లో నుండి, కొంత విద్యనేర్చుకొని తరువాత 'హల్' (Hull) లోని 'గ్రామర్ స్కూల్' లో చేరెను. అప్పుడది రివరెండ్ జోసెఫ్ మిల్నర్ అధ్యక్షత నుండెను. ఇక్కడనుండి, డేవిడ్ బ్రౌన్ కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునకుపోయి అచ్చట మేగ్డలీన్ కాలేజీలోచేరెను. అక్కడనుండగా చాలసార్లు జబ్బుచేసినను తేరుకొనుచు వచ్చి తాత్త్విక విషయములను, మతసంబంధములైన విషయములను, గ్రీకు మొదలైన భాషలను నేర్చెను. ఈ విధముగా అన్నియు క్రమముగా నడచుచుండగా, అనుకొనకుండ అతనికి భారతదేశములో నొక ఉద్యోగము లభించెను. యుద్ధములలో గాని, పనిచేయుచు గాని చనిపోయిన ఆఫీసర్ల యొక్క పిల్లలకు విద్య నేర్పుటకై కలకత్తాలో ఒక విద్యాసంస్థ స్థాపితమై యుండెను. దానికొక సూపరింటెండెంటు కావలసివచ్చి, డేవిడ్ బ్రౌన్‌నకది తీసికొనవలసినదిగా ఆహ్వానము వచ్చినది.

ఈ ఆహ్వానము వచ్చిన విధము చాల విచిత్రమైనది. కాలేజీలో నుండగా, డేవిడ్ బ్రౌన్ కొందరు పేదవారికి సాయము చేయుచువచ్చెను. ఆ సందర్భమున తనకు కలిగిన అనుభవముల నాతడు లండనులోని స్నేహితున కొకనికి లేఖామూలమున తెలియజేసెను. ఆ స్నేహితుడు, ఈస్టిండియా కంపెనీ ఉద్యోగియగు మేజర్ మిచల్ (Major Mitchell) అను వానికి, డేవిడ్ బ్రౌన్‌ను గూర్చి చెప్పెను. అప్పటికి మేజర్ మిచల్‌నకు, ఇండియాలోని విద్యాసంస్థకు ఒక సూపరింటెండెంట్ కావలసియున్నదనియు, అట్టివానినిసంపాదించుటకుసాయపడవలసినదనియు ఒక అభ్యర్థనము వచ్చినది. మేజర్ మిచల్ మనస్సులో, డేవిడ్ బ్రౌన్ మెలిగెను. వెంటనే ఆతడు లండను నుండి 1785 ఫిబ్రవరిలో, డేవిడ్ బ్రౌన్‌నకొక జాబు వ్రాసెను. ఆ జాబులో తాను డేవిడ్ బ్రౌన్ యొక్క గుణగణములను గూర్చి విన్నట్లును, కలకత్తాలోని "విద్యాసంస్థ-శరణాలయము" లో ఇరువది ఐదుగురు బాలురు, ఇరువది ఐదుగురు బాలికలు కలరనియు, దానికొక సూపరింటెండెంటు

---

2. "I think he is destined to a higher and more important profession; and if you will entrust him with me for a year or two, I will give him the preparatory attention necessary to his passing through a grammar school, which may fit him for college, and lead to his entering the Church". Memoir of the Rev. David Brown (The Asiatic Journal, London, 1819, Vol. VIII Page-2.)

కావలసి యున్నందున, ఆ ఉద్యోగము డేవిడ్ బ్రౌనెకియవలెనని తాను సిఫారసు చేయవలెననుకొను చున్నట్లును, ఏ విషయమును తేల్చుకొని వెంటనే వ్రాయవలె ననియు ; మేజర్ మిచల్ వ్రాసెను.[3]

ఈ ఉత్తరము వచ్చునప్పటికి, డేవిడ్ బ్రౌన్ జబ్బుచేసి తేరుకొనుచుండెను. ఇండియాలోని ఉద్యోగమునకు పోవుటకు చాల అడ్డంకులు ఆతనికి తోచెను. ఈ ఆహ్వానమును, అంతరాత్మకు బాధ కలుగకుండ మన్నింపకుండుటకు చాల కారణములు కన్పట్టెను. అన్నింటి కంటె ముఖ్యమైనది, అతని చిన్న వయస్సు (28 సంవత్సరములు). అంత చిన్న వయస్సులో చర్చిలో మతోద్యోగిగా చేరుట ఆతనికి మొదట వచ్చలేదు. కాని, అతని స్నేహితులందరు, ఆతడు ఇండియాలోని ఈ ఉద్యోగమును స్వీకరింపవలెననియే తలంచిరి.[4]

---

3. "...for it is in consequence of the very high opinion I have conceived of your character and capacity, from the favourable mention of both in the course of my conversations with your estimable correspondent that I have been induced to write you this letter".
"...but as they propose to have a superintendant of the institution in India, they have authorised a captain of the Bengal army...to look out for a married young gentleman (a clergyman in preference) to proceed to India in one of the ships of the season. As the gentleman embarks for India in ten days, you must make an immediate choice. I have prevailed on him to wait for your answer until Thursday morning..." (From the Private Papers of Rev. David Brown).

4. "When this letter reached me at College, I was just recovering from a long indisposition. There were many objections immediately occured to me; I foresaw them all at a rapid glance, and settled in my mind that I might decline the offer with a good conscience; above all, I was too young for priest's orders...I acquainted some of my serious friends with the import of the Major's letter...They differed from me in judgement..." (Ibidem).

డేవిడ్ బ్రౌన్, మేజర్ మిచల్‌ను 1785 లో ఫిబ్రవరి 15 వ తేదీని కలిసికొనెను. ఇండియా పోవుచున్న కెప్టెన్ ఫిట్జ్‌పాట్రిక్ (Captain Fitzpatrick)ను, తరువాత రెండు రోజులకు కలిసికొనెను. "విద్యాసంస్థ-శరణాలయము"న పబది మంది బాలబాలికలు గాక, ఐదు వందల మంది ఉన్నట్లును, జీతము మొదట చెప్పిన దానికంటె తక్కువ అయినట్లును అప్పుడు తెలినది కాని, అప్పటి కప్పుడే ఇండియా వెళ్ళవలెనని నిర్ణయించుకొనిన డేవిడ్ బ్రౌన్, తనను క్రైస్తవ పురోహితునిగ (Priest చేయుటకు బిషప్ అంగీకరించినచో, తాను ఇండియా వచ్చెదని చెప్పి, వమ్మతిపత్రమున సంతకము చేసెను. ఇప్పుడాతనికి రెండు సమస్యలుండెను. బిషప్‌నుండి క్రైస్తవ పురోహితునిగ నుండుటకు అజ్ఞాపత్రము సంపాదించుట మొదటిది. ఇండియాలోని ఉద్యోగమునకు వివాహితుడైన మహోద్యోగి కావలెను గనుక, సాధ్యమైనంత త్వరలో వివాహము చేసికొని భార్యను సంపాదించుట రెండవది. వ్యవధి తక్కువ గనుక, ఈ రెండును మొదట కష్టములుగనే తోచెను!

వెంటనే అతడు లండను బిషప్ అయిన డాక్టర్ లౌత్ (Dr. Lowth, Bishop of London) దగ్గరకు పోయి తనను పురోహితునిగ చేయవలసినదని కోరెను. కాని అతడంగీకరింపలేదు. అతడంతకు పూర్వము పురోహితులనుగా చేసిన కొందరు యువకులు; తాము వాగ్దానముచేసినట్లు విదేశములకు పోక, లండను లోనే తిరుగుచు, వృత్తికే అపకీర్తి తెచ్చుటచే, అతడు డేవిడ్ బ్రౌన్‌ను పురోహితునిగ చేయుట కంగీకరింపలేదు.[5]

వెంటనే డేవిడ్ బ్రౌన్, మేజర్‌తో కలిసి లాన్డఫ్ బిషప్ అయిన డాక్టర్ వాట్సన్ (Dr. Watson, Bishop of Landaff) ను, కలిసికొని జరిగినదంతయు చెప్పెను. వెంటనున్న మేజర్ కూడ, సాయముచేయవలసినదిగా ఆతనిని అర్థించెను. అందులకా బిషప్, కేంటర్‌బరి ఆర్చిబిషప్ ఒప్పుకొన్నచో, తాను డేవిడ్ బ్రౌన్‌ను పురోహితునిగ చేయుట కంగీకరింతునని చెప్పగా; డేవిడ్ బ్రౌన్ ఆర్చిబిషప్‌ను కలిసికొనెను. ఆర్చిబిషప్ ఒప్పుకొనెను. ఫిబ్రవరి 27 వ తేదీని (1785) డేవిడ్ బ్రౌన్

---

5. "I waited on Dr. Lowth, the bishop of London, asking to be ordained to go abroad: he answered flatly, that he would never ordain another man to go abroad; for that he had ordained several for the colonies, who afterwards remained lounging about the town, a dis-grace to the cloth." (Ibidem)

పురోహితునిగ చేయుండి, రివరెండ్ డేవిడ్ బ్రౌన్ అయ్యెను. మార్చి 2 వ తేదీని ఆతనిని "క్రైస్తవ విజ్ఞాన ప్రచారక సంఘము" (The Society for promoting Christian Knowledge)న, సభ్యునిగచేసిరి. తరువాత, ఆ సంఘమువారు ఆతనిని కంపెనీ డైరెక్టర్లకు సిఫార్సుచేసిరి. వారాతని యోగ్యతలను పరీక్షించి, ఇండియా ప్రయాణమునకై మూడు వందల గినీలను, ముందుగానే ఇచ్చిరి. దీనికి డేవిడ్ బ్రౌన్ ఎప్పుడును కృతజ్ఞుడై యుండెను.

ప్రయాణమునకు అంతయు సిద్ధమైనది. కాని, వివాహమింకను కాలేదు. ఆ అడ్డు తీరలేదు. ప్రయాణమునకు ఓడలో స్థలము దొరకక కొన్ని నెలలు ఇంగ్లండు లోనే ఉండిపోవలసి వచ్చినది. ఈ కాలములో ఆతడు వివాహ ప్రయత్నముచేసి, గృహస్థుడయ్యెను. అతని భార్యయొక్క కన్యానామము మిస్.రాబిన్సన్ (Miss Robinson). ఆమె నాతడు చాల కాలమునుండి ఎరిగి యుండుటచే,వివాహము సులభముగా నైనది. కొద్ది కాలములో ఇండియా పోవుచున్నామనుకొని వారు 1785 లో మార్చి 4 వ తేదీని వివాహము చేసకొనిరి. కాని, కారణాంతరములచే ప్రయాణము ఆలస్యమైనది. ఆ పరిస్థితులలో డబ్బు లేకపోవుట వలన, రివరెండ్ డేవిడ్ బ్రౌన్ దంపతులు చాల చిక్కులు పడిరి[6]. ఇండియా పోవువరకు జీతము రాదుగదా! కనుక డబ్బు ఇబ్బందులు కొంత తొలగుటకై "ఛల్సియా చర్చి"లో కొన్నాళ్ళు క్యూరేట్ (Curate)గా పనిచేసెను. అతని స్నేహితులందరును అతనికి డబ్బు పంపుచు వచ్చిరి ఆ డబ్బు, అప్పుగా తీసికొనుచున్నానని వారికి చెప్పి, దాని నాతడు స్వీకరించెను. ఇండియా వెళ్ళిన తరువాత ఆ అప్పును తీర్చివేసెను.

రివరెండ్ డేవిడ్ బ్రౌన్ ఎట్టకేలకు ఓడపై స్థలమును సంపాదించి,గర్భవతి యైన భార్యతో ఇంగ్లండు నుండి ఇండియాకు బయలుదేరెను. ఆ రోజులలో ఈ ప్రయాణము ఇంచుమించుగా ఆరు నెలలు తీసికొనెడిది. ప్రయాణ మధ్యమున ఆతని భార్య ప్రసవించి, 1786 లో ఫిబ్రవరి ఒకటవ తేదీని కుమారుని కన్నది అందరును సంతోషించిరి. రివరెండ్ బ్రౌన్, తన కుమారునకు డేవిడ్ మిచల్ బ్రౌన్ అని పేరు పెట్టెను. ఇట్లు సకుటుంబముగా ప్రయాణము చేసి కలకత్తా

6. **"I am now to reside in Chelsea, and have very little money and food to provide for my wife and self". (Journal of Rev. David Brown)**

చేరి, జూన్ 18 వ తేదేని 1786 లో "విద్యాసంస్థ - శరణాలయము" యొక్క యాజమాన్యమును వహించెను. అందరు పిల్లలు తమ రక్షణమున నున్నందులకు, రివరెండ్ బ్రౌన్ దంపతులు సంతోషించిరి. వచ్చిన కొద్ది రోజులకే, రివరెండ్ బ్రౌన్; ఫోర్టు విలియమ్‌లోని ఒక బ్రిగేడు (Brigade)నకు ఛాప్లైన్ (Chaplain)గా నియమింపబడెను.

తాను కలకత్తాలో ఉండవలసి యుండుటచే బెంగాలీ నేర్చుకొనుట ప్రథమ కర్తవ్యమని గ్రహించి, రివరెండ్ బ్రౌన్, ఓడ మీదనే ఆ భాషను నేర్చుకొనుట ప్రారంభించెను. భారతీయ భాషలయందు మొదటినుండియు ఆతనికి ఆదర ముండెను ఆతని కుమారుడైన ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్, తన భాషాభిమానమును తండ్రి నుండియే పైతృకముగ పొందియున్నా డనవచ్చును. ఆనాడు, ఓడ ప్రయాణము ఆరేడు నెలలు పట్టుచుండెను గనుక; రివరెండ్ డేవిడ్ బ్రౌన్ కలకత్తాలో అడుగుపెట్టు నాటికి. వంగభాష బాగుగ నేర్చుకొని యుండెను. కనుకనే ఆతడు వెంటనే తన కార్యకలాపములలో, భాషవలని బెడదలేకుండ నిమగ్నుడు కాగలిగెను.

కాని, ఆతడు కలకత్తాలో అడుగుపెట్టిన సంవత్సరము లోపుననే, పుత్ర వియోగమును పొందవలసిన వాడయ్యెను. బ్రౌను దంపతులకు, ఓడమీద కలిగిన కుమారుడు, చాల చిన్న వయస్సులో చనిపోయెను (20 ఏప్రిల్ 1787). ఆతనికి పిల్లలనిన మొదటినుండియు చాల ప్రేమ. ఈ ప్రథమ పుత్రుని మృతి - బాలుడు చాల చిన్నవాడైనను - ఆతనిని చాల దుఃఖపెట్టినది ఆ రోజులలో ఆత డొక మిత్రునకు వ్రాసిన జాబులోని ఈ భాగము, మనకీ విషయమును తెలుపును :

**"He began to lisp and walk, then the lovely blossom died-"** కాని, ఆతడెంత వీతరాగుడో, ఆ లేఖలో నేయున్న క్రింది వాక్యము తెలుపును: **"If a wish could bring back his child, that wish he would not form"**. రివరెండ్ డేవిడ్ బ్రౌన్‌నకు, తన మత సత్యములయందెంత నమ్మక మున్నదో, పుత్రుని మృతిని ఎంతటి ప్రశాంత చిత్తతతో గ్రహించెనో ;

---

7. **Memoir of the Rev. David Brown (The Asiatic Journal. London, 1819. Vol. VIII; Page-218).**

పుత్రుని గోరి మీద నున్న "శిలాలేఖనము" వలన మనకు తెలియును:

**"The Epitaph"**

**"Bold infidelity, turn pale and die,**
**under this turf an Infant's ashes lie :**
**Say, is it lost or saved ?**
**If death's by sin, it sinn'd, because 'tis here;**
**If Heaven's by works, it can't in Heav'n appear ?**
**Ah, reason how depraved !**
**Revere the Bible's sacred page, the knot's untied,**
**It died through Adam's sin; it lives, for Jesus died."**
**David Mitchell Brown.**
**Born at sea, Feb. 1st. 1786;**
**Died at the Orphan-house, Bengal, April 20. 1787.**

ఈ దుఃఖము వాతడు, మరచిపోవుటకు ఎక్కువపనిని మీదవేసికొని దానిలో నిమగ్నుడై యుండుటకు ప్రయత్నించెను. "మిషన్ చర్చ్" (**Mission Church**)కి సంబంధించిన పనుల నన్నింటిని ఆతడీ సంవత్సరమే (1787) తనపై వేసికొనెను. దీనితో ఆతడు, ప్రతి ఆదివారమును ఒకదాని తరువాత నొకటిగా మూడు చోట్లు అందు (శరణాలయము, ఫోర్టు విలియమ్, మిషన్ చర్చ్) తన మత సంబంధమైన కార్యములలో ప్రవర్తింపవలసి వచ్చెను.

ఆతడు "మిషన్ చర్చ్" కొరకు పాటుబడుచున్న రోజులలో, తన కృషికి ప్రతిఫలమును - ధనరూపముగ - ఏమియు తీసికొనలేదు. అప్పుడాతడు పూనుకొననిచో, దానిని మూసివేయవలసి వచ్చెడిది! ఇట్లు ఏడు నెలలు జరిగిన తరువాత, "శరణాలయము" అధికారులకు ఆతని స్వార్థరహిత కృషి అంతగా నచ్చక కాబోలు - శరణాలయము పని గాని, మిషన్ చర్చ్ పని గాని, ఏదో ఒకటి మాత్రమే ఆతడు చేయవలెనని ఒత్తిడిచేసిరి. మిత్రుల సలహా ననుసరించి. తనకు లాభదాయకమైన ఆతడు, శరణాలయము పనిని మానివేసెను ! ఇది 1788 ఆగష్టులో జరిగినది. ఈ "శరణాలయము" పనిలో ఉన్న దినములలో ఆతడు, స్వదేశస్థుల పిల్లలకై ఒక "ధర్మబడి" ని కూడ స్థాపించి ఉచితముగా నిర్వహించెను.

శరణాలయము పని మానివేసిన తరువాత, తన ఇంటిలోనే విద్యార్థులకు పాఠములు ఉచితముగా చెప్పుట ప్రారంభించెను. ఈ తరగతులు చాల ప్రచారమునకు వచ్చి, ఆతనికి మంచి పేరు తెచ్చెను. ఈ పనులు గాక, ఆతడు నిర్ణీతములైన దినములలో ; జైళ్ళు, ఆసుపత్రులు కూడ తన మతమునకు ప్రచార కేంద్రములుగ భావించి, అక్కడకు పోయెడివాడు. ఇట్లు నిర్విరామముగ, తాను తన్నీ నిమ్మిన ధర్మముయొక్క ప్రచారమునకు రివరెండ్ డేవిడ్ బ్రౌన్ కృషిచేసి, సమకాలికులలో ఖ్యాతికెక్కెను

ఈ పనులిట్లుండగనే, 1794లో ఆతడు "ప్రెసిడెన్సీ ఛాప్లైన్" (Presidency Chaplain) గా నియమింపబడెను. ఈ క్రొత్తపని వచ్చినను ఆతడు తన మిగిలిన పనులను మానక, పూనికతో అన్నింటిని నెరవేర్చుచుండెను. అప్పటి నప్పుడే, రివరెండ్ డేవిడ్ బ్రౌన్, ముగ్గురు "గవర్నర్-జనరల్" (Governor-General) గార్ల[8] వద్ద పనిచేసినట్లైనది. ఆతడు వీరి మెప్పునుపొందుటచేతనే; 1800 లో "ఫోర్టు విలియమ్ కళాశాలను"ను, మార్క్వెస్ వెలస్లీ స్థాపించినప్పుడు, రివరెండ్ బ్రౌన్‌ను "ప్రోవోస్ట్"(Provost)గాచేసెను కళాశాలస్థాపించునాటికున్న,అధికారవర్గమిది[9]: వంగరాష్ట్రములో నాడు, ఈ కళాశాల చాల ప్రముఖపాత్ర వహించినది. కంపెనీ ఉద్యోగులైన వారిలో - భారతీయ భాషల విషయమున, నాగరకతా సంస్కృతుల

"Rev. [illegible]avid Brown, Provost.

Rev. Claudius Buchanan, A B Vice-Provost.

PROFESSORSHIPS

Arabic Language and Mahomedan Law-Lieutenant John Baillie.

Persian Language and Literature - Lieutenant Colonel William Kirkpatrick, Francis Gladwin, and Neil Benj. Edmonstone Esq.

Hindustanee Language—John Gilchrist, Esq.

Regulations and Laws, & c —Geo. Hilaro Barlow, Esq.

Greek Latin and English Classics—Rev. Claudius Buchanan".

ఆనాడు, ప్రోవోస్ట్‌నకు రు. 2,500/-, వైస్-ప్రోవోస్ట్‌నకు రు. 2,000/-, ప్రొఫెసర్‌నకు రు. 1,600/- జీతమని తెలియుచున్నది.

---

8. (i) Lord Teignmouth, (ii) Marquis Cornwallis, (iii) Marquis Wellesley.

9. 'The Good old days of Honorable John Company; Simla, 1882'. By W.H. Carey. (Page-24.)

విషయమున; జ్ఞానమున్న వారిసంఖ్య చాల తక్కువ గనుక ; అట్టి జ్ఞానమును వారికి కలిగింపవలెనను సదుద్దేశముతో మార్క్విస్ వెలస్లీ దీనిని స్థాపించెను.[10] ఈ కళాశాలనుబట్టి భారతీయులను కొంతవరకు తమ్ము పాలించుచున్న ఆంగ్లేయులను గూర్చి తెలిసికొనుట జరిగినది.

ఈ కళాశాలలో మొట్టమొదట, తరగతులు 1800 లో, నవంబరు 24 వ ప్రారంభింపబడినవి. ముందుగా అరబ్బి, ఫార్సి, హిందుసానీ, భాషలలో శిక్షణ మొదలయ్యెను. కాలేజీని పురస్కరించుకొని గ్రంథాలయము కూడ అప్పుడే స్థాపించబడినది.

1861 లో జరిగిన పరీక్షలో ఎక్కువగా గుణములను సంపాదించిన వారికి బహుమతులు పంచబడినవి 1802 లో ఫిబ్రవరి 6 వ తేదీని జరిగిన ఈ సభలో, "వక్తృత్వపు పోటీలు[11]" కూడ జరిగినవి. ఈ కళాశాల ఉన్నంత కాలమును, విద్యార్థులు - ఆచార్యులు కూడ మంచి ఉత్సాహముతో పట్టుదలతో పనిచేసిరి. గొప్ప ప్రతిభావంతులైన ఆచార్యులు[12], తమ కార్యములను సమర్థతతో నిర్వహించెడివారు.

---

10. "Under no Administration of our Indian affairs was so much done for the encouragement of Oriental learning among the servants of the state, or for its general diffusion by the publication of valuable works, as during the rule of that great man. An assemblage of the ablest professors and teachers in every branch of instruction that was to be imparted, gave life and energy to the system". (Ibidem; Page-23.)

11. నాటి చర్చనీయాంశములు :- "(1) An academical institution in India is advantageous to the Natives and the British nation. (2) The Asiatics are capable of as high a degree of civilization as Europeans; and (3) The Hindustanee language is the most generally useful in India". (Ibidem; Page-24.)

12. The names of Colebrooke, Gladwin, Harington, Gilchrist, Edmonstone, Baillie, Lockett, Lumsden, Hunter, Buchanan, Carey and Barlow, all of whom in various branches of tuition, discharged the duties of professors, will vouch the excellence of the instructions imparted, and the advantages enjoyed by the students in that establishment..." (Ibidem; Page-24.)

దేశభాషలను నేర్చుకొనుటకు విశేషమైన ప్రోత్సాహము విద్యార్థులకు కలిగించుటకై, ప్రభుత్వమువారు 1812 లో, ఫిబ్రవరి 8వ తేదీని - పట్టుదలతో కళాశాల విడిచిన తరువాత కూడ అరబ్బీ, సంస్కృత భాషలలో కృషిచేయుచున్న కంపెనీ సివిలు ఉద్యోగికి, 5000 రూపాయలను, పారితోషికముగ నిత్తుమని ప్రకటించిరి. కాని, కంపెనీ డైరెక్టర్లు దీనిని త్రోసిపుచ్చి (22-7-1814) గౌరవమైన డిగ్రీని, ఇత్తుమని ప్రకటించిరి (30-5-1815). దీనితో కొందరి ఉత్సాహము సన్నగిల్లినది.

ఈ కళాశాల స్థాపింపబడిననాటి నుండి తన మృతివరకు (1812) రివరెండ్ డేవిడ్ బ్రౌన్, దీనికొరకై అధికారిగ, అనధికారిగ కూడ చాల శ్రమించెను. అతని ఉత్సాహము, పట్టుదల అట్టివి కంపెనీవారు, ఈ కళాశాలను 1828 లో ఎత్తివేసి; తమ ఉద్యోగులు ఆయా రాష్ట్రములలో మున్షీలవద్ద, ఆయా భాషలు నేర్చుకొనునట్లు ఏర్పాటు చేసిరి. కాని, ఈ కళాశాల ఉన్నంతకాలము, తరువాత కూడ; దీని ప్రభావము కన్పట్టినది[13].

ఫోర్టు విలియమ్ కళాశాలలో "ప్రోవోస్ట్", అయిన తరువాత పని ఎక్కువగుటచే, తాను "ప్రెసిడెన్సీ" పనిని చేయుట కష్టమని తలంచి, రివరెండ్ బ్రౌన్, దానిని మానుకొనెను. ఇట్లు తన కాలమునంతటిని కళాశాలయొక్క అభివృద్ధికై రివరెండ్ బ్రౌన్ వ్యయించుటకు సిద్ధపడినను; కంపెనీవారు 1806 లో ప్రోవోస్ట్, వైస్-ప్రోవోస్ట్ పదవులు అనావశ్యములని తలంచి వానిని తీసివేసిరి[14]. నాటి

---

13. "...notwithstanding it has ceased to exist, yet continues its beneficial influence by the many standard works of eastern literature and education which issued formerly under its patronage from the press, and by the important services rendered by those who had been trained within its walls". (Ibidem; Page-24.)

14. 'Para, 6-We think the writers may complete their studies in the oriental branches, in one year, at the College at Calcutta, provided they davote their time and attention exclusively to this object. The expense, therefore of the institution may be reduced within a much more limited scale than at present" "Para, 7—Considered upon these principles, it will be unnecessary to continue the offices of provost and vice--provost..." (Extract from a Public General Letter from the Hon. the Court of Directors dated 21st. May 1806.)

కంపెనీవారి మన స్వత్వమున కిది మంచి తార్కాణము. స్వార్థరహితముగ కృషి చేయుచున్న రివరెండ్ బ్రౌన్‌న కిది కష్టముగ తోచి, తాను జీతము తీసికొనకుండ పనిచేయుటకు సిద్ధముగా నున్నట్లు; అప్పుడు గవర్నర్ జనరల్‌గను, కళాశాలకు "విజిటర్" (Visitor) గను ఉన్న సర్ జి హెచ్ బార్లోకొక జాబు వ్రాసెను. ఈ జాబు[15]; రివరెండ్ డేవిడ్ బ్రౌన్ యొక్క ఆశయములను, వాని నాచరణలో పెట్టు సందర్భమున అతడు చూపగల ధైర్యసాహసములను మన ఎదుట పెట్టను. ఇతరులకు సాయముచేయుట అన్న అతడెంత వ్యయ ప్రయాసలకును జంకెడి వాడు కాడు స్వార్థపరత్వము రాజ్యము చేయుచున్న ఆ దినములలో, రివరెండ్ డేవిడ్ బ్రౌన్, స్వార్థరహితత్వమునకు ఉదాహరణ ప్రాయుడు[16].

తాను శ్రమపడి సేకరించిన నూరు ఫోలియో (Folio) వాల్యూములు, ఫోర్ట్ విలియమ్ కళాశాలయొక్క గ్రంథాలయమునకు దానము చేసియు; ఇంకను చాల గ్రంథములు బైబిలు అనువాదకులకు దానముచేసియు, అతడిట్టి సత్కార్యములకు నాడు మార్గదర్శకుడయ్యెను. నాడు, వంగరాష్ట్రమునుండి బైబిలు అనువాదములు చేసిన వారి కెందరికో రివరెండ్ డేవిడ్ బ్రౌన్ సేకరించిన గ్రంథములు సాయము చేసెను[17].

---

15. "Hon. Sir :- From conviction that I cannot devote my time and attention more usefully in the service of the Hon. Company. than by promoting the success of their collegiate institution, I am induced to offer the continuance of my superintendence, if my doing so be thought eligible, and to officiate without salary, if that is considered necessary by the government under present circumstances..." (రివరెండ్ డేవిడ్ బ్రౌన్ లేఖలోని భాగము).
16. "Every species of charitable contribution at Calcutta, where calls are very frequent, received his countenance and large support..." (Christian Bioaraphy-printed for the Religious Tract Society; Religious Grace Society; Instituted 1799; Page-65.)
17. "Toward the formation of the library of the College of Fort William, he bestowed a rich stock of a hundred volumes, mostly folios, of scarce and valuable works; as also a similar present to the library founded by himself, for the use of the translators of the scriptures." (Ibidem; Paae-57.)

1786 నాటికే కలకత్తా చేరిన రివరెండ్ డేవిడ్ బ్రౌన్; ఇతని తరువాత అచ్చటకు వచ్చిన చర్చి ఉద్యోగులకు, మిషనరీలకు ఆశ్రయమై యుండి, వారికి ఆతిథ్యమిచ్చి ఆదరించెడివాడు. ఇతని కుమారుడైన ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ కూడ, ఈ విషయము నిట్లు సూచించెను. "My Father, the Reverend David Brown, was for sometime Provost of the College at Calcutta; where he was the revered friend of Claudius Buchanan, Thomason. Henry Martyn Daniel Corrie, Carey. Marshman and Ward[18]."

ఇందు పేర్కొనబడిన వారందరును నాడు భారతదేశమున క్రైస్తవ మత ప్రచారమునకై చాల శ్రమపడినవారు[19]. రివరెండ్ డేవిడ్ బ్రౌన్ కూడ ఆ దృష్టి కలవాడే గనుక, వారికి ఆశ్రయమిచ్చినాడు. వీరేగాక, క్రొత్తగా ఇంగ్లండ్ నుండి కలకత్తాకు ఎవరు వచ్చినను, వారు కొంత కాలమైనను రివరెండ్ బ్రౌన్ అతిథులుగ నుండెడివారు. ఇది నాడు - హోటళ్ళు లేని రోజులు గనుక - కొంత వరకు

---

18. Some Account of the Literary Life of Charles Philip Brown.

19. ఈ ప్రచారకుల సంగ్రహ చరిత్ర ఇది :-

*విలియమ్ కెరే* (William Carey ; 1761 - 1834). వంగరాష్ట్రమునకు 1794 లో వచ్చెను. శ్రీరామపురం మిషను, బాప్టిస్టు. గొప్ప భాషావేత్త. తెలుగునకు వ్యాకరణము (1814) రచించెను.

*క్లాడియస్ బుకనన్* (Cladius Buchanan ; 1766 - 1815) వంగ రాష్ట్రమునకు 1797లో వచ్చెను. ఫోర్ట్ విలియమ్ కళాశాలలో వైస్-ప్రొవోస్ట్. మంచి విద్వాంసుడు.

*జోషువా మార్ష్‌మన్* (Joshua Marshman; 1768-1837). శ్రీరామ పురమునకు 'వార్డ్' తోకలిసి 1799 లో వచ్చెను.

*హెన్రీ మార్టిన్* (Henry Martyn ; 1781 - 1812) కలకత్తాకు 1805 లో వచ్చెను. మిషనరీ. మత ప్రచారకునిగ పేరు పొందెను.

*డేనియల్ కొరీ* (Daniel Corrie ; 1777 - 1837). కలకత్తాకు 1806 లో వచ్చెను. బెంగాల్ ఛాప్లెన్. మదరాసు మొదటి బిషప్పు.

*థామస్ ట్రూబోడీ థోమాసన్* (Thomas Truebody Thomason) ఇండియాకు 1808 లో వచ్చెను. బెంగాల్ ఛాప్లెన్.

సర్వ సామాన్యముగానున్నను, రివరెండ్ బ్రౌన్ యొక్క అతిథి సత్కారము అనన్య సామాన్యముగా నుండెను. ఈ విషయమును సమకాలికులందరు పేర్కొనిరి.

అతని గార్హస్థ్య జీవితము సుఖప్రదమై యుండుటచేతనే, అందరతిథుల నాతడు ఆదరింపగలిగెను. ఈ జీవితమున ఆతనికి ఎగుడుదిగుడులు ఒడుదొడుకులు లేక కాదు. ఇండియాలో అడుగుపెట్టిన సంవత్సరములోపుగా అతని పుత్రుడు చనిపోయెను. మరి పదు సంవత్సరములకు ఆతని భార్యయు చనిపోయెను (జూలై 1794). ఈ దుఃఖముతో నాతడు రెండు సంవత్సరములు విధురుడుగా నుండెను. తరువాత మిత్రుల సలహాల ననుసరించి, మిస్. ఫ్రాన్సెస్ కౌలే (Miss Frances Cowley) అను నామెను ద్వితీయ వివాహముగ చేసికొనెను. ఈ వివాహము, ఆతని జీవితమును సుఖవంతముగ చేసినది. మన కథానాయకుడైన ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్, ఈ వివాహ ఫలమే.

ఇక్కడ విచిత్రమైన విషయమేమనగా – అతని మొదటి భార్య. మిస్. కౌలేను ఎరిగియుండుట ! ఎరిగియుండుటయే కాదు ; తాను చనిపోయినచో తన భర్త మిస్. కౌలేను వివాహమాడవలెనని కాంక్షించుట ! మిస్. కౌలే తండ్రి కెప్టెన్. కౌలే (Captain Cowley) బెంగాలు పదాది దళమునకు చెందినవాడగుటచే, కలకత్తాలోనే ఉన్న బ్రౌన్ దంపతులు, కౌలేలను కలిసికొనుట జరిగినది. తన అనారోగ్యమును ఎరింగిన మొదటి బ్రౌన్ సతీమణి, తాను చనిపోయినచో, తన భర్త మిస్. కౌలేను వివాహమాడవలెనని తలంచి ఆ విషయము రెవరెండ్ డేవిడ్ బ్రౌన్‌తో అన్నది కూడ[20]!

రివరెండ్ డేవిడ్ బ్రౌన్, జూలై 19 వ తేదీని (1796) మిస్. కౌలేను వివాహమాడినాడు. వీరి రెండవ కుమారుడే, ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్. ఈతడు గాక బ్రౌను దంపతులకు ఇంకను కుమారులు, కుమార్తెలు కూడ గలరు. కాని తన సంతానమంతటిలోను, తన రెండవ కుమారుడు విశిష్టుడను భావము రివరెండ్ డేవిడ్ బ్రౌన్‌కు కలదని చెప్పుట కాధారములు, ఆతని లేఖలలో కలవు. 1810లో వ్రాసిన ఒక లేఖలో – అప్పటికి ఛార్లెస్ ఫిలిప్ బ్రౌనుకు పండ్రెండు సంవత్సరములు మాత్రమే – రివరెండ్ డేవిడ్ బ్రౌన్ తన రెండవ కుమారుని సాహిత్యాభి

---

20. "How happy would Miss Cowley make you ! I wish you none other, should it please God to take me from you." (Memoir of the Rev. David Brown.)

రుచిని గూర్చి వ్రాసెను[21]. తన సంతానమునకు తానే ఆచార్యుడై, వారికి విద్య నేర్పెను. భారతీయ భాషలను నేర్చుకొని తిరవకేమను [illegible] పంపుటచే, తన సంతానము చేత, ఆ భాషలను చదివించెను[22]. తనకు స్వయముగా వివిధ విషయములపై అభిమానముండుటచే, తన సంతానమునకు అట్టి అభిరుచి కలుగుటకు పాటుబడెను. ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్, తండ్రి ఆశయముల నెరవేర్చెను.

క్రైస్తవమత ప్రచారము బాగుగా చేయగలుగుటకు, హిందూమతమును గూర్చి సవిస్తరముగ తెలిసికొనుట ఆవశ్యకమనియు, ఇందులకు సంస్కృత భాషా జ్ఞానము తప్పనిదనియు రివరెండ్ బ్రౌన్ గ్రహించి, ఆ భాషను నేర్చుకొనుట ప్రారంభించెను[23]. ఇది గాక, భారతీయ భాషలలోనికి బైబిలును అనువాదము చేయుటకు వీలగునట్లు, వివిధ భారతీయ భాషల పదజాలము నొక కోశముగ సిద్ధముచేసెను. ఇందు గ్రీక్, లాటిన్ భాషలలోని పదజాలమును కలదు. విశేషించి

---

21. "My second boy has read with understanding the Paradise Lost, Dryden's Aeneid, and is now reading Cowper's Homer ......" (Memorial Sketches of the Rev. David Brown— London, 1816. Page—89.)

22. "It was Mr. Brown's desire to give that bent to his children's minds, and to put them in that track, which would probably lead to their pursuing through life the line he deemed preeminently useful in a Country like Bengal... he intended they should be well grounded in the languages" (Ibidem; Page-90.)

23. "It is twelve months since I entered upon the determination of studying Sanscrit......I, the more willingly enter on this subject as you are about a necessary and important work, which makes you wish your inquiries had been directed, like those of mine,to collect materials for a thorough display of Hindooism." (Extracts from Rev. David Brown's Correspondence, 1792.)

ఇందు, భారతీయ భాషలలోని పదజాలముతో బాటు మిగిలినకొన్ని ప్రాచ్యభాషల లోని పదజాలమును కలదు[24].

రివరెండ్ డేవిడ్ బ్రౌన్‌నకు భాషలయందేగాక, సామాన్య సాహిత్య, విజ్ఞానము లందును ఆసక్తి ఎక్కువ. చాల ధనమును వెచ్చించి సాహిత్య గ్రంథములను సంపాదించి, తన ఇంటనే ఒక గ్రంథాలయమును స్థాపించెను[25].

రివరెండ్ డేవిడ్ బ్రౌన్, కలకత్తాకు పదునైదు మైళ్ళ దూరమున సొంత ఇంటిలో నివసించెడివాడు[26]. ఇది గవర్నర్ - జనరల్ యొక్క పార్కునకు ఎదురుగా. హుగ్లీ నదికి పశ్చిమతీరమున నుండెను. ఈ ఇంటి పేరు 'ఆల్డీన్' (Aldeen). బాప్టిస్ట్ (**Baptist**) మిషనరీలయిన 'కరే' (**Carey**) మొదలైనవారు కృషి చేయుచున్న శ్రీరామపురమునకిది సమీపమున కలదు. ఈ ఇంటిని ఆనుకొనిఉన్న తోటలో, ఒక పాడుపడిన దేవాలయముండగా. దానిని బాగు చేయించి; రివరెండ్ బ్రౌన్ అచ్చట ఒక అతిథి గృహమును నిర్మించెను. క్రైస్తవ మత ప్రచారమునకై వచ్చిన అతని మిత్రులు; వారివారి నిర్ణీత స్థలములకు పోవువరకు అతని అతిథులుగ

---

24. "It was Mr. Brown's opinion, that the Asiatic languages demanded and deserved revival...In the original scripture tongues, as also in some degree in Arabic, Mr. Brown prepared and arranged grammatical helps for his children : and, with a view to facilitate Bible translations, he commenced a polyglot vocabulary of several Eastern languages, together with Greek and Latin." (Christian Biography; Page-56.)

25. "He had a strong turn for general, literary and scientific pursuits; and had looked into most subjects of knowledge." (Ibidem; Page-57.)

"His love of literature always was the chief source of his personal expense; for he possessed at no small cost, an extensive collection of valuable books..." (Ibidem; Page—57.)

26. "...induced him some years before to remove his domestic abode to a short distance from Calcutta, on the bank of the river, where he purchased a small property." (Memorial Sketches; London, 1816. Page-62.)

ఇటనే ఉండెడివారు. రివరెండ్ హెన్రీ మార్టిన్ ఇక్కడ మొట్టమొదటిలో ఐదు నెలలుండెను[37]! ఈయన మిలిటరీ ఛాప్లిన్‌గా కలకత్తా వచ్చెను. కొంత కాలము శ్రీరామపురములో కూడ పనిచేసెను. ఫార్సీ, హిందూస్థానీ భాషల లోనికి క్రొత్త నిబంధన గ్రంథమును, ప్రార్థనలను అనువదించెను.

ఆతిథ్యము విషయముకగాని, కావలసిన వారికి సాయము చేయు విషయములో గాని, రివరెండ్ బ్రౌన్ ముందు వెనుకలుగాని, తన సాయమపేక్షించినవారి జాతిమతములు గాని వివక్షించెడి వాడు కాడు. క్రైస్తవ మతమునకు సంబంధించిన

---

27. "...the venerable David Brown remained to welcome the young priest (Rev. Henry Martyn), to be a father and a friend to him; to provide him with a home, and to sustain him in all his trials. Mr. Brown resided some fifteen miles from Calcutta, at a place on the opposite bank of the river, named Aldeen, not far from the settlement of Serampore, where the Baptist missionaries Carey, Marshman, and Ward lived and laboured. In the grounds attached to this Aldeen house was a deserted idol-temple, upon the margin of the river, the picturesque aspect of which, as it stands out a broad mass of purple shadow against the setting sun, has been noted by thousands of Englishmen...This pagoda had been fitted up as a dwelling-place-one of those convenient guest-houses, which in the old days of Indian hospitality, English residents delighted to have in their gardens for the reception of their friends." (Lives of Indian Officers by Sir J.W. Kaye; London, 1904. Pages, 503-504.)

వివిధ శాఖలకు[28] చెందిన వారికి, పరస్పరము వాగ్వాదములు జరుగుచున్న రోజులలో కూడ, అతడు తన "శాఖ" కు చెందని వారి కెందరికో ధన సాహాయ్యమును కూడ చేసిన ఉదారుడు. ఈ వాగ్వాదములలో ప్రత్యక్షముగ పాల్గొనుట కిష్టములేని రివరెండ్ బ్రౌన్ కూడ ఇందులోని కీడ్వబడినాడు. క్రైస్తవ మత సిద్ధాంతములను పురస్కరించుకొని బయలుదేరిన ఈ వివాదములోని ఒక పక్షమువారు, రివరెండ్ డేవిడ్ బ్రౌన్, మతోద్యోగమును చేయుట కర్హతలేని వాడని వాదించు వరకు

---

28. క్రైస్తవ మతములోని వివిధ శాఖలు (Denominations)

"There are three main branches of Christianity: Roman Catholicism, Protestantism, and Eastern Orthodoxy. Eastern Orthodoxy includes some twenty independent ("autocephaious," each-with-its-own-head) Churches, each of which draws its members mostly from one nation (the Churches of Greece, Russia, Serbia, Rumania, Bulgaria, etc.). They are closely related through a common tradition and liturgy".

"The first major division within Christendom came not between Roman Catholicism and Protestantism, but between the Eastern and Western Catholic Churches in the eleventh century. The separation of Protestants from Western Catholicism came five centuries later".

"In the earlier Christian centuries, a number of groups separated from the main body of Christendom (the Coptic, Syrian, Armenian and others) and have continued as independent Christian bodies to this day".

(Religions of America : What is a Protestant ? by Henry P. Van Dusen; Page-118.)

మెథడిస్ట్ (Methodist); లూథరన్ (Lutheran); క్వేకర్ (Quaker); మార్మన్ (Mormon); క్రిస్టియన్ సైంటిస్ట్ (Christian Scientist); సెవెన్త్ డే యేడ్వెంటిస్ట్ (Seventh-day Adventist; ప్రెస్బిటేరియన్ (Presbyterian); చర్చ్ ఆఫ్ ఇంగ్లండ్ (The Church of England); బాప్టిస్ట్ (Baptist) మొదలుగాగల చాల ఉపశాఖలు స్థూలముగా పై మూడింటిలో అంతర్భాగములుగ గలవు.

వచ్చినది[29]. అతనిని తొలగింప యత్నించిరి. తన ఉద్యోగమును తానే మానుకొని పోయినచో, తాము ఏమియు చేయక ఊరకుందుమని అతనికి జాబు మూలమున తెలియపర్చిరి. రివరెండ్ బ్రౌన్, విషయమంతటిని లార్డ్ వెల్లస్లీ (Lord Wellesley) ముందుంచగా అతడు సానుకూలతను ప్రకటించుచు, జవాబు పంపించుచు, తన కన్ని విషయములును తెలియుననియు, అట్టి వానిని ఉపేక్షించుట చాలునని మతోద్యోగియైన బ్రౌన్ తలంచినందుల కాతని నభినందించెను[30].

ఇట్లు, ఇతర శాఖలకు చెందిన క్రైస్తవులు తనను బాధించుచున్నను, రివరెండ్ డేవిడ్ బ్రౌన్ గొప్ప ఓర్పుతో అన్నింటిని సహించి, తనకు సత్యమని తోచిన మార్గమును బట్టి పనిచేసికొని పోవుచుండెడివాడు. సోదర మానవునిపై గల కారుణ్యముచే; అతడేమతమునకు, జాతికి, శాఖకు చెందినను; తన సాయము కావలసిన వారికందరికిని, రివరెండ్ బ్రౌన్ సాహాయ్యము చేసెడివాడు. తన

---

29. "But all this increased the bitterness of the majority, and so worsted in their argumentative strife, they endeavoured to get rid atleast of one of their opponents by denying his (Brown's) clerical authority, and threatening to prosecute him for the performance of ecclesiastical duties to which he had not been ordained. Mr. Brown was only a deacon of the English Church and his enemies affected to believe that he had not received episcopal ordination at all. One of their number, therefore wrote to him demanding a sight of his 'letters of orders', and another told him that 'a process of law was about to be commenced against him, which, in the first instance, would subject him to legal penalties, and ultimately to degradation and concluded by assuring him that if he would but immediately resign he was authorized to say that the business would be dropped." (Lives of Indian officers by Sir J. W. Kaye; London, 1904, Pages-500, 501.)

30. "Mr. Brown laid the matter at once before Lord Wellesley, who sent, through his private secretary, a kind and encouraging letter to the faithful minister and commended his determination to treat such threats with contemptuous silence." (Ibidem; Page-501.)

ఇంటియందు నెలల కొలది అతిథుల నుంచుకొని, వారికి సాయము చేసెడివాడు[81]. కబ్బు కావలసి వచ్చిన వారికి, వడ్డీలేకుండ అప్పులిచ్చి వారిని ఆదుకొనెడివాడు[82]. రోమను కేథలిక్కులను, బాప్టిస్టులను సిద్ధాంత రీత్యా ఆతడు నిరసించినను, వ్యక్తులుగా వారిని ఆదరించి గౌరవించెడివాడు, సాయము చేసెడివాడు. ఇట్లే, జాతి భేదము నెంచక కొందరు తమిళ క్రైస్తవులకును ఆతడు సాయము చేసెను[83].

హిందూమతముపై ఆతనికి గౌరవము లేకున్నను - క్రైస్తవ మత ప్రచారమాతని ఆశయము, ఆతని పని - జన బాహుళ్యములో నున్న ఆచార వ్యవహారములకును, విజ్ఞుల ఆచరణలో నున్న మతమునకును చాల తారతమ్య మున్నదని

---

81. "...although his own family was nine or ten in number, he received, at separate times, from six to ten individuals at once...not ss cursory visitors, but for weeks and months together..." (Memoir of the Rev. David Brown.)

82. To other friends, to whom temporary assistance was a benefit...he lent money free of interest..." (Ibidem)

83. "He subsisted for some time a Portuguese minister, since dead, for a congregation of that people at the mission church, by paying him a yearly salary". (Ibidem)

"His benevolence was not confined to those of his own tenets. He extended generous aid to a large amount, to the missionaries of Serampore, for forwarding their public undertakings. Still less did his sympathy owe its intense activity to being circumscribed by the lines of clan or Country of his exhortations in the cause of universal charity from the pulpit, one conduced to establish a fund for the relief of all the indigent, whether Europeans or natives; and one dispensed benefits to the Tamil Christians" (Ibidem)

గ్రహించి హిందూమత ధర్మములను జాగరూకతతో పరిశీలింపవలెనని, అతడు తలంచెను[34]. ఆ మతమును సులభముగా తేలికచేసి పలుకరాదనెను.

అది గాక, బైబిలును ఆసియా దేశస్థులు అర్థము చేసికొనుట విషయమున రివరెండ్ డేవిడ్ బ్రౌన్ కు కొన్ని నిశ్చితాభిప్రాయములున్నట్లు, అతని వ్రాతల వలన మనకు తెలియును. ఆసియా దేశములోని ఆచారవ్యవహారములు, పాశ్చాత్య దేశములలోని వానియంత వేగముగ మారలేదు గనుక, బైబిలులో చెప్పబడిన కొన్ని విషయములు, వర్ణింపబడిన ఆచార వ్యవహారాదులు, ఆసియావాసులు సులభముగా అర్థము చేసికొనగలరని అతడు తలంచెను[35].

ఆసియా దేశస్థులు మంచి విద్వాంసులనియు, సునిశితమైన బుద్ధి కలవారనియు భావించిన డేవిడ్ బ్రౌన్; వారు బైబిలును, సామాన్య పాశ్చాత్య దేశస్థుని కంటె బాగుగా, వేగముగా గ్రహింపగలరనియు, ఇందులకు కారణము; బైబిలులోని కథలు, రూపకాదులు, ఆసియా వాసులకు సన్నిహితములై నవగుటయే యనియు కూడ తలంచెను[36].

---

34. "The system is extremely complex, and it is therefore very easy to misrepresent it.... There is, clearly, a total difference between the religion of the learned and that of the common people...All the educated and instructed that I have had the opportunity of seeing, assent to the unity of God, and they possess all the light of natural Religion..." (Extracts from Rev. David Brown's correspondence-1792 )

35. "The customs of Asia appear in many respects unchanged, to this day, from what they were in the days of Moses and the Prophets, of Christ and his Apostles. Therefore the European, who diligently searches the Scriptures in Asia, does, with the blessing of God on his devout purpose, study his bible with increased delight and advantages for understanding it, amidst the colloquial peculiarities and familiar practices of those countries". (Memorial Sketches: London-1816; Page-85.)

36. "Asiatics are very apt scholars in acquiring an accurate insight into the signification of the Bible... t is highly probable that the allusions and metaphors contained in the sacred volume, will frequently eonvey a force to a pious Asiatic reader which our translations have never yet adequately imparted to the plain English reader". (Ibidem. Page-84.)

రివరెండ్ డేవిడ్ బ్రౌన్ ఇంతలో ఆగక - బైబిలునకు విశిష్టమైన వ్యాఖ్యానము, ఒకహిందువుడు పాశ్చాత్యులకు ఇచ్చు దినముకూడ రావచ్చునని వ్రాసెను[37]! ప్రాచ్యదేశస్థుల సంప్రదాయ విజ్ఞానమునకు సన్నిహితమైన భావనాసామగ్రి బైబిలులో నుండుటయే ఇందుకు కారణమని అతని ఊహ. బైబిలు కథలలోని భావచిత్రములు కొన్ని పాశ్చాత్యులకు అర్థము కాని నాడు, ప్రాచ్యదేశస్థుడొకడు; వానితో సాజాత్యముగల ఉపమానాదులను చూపి, వానిని చక్కగా వ్యాఖ్యానింపగలడని అతని భావము[38]. ఇందుచేతనే రివరెండ్ డేవిడ్ బ్రౌన్, పదేపదే, ఆసియా దేశపు భాషలను పాశ్చాత్యులు నేరుకొనుట ఆవశ్యకమని నొక్కి చెప్పెను[39]. తన సంతానమునకు తానవి వచ్చునట్లు చేయు - జీవించినంత కాలము - ప్రయత్నించెను. తండ్రి భాషాతృష్ణను గ్రహించి కొడుకు ఆ దాహమును తీర్చగలుగుట ముదావహము. తండ్రి తానే పుత్రునిగా పుట్టునని గదా ఆర్యోక్తి! తండ్రి ఆశయములు, కుమారునిలో ఫలవంతములయ్యెను.

రివరెండ్ డేవిడ్ బ్రౌన్, ఇరువది ఐదు సంవత్సరముల కంటె కొంచెమెక్కువగనే, కలకత్తాలో ఉండి మతప్రచారము చేయుటయే గాక; ప్రాచ్యభాషా సంస్కృతులను పాశ్చాత్యులకు వ్యాఖ్యానించి చూపుచువచ్చెను. క్రైస్తవ మిషనరీలకు సర్వశక్తులనువయోగించి సాయముచేసెను. కలకత్తాలో 'బైబిలు సొసైటీ'ని స్థాపించెను. ఇట్లు రేయింబవళ్ళు పనిచేయుటచే, అతనికి శరీర పటుత్వము తగ్గి దేహములో రుగ్ణత ప్రవేశించెను. జ్వరము తరచుగా వచ్చుచుండుటచేత అతని బలము తగ్గిపోజొచ్చెను[40].

---

37. **"The day may even come when a Hindoo shall give us a more perfect explanation of our Bible than we can give to them". (Ibidem; Page-84.)**
38. **"Should, for instance, the imagery of a parable not be clear, it is highly probable an intelligent Asiatic could quickly illustrate it, by parallel narrations, or descriptions drawn from his own knowledge of the habits of his country-men" (Ibidem; Page-86.)**
39. **"But continue at your post, and attain some of the languages perfectly; and you will in due time be found of importance there". (Ibidem; Page-91.)**
40. **"...he had become subject to severe attacks of fever." (Memoir of Rev. David Brown.)**

ఇట్టి పరిస్థితులలో ఆరోగ్యమును కోలుకొనుటకు సముద్రపు గాలి మంచిదని వైద్యులు చెప్పుటచే, ఎట్టకేలకు తన పనిని విడిచి విశ్రాంతి తీసికొన నెంచెను. ఇందులకై అతడు, కలకత్తానుండి బంగాళా ఖాతము ద్వారా మదరాసు పోవు ఓడ మీద ఎక్కెను. సముద్రపు గాలికి అతని ఆరోగ్యము కొంత బాగుపడెను. కాని, ఓడ మదరాసు చేరు లోపలనే, తుఫానులో చిక్కుకొనుటచే, బాగుగా దెబ్బతిని మునిగిపోవు వరకు వచ్చెను. ప్రయాణికులు, నావికులు - ఇంకొక ఓడ వారిచే రక్షింపబడిరి. అసలే, జ్వరముతో బాధపడుచున్న రివరెండ్ డేవిడ్ బ్రౌన్, మరల కలకత్తాకు కొనిపోబడెను. అట, ఈ స్వార్థరహితుడైన వ్యక్తి, 1812 లో జూన్ 14వ తేదిని చనిపోయెను[41].

రివరెండ్ డేవిడ్ బ్రౌన్ మృతి, అతని మిత్రబృందమునే గాక, క్రైస్తవ ప్రపంచము నంతటిని దుఃఖసముద్రమున ముంచినది. పాండితీగరిమచేత, సత్ప్రవర్తనముచేత, సౌజన్యముచేత అతడు అందరి మన్ననలను పొందుటయే ఇందులకు కారణము. అతని మృతిని గూర్చి "మిషనరీ సొసైటీ ట్రాన్సేక్షన్స" (**Missionary Society Transactions**)[42] ఇట్లు వ్రాసెను.

June 23rd, 1812. **This day brings us the sad tidings of** the death of the Rev. Mr. Brown, **of Calcutta. Distressing** intelligence! The Church has lost **a zealous and valuable** Minister, the Bible Society **a streauous and firm supporter, and we, an** excellent Counsellor **and friend. We may well** regret the removal of one, **who, with his influence and excellent** advice, was ever ready **to assist us and our departed brethern."**

పై వాక్యములు రివరెండ్ బ్రౌన్ యొక్క వ్యక్తిత్వమును మన కన్నుల ఎదుట

---

41. "Brown's health failing in 1812, he embarked, for the benefit of sea air, in a vessel bound for Madras, which was wrecked on the voyage down the Bay of Bengal. The Passengers and crew were rescued by another vessel and taken back to Calcutta. Where Brown died on 14 June 1812". (The Dictionary of National Biography-Vol. III; 1921-1922.)

42. "No. 26 of the Transactions of the Missionary Society,".

పెట్టుచున్నవి. ఆతనిని అందరును గౌరవించిరి ఈ గౌరవాభిమానములు, ప్రజలందరు రివరెండ్ బ్రౌన్ కటుంబముపై చూపిరి. ఆతడు చనిపోవు నాటికి, పిల్లలందరు చిన్నవారు. కుటుంబము పెద్దది. డబ్బు తక్కువగా నుండెను. రివరెండ్ బ్రౌన్, తాను నిర్వహించిన ఉద్యోగముల వలన - ఆ రోజులలో ఛాప్లెన్ (**Chaplain**) నకు సాలుకు 10,000 రూ. జీతము[43] - తగినంత డబ్బు సంపాదించినను, అతిథి సత్కారాదుల వలన, ఆ ధనము చాల వరకు ఖర్చు ఆయ్యెడిది. కనుక, అతని మృతి తరువాత కుటుంబము ఇంగ్లండునకు పోవుటకు తదితరములైన ఖర్చులకు, కొంత ధనము కావలసివచ్చెను. మిత్రులు సాయపడిరి. తరువాత రివరెండ్ బ్రౌన్ యొక్క రచనలు. అతని జీవిత చరిత్ర ; అచ్చువేసి, చందాదారులకు ఇచ్చినచో ధనలాభము కలుగునని, అతని మిత్రుడైన రివరెండ్ ఛార్లెస్ సిమియన్ (**Rev. Charles Simeon, M A., Late Senior Fellow of King's College and Minister of Trinity Church, Cambridge**) తలంచెను.

ఈ తలంపున కనుగుణముగా, పుస్తకమును సిద్ధము చేయుపని రివరెండ్ సిమియన్ పై బడినది. ఆతడు, రివరెండ్ బ్రౌన్ యొక్క, మతోపన్యాసముల నుండి కొన్ని ఎన్ని; పుస్తకములో రివరెండ్ బ్రౌన్ యొక్క జీవిత చరిత్ర అతని భార్యచేతనే వ్రాయించి[44], పుస్తకమునకు పీఠిక తానే వ్రాసి, "మెమోరియల్

---

43. "The salaries of the chaplains were at Fort William and the military stations Rs. 10,000 per annum..." (The Good old days of Honorable John Company by W.H. Carey; Simla, 1882. Page-123.)

44. "Feeling this, the Editor thought it better, that the widow of Mr. Brown should draw up a Memoir of her departed husband..." (Memorial Sketches of the Rev. David Brown; London-1816., Preface by Rev. Charles Simeon, King's College, Cambridge. Sep. 16, 1816., Page-XI.)

స్కెచెస్" (**Memorial Sketches**) అను పేర 1816 లో అచ్చువేయించెను[45]. ఈ పుస్తకమునకు సంపాదకుడును అతడే. డబ్బును చందాగా ఇచ్చినవారికి ఒక్కొక్క కాపీ ఇచ్చిరి. ఇట్లు 198 కాపీలు పంచిరి. ఇందువలన వసూలయిన డబ్బు 19,800 సిక్కా రూపాయీలు. చందాదారుల పేరులు వారిచ్చిన డబ్బు, పుస్తకములో మొట్టమొదట అచ్చువేసిరి. 198 మంది వలన 19.800 సిక్కా రూపాయీలు వచ్చినవన్నచో, రివరెండ్ బ్రౌన్ ఎడల సమకాలికులకు ఎంత గౌరవాభిమానములు కలవో తెలియును. "మెమోరియల్ స్కెచెస్" (**Memorial Sketches**), రివరెండ్ డేవిడ్ బ్రౌన్ పేరనే వెలయించిరి. అందొక పుటలో ; అతని కృషి నంతటిని, జీవితమును ఇట్లు నిరూపించిరి.

**These Pages Are**
**Inscribed.**
**In Tribute To The Memory of the Reverend**
**David Brown**
**Who was ten years the senior Chaplain of the**
**East India Company, And**
**Provost of the College of Fort William :**
**He also held in Trust**
**The ministry of the Mission Church,**
**One - And - Twenty Years,**
**And was Secretary to the British And foreign**
**Bible Societies at Calcutta ;**

---

45. పుస్తకము యొక్క ముఖపత్ర మిది—

**Memorial Sketches**
**of the**
**Rev. David Brown**
**with a selection of his**
**Sermons,**
**Preached at Calcutta.**
**London**
1816

**Both which offices he alike zealously and**

**Gratuitously discharged,**

**And was, in all his pursuits,**

**The Faithful Minister of Christ**

**He lived Revered, and died lamented,.**

**O. B. XIV June 1812, At. XLIX AN**

ఇంతటి ఫలవంతమైన జీవితము రివరెండ్ డేవిడ్ బ్రౌన్ జీవితము.

ఆతని ఆప్తమిత్రులైన - బుకనన్, మార్టిన్, థోమాసన్ మొదలైన వారి స్మృతి గ్రంథములలో; రివరెండ్ డేవిడ్ బ్రౌన్ జీవితము యొక్క ముఖ్య ఘట్టముల పరిగణనము, ప్రశంస కలవు. ఆతని ఆతిథ్యమును రుచిచూచిన ఒక సైనికోద్యోగి, ఆతనిపై కొన్ని పద్యములను రచించెను. ఇవి "మెమోరియల్ స్కెచెస్" లోను, తరువాత "ఏషియాటిక్ జర్నల్" లోను ప్రచురింపబడెను[46]. వీనిలోనుండి చివరి రెంటింటిని ఉదాహరించు చున్నాను :

**"Farewell ! Whose pleasing manners gave**
**This land the charms of Britain's Isle ;**
**Whose faith, triumphant O'er the grave,**
**Beheld its terrors with a smile."**

**"May we the lesson taught receive,**
**Whilst angels greet thee to the sky ;**
**In sacred pleasures here to live,**
**With Conscience whispering peace." - to die.**

**Camp, 1812.** **G. V.**

---

46. **Elegiac Stanzas To the memory of the late Reverend David Brown (Written in India by a young friend in the military service) - The Asiatic Journal ; London. 1819. Vol VIII Page - 82.**

ఈ పద్యములు వ్రాసిన సైనికోద్యోగి, చాలసార్లు రివరెండ్ బ్రౌన్ ఇంటి (**Aldeen**) లో, ఆతిథ్యమును స్వీకరించి యుండుటను కూడ ఈ "రచన" లో పేర్కొనెను[47].

రివరెండ్ డేవిడ్ బ్రౌన్ చివరి గడియలు చాల ప్రశాంతముగ గడచినవి. కుటుంబముచే, మిత్రులచే పరివేష్టింపబడి ఆతడు భగవంతుని స్మరించుచు ప్రాణములను విడిచెను. ఆతడు చనిపోవుటకు ముందు, మిత్రులు - ఆతని గోరి యొక్క శిలా లేఖనమును గూర్చి అడుగగా ; ఆతడు వినయముతో ; "కలకత్తా మిషన్ చర్చిలో ఇరువది యైదు సంవత్సరములు పేదవారికి పరిశుద్ధ గ్రంథమును ఈతడు బోధించెను" అని చెక్కింపుడని పలికెను[48]. ఈ తుది వాక్యములు యావజ్జీవమును ఆతడు క్రైస్తవ మతము కొరకు చేసిన కృషిని మనకు తెలుపును[49].

రివరెండ్ డేవిడ్ బ్రౌన్ ఏ ఆశయములను మనస్సులో నుంచుకొని మన దేశమునకు వచ్చెనో, ఆ ఆశయసిద్ధికై తుదివరకు పాటుబడెను. తండ్రి దృష్టిలో విజ్ఞాన సముపార్జనము - మత ప్రచారమునకు, కుమారుడైన చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ దృష్టిలో విజ్ఞాన సముపార్జనము యొక్క పరమావధి, అదియే. వేరేదియు కాదు. కుమారునకు క్రైస్తవ మతమందు తండ్రికున్నంతటి అభినివేశమున్నను, ఈ దృష్టిభేదము - కుమారుని భాషా సేవకునిగను, తండ్రిని మత ప్రచారకునిగను చేసెను.

---

47. "I've shelter'd in the happy bow'rs,
Where (strangers to this boist'rous land)
Domestic pleasures Charm'd the hours' (Ibidem)

48. "...he desired it to be recorded, that in the Mission Church of Calcutta, for twenty - five years, he preached the Gospel to the poor". (Memoir of the Rev. David Brown)

49. "With the Society for Promoting Christian Knowledge, he nearly began his career of minisiterial labor, with the British and Foreign Bible Society, he closed it.
(Memorial Sketches., London - 1816 ; Page - 60)

# ప్రారంభ దశ - ఉద్యోగ జీవితము - విశ్రాంతి

తన జీవితకాల మంతయు భారతీయ భాషల కొరకు - ముఖ్యముగా తెలుగు కొరకు[1] - కృషిచేసిన 'తూర్పు ఇండియా కంపెనీ' (**The East India company-English**) ఉద్యోగి, ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ (**Charles Philip Brown**) కలకత్తా నగరములో. డేవిడ్ బ్రౌన్ దంపతులకు, 1798లో నవంబరు 10వ తేదీని, పుట్టెను. 'బాప్టిజమ్' (**Baptism**) డిసెంబరు 2వ తేదీని జంగెను. అతడు పుట్టునప్పటికి, రివరెండ్ డేవిడ్ బ్రౌన్ నాటి పాశ్చాత్య సమాజమున, ఉత్తమ క్రైస్తవునిగ, సత్పురుషునిగ పేరుపొంది యుండెను. అందుచే ఆతనికి సమాజమున గౌరవ స్థానముండెను. తండ్రి, ఇట్టి పరిస్థితులలో నుండగా పుట్టిన బ్రౌను దొర చిన్ననాటి నుండియు, ప్రతిభ వికసించుటకు అనువైన వాతావరణమున పెరిగెను. తండ్రి చనిపోయిన తరువాత భారతదేశమును విడిచి ఇంగ్లండునకుపోవుట వలన బ్రౌన్ దొర జీవితములో మార్పు కలిగెను. కాని అతడు మరల 1817లో కంపెనీ ఉద్యోగిగా భారతదేశమునకు (మదరాసునకు)వచ్చుటతో అతడు "స్వదేశము"నకు తిరిగి వచ్చినట్లయ్యెను.[1]

---

1. **"Distinguished by his attainments in nearly every other language of India, whether vernacular or classical. Mr. Brown particularly attached himself to the study of Telugu. The best years of his official life were passed in those districts where that dialect is current. He was the first who applied himself to a thorough examination of its literature and if others shall here after be enabled to follow his example, it will only by the light of those aids which he has left for their guidance" (A catalogue Raisonnee of Orient Manuscripts in the Library of the (Late) College, Fort St. George, 1857. Preface-D.F. Carmichael. Secretary; 23rd, March, 1858.)**

ఇంగ్లండులో ఉన్న కాలమందే (1812-1817) బ్రౌను దొరను కంపెనీ వారు, మదరాసు సివిల్ సర్వీస్‌లో ఉద్యోగిగా నియమించి, దానికి తగిన చదువును నేర్చుకొనుటకు 'హెయిలీబరీ' (Haileybury) లోని కళాశాలకు పంపిరి. ఆ రోజులలో, గౌరవ కుటుంబములకు చెందిన బాలురను, కంపెనీ వారిల్లే చిన్న వయస్సునందే ఉద్యోగమును నిర్ణయించి, కళాశాలలో శిక్షణ ఇప్పించి, భారత దేశమునకు పంపెడివారు. అట్లు వచ్చినవారు. మదరాసు కళాశాలలోగాని, కలకత్తా కళాశాలలోగాని చేరి; భారతీయ భాషలను ఉద్యోగ సంబంధమైన పనులను నేర్చుకొని, తరువాత ముందే నియమింపబడినట్లుగా ఆయా శాఖలలో ఉద్యోగులుగా చేరెడివారు. ఈ ఉద్యోగములకు వచ్చిన వారిలో, చాల మంది సిఫార్సులచే వచ్చిన అభ్యర్థులున్నను, వంశపారంపర్యముగా కంపెనీ ఉద్యోగములు చేయుచు వచ్చిన కుటుంబములకు చెందిన అభ్యర్థులును ఉండిరి[3]. అట్టివారిలో బ్రౌను దొర ఒకడని, మనకు తెలియుచున్నది.

---

2. ఈ ఉద్యోగములకై, ఆ రోజులలో-ఆశ్రయింపులు, బంధుత్వములు, లంచములు మొదలు గాగల సర్వయు సాధనములే. ఈవిషయమును గూర్చి **Lives of Indian Officers** అను పుస్తకములో Sir J. W. Kaye, ఇట్లు వ్రాసెను. **"From all the high places at home-from the Kings Court, from the Council-chamber of the King's Ministers, from the Houses of Parliament, from the lobbies of the India House-solicitation on behalf of all sorts of people kept streaming into Calcutta. (Lord Cornwallis, Page-97.)**

ఇండియాలో గవర్నర్-జనరల్‌గా ఉన్న లార్డ్ కారన్ వాలీస్ తనమిత్రుడైన లార్డ్ సిడ్నీ (**Lord Sydney**) కి వ్రాసిన లేఖలోని ఈ క్రింది భాగము; కంపెనీ ఉద్యోగములకై సిఫార్సులు "ఇంగ్లండు రాణినుండి దిగువ ఉద్యోగుల వరకు", పంపుట కలదని తెలుపుచున్నది.

**Lord Ailesbury (Queen's Chamberlain) has greatly distressed me by sending out a Mr. Ritso, recommended by the Queen ......" (Page-98)**

ఆ వచ్చెడి వారెంతటి అవస్థలలో, లేఖలోని ఈ క్రింది భాగము తెలుపును. **"I am still persecuted everyday by people coming out with letters to me, who either get into jail or starve in the foreign settlements". Page-98 (Lives of Indian Officers. London, 1904. New Edition)**

3. **"......the services of the East India Company were to a great extent, hereditary services....we only discovered the good of this after we had lost it...." (Ibidem; Preface.)**

ఇంగ్లండులోని కళాశాలలో బ్రౌనుదొర పదునాల్గవఏట చేరి, కొంతకాలము మిగిలిన పాఠ్యవిషయములతోబాటు 'హిందూస్థానీ' ని కూడ చదివెను. పుస్తకము లన్నియు జాగరూకతతో సంపాదించినను, అక్కడ అతడు నేర్చుకొన్నది ఎక్కువ లేదు. ఇట్లు రెండు సంవత్సరములు గడిపిన తరువాత, నాటియువక సమాజములో చేరి కాలమును కులాసాగా వెళ్ళబుచ్చ మొదలిడెను. కాని, తరువాత కొంత కాలమునకు తన తప్పు తెలిసికొని, లాటిన్ కవులను చదువ మొదలిడి, అందు మంచి పాండిత్యమును సంపాదించెను. అప్పటి కింకను తెలుగు భాష పేరైనను, అతడు వినలేదట![4]

బ్రౌను దొర, ఇండియాలో ఉండగనే అతని తండ్రియైన రివరెండ్ డేవిడ్ బ్రౌన్, ఆతనికి విద్యా విషయకమైన మంచి శిక్షణము నిచ్చెను. పదునాల్గువ ఏట పితృవియోగము సంభవించు నాటికే బ్రౌనుదొర చాల భాషలలో ప్రావీణ్యమును పొందెను. తండ్రి ప్రోత్సాహమున, శిక్షణమున బ్రౌనుదొర చిన్న వయస్సునందే- హీబ్రూ, సిరియక్, అరబ్బీ, ఫార్సీ, గ్రీకు, లాటిను, హిందూస్థానీ మొదలైన భాషలలో కొంత కృషి చేసెను[5]. భాషా విషయకములైన ఈ పునాదులపై, ఆతని భవిష్యత్కృషి అంతయు నిలిచినదని మన మనవచ్చును. ఈ భాషల యందే గాక, ఇంగ్లీషు భాషా సాహిత్యము అందును, రివరెండ్ బ్రౌన్ తన కుమారునకు మంచి అభిరుచిని కల్పించెను బ్రౌనుదొర, తనతల్లి దండ్రులకు రెండవ కుమారుడు.

---

4. "In two years I left College and entered into very cheerful society; but considering that if I gained any scholarship it must be my own efforts, I then began a course of Latin reading, going steadily through Virgil, Horace Juvenal, Lucretius, Ovid, Plantus and some other volumes...I never had even heard of Telugu". (Some Account of the Literary Life of C. P. Brown. London, 1866.)

5. "He wished to give us a learned education: we were taught the elements (and little more) of Hebrew and Syriac, Arabic and Persian, Greek and Latin. We read through the Bagho Bahar, (a romance written in Hindustani) and had a good knowledge of the language: which indeed was spoken by the people around us. My father had given me a taste for English reading in my childhood". (Ibidem)

ఈతని సోదరు లిద్దరు, ఈతడు నియమింపబడినప్పుడే, వంగదేశములో సివిల్ సర్వీస్ నందు నియమింపబడిరి. భాషా దృష్టి ననుసరించి చూచినచో వారు సామాన్యులు. తమతమ ఉద్యోగ ధర్మములను, వారును సమర్థతతో నిర్వహించినట్లు, సమకాలికాధారముల వలన మనకు తెలియుచున్నను, అంతకంటె వారెక్కువగా సాధించిన దేమియు లేనట్లున్నది. బ్రౌనుదొర ప్రత్యేక ప్రతిభను, బాల్యముననే తండ్రి గుర్తించినట్లు నిదర్శనములు కలవు. మిగిలిన కుమారులనుగూర్చి ఏమియు తెలుపని, రివరెండ్ బ్రౌన్ తన రెండవ కుమారుని గూర్చి 1810 లో, ఒక లేఖలో తన మిత్రునకొకనికి ఇట్లు వ్రాసెను:

**"My second boy has read with understanding the Paradise Lost, Dryden's Aeneid, and is now reading Cowper's Homer. Milton delighted him. Dryden he thought dull, but Cowper is better[6]."**

ఈ జాబు తండ్రి వ్రాయునప్పటికి, బ్రౌనుదొర వయస్సు పండ్రెండు సంవత్సరములు; పూవు పుట్టగనే పరిమళము !

1811 నాటికి, బ్రౌనుదొర సర్ వాల్టర్ స్కాట్ రచనలను చదివి ఆనందించు చుండెను. మూర్, బైరన్ కవులు కూడా అతని దృష్టిని ఆకర్షించిరి. కాని, పదునారు సంవత్సరముల వయస్సు వచ్చువరకు, షేక్స్పియరు మాత్రము అతని కంట పడలేదు[7].

ఇట్లు తండ్రి ప్రోత్సాహమున, శిక్షణమున వివిధ భాషల, సాహిత్యముల విషయమున సహృదయతయు, అభిరుచియు బ్రౌను దొరకు చిన్ననాటనే కలిగెను. ఇదిగాక, అతని తండ్రి చిన్నతనము నుండియు, అతనిని తప్పొప్పుల పట్టికలు తయారుచేయుట యందు, కవుల రచనలలో పక్షపాతము లున్నచోటులందు

---

6. **Memorial Sketches of the Rev. David Brown. London, 1816. (Page-89.)**

7. **"In the next year (1811)...I rejoiced in Walter Scott's "Lay" and "Marmion", then newly published. Moore and Byron were equally favourites when I read their works... I was sixteen before I was acquainted with Prospero, Titamia, and Othello." (Some Account of the Literary Life of C.P. Brown)**

వాటిని పూరణ చేయుటయందు నియమించి, మంచి పరిశోధనకును కావలసిన ఓర్పు, నేర్పరితనము అలవర్చెను[8]. ఆతని భవిష్య జీవితము తెలిసిన మనకు, రివరెండ్ బ్రౌన్ తన కుమారున కిచ్చిన శిక్షణము యొక్క విలువ ఇంతింతన రానిదని తెలియును. బ్రౌనుదొర భారతభాషా సాహిత్యములకు ముఖ్యముగా, తెలుగునకు- చేసిన సేవకు పరోక్షముగా ఆతని తండ్రి రివరెండ్ డేవిడ్ బ్రౌన్, కారకుడు! ప్రేరకుడు! "మెమోరియల్ స్కెచెస్" (Memorial Sketches) లోని ఈ క్రింది వాక్యములు, రివరెండ్ బ్రౌన్ — భారత భాషల విషయమున తన కుమారులు ఎట్లు వ్యవహరింపవలెనని యూహించెనో తెలుపును-

**"It was Mr. Brown's desire to give that bent to his hildren's minds, and to put them in that track, which would probably lead to their pursuing through life the line he deemed pre-eminently useful in a country like Bengal...he intended they should be well grounded in the languages[9]".**

ఇట్టి దృష్టితో ఆతడు తనకుమారుల కిచ్చిన శిక్షణము, ఆతని రెండవ కుమారుని విషయమున ఫలించి, మనకు ఆంధ్రభాషాభిమాని బ్రౌనుదొర లభించెను!

కలకత్తాలో పుట్టిన బ్రౌను దొరకు చిన్ననాటినుండియు-బెంగాలీ, హిందుస్థానీ భాషలు సుపరిచితములు. తండ్రి శిక్షణమున, హీబ్రూ మొదలైన భాషలను ఇంగ్లండులో లాటిన్ మొదలైన భాషలను నేర్చుకొని, యువక సహజమైన ఉత్సాహమునకు తోడు, పాండిత్యమును తనకుతోడు కాగా, 1817లో ఏప్రిల్ 1వ తేదీని ఇంగ్లండునుండి బయలుదేరి, ఆగష్టు 4 వ తేదీని మదరాసు రేవులో తన పందొమ్మిదవ ఏట, కాలు పెట్టెను. అప్పటి కింకను. ఆతనికి "తెలుగు" అను భాష ఉన్నదని కూడ తెలియదను విషయమును మరల ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకొందము.

---

8. "From childhood I was taught to correct errata, and fill up deficient passages in books. The driest enquiries had the greatest charms for me." (Ibidem).

9. Memorial Sketches. London. 1816. (Page - 90)

1817 లో ఇంగ్లండు నుండి ఇండియాకు రాకపోకలను సాగించిన "ఓడల కాలసూచిక"[10] లను పరిశీలింపగా, బ్రౌనుదొర ప్రయాణమునకు సంబంధించిన ఈ వివరములు లభించినవి. అందుండి, బ్రౌను దొరకు సంబంధించినంతవరకు (అతని పేరు, ఓడపేరు, మిగిలిన కొందరు ప్రయాణికుల పేరులు మొదలైనవి) ఇట నిచ్చుచున్నాను:

**"Shipping Intelligence - Madras" "1817 - Aug. 3. — Arrived the Companys ships Carnatic, Capt. J. Blanchard, and William Pitt, Capt. Graham, the two last Indiamen of the season destined to Madras. They sailed from the downs on the 15th of April, touched at Madeira on the 26th. They spoke the ship D rah from Bengal, in lat. 37 Sout.1 and longitude 20 East. She had part of the 66th regt. on board destined for St. Helena. The following are lists of their passengers".**

**"Per Carnatic for Bengal - Mrs. A. Mackenzie" etc. "— For Madras — Mrs. M. Greenway, Miss E. and H. Harlewood, T. Greenway, Esq. T.W. Carrington. Esq. Capt. S. Green, Mr. P. Grant, *Mr. C P. Brown*, Mr. F. Skitten, Asst. Surg. Mr. J. Hoare, Mr. C. A. Thursby" "— For Bombay — Mr. T. Farrel."**

బ్రౌనుదొర ప్రయాణము చేసిన ఓడ, ఆగష్టు 3 వ తేదీని మద్రాసు రేవును చేరినది. ఆగష్టు 4 వ తేదీని ఓడ దిగి, ఐదు సంవత్సరముల తరువాత, బ్రౌను దొర మరల భారత భూభాగముపై అడుగుపెట్టెను. 1812 వ సంవత్సరమున, బాలునిగా భారతదేశమును విడిచి స్వదేశమునకు పోయిన బ్రౌనుదొర; 1817లో యువకునిగ అధికారపు హోదాతో స్వదేశమునుండి భారతదేశమున కాతడు తిరిగి వచ్చెను. నాటి పరిస్థితుల ననుసరించి, సివిలు ఉద్యోగములకు నియమితులైన వారు, మద్రాసుచేరిన వెంటనే "మద్రాసు కాలేజి"లో చేరి; ప్రాదేశిక భాషల నభ్యసించుటయు, తమ తమ ఉద్యోగములకు కావలసిన పనులను నేర్చుకొనుటయు

---

10. **The Asiatic Journal, London, 1818 (Feb) Page - 200.**
(సులభముగా గుర్తించుటకు, బ్రౌనుదొర పేరు క్రింద గీత గీసితిని).

చేయవలసి యుండెను. ఈ 'శిక్షణ' ముగిసిన తరువాత, కాలేజి బోర్డు వారు వీరిని పరీక్షించి; పరీక్షలో వీరి తరగతిని, తరగతిలో శ్రేణిని నిర్ణయించెడివారు. వీటి ననుసరించి, ఏ ప్రాంతమునకు ఏ ఉద్యోగమునకు వీరు తగుదురని తోచిన, ఆ విధ ముగా చేసెడివారు.

ఆగస్టు 4 వ తేదీని ఓడ దిగిన బ్రౌనుదొర, ఆగస్టు 18 వ తేదీని ఈ కాలేజీలో చేరెను. అక్కడ మొట్టమొదటిసారి, "తెలుగు" పేరు వినుట, చదువుట ప్రారంభించుట, జరిగినది. బ్రౌనుదొరకు తెలుగు అక్షరములను, మద్రాసు కాలేజీలో 1817 లో నేర్పినది-వెలగపూడి కోదండరామ పంతులు[11]. ఈతని యందు బ్రౌనుదొర అభిమానము కలవాడై, తరువాత పోలీసుశాఖలో "హెడ్ అమీన్"గా నియమింపజేసెను. ఈ పని తరువాత చాలరోజులకుగాని జరుగలేదు. కోదండ రామ పంతులు, బ్రౌనుదొరకు తెలుగు అక్షరములను నేర్పుచున్నప్పుడు, దొర తెలుగులో అంత పండితుడై, భాషాసేవ చేయునని తలంచి యుండడు! బ్రౌను దొరకు ముందు అతని తరువాత, ఎందరికి "పంతులు" తెలుగు అక్షరములు నేర్పియుండడు! బ్రౌనుదొర, కాలేజి పరీక్షకు పోయినప్పుడు (9-18 డిసెంబరు. 1818) అతనితో కలిసి ఇరువదిమంది దొరలు తెలుగు పరీక్షకు హాజరయిరి. ఇందులో ఎందరి పేరులు మనకు తెలియును?

ఇట్లు పరీక్షకు పోయినవారిలో, తెలుగులో బ్రౌనుదొరకు "సెకండుక్లాస్" మాత్రమే వచ్చినది. "ఫస్టుక్లాస్"ను అతనికంటె తెలుగులో ఎక్కువ మార్కులు వచ్చినవారును కూడకలరు! కాని, తెలుగులో పాండిత్యము సంపాదించి, దాని కొరకు జీవితాంతము కృషి చేసిన వ్యక్తి మాత్రము బ్రౌనుదొర ఒక్కడే!

నాడు బ్రౌనుదొరను మొట్టమొదట పరీక్షించిన బోర్డులో, సుప్రసిద్ధులైన- ఎఫ్. డబ్లియు. ఎల్లిస్ (F. W. Ellis), ఎ. డి. కాంబెల్ (A. D. Campbell) దొరలున్నారు. అప్పుడు మదరాసునకు గవర్నరుగా, హ్యూగ్ ఎలియట్

---

11. "This Bramin (Velagapudi Codanda Rama Pantulu) taught me the Telugu alphabet when I entered the Madras College in 1817: but it was long before I could provide for him in a police situation." (English Translation of the Telugu Reader by C.P. Brown, Madras, 1865. Second Edition; Page-55.)

(**Hugh Elliot**) దొర కలడు. ఈ పరీక్షలో, విద్యార్థుల యోగ్యతలను వారి భాషాపాండిత్యము ననుసరించియు, సామూహికముగ వివిధ విషయములలో వారు ప్రదర్శించిన ప్రతిభ ననుసరించియు, "క్లాసు" లను నిర్ణయించెడివారు. ఈ రెండవ నిర్ణయము ననుసరించి, బ్రౌను దొరకు "థర్డ్ క్లాస్" (**Third Class**) వచ్చినది! కాని, ఆ పరీక్ష మిగిలిన సంవత్సరములలో జరిగిన పరీక్షల కంటె సంతృప్తికరముగ నున్నదని, బోర్డువారిట్లు వ్రాసిరి:

**"Since the establishment of the college, we have never been more gratified than on the present occasion, by the result of a general examination.** For whether considered **as regards the high standard of proficiency attained,** the rapid progress **of the students,** the **attention generally shown to study or the laudable determination evinced to avoid pecuniary embarrassment, the result of our inquiries has proved of the most satisfactory nature"**[12].

ఆ రోజులలో క్రొత్తగా వచ్చిన జూనియర్ సివిల్ ఉద్యోగులు సాధారణముగా అప్పులలో ములిగియుండుటచే కాబోలు, ఆ విషయమునను, ఈ "బాచ్" (**Batch**) ఉద్యోగులు యోగ్యులని, బోర్డువారు వారి నభినందించుచు వ్రాసిరి! గవర్నరునకు పంపిన ఈ రిపోర్టు (20 డిసెంబరు, 1818) లో, ప్రతి విద్యార్థి యొక్క యోగ్యతలను కూలంకషముగ చర్చించి; బోర్డువారు అతనికి ఎక్కువ జీతము ఈయవచ్చునా? బహుమాన మీయవచ్చునా? మెడల్ ఈయవచ్చునా? మొదలైన వాటి విషయములలో నిర్ణయములు చేసిరి.

నాడు కాలేజిలో, సాధారణముగా-తెలుగు, తమిళము, హిందుస్థానీ, ఫార్సీ, మరాఠీ, సంస్కృత భాషలలో పరీక్షలు జరుగుచుండెడివి. సాధారణముగా, విద్యార్థులైన జూనియర్ సివిల్ ఉద్యోగులు రెండు, మూడు భాషలను నేర్చుకొనెడివారు. బ్రౌనుదొరతో బాటు, తెలుగు పరీక్షకు వెళ్ళిన వారిలో - పి. గ్రాంట్,

---

12. "Report of the Second General Examination for the year 1818, **of the Junior Civil Servants attached to the College at Fort** St. George-Dec. 20, 1818."

(**The Asiatic** Journal. London, July - Dec. 1819. **Page-166.**)

మారిస్, మెక్లీన్, స్టోన్ హౌస్, హార్లే మొదలైనవారు కలరు. వీరిలో కొందరు, బ్రౌను దొరకంటె ముందునుండి మన దేశములోనున్న వారున్నారు. ఈ విద్యార్థులలో; పి. గ్రాంట్[13], మారిస్[14] దొరలను బోర్డువారు విశేషముగ శ్లాఘించిరి. సి.పి. బ్రౌన్, డేవిసన్, క్లార్కు, గ్రహాం అనువారు కూడ, తెలుగు బాగుగనే చదివిరనియు; వీరికి నెలకు డెబ్బది ఐదు పెగోడాలు జీతములో పెంచవలెననియు, బోర్డువారు సిఫార్సు చేసిరి[15]. ఈ విధముగా, బ్రౌను దొర మన దేశమునకు వచ్చిన తరువాత, పదునారు నెలలలో, తెలుగులో చక్కని కృషిచేసి, బోర్డువారిచే మెప్పు పొందినాడు. కాని, అతని కప్పటికింకను తెలుగులో తోడివారిని మించగల శక్తి వచ్చినట్లు లేదు.

ఇట్లు, కొంత కాలము తెలుగు చదివిన తరువాత, బ్రౌను దొర ఉన్నతాధికారుల ఆదేశము ననుసరించి, మరాఠీ చదువవలసిన వాడయ్యెను[16]. నాడు తెలుగు నేర్చుకొనుటకు తగిన పుస్తకములు లేవు. అసంపూర్ణమైన వ్యాకరణ గ్రంథము, నిరుపయోగములైన రెండు అభ్యాసపుస్తకములు, ఆతనికి లభించినవి. పాశ్చాత్యులకు పనికివచ్చు వ్యాకరణముగాని, నిఘంటువుగాని లేదు. పాఠములు చెప్పెడి వారికి, ఇంగ్లీషు మాటాడుట వచ్చినను, వ్యాకరణ సంబంధమైన పరిజ్ఞానము

---

13. "....the knowledge...that...Mr. P. Grant has attained of Teloogoo, is superior to what has ever been acquired at the institution..." (Ibidem, Page - 166)

14. "We had very lately occasion to bring under the notice of government the great, and unprecedentedly rapid progress of Mr. Morris in the acquirement of the Teloogoo language..." (Ibidem, Page-167)

15. "Mr. Brown, Mr. Davison, Mr. Clarke and Mr. Graham passed such examinations in Teloogoo as evinced that each had been applying to study with assiduity and success. During the periods that they have respectively studied, their progress has been very satisfactory; and we therefore recommend that the increased allowance of pagodas 75 per mensem be granted to each of them." (Ibidem, Page - 168.)

16. "After I had acquired a little Telugu, I was desired to read Maratta."(Some Account of the Literary Life of C.P. Brown.)

తక్కువ యట[17] ; ఈ పరిస్థితులలో సామాన్యమైనవాడే ఐనచో బ్రౌను దొర, తెలుగు భాషకు ఒక నమస్కారముచేసి, సమకాలికులైన కొందరు తెల్లవారివలెనే, సంపాదించిన జ్ఞానముతోనే సంతృప్తిపడి, ధనార్జన చేయుచు కాలము గడిపి యుండెడివాడు కాని, బ్రౌను దొర సామాన్య వ్యక్తి కాడు. ఆరంభించిన కార్యమును పరిసమాప్తి పొందింపకుండ విడుచు స్వభావము కాదతనిది. కార్యదీక్ష, మేధాశక్తి రెండును కూడ గొప్పవే. తాను శ్రమపడి తెలుగు నేర్చుకొని, తన తరువాత ఆ భాష నేర్చుకొనగోరు వారికి, తన పుస్తకముల రూపమున మార్గము సుగమము చేసి, ఘంటాపథమును నిర్మించెను. భారతదేశములోని భాషలలో తెలుగు కష్టమైనదను 'అపోహ' తొలగించెను[18]. ఇందులకు కారణము, అతడు రచించిన పుస్తకములే. ఈ కృషి అంతయు తరువాత జరిగినది. ఇప్పుడు మనము పరిశీలించుచున్న ప్రారంభదశలో, ఆతనికి అన్నియు చిక్కులే. ఒక్కొక్కప్పుడు; ఈ దేశమును, భాషలను, ఉద్యోగమును - అన్నింటిని - విడిచి స్వదేశమునకు పోవలెనను వాంఛ కూడ ఆతనికి కలుగుచుండెడిది[19].

ఇట్టి పరిస్థితులలో, మన దేశములో ఆతని ప్రారంభదశలో, సర్ థామస్ మన్రో (Sir Thomas Munro; 1761-1827) మద్రాసునకు గవర్నరుగా (1820-1827) వచ్చెను. మన దేశమున, అధికారమును నిర్వహించిన కంపెనీ ఉద్యోగులలో, పాలితులైన ప్రజలయొక్క యోగక్షేమములను విచారించిన ఉన్నతోద్యోగులలో మన్రో దొర ప్రముఖుడని పేరు. ఈతడు 1780లో మిలిటరీ కేడెట్' (Military Cadet) గా, మద్రాసునకు వచ్చి చాలకాలము సమర్థతతో కంపెని సేవచేసి, 1820 లో మద్రాసునకు గవర్నరై ; తాను విశేషముగా ప్రజాభ్యుదయమునకు, కంపెనీ లాభమునకు కృషిచేసిన రాయలసీమ యందు పత్తికొండలో 1827 లో

---

17. "I was directed to learn Telugu : supplied with an insufficient grammar, two worthless native books of exercise, and no dictionary, out tutors were Brahmans, who spoke English but had few notions of grammar." (Ibidem)

18. "I think Telugu will not longer be considered the most difficult language in India." (Ibidem)

19. "So little at that time did I love them, that my wish was to fly to Oxford and pass my life in classical reading." (Ibidem)

చనిపోయెను. ఆనాటి ప్రజలు, ఉద్యోగులు ఆతనిని గాఢముగా ప్రేమించిరి[20]. ఇట్లు సర్వులచేత గౌరవింపబడిన 'మన్రో' ఎదుట: బ్రౌను దొర యొక్క సివిల్ సర్వీస్ పరీక్షలలోని చివరి పరీక్ష జరిగెను. ఆ సందర్భమున, సివిల్ సర్వీస్ ఉద్యోగుల నుద్దేశించి ఉపన్యసించుచు, మన్రో దొర; వారు దేశ భాషలలో ప్రావీణ్యము సంపాదింపవలెననియు, ప్రజల ఆచారవ్యవహారములను సానుభూతితో

---

20. సర్ థామస్ మన్రో, చనిపోయినప్పుడు మద్రాసు గవర్నమెంటువారు ప్రకటించిన "గెజెట్"(Government Gazette Extraordinary) లో నుండి కొంత భాగము నిచ్చుచున్నాను:

"The eminent person whose life has been thus suddenly snatched away, was on the eve of returning to his native country, honoured with signal marks of esteem and approbation from his sovereign, from the East India Company, which he had served for more then forty - seven years from every authority with which he had occasion to co - operate, from the public at large, and from private friends. From the earliest period of his service, he was remarkable among other men. His sound and vigorous understanding, his transcendent talents, his indefatigable application, his varied stores of knowledge, his attainments as an Oriental scholar, his intimate acquaintance with the habits and feelings of the Native soldiers, and inhabitants generally ; his patience, temper, facility of access, and kindness of manner, would have ensured him distinction in any line of employment. These qualities were admirably adapted to the duties which he had to perform in organizing the resources, and establishing the tranquility of those provinces where his latest breath has been drawn, and where he had long been known by the appellation of Father of the people......"

(Government Gazette Extraordinary. Madras, Monday, July 9, 1827.)

పరిశీలించి పరిపాలింపవలె ననియును, హెచ్చరించెను[21]. ఈ హెచ్చరిక, బ్రౌను దొర హృదయముపై గాఢమైన ప్రభావమును నెరపెను. దీనిని గూర్చి బ్రౌను దొరయే యిట్లు వ్రాసెను.

"One occurrence produced a good effect : In 1820 Sir Thomas Munro arrived as Governor of Madras, and my final examinations (in which my grade was low) took place in his presence. He addressed us indulgently, but pointed out the neccesity ef acquiring the languages used in the Country[22]."

బ్రౌను దొర తండ్రియైన రివరెండ్ డేవిడ్ బ్రౌన్ కూడ దేశభాషలను ఇంగ్లీషువారు నేర్చుకొనవలెనని ఎప్పుడును చెప్పుటయే గాక, తన కుమారులకు భాషావిషయకమైన చక్కని శిక్షణకూడ ఇచ్చెను, ఈ ప్రభావమును బ్రౌనుదొరపై

---

21. సర్ థామస్ మన్రో, గవర్నరయిన వెంటనే చేసిన పనులలో ముఖ్యమైనది, జూనియర్ సివిల్ ఉద్యోగులను, దేశభాషలు నేర్చుకొనవలసినదని చేసిన హెచ్చరిక. దానిలోనుండి కొంత భాగమును చూపుచున్నాను:

    "The advantage of knowing the country languages is not merely that it will enable you to carry on the public business with greater facility, but that by rendering you more intimately acquainted with the people, it will dispose you to think more favourably of them, to relinquish some of those prejudices which we are all at first too apt to entertain against them......".

    "In every situation it is best to think well of the people placed under our authority....It is a strong argument in favour of the general good qualities of the natives, that those who have lived longest amongst them, have usually thought the most highly of them......".

    (The Life of Sir Thomas Munro by the Rev. G. R. Gleig. London, 1830. Page — 12.)

22. Some Account of the Literary Life of C. P. Brown.)

పడినది.[23] 1820 లో మన్రో ఎదుట అతని పరీక్ష జరుగునాటికి బ్రౌనుదొర వయస్సు 22 సంవత్సరములు- ఇట్లు బ్రౌనుదొర తన ఉద్యోగముయొక్కయు జీవితము యొక్కయు ప్రారంభదశలో మంచి ప్రభావములకు లోనయ్యెను. సహజముగా సహృదయుడైన అతనిపై ఇవి చక్కగా పనిచేసినవి. ఈ ఇద్దరి ప్రభావమును. బ్రౌనుదొరయొక్క ప్రతికార్యమునను జీవితాంతము వరకు, పని చేసినట్లు మనము చూడవచ్చును. సత్ప్రభావము వలన లభించిన ఆదర్శము ననుసరించుటలోనే, బ్రౌను దొరయొక్క శీలసంపత్తి. హృదయదార్ఢ్యములు వ్యక్తము లగుచున్నవి.

ఆ రోజులలో ఎందరు తెలుగు చదివిన పాశ్చాత్యోద్యోగులు లేరు ! కాని, ఎవరును బ్రౌనుదొర వలె ఆ భాషా సేవకు పూనుకొనలేదు.[24] జూనియర్ సివిల్ ఉద్యోగుల నుద్దేశించి, సర్ థామస్ మన్రో చెప్పిన మాటలలో "దేశభాషలను నేర్చుకొనవలెను" అనునది బ్రౌనుదొరకు బాగుగ నచ్చి, తరువాతి అతని భాషా సేవకు పునాదిపడెను. పరీక్ష అయిన వెంటనే. అతనికి కడపలో ఉద్యోగము చేయ వలసివచ్చెను. అచ్చట హాన్బరీ (Hunbury) అను నాతని క్రింద బ్రౌనుదొర పని చేయుచు, తెలుగు బాగుగా మాటలాడుట నేర్చుకొనజొచ్చెను. హాన్బరీ తెలుగు చక్కగా, స్వేచ్ఛగా మాటలాడ గలిగియుండుట వలనను, కార్యావశ్యకతను బట్టియు, సహజ కుతూహలముచేతను, బ్రౌను దొర తెలుగు చక్కగా నేర్చుకొని, రెండు సంవత్సరములలో హాన్బరీని మించెను[25]. ఇంతేకాక. తెలుగుభాష

---

23. రివరెండ్ డేవిడ్ బ్రౌన్, ఒక మిత్రునకు జాబు వ్రాయుచు, దేశభాషలను నేర్చుకొన వలసినదని ఇట్లు హెచ్చరించెను :

"But continue at your post, and attain some of the languages perfectly ; and you will in due time be found of importance there.......

(Memorial Sketches. London, 1816. Page — 9'.)

24. "Several of my compeers gained prizes in the College : but none of these ever attained in late years a riper skill in the languages." (Some Account of the Literary Life of C. P. Brown )

25. "...Impelled by zeal as well as necessity, in two years..." (Ibidem)

నభ్యసించుటలో ఎల్లవారి సాయమును తాను పొందినట్లు బ్రౌనుదొర వ్రాసెను. కోర్టులోని వాది ప్రతివాదులు, నేరస్థులు, సేవకులు— అందరుకూడ తనకు ఆయా కాలముల గురువులైరి అని వ్రాసి తన ఔదార్యమును ప్రకటించెను[26].

తన రోజులలో తెలుగు దేశముయొక్క హద్దులను గూర్చియు, జనసంఖ్యను గూర్చియు భాషకును, దేశమునకుగల వివిధ నామములను గూర్చియు బ్రౌనుదొర పరిశీలించి వ్రాసెను. ఆ వాక్యములు మనకు చరిత్రదృష్టితో చూచినచో అతిముఖ్యములు గనుక పూర్తిగా ఉదాహరించుచున్నాము:

**"The Telugu or Teaugu nation which foreigners call Telinga) fills a country larger than Spain. to the North and West of Madras Town. In some English books it is called Telingana or Golconda. (See Marshman's History of India, chapter IV, Page 114) It is contained in circles which we may describe on the map around Kadapa, Rajamandri, and Kondapalli; the radius extending to Madras; also in one round Visakhapatnam, reaching to Ganjam, towards Puri (Poory) in Kattack, often called Jagannath. In the Rev. Wm. Campbell's British India, 1858 the nation is rated at nine (othere say fourteen) millions of Hindoos. The Musalmans dwelling among them are rated at about two millions. The earliest literature, eight hundred years old, varies little from the Mode n Telugu. The Telugu Grammar and Prosody have always been considered peculiarly intricate"[27]**

ఇంత విశాలమైనది, నాటి ఆంధ్రదేశము. బ్రౌనుదొర, పట్టణ నామములను బట్టి చేసిన విభజనను పరిశీలించునపుడు నేటి జిల్లా విభజనను మనము మనస్సునందుంచుకొనరాదు.

---

26. "Books alone will not teach the living language. I used the everyday dialect in the police office. There cannot be a better school. Whenever I had a conversatoin with a plaintiff, witness or prisoner, with a learned native judge, or an ignorant menial, every one became my teacher for the time." (Ibidem)

27. (Ibidem)

ఈ విధముగా తెలుగు దేశమును పూర్ణముగ మనోముకురమందు ప్రతిబింబించుకొన్నాడు బ్రౌనుదొర. నవంబరు 10 వ తేదీ 1828 లో బ్రౌనుదొరకు పాతిక సంవత్సరములు నిండెను. ఇంతవరకు బ్రౌనుదొర, తెలుగులో బాగుగా మాటలాడ గలిగియున్నను, దానిని ప్రత్యేక దృష్టితో చదువలేదట ! చెప్పుకొన తగిన తెలుగు పుస్తకము దగ్గర లేదట[28]:

ఆ రోజులలోని చాలమంది కంపెనీ ఉద్యోగులవలెనే బ్రౌను దొరయు, ప్రభుత్వము యొక్క వివిధ శాఖలలో పనిచేసెను. పరీక్షలో ఉత్తీర్ణులైన వారిని, సర్ థామస్ మన్రో వివిధ ప్రాంతములకు ఉద్యోగులనుగా పంపెను. ఆ పంపుటలో ఆంధ్రభాష అదృష్టము వలన- నాటి పరిస్థితులనుబట్టి చూచినచో, ఇది అతిశయోక్తి కాదు-బ్రౌను దొరను, మన్రో కడపలో ఉద్యోగమునకై పంపెను. ఇది కేవలము యాదృచ్ఛికముగాజరిగినది[29]. నాకు బ్రౌనుదొర ఉద్యోగిగా ఇంకొక ప్రాంతమునకు పంపబడినచో, ఆ ప్రాంతీయ భాషలో కృషిచేసెడి వాడనవచ్చును ! 1820 లో కడపలో ఉద్యోగమును ప్రారంభించిన బ్రౌనుదొర, 1822లో మచిలీపట్టణమున అసిస్టెంటు జడ్జిగా నియమింపబడెను. ఆ రోజులలో మచిలీపట్టణమునకు - రేవు పట్టణమగుట వలన - మద్రాసు తరువాతి స్థానము, రాజకీయముగా నుండెను. అందుచేతనే బ్రౌనుదొర మచిలీపట్టణమునుగూర్చి వ్రాయుచు;"తెలుగుదేశమునకు రాజధాని[30]" అని చెప్పెను. ఈ పట్టణము చాల సంవత్సరములు అతని సాహిత్య వ్యాసంగమునకు కేంద్రమయినది. కాని, 1824 వచ్చు వరకు - అనగా తెలుగు చదువు ప్రారంభించినది మొదలు, ఏడు సంవత్సరములగు వరకు - అతడు. తెలుగులోని సాహిత్యమును నియమబద్ధముగా చదువుట ప్రారంభింపలేదు[31].

---

28. "I did not possess a single Telugu volume." (Ibidem)

29. "He (Sir Thomas Munro) then appointed us to various districts, and my lot fell in Cuddapa....." (Ibidem)

30. "Masulipatam, the capital of the Telugu Country...."(Ibid) "...... in 1824 when I already talked Telugu easily.

31. I was induced to commence a regular study of some Telugu poems." (Ibidem)

పాశ్చాత్యులలో కొందరాతనిని తెలుగుచదువు విషయమునకూడ నిరుత్సాహ పరచిరి. వీరిలో ముఖ్యుడైనవాడు, మత్తాయి (Mathew) సువార్తను "హిబ్రూ" భాషలో అచ్చువేసినవాడు. మంచి పండితుడు. ఈతని పేరు "జారెట్" (Jarrett). ఈతడు బ్రౌను దొరతో, ఉత్సాహమంతయు మొట్టమొదటనే ఉండుననియు, తెనుగునకు సంబంధించిన యత్నము లన్నియు మానుట[82] మంచిదనియు, చెప్పెనట! ఇట్టి "పిరికి మందులు" బ్రౌనుదొర వజ్రసంకల్పమును కదలింపలేకపోయి నవి గనుకనే తెలుగు భాషకు, తెలుగువారికి మహోపకారము జరిగెను. ఈ సందర్భముననే బ్రౌనుదొర, చిన్ననాడు తన్నందరును "చపలచిత్తుడు వీడ"ని నిందించెడివారనియు, కొమ్మనున్న ఆకు చలించినను — కొమ్మపట్టు విడువనంత కాలము— నష్టమేమనియు వ్రాసెను.[83]

"జారెట్" (Jarrett) మాత్రమేకాక, విలియమ్ బ్రౌన్ (William Brown-Death-1887) అను నాతడు కూడ బ్రౌనుదొరను తెలుగు చదువు విషయమందు నిరుత్సాహపరచినట్లు తెలియుచున్నది. విలియమ్ బ్రౌన్ అనునాతడు (1817-1818 లో) కొంత తెలుగు పదజాలమును ఒక గ్రంథముగ అచ్చొత్తించెను. అసమగ్రమయిన తెలుగు వ్యాకరణ మొకటికూడ సిద్ధము చేసినాడట! ఈతడు తెలుగు భాషను జెంటూ (Gentoo) అని పిలిచెడివాడట! ఈతడు తెలుగు భాషకు సాహిత్యము లేదనియు, దానిని చదువుట వ్యర్థ మనియు బ్రౌనుదొరతో గట్టిగా చెప్పినాడట! ఈ మాటలను స్థిరసంకల్పము గల బ్రౌనుదొర పట్టించుకొనక, తాను నిర్ణయించుకొనిన మార్గమును బట్టి, కృతకృత్యుడయ్యెను.

ప్రారంభ దినములలో బ్రౌనుదొరకు అన్నియు చిక్కులే. ఒకమూల ఉద్యోగ సంబంధమైనపనులు. ఇంకొకవైపు, పాటిపాశ్చాత్యుల నిరుత్సాహ వాక్యములు. మూడవదైన, దేశీయులైన పండితులయొక్క ఛాందసము. తనకు మార్గదర్శకులైన పండితుల భాషభేషజము వలన, అనేక పర్యాయములు తన కృషి భగ్నమగునంత వరకు వచ్చెనని బ్రౌనుదొర వ్రాసెను, వారు మారుమూలమన్నవి.

---

82. ".....In 1826 Mr. Jarrett counselled me to desist from my Telugu projects, predicting that my ardour and enthusiasm would soon cease." (Ibidem)

83. "In my younger days I was blamed for fickleness; but a leaf may flutter without losing its hold on the branch." (bidem)

అతికఠినమైనవి, అయిన విద్యావిషయములను మాత్రమే ఆదరింతురనియు;మూడు సారులు తన కృషి విరమించుకొనవెంచునంత వరకు వచ్చెననియు బ్రౌనుదొర వ్రాసెను [84]

క్రొత్త భాష నేర్చుకొనుట కష్టము. నిఘంటువు, వ్యాకరణము, ప్రారంభకులకు పనికివచ్చు పుస్తకములు దొరకని భాషను నేర్చుకొనుట ఇంకను కష్టము. ఈ కష్టములు స్వదేశస్థునకే తప్పవు. ఇంక విదేశస్థుని మాట చెప్పవలెనా? భారతదేశ భాషలకై తమ జీవితాంతము కృషిచేసిన విదేశస్థులీ బాధలన్నియు పడిరి. వారిని జ్ఞప్తికి తెచ్చుకొని బ్రౌనుదొర పట్టు విడవక తెలుగులో కృషి చేసెను[85]. కార్యము సాధించెను. తాను పడిన పాటులను జ్ఞప్తియందుంచుకొని తన తరువాత తెలుగు నేర్చుకొనగోరు వారికి ఈ కష్టము లేకుండుటకై. తన జీవితమంతయు కృషిచేసి,, విద్యార్థులకు తగిన గ్రంథములను, వరుసగా రచించి ప్రకటించెను, ఇట్టివి లేకపోవుటవలననే, వాటి గురువులు బ్రౌనుదొరను, అన్ని పుస్తకములను - నిఘంటువులు. వ్యాకరణము, పదజాలములు మొదలైన వాటిని-'వల్లె' వేయుడని హెచ్చరించిరట! ఒక పండితు డాతనిని "భట్టీయము"ను "బట్టీ" పట్టుడని సలహా చెప్పెనట ! చాల సంవత్సరము లాతడు, ఇంగ్లీషు ఏ మాత్రమును రాని పండితుల యొద్దనే చదివెను. ఆ రోజులలో, భాషను నేర్చుకొనుటకై తాను పడినపాట్లను

---

84. **"At first I was nearly ship-wrecked more than once, because of the pedantry of my lerned instructors. They consider the most abstruse branches of learning primarily disirable; and on three occasions I desisted, being daunted by the phantoms these wiseacres conjured up" (Ibidem)**

85. **"To commence learning a language without the help of a Dictionary or Grammar requires some determination of purpose ; however, he is but a poor workman who cannot work with orwithout tools. Beschi, Gilchrist, Carey, and Hands did the same thing withTamil, Hindustani, Bengali and Kannadi." (Ibidem)**

గూర్చి తనువాసి వ్రాయుచు, తనకట్టురకు బ్రౌనుదొర ఆశ్చర్యమును వెలి బుచ్చెను[86]. "క్రియా సిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే".

తెలుగు భాషా సాహిత్యములను ప్రాముఖ్యము లేని పండితుల దగ్గర చదివెను. ఒక దశలో ప్రసంగము వచ్చినప్పుడు ఆయన పండితులను పేర్కొనెను కూడ[87]. పట్టి పండితులలో సర్వం అద్వైత బ్రహ్మశాస్త్రి[88] కూడ. నాటి సదర్ అదాలత్ (కోర్టు) లో ఈయన పండితుడు. కొన్ని నాళ్ళు 'నేటివు జడ్జి' పని చేసినాడు. బ్రౌనుదొర ఈ పండితుని గురువుగా, మిత్రునిగా, తన భాషాసేవకు సహాయునిగ గ్రహించి గౌరవించెడివాడు. నాటి గుంటూరుజిల్లాకుచెందిన రేపల్లె డివిజను లోని కారుమూరు ఈ పండితుని స్వగ్రామము. తరువాత నితడు ఉద్యోగ ధర్మము ననుసరించి గుంటూరు, మద్రాసు మొదలైన నగరములకు సాగి వెళ్ళెను.

కడపలో ఉద్యోగిగా వెళ్ళియున్న మొదటిరోజులలో బ్రౌనుదొర తెలుగులో కంటె గ్రీకు, హీబ్రూ, పార్సీ భాషలలో ఎక్కువ కృషి చేసినాడు. అప్పటి కింకను పార్సీ భాషకు అధికారికమైన ప్రాముఖ్యముండుటచేత దానియందును, ప్రాచీనమైన భాషలయందు అభిమానముండుటచే గ్రీకు, హీబ్రూ భాషలయందును, అతడు కృషిచేయ జొచ్చెను. వ్రాయసగాని ద్వారమున తెలుగులో వ్యవహార మంతయు నడపుచున్నను, దానినంత జాగరూకతతో గమనించలేదు[89] ఇట్లే మచిలీపట్ట

---

86. "I read for some years, employing such pandits as came in may way; none knew a word of English. Looking back on these studies after a lapse of forty years, I see reason to wonder at my perseverance." (Ibidem)
87. "I read some of the Telugu poetry with him and in the course of amusing conversations, he related to me the tales here preserved." (తాతాచార్యుల కథలు (Popular Telugu Tales) యొక్క పీఠికలో (18-1-1855) తాతాచార్యులను గూర్చి బ్రౌనుదొర వ్రాసినది)
88. "This learned man was one of my chief instructors in Telugu" (సర్వం అద్వైత బ్రహ్మశాస్త్రిని గూర్చి బ్రౌనుదొర,'English Translation of Telugu Reade' Page-63; Foot Note లో వ్రాసినది)
89. "In my leisure hours while in Kadapa, I read Greek, Hebrew, and Persian, I did not study Telugu, though I daily corresponded in it by means of an amanuensis on matters of business." (Some Account of the Literary Life of C. P. Brown.)

ణమునన్న ప్రారంభ దినములలో, వంగలిపి-భాష బాల్యమున కొంత తెలిసి యున్నను- నేర్చుకొనెను, తరువాత కొంత కాలమునకు అక్కడనే దేవనాగరి లిపి నేర్చుకొనియు; బ్రౌను దొర తన భాషా పరిజ్ఞానమునకు మెరుగులు దిద్దుకొనెను[40]. ఈ కృషి అంతయు అతనికి ముందు ముందు మిక్కిలి ఉపయోగించి, అతనిచే గొప్పదైన భాషా సేవ చేయించెను. ఈ సేవ, అతని ఉద్యోగ జీవితముతో పాటు పెరుగుచువచ్చి, అతని ఉద్యోగ విరమణము తరువాతను సాగినది.

ఆ రోజులలో పనిపాటలు లేకుండ విశ్రాంతి ననుభవించుచు, తమకు ఆహ్లాదకరమగు పనులను మాత్రమే చేయుచు కాలము గడిపెడి, పాశ్చాత్యులు మన దేశమున లేరనవచ్చును[41]. ఇక్కడకు వచ్చిన వారిలో ఏ కొద్ది మందియో తప్ప మిగిలిన వారందరును, తొందరగా సులభముగా డబ్బుచేసికొని స్వదేశమునకు పోవతలను కోరిక గలవారే! కాని, కంపెనీ ఉద్యోగులలో సాహిత్యాభిలాషులు, సంస్కృతి కలవారు, కొందరు లేకపోలేదు వారు, తమ ఉద్యోగ సంబంధములైన పనులైన తరువాత, మిగిలిన కాలములో సాంస్కృతిక వ్యాసంగములతో కాలము గడిపెడివారు. వీరికి అధికార వర్గమునుండి ఎక్కువ ప్రోత్సాహము కాని, తోడి పాశ్చాత్యులనుండి విశేష గౌరవము కాని; ఈ వ్యాసంగముల వలన లభించెడిది కాదు. ఇట్టి పరిస్థితులలో, మన భాషలను నేర్చుకొని అందు గొప్ప కృషి చేసిన

---

40. "I obtained a Grammar of the Bengali language, and at Masulipatam I learnt that character......I also met with Wilkins's Sanskrit Grammar, in which I learned the Devanagari alphabet." (Ibidem)

41. "A mere man of letters, retired from the world and allotting his whole time to philosophical or literary pursuits, is a character unknown among European residents in India. Here every individual is a man of business; in the civil or military state he is constantly occupied in the affairs of Government, in the administration of Justice, in some department of revenue, or commerce, or in one of the liberal professions; very few hours in the day or night can be reserved for study." (Introduction to the 'Asiatic Researches' by Sir Williams Jones.) 'ఏషియాటిక్ సొసైటీ'. 15 జనవరి 1784 న ఏర్పడెను. దాని మొదటి అధ్యక్షుడు, సర్ విలియమ్ జోన్స్.

బ్రౌనుదొర వంటివారు, ఎంత శ్రమపడి యుండిరో మనము సులభముగా నూహింప గలము.

భారతదేశములో పుట్టిన పాశ్చాత్యుల పిల్లలు కూడ, దేశ భాషలను పరిసరముల ననుసరించి, మాటాడ గలిగినను; తల్లిదండ్రులు చాలవరకు, ఆ పిల్లలు ఆయా భాషలు నేర్చుకొనకుండుటకై ప్రయత్నించుటయు కలదు.[42] ఇందులకు అపవాదముగా రివరెండ్ డేవిడ్ బ్రౌన్ వంటి వారును కలరు. మొత్తము మీద, దేశ భాషలను ఆదరాభిమానములతో నేర్చుకొనెడి వారి సంఖ్య చాల తక్కువ. ఈ పరిస్థితుల నన్నింటిని గ్రహించినచో బ్రౌను దొరవంటి వారి కృషి యొక్క వైశిష్ట్యము వ్యక్తమగును.

1824 నుండి, తెలుగు కావ్యములను చదువ మొదలిడిన బ్రౌనుదొర, చాల తక్కువ కాలములోనే వాటి యందు మంచి జ్ఞానమును సంపాదించెను. 1829 లో వేమన పద్యములను ఆంగ్లానువాదముతో అచ్చువేయునాటికి, బ్రౌనుదొరకు పండ్రెండు సంవత్సరముల నుండి తెలుగుతో సంబంధము (1817-1829) ఉండెను. దీని తరవాత మరి ఐదు సంవత్సరములకు (1834) మొట్టమొదటిసారి అతడు సెలవు తీసికొని, ఇంగ్లండునకు బయలుదేరెను. అప్పటి కాతడు పదునేడు సంవత్సరముల నుండి మనదేశమున నుండెను. ఈ కాలమున నతడు-కడప, మచిలీపట్టణము, రాజమహేంద్రవరము, తిరుచునాపల్లి, మద్రాసు, గుంటూరు, చిత్తూరు మొదలైన పట్టణములలో; రెవెన్యూ, జ్యూడిషియల్, పోలీసు, కస్టమ్స్ శాఖలలో పనిచేసెను. ఇట్లు, బహు కార్యవ్యగ్రుడైనను బ్రౌనుదొర ప్రతిదినమును (ఆదివారము తప్ప) కొంత కాలము భాషా సాహిత్యముల వ్యాసంగమునకు కేటాయించి; ఇంచుమించుగా తన విశ్రాంతి కాలము నంతటిని, వాటికై వినియోగించెను. హిందువులకు సాయపడుటయే తన ప్రధాన దృష్టి యనియు; ఉదయము ఐదు మొదలు పదివరకు, వారమునకు ఆరు రోజులు తాను భాషాసేవకై వినియో

---

42. "Baby is very well and very intelligent. Every now and then she learns to pronounce some new word, which she thinks is very clever. but I intend, as much as possible, to prevent her learning the native languages......" Letters from Madras, 1839. Quoted from 'The Sahibs', London, 1948. Page-205.)

గించుటకు విశ్రాంతి కాలమనియు అతడు వ్రాసెను[43]. ఇంత పట్టుదలతో భాషా కృషి చేయకపోయినచో బ్రౌనుదొర[43], తన భాషా సేవ నంతటి సమర్థతతో చేయ లేక పోయెడివాడు.

ఆ రోజులలో కంపెనీ ఉద్యోగులు చాల మంది. ప్రాతఃకాల మంతయు, గుఱ్ఱపు స్వారి మొదలైన విలాసములతో గడిపి; పది గంటలకు ఆఫీసులకు పోయి రెండు గంటల వరకు అచ్చట పనిచేసి, తరువాత భోజనము చేసి మరల విలాసము లతో కాలము గడిపెడి వారని తెలియుచున్నది. కొందరి విషయమందు, ఈ దిన చర్యలో మార్పు ఉన్నను, ఉదయము ఐదు మొదలు పదివరకు భాషా వ్యాసంగము చేసినవారి సంఖ్య మాత్రము చాల తక్కువ. ఈ అల్పసంఖ్యాకుల వర్గమునకు చెందినవాడు బ్రౌనుదొర. సివిల్, మిలిటరీ ఉద్యోగుల దినచర్యలో కొంత భేద మున్నను, మొత్తముమీద అందరి దినచర్య యందును సాహిత్య వ్యాసంగము మాత్రము లేదు[44]. ఇతరులు గుఱ్ఱపు స్వారి చేయుచున్నప్పుడు; కుక్కలతో అడవి

---

43. "To benefit the Hindus was always my primary object. My leisure for these pursuits was chiefly between five and ten in the morning, six days every week." (Some Account of the Literary Life of C. P. Brown).

44. ధనవంతులైన పాశ్చాత్య వణిజుల దినచర్య ఇంకను విలాసముగ, భోగ పూరితముగ నుండెడిది. కంపెనీ ఉద్యోగులలో ఉన్నత శ్రేణికిచెందిన వారం దరు. ఇంచుమించుగా, ఈ జాతికి చెందిన వారే పదునెనిమిదవ శతాబ్ది, తుది రెండు దశాబ్దులలో వారెట్లు జీవించుచుండెడి వారో, తెలుపు ఈ క్రింది వాక్యములు ఈ సందర్భమున పఠనార్హములు:
"I am now to fulfil my promise, to give you a particular account of the day, as it is commonly spent by an Englishman in Bengal."
"About the hour of seven in the morning, his doorkeeper opens the gate, and the viranda is free to his circars, peons, chubdars......writers and solicitors. The head-bearer and jemmadar enter the hall and his bedroom at eight o'clock. A lady quits his side, and is conducted by private stair case, either to her own apartment or out of the yard. The moment the master throws his legs off out of bed, the whole posse in waiting rush into his room............In about

ఖండముల చేటలో నున్నప్పుడు: బ్రౌనుదొర భాషా కృషి చేయుచుండె నన్నమాట' మన భాషా సాహిత్యములకు సేవచేసిన ప్రాశ్చాత్యోద్యోగులందరు, ఇట్లు తమ విశ్రాంతి కాలమును భాషా సేవకై వినియోగించినవారే! మిగిలిన కాలమును. ఉద్యోగ ధర్మము ననుసరించి విడిచెడివారు అనగా, ఎందరో పట్టురలు, భాషాభిమానము లేనిచో, నాకు ఈ వ్యాసంగములకు తెరుబడియే లేదన్నమాట ! కాని, భాషా సేవకు తన విశ్రాంతికాలమును అంకితముచేయ కృతనిశ్చయుడైన బ్రౌను దొర, తీరుబడి లేనిపోవుట అనగా, కృషియందు కుతూహలము లేకుండుట, అను నిర్ణయము చేసెను[45]. ఇది చాలా మందికి కష్టమైన నిర్ణయమే కాని, పనిచేసి చూపిన బ్రౌనుదొర, ఇట్లనుటకు తగినవాడు.

ఇట్లు, మనదేశములో నున్నప్పుడేకాక, పదునేడు సంవత్సరముల తరువాత స్వదేశమునకు పోయినప్పుడు, అక్కడ కూడ; భాషా సాహిత్యముల వ్యాసంగము

---

half an hour after undoing and taking off his drawers, a clean shirt, breeches, stockings, and slippers are put upon his body......without any greater exertion on his own part, than if he was a statue. The barber enters, shaves him, cuts his nails, and cleans his ears...The superior then walks in state to his breakfasting parlour in his waist coat; is seated; the consumah makes and pours out his tea, and presents him with a plate of bread or toast. The hair-dresser comes behind and begins his operation, while the houccabadar softly slips the upper end of the snake or tube of the houcca into his hand. While the hair dresser is doing his duty, the gentleman is eating, sipping and smoking by turns. By and by his banian (Clerk) presents himself with humble salaams... These ceremonies are continued till perhaps ten o'clock...... With no greater exertions than these, do the Company's servants amass the most splendid fortunes." (Travels in Europe, Asia and Africa—1779 by Mackintosh, as quoted in The Sahibs. London, 1941. Page—113). అందరు ఇట్లు లేకున్నను, నాటి పరిస్థితుల కిది చక్కని ఉదాహరణము. మంచి వర్ణన.

45. "Want of leisure, so often lamented in India, usually denotes want of inclination. I have always had leisure" (Some Account of the Literary life of C. P. Brown).

విడువలేదు. తెలుగు భాషను మరువలేదు విశ్రాంతి లభించి నప్పుడెల్ల, భాషా కృషి చేయుచునే యుండెను. స్నేహితుల యొద్దకురాకపోకలు, విలాసయాత్రలు మొదలగునవి ఎన్నియున్నను, కొంత విరామ కాలము బ్రౌనుదొరకు చిక్కుచుండెను. దాని నాతడు తన నిఘంటువు, వ్యాకరణము చక్కదిద్దుటకే వినియోగించెడివాడు[48]. ఇంత లక్ష్యశుద్ధి కలిగియుండియు, తాను చేసినకృషి చాల తక్కువ అని చెప్పుకొనగలిగిన వినయము కలవాడు బ్రౌనుదొర.

బ్రౌనుదొర లండనులో నున్నప్పుడు లిఖిత ప్రతులను సరిదిద్దుటయందు, "ఇండియా హౌసు గ్రంథాలయము" లోని దాక్షిణాత్యలిపులలోగల లిఖిత గ్రంథములను మన దేశమునకు చేర్చుటయందు, మెచ్చుకొన దగిన కృషి చేసెను ఇట్టివిగాక, ఆతని సాహిత్యాభిరుచిని, రసికతను తెలియజేయు సంఘటన ఒకదానిని ఇట మనము పేర్కొనవచ్చును. ఇది ఆతడు కేవలము శాబ్దికుడు కాడనియు, కావ్యామృత రసాస్వాదన చేయుజాలిన రసికుడగు సహృదయుడనియు, మనకు తెలియజేయును. ఆతడు ఇంగ్లండులో ఉండగా, షేక్స్పియరు మహాకవి వ్రాసిన, 'ది టెంపెస్ట్' (The Tempest) అను నాటకమును, డ్రైడన్ (Dryden) కవి చేసిన మార్పులతో ప్రదర్శితమైన దానిని, చూచుట తటస్థించెను. ఆ మార్పులు రసిక హృదయుడగు బ్రౌనుదొరకు నచ్చక; వాటిని తీసివేసి, నాటకమును యథాతథముగ ప్రదర్శించుట మంచిదని, నాటకమున ముఖ్య పాత్రధరించిన "మెక్రెడీ" (Macready) కి, అతడు జాబు వ్రాసెను. దానికి సమాధానముగా ఆ నటుడు, బ్రౌనుదొర అభిప్రాయానుసారము తాను చేయలేనందులకు చింతించుచు, అందులకు కారణము నాటి ప్రజల దృక్పథమేనని వ్రాసెను. కాని, రెండు సంవత్సరముల తరువాత ఆ నటుడు "డ్రైడన్" పద్ధతిని త్యజింపగానే, అందరును అతనిని ప్రశంసించిరట! అప్పుడు బ్రౌనుదొర, తన సలహా ఎట్టకేలకు ఆచరణలో

---

48. "But visits, jaunts, sight seeing, and tours, still left me daily leisure which I occupied in completing a transcript of my Dictionary and in writing a Telugu Grammer" (Ibidem). బ్రౌనుదొర 17-12-1834 లో కోరంగిరేవులో ఓడ ఎక్కి ఇంగ్లండు పోయి జనవరి 1838 లో తిరిగివచ్చెను.

పెట్టుకొనిరి గదా [illegible], [illegible]నుు[47]. [illegible] సలహాను [illegible] [illegible] [illegible] ఆచారము పోయినది గదా యని బ్రౌనుదొర సంతసించెను.

ఇంగ్లండులో సెలవు ముగించుకొని, మరల ఉద్యోగములో చేరుటకు జనవరి 1838 లో మనదేశమునకు రాగానే, బ్రౌను దొరను కంపెనివారు, "ఫార్సీ అనువాదకు"నిగ (Persian Traslator) నియమించిరి. ఆతడు మొదటి నుండియు - ముఖ్యముగా కడప, మచిలీపట్టణములలో - చదువుచు వచ్చిన "ఫార్సీ" భాషకు మంచి వినియోగము కలిగెను. ఈ ఉద్యోగములో ఆతడుండి, అనువాదరూపమున చేసిన రచనలు చాల కలవు.

ఈ కాలముననే బ్రౌనుదొర కాలేజీ బోర్డులో నొక గౌరవ సభ్యునిగ నియమితుడయ్యెను. ఈ కాలేజి బోర్డునుగూర్చి యథార్థకథనము చేయుటలో బ్రౌను దొర జంకలేదు. తెల్లవారి లోపములను ఎత్తి చూపుటకు సంకోచింపలేదు. నాటి బోర్డు అధికారులకు పనితొందర లేదట! పనిలేకపోయినను గౌరవమునకు లోటు లేదట! బ్రౌనుదొర, ఆ కాలమును - పని ఎగవేయువారికి, స్వర్ణ యుగమనెను[48]. ఈ సందర్భమున, బ్రౌనుదొర "బెంథామ్" (Jeremy Bentham) వ్రాసిన ఈ క్రింది వాక్యము నుదాహరించి, బోర్డుల బండారమును బయట పెట్టెను "Beware of Boards; Screens are made of Boards" నిజమే. బోర్డులు ఒక్కొక్కప్పుడు తెరలే! అడ్డుగోడలే! తానున్న బోర్డులోని సభ్యులు, దానిని విడిచి స్వదేశమునకు పోవు వరకు బ్రౌనుదొర, ఆ బోర్డును సంస్కరింపలేక పోయెను.

పరీక్షలలో విద్యార్థులను బ్రౌనుదొర పరీక్షించెడి పద్ధతి, చాల కఠినమైనదని కొందరు, చాల తేలికముగ నున్నదని కొందరు, ఆతనిని గేలి చేసిరట! ఇట్లు తన

---

47. "I therefore flattered myself thet he had taken any advice." (Ibidem)

48. "In that College it was the Golden Age; no work, no worry; all praises and prizes" (Ibidem)

పద్ధతినిగూర్చి, పరస్పరము విరుద్ధములైన భావములు వ్యక్తము చేయబడుటవలన తన మార్గము సరిగానున్నట్లు తానూహించితినని బ్రౌనుదొర హాస్యముగపలికెను[49].

---

49. "Some thought my style in Telugu Teaching (as also in the Dictionary and Grammar) too high; others blamed it as too low; so probably it was right." (Ibidem)

నాటి (కంపెనీ ఉద్యోగుల) పరీక్షలలోని ప్రశ్నపత్రములనుండి "తెలుగునుండి ఇంగ్లీషులోనికి అనువాదము" చేయుటకై ఈయబడిన 'కథ'ను, ఉదాహరణగా చూపుచున్నాను.

"ఒక వూరిలో వొక గురువుండెను. అతనివద్ద నలుగురు శిష్యులు వుండిరి. వారిలో వొకడు ఆ గురవుకు అన్నము వండిపెట్టును. ఒకడు అతని బట్టలు వుతికి, ఆరవేసి, అతనికి కట్టుకొనేటందుకు యిచ్చును. ఒకడు దేవుని పూజకు పుష్పాలు తెచ్చి యిచ్చును. ఒకడు అతని కాళ్ళు చేతులు వొత్తును. ఒకనాడు ఆ గురువుయొక్క అంగవస్త్రము కాస్త చినిగినందున, అతడు శిష్యులను పిలిచి, దీనికి యేమి చేయవలెనని అడిగెను. సూది యిస్తే కుట్టుతామని చెప్పిరి. సూది యెక్కడ వున్నదని గురువు నడిగెను. మాకు నలుగురుకిన్ని శలవు యిస్తే, మేము సంతకుపోయి సూది తెస్తామనిరి. అంతట ఆ గురువు బహుదినాలుగా పెట్టుకొనివున్న అర్ధరూపాయి వాండ్ల చేతికి యిచ్చెను. వాండ్లు అర్ధరూపాయి తీసుకొని సంతకుపోయి సూది నిమిత్తము అంగడంగడి తిరుగుతూ వుండగా, వొక మోసగాడు వాండ్లను తన యింటికి పిలుచుకొనిపోయి, వొక సూదియిచ్చి, ఆ అర్ధరూపాయి తీసుకొనెను. అంతట నలుగురున్ను వొకచోట కూర్చుండి, మన గురువు యీ సూదిని తేవడానికి మనలను పంపించాడు. వొకడు తీసుకొనిపోతే గురువు కోపగించుకొనునని, అక్కడ పడివున్న వొక తాటి చెట్టులో ఆ సూదిని దోపి, ఆ చెట్టును నలుగురున్ను యెత్తుకొని దోవలో బహు ఆయాస పడి గురువు వద్దికి వచ్చి, యిదిగో సూది తెచ్చినామని. తాటిచెట్టును గురువు ముందర వుంచగా, దగ్గెర వున్న వాండ్లందరున్ను నవ్వసాగిరి. ఆ చెట్టులో దోపివున్న సూదిని వెతకగా, అది అగపడలేదు. గనుక, బుద్ధిహీనులైన వారు అల్పకార్యమునకు మహాప్రయత్నము చేసి, ఆ కార్యములు చెడగొట్టుతారు". (తెలుగు రీడరు, పుటలు - 17, 18.)

తన **English Translation of the Telugu Reader** లో పై కథ ఆంగ్లానువాదముక్రింద బ్రౌనుదొర ఇట్లు వ్రాసెను. **"I print some of these old papers for the satisfaction of those who fancy the papers I prefer are of a lower degree of merit." (Page-10).**

పరీక్షకు పోబడు కానున్న విద్యార్థులకు, తమ తమ సందేహములను తీర్చుకొనుటకు, తన ఇంటికి బ్రౌనుదొర రానిచ్చి వారికి సాయము చేసెడివాడు. తెలుగు భాషను వారు సరిగా నేర్చుకొనవలెనను కుతూహలమే దీనికి కారణము. సివిల్, మిలిటరీ, వైద్య విద్యార్థులను తన ఇంటికి "అల్పాహారము"నకు పిలిచి, వారివారి సంశయములను తీర్చుచుండెడివాడు. ఈ సందర్భమున, బ్రౌనుదొర శ్రద్ధ గల విద్యార్థులందరు తన్ను మిత్రునిగా పరిగణించి రనెను. సోమరిపోతుల అడ్డు సవాళ్ళను తాను లెక్కచేయలేదని కూడ, ఈ సందర్భముననే పలికెను[50].

ఆ రోజులలో తెల్లవారితో బాటు, తెలుగువారైన పండితులు బోర్డు మీటింగులలో, పరీక్షల సమయమున, కూర్చుండుట లేదు. దీనికి, జాత్యహంకారము కూడ కొంత కారణము కావచ్చును. బ్రౌనుదొర, చాల ప్రయత్నించి మిక్కిలి కష్టము మీద- తెలుగు పండితులు కూడ-కంపెనీ ఉద్యోగులకు తెలుగు పరీక్ష జరుగు సందర్భమున- తనతో బాటు బోర్డులో కూర్చుండుటకు వీలైన అనుమతిని సంపాదించెను[51]. ఇది గొప్ప విప్లవాత్మకమైన కృత్యము. నేటికిని, తెల్లవారైన పాశ్చాత్యులు విజాతీయులను తమతో సమానముగా చూడని ప్రాంతములు ప్రపంచములో నుండగా; పందొమ్మిదవ శతాబ్దిలో మన దేశమును పాలించుచున్న తెల్ల ప్రభుత్వము యొక్క ప్రతినిధి ఒకడు, పాలితులైన వారినుండి కొందరిని తనతో బాటు సమానముగా బోర్డులో కూర్చుండుటకు అంగీకరించి, ప్రయత్నించి, కృతకృత్యుడైనాడన్నచో; బ్రౌనుదొర యొక్క వైశిష్ట్యము స్వయం వ్యక్తము గదా !

1820-1827 వరకు మద్రాసునకు గవర్నరుగానున్న సర్ థామస్ మన్రో వంటి రాజకీయముగ దూరదృష్టి కల విశాల హృదయుల ప్రభావము

---

50. "I disregarded idle cavils, and every diligent student found in me a true friend" (Some Account of the Literary Life of C. P. Brown.)

51. "I prevailed on the Board to permit the native tutors to sit by while I examined." (Ibidem)

బ్రౌనుదొరపై పడుటచే, ఇందులకు కారణము కావచ్చును. సహజముగనే అతడు సహృదయుడు, సౌజన్యము కలవాడు. పైని, ఈ ప్రభావమును పడినది[62].

1846 లో పోస్ట్ మాస్టర్ జనరల్ పదవి కాళీకాగా అదియును, అంతకు పూర్వము ప్రభుత్వమునకు తెలుగు ట్రాన్స్‌లేటర్‌గా ఉన్న మారిస్ దొర తన ఉద్యోగమునకు రాజీనామా ఇయ్యగా అదియును, ప్రభుత్వమువారు బ్రౌనుదొర కిచ్చిరి. అంతకు పూర్వమే అతడు ఫార్సి ట్రాన్స్‌లేటర్ పనిలో నుండెను. ఈ పనుల వలన ఆతనికి రోజునకు పది "గినీ" లు, ఆదాయము వచ్చుచుండెనట[63]! ఇంచు మించుగా, ఈ సమయముననే అతడు - కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషన్ (Council of Education)న, మెంబరుగా; మదరాసు బ్యాంకు డైరెక్టరులలో గవర్నమెంటు డైరెక్టరుగా; మదరాసు కాలేజి లిఖిత పుస్తకముల గ్రంథాలయమునకు క్యూరేటరుగా, కాలేజి బోర్డులో సీనియరు మెంబరుగా; పనిచేయుచుండెను. ఇవిగాక, బ్రౌనుదొర చాల సంవత్సరములు, ఆర్. కోల్ (R. Cole) దొరతో కలసి, మద్రాసు లిటెరరీ జర్నల్ (The Journal of Literature and Science, Madras) నకు సంయుక్త సంపాదకునిగ పనిచేసెను.

బ్రౌనుదొర ఆత్మతృప్తి కొరకేగాక, ప్రభుత్వోద్యోగిగా భారతీయ భాషలలో చేసిన కృషి చాల కలదు. తెలుగు, ఫార్సీ, హిందుస్థానీ భాషలనుండి ఇంగ్లీషులోనికిని, ఇంగ్లీషులో నుండి ఈ భాషలలోనికిని వందలకొలది పుటలు అనువాదము చేసెను. ఈ పనిని ఆతడు ఉద్యోగ కృత్యముగ తీసికొనుట చేతను, ఆతని పర్య

వేతనమున ఆ పనులను చాలవరకు ఇతరులు చేయుటచేతను, ఆ పనుల వలన ఆతనికి వేతనము లభించుట చేతను; వాటి నాతడు విశేషముగా గణింపలేదు[54]. తాను సొంత డబ్బు వెచ్చించి, స్వయముగా శ్రమపడి నిర్వహించిన కార్యములను గూర్చియే ఆతడు గర్వము వహించెడివాడు.

ఇట్లు సర్వతోముఖమగు దీక్షతో సాహిత్య సేవయు, దక్షతతో ఉద్యోగమును నిర్వహించుచున్న బ్రౌనుదొరకు; దేహపరిశ్రము ననుసరించి 1958 లో పక్షవాతము వచ్చెను. వెంటనే,ఆరోగ్యమును తిరిగి పొందుటకై డాక్టర్లు ఆతనిని ఉదకమండలము పంపిరి. నీలి కొండలు, ప్రశాంత వాతావరణము, ఆరోగ్యమగు పరిసరములు; ఆతనిని త్వరలోనే పూర్ణారోగ్యము పొందునట్లు చేసెను. ఉదకమండలములో ఆతడొక క్రైస్తవ కుటుంబమున అతిథిగా నుండెను. వారి దైవభక్తి, వినయము, పాపభీతి ఆతనిని మిక్కిలి ఆకర్షించినవి. అక్కడ ఉన్నంత కాలమును విశ్రాంతిగా ఆనందముతో గడిపెను. ఆతని ఆరోగ్యము చక్కబడెను. వైద్యులాతనిని, భాషా వ్యాసంగమును మాని పూర్తిగా విశ్రాంతి తీసికొనుమనియు, లేనిచో ఆరోగ్యమంతయు చెడిపోవుననియు సలహా ఇచ్చిరి.

ఈ పరిస్థితులలో కొందరు మిత్రులాతనిని, తన జీవిత చరిత్రను గూర్చి వ్రాయుడనగా, వారి కోరిక ననుసరించి, మన దేశమును విడిచిపోవుటకుముందు, తన సాహిత్య వ్యాసంగమునుగూర్చి బ్రౌనుదొర లఘువుగా వ్రాసెను[55]. (Some Account of the Literary Life of C. P. Brown). కాని, ఇది అతడు చనిపోవు వరకు బహిరంగపరుపబడలేదు. కొంతవరకు ఇది వ్రాసిన తరువాత, తాను మరల చూడవలెననుకొన్న ప్రాంతములను చూచుటకై అతడు పోయెను. ఈ యాత్రలో బ్రౌనుదొర బెంగుళూరు, శ్రీరంగపట్టణము, మైసూరు మొదలైన నగరములను చూచి వచ్చెను. ఈ ప్రయాణము వలన, ఆతని ఆరోగ్యము మరల క్షీణింప జొచ్చెను. ముఖ్యముగా, నిద్రపట్టుట మానినదాతనికి. ఆతని ఆరోగ్యము

---

54. "I was paid for those duties, and the task was chiefly performed by learned men in my employ." (Ibidem)

55. "On the eve of leaving India,their late learned colleague was induced by his friends to compile some details of his own literary life......" (D.F. Carmichael in the preface to A Catalogue Raisonnee of Oriental Manuscripts, Madras, 1858.)

యొక్క స్థితిని గూర్చి విన్న అతని సోదరీమణులాతనిని ఇంగ్లండునకు తిరిగి వచ్చి వేయవలసినదిగా తొందరచేయమొదలుపెట్టిరి. అతని వైద్యులుకూడ, ఆరోగ్యము పూర్తిగా భగ్నము కాకపూర్వమే, ఇంగ్లండునకు తిరిగిపోవుట మంచిదని హెచ్చరించిరి. వీటి నన్నింటిని బట్టి, బ్రౌనుదొర స్వదేశమునకు పోవలెనని నిర్ణయించుకొని, ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చెను. ఏప్రిల్ 1855 లో అతడు మన దేశమును విడిచిపోవునాటికి; మనదేశములో మరల పదునేడు సంవత్సరములు (మొదటి సెలవు నుండి (1834–1838) తిరిగి వచ్చిన తరువాత) బ్రౌనుదొర ఉండెనన్నమాట ! మొత్తము, మద్రాసు సివిల్ సర్వీసులో ముప్పది ఎనిమిది సంవత్సరము లుండెను. (1817–1855).

బహుముఖ ప్రజ్ఞగల బ్రౌనుదొర కొంత కవిత్వమును గూడ ఇంగ్లీషులో వ్రాసెను. షేక్స్పియర్, కౌపర్, బర్న్స్, బైరన్ మొదలైన వారి రచనలు చదువుట వలన కలిగిన ఉత్సాహములో పద్యములు వ్రాసెను. కాని, వీటిలో చాలవరకన్నియు కాలగతినిచెందినవట[56]! అప్పుడప్పుడాతడు తెలుగుపద్యములను ఆంగ్లీకరించుటయు గలదు. గజేంద్రమోక్షములోని "లావొక్కింతయు లేదు" మొదలైన వాటి కాతడనువాదము చేసెను.

బ్రౌనుదొర తన గ్రంథములను ప్రచురించుటకు, పరిశోధనలు చేయుటకు, తన ధనమును వినియోగించుటయే గాక, ఉత్తమమైన కృషిచేసి, ఆ కృషి ఫలితములను ధనాభావముచే ప్రచురించుకొనలేని వారికి ధనమిచ్చి వాటిని ప్రచురింపజేసెడివాడు. రెవరెండు డాక్టరు బెర్నహార్డ్ ష్మిడ్ (Rev. Dr. Bernhard Schmid) క్రైస్తవ మత సంబంధములైన రచనలు కొన్ని తమిళములోచేయగా, వాటి ముద్రణమునకగు (ఒక్కొక్క పుస్తకము 3,000 ప్రతులు) వ్యయమును, బ్రౌనుదొర భరించెను. తెలుగువారికే కాక పాశ్చాత్యులకును ఇట్టి గుప్తదానముల నెన్నింటినో చేసెను.

---

56. "A perusal of Shakespeare and Milton, Cowper and Burns, Scott, Byron and Moore, led me to compose verse, and the propensity lasted for many years : but nearly all I wrote perished." (Some Account of the Literary Life of C. P. Brown.)

మన దేశమునుండి స్వదేశమునకు పోయిన రెండు సంవత్సరములలో బ్రౌను దొర ఆరోగ్యము చక్కబడెను. దృష్టిమాంద్యము కూడ కలుగలేదు. ఉష్ణదేశమైన భారతదేశములో ఉద్యోగము చేసి, స్వదేశమునకు తిరిగివెళ్ళిన ఇంగ్లీషు వాడు తమ ఆరోగ్యములు చెడుటకు, భారతదేశ శీతోష్ణస్థితి కారణమని చెప్పుట ఆచారము. కాని, బ్రౌనుదొరను చూచిన వారందరు, అతడు భారతదేశము యొక్క వాతావరణమునకు లోనుకాక, ఆరోగ్యముగా నుండెనని చెప్పిరట! బ్రౌనుదొర జీవితము నియమ బద్ధమైనదని వారెరుగరు కాబోలు ?

ఇంగ్లండు విశ్రాంతికై పోయినను, బ్రౌనుదొర పనిలేకుండ కూర్చుండ లేదు. అతని కృషిని గూర్చి తెలిసిన వారాతనిని కూర్చుండనీయరు. ఇంగ్లండు చేరిన వెంటనే, అతనిని లండను విశ్వవిద్యాలయ కళాశాలలో తెలుగునకు ఆచార్యునిగ నియమించిరి[57]. ఇది, ఇంచుమించుగా జీతములేని గౌరవోద్యోగము. తరువాత కొంతకాల మాతడు, రాయల్ ఏషియాటిక్ సొసైటి కౌన్సిల్ సభ్యుడు[58]. ఆరోగ్యము బాగుగా ఉన్నంతకాలము, బ్రౌనుదొర లండనులో కూడ చాల ఉత్సాహముతో పని చేసినాడు.

తరువాత, సివిల్ సర్వీస్‌నకు 'పోటీ పరీక్ష' లు వచ్చినప్పుడు, బ్రౌనుదొర తెలుగునకు పరీక్షాధికారి అయ్యెను. కాని 1869 వరకు, ఈ పని కాతడు పూను కొనలేదు. ఈ పరీక్షలో ఉపయోగింపబడిన పుస్తకము లన్నియు అతడు ప్రచురించినవే ![59]

---

57. "I was invited to become Professor of Telugu in the London University, and this I accepted......"(Ibidem)

58. సుప్రసిద్ధ దేశభక్తుడైన 'దాదాభాయ్ నౌరోజి' కూడ ఆ సమయముననే రాయల్ ఏషియాటిక్ సొసైటీలో మెంబరు. 'నౌరోజి' లండనులో నాటి చిరునామా : 32, Great St. Helen's, E. C.

59. "When the competitive examinations for the Civil service commenced I was asked to examine in Telugu: but I did not undertake this until 1869. The books used are my own publisations alone." (Some Account of the Literary life of C.P. Brown.)

యొక్క స్థితిని గూర్చి విన్న ఆతని సోదరీమణులాతనిని ఇంగ్లండునకు తిరిగి వచ్చి వేయవలసినదిగా తొందరచేయ మొదలుపెట్టిరి. ఆతని వైద్యులుకూడ, ఆరోగ్యము పూర్తిగా భగ్నము కాకపూర్వమే, ఇంగ్లండునకు తిరిగిపోవుట మంచిదని హెచ్చరించిరి. వీటి నన్నింటిని బట్టి, బ్రౌనుదొర స్వదేశమునకు పోవలెనని నిర్ణయించుకొని, ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చెను. ఏప్రిల్ 1855 లో ఆతడు మన దేశమును విడిచిపోవునాటికి; మనదేశములో మరల పదునేడు సంవత్సరములు (మొదటి సెలవు నుండి (1834-1838) తిరిగి వచ్చిన తరువాత) బ్రౌనుదొర ఉండెనన్నమాట ! మొత్తము, మద్రాసు సివిల్ సర్వీసులో ముప్పది ఎనిమిది సంవత్సరము లుండెను. (1817-1855).

బహుముఖ ప్రజ్ఞగల బ్రౌనుదొర కొంత కవిత్వమును గూడ ఇంగ్లీషులో వ్రాసెను. షేక్స్పియర్, కౌపర్, బర్న్స్, బైరన్ మొదలైన వారి రచనలు చదువుట వలన కలిగిన ఉత్సాహములో పద్యములు వ్రాసెను. కాని, వీటిలో చాలవరకన్నియు కాలగతినిచెందినవట[56]! అప్పుడప్పుడాతడు తెలుగుపద్యములను ఆంగ్లీకరించుటయు గలదు. గజేంద్రమోక్షములోని "లావొక్కింతయు లేదు" మొదలైన వాటి కాతడనువాదము చేసెను.

బ్రౌనుదొర తన గ్రంథములను ప్రచురించుటకు, పరిశోధనలు చేయుటకు, తన ధనమును వినియోగించుటయే గాక, ఉత్తమమైన కృషిచేసి, ఆ కృషి ఫలితములను ధనాభావముచే ప్రచురించుకొనలేని వారికి ధనమిచ్చి వాటిని ప్రచురింపజేసెడివాడు. రివరెండు డాక్టరు బెర్నహార్డ్ ష్మిడ్ (Rev. Dr. Bernhard Schmid) క్రైస్తవ మత సంబంధములైన రచనలు కొన్ని తమిళములోచేయగా, వాటి ముద్రణమునకగు (ఒక్కొక్క పుస్తకము 3,000 ప్రతులు) వ్యయమును, బ్రౌనుదొర భరించెను. తెలుగువారికే కాక పాశ్చాత్యులకును ఇట్టి గుప్తదానముల నెన్నింటినో చేసెను.

---

56. "A perusal of Shakespeare and Milton, Cowper and Burns, Scott, Byron and Moore, led me to compose verse, and the propensity lasted for many years : but nearly all I wrote perished." (Some Account of the Literary Life of C. P. Brown.)

మన దేశమునుండి స్వదేశమునకు పోయిన రెండు సంవత్సరములలో బ్రౌను దొర ఆరోగ్యము చక్కబడెను. దృష్టిమాంద్యము కూడ కలుగలేదు. ఉష్ణదేశమైన భారతదేశములో ఉద్యోగముచేసి, స్వదేశమునకు తిరిగివెళ్ళిన ఇంగ్లీషు వారు తమ ఆరోగ్యములు చెడుటకు, భారతదేశ శీతోష్ణస్థితి కారణమని చెప్పుట ఆచారము. కాని, బ్రౌనుదొరను చూచిన వారందరు, ఆతడు భారతదేశము యొక్క వాతావరణమునకు లోనుకాక, ఆరోగ్యముగా నుండెనని చెప్పిరట! బ్రౌనుదొర జీవితము నియమబద్ధమైనదని వారెరుగరు కాబోలు ?

ఇంగ్లండు విశ్రాంతికై పోయినను, బ్రౌనుదొర పనిలేకుండ కూర్చుండ లేదు. ఆతని కృషిని గూర్చి తెలిసిన వారాతనిని కూర్చుండనీయరు. ఇంగ్లండు చేరిన వెంటనే, ఆతనిని లండను విశ్వవిద్యాలయ కళాశాలలో తెలుగునకు ఆచార్యునిగ నియమించిరి[57]. ఇది, ఇంచుమించుగా జీతములేని గౌరవోద్యోగము. తరువాత కొంతకాల మాతడు, రాయల్ ఏషియాటిక్ సొసైటీ కౌన్సిల్ సభ్యుడు[58]. ఆరోగ్యము బాగుగా ఉన్నంతకాలము, బ్రౌనుదొర లండనులో కూడ చాల ఉత్సాహముతో పని చేసినాడు.

తరువాత, సివిల్ సర్వీస్‌నకు 'పోటీ పరీక్ష' లు వచ్చినప్పుడు, బ్రౌనుదొర తెలుగునకు పరీక్షాధికారి అయ్యెను. కాని 1869 వరకు, ఈ పని కాతడు పూనుకొనలేదు. ఈ పరీక్షలో ఉపయోగింపబడిన పుస్తకము లన్నియు ఆతడు ప్రచురించినవే ![59]

---

57. "I was invited to become Professor of Telugu in the London University, and this I accepted......"(Ibidem)

58. సుప్రసిద్ధ దేశభక్తుడైన 'దాదాభాయ్ నౌరోజి' కూడ ఆ సమయమునసే రాయల్ ఏషియాటిక్ సొసైటీలో మెంబరు. 'నౌరోజి' లండనులో నాటి చిరునామా : 32, Great St. Helen's, E. C.

59. "When the competitive examinations for the Civil service commenced I was asked to examine in Telugu: but I did not undertake this until 1869. The books used are my own publications alone." (Some Account of the Literary life of C.P. Brown.)

అతనికి సహాయునిగ ఒక ట్యూటర్ కూడ తెలుగున కుండెను. ఈతడును మన దేశములోనే పుట్టిన వాడగుటచే - విశేషించి తెలుగు దేశమున - మన భాషలను బాగుగా ఎరింగినవాడు[60].

అతడు స్వదేశమునకు పోయిన తరువాత, అచ్చువేసిన పుస్తకములలో 1) కర్ణాటిక్ క్రోనాలజీ (Carnatic Chronology: London, 1863)యును, 2) సంస్కృతము యొక్క ఛందస్సు, సంఖ్యల సంకేతములు (Sanskrit Prosody and Numerical Symbols explained, London, 1869) అనునదియు, ముఖ్యమైనవి. తెలుగు వ్యాకరణమును మూడవ ముద్రణమునకు 1863 లోనే సిద్ధముచేసినాడు. అటులనే, బైబిలును (The Holy Bible) కూడ పూర్ణముగా అనువాదము చేసి యుంచినాడు మిగిలిన గ్రంథములను - ముఖ్యముగా నిఘంటువులను - అవశ్యకతను బట్టి పెంచుచు వచ్చెను. ఇట్లు, వివిధ రంగములలో కృషిని చేయుచునే, తన దగ్గరకు విద్యాభిలాషతో వచ్చిన వారికి సాయము చేయుచునే, కాలము గడిపెడివాడు.

అతని సోదరుని పుత్రిక 'మిరియమ్' సంస్కృతము చదువ నభిలషింపగా (16 ఏండ్ల బాలిక), ఆమెకు దేవనాగరిలిపి నేర్పి, ఆమెను ప్రోత్సహించెను. ఇట్లు రెండు సంవత్సరములు చదివిన తరువాత ఆమెను బెంగాలి నేర్చుకొనుమని చెప్పి, అందుకు తగిన మంచి శిక్షణము ఇచ్చెను. ఇట్లాతని కుటుంబములో చిన్న వారికిని భాషల యందభిమాన మాతడు కల్పించెను.

బ్రౌనుదొర, హిందువుల స్థితిగతులను గూర్చి ఒక ఉపన్యాసమును సిద్ధము చేసి, దానిని వివిధ పట్టణములలో ఇచ్చుచు వచ్చి, ఇంగ్లీషు వారికి భారతీయులను గూర్చి పరిచయము చేసెను.

'రాయల్ ఏషియాటిక్ సొసైటీ'తో చిరకాలము సంబంధమున్న బ్రౌను దొర ఆ సంఘము యొక్క మ్యూజియమ్‌నకు, గ్రంథాలయమునకు చిత్ర విచిత్రములైన వస్తువులను, పుస్తక ప్రతులను బహూకరించుట కలదు. ఈ బహూకరణలకు, ఆ సంఘము తీర్మానము మూలమున, తన కృతజ్ఞతను తెలుపుకొనుటయు

60. "......My friend the present tutor, born in India, is fully competent to the duty. All the work indeed rested with him......" (Ibidem)

కలదు. తెలుగు వారిలో- కావలి వేంకట బొర్రయ్య సోదరుడైన కావలి వేంకట లక్ష్మయ్య కూడ, రాయల్ ఏషియాటిక్ సొసైటీకి బ్రౌను దొర ఉపహారకరణము చేసినప్పుడే, కొన్ని విగ్రహములు బహూకరించెనట. అందువలన బ్రౌనుదొరకు ఎరుగుననుట కవకాశమున్నది.

ఒక పనికి తగిన పాండిత్యము తనకు లేదని తోచినప్పుడుగాని, తలపెట్టిన పనిని విజయవంతముగా కొనసాగించుట కుదరదని తోచినప్పుడుగాని; బ్రౌనుదొర ఆ పనిని చేయుట కంగీకరించెడివాడు కాదు. బ్రౌనుదొర సేకరించిన లిఖిత ప్రతులకు; ఇంగ్లీషులో వర్ణనాత్మకమైన వివరణ ప్రతి పుస్తకమునకు వ్రాయవలసినదిగా గ్రంథములను స్వీకరించిన ప్రభుత్వము కోరగా; తానట్లు వ్రాసినను, అందరికి అర్థమగునట్లు వ్రాయుట - ప్రాచ్య భాషలను గూర్చి తెలియనివారికి- పొసగదని; అతడా పనిని నిరాకరించెను[62]. ఇట్లే, "యోగశాస్త్రము"నకు వివరణ వ్రాయుచున్నప్పుడును, అతనికి తోచి దానిని కూడ పూర్తి చేయలేదు. సంస్కృత పండితుడైన "విల్సన్" దొర కోరిక ప్రకారము; "యోగశాస్త్రము"నకు వివరణము వ్రాయవలెనని సంకల్పించి పండితుల సాయమును పొందగా; వారిలో వారికి అర్థ వివరణమున ఏకవాక్యత కుదరనందున, దానిని కూడ మానుకొనెను[63].

---

61. "From C. P. Brown, Esq., M.R.A.S."
"A painting of a Telugu Lady of Rank; and one representing Ganesa dancing; the latter copied from a bas-relief of the same size at Cotipilly, on the Godavary."
"From Cavelly V. Lutchmiah, C.M.R.A.S."
"Two Baudha Images, in copper, found in the earth in the Chittoor District. Five small Gilt Images of Deities from Rangoon."
"Thanks were ordered to be returned to the respective donors" (The Journal of the Royal Asiatic Society, October 1836-London.)

62. "I could scarcly write such an English account as a total stranger would comprehend, and declined the task."
(Some Account of the Literary Life of C.P. Brown.)

63. "No two books agreed, and no two readers gave the same interpretation." (Ibidem)

బ్రౌనుదొరకు అభిమానమైన విషయము, "యూరపుయొక్క చరిత్ర." ఈ విషయముపై, ఇంగ్లీషు ఫ్రెంచి భాషలలో గల పుస్తకముల నాతడు చాల సేకరించెను. ఆతనికి తత్త్వశాస్త్రమన్నను, శాస్త్రీయ ప్రయోగము లన్నను, అభిమానము హెచ్చు. ఈ సంబంధమైన గ్రంథముల నెన్నింటినో ఆతడు సేకరించెను. లండనులోని ఆతని జీవితము, కేవలము పనినుండి "రిటైరు" అయిన ఉద్యోగి జీవితము కాదు. తన ఆరోగ్యము బాగున్నంత వరకు, ఆతడు భాషా సాహిత్యములు సేవచేయుచునేయుండెను. వైజ్ఞానిక విషయములను గ్రహించుచునే యుండెను. లండనులోని ఆతని ఇల్లు (22, Kildare Gardens; Westbourne Grove, W.), ప్రాచ్యభాషా విద్వాంసులకు కూడలిగా నుండెడిది. భారతీయ భాషలను గూర్చి- ముఖ్యముగా తెలుగును గూర్చి-తెలిసికొనగోరిన వారందరును, ఆతనిని దర్శించెడివారు.

పరిశోధకులకు అలంకార ప్రాయములైన రెండు ముఖ్య లక్షణములు- వ్రాసిన దానిని సోపపత్తికముగ నిరూపించుట, అవశ్యకత లేనిదే వ్రాసినది అచ్చువేయకుండుట- ఆతనికి సహజములైన గుణములు[64]. ఈ లక్షణములవలననే, ఆతని కృషి వైశిష్ట్యమును పొందినది.

ఇంచుమించుగా నలుబది సంవత్సరములు భారత దేశములో నివసించి, ఇంగ్లండునకు వెళ్ళినను, వాతావరణ మందలి మార్పు ఆతని నంతగా బాధింపలేదట! ఇంగ్లండులోని శీతకాలము తన్నంతగా బాధింపలేదనియు, తీరుబడి ఉండి తాను లండనులో నున్నప్పుడెల్ల, తెలుగులో కృషిచేయుచునే యున్నట్లును; ఆతడు తెలిపెను[65]. ఇంత ఆరోగ్యవంతుడైనను, దేహధర్మము ననుసరించి, ఆతనికి డెబ్బది ఏండ్ల ప్రాయమున మరల నొకసారి పక్షవాతము వచ్చినది. కాని, బ్రౌనుదొర మరల తేరుకొనెను. మరల సాహిత్యవ్యాసంగమును కొనసాగించెను. రెండవసారి (1868) పక్షవాతము వచ్చిన తరువాత, తేరుకొని ఆతడింకను పదునారు సంవత్సరములు జీవించి, 1884 లో కీర్తిశేషుడయ్యెను.

---

64. "I always avowed my writings, nor did I ever print unless there seemed a necessity." (Ibidem)

65. "The severity of the winters has never incommoded me. I resumed Telugu reading; merely carrying on the work when I happened to be in London and at leisure." (Ibidem)

బ్రౌనుదొర నిర్వ్యాజీవితమునకు సంబంధించిన విషయములనుగూర్చి మనకంతగా తెలియదు. తాను వ్రాసిన "స్వీయ చరిత్ర"లో కూడ ఈ విషయముల ప్రసంగము తక్కువగా చేసెను. వ్యక్తిగత జీవితమును గూర్చి కూడ ఏమియు చెప్పలేదన వచ్చును. వివాహ ప్రస్తావన లేదు. ఇందువలనను, మన దేశములో జబ్బు చేసినప్పుడు గాని, [illegible] ప్రస్తావన రాక పోవుటచేతను, ఆయనను స్వదేశమునకు వచ్చివేయుమని ఒత్తిడి తెచ్చినవారు తన సోదరీమణులని[66] ఆయనయే వ్రాయుటచేతను బ్రౌనుదొర వివాహము చేసికొనలేదని మనమనుకొన వచ్చును. ఆరోజులలో [illegible] ఇది సర్వసామాన్య విషయమని మనకు తెలియుచున్నది[67].

డబ్బు విషయమున బ్రౌనుదొరకు శ్రద్ధతక్కువ అనియు, ఖర్చుచేయుట తెలిసినంతగా నిలువచేయుట తెలియదనియు తెలియుచున్నది. చాల తరుచుగా "పార్టీలు"-స్త్రీలు పాల్గొనెడి పార్టీలు కూడ-ఇచ్చెడివాడు. అతిథుల సంఖ్య ఇరువదిని మించకున్నను "డబ్బు లెక్క చేయనివాడు" అని తాను పేరుపొందినట్లు ఆయనయే వ్రాసెను.

మొదటి నుండియు అతిథి సత్కారము ఆయన అలవాటు. బ్రౌనుదొర తండ్రి డేవిడ్ బ్రౌను కూడ అతిథులను సత్కరించుటలో ముందంజ వేసెడివాడనియు, కలకత్తాలోని ఆతని ఇల్లు వివిధ ప్రాంతముల నుండి వచ్చిన మిషనరీలతో, ఇతర మిత్రులతో నిండి యుండెడిదని తెలిసికొని యుంటిమి (ఈ పుస్తకములో పుట-33,) తండ్రికంటె, ఉద్యోగముల ద్వారా విశేషముగా ధనమును సంపాదించుచుండెడి కుమారుడు ఇంకను ఎక్కువగా అతిథులను ఆదరించెడి వాడగుట

---

66. "Afterwards my health began to decline; particularly with regard to sleep; and while my sisters pressed me to return to England, my doctor warned me to desist from study and retire while yet free from positive illness". (Ibidem)

67. "Nearly all the unmarried Europeans- ***and few were married in those days***- lived in acknowledged concubinage with native women". (The Good Old Days of Honorable John Company by W.H. Carey, Simla, 1882, Vol. II; Page-63.

వింతకాదు. హోదాలకు తగిన ఇల్లు, ఇంటికి తగిన వస్తుసామగ్రి, వీటికి తగినట్లుగా పాలరాతి శిల్పములు, ప్రశస్త చిత్రములు-బ్రౌనుదొర సంపాదించి పెట్టుకొనెను. వాహ్యాళికి, సంచారములకు పనికి వచ్చెడి రెండు శకటములు, ఆరు గుఱ్ఱములు-ఇవి కూడ ఆయన ఆనాటి హోదాకు చిహ్నములు. ఇంచుమించుగా, జీవిత విధానములో గవర్నరు హోదాను తానునుభవించుచుండినట్లు బ్రౌనుదొర తెలిపెను[68].

ఈ అతివ్యయము వలన బ్రౌనుదొర అనేక కష్టములకు లోనయ్యెను. పుస్తకములు సంపాదించుట, సంపాదించిన వాటిని ముద్రణమునకు సిద్ధము చేయుట, పండితులచే కొన్నింటికి వ్యాఖ్యలు వ్రాయించుట మొదలైన పనులు మానలేదు. ఇప్పటికైనను ఉద్యోగాదులలో అనుకూల పరిస్థితులు రాకపోవునా, అప్పులు తీరకపోవునా అని ఆశలు పెంచికొనినను వీటికి పరిణామముగా అరువదివేల రూపాయల అప్పుమిగిలినదట! దీనిలో సగముకంటె ఎక్కువ వడ్డీయే నట! ఒక ఇంగ్లీషు వర్తకుని "ట్రస్టీ"గా నియమించుకొని ఆతనికి తన జీతము నుండి ప్రతి

---

68. "Being now in comfortable circumstances I resumed my old customs of hospitality: and often had ladies' parties: seldom had more than twenty guests, but was thought lavish and careless of money. My guests were chiefly those who never could return my hospitality. I removed into a large house, or palace, which I soon adorned with a noble gallery of marble statues and seventy oil paintings, chiefly English, Dutch and Italian landscapes: besides more than onehundred other pictures: I had two carriages six horses and all else my station seemed to require: my table was more splendid than that of the governor". (Literary Autobiography of C.P Brown- Editor: Bangorey; Chief Editor : G. N. Reddy; Sri Venkateswara University, Tirupati, 1978; Page-74).

మాసము రెండువేల రూపాయల వంతున కిచ్చి కొన్ని సంస్థలకు ఋణవిముక్తు డాయెను.[69]

బ్రౌనుదొర మొదటి నుండియు "ఖర్చుమనిషి" అగుటవలన కొందరు తెలుగువారి యొద్దకూడ అప్పులు చేసినట్లును. తీర్చిన అప్పుల విషయమునకూడ- తాను వ్రాసిన పత్రములను తిరిగి తీసికొనుట మొదలైన ప్రాథమిక కార్యములలో కూడ- జాగరూకుడు కానట్లును మనకు తెలియుచున్నది. బ్రౌనుదొరకు అంతరంగికుడును, కడపలో ఆయన తన ఇంటిలో నిర్వహించుచుండిన "కాలేజి" (పండితులు గ్రంథములు పరిష్కరించుట మొదలైన కార్యములను నిర్వహించెడి "బంగాళా") యొక్క నిర్వహణమున సాయపడుచుండినవాడును, కడపలో ఉద్యోగమున నున్నవాడును, స్థానికుడును, బ్రౌనుదొరకు మంచి చెడ్డలు చెప్పగల చనువు ఉన్నవాడును అయిన శ్రీ అయోధ్యాపురం కృష్ణారెడ్డి-అప్పటికి తిరుచునాపల్లిలో ఉన్న బ్రౌనుదొరకు-1829 లో

---

69. "Four or five years I had lived in very humble style, giving every farthing to pay first my brahmans and secondly my debts: even when in the greatest difficulties I gave from two (to) three hundred rupees a month to my book schemes; for I lived in hope that the tide would one day turn. When it did turn I had to pay off sixty thousand rupees: of which much more than half was interest".

"My principal creditor was an English merchant. I made him my Trustee and every month paid over two thousand rupees until he had paid every debt I earnestly thanked God for this deliverance and as a fruit of gratitude I made the poor and the needy participate in the comfort I now enjoyed" (Ibidem; Page-72).

మే నెల 13వ తేదీని వ్రాసిన లేఖలోని క్రింది భాగము[70], ఋణవిషయమున బ్రౌనుదొర అంత జాగరూకుడు కాడని తెలుపుచున్నది:

"వోబళరావు దగ్గర తమరు రెండు మూడు మారులు అయివజు తీసుకొని పత్రాలు వ్రాశియిచ్చి వున్నారు. ఆ పైకి కొంత అయివజు చెల్లుయిచ్చివున్నారు. పత్రాలు అన్ని అతని వశ్యానే వున్నవి. లెఖ్ఖచూచుకొని చెల్లు అయివజుకి కొన్ని పత్రాలు వాపస్సు తీసుకొని బాకియింత అయివజు అని లెఖ్ఖచూచుకుంటే యుక్తంగా వుంటూ వున్నది అని వోబళరావు చెప్పుతూ వున్నాడు. అయివజు చెల్లించి వుండిన్ని పత్రాలు వారి వశ్యానే వుండడము యీ కాలములో యేమిన్ని యుక్తంగా అగుపడలేదు".

ఆర్థికమైన చిక్కులలో తాను చిక్కుకొని యున్నను తనకంటె దయనీయమైన స్థితిలో ఉన్నవారికి, పేదవారికి సాయపడుట బ్రౌనుదొరకు సహజమైన లక్షణము. ఆయన చేసిన దానధర్మములు మొదలైన వాటిని గురించి మనకెక్కువ తెలియకపోయినను, పేదవారిని కొందరిని ఆదుకొన్నట్లు ఆయనయే వ్రాసిన "జీవిత కథ" నుండి మరికొన్ని వివరములు తెలియుచున్నవి. ఒక ఇంగ్లీషు వర్తకుని "ట్రస్టీ"గా నియమించుకొని తన అప్పుల నుండి విముక్తి పొందిననాడు బ్రౌనుదొర పొందిన ఆనందమునకు అవధులులేవు. హృదయ పూర్వకముగా భగవంతుని కొనియాడుటయేగాక దాన ధర్మములు కూడ విశేషముగ చేసెను. తన కొలువులోనున్న ఒక ముదుసలి ముస్లిం మునిషీకి వేయి రూపాయలిచ్చుటయేగాక, కుంటివారికి గ్రుడ్డివారికి ప్రతిమాసము పైసలిచ్చుచు వచ్చెను; అప్పులు తీర్చలేక జైలు శిక్ష ననుభవించుటకు పోవుచున్న పదునొకొండుగురునకు, మూడువందల

---

70. బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు: కడప జాబుల సంకలనం-సంశోధన: బంగోరె; పర్యవేక్షణ: జి. యన్. రెడ్డి., శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి - 1977; పుట ౨౮.

ఏబదిఐదు రూప్యముల నిచ్చి వారి అప్పులుతీర్చి వారిని శిక్షనుండి విముక్తులను చేసెను[71].

యౌవనమున మద్యపానాదులు చేసినను క్రమక్రమముగ ఏబదవయేడువచ్చు నాటికి ఆరోగ్య రక్షణమున శ్రద్ధవహించి ద్రాక్షాసార వ్యసనములకు దూరముగ నుండెనని తెలియుచున్నది.[72] చిన్నతనమున వేటలోను, తుపాకి కాల్పులలోను కొన్ని స్వల్పప్రమాదములు జరిగినను అవి అంతగా చెప్పుకోదగినవి కావని ఆయనయే వ్రాసెను. 1845 ఆగస్టులో ప్రమాదకరమైన జబ్బు చేసినది. 1848 జనవరిలో కలరా వంటి జబ్బు వచ్చి తగ్గినది. ఆ సంవత్సరమే డిసెంబరులో అపాయకరమైన జబ్బు చేసినది. 1849 ఏప్రిల్‌లో గుఱ్ఱముమీద నుండి పడుటచే ప్రక్కటెముక ఒకటి, కుడి బొటనవ్రేలు విరిగినవి. ఈ సమయమున అతని నిఘంటువులు అచ్చులోనుండుటచే వాటి ప్రూఫులు దిద్దుటలోను కొన్ని "నోట్సు" వ్రాయుటలోను ఎడమచేతిని ఉపయోగించెనట! 1851లో రెండుసార్లు (మే 9వ తేదీని, నవంబరు 20వ తేదీని) కలరా వచ్చినది. 1853లో ఏప్రిల్ 16వ తేదీని మెదడు జ్వరము వచ్చుటతో ఆరోగ్య సంపాదన కొరకు నీలగిరిపోయి ఆరోగ్యమును బాగుచేసికొనెను. వయస్సు వచ్చినను కంటి చూపు తగ్గలేదు. ("....yet

---

71. "I had dreaded imprisonment: and as one mark of gratitude I bestowed one thousand rupees on an aged Musulman Munshee in my employ: gave one rupee a piece every month to 180 blind, lame and halt, and gave rupees 355 to release eleven debtors from jail". (Literary Autobiography of C. P. Brown- Editor : Bongorey: Chief Editor; G. N. Reddy; Sri Venkateswara University, Tirupati, 1978; Page-72).

72. "Thus I drew towards the close of my fiftieth year. Latterly I had laid aside wine and all such poisons, and now was a teetotaller......Latterly I became more and more sober and during the last year have taken little beyond water" (Ibidem; Page-75).

at the age of fifty my eyes are perfect as regards writing and reading: in which I use no glasses, not even in reading the smallest print...")

తన వ్యక్తిగత జీవితములో తాను చెందిన క్రైస్తవ మతశాఖకు విధేయుడై యుండెను. తానెన్నిపనులలో నున్నను ఆదివారము ఏ పనులుచేయక "సబ్బాత్"ను పవిత్రముగా పాటించినట్లు వ్రాసికొనెను[73]. ప్రొటెస్టెంట్ అయిన బ్రౌనుదొర, కనుక "రోమన్ కేథలిక్" సిద్ధాంతముల విషయమైయున్న వ్యతిరేకతను చాలాసార్లు వ్యక్తము చేసెను[74]. తెలుగుభాషా సాహిత్యములనంత శ్రద్ధతో నధ్యయనము చేసినను బ్రౌనుదొరకు హిందూమత సిద్ధాంతముల విషయమున సద్భావము లేదను విషయము కూడ మనము గ్రహింపవలెను. ("....and the books which I have printed show my opinions regarding that system of idolatry, priest-craft and superstition") కాని అనావశ్యకముగ ఇతరుల నమ్మకములను ఈసడించని సభ్యతగల వ్యక్తి అనికూడ గుర్తింపవలెను.

---

73. "Throughout my Telugu studies, at least, during the last twenty years, I was no sabbath breaker. And when printing my Grammar and Dictionaries I worked hard with my brahmins all the week, but always kept the sabbath holy" (Ibidem, Page-75).

74. ఉదా:, 1833-'34 నుండి మద్రాసునుండి Madras Literary Society యాజమాన్యమున వెలువడుచుండిన Madras Journal of Literature and Science లో (ఈ పత్రిక, మధ్య మధ్య ఆగుచు 1890 వరకు వచ్చినది). విద్యమీద, హిందువుల ఆచార వ్యవహారముల మీద, నమ్మకములమీద, రోమన్ కేథలిక్ ఆరాధనా పద్ధతులమీద ("...and a series of remarks on the Roman Catholic idolatry...") బ్రౌనుదొర వ్యాసములు వ్రాసెను. ఈ విషయమై నెల్లూరులోని ఒక రోమన్ కేథలిక్ బిషప్ (Rev. Fr. J. Aelen) అక్కడినుండి అచ్చయి వెలువడిన (1969) "వేదాంత రసాయనం" అను క్రైస్తవ గ్రంథమునకు ఉపోద్ఘాతము వ్రాయుచు ఇట్లనిరి: "Brown was a staunch Protestant and showed in more than one place his dislike for things Catholic..." (Ibidem; Page-45; Foot Note No. 50).

బ్రౌనుదొరకు పట్టుదలకొంచెము ఎక్కువ. ప్రజలకు న్యాయము చేకూర్చవలెననియు, దోషులను శిక్షింపవలెననియు ఆయన స్థిరముగా నమ్మెను. దీనితోను కొంచెము తొందరపాటు. యౌవనమున అది సహజము గదా! - ఉద్యోగ కాలములోని మొదటి దశాబ్దములో ఆయన ప్రవర్తించినట్లు నిదర్శనములున్నవి. నిర్ణయములు తీసికొను విషయమున [illegible] తొందరపాటుల వలన 18[illegible]లో ఉద్యోగము నుండి బ్రౌనుదొరను అధికారులు "సస్పెండు" చేసిరి. ఈ విషయమై తాను వ్రాసిన "జీవిత చరిత్ర"లో వివరణలు లేవు. 1866 లో లండనులో అచ్చయిన "చరిత్ర"లో క్రింది వాక్యము లున్నవి[75]:

"In discharging my duty as a judge I was zealous and too often rash. An aged judge who shewed me great friendship, predicted in 1825 that I should do great good but injure myself. He on one occasion said 'go on, my friend; you will certainly ruin yourself; but do not fear: I know that God will recompense you".

న్యాయ విచారణచేసి తీర్పుచెప్పునప్పుడు, దోషికి శిక్ష విధించునప్పుడు, చెప్పిన తీర్పును సవరించి మరల క్రొత్త తీర్పులను చెప్పునప్పుడు న్యాయాధిపతి సాధారణముగా పాటింపవలసిన విధులను సావధానుడై పాటింపక పోవుటవలన బ్రౌనుదొరకు చిక్కులు వచ్చినట్లు క్రింది వాక్యములవలన తెలియుచున్నది[76]:

"Meantime I was daily buried at my public duties, chiefly as a judge. Unhappily in the wish to do justice I committed several illegal acts which soon led to my ruin..."

కొన్ని చట్టవిరుద్ధములైన పనులను చేసినను వాటిని స్వలాభము కొరకు చేయలేదనియు, అవి చట్టవిరుద్ధమని తానూహింప కుండుట పొరపాటనియు తాను క్షంతవ్యుడననియు, ప్రభుత్వమునకు తాను పెట్టుకొనిన "అర్జీ"లో వ్రాసి కొనినాడు బ్రౌనుదొర. రాజమహేంద్రవరములోను మచిలీపట్టణములోను న్యాయాధిపతిగ బ్రౌను చేసిన తీర్పులకు పర్యవసానము ఈ "సస్పెన్షన్"

---

75. బ్రౌన్ లేఖలు-సంశోధన: బంగోరె; పర్యవేక్షణ: జి. ఎన్. రెడ్డి; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి-1977; పుట-131.

76. Ibidem, పుట-130, 131.

at the age of fifty my eyes are perfect as regards writing and reading: in which I use no glasses, not even in reading the smallest print...")

తన వ్యక్తిగత జీవితములో తాను చెందిన క్రైస్తవ మతశాఖకు విధేయుడై యుండెను. తానెన్నిపనులలో నున్నను ఆదివారము ఏ పనులుచేయక "సబ్బాత్"ను పవిత్రముగా పాటించినట్లు వ్రాసికొనెను[73]. ప్రొటెస్టెంట్ అయిన బ్రౌనుదొర, నరక "రోమన్ కేథలిక్" సిద్ధాంతముల విషయమైయున్న వ్యతిరేకతను చాలాసార్లు వ్యక్తము చేసెను[74]. తెలుగుభాషా సాహిత్యములనంత శ్రద్ధతో నధ్యయనము చేసిన బ్రౌనుదొరకు హిందూమత సిద్ధాంతముల విషయమున సద్భావము లేదను విషయము కూడ మనము గ్రహింపవలెను. ("....and the books which I have printed show my opinions regarding that system of idolatry, priest-craft and superstition") కాని అనావశ్యకముగ ఇతరుల నమ్మకములను ఈసడింపని సభ్యతగల వ్యక్తి అనికూడ గుర్తింపవలెను.

---

73. "Throughout my Telugu studies, at least, during the last twenty years, I was no sabbath breaker. And when printing my Grammar and Dictionaries I worked hard with my brahmins all the week, but always kept the sabbath holy" (Ibidem, Page-75).

74. ఆనాడు, 1833-'34 నుండి మద్రాసునుండి Madras Literary Society యాజమాన్యమున వెలువడుచుండిన Madras Journal of Literature and Science లో (ఈ పత్రిక, మధ్య మధ్య ఆగుచు 1890 వరకు వచ్చినది). విద్యమీద, హిందువుల ఆచార వ్యవహారముల మీద, నమ్మకములమీద, రోమన్ కేథలిక్ ఆరాధనా పద్ధతులమీద ("...and a series of remarks on the Roman Catholic idolatry...") బ్రౌనుదొర వ్యాసములు వ్రాసెను. ఈ విషయమై నెల్లూరులోని ఒక రోమన్ కేథలిక్ బిషప్ (Rev. Fr. J. Aelen) అక్కడినుండి అచ్చయి వెలువడిన (1969) "వేదాంత రసాయనం" అను క్రైస్తవ గ్రంథమునకు ఉపోద్ఘాతము వ్రాయుచు ఇట్లనిరి: "Brown was a staunch Protestant and showed in more than one place his dislike for things Catholic..." (Ibidem; Page-45; Foot Note No. 50).

బ్రౌనుదొరకు పట్టుదలకొంచెము ఎక్కువ. ప్రజలకు న్యాయము చేకూర్చవలె ననియు, దోషులకు శిక్షించవలెననియు ఆయన దృఢముగా నమ్మెను. దీనితోడు కొంచెము తొందరపాటు. యౌవనమున ఇది సహజముగదా! - ఉద్యోగ కాలము లోని మొదటి దశాబ్దములో ఆయన ప్రదర్శించినట్లు నిదర్శనములున్నవి. నిర్ణయములు తీసికొను విషయమున కడిన తొందరపాటుల వలన 1834లో ఉద్యోగము నుండి బ్రౌనుదొరను అధికారులు "సస్పెండు" చేసిరి. ఈ విషయమై తాను వ్రాసిన "జీవిత చరిత్ర"లో వివరణలు లేవు. 1866 లో లండనులో అచ్చయిన "చరిత్ర"లో క్రింది వాక్యము లున్నవి[75]:

"In discharging my duty as a judge I was zealous and too often rash. An aged judge who shewed me great friendship, predicted in 1825 that I should do great good but injure myself. He on one occasion said 'go on, my friend; you will certainly ruin yourself; but do not fear: I know that God will recompense you".

న్యాయ విచారణచేసి తీర్పుచెప్పునప్పుడు, దోషికి శిక్ష విధించునప్పుడు, చెప్పిన తీర్పులను సవరించి మరల క్రొత్త తీర్పులను చెప్పునప్పుడు న్యాయాధిపతి సాధారణముగా పాటింపవలసిన విధులను సావధానుడై పాటింపక పోవుటవలన బ్రౌనుదొరకు చిక్కులు వచ్చినట్లు క్రింది వాక్యములవలన తెలియుచున్నది[76]:

"Meantime I was daily buried at my public duties, chiefly as a judge. Unhappily in the wish to do justice I committed several illegal acts which soon led to my ruin...".

కొన్ని చట్టవిరుద్ధములైన పనులను చేసినను వాటిని స్వలాభము కొరకు చేయలేదనియు, అవి చట్టవిరుద్ధమని తానూహింప కుండుట పొరపాటనియు తాను క్షంతవ్యుడననియు, ప్రభుత్వమునకు తాను పెట్టుకొనిన "అర్జీ"లో వ్రాసి కొనినాడు బ్రౌనుదొర. రాజమహేంద్రవరములోను మచిలీపట్టణములోను న్యాయాధిపతిగ బ్రౌను చేసిన తీర్పులకు పర్యవసానమున ఈ "సస్పెన్షన్"

---

75. బ్రౌన్ లేఖలు-సంశోధన: బంగోరె; పర్యవేక్షణ: జి. ఎన్. రెడ్డి; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి-1977; పుట-131.

76. Ibidem, పుట-130, 131.

జరిగినది. ("....removed for arbitrary and illegal proceedings as Asst. Judge of the Auxiliary court and Acting Judge of the Zilla court" - Fort St. George Gazette) ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లకు వ్రాసికొనిన "మెమోరియల్"లో ఈ విషయమిట్లు బ్రౌనుదొర ప్రథమ పురుషలో చెప్పెను[77]:

"Your memorialist will now proceed with great grief to the cause of his removal, by one order, from both these appointments".

"And the two acts for which he has been removed are, Punishing by fine and imprisonment the various persons found guilty of fraud to an extent which is judged to be greater than the regulations authorize. And secondly revising certain judgements in civil cases in which he was assured he had been at first misled".

"He acknowledges with the deepest sorrow that in point of routine he was wrong....The utmost that is proved against him is error....your memorialist can shew most clearly that no corrupt or dishonest motive is attributed to him, and that it is admitted he has been a hard working public servant....".

1834 లో నవంబరు 26 వ తేదిని ఈ మెమోరియల్ బ్రౌనుదొర వ్రాసికొనెను. అధికారులు చేసిన ఈ పని వలన తాను సర్వనాశనమగుట తథ్యమని మనవి చేసికొనెను.[78]

"The reference to the Honorable Court puts him out of employ for at least a year, and involves his total ruin, as he acknowledges that his endeavours in the pursuit of

---

77. Literary Autobiography of C. P. Brown - Editor : Bangorey; Chief Editor: G.N. Reddy; Sri Venkateswara University, Tirupati. 1978; Pages-127, 128.

78. Ibidem Page-129.

his plans (now involved in his ruin) for cultivating the literature of the people among whom he lived, have engrossed all the small means he had collected and he is now left, after seventeen years, laborious employment, completely destitute".

తాను పదునేడు సంవత్సరములు (1817-1834) ఇండియాలోనే యుండి సెలవు తీసుకొనకుండ పనిచేసి యుండుటచే, మూడు సంవత్సరములు సెలవు తీసికొని స్వదేశమునకు పోవుటకు అర్హత సంపాదించి యుండుటచే ఆ సెలవు ఇప్పించ వలసినదిగా అర్జీ పెట్టుకొనెను. ఆ సెలవు డిసెంబరులో లభింపగా[79] ఇంగ్లాండు పోవుటకు ఏర్పాటులన్నియు పూర్తిచేసికొని డిసెంబరు 17 వ తేదిని "కోరంగి" రేవులో పడవనెక్కెను. లండనులో సెలవులో ఉన్నంతకాలము సంవత్సరమునకు 500 పౌనులు అలవెన్సుగా కంపెనీ వారిచ్చిరి ("....which gave me 500 pounds a year for three years") లండనులో నున్నప్పుడు కూడ సాహిత్యములలో కృషి మానలేదు. భారతీయ భాషలకు సంబంధించినంతవరకు లండనులో బ్రౌనుదొర చేసిన ముఖ్యమైన కృషులు మూడు. మొట్టమొదటిది - తెలుగు వ్యాకరణ రచన. 1835 నవంబరు 28 వ తేదిని తాను వ్యాకరణ రచనను ప్రారంభించినట్లును; దీనికి ఉపోద్ఘాతము 1837 నవంబరు 10 తేదీని, తన తిరుగు ప్రయాణములో ఓడ సముద్రములో పయనించుచుండగా వ్రాసినట్లును బ్రౌనుదొర వ్రాసికొనెను[80]. రెండవది - తెలుగు, ఇంగ్లీషు నిఘంటువు (ఎనిమిది వాల్యూములు) పునర్నిర్మాణ కార్యక్రమమున చిత్తు ప్రతిని తయారు చేయుట. దీనిని లండనులో మే 20 వ తేదిని 1836 లో ముగించినట్లు వ్రాసికొనెను[81]. మూడవది — ప్రొఫెసర్ రోసెన్ కోరికపై సంస్కృత చ్ఛందస్సు మీద వ్యాస

---

79. "C.P. Brown has been permitted to proceed on private affairs to Europe or furlough with the absentee allowance" (Fort. St. George Gazette ; Dec. 3, 1834.)

80. "I began to write this volume at Walton Hall, Derbyshire, 28th, Nov. 1835".
ఉపోద్ఘాతము "....at sea on 10th November 1837".

81. "....still left me daily some hours of leisure ; which I occupied in completing a transcript of the Dictionary". "....finished in London 20th May 1836".

రచన. ఇది, ఇంచుమించుగా వెంటనే 1887 లో "ఏషియాటిక్ జర్నల్" లో రెండు సంపుటములలో (మే. అగస్టు) ప్రకటితమైనది. కాలక్రమమున దీని పునర్ముద్రణము విస్తృత గ్రంథ రూపముగ వెలువడినది (1869).

లండనులో ఉన్నంత కాలములో బ్రౌనుదొర చేసిన ఇంకొక ముఖ్యమైన పని అక్కడి వివిధ గ్రంథాలయములలో నున్న లిఖిత ప్రతులను క్రమబద్ధమైన పద్ధతిలో అమర్చుట. ప్రొఫెసర్ విల్సన్ కోరిన మీదట "ఇండియా హౌస్ లైబ్రరీ" (India House Library) లో నున్న తెలుగు, కన్నడ లిఖిత ప్రతులకు ఒక కేటలాగును తయారుచేసెను. బ్రిటిష్ మ్యూజియములోను, బోడ్లియన్ లైబ్రరిలోను చిర కాలము నుండి యున్న కొందరు లాటిన్ కవుల లిఖిత ప్రతులను సరిదిద్దెను.

ఇండియాలో ఉద్యోగము నుండి "సస్పెండ్" చేసిన తూర్పిండియా కంపెనీ అధికారులే లండన్‌లో గ్రంథాలయములను చక్కబెట్టుటలో సాయపడిన బ్రౌను దొరను అభినందించుచు తీర్మానము చేసిరి[82]! తన ఉద్యోగమునకు సంబంధించిన గొడవలను సరిదిద్దుకొనుటకు వచ్చిన బ్రౌనుదొరకు లండన్‌లో కూడ భాషా సాహిత్య సేవ తప్పలేదు! ఆయన ఆనందముతోడనే ఈ బాధ్యతను స్వీకరించినా డనుటలో సంశయము లేదు.

ప్రొఫెసర్ విల్సన్ కోరిక ననుసరించి "యోగశాస్త్ర" విషయములను గ్రహించుటకై శాక్త సిద్ధాంతాధ్యయనమునకు వీర శైవులయిన జంగముల

---

82. "I was also invited to assist in collating antique manuscripts of some Latin poets in the British Museum and Bodleian Libraries. And I examined the Telugu and Kannadi manuscripts stored up in the India House Library : of these I framed a Catalogue at the request of Professor Wilson : for which the Honourable Court in March 1837 bestowed upon me their thanks". (Some Account of the Literary Life of C. P. Brown.)

సాహిత్య తత్త్వ వివేచనమునకు బ్రౌనుదొర లండనులో నుండగనే శ్రీకారము చుట్టెను[83].

లండనులో నున్నప్పుడు చేసిన ప్రయత్నముల వలన, వచ్చిన "కేసు"లలో శిక్షకు తగినంత దోషములు లేకుండుట వలన, తూర్పిండియా కంపెనీ అధికారులు బ్రౌనుదొరపై అమలు జరిగిన "సస్పెన్షన్" రద్దుచేసినారు. ఈ విధమైన ఆర్డరు పొంది, బ్రౌనుదొర 1838 జనవరి 7వ తేదీని మరల మద్రాసువచ్చి ఉద్యోగములో చేరెను[84] కాని, న్యాయ శాఖలోను, విత్తశాఖలోను ఉద్యోగ మీయరాదను ఆంక్షను విధించినట్లున్నది ఇందువలన తనకు చాల నష్టము వచ్చుచున్నదనియు, భారతదేశము వచ్చిన వెంటనే మద్రాసులో ప్రభుత్వము వారిచ్చిన "ఫార్సీ అనువాదకుని ఉద్యోగము" చాల చిన్నదనియు, కంపెనీ అధికారులకు 1838 లో ఆగస్టు 19వ తేదీని బ్రౌనుదొర మనవి వ్రాసికొన వలసి

---

83 "I was counselled by Prof. Wilson, when I was his guest at oxford in 1839 to pursue and explain the SACTYA mysteries....the learned Professor Wilson did me the honour to desire me to obtain further information on points which remained very uncertain for want of sufficient enquiries made in the peninsula of India. On returning to Madras, I accordingly resumed an enquiry regarding the Jangams..."

("On the Creed, Customs and Literature of the Jangams C P. Brown. The Madras Journal of Literature and Science; Vol. x p. 145 January, 1840.")

84 "C. P. Brown Esq Senior Merchant on the establishment, has reported his return to this presidency on the 7th instant, with the permission of the Honourable Court of Directors". (The Fort St. George Gazette; January 9, 1838.)

వచ్చినది[85]. కాని దీనివలన అంత ప్రయోజనము కలుగలేదు.

పదునేడు సంవత్సరముల తరువాత లండను పోవుటవలన - బంధు మిత్రులను కలిసికొనుట, సరస సల్లాపములు, పర్యటనలు, ఇంగ్లీషు నాటకముల ప్రేక్షకత్వము మొదలైనవన్నియు సమకూరి బ్రౌనుదొరకు కొంత చిత్త శాంతి ఏర్పడినది. 1838 లో తిరిగి వచ్చిన తరువాత ఇంకొక పదునేడు సంవత్సరములు ఇండియాలో (1855) నివసించుటకు తగిన ఉత్సాహము లభించినదనవచ్చును. కాని, బ్రౌనుదొర వంటి వాని విషయమున-తెలుగు భాషా సాహిత్యముల కృషిని పెంచిన వాని విషయమున-ఇంగ్లండులో నుండుట ఆహ్లాదకరమో ఇండియాలో నుండుట ఆనందదాయకమో నిర్ణయించుట నిజముగా కష్టమైన విషయము !

మనకు, బ్రౌనుదొర వ్యక్తిత్వము, పాండిత్యము మొదలైన విషయములను గురించిన ప్రత్యక్ష జ్ఞానము - రివరెండ్ బిషప్ రాబర్ట్ కాల్డ్వెల్

---

85. "The final order passed in England regarding your memorialist cut him off from being again employed in the Revenue and Judicial branches of the service, in which he had served for seventeen years...." .

"...And the employ granted to him at the Presidency by his Lordship the Governor, was that of Persian translator on four hundred rupees pay per month. This appointment required residence at Madras where the same sum is worth little more than half of what it would be up the country...."

"....That punishment however involves his total ruin, after a long period of service....He therefore humbly prays that the order passed in his case may be annulled and that he may be restored to his place in the civil service by being again rendered capable of employment in the Revenue or Judicial line..."

(Literary Autobiography of C. P. Brown - Editor: Bangorey; Chief Editor: G.N. Reddy, Sri Venkateswara University, Tirupati-1978; Pages-129, 130.)

(Rev. Dr. Bishop Robert Caldwell, 1814-1891) వ్రాయగా ఆయన అల్లుడు రివరెండ్ జె. ఎల్. వైట్ (Rev. J. L. Wyat) సంపాదించి 1878, 1894 లలో ముద్రించిన "బిషప్ కాల్డ్వెల్ జ్ఞాపకములు (Reminiscences of Bishop Caldwell) అను గ్రంథమువలన తెలుగుచున్నది. 1887 లో ఆగస్టు 30 వ తేది లండను నుండి ఇండియాకు తిరిగి వచ్చుచున్న బ్రౌనుదొరకు "మేరీ యాన్" (Mary Ann) ఓడ మీద, ఇండియాకు మొదటిసారి వచ్చుచున్న బిషప్ కాల్డ్వెల్ తో పరిచయమయ్యెను. అప్పటికి బ్రౌనుదొర వయస్సు నలుబది సంవత్సరములు. పదునేడు సంవత్సరములు ఇండియాలో నివసించి ఇక్కడి భాషలతో-ముఖ్యముగా తెలుగుతో-మంచి పరిచయమున్న వాడు బ్రౌనుదొర. సెలవు మీద లండనుపోయి తన ఉద్యోగమునకు సంబంధించిన సమస్యను పరిష్కరించుకొంటినను ఉత్సాహముతో బ్రౌనుదొర ఉండెను. ఇంక కాల్డ్వెల్ అన్ననో ఇరువది నాలుగు సంవత్సరముల వయస్సులో క్రైస్తవ మత ప్రచారము చేయవలెనను పట్టుదలతో మిషనరీగా భారతదేశమునకు వచ్చుచుండెను[86]. భారతదేశమును గురించిన ప్రథమ పరిజ్ఞానము ప్రత్యక్షముగా బ్రౌనుదొర ద్వారా లభించుచున్నదను కుతూహలముతో బిషప్ కాల్డ్వెల్ ఉన్నను, బ్రౌనుదొరను మెచ్చుకొను విషయమున గాని తెగడు విషయమునగాని జంకు గొంకులు ఉండవలసిన అవసరములేనివాడు. కనుక, ఈయన అభిప్రాయములకు చాల విలువలేదు. అభిప్రాయములను వ్యక్తము చేయుటలో కూడ మిగుల మోటము లేనివాడు.

రివరెండ్ డాక్టర్ బిషప్ రాబర్ట్ కాల్డ్వెల్ తమిళదేశములో చేసిన కృషి, ద్రావిడ భాషలకు ఆయన చేసిన కృషి గణనీయములైనవి. ఆయన వ్రాసిన "ద్రావిడ భాషల తులనాత్మక వ్యాకరణము" (A Comparative Grammar of the Dravidian or South Indian Family of Languages

86. "Caldwell was a Scotsman, While studying in Glasgow he was introduced to Comparative Philology.... At Dublin he learnt art and painting... At the age of 20 he became a Missionary. He passed the B A; and was ranked first........During the voyage to India he got acquainted with C. P. Brown - of the Madras Civil Service...." (The Contribution of European Scholars to Tamil by Dr. K. Meenakshi Sundaram, University of

st Edition) Harrison ; London - 1856 ) తెలియని విద్యాంసు
కరు. ప్రఖ్యాత తమిళ విద్వాంసులైన ఆచార్య ఆర్. పి. సేతు పిళ్లైగారు
ల్డ్వెల్ అయ్యర్" (Caldwell Aiyer) అను పేరుతో ఆయన జీవిత చరిత్ర
నారు[87].

డాక్టర్ కాల్డ్వెల్ 1838 జనవరిలో బ్రౌనుదొరతో పాటు మద్రాసులో
గెను. మద్రాసు వచ్చిన వెంటనే రివరెండ్ డాక్టర్ జి. యు. పోప్
) ఏప్రిల్ 24-1908 ఫిబ్రవరి 11), రివరెండ్ మిరాన్ విన్స్లో (1789
ర్ 11-1864 అక్టోబర్ 22), జాన్ ఆండర్ సన్ (స్కాట్లాండ్ నకు చెందిన
టేరియన్ మిషనరీ), హెన్రీ బవర్ (యూరేషియన్) మొదలైన వారిని
సెను. తరువాత మద్రాసు నుండి కాలినడకను 1814 లో తిరునల్వేలి
తాను చూచిన తమిళ ప్రాంతముల నిట్లు వర్ణించెను : [88]

"My next stay was at Tarjore. On the way I lost no
tunity of examining the great Hindu Temples of the
re Country and the neighbouring districts especially
mbaram, the most sacred Siva Temples and Tanjore
in some respects, the most imposing temple in South
I was Sufficiently acquainted with Hinduism and
archaeology to understand and appreciate much of
saw."

మార్గమధ్యమందు చాలమంది మిషనరీలను కలిసికొనుచు వారి అనుభవము
గహించుచు కాల్డ్వెల్ ప్రయాణముచేసి "ఇడయం గుడి"లో స్థిరపడెను.
ములో మంచి జ్ఞానముండి కాల్డ్వెల్ నకు సమీపమునవేయున్న ఎడ్వర్ట్
క్ ఈయనకు చాల సాయపడెను. రివరెండ్ కాల్డ్వెల్ "ఇడయం గుడి"
టికి ఆ ప్రాంతమంతయు "చవిటి పఱ్ఱ"గా తాటిచెట్లతో నిండి ఉండెను.
బి త్రవ్వించి, చెట్లు నాటించి, రోడ్లు వేయించి, చిన్న చిన్న ఇండ్లు కట్టించి
ంతమును రివరెండ్ కాల్డ్వెల్ వాసయోగ్యముగా చేసెను. తనకొక ఇల్లు

---

Caldwell Aiyer (The life and work of Rev. Robert
Caldwell) by R. P. Sethu Pillai; II Edition - 1948

eminiscences of Bishop Caldwell-Editor : Rev. J. L.
Yatt. (Addison & Co; Madras - 1873 & 1894)
ges-70, 71.

కట్టించుకొనెను. ఒక చర్చిని నిర్మింపజేసెను. ఆ ప్రాంతమున పాఠశాలలు పెట్టించెను. తన పలుకుబడిని వినియోగించి "ఇడయం గుడి" వంటి చిన్న ఊరికి 1886 లో మద్రాసు గవర్నరు దంపతులను లార్డ్ నేపియర్, లేడి నేపియర్ లను రప్పించెను. "ఇడయం గుడి" యందు బిషప్ కాల్డ్వెల్ నకు ఎంత అభిమానమనగా, వియన్నాలో జరిగిన ఒక ప్రదర్శనమునకు "ఇడయం గుడి" ఇసుకను కొంత ప్రదర్శన వస్తువుగా పంపెనట[89]!.

బిషప్ కాల్డ్వెల్ భార్య పేరు "ఎలిజా". ఆమె రివరెండ్ చార్లెస్ మాల్ట్ అను లండను మిషన్ సొసైటీకి చెందిన ఆయన కూతురు. ఆయన "నాగర్ కోయిల్" లో ఉండెడివాడు. వివాహము నాటికి బిషప్ కాల్డ్వెల్ నకు ఇరువది తొమ్మిది సంవత్సరముల వయస్సు. "ఎలిజా" నాగర్ కోయిల్ లో స్కూలునకు వెడలుటచే వ్యావహారిక తమిళము బాగుగావచ్చును. ఇది ఆమె భర్తకు చాల నుపయోగించెను. "ఇడయం గుడి" లోని బాలికా పాఠశాలలో ఆమె అధ్యాపకురాలు. ఆయనకు ఆమెకు ఇద్దరు కొడుకులు ఇద్దరు కూతుళ్ళు. ఆయన తన జీవిత కాలములో ఇంగ్లండు మూడు మారులుపోయెను. జీవితాంతమునకు ఆయన తన కూతురు మిసెస్ వైట్, కొడైకెనాల్ లో నుండుటవలన అక్కడికిచేరెను. 1891లో అక్కడనే చనిపోగా శవమును "ఇడయం గుడి"కి తెచ్చి ఖననము చేసిరి.

తన జీవితములో ఇంత సాధించిన బిషప్ కాల్డ్వెల్ 1837లో బ్రౌనుదొరను ఓడలో కలిసికొను నాటికి ఇరువది మూడు, ఇరువది నాలుగు సంవత్సరముల

---

89. "Caldwell settled in Idayangudi. It was a very dry place strewn with palm trees. Caldwell changed it into an inhabitable Place. Wells were dug, shady trees planted, and roads laid. Small Convenient houses were built. He built a house for himself and a beautiful Church...In 1886, the Governor of Madras, Lord Napier and Lady Napier visited Idangudi...For the Vienna Exhibition, Caldwell sent as an exhibit a little sand from "Idangudi". (The Contribution of European Scholars to Tamil by Dr. K. Meenakshi Sundaram, University of Madras; 1974. Page-35.)

వయస్సులో నుండి భారత దేశమునకు సంబంధించిన విషయములను సాధ్యమైనంత విపులముగ గ్రహింపవలెనని యుండెను. వారిరువురు కలిసి ఓడలో ప్రయాణము చేసిన నెలలలో బిషప్ కాల్డ్వెల్‌ను గురించి బ్రౌనుదొర ఏమనుకొనెనోగాని, బిషప్ కాల్డ్వెల్ మాత్రము "ఎక్స్‌రే" కనులతో చూచినట్లు బ్రౌనుదొరను గురించి తన అభిప్రాయములను తెలిపెను. ఆవి బ్రౌనుదొర ప్రతిభా వ్యుత్పత్తులను, లోపములను కన్నులకు కట్టినట్లు వివరించును.

ఒక్కముక్కలో బ్రౌనుదొరను "My restless 'Pandit' Mr. Brown" అని బిషప్ కాల్డ్వెల్ వర్ణించి ఆయన రూపమును మన ఎదుటపెట్టెను. 1887లో "జర్నల్" రూపమున బ్రౌనుదొరకు తనకు జరిగిన కలయికను బిషప్ కాల్డ్వెల్ వెలువరించెను. తన యొద్ద తెలుగు సంస్కృతములను చదువుకొనుడని బ్రౌనుదొర బిషప్ కాల్డ్వెల్‌కు హితోక్తి పలికెను. తాను తమిళ దేశమునకు మిషనరీగాపోవుచుండుటచే తనకు తెలుగు అనావశ్యకమనియు సంస్కృతము నేర్చుకొందుననియు ఆయన పల్కి సంస్కృతమును ప్రారంభించెను. దీనివలన తనకు భవిష్యత్కాలములో లాభము జరిగినదనియు తమిళ శబ్దముల ఉచ్చారణలో కష్టములు తగ్గి వాటి ఉచ్చారణ సులభమయ్యెననియు వ్రాసెను. ఇదిగాక, భారతీయ భాషల, విజ్ఞాన విషయముల యందు బ్రౌనుదొరకున్న ఉత్సాహము కొంత తనకు కూడ సంక్రమించినదనియు ఆయన వ్రాసెను[90].

---

90. "He offered to teachme Telugu, but as I was going to be Missionary in the Tamil Country, I declined. He was also, however, a good Sanscrit s-holar...I was, therefore, glad to come to a compromise with him by learning Sanscrit from him instead of Telugu. The amount of Sanscrit I then learnt, was not very great, it is true, but such as it was, it formed a good foundation for subsequent study and has been of great advantage to me all through life. I got over in this way, without knowing it, most of the difficulties connected with Tamil Pronounciation, and I imbibed from my teacher some of the enthusiasm for Indian learning with which he wcs filled". (Reminiscences of Bishop Caldwell).

బ్రౌనుదొరను కలిసిన వెంటనే ఆయన పాండిత్యవిశేషములకు భారతదేశమును గూర్చి ఆయనకు గల పరిజ్ఞానమునకు బిషప్ కాల్డ్వెల్ ముగ్ధుడయ్యెను. ఆయన సంభాషణా చాతుర్యమునకు దిగ్భ్రాంతుడై నమ్రుడయ్యెను. ఆయనకు వచ్చిన భాషలు వాటిని గురించి ఆయనకు తెలిసిన విషయములు, ఆయన జ్ఞాపకశక్తి మొదలైన వన్నియు బిషప్ కాల్డ్వెల్‌ను ఆశ్చర్యచకితుని చేసెను. అంతటి ప్రతిభావంతుని తానంతకు పూర్వము కలియలేదని ఇట్లు వ్రాసెను: [91]

"One of my fellow passengers was Mr. C.P. Brown, of the Madras Civil Service, the great Telugu scholar.......His talents were good, his memory retentive, his perseverance indomitable; and thus with an insatiable thirst for knowledge and a constitution able to hold out under any exertions, it is the less wonderful that he should have amassed such stores of information;that to omit Mahrattha, Persian, Arabic, Syriac, Hebrew, Italian, of which languages, respectively, his knowledge is by no means contemptible, he should be critically acquainted with Sanscrit and Telugu and Hindustani, Greek, Latin and French; and that besides translating and editing a good deal of Indian literature, he should have written a Telugu prosody,a Sanscrit prosody, a Telugu Grammar in quarto and Telugu Dictionary unpublished in eight volumes quarto. Though he is scarcely yet forty years of age, and though during the last twenty years he has filled the offices, in turn, of Collector, Magistrate

---

91. Ibidem.

and Judge-no sinecure in a country like India- by dint of determination, and a dogged sort of enthusiasm he has done all this; and at the same time acquired a very respectable knowledge of English literature.......I never met with any person and seldom have I heard of any who had such an all-grasping, all retaining memory. Not only the Greek and Latin poets will he quote by the hour, if any one will listen; but even our Scotch poets he knows word by word......."

బ్రౌనుదొర పాండిత్యమును, భాషాపాటవమును ఇంతమెచ్చుకొన్న బిషప్ కాల్డ్వెల్, ఆయన లోపములను ఎత్తిచూపుటలో సంకోచ పడలేదు. బ్రౌను దొరకు విషయ పరిజ్ఞానమున్నంతగా వివేచనలేదని వ్రాసెను. పాండిత్య ప్రకర్ష, ప్రదర్శనా కుతూహలము, మొండిపట్టుదల ఛాందసత్వము మొదలైన లక్షణములు బ్రౌనుదొరలో ఉన్నవనియు, దానికి కారణము, ఆయన ఎప్పుడు తన కంటె తక్కువ స్థాయిలో ఉన్న వారితో నిత్యసహవాసము కలిగి యుండుట మొదలైన వాటిని పేర్కొనెను. చక్కగా చదువుకొనిన వాడైనను, మంచి ధారణ కల వాడైనను బ్రౌనుదొర కంఠస్థముచేసినవి అంత ఉన్నతమైన భావములుకలవికావు. బ్రౌనుదొర విరుద్ధ విషయములకు కూడలి అనియు, కొంతవరకు, ఆయన సంభాషణలు ఉల్లాసభరితములు కావనియు బిషప్ కాల్డ్వెల్ బ్రౌనుదొర విషయమున వ్రాసెను. ఆయనతో మాటలాడుట కష్టమనియు, సంభాషణ ఎప్పుడును ఒక

వైపు నుండి (ఆయన వైపు నుండి) ఉండుననియు ఇట్లు వ్రాసెను : [౯౨]

"...I could not be long in his company without discovering that whilst his knowledge was extraordinary his judgement could not always be depended upon..."

"...But both pedantic and eccentric he is beyond all doubt..."

"....Had he been educated at one of the Universities and been all alone in the company of men of real learning and abilities;....his love of display would have been checked.... But having been in great part self-educated, and afterwards been chiefly in the company of his inferiors in talent and acquirements- those among whom he could lord it-.... the weak points in the mental character swelled out to a large development and those weeds of pedantry, idealism and overbearing dogmatism...were permitted to spread and luxuriate..."

"...It is a pity, however, that he had not made a better selection, both in reading and in committing to memory; for he seems often to have neglected the valuable and chosen the worthless..."

"....I did not know, in short, that my new friend was the completest paradox that I had ever heard of..."

"....I think one must have had nerves of iron and no ordinary share of patience....to weather a conversation with him- if indeed that can be called, with any accuracy, a conversation, which is like Irish reciprocity- all on one side..."

"....I thought him a bore of the first magnitude...."

---

౯౨. Ibidem.

బ్రౌనుదొరలోని - తనకు కనబడిన - కొన్ని లోపముల నిట్లు నిర్దాక్షిణ్యముగ బిషప్ కాల్డ్వెల్ వ్యక్తము చేసినను, ఇది వ్రాయుటకు కారణము ఆయన లోపముల నెత్తి చూపుటకు గాదనియు పూర్ణముగా బ్రౌనుదొర వ్యక్తిత్వమును ప్రదర్శించుటమే తన లక్ష్యమనియు వ్రాసెను. ఆయన వ్యక్తిగతముగ తన విషయమున చూపిన ఆదరాభిమానములను చాల మెచ్చుకొనెను. బ్రౌనుదొరలో దుర్మార్గమున్నచో తానాయనను గూర్చి వ్రాసెడి వాడను కాననియు, ఆయన నైతిక లక్షణములు తన్నాకర్షించెననియు బిషప్ కాల్డ్వెల్ తెలిపెను. ఆయన పూర్ణరూప చిత్రణము వలన మన హృదయములలో - ఆయన మంచితనము, సాయము చేయు స్వభావము, సుగుణ సంపత్తి అవగతములై - ఆయన యందు మనకు గౌరవము పెరుగునని బిషప్ కాల్డ్వెల్ వ్రాసెను :[98]

"I have not alluded to Mr. Brown with the intention of doing him the slightest jnjury. Were there nothing else to hinder me from doing so, the kindness and attention he has shown me would be a hindrance..." "...Had it been a character in which evil predominated, I should not have made the attempt; but the unaffected amiableness possessed by the very individual who is such a sceptic and such a pedant; such is the combination of moral virtues, with intellectual vices in his strange character, that a faithful portrait must give rise to respect, esteem as well as wonder...." (Ibidem)

ఇవన్నియు వ్రాసినను ఇంకను తృప్తిలేక, బ్రౌనుదొరను గూర్చి "ఆయనకు ఆయనయే సాటి" అని వ్రాసి బిషప్ కాల్డ్వెల్ తృప్తిపడెను:

"....I think I have never met his parallel for a heterogenous mixture of sound learning and pedantry, wit and thoughtlessness, amiability and snappish dogmatism, knowledge of the world and credulity, acuteness in setting a question by a single sentence and inability to string three sentences together logically. In these respets "none but himself can be his parallel...."

---

98, Ibidem,

బ్రౌనుదొర పాండిత్య వైభవమునకు దిగ్భ్రాంతి చెంది మెచ్చుకొనిన బిషప్ కాల్డ్వెల్, ఆయన లోపములను సంకోచమనునది లేక విమర్శించి వ్రాసిన బిషప్ కాల్డ్వెల్ — బ్రౌనుదొరకు క్రైస్తవ మత విషయమున నున్న (చర్చ్ ఆఫ్ ఇంగ్లండ్) అభిప్రాయములకు ఆమోదముతో ఆనందము తెల్పెను. సాధారణముగా, భారతదేశము వచ్చి ఇచ్చటి సాహిత్య సంస్కృతులతో తత్త్వ సిద్ధాంతములతో పరిచయమున్న వారందరు - ఇంచుమించుగా - మత విషయమున (క్రైస్తవమత విషయమున) అంత పట్టుదల వహించక స్వేచ్ఛాభావకులగుట సహజముగా కన్పట్టినను బ్రౌనుదొర విషయమున అట్లుగాదనియు, క్రైస్తవమత విషయమున ఆయన గాఢాభిమానము కలవాడనియు వ్రాసెను. ఆ రోజులలో - సర్ విలియమ్ జోన్స్ (1746-1794,) హెచ్.హెచ్. విల్సన్ (1786-1860) మొదలైన వారందరు "పాశ్చాత్యబ్రాహ్మణులు" (Western Brahmins) కాగా, బ్రౌనుదొరకు తాననుసరించుచున్న క్రైస్తవమతము మీద అభిమానముండుటయే గాక, హిందూమతము మీద కొంత హేయ భావము కూడ నుండినట్లు తనకు తోచినదని మిషనరీ కాల్డ్వెల్ ఇట్లు వ్రాసెను : [94]

"It is necessary, however, to mention distinctly that this scepticism is not extended to religion, though Indian scholars of eminence are generally freethinkers, and though one would have expected that a mind in other respects sceptical would have been sceptical with regard to this matter too. Yet, I am happy to say in this respect Mr. Brown is as usual, of a different opinion from those with whom he has intercourse. His literary friends are many of them infidels. No tendency towards their way of thinking is apparent in him."

"Sir William Jones for a considerable period of life was a sceptic...While Colbrooke, Wilkins, Wilford and Wilson, who have taken up and carried onward the study of sanscrit literature, are Brahmins, if any-thing....Wilkins told Mr. Brown sometime ago that

---

94. Ibidem.

"he thought in another century Christianity would be worn out".

"....Hence one might have expected that a zealous disciple would have followed these "Western Brahmins" even in their free thinking. But such has not been the result. He seems to have a sincere, thorough, and well-grounded belief in Christianity as a system, and a very low opinion, I may say a contempt, of Hindooism; not a surprising thing after all when his education is kept in mind; when it is remembered that, beside others of a similar cast who were met with later in life, he was once intimate with Buchanan, Martyn, Thomason and the missionaries of Serampore"

బ్రౌనుదొరలో గాంభీర్యము, విలాసత్వము కలిసి ఉన్నవనియు ఈ కూడలి వలన ఆయనను ఏవిధముగా నర్థము చేసికొనవలెనో తెలియుట కష్టమగుచున్న దనియు బిషప్ కాల్డ్వెల్ వ్రాసెను. క్రైస్తవమత గ్రంథములను దానికి సంబంధించిన ఇతర ధార్మిక గ్రంథములను బ్రౌనుదొర వలె చదివిన వారరుదనియు, భారతదేశములో క్రైస్తవమత వ్యాప్తిని గురించి ఆయనకు విలక్షణాభిప్రాయములున్నవనియు మిషనరీ కాల్డ్వెల్ వ్రాసెను. బ్రౌనుదొర ఇంగ్లండనకు తిరిగి పోవుట ఆయనకు చాల మంచిదయినదనియు, ఆయన సోదరీమణుల ప్రభావము వలన క్రైస్తవమత విషయమున ఆయన అభినివేశము, విశ్వాసము పెరిగినవనియు ధార్మిక గ్రంథముల పఠనమధికమైనదనియు బిషప్ కాల్డ్వెల్ వ్రాసెను. బ్రౌనుదొర లివర్‌పూల్‌లో నున్నపుడు అక్కడ ఇద్దరు సత్పురుషులతో పరిచయమై (Ould and Mc Neile) ఆయనకు వారిభక్తి విశ్వాసములు, నైతికజీవనము, సంయమనము కనువిప్పు కల్గించెను. దీనివలన ధార్మిక గ్రంథముల పఠనమధికము చేసెను. కొన్నింటిని తానే ఆయనకిచ్చినట్లు బిషప్ కాల్డ్వెల్ వ్రాసెను. చదివిన పుస్తకములనుండి నోట్సు కూడ వ్రాసికొనెడి బ్రౌనుదొర "దేవుని

రాజ్యము"నకు దూరముగ లేదని వ్రాసి తన తృప్తిని మిషనరీ కాల్డ్వెల్ వెల్లడించెను :[95]

"In divinity, besides English authors he has read some of the fathers and more of the Talmud than anyone I have met with...I don't know what to make of him. On the one hand he is the leader in the fashionable slip-slop about plays and players and operas and balls and cooks and field-sports, discussing such subjects with all the wit and zest imaginable; and on the other he at times astonishes me with the novelty and yet the reasonable and truthlike aspect of his views on the spread of Christianity in India..."

"...Mr. Brown's return to England appears to have been of much advantage to him. His sisters are religious (though like many others in the Church of England they are tinged with Millinarianism), and by their means his attention was more directed to religious subjects than ever it had been before. At Liverpool, where his friends live, he became acquainted with those two "precious Orangemen" as I have heard them called, Ould and McNeile; and their vast exertions, faithfulness, self-denial and apostolic character struck him with admiration. He was thus led to think and read...and those books with which I have furnished him he reads with a diligence and an earnestness truly wonderful...I believe he is not far from the Kingdom of God, and I trust God will confirm this belief in his own good time..."

---

95. Ibidem.

బ్రౌనుదొర ప్రతిభావ్యుత్పత్తులను మానసిక ప్రవృత్తులను క్షుణ్ణముగా పరిశీలించి, నిర్భయముగా బిషప్ కాల్డ్వెల్ వ్యక్తము చేసెను గనుకనే ఆయన వ్రాసిన "రెమినిసెన్సెస్" (Reminiscences) నుండి దీర్ఘముగా ఉద్ధృతముల నిచ్చుచు వ్రాయుట జరిగినది. మనకు తెలిసినంతవరకు బ్రౌనుదొర మానసిక ప్రవృత్తులను ఇంత విపులముగా పరీక్షించి వ్రాసినవారు లేరనవచ్చును. ఆయన ప్రతిభా వ్యుత్పత్తులను గూర్చి వ్రాసినవారు కొందరున్నారు గాని మిగిలిన విషయములను గురించి బిషప్ కాల్డ్వెల్ వ్రాసినట్లు వ్రాసినవారు లేరనుట సత్యదూరముకాదు.

బ్రౌను దొర, ఇంచుమించుగా, నాలుగు దశాబ్దులు (1817-1855) భారత దేశములో తెలుగునాట గడిపినను ఇతర పాశ్చాత్యోద్యోగుల వలె ధనార్జన చేయలేదు. తనడబ్బు ఖర్చుచేసి ఆంధ్రభాషా సాహిత్యముల సేవచేసెను. ఈ కృషి అనేక రంగములలో సాగినది. చేసిన ఉద్యోగములలో న్యాయ పరిరక్షణకు పాటుబడెను. అందుకై తొందరపడి చేసిన కొన్ని పొరపాటులవల్ల శిక్షననుభవించెను. తాను తలపెట్టిన భాషాసాహిత్యముల సేవకు వేలకొలది రూపాయలు వెచ్చించెను. వేలకొలది రూపాయలు ఖర్చుచేసి లిఖిత ప్రతులను సంపాదించెను. ("The library of Sanscrit and Telugu manuscripts which I have collected cost me more than 30,000 Rupees." ఇది 1836లో వ్రాసిన వాక్యము.) ఇంగ్లండు పోయిన తరువాత కూడ, జీవించిన మూడు దశాబ్దులు భాషాసాహిత్యసేవ కింకితమైపోయి తన స్వల్ప ఆదాయమునుండి (ఆనాడు భారతదేశమునందుండి స్వదేశము తిరిగి వచ్చిన ఇంగ్లీషువారి అర్జన ననుసరించి చూచిన ఇది స్వల్ప ఆదాయమే !) సొమ్ము వ్యయము చేసెను.

బ్రౌనుదొర చేసిన ఉద్యోగములు, వాటివలన వచ్చిన జీతములు, ఇతర అలవెన్సులు పరీక్షించినప్పుడు ఆయన చేసిన త్యాగము మనకర్థమగును. బ్రౌనుదొర మొట్టమొదటి ఉద్యోగము - కడపలో కలెక్టర్ క్రింద అసిస్టెంటు పని. 1820 ఆగస్టులో దీనిలో చేరెను. అంతకు పూర్వము స్వల్పకాలము క్రిందట జిల్లా హెడ్ క్వార్టర్స్ సిద్ధవటం నుండి కడపకు మారినది. ఇక్కడ రెండు సంవత్సరముల కాలము పనిచేసెను. కడపనుండి మచిలీపట్టణంజిల్లా కోర్టులో "రిజిస్టర్"గా అక్టోబరు 25 వ తేది 1822 లో బదిలీ పొంది డిసెంబరు 16వ తేదీనాడు జిల్లా కోర్టులో ప్రమాణ స్వీకారము చేసి ఉద్యోగములో చేరెను. జిల్లా జడ్జీ క్రింద పనిచేయు ఇంగ్లీషు ఉద్యోగి పని అది. వేయి రూపాయుల పరిమితిలో సివిల్ దావాల విచారణ, దస్తావేజుల రిజిస్ట్రేషన్, సహాయక మేజిస్ట్రేట్ హోదాతో కేసుల విచారణ దీనిలోని ముఖ్యమైన పనులు. 1823 జనవరిలో మచిలీపట్టణంలోని జడ్జి చెర్రీ బదలీ అయినప్పుడు క్రొత్త జడ్జి వచ్చి చేరెడి లోపున 'రిజిస్టర్'గా ఉన్న బ్రౌనుదొర కొన్ని నెలలు ఆ హోదాను పొందెను. ఈ కాలములోనే ఆయన కొందరు లంచగొండులను శిక్షించెను. ఆ రోజులలో ఇదికొంత అలజడిని

కలిగించెను. 1824లో నవంబరు 28 తేదీని రాజమహేంద్రవరం కలెక్టరునకు హెడ్ అసిస్టెంట్‌గా మేజిస్ట్రేట్‌గా బదిలీ పొందెను. 1825 లో రాజమహేంద్ర వరంలో ఉద్యోగములో చేరినతరువాత, "సాల్ట్ దరోగా" పనిని నిర్వహించు చున్న గవర్రాజును లంచము తీసికొనుచుండెనను నేరము మీద పనినుండి తొల గించి జుల్మానాను విధించెను. బందరులో 'వాజిర్' ను తొలగించినప్పుడు గొడ వలు జరిగినట్లే ఈ మారును జరిగి బ్రౌనుదొర తీర్పులకు వ్యతిరేకముగా మద్రాసు లోని అధికారులు తీర్పులిచ్చిరి. ఇవన్నియు 1826లో జరిగెను. అప్పుడు బదలీ జరిగి కడప జిల్లా కోర్టులో "రిజిస్టర్" పనిని; కొంతకాలము ఇన్‌చార్జ్ అసిస్టెంట్ జడ్జిగా, సంయుక్త క్రిమినల్ జడ్జిగా పనులను నిర్వహించెను. అక్కడి నుండి కంభంలోని "ఆగ్జిలరీ కోర్టు" లో జడ్జిగా నియుక్తుడై పోయెను. ఇది 1827లో జరిగినది. 1828లో కడప జిల్లా జడ్జి "హేగ్" జబ్బుపడి సెలవుమీద పోగా ఆ స్థానములో నియమితుడైన జడ్జి వచ్చి చేరులోపున బ్రౌనుదొర కంభం నుండి వచ్చి జిల్లా జడ్జిగా ఛార్జి తీసికొనెను. క్రొత్తజడ్జి "మేసన్" వచ్చి చేరుట తోడనే బ్రౌనుదొర సెలవు మీద పోయెను. కడపకు 1820లో మొదటిసారి వచ్చినపుడో, 1826లో రెండవసారి వచ్చినపుడో ఒక బంగాళాను తోటను కొనెను. రెండవసారి వచ్చినపుడే కొనియుండుటకు ఆధారములెక్కువగా నున్నవి. బ్రౌను దొర ఉద్యోగరీత్యా వివిధ ప్రాంతములకు తిరుగుచున్నను ఆయన భాషాసాహిత్య కృషికి కేంద్ర స్థానమైనది ఈ బంగాళాయే. ఆయన పండితులైన జూలూరి అప్ప య్యపంతులు, వైదిపాటి వేంకట నరసయ్య ప్రభృతులు ఇక్కడ నుండియే వ్యాఖ్యలు మొదలైనవి సిద్ధము చేసిరి. అయోధ్యాపురం కృష్ణారెడ్డిగారి అజమా యిషీలో ఈ "కాలేజి" నడచినది. బ్రౌనుదొర వ్యక్తిగతములైన విషయముల నన్నింటిని ఈయనయే చక్క దిద్దెడివాడు. ఈ బంగాళాను గురించి ప్రతి ఉత్త రములోను కృష్ణారెడ్డిగారు బ్రౌనుదొరకు వ్రాసినాడనిన అత్యుక్తికాదది. ఇది బ్రౌనుదొర పేర 20, 25 సంవత్సరములుండినదనవచ్చును. 1829లో ఆయన తెలుగుదేశమునకు దూరముగా తమిళదేశములోని తిరుచునాపల్లిలో "ప్రొవిన్షి యల్" కోర్టులో "రిజిస్టర్" గా ఫిబ్రవరిలో పదవిని స్వీకరించెను. ఆ రోజులలో మద్రాసు ప్రెసిడెన్సీలో మచిలీపట్టణం, చిత్తూరు, తెలిచ్చేరి, తిరుచునాపల్లి నగర ములలో నాలుగు ప్రొవిన్షియల్ కోర్టులుండెడివి. డిసెంబరు వరకు బ్రౌనుదొర తెలుగుదేశమునకు దూరముగ నుండెను. 1829లోనే డిసెంబరు 11వ తేదీని

పెరిగిన హోదాతో "అసిస్టెంట్ జడ్జి అండ్ సంయుక్త క్రిమినల్ జడ్జిగా రాజమహేంద్రవరము వచ్చెను. వచ్చిన కొలది కాలమునకే అక్కడి జడ్జి అనారోగ్య కారణముగా సెలవు తీసికొనుటవలన బ్రౌనుదొర కొంతకాలమక్కడ ఆక్టింగ్ జడ్జిగా పనిచేయవలసి వచ్చెను తరువాత మచిలీపట్టణంలో అగ్జిలరీ జడ్జిగా నియమితుడై 18[illegible]లో అక్కడికి వచ్చి చేరెను. ఈయన మచిలీపట్టణంలో నున్నప్పుడే ఏనుగుల వీరాస్వామయ్యగారు 1831 లో కాశీయాత్రనుండి తిరిగి వచ్చుచు ఆగస్టు 2-15 తేదీల నడుమ బ్రౌనుదొరను కలిసికొనెను.[96]

ఈ విషయమును వీరాస్వామయ్యగారు కాశీయాత్ర చరిత్రలో చెప్పలేదు గాని, తరువాత బ్రౌనుదొరకు తాము 1831 లో డిసెంబరు 15 వ తేదీని వ్రాసిన లేఖలో "నేను మచిలీపట్టణమున నున్న కాలంలో తాము నా యెడల చూపిన దయకు నా కృతజ్ఞతాభివందనాలు స్వీకరింపగోరుతాను"[97] అని వ్రాసియుండుట చేతను, ఆ సమయమునకు బ్రౌనుదొర మచిలీపట్టణములో నుండుటచేతను మన మిట్లూహింపవచ్చును.

బ్రౌనుదొర, మచిలీపట్టణంనుండి 1832లో ఆక్టింగ్ కలెక్టర్‌గా గుంటూరు వచ్చి చేరినాడు. ఆ రోజులలోనే గుంటూరు ప్రాంతమంతయు కరువు కరాళ హస్తములలో చిక్కుకొన్నది. అదే కాలములో కడప, నెల్లూరు ప్రాంతములుకూడ వర్షములు లేక కరువు పాల్పడినవి. ఈ కరువు "నందన" సంవత్సరమున వచ్చుటచే (1832-1833) దీనికి "నందన కరువు" (గుంటూరు కరువు) అని మన వారి స్మృతిలో నిలిచిఉన్నది. దీని తరువాత వచ్చినది, మన వారిలో పెద్దలు చెప్పినట్లుగా చెప్పెడి ధాత కరువు (1876-1877). దీనికంటె ఘోరమైనది "నందనకరువు" ఈ కరువును గురించి పాశ్చాత్యులు ఈ విధంగా వ్రాసినారు:

---

96. "౨ తేదీ (మంగళ్వారం) వుదయాత్పుర్వము ౨ గంటలకు మబ్బుచినుకులుగా వున్నా లేచి యిక్కడికి (తుమ్మిడి గ్రామం) రెండామడ దూరములో వుండే మచిలీ బందరు అనే షహరు యీ దేశస్థులు పేట అని చెప్పేబస్తీని ౯ గంటలకు ప్రవేశించినాను". (పుట. ౩౪౮)

"యీ మచిలీ బందరులో ఆగస్టు నెల ౧౫ తేదీ వరకు వసించినాను".
(పుట. ౩౫౦)

(ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర; తృతీయ ముద్రణం: ౧౯౪౧; సంపాదకుడు: దిగవల్లి వేంకట శివరావు, బెజవాడ).

97. Ibidem, పుట-10 (అసలు ఉత్తరము ఇంగ్లీషులో నుండగా దానికిది తెలుగని శ్రీ దిగవల్లివారు వ్రాసిరి. పుట-8)

"In 1832-1833 occurred the terrible drought, which is known among Europeans as "the Guntur Famine" and among natives as "Nandana" that being the cyclic year. This terrible calamity covered the country with human bones from Ongole to Masulipatam and for twenty years afterwards the cultivation in the Guntur District did not reach its previous limit".[98]

ఈ కరువు రోజులలోనే బ్రౌనుదొర డిసెంబరు 21 వ తేదిని 1832 లో డబ్ల్యు. మేసన్ నుండి ఛార్జి తీసికొనినాడు. ఆకలి చావులను గురించి ప్రతిదినము వినవచ్చుటచేత బ్రౌనుదొర మద్రాసులోనున్న ప్రభుత్వము వారికి క్షామ పరిస్థితులను గూర్చి సాయము నర్థించుచు జాబు వ్రాసెను. ఈ జాబులో ఆయన,"...the distress from the continued drought is very great, and the deaths by famine are frequent even in the town of Guntur and much more so in surrounding villages...."అనెను. ఈ జాబును, ఛార్జి తీసికొన్న పదిరోజులకు (డిసెంబరు, 31) వ్రాసెను. కలరాకూడా జిల్లాలో తీవ్రముగా వ్యాపించినదని వ్రాసెను. క్షామ పరిస్థితులవల్ల నేరము అధికమైనదనియు వాటిని అదుపులో పెట్టుటకు పోలీసులకు ఆయుధములు కావలెనని 1833 లో జనవరి 16 వ తేదిని మద్రాసులోని ప్రభుత్వమునకు వ్రాసెను. బ్రౌను వ్రాసిన ఈ ఉత్తరములో "క్షామము" (Famine) అను పదమును వాడెను. ప్రభుత్వమున కిది నచ్చలేదు. అట్టి బరువైన మాటలను వాడకూడదని ప్రభు

98. A Manual of the Kistna District, Madras - 1881; Page-86.

త్వము వారి ముఖ్య కార్యదర్శి బ్రౌనుదొరను మందలించెను.[99] జిల్లాలో మశూచికము, కలరా వ్యాపించియున్నవని బ్రౌనుదొర వ్రాసెను. ఈ పరిస్థితులలో రోడ్లు వేయించి కూలి యిచ్చుట, "గంజిదొడ్లు" నడపుట మొదలైన ప్రజోపయోగ కార్యములను ఈయన ప్రభుత్వము తరఫున అమలు చేసెను. మార్చిలో గుంటూరు విడిచి జిల్లా జడ్జిగా చిత్తూరు పోవువరకు బ్రౌనుదొర క్షామనివారణ కొరకు ప్రయత్నించుచునే యుండెను.

ఈ క్షామప్రభావము మద్రాసుమీదకూడ పడినది. ఏనుగుల వీరాస్వామయ్యగారు తమ కాశీయాత్ర (18-5-1830 నుండి 3-9-1831 వరకు) ముగించుకొని మద్రాసు చేరిన సంవత్సరములోపుననే మద్రాసు ప్రెసిడెన్సీలోని తెలుగు ప్రాంతములలో విలయతాండవమాడిన క్షామము, మద్రాసు నగరమును కూడ స్పృశించినపుడు ఆయన చేసిన సంఘసేవను ఆయన స్నేహితులు కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లగారు తాము అచ్చువేయించిన (1838) "కాశీయాత్ర చరిత్ర"లో నిట్లు వ్రాసిరి:

"నందన సంవత్సరపు క్షామములో నేను కొంత ధాన్య సంగ్రహము చేసి వుంచడము మేలని చెప్పినందుకు అయ్యవారు మనము ధాన్యము సంగ్రహించి మనము మట్టుకు భుజించి అన్నాతురులై దుఃఖపడే పేదలను చూచుచు జీవించుట అప్రయోజకము గనుక తమ ప్రయోజనమునకుగాను విస్తరించి జాగ్రత పెట్టుకొన

---

99. I am directed to acknowledge receipt of your letter of the 16th applying for certain military stores to ensure the tranquility of your district during the present famine..."
"H.E. Governor in Council has not yet heard that any part of the country is suffering the calamities of "famine" and hopes that you have made use of that term inadvertantly. The indiscriminate employment of strong expressions when the occasion does not require them, should be carefully avoided...."
(Madras, Tamilnadu Archives, Judicial Consultation No. 14 of 1838 January 18. as quoted in బ్రౌనుజాబులు : స్థానిక చరిత్ర; కడప జాబుల సంకలనం; సంశోధన; బంగోరె; పర్యవేక్షణ; జి.ఎన్. రెడ్డి; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, 1977; పుట-34.)

రాదని చెప్పి ఆ దుర్భిక్షములో శక్తివంచన లేకుండా తాను అన్న ప్రదానము చేయుచు యితరులను స్వప్రయోజనమునకు అనుసరించేలాగు అనుసరించి వారిన్ని పేదలపోషణవిషయమై ప్రవర్తింపజేయుచు ఆలాగు ప్రవర్తించినవారిని తాను మిక్కిలీ కొనియాడి సంతోషపెట్టుచు వచ్చిరి. అందువల్ల మరికొందరున్ను అన్న దానమందు ప్రవర్తింపుచు వచ్చిరి. మరిన్ని గంజిదొడ్డియుచే అన్న సత్రములో గవర్నమెంటువారు అపార ద్రవ్యమును బదల అన్న ప్రదాన విషయమై ఖర్చు చేసినప్పుడు అయ్యవారు ఆధర్మ విచారణ ప్రభువులలో తాను వొకడుగా నుండి పేదలకు కాలములో విమర్శగా అన్నమును అందజేసేకొరకై పడిన శ్రమ చెప్పశక్యము కాదు..."100

కులమత వివక్ష లేకుండ అందరు ఆకలికి అలమటించిపోవుచు గుంటూరు మండలమును విడిచి కడప వరకు పోయిరని చెప్పినచో ఆనాటి క్షామతీవ్రత తెలియగలదు. ఈ విధముగానైనను క్రీస్తుబోధలను సర్వులకు వినిపించెడి అవకాశము లభించినందులకు ఆనందభరితుడై ఆనాడు కడప ప్రాంతమున- ముఖ్యముగా కడపలో- లండను మిషనరీ సొసైటీకి చెంది కృషిచేయుచున్న మిషనరీ డబ్లు. హోవెల్ (W. Howell) 1838 ఏప్రిల్ ౯వ తేదీని మిషన్‌వారి లండన్ కార్యాలయమునకు వ్రాసిన లేఖలో ఇట్లు తెలిపెను:

"In my last I alluded to the late drought; in Con-sequence of which there is great distress throughout the country,and the inhabitants from the Guntoor District have come into the place, in great numbers...Last Sabbath, particularly, there were above 500 persons who came with their wives and children, and among them many Brahmin families, who filled the chapel at an early hour; and, on seeing them, I rejoiced in the opportunity thus afforded me to bring to their serious consideration; and it was gratifying to find how attentively they sat all the time hearing of the great salvation purchased for sinners by the Lord Jesus Christ. It is a pleasing circumstace, that while they have

---

100. కాశీయాత్ర చరిత్ర : ఏనుగుల వీరాస్వామయ్య; తృతీయ ముద్రణము, 1941. సంపాదకుడు : దిగవల్లి వేంకట శివరావు, విజయవాడ; పుటలు - ౬, ౭.

come so far for the bread that perisheth, they have been invited also to receive the bread of life"[101].

గుంటూరు విడిచి చిత్తూరులో జిల్లా జడ్జిగా పదవీ స్వీకరణ చేయవలసినదని ఆర్డరు మార్చి 12వ తేదీని రాగానే బయలుదేరినాడు. చిత్తూరులో ఒక నెల పనిచేయునాటికి మరల బదిలీ! మచిలీపట్టణం డివిజన్‌నకు చెందిన రాజమహేంద్రవరంలోని అగ్జిలిరీ కోర్టులో జడ్జిపని ఇచ్చినారు. 1833 సంవత్సరమంతయు ఇంచుమించుగా రాజమహేంద్రవరంలోనే గడిచినట్లెంచుకొనవచ్చును. 1834లోనే బ్రౌనుదొర సస్పెన్షన్ మొదలైనవన్నియు వచ్చెను. ఈ సంవత్సరమంతయు సుఖశాంతులులేక బాధపడెను. తుదకు మూడు సంవత్సరముల సెలవుమీద డిసెంబరు 17వ తేదీని బయలుదేరి లండన్ నగరమునకు ప్రయాణము కట్టెను. లండన్‌లో ఉన్న కాలములో పరియైన జీతములేక అలవెన్సులతో కాలము గడిపెను. పదునేడు సంవత్సరములు ఇండియాతో ఉద్యోగముచేసి 17-12-1834 నాడు కోరంగి రేవునుండి బయలుదేరి లండనుపోయి, సస్పెన్షన్ ఆర్డరును తొలగింపించుకొని ఇండియాకు బయలుదేరి 7-1-1838 నాడు మద్రాసు రేవులో దిగెను. ఈ తిరుగు ప్రయాణములోనే బిషప్ రాబర్ట్ కాల్డ్వెల్‌ను ఓడపై కలిసికొనెను.

లండన్‌నుండి తిరిగివచ్చిన తరువాత బ్రౌనుదొరమీది అంక్ష తొలగినను ఆయన కోరిన రెవిన్యూ, జ్యుడీషియల్ శాఖలలో ఉద్యోగము రాలేదు. 1838లో జనవరి 23వ తేదీని "పెర్షియన్" అనువాదకునిగ నియమించిరి. "కాలేజి బోర్డు"నకు మొదట ఆక్టింగ్ కార్యదర్శిగాను (మార్చి 2వ తేదీ) తరువాత మెంబరుగాను (సెప్టెంబర్ 25వ తేదీ) నియమితుడయ్యెను. "నేటివ్ ఎడ్యుకేషన్ కమిటీ"లో సభ్యత్వము లభించెను. ఇవి గౌరవహోదాలు. 1839 లో జనవరి 22వ తేదీని మద్రాసులోని సదర్ అండ్ ఫౌజ్‌దారీ అదాలత్ కోర్టులో "ఆక్టింగ్ రిజిస్టర్" పదవిని స్వీకరించెను. దీని తరువాత మే 14వ తేదీని ప్రభుత్వమువారు నిర్వహించెడి "లాటరీ"లకు ఆక్టింగ్ సూపరింటెండెంట్‌గా నియుక్తుడయ్యెను. "మదరాస్ జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్స్" (Madras

---

101. Missionary Chronicle (London Missionary Society) for March 1834, London, 1834, P. 122. as quoted in బ్రౌను జాబులు: స్థానిక చరిత్ర; కడప జాబుల సంకలనం; సంశోధన: బంగోరె; పర్యవేక్షణ: జి.ఎన్. రెడ్డి; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి; 1977; పుటలు-49, 50.

Journal of Literature and Science) నకు ఆర్. కోల్ తో బాటు సహాయ సంపాదకుడయ్యెను. 1840లో మార్చి 31వ తేదీని జె.సి. మారిస్ సెలవు పెట్టగా ఆ స్థానములో "సివిల్ ఆడిటర్ అండ్ సూపరింటెండెంట్ ఆఫ్ స్టాంప్స్"గా పదవి స్వీకరించెను.

ప్రభుత్వమువారికి ఎన్ని అర్జీలు పెట్టికొనినను బ్రౌనుదొరకు ప్రాత ఉద్యోగములు వచ్చినట్లులేదు. 1841 ఫిబ్రవరి 12వ తేదీని ఆక్టింగ్ కలెక్టర్ ఆఫ్ సీ కస్టమ్స్, ఆగస్ట్ 31వ తేదీని ఆక్టింగ్ పోస్ట్‌మాస్టర్ జనరల్ ఉద్యోగములు వచ్చినవి. 1843 సెప్టెంబర్ 29వ తేదీని మదరాసు యూనివర్సిటీ బోర్డునకు "ఆక్టింగ్ కార్యదర్శి" అయ్యెను. ఈ "ఆక్టింగ్" ఉద్యోగములు, "బదిలీ"లు బ్రౌనుదొరకు చిరకాలము పట్టి విడువలేదు. 1846 లో కొంత, ఉద్యోగములు కుదుటబడు పరిస్థితి ఏర్పడినది. జూలై 6వ తేదీని "పోస్ట్‌మాస్టర్ జనరల్"గా "ఫుల్ ఛార్జ్" ఈయనకు ఇచ్చినారు. ప్రభుత్వమునకు తెలుగు అనువాదకునిగ కూడ చేసిరి. ఆగస్టు 4వ తేదీని "ఎడ్యుకేషన్ కౌన్సిల్"లో సభ్యత్వము లభించినది.

ఇవి లభించినను, తెలుగు భాషా సాహిత్యములకు ఎనలేని సేవచేయుచున్నను, లిఖిత ప్రతులను వందలకొలది సంఖ్యలో సేకరించి గ్రంథాలయము లకు బహూకరించుచు వచ్చినను — ఆనాటి ప్రభుత్వముయొక్కగాని, పైఅధి కారోద్యోగుల యొక్కగాని సహకార సానుభూతులు— బ్రౌనుదొరకు ఇతరోద్యోగు లకు లభించినట్లుగా-ఎన్నడు లభించలేదనుట సత్య దూరము కాదు. తెలుగు ప్రజలు, పండితులు ఎన్నడు ఆయనను మెచ్చుకొనక మానలేదు! కాని, వారికి అధికారికమైన బలమేమియున్నది? ఒక విధముగా చూచినప్పుడు మనకు ప్రబ లముగా గోచరించునది ఆనాడు కాంబెల్, మారిస్ మొదలైనవారికున్నంత పలుకుబడి-ప్రభుత్వములో-బ్రౌనుదొరకున్నట్లు లేదని! తాను మొదట చేసిన రెవిన్యూ. జ్యుడీషియల్ శాఖలలో మరల ఉద్యోగములు ఆయన సంపాదింపలేక పోయెను. గుంటూరులో ఆక్టింగ్ కలెక్టరుగా ఉన్నప్పుడు తన అలవెన్సును అద నముగా పెంచవలసినదని వ్రాసికొనగా ప్రభుత్వమువారు వీలులేదన్నారు. గుంటూరు, చిత్తూరు, రాజమహేంద్రవరము, మచిలీపట్టణము మొదలైనచోట్లకు- ఇంచుమించుగా-ఇష్టము వచ్చినట్లు బదిలీలు చేసినారు. మొదటిలోనే (1834) తానుచేసిన తప్పు-పొరపాటువల్ల జరిగినదేగాని, కంపెనీని మోసముచేసి ధనా ర్జన చేయవలెనను దృష్టితో చేసినది కాదని ఎంత మొరపెట్టికొనినను పెడచెవిని బెట్టి "సస్పెండ్" చేసినారు. తన "కేసు"నకు ఇండియాలోనే తీర్పు ఈయకుండ లండనులోని "కంపెనీ కోర్టు" వారికి పంపించుటవల్ల - దూరభారమువల్ల - ఒక

సంవత్సర కాలము తాను నిరుద్యోగిగా ఉండిపోవలసి వచ్చునని "గోల" పెట్టి నను ("The reference to the Honourable Court puts him out of employ for at least a year, and involves his total ruin ... 26-11-1834 నాటి జాబు) ఎవరును పట్టించుకొనలేదు. ఇంక గతిలేక, మూడు సంవత్సరములు సెలవు తీసికొని ఇంగ్లండు పోవవలసి వచ్చినది! తన "తెలుగు వ్యాకరణము"ను ముద్రింపవలసినదని కాలేజి బోర్డువారికి సమర్పించి నప్పుడు-కాంబెల్ పలుకుబడివల్ల (ఆయన తెలుగు వ్యాకరణమొకటి ఆనాటికే రంగమున నుండెను-దీని ప్రథమ ముద్రణము-1816). బ్రౌనుదొర పుస్తకము విషయమై "మారిస్" మొదలైన ఇతర సభ్యులు మౌనము వహించిరి! బ్రౌను దొర, నిఘంటువుల ముద్రణకు ఎస్.పి.సి.కె. (Society for Promoting Christian knowledge) సంస్థతో ఒక ఒప్పందము కుదుర్చుకొనినను ముద్రణ కాలమున క్రొత్తక్రొత్త ఆరోపములను చేర్చుచు వచ్చుటవలన మూడు సంవత్సరములలో ముద్రింపబడవలసినవి ఆరు సంవత్సరములు తీసికొనెను. వేయి పుటల గ్రంథము మూడువేల పుటలకు పెరిగెను. ఇందువలన మొదటి షరతులు మార్చుట న్యాయమని బ్రౌనుదొర సంస్థయొక్క అధికారులతో ఎంత చెప్పినను వారు వినలేదు. వారిని ఈయన వినిపింపజేయలేకపోయెను! ఆయన "జిల్లా నిఘంటువు" నందు చాల లోపములున్నవి గనుక కొనుటకు వీలులేదని ప్రభుత్వమువారు ఆయనను విమర్శించిరి ("I regretted this thing. It was the puniest of my works, and the only volume which was peevishly criticised"). కాని, తరువాత బయలుదేరిన "విల్సన్" కూర్చిన "గ్లాసరీ ఆఫ్ జుడిషియల్ అండ్ రెవెన్యూ టర్మ్స్" (1855)నకు ఇది సాయ పడెను. బ్రౌనుదొర పుస్తకములను అధికసంఖ్యలో కొనెదమని ఎన్నియోసార్లు ఆనాటి ప్రభుత్వము వాగ్దానము చేయుటయు, కొనకుండుటయు పరిపాటి అయి నది. మెకంజీ సేకరించిన, బ్రౌనుదొర ఇచ్చిన లిఖిత ప్రతులన్నింటికి "కేట లాగు" తయారుచేయు పనికి బ్రౌనుదొర సిద్ధమైనను కంపెనీ డైరెక్టర్లు ఒప్పు కొనలేదు! చివరకిది రివరెండ్ విలియమ్ టెయిలర్ గారి కప్పగించిరి. నాలు గేండ్లు తీసికొనినను ఈ "కేటలాగు" (A Catalogue Raisonnee) తృప్తికర ముగ లేదనియు, "డబ్బుదండుగ" అనియు బూహ్లర్ పండితుడు (Buhler 1837-1898) మొదలైనవారు వ్రాసిరి. వీటినన్నింటిని పరిశీలించినప్పుడు, కర్మ వీరుడైన బ్రౌనుదొరను ఆనాటి అధికారులు-వీరైనప్పుడెల్ల - విసిగించుచుండిరని తెలియును. పండ్లున్న చెట్లునకే రాళ్ళదెబ్బలు !

ఆయన చనిపోయిన తరువాత, లండనులోని "ఎథీనియమ్" పత్రికలో వ్రాయుచు (3 జనవరి, 1885) ఆర్. ఎమ్. మేగ్డొనాల్డ్ తన వ్రాత నిట్లు ముగించెను:

"Few literary men have derived less pecuniary advantage from their labours. He told me a few months before his death that what he had received represented about a fifteenth part of what he had spent".

నాటినుండి నేటివరకు — ఏనాడునుకూడ — పనిచేయువానికి పని "ఇంక్రిమెంట్", చేయనివానికి జీతము "ఇంక్రిమెంట్"!. ఇండియాను విడిచిపోవుటకు మూడు సంవత్సరములముందు, ముప్పది అయిదు సంవత్సరముల "సేవ" తరువాత, కంపెనీ ప్రభుత్వమువారు బ్రౌనుదొరను 29 మార్చి 1852 న "ఫస్ట్‌క్లాస్ సివిల్ సర్వెంట్"గా చేసినారు !

ఈ సందర్భముననే, బ్రౌనుదొర తన ఉద్యోగ కాలమున తీసికొనిన జీతములను గురించి కొంత తెలిసికొనుట సమంజసము. ఆ రోజులలో కంపెనీ ఉద్యోగులు జీతములమీదనే జీవించుట యనునది, బ్రౌనుదొరవంటి ఏ కొలది మంది విషయముననే సత్యముగాని మిగిలినవారి విషయమున కాదు అనునది ఐతిహాసిక సత్యము. గవర్నరు, గవర్నర్ జనరల్ వంటి అత్యంతోన్నతోద్యోగులు కూడ సొంతముగా వ్యాపారములు చేసియు, చేయించుకొనియు లాభములు గడించుచుండిరి. మిగిలిన ఉద్యోగుల సంగతి చెప్పనక్కరలేదు. జమీందారులకు, మహారాజులకు అప్పులిచ్చు స్థితిలో నుండిరి. మద్రాసు ప్రెసిడెన్సీకి సంబంధించినంత వరకు ఆర్కాటు నవాబు చరిత్ర, తంజావూరు రాజు చరిత్రలను మాత్రమే పరిశీలించినను మనకీ విషయములు తెలియును. ప్రజలకు న్యాయము చేయవలెననియు, అన్యాయముగ ధనార్జన చేయరాదనియు, అధికారమును దుర్వినియోగము చేయకూడదనియు నమ్మిన ఇంగ్లీషువారిని - వారెంతటి ఉన్నతోద్యోగములో నున్నను - లెక్కచేయని పరిస్థితులుకూడ నుండెను. వారికి, మన దేశములోని ఇంగ్లీషు అధికారులనుండిగాని, ఇంగ్లండులోని కంపెనీ అధికారులనుండిగాని - చివరకు - బ్రిటిష్ పార్లమెంటునుండిగాని సాయము సర్వకాలముల, సర్వపరిస్థితులలో లభించునని చెప్పుటకు వీలులేదు ! ఆర్కాటు నవాబు సాయముతో ఇంగ్లీషు కంపెనీ ఉద్యోగులు తంజావూరు రాజును అష్టకష్టములపాలు జేసినప్పుడు చెన్నపట్టణములో "వించ్" (Wynch) గవర్నరు. ఈయన "లంచగొండి" అని గుర్తించి ఇంగ్లండులోని కంపెనీ అధికారులు ఈయనను తొలగించి "జార్జ్ పిగెట్"

(ఈయన మొదట 1755-1763 మధ్య మద్రాసు గవర్నరు)ను తిరిగి గవర్నరుగా 1775 లో నియమించినారు. ఈయన న్యాయముకొరకు చాల పాటుబడి- తన కౌన్సిలు మెంబర్లు, ఇతర ఇంగ్లీషు ఉద్యోగులు వ్యతిరేకులగుటచే- ఏమియు చేయలేక తుదకు తానే తన కౌన్సిలు సభ్యులచే ఖైదు చేయబడినాడు! (24 ఆగస్టు, 1776). ఆనాటి గవర్నర్ జనరల్ (1772-1774) వారన్ హేస్టింగ్స్ ఈ విషయములో మౌనము వహించెను. దానిని హర్షించినట్లుగూడ "హేస్టింగ్స్" 26-9-1776 లో తన స్నేహితునకు వ్రాసిన లేఖ వలన తెలియుచున్నది[102]. ఇంగ్లండులోని కంపెనీ డైరెక్టర్లు, పార్లమెంటు సభ్యులుకూడ- వారిలో ఉన్న అంతఃకలహములవల్ల- తగిన నిర్ణయమునకు రాలేకపోయిరి. ఇండియాలో నున్నప్పుడు చాల ధనము సంపాదించి, బ్రిటిష్ పార్లమెంటులో సభ్యులై- పాల్ బెన్ ఫీల్డ్ (ఇతనిని 1770, 1778 సంవత్సరములలో రెండుసార్లు ఇండియాలో ఉద్యోగమునుండి తొలగించిరి), ఆట్‌కిన్‌సన్ మొదలైనవారు- ఇండియాలో కంపెనీ ఉద్యోగుల అరాజకములను హర్షించి ఆమోదింపజేసెడివారు. వీరి ప్రయత్నము వలన "ఎడ్మండ్ బర్క్" (Edmund Burke 1728-1797) వంటివారి- పార్లమెంటులోని- ప్రయత్నములును వమ్మైయ్యెను. చివరికి "జార్జ్ పిగెట్" 11-5-1777 లో మరణించి తన బాధలనుండి విముక్తి పొందెను![103]

భారతదేశము నుండి 'కంపెనీ ఉద్యోగులు' సంపాదించి తెచ్చుచున్న ధనము; ఇంగ్లండులోని సమాజమును, రాజకీయ విధానమును కూడ అవినీతిపాలు చేయుచున్నదని "లార్డ్ ఛాతమ్" (Lord Chatham) 1770 లో ఇట్లు వ్రాసెను:

"For some years past there has been an influx of wealth into the country which has been attended with many fatal consequences because it has not been the regular,

---

102. Memoirs of Warren Hastings-Gleig (1841) Vol. II; Pages 106, 113.

(వారన్ హేస్టింగ్స్ భారతదేశములో చేసిన అవినీతి కార్యములను బ్రిటిష్ పార్లమెంట్‌లో అతనిని "ఇంపీచ్" చేయు సందర్భమున మహావక్త ఎడ్మండ్ బర్క్ బయట పెట్టిన విషయము ఐతిహాసిక సత్యము).

103. History of British Empire - Edward Thornton Vol. II; Pages 212, 213.

natural product of labour and industry. The riches of Asia have been poured in upon us and have brought with them not only Asiatic luxury but, I fear, Asiatic principles of government. Without connexions, without any natural interest in the soil, the importers of foreign gold have forced their way into Parliament by such a torrent of private corruption as no private hereditary fortune can resist''.[104]

పదునెనిమిదవ శతాబ్ది ప్రారంభ దశాబ్దిలోనే భారతదేశమునుండి తిరిగి వచ్చిన కంపెనీ ఉద్యోగులు, వర్తకులు ధనాఢ్యులై ఇంగ్లీషు ప్రజల మన్ననలను పొందుచున్నట్లు తెలియుచున్నది.[105] ఈవిధముగా ధనవంతులైనవారిని "నవాబు" లని ఇంగ్లీషు ప్రజలు పిలిచెడివారు. వీరివలన ప్రజాజీవితము కలుషితమగుచుండె నని ఆనాటి ఇంగ్లీషు మేధావులు, నాయకులు బాధపడుచుండిరి. ఆర్కాట్ నవాబు, తంజావూరు రాజు మొదలైనవారి నాశ్రయించుకొని ఉన్న ఇంగ్లీషు ఉద్యోగుల ప్రభావమును మనసునందుంచుకొనియే విలియమ్ పిట్ (William Pitt) 1782 లో ఇట్లు పలికెను. ఇంగ్లీషు పార్లమెంటునందు సంస్కరణలు ప్రవేశపెట్టవలెనను సందర్భమున పలికిన పలుకులివి :

"We have sitting among us the members of the Rajah

---

104. Modern India and the West-Edited by L. S. S. O' Malley. Oxford University Press, London - 1941. Page-748.

105. "I observe that our people in England often admire how the officers which the Company send into India, and the merchants which generally stay there, get such very great estates as they do and sometimes come home worth sixty to seventy and a hundred thousand pounds at a time". (రాబిన్‌సన్ క్రూసో అనినట్లు నవలకారుడు డేనియల్ డిఫో (1661-1731) తన Farther Adventures of Robinson Crusoe (1719) లో వ్రాసెను.

of Tanjore and the Nawab of Arcot....our senators are no longer the representatives of British virtue but of the vices and pollutions of the East."[106]

ఈ పరిస్థితులలో బ్రిటన్‌లోని ఇంగ్లీషు సమాజము, రాజకీయములు-బ్రౌనుదొరకు అవ్యవహిత పూర్వకాలమున- పదునెనిమిదవ శతాబ్దిలోనుండి, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధములోనికి ఆయా దోషములను చొప్పించెను. ఈ కాలమున, కంపెనీ ప్రభుత్వము సుస్థిరమగుటవలన దురాశగల ఉద్యోగులకు ప్రభుత్వాధికారము తోడై నిలిచినది. ఇంతటి నైతిక పతనమున్న కాలమున, బ్రౌనుదొర నీతిగా- తన జీతముమీద తాను - జీవించినాడన్నప్పుడు ఆయన వ్యక్తిత్వము యొక్క విశిష్టత అర్థమగును.

కడపలో మొట్టమొదట ఆగస్టు 1820 లో ప్రిన్సిపల్ కలెక్టర్ దగ్గర రెండవ అసిస్టెంటుగా ఉద్యోగములో చేరెను. తొమ్మిది సంవత్సరములు, వివిధ ప్రాంతములలో "సబార్డినేట్" హోదాలోనే పని చేసెను. 1829 లో జిల్లా స్థాయి ఉన్నతోద్యోగిగా హోదాను సంపాదించెను. తరువాత 1832 లో మాత్రమే "ఫస్ట్‌క్లాస్ సివిల్ సర్వెంట్" హోదాను పొందగలిగెను. 1834 లో "సస్పెన్షన్" వలన పోగొట్టుకొన్న "రెవిన్యూ, జ్యుడీషియల్" శాఖలలో ఉద్యోగములు మరల లభింపలేదు. దీనితో, నిజమైన అధికారము "చెలాయించ"గలిగిన ఉద్యోగములు పోయినట్లే! ఉద్యోగకాలములోని ఉత్తరార్ధములోని చాల భాగము "మద్రాసు"లో గడచుటతో జీతము మద్రాసు జీవితమునకు 'బొటాబొటి'గా సరిపోవుచుండెననవచ్చును. ఆయన పుస్తకముల వలన ఇతరులు (ముద్రాపకులు, వ్యాపారసంస్థలవారు) బాగుపడిరిగాని ఆయనకు నష్టమే కలిగినదని ఆయన వ్రాతలవలననే తెలియుచున్నది.[107]

---

106 Modern India and the West-Edited by L. S. S. O'Malley. Oxford University Press, London-1941, Page-798.

107. "My books may prove valuable to some publishers, but I was never a penny the richer for any of them, and by some I lost the sum I expended; but I looked for this result and was satisfied" (Some Account of the Literary life of C. P. Brown.)

ఉద్యోగములో అసిస్టెంట్‌గా ఉన్న మొదటి నాలుగైదు సంవత్సరములలో (1820-1825) ఆయన జీతము నెలకు 23⅓ రూ॥ మొదలు 350 రూ॥ వరకు నుండెను. 1825-1826 నాటికి నెల జీతము రూ. 525 అయినది. ఎలవెన్సుల క్రింద: టెంట్ ఎలవెన్స్ నెలకు రూ. 42/-, టూర్‌లో ఉన్నప్పుడు అదనముగా రోజునకు టెంట్ అలవెన్స్ రూ. 2-10-0; ఇంటి అద్దెకు నెలకు రూ. 35/- నుట్టుచుండెను. ఇదిగాక, కలెక్టరు క్రింద అసిస్టెంట్‌గా ఉన్న కాలమందు-అమానీ భూములపై వసూలయిన శిస్తు నుండి కొంత శాతము కమీషన్‌గా లభించెడిది. గుంటూరులో ఆక్టింగ్ కలెక్టర్‌గా ఉన్న కొలది నెలలలో నెలకు రూ. 17½/-చొప్పున ఎక్స్ట్రా ఎలవెన్స్ ఇచ్చినారు. సెలవు ముగించుకొని (1838) మద్రాసు వచ్చిన వెంటనే నెలకు రూ. 400/-మీద పర్షియన్ అనువాదకునిగా- మద్రాసులో- నియమించిరి. ఈ కాలమున, మొత్తం మీద-జీతము ఎలవెన్స్‌లు కలిపి- రూ. 600/- దాటలేదనవచ్చును. ఇందు వలననే ఆయన కటకటలాడి పోయినాడు. 1852 లో (మనదేశమును విడిచిపోవుటకు మూడు సంవత్సరముల ముందు) ఫస్ట్‌క్లాస్ సివిల్ సర్వెంట్ హోదాను పొందుట వలన నెల జీతము రూ. 3,038/- వరకు నుండెను 1855 లో భారత దేశమును- పెన్షన్ తీసికొని- శాశ్వతముగా విడిచిపోయినప్పుడు కంపెనీ వారు [illegible] సాలుకు 920 పౌన్లు పెన్షన్‌గానిర్ణయించిరి. 1865లో లండను విశ్వవిద్యాలయములో తెలుగు ప్రొఫెసర్‌గా, 1869 లో ఐ. సి. ఎస్. వారికి తెలుగు ఎగ్జామినర్‌గా కొంత ఆదాయము "చన్నీళ్ళకు వేణ్ణీళ్ళు"గా లభించినదనవచ్చును.[108]

బ్రౌనుదొర 1855 లో ఇండియాను శాశ్వతముగా విడిచిపోవుటకు ముందు తాను సేకరించిన కొన్ని వేల గ్రంథములను - వివిధములైన ఐరోపీయ భాషలలో నున్న వానిని-నష్టమునకే అమ్మివేసెను. మద్రాసులో ఆ పుస్తకములను కొను వారు ఎక్కువ మంది ఉండరు కదా ! గహనములైన విషయములకు సంబంధించిన పుస్తకముల సంగతి ఇంక చెప్పనక్కరలేదు! ఒక్కొక్క ఉద్గ్రంథమునకు ఒక షిల్లింగ్ కంటె తక్కువయే వచ్చినట్లు ఆయన వ్రాసికొనెను. తన జీవిత కాలములో శ్రమపడి సేకరించిన బైబిలు ప్రతులను, తాను జీతమిచ్చి చేయించిన బైబిలు తెలుగు అనువాదమును శ్రమపడి తాను పునఃపరిశీలన చేసి సిద్ధము చేసిన తెలుగు బైబిలును హీబ్రూ, గ్రీకు మొదలైన భాషలలో నున్న బైబిలు ప్రతులను

---

108. బ్రౌను జాబులు : స్థానిక చరిత్ర; కడప జాబుల సంకలనం; సంశోధన; బంగోరె; పర్యవేక్షణ; జి.ఎన్. రెడ్డి; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం; తిరుపతి; 1977 పుటలు — 96, 97.

"బైబిలు సొసైటీ" కి ఇచ్చివేసెను.[109] తాను వ్రాసి అచ్చొత్తించిన పుస్తకములను "లాటు"గా కొనవలసినదని ప్రభుత్వమును అభ్యర్థించినను అంతగా లాభము లేకపోయెను. ఒక్కొక్క పుస్తకమును ఒకటి రెండు వందల ప్రతులను మాత్రమే కొనుట జరిగి బ్రౌను దొరకంత లాభము రాలేదు.

లండన్ పోయిన తరువాత (1855) కేవలము విశ్రాంతి తీసికొనిన కంపెనీ ఉద్యోగిగా కాక భాషా సేవకునిగ పరిశోధకునిగ ఇంకను ముప్పది సంవత్సరములు (1884) శ్రమించి దివంగతుడయ్యెను. ఈ కాలములోనే ఆయన తన తెలుగు వ్యాకరణము ద్వితీయ ముద్రణము (1857) నకు చక్కని పీఠిక వ్రాసి వంపెను 1883 లో "కర్ణాటిక్ క్రోనాలజీ" ప్రచురించెను. భారత దేశమును విడిచి పోవునప్పుడు మిత్రుల కోరికపై బ్రౌను దొర తన జీవిత చరిత్రను వ్రాసినట్లు డి. ఎఫ్, కార్మికేల్ వ్రాతల వలన

---

109. "I now made preparations to quit India, and sold off all my property with about five thousand volumes of European literature. But, in Madras English, French and Latin books are a mere drug and my books, particularly the learned ones went for less than a shilling a volume."

"My collection of Bibles I bestowed on the Bible Society. A Telugu translation of the Bible having been eompleted by the persons whom I employed and paid, I now commenced a revisal of the whole. This task has proved laborious but proceeds steadily. The correct rendering of each word had been settled while I prepared the English - Telugu Dictionary. On completing the work I presented to the Bible Society a collection of Bibles in Hebrew, Greek and various languages, which had aided me in the task."

(Some Account of the Literary life of C. P. Brown)

తెలియుచున్నది :

"On the eve of leaving India, their learned colleague was induced by his friends to compile some details of his own literary life. But as the narrative was not printed for publication the Board do not deem it proper to make free with its contents."[110]

భారత దేశమును విడిచి వెళ్ళిపోవుటకు కొంచెము ముందుగా వ్రాసిన ఈ 'జీవిత చరిత్ర' 1854 లో వ్రాసి యుండవచ్చును.

ఇది గాక బ్రౌనుదొర 1866 లోను 1872 లోను రెండుసార్లు తన 'జీవిత చరిత్ర' ను వ్రాసి లండనులో అచ్చువేయించెను. వీనిలో 1866 లో అచ్చైన దానిని సంస్కరించి 1872 లో ముద్రించుట జరిగినది. సంస్కరణను పొందిన 1872 అచ్చుప్రతి ప్రచారమునకు వచ్చి బ్రౌనుదొర 'ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు' 1895 లో మద్రాసున ద్వితీయ ముద్రణమును పొందినప్పుడు (దీని సంస్కర్త ప్రెసిడెన్సీ కాలేజిలో ఇంగ్లీషునకు అసిస్టెంట్ ప్రొఫెసరయిన ఎమ్. వెంకటరత్నంగారు) దానియందు ముద్రితమై మనదేశములోని వారికి సులభముగ అందుబాటులోనికి వచ్చినది.*

110. A Catalogue Raisonnee of Oriental Manuscripts in the Library of the (Late) College, Fort Saint George ; by the Rev. William Taylor (Vol. I) Madras, 1857. దీని Preface లో బోర్డు సెక్రటరీ అయిన డి. ఎఫ్. కార్మికేల్ (23-3-1858) వ్రాసిన వాక్యములు.

* ఈ రెండును (1866, 1872) గాక మూడవది (వ్రాతప్రతి) ఒకటి, మినెసోటా విశ్వవిద్యాలయములోని ఏమెస్ దక్షిణ ఆసియా గ్రంథాలయములో (Ames Library of South Asia, University of Minnesota) తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయములోని తెలుగు అధ్యయన శాఖ నిర్వహించుచున్న 'బ్రౌను ప్రాజెక్టు' లోని పండిత పరిశోధకులకు లభించినది. ఈ మూడింటిని గ్రహించి 1866 లో అచ్చయిన జీవిత చరిత్రను నాధారముగా నుంచుకొని 1978 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము వారు Literary Auto-Biography of C. P. Brown అను పేర బ్రౌను జీవిత చరిత్ర అచ్చు వేసిరి. దీనికి ఆచార్య జి.ఎన్. రెడ్డిగారు ప్రధాన సంపాదకులు. 'బంగోరె' (శ్రీ బండి గోపాలరెడ్డిగారు) సంపాదకులు. ప్రస్తుత గ్రంథకర్తకు (ఈ గ్రంథము యొక్క ద్వితీయ ముద్రణమునకు) బ్రౌను ప్రాజెక్టువారు ప్రచురించిన ఇతర గ్రంథముల వలెనే, ఈ Auto-Biograghy కూడ చాల సాయపడినది.

బ్రౌనుదొర లండనులో నున్నప్పుడు కూడ తెలుగు దేశముతో సంబంధమును "తెగతెంపులు" చేసికొనకుండ, ఇక్కడ భాషా సాహిత్య రంగములలో జరుగుచుండెడి కృషిని పరిశీలించుచునే యుండెను. మన దేశములోని కొందరు మిత్రులు, అభిమానులు, పరిచయ మున్నవారు ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపు చుండెడి వారనుటకు తార్కాణములున్నవి. చిన్నయసూరిగారి వ్యాకరణమును బ్రౌనుదొర చూచియుండవచ్చును. బ్రౌనుదొర వ్యాకరణము ద్వితీయ ముద్రణమునకు వచ్చునప్పటికి సూరిగారి వ్యాకరణము (1858) వచ్చినది. మదరాసులో తెలుగు మున్షీ మద్దాలి లక్ష్మీనరసయ్యగారి తెలుగు వ్యాకరణము, ఆర్డెన్ (A.H. Arden) దొర వ్రాసి ముద్రించిన తెలుగు వ్యాకరణము (1873), కర్ దొర (M.W. Carr) ఆంధ్రలోకోక్తిచంద్రిక (తెలుగు సామెతలు-1868) బ్రౌనుదొర పరిశీలించుట జరిగినది. ఇదిగాక, రాయల్ ఏషియాటిక్ సొసైటీ (లండను) పత్రికలో కొన్ని వ్యాసములు ప్రచురించెను. లండను విశ్వవిద్యాలయములో తెలుగున కాచార్యునిగ నియమితుడై పనిచేసినట్లును, సివిలు సర్వీసు ఉద్యోగులకు తెలుగులో పరీక్షలు చేసినట్లును (1869) మనకు తెలియుచునే యున్నది, ఆనాడు లండనులో సంస్కృతాచార్యుని నుండిన జర్మను దేశస్థుడయిన "గోల్డ్‌స్టకర్" (Goldstucker) ను 1860 లో కలిసికొనినప్పుడు, అతని కోరిక ననుసరించి 1857 లో తాను "సంస్కృత ఛ్చందస్సు" మీద వ్రాసిన చిన్ని పుస్తకమును పెంచి విపులీకరించి Sanscrit Prosody Explained అను పేర 1869 లో ముద్రించెను. ఈ గోల్డ్‌స్టకర్ నకు చిన్నతనములో సంస్కృతముమీద అభిమానము బ్రౌనుదొర వలననే కలిగినది ! ఆనాడు తెలుగుదేశమున ప్రసిద్ధులై రచనలు చేయుచుండిన - స్వామినీన ముద్దునారసింహానాయనివారు (హితసూచని-1862), నరహరి గోపాలకృష్ణమ సెట్టిగారు (శ్రీరంగరాజు చరిత్ర-1872), వీరేశలింగం పంతులుగారు (రాజశేఖర చరిత్ర-1878) మొదలైనవారు చేసిన రచనలతో బ్రౌనుదొరకు పరిచయమున్నదని చెప్పవచ్చును. తెలుగుదేశమునకు, తెలుగువారికి దూరముగ లండనులో నున్నను తెలుగుభాషా సాహిత్యములకు ఆయన దూరముగ లేడు. తెలుగులో పత్రికలు బయలుదేరుచున్నందులకు, ముద్రణ వృద్ధి పొందుచున్నందులకు ఆయన ఆనందమును వ్యక్తము చేయుట మనకు తెలిసిన విషయమే !

భారతదేశములో వచ్చిన సిపాయిల తిరుగుబాటు (1857) నకు ముందే స్వదేశమునకు తరలిపోయిన కంపెనీ ఉద్యోగి బ్రౌనుదొరకు, భారతదేశములోని సామాజిక పరిస్థితులను గురించిన విశిష్ట జ్ఞానముండును గనుక ఆ 'సిపాయిల తిరుగుబాటు' జరిగిన వెంటనే ఆయనను భారతదేశములోని పరిస్థితులను గురించి (ముఖ్యముగా హిందు, ముస్లిములను గురించి) ఉపన్యాసములు ఈయవలసినదిగా ఇంగ్లీషు ప్రజలు కోరుట సహజము. ఈ విధముగా బ్రౌనుదొర చాల పట్టణములలో ఉపన్యసించినట్లు తెలియుచున్నది.[111]

తాను సిద్ధముచేసి అచ్చువేయించిన నిఘంటువులకు ప్రతి దినమును క్రొత్త క్రొత్త మాటలను బ్రౌనుదొర చేర్చుచునేయుండెను.[112] లండనులో ఇట్లు చేర్చిన మాటలు వేలకొలది కలవు. అచ్చయిన నిఘంటువులలో కాగితమునకు కాగితమునకు మధ్య తెల్లకాగితము వేయించి బైండుచేయించిన పుస్తకములలో ఈ మాటలను ఆయన చేర్చుచుండెను. ఇట్లు సిద్ధమయిన నిఘంటువులలో ఇచ్చిన ప్రయోగములు తానే అచ్చువేయించిన కావ్యములనుండి తీసికొనుచుండెను. ప్రథమ ముద్రణమైన ఈ ప్రయోగములను లిఖిత ప్రతులనుండి తీసికొనినట్లు ఆయనయే వ్రాసెను. తన వ్యాకరణము, నిఘంటువులు పూర్తి అయినట్లు కనబడినను, వానికి చేర్పులు మార్పులు తాను చేయుచునేయుండినట్లు వ్రాయు

---

111. "I was also called upon to deliver a lecture upon the present state of the Hindus... this has been delivered in eight towns, and continually extended".

(Some Account of the Literary Life of C.P. Brown.)

112. "The Telugu classical poems had been printed from the texts prepared at my expense. I continued the perusal; and daily made additions to the *Dictionaries* and to the *Grammar*; which are now greatly extended". (Ibidem).

సందర్భమున బ్రౌనుదొర తనకును డా॥ జాన్సన్‌కును పోలికను ఇట్లు సూచించెను: "Though the Dictionaries and the Grammar appear to be completed, I have never ceased making additions and improvements. Dr. Johnson made alterations in his Dictionary as long as he lived and he lived to print it eight times."

బ్రౌనుదొర, లండను చేరిన తరువాత తాను జీవించిన ముప్పది సంవత్సరములను భాషా సాహిత్యములలో (ముఖ్యముగా తెలుగు) కృషిచేయుచునే యుండెను.

ముసలితనము పూర్తిగా పైబడినప్పుడు, 1884 నవంబరులో 3వ తేదీని బ్రౌనుదొర 'విల్లు' నొకదానిని వ్రాసెను* విల్లు వ్రాయునప్పటికి బ్రౌనుదొరకు 86 సంవత్సరములు. ఇది వ్రాసిన నెలరోజులకు- 12-12-1884 న ఆయన కీర్తిశేషుడయ్యెను. విల్లునుబట్టి చూచినప్పుడు- ఇతరులకిచ్చుటకు ఆయనదగ్గర డబ్బుకంటె పుస్తకములే ఎక్కువ యున్నట్లు- మనకు తెలియును.

తెలుగు, సంస్కృతము మొదలైన ప్రాచ్యభాషల ముద్రిత గ్రంథములు, అముద్రిత లిఖితప్రతులు, ఇతరములైన కాగితములు, ఇండియా ఆఫీసు లైబ్రరీకి అంతకు పూర్వమిచ్చినవి- అన్ని- ఇండియా కార్యదర్శి (Secretary of State for India) పరముచేసి వానిని ఇండియా ఆఫీసు లైబ్రరీలో పెట్టవలసినదిగా బ్రౌనుదొర కోరెను. ఇవి కావలసినవారు వానిని నిరభ్యంతరముగ ఉపయోగించుకొందురని ఆయన వాంఛించెను. ఈ గ్రంథములను సర్దుట మొదలైన పనులలో నియుక్తుడైనందులకు అప్పటి లైబ్రేరియన్‌నకు తాత్కాలికముగా బ్రౌనుదొర

---

* ఈ 'విల్లు' శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తెలుగు అధ్యయన సంస్థవారి బ్రౌను ప్రాజెక్టు పండిత పరిశోధకులు ముద్రించిన 'Literary Autobiography of C.P. Brown' (1978) పుస్తకములో 83-84 పుటలలో కలదు.

పది పౌనులు ఈయవలసినదిగా విల్లులో వ్రాసెను.[118]

తనదగ్గర ఇరువది నాలుగు సంవత్సరములు పనిచేసిన సారా నాట్ (Sarah Natt) నకు 250 పౌనులు, గృహోపకరణములు, వస్త్రములు, కేవలాలంకరణ వస్తువులైన చిత్రపటములు మొదలైనవి కాక మిగిలిన సామగ్రి చెందునట్లు వ్రాసెను. ఇంకొక సేవకురాలైన ఎమ్మ అగర్ (Emma Ager) నకు 25 పౌనులు ఇచ్చెను. ఏన్ హెన్రిట షెర్మన్ (Ann Henrietta Shearman) అను నామెకు 200 పౌనులు, ఆమె సోదరి అగ్నెస్ లైనీ (Agnes Lainy) అనునామెకు 100 పౌనులు, మిస్ మేటిల్డా కోస్ట్లే (Miss Matilda Costley) అను నామెకు 5 గినీలు చెందునట్లు విల్లులో వ్రాసెను. ఇవన్నియు పోగా మిగిలిన ఆస్తి భాగమును చెరిసగము పైని పేర్కొన్న అక్క చెల్లెళ్ళకు వ్రాసెను.

తనకు ఇతరులీయవలసిన అప్పులన్నింటిని రద్దుచేసినట్లు కూడ వ్రాసెను. తాను విల్లు ద్వారా సంక్రమింపజేసిన ఆస్తులు, ఆయా స్త్రీలు తమ భర్తల ప్రమేయము లేకుండ అనుభవింపవచ్చుననియు వానిలో భర్తలకు పాలు లేదనియు కూడ వ్రాసెను.

ఈ విల్లులో బ్రౌనుదొర తన సోదరులకు (ఆయనకు ఒక అన్న, ఒక తమ్ముడు ఉండిరి. వీరిద్దరు బెంగాలు సర్వీసులోనే చేరిరి. ఇద్దరు సోదరీమణులు

---

118. "The will of Charles Philip Brown (of No. 22, Kildare gardens in the County of Middlesex) Esquire, Being now in the eighty sixth year of my age but of sound mind and body and free from all debts, I bequeath to the Secretary of State in India all my manuscripts and printed books regarding Telugu, Sanscrit or any other oriental language and all my papers printed or manuscript now in the India Office or in my study regarding the same to be deposited in the Library of the India Office in Westminster being bequeathed by me for the use of those who have access thereto. And I bequeath to the Librarian for the time being of the same Library the sum of ten pounds for any trouble he may be put to in taking charge of the same manuscripts" (C.P. Brown's will).

కూడ నుండిరి) ఏమియు ఇచ్చినట్లు లేదు. కాని, తన సోదరుడైన జేమ్స్ కౌలే బ్రౌన్ (James *Cowley Brown) కుమారుడైన జార్జి జేమ్స్ కౌలే బ్రౌన్ (George James Cowley Brown) ను తన విల్లునకు ఒక ఎగ్జిక్యూటర్ (Executor) గా, ట్రస్టీ (Trustee) గా నియమించుటయేగాక; ఇతరులకు ఇతర సంస్థలకు ఈయగా మిగిలిన పుస్తకములలో నూరు వాల్యూములు కూడ సంక్రమింపజేసెను. ఈతనితోబాటు మిసెస్ లూసీ స్టాగ్ (Mrs. Lucy Stagg) అనునామెకూడ బ్రౌనుదొర విల్లునకు ఎగ్జిక్యూట్రిక్స్ (Executrix) గాను, ట్రస్టీగాను నియమితురాలయ్యెను. వీరి ఈ శ్రమకు, చెరియొక డెబ్బది పౌనులు ఈయవలసినదని బ్రౌనుదొర విల్లులో వ్రాసెను. ఈ విల్లునకు సాక్షులుగ విలియమ్ లెవిస్ (William Lewis, Solicitor, 7, Wilmington Square, W.C) సి. ఎమ్. జోన్స్ (C.M. Jones, 86, Westbourne grove W). అనువారు సంతకములు చేసిరి.[114]

---

* బ్రౌనుదొర తల్లిగారి పుట్టింటివారి పేరు "కౌలీ", ఆయన తాతగారు కెప్టెన్ కౌలే (Captain Cowley). బ్రౌనుదొర తండ్రి రివరెండ్ డేవిడ్ బ్రౌన్, మొదటిభార్య చనిపోయిన తరువాత ద్వితీయ వివాహమున మిస్ ఫ్రాంసెస్ కౌలే (Miss Frances Cowley) ను పరిగ్రహించునాటికి (19 జూలై 1796 కలకత్తా) ఆమె తండ్రి కెప్టెన్ కౌలే బెంగాలు పదాతి దళమునకు చెందియుండి కలకత్తాలోనే పనిచేయుచుండెను. బ్రౌనుదొర సోదరులు బెంగాలు సివిల్ సర్వీసులో చేరుటకు, వారిలో నొకరు తన పేరుతో తల్లిగారిపేరైన "కౌలే" చేర్చుకొనుటకు తాతగారైన కెప్టెన్ కౌలే ప్రభావము కొంత యుండి యుండవచ్చును. (ఈ పరిశోధన గ్రంథములో పుట-34).

114. "And I appoint Mrs. Lucy Stagg, widow of George Stagg Esquire of 23, Graven Hill Gardens, Hyde Park and my nephew the Revered George James Cowley Brown of Grosvenor Street, Edinburg, Executrix and Executor and Trustees of this my will. And I bequeathed to each of them for the trouble they may have as such executrix and executor the sum of seventy Pounds." (C.P. Brown's will).

బ్రౌనుదొర 'విల్లు'లో పేర్కొన్న భ్రాతృవ్యుడు 'కాలే' అను నామమునుగూడ పెట్టుకొనెను గనుక అతడు బ్రౌనుదొరతోబాటే 'హెయిల్‌బరీ' (Haileybury) కళాశాలలో చేరిన ఆతని సోదరుడు జేమ్సు కాలే బ్రౌన్ పుత్రుడని నిర్ణయింపవచ్చును. (ఈ సోదరులిద్దరు ఒకేదినమున 19 జనవరి 1814) ఒకరు మద్రాసు సివిల్ సర్వీసున, ఇంకొకరు బెంగాల్ సివిల్ సర్వీస్‌న నియుక్తులైరి. ఇక్కడ "నియుక్తులైరి" అన్నప్పుడు ఆయా ప్రాంతములలో ఉద్యోగములలో చేరిరనికాదు. ఇండియాలో తూర్పిండియా కంపెనీలో "రైటర్లు" (Writers గా ఉద్యోగులగుటకు అర్హతను కలిగించు "చదువు"లో హెయిల్‌బరీ కళాశాలలో చేరిరన్నమాట! ఈ కళాశాలలో చేరినప్పుడే, చేరిన యువకులలో ఎవరు ఎక్కడ భారతదేశములో పనిచేయవలెనో నిర్ణయించి వారిని ఆయా ప్రాంతములకు "నియమించి" చదువుకొన సాగింపజేసెడివారు. బ్రౌను సోదరుల నియామకమిట్లు జరిగినది. ఆనాడు కంపెనీలో రైటర్లుగా చేరుట మొదటి ఉద్యోగము. దీనిని గురించి కొంత విపులంగా తెలిసికొనినచో ఆనాటి పరిస్థితులర్థమగుటయేగాక, సకామకృషి పరిపాలించుచున్న ఆ కాలములో బ్రౌనుదొర నిష్కామకృషి విలువ కోటి గుణితమగును!

కంపెనీ రైటర్లుగా తీసికొనబడిన యువకులకు భారతదేశ వ్యవహారములను గురించి ఇంగ్లండులోనే శిక్షణ ఇచ్చుటకు కంపెనీ డైరెక్టర్లు 1805 లో హార్ట్ ఫోర్డ్‌షైర్ (Hartfordshire) లో ఉన్న హెయిల్‌బరీ (Haileybury) ఎస్టేటును కొని కళాశాలా భవనముల నిర్మాణమునకు పూనుకొనిరి. కట్టడములు వచ్చువరకు హార్ట్‌ఫోర్డ్ కోటలో 1806 లో ఈస్ట్ ఇండియా కాలేజ్ అను పేర కళాశాలను స్థాపించిరి. కట్టడములు వచ్చిన తరువాత 1809 లో హెయిల్‌బరీకి కళాశాలను తరలించిరి.

దీనిలోచేరెడి పిల్లల వయస్సు సాధారణముగా పదునైదు సంవత్సరములుండెడిది. ఆరోజులలో, ఇంగ్లీషువారికి కంపెనీ ఉద్యోగులుగా ఇండియా వచ్చుటయనగా అపరిమిత ధన సంపాదనకు మార్గము తెరువబడినట్లే గనుక- పెద్ద కుటుంబములవారి పిల్లలు, కంపెనీ డైరెక్టర్ల పిల్లలు, మతాధికారుల పిల్లలు, వణిక్ప్రముఖుల పిల్లలు, ఇంకను పలుకుబడిగలవారి పిల్లలు రైటర్లుగా చేరి ఇండియా వచ్చెడివారు. బ్రౌను సోదరులు మతాధికారి పిల్లలుగా కంపెనీ ఉద్యోగములకు స్వీకరింపబడిరి. ఉద్యోగాభ్యర్థులకు పెద్ద చదువులనావశ్యకము

చిన్న వయస్సు, భాషల విషయకమైన కొంత సామాన్య పరిచయము చాలును. ఇవిగాక— 500 పౌనుల రెండు సెక్యూరిటీలతో ఒక 'బాండు' సక్రమముగా పనులు నిర్వర్తింతునని లిఖితపూర్వకముగా సమర్పణచేయుట— ముఖ్యమైనవి. కళాశాలలో చేరి రెండేండ్లు చదివిన తరువాత ఈస్ట్ ఇండియా హౌస్‌నకు పోయి లిఖితపూర్వకముగా 'కాంట్రాక్టు' వ్రాసి ఇచ్చిన తరువాత ఆరు నెలల లోపుగా భారతదేశమునకు వారు విధిగా పోవలెను. ఆ రోజులలో ఇండియాకుపోయి తొందరగా ధనవంతులము కావచ్చుననెడి భావము ప్రజలలో ప్రబలముగా నుండుటవలన లంచములిచ్చి ఈ 'రైటరు' ఉద్యోగమును సంపాదించెడివారు. 1772 లో, ఒక పత్రిక కథనము ప్రకారము— 'రైటరు' ఉద్యోగమును రెండు వేల, మూడువేల పౌనులకు "కొనుట" జరుగుచుండెడిదట! 1773 లో ఒక పత్రికలో, బెంగాలులో 'రైటరు' ఉద్యోగమునకు, "ఒక వేయి గినీలు ఇచ్చుటకు సిద్ధము" అని ప్రకటన పడినదట!

హెయిల్‌బరీ కళాశాలలో లాటిన్, గ్రీకు భాషలలోని కావ్యములు, రాజనీతి, అర్థశాస్త్రము, చరిత్ర, న్యాయశాస్త్రము, ప్రాచ్యభాషలలో—సంస్కృతము, ఫార్సీ, అరబ్బీ, హిందుస్థానీ, బెంగాలి నేర్పెడివారు. మొదటిలో—దక్షిణ భారత భాషల అధ్యయనము లేదు.

బ్రౌను సోదరులు ఈ కళాశాలలో 1814 లో చేరునాటికి రెవరెండ్ జోసెఫ్ హెచ్. బేటన్ దీనికి ప్రిన్సిపాల్. అలెగ్జాండర్ హేమిల్టన్ భారతీయ సాహిత్యేతిహాసములను బోధించెడివాడు. చార్లెస్ విల్కిన్స్ (1750-1836) అతిథి ఆచార్యునిగా వచ్చెడివాడు. మౌల్వీ మిర్జాఖలీల్, మున్షి గులాం హైదర్‌లుకూడ పనిచేయుచుండెడివారు.

ఇండియాలో గవర్నర్ జనరల్ మార్క్విస్ వెలస్లీ (Marquess of Wellesley) ఇక్కడ పనిచేయుటకు వచ్చెడి కంపెనీ ఉద్యోగుల జ్ఞానాభివృద్ధికి ఫోర్ట్ విలియమ్ కళాశాలను 1800 లో కలకత్తాలో స్థాపించుటతో లండనులోని కంపెనీ డైరెక్టర్లకు వేడిపుట్టి తమ సివిలు సర్వీసు ఉద్యోగులు ఎక్కడ భారతీయాభిమానులుగా మారిపోవుదురో అను భయముతో హెయిల్‌బరీ కళాశాలను స్థాపించినవచ్చును! దాక్షిణాత్య భాషలను నేర్పుటకు మద్రా

సులో 1812 లో స్థాపితమైన ఫోర్ట్ సెయింట్ జార్జి కాలేజి కృషిచేయుచుండెడిది. మే ఒకటవ తేదీని (1812) కాలేజి బోర్డు ఏర్పాటయినది. దాని ముఖ్యమైన పనులలో ఒకటి : "In expediting and perfecting the preparation of the candidates for those important public offices which the members of the Civil Service are destined to fill".

దక్షిణదేశమున (మద్రాసు ప్రెసిడెన్సీ) ఉద్యోగులుగా నియుక్తులైన బ్రౌనుదొర మొదలైనవారందరు (బ్రౌన్, గ్రాంట్, విల్లాక్, డేవిసన్, మారిస్, క్లార్క్, గ్రహాం, ఎలియట్, థాంసన్ మొదలైనవారు) ఇక్కడ చదివినవారే! వీరిలో చాలమంది పేర్లు ఈనాడు మనకు తెలియవు. తెలిసినవారుకూడ బ్రౌనుదొరతో పోల్చదగిన కృషిచేసినవారు కారని వెంటనే చెప్పవలసివచ్చును. ఈ ఐతిహాసిక నేపథ్యము ననుసరించి బ్రౌనుదొర కృషిని పరిశీలించినప్పుడు ఆయన విశిష్ట వ్యక్తిత్వము మన కనుల ఎదుట నిర్మలముగ స్ఫుటముగ గోచరించును.

బ్రౌనుదొర దివంగతుడైన తరువాత ఆయన గుణగణాదులను గూర్చి వ్రాసిన పత్రికలలో "ది టైమ్స్" (The Times, London), "ది ఎథీనియమ్" (The Athenaeum, London) అనునవి ముఖ్యమైనవి. వీనిలో 'ది టైమ్స్' పత్రిక, ఆయన చనిపోయిన వెంటనే (12 డిసెంబరు) ఆ వార్త ప్రచురించి, డిసెంబరు 20 వ తేదీని వివరణాత్మకముగ ఆయన జీవితమును గూర్చియు, రచనలను గూర్చియు వ్రాసెను. దీనిలో ఆయన భాషా సాహిత్యముల కృషిని గూర్చి ఇట్లున్నది :

"....but it was as a profound scholar of Indian languages that he became widely known in India and to many in England. In addition to a thoroughly practical knowledge of Persian, Hindustani and Sanscrit, he devoted himself to the language and literature of the people of the Telugu Country among whom his first official duties lay, and among European gentlemen he has probably been surpassed in familiar and literary knowledge of a native language only by the Jesuit Father Beschi who was in India in the beginning of the last century...."

"ది ఎథీనియమ్" పత్రికలో ఆర్. ఎమ్. మేక్డనాల్డ్ (R. M. Macdonald) ఇంకను విపులముగ బ్రౌనుదొర కృషిని గూర్చి వ్రాసెను. ఆయన సేకరించి బహూకరించిన తాళపత్ర ప్రతులను గురించియు, వ్యాకరణాదులను గురించియు, నిఘంటువులను గురించియు, చేసిన ఉద్యోగములను గురించియు వ్రాసెను. ఈ విషయములు మనకు చాలవరకు తెలిసినవే. ఇంగ్లండులోని వారికై దీనిని వ్రాయుటచే మేక్డనాల్డ్ అట్లు వ్రాసినాడనవచ్చును. బ్రౌనదొర పాండిత్యాదికమును గూర్చి మేక్డనాల్డ్ వెలిబుచ్చిన వాక్యములు మనకు ముఖ్యములు. వానిలో కొన్ని ఇవి :

"Mr. C.P. Brown, whose death at the advanced age of eightysix has been recently announced in the papers, was one of the most distinguished Oriental Scholars in Southern India...Much of his early service was spent in the Telugu districts, especially at Masulipatam, where he laid the foundation of that profound acquaintance with Telugu literature in which he became famous."

"Mr. Brown's ***opus magnum*** was his Dictionary, Telugu-English, English-Telugu and Mixed Dialects and Foreign words used in Telugu which appeared in 1852, 1853 and 1854..... A.D. Campbell and Morris had previously published dictionaries of considerable merit, but far inferior to Brown's".

"Few literary men have derived less pecuniary advantage from their labours. He told me a few months before his death that what he had received represented about a fifteenth part of what he had spent".

ఈ వాక్యములనుబట్టి ఆనాటి విద్వాంసులకు బ్రౌనుదొరమీద నున్న గౌరవ మర్యాదలు తెలియుచున్నవి.

బ్రౌనుదొర మృతికి ప్రపంచములోని ప్రాచ్య భాషాభిమానులందరు చింతించిరి. రాయల్ ఏషియాటిక్ సొసైటీ తన అరువది రెండవ వార్షిక సమావేశమున, బ్రౌనుదొర మృతికి సంతాపము తెలిపినది. ఆ సభకు సర్ విలియమ్ మ్యూర్ (Sir William Muir, K.C.S.I., D.C.L., LL.D.,) అధ్యక్షుడు. 1885, మే 18 వ తేదీని, జరిగిన ఈ సమావేశములో, 'సొసైటీ' యొక్క సంతాపము తెలుపబడినది.[115] తరువాత, సొసైటీయొక్క వార్షిక నివేదికలో, బ్రౌనుదొర యొక్క కృషి ప్రశంసింపబడినది.[116] అతడు చేసిన ఉద్యోగములు, పేర్కొనబడినవి.

మనమందరము కృతజ్ఞులమై ఉండవలసినంత సేవ, తెలుగు భాషా సాహిత్యములకు బ్రౌనుదొర చేసినాడు. ఈ సేవకాతడు వాంఛించిన ప్రతిఫలము కాని, లభించిన ప్రతిఫలము కాని, ఏమియు కనబడదు. ఈ నిష్కామకర్మాచరణమే, అతనిలోని విశేషము. ఇంత గొప్ప కృషిచేసిన అతడు; తానింకను చేయవలసినదెంతయో ఉండగా చేయలేకపోయినానే, అని. విచారించినాడు: చేయగలిగిన దానితో చేసినదానిని పోల్చినప్పుడు ఎంత బాధాకరముగునో, అతడూహించెను[117]. తన్నుగూర్చి తాను తెలిపిన లఘువ్యాసములో; అతడు తనకు వినయము లేదనియు, వ్రాసినదానిలోనుండి కొన్ని భాగములు తీసివేయవలెననియు వ్రాసి, తన వినయమును తెలిపెను[118].

ఆయన జీవితము మొత్తము నంతటిని సింహావలోకనము చేసి చూడగా, ఆయన సాధించినదంతయు స్వయంకృషి వలననే అని మనకు తెలియగలదు.అనగా,

---

115. "They have to announce with regret the loss by death or other causes, of their Resident members" (Journal of the Royal Asiatic Society, Annual Report, London, May, 1885).

116. "Mr. Brown was evidently a man who liked to do his work thoroughly." (Ibidem)

117. "Dr. Samuel Johnson has observed that it is a most mortifying thing for any man to consider what he has done, compared to what he might have done." (Some Account of the Literary Life of C.P. Brown).

118. "Looking over the statements here made, long written, and never yet impugned, I confess I find too little humility." (Ibidem)

ఇతరుల సాయమును పొందలేదని కాదు. చేసిన పనికి వెంటనే మెప్పుగాని, ధన లాభముకాని, ఉద్యోగము పెరుగుటకాని, లేనప్పుడు ఇంత గొప్ప కార్యమును తలపెట్టి, అందు దిగ్విజయమును పొందుటయే అతని స్వయం కృషి! ఈ భావమే అతనికిని ఉన్నట్లున్నది[119]. తన్నుగూర్చి ఇంకను వివరములు కావలెనన్న వారికి సమాధానముగా – "ఇక చాలు, చెప్పవలసినదంతయు చెప్పితిని. యోగ్యులైన వారిని గురించి మనకెంత తక్కువ తెలియును!" అని వ్రాసెను[120].

యుగసంధ్యలో తెలుగు ప్రాంతమునకు ఉద్యోగిగా వచ్చి, తెలుగుభాషను మాతృభాషకన్న విశేషముగ ప్రేమించి. ఆ భాషకు, సాహిత్యమునకు మరువ రాని సేవ[121] చేసిన మృతజీవి బ్రౌనుదొర. ఎ.హెచ్. ఆర్డెన్ మాటలలో :

"The student of Telugu must ever feel specially grateful to Mr. C.P. Brown, by whose efforts so much has been done to bring the language into its present position, and to render it accessible to Europeans".

---

119. 'జేమ్స్ ఫెర్గుసన్' జీవితచరిత్రలో, 'కార్లైల్'ను గూర్చి చెప్పబడిన క్రింది వాక్యములను బ్రౌనుదొర తన కన్వయించుకొనినాడు:
"He was what is generally called self-taught, but I think he might with propriety have been termed God Almighty's scholar." (Ibidem)

120. "I have said quite enough. How little we know of men more deserving! Quique sui memores alios fecere merendo!"

121. A Progressive Grammar of the Telugu Language - A.H. Arden; Preface to the First Edition, 1873. Madras.

# గ్రంథ సేకరణ - సంస్కరణ - ముద్రణ

బ్రౌనుదొర చేసిన కృషులలో ఉత్తమోత్తమమగునది. అతని పేరును ఆంధ్ర సాహిత్య చరిత్రయందు శాశ్వతముచేసినది, ఆతడు తెలుగు కావ్యములకు చేసిన సేవ. ఆనాడాతడు మేరుధీరుడై నిలిచి, ఆంధ్ర కావ్యముల నుద్ధరింప బూనకుండినచో, మహా కావ్యములని ప్రఖ్యాతిపొందిన చాల తెలుగు కావ్యములు మనకు లేకపోయెడివే. విస్మృతమై కొన్ని, అజ్ఞాతమున కొన్ని బహుళ ప్రచారములేక కొన్ని, ఆంధ్ర కావ్యములు క్రుంగుచుండగా, బ్రౌనుదొర ఆ "పుడమి కానుపు పద్మినులకు ఇనాకారముద్ర చూపి వెలయించెను." ఇందులకు అతని అధికారముద్ర చాలవరకు తోడ్పడెను. ఆ కాలమందు, ఏ తెలుగువాడును అంతటి ఘనకార్యము - అధికారము లేక ఉండదుగనుక - చేయలేకపోయెడివాడు. నాడది పాలకులైన ఇంగ్లీషు వారికే సాధ్యము. ఇది గుర్తించియే బ్రౌనుదొర తన పలుకుబడిని వినియోగించి, తెలుగు కావ్యముల సేకరణమునకు, సంస్కరణమునకు, ముద్రణమునకు పూనుకొనెను. సాహిత్య స్థాపకులకు, ఉద్ధారకులకు మన మిచ్చు గౌరవమునకు బ్రౌనుదొర పూర్ణముగ నర్హుడు.

వివిధ పాఠములను పరిశీలించి వ్యాఖ్యానములతో తెలుగు కావ్యములను పెద్దఎత్తున ప్రకటించుటకు పూనుకొనిన మొట్టమొదటివాడు బ్రౌనుదొర యనుటలో విప్రతిపత్తిలేదు పండితులను, వ్రాయసగాండ్రను, లిఖిత ప్రతులను సేకరించువారిని, సొంత డబ్బుతో పోషించి; వివిధ ప్రాంతములనుండి వ్రాత ప్రతులను తెప్పించి, వాని పాఠములలో గల పరస్పర వైరుధ్యములను తొలగించి, పద్య సంఖ్యలను, ఆశ్వాస విభజనలను నిర్ణయించి, శుద్ధమైన లిఖితప్రతులను నాడు బ్రౌనుదొర సిద్ధము చేయకుండినచో, నేడు మనకు ప్రాచీనాంధ్ర సాహిత్యములో చాల భాగము నామమాత్రావశిష్టముగ నుండెడిది. రాజరాజనరేంద్రుడు, శ్రీకృష్ణ దేవరాయలు, రఘునాథనాయకుడు మొదలైనవారు కావ్య సృష్టి విషయమున పోషకులు కాగా, బ్రౌనుదొర యుగసంధ్యలో నిలిచి, కావ్యరక్షణమున బాధ్యత వహించినాడు. ఇది సామాన్యమైనది కాదు. ఈ విషయమును మనము జ్ఞప్తియందుంచుకొనినచో, బ్రౌనుదొరకు మనమెంత ఋణపడి

యున్నామో తెలియును. అతడు పరిష్కరింపించి ముద్రించిన గ్రంథములే-మను చరిత్రాదులు-మనకు లేకుండినచో. మన సాహిత్య మెక్కడ? ఈ మహాకార్యమున, ఆతనికి సమస్త విధముల తోడ్పడినవారు, అతని పండితులు. కావ్యముల లిఖిత ప్రతులను సేకరించి తెచ్చినవారు, అతని యుద్యోగులు. శుద్ధప్రతులను సిద్ధము చేసినారు, అతని వ్రాయసగాండ్రు[1]. కాని, వీరనందరిని కూడగట్టుకొని వచ్చి పనిచేయించిన ప్రతిభ బ్రౌనుదొరది. నాడీ ప్రతిభ పైవారి నందరిని నడప కన్నచో-పై వారందరు ఎప్పుడును ఉన్నవారే-ఈ సాహిత్య యజ్ఞమున, అవభృత స్నానముండెడిది కాదు. యజ్ఞవ్యయముకూడ నాతడే భరించెను.

ఈ సాహిత్య యజ్ఞమునకు అధ్వర్యవము వహించిన బ్రౌనుదొర సొంత డబ్బు వెచ్చించి - పండితులను, వ్రాయసగాండ్రను, గ్రామములందు తిరిగి లిఖిత గ్రంథములను సంపాదించు వారిని, పోషించెడివాడు. నాడు కొంచెము తెలుగు వ్రాయగలిగినవాడు, పండితుడనిపించుకొనుచున్నవాడు - అందరు - తమకేదైన వ్రాతపని ఇప్పింపుడని బ్రౌనుదొరకు వ్రాసికొన్నవారే! ఉదాహరణకై ఒండు రెండు లేఖలనుండి భాగములను చూపుచున్నాను:

"మహారాజ రాజశ్రీ సి.పి. బ్రౌనుదొరవారి సముఖానకు, రాజువారి శీమ విరతని తాలూకాలో చేరిన మానంటూరు అగ్రహారములో వుండే మడుంబి శేషాచార్యులు అనేక సలాములుచేసి వ్రాసుకొన్న విన్నపము యేమంటే:... మీరు కాకితములలో తెలుగుప్రతులు వ్రాయిస్తూ, ఆ మూలకముగా బహుమందికి జీవనము నడిపిస్తున్నారని అనేకులవల్ల తెలిసినది. యీ కాకితములో వ్రాసి వుండే అక్షరములు నేను స్వతహాగా వ్రాశినవి. యీ అక్షరములు తాము కటాక్షించి చూచి, నేను నిండారి కున్ని గనక, నాకు జీవనము నడిపించే భారము తమదేగాని, యితరము నాకు యెవరులేరు". (తెలుగు రీడరు పుట - ౯౫)

---

1. "......Indeed there were always from ten to twenty.... in my pay; employed in transcribing native authors, in preparing correct editions, in framing indexes and commentaries." (Some Account of the Literary life of C. P. Brown)

బ్రౌనుదొరచేత వ్రాయసగానిగా నియమితుడైన యాతడు వ్రాసిన లేఖలోని భాగమీ క్రింద నీయబడుచున్నది:

"ఆజ్ఞాధారకుడైన గుండవరపు కృష్ణయ్య సలాములు చేసి వ్రాసుకొన్న అర్జీ విన్నపం.... 1826 సంవత్సరములో నేను వఠ్యం కృష్ణశాస్త్రులవద్ద వుండి, తమయొక్క గ్రంథములు వ్రాస్తూ వుండవలసినదని తాము కడపనుంచి నాపేర మా గ్రామానకు ఆజ్ఞ వ్రాయించినారు......." (20-11-1833 లేఖ వ్రాసిన తేది.) (తెలుగు రీడరు: పుట-183)

ఇట్లు చదువుకొన్నవారిని వ్రాయసగాండ్రగా నియమించి, వారిచేత గ్రంథములకు ప్రతులు వ్రాయించి, పరిష్కరణకు వాటిని సిద్ధపరిచెడివాడు.

తప్పులు లేకుండ, పాఠభేదముల నన్నింటిని గుర్తించి, శోధించి లిఖిత ప్రతిని – ముద్రణమునకు తగినదానివిగా - సిద్ధముచేయు పద్ధతిలో బ్రౌనుదొర, పాశ్చాత్య విధానము నవలంబించెను. తన కాలమునాటి పండితులు చదువు చెప్పెడి పద్ధతిని, గ్రంథములను పరిశీలించుపద్ధతిని గూర్చి బ్రౌనుదొర వ్రాసినది మనము గుర్తింపవలెను. నాటి పండితులు చెప్పెడిదానినే, పూర్తిగా నమ్మి చదివినచో, భాష రానివాని కుపయోగించునది అందు చాల తక్కువ అనియు, ఛందోబద్ధమైన పదజాలములను (నిఘంటువులను) కంఠస్థము చేయుడని వారు ప్రోత్సహింతురనియు, అందువలన విశేషమగు నుపయోగములేనట్లు తోచినందున, తాను పాశ్చాత్య విధానమునే అవలంబించినట్లును, బ్రౌనుదొర వ్రాసెను.[2] ఈ వాక్యములు చాలవరకతడు తెలుగు నేర్చుకొనగోరు, నేర్చుకొనుచున్న, పాశ్చాత్యులను మనస్సునందుంచుకొని వ్రాసినాడను విషయము మనము జ్ఞప్తి యందుంచుకొనవలెను. కాని, ఈ విమర్శ చాలవరకు సత్యమైనదని అందరును అంగీకరింపవలసినదే గదా !

ఈ విధముగ పాశ్చాత్య విమర్శన పద్ధతులకు మన దేశములో బ్రౌనుదొర పునాదులు వేసెను. ఈ విధానమును, అతడు తాను తెలుగు నేర్చుకొనుటలో

---

2. "......Were we to submit entirely to their guidance we should learn little that is profitable. They exhort us to learn by rote long vocabularies framed in metre; but I rejected these, preferring the European method of study." (Ibidem)

ఉపయోగించుటయేగాక, తాను ముద్రించిన గ్రంథముల సంస్కరణ విషయమున, వ్యాఖ్యల రచనయందు, లిఖితప్రతులను - వివిధ పాఠభేదములు గుర్తించుచు-సిద్ధను చేయుటయందును; అవలంబించెను.

వ్యాఖ్యాతలను గురించి వ్రాయుచు, వారికి తమ పాండిత్యమును ప్రదర్శించుకొనుట యందిచ్ఛ ఎక్కువ అనియు, "మూలమును పాఠకులకు అర్థమగునట్లు చేయుటకై వ్యాఖ్యానము పుట్టినది' అను భావము తక్కువ అనియు వ్రాసెను. ఆనాటికున్న వ్యాఖ్యానములలో చాలవరకు. వ్యాఖ్యానాలు తమ పాండిత్య ప్రకర్షకై వ్రాసినవేగాని, ప్రారంభకున కుపయోగించునవి కావనియు బ్రౌనుదొర ఊహ[3]. ఈ సందర్భమున, 'రామస్తవ రాజము'[4] అను గ్రంథమును సంస్కరించునప్పుడు, తనకు కలిగిన అనుభవమును బ్రౌనుదొర వ్రాసెను. ఆ పుస్తకములోని ఒక భాగము, బ్రౌనుదొరకును వ్యాఖ్యానము చేయుచున్న పండితునకును కూడ 'కొరుకుపడని కొయ్య' కాగా దానిని విడువవలసినదని, పండితునకు బ్రౌనుదొర సలహా ఇచ్చెనట! కాని పండితుడగు ఆ వ్యాఖ్యాత అట్లు వినపక, కొన్ని దినములు పోయిన పిదప, దానికొక వింత అర్థము, అతిప్రయత్న పూర్వకముగ చెప్పెనట! అప్పుడు బ్రౌనుదొర, ఆ అర్థమునకును గ్రంథస్థ విషయమునకును సంబంధము లేదని నిరూపింపగా, ఆ వ్యాఖ్యాత, "ఆ సంబంధములేని సంగతి పాఠకులు గ్రహించుటకే దీని నిట్లుంచెదను[5]" అని పలికెనట!

ఇట్లు వ్రాసినను బ్రౌనుదొరకు మన పండితుల పాండిత్యమందు గౌరవము లేకపోలేదు. తనకు సహజమైన వినయముతో, తెలుగు పండితులు పాండిత్యమున తనకంటె అన్ని విషయముల అధికులని వ్రాసెను. ఈ సత్యనిష్ఠయే అతనిని మనము గౌరవించునట్లు చేసినది. పండితుల ఆర్థిక స్థితికి వగచుచు, వారు దారిద్ర్యమున

---

3. "They were written more to glorify the acumen of the critic and less to aid the learner." (Ibidem)

4. "రామస్తవరాజం a poem in three books; by మల్లనార్య teaching mysticism......" (Ibidem)

5. "...I read it and observed that it was ingenious, but readers would complain that it had nothing to do with the text. He laughed and said, I shall leave them to find it out......" (Ibidem)

మునిగి యున్నారనియు, సామాన్య సేవకున కిచ్చు జీతమునకే వారు సంతోషింతు రనియు వ్రాసెను.[6] ఈ సందర్భమున బ్రౌనుదొర, రావిపాటి గురుమూర్తి శాస్త్రి (1770-1836) పాండిత్యమును గూర్చి వ్రాసిన క్రింది వాక్యములను పరిశీలించినచో, అతడెంతటి పండిత పక్షపాతియో తెలియగలదు:

"That distinguished scholar, the Head Telugu Examiner of the College Gurumurthy Sastry, who died about three years ago fully concurred in the opinions given in the present essay. I mention his name because, his talents, learning and good sense always entitled his judgement and respect".[7]

ఈ విధముగా పండితులను గౌరవించుచు, లోపములను ఎత్తిచూపుచు, అనన్య సామాన్యమైన కార్యదీక్షతో కృషిచేసి తెలుగు భాషా సాహిత్యములకు బ్రౌనుదొర మహోపకారము చేసెను. నాడు మన భాషా సాహిత్యములు, నాగరకతా సంస్కృతులు, మిక్కిలి దీనస్థితిలో నుండెను. అది సంధి యుగము. రాజుల రారాజుల పోషణము లేక భాషా సాహిత్యములు వన్నెదరిగి యుండెను. వాణిజ్యమునకై వచ్చినవారు పాలకులైరి. తెలుగు జాతి, భారతదేశములోని మిగిలిన వారందరివలెనే, స్తబ్ధత వహించి యుండెను. ప్రాతదినములను జ్ఞప్తికి తెచ్చుకొని, ఉత్సాహము సంపాదించి, కృషిచేయుటకు చాలిన సత్తువయు లోపించి యుండెను. అట్టి స్థితిలో ఆంధ్రసాహిత్య దీపము మినుకు మినుకు మనుచు కునుకుచుండెను.[8] దీనిని చూచిన వెంటనే బ్రౌనుదొర తన కర్తవ్యమును గుర్తెరింగి,

---

6. "I discoered some excellent scholars, poets, grammarians and critics. half of whose learning I never attained, living in poverty, mere mendicants; and they were glad to be thus employed on wages as moderate as those we pay our menial servants" (Ibidem)
7. Essay on the language and literature of the Telugus, by C. P. Brown Madras, Journal of Literature and Science, July-Oct: 1839; Pages-43-59; 366-367.)
8. "When I began these tasks, Teluugu literature was dying out, the flame was just glimmering in the socket." (Some Account of the Literary life of C.P. Brown)

దాని నుద్ధరింపబూనెను. ఇట్టుల ఆరిపోవుచున్న ఆంధ్రసాహిత్య దీపమును స్నేహాసిక్తముచేసి ప్రజ్వలింప చేసినాడు బ్రౌనుదొర. ఆ చిరుత దివ్వె పూర్వపు ఔన్నత్యమును స్మరణకు దెచ్చుకొని, అఖండ జ్యోతియై వెలుగ జొచ్చెను. 1813 లో స్థాపింపబడిన మదరాసు కళాశాల, ఆ చిరుత దివ్వెకు కొంత అండయై నిలిచినను, బ్రౌనుదొర 'స్నేహము' లభించువరకు దానికి 'కంపము' వదలలేదు. నాటి కళాశాలా పండితులు, బ్రౌనుదొరతో తమ కష్టములనుగూర్చి చెప్పికొనుచు, అధికారులు తమ్ము, ఎందులకు కొరగాని 'ఫింఛనీదారు'లుగ పరిగణించుచున్నారని వాపోయిరట[9]! ఈ నిరుపయోగులైన 'ఫింఛనీదారు'లచే, అతడు మహోత్కృష్టమయిన కృషి చేయించినాడు. ఈ 'ఫింఛనీదారు'లలో, రావిపాటి గురుమూర్తి శాస్త్రి వంటి పండితు లెందరో మహానుభావు లున్నారు!

తాను కృషిని ప్రారంభించుటకు పూర్వము తెలుగు కావ్యముల స్థితి, ముద్రణము రాకపూర్వమున్న గ్రీకు, లాటిను కావ్యముల స్థితిని పోలియున్నదని బ్రౌనుదొర వ్రాసెను.[10] సమర్థులగు పండితుల సాయముతో, అతడు చేసిన నిరంతర కృషి ఫలితముగ, ముఖ్యమైన తెలుగు కావ్యము లన్నియు, పూర్తిగ తప్పులు లేకుండ సిద్ధమయ్యెను.[11]

శుద్ధప్రతులను సిద్ధము చేయుటకు ముందు, లిఖిత ప్రతులను దేశము యొక్క నాలుగు మూలలనుండి తెప్పింపవలసి వచ్చెను. ఇందులకు బ్రౌనుదొర తన పలుకుబడిని, మర్యాదను, ఔదార్యమును - సమయానుకూలముగ - ఉపయోగించెను. హిందువులు లిఖిత ప్రతులను ఎరువు ఇచ్చు విషయమున చాల సంశయము కలవారనియు, పుస్తకము అమ్ముట అనిన సహింపరనియు, మంచి మాటలతో వారిని లోబరుచుకొని,ఎరువు తెచ్చిన పుస్తకమును వేళతప్పకుండ తిరిగి

9. "........the pandits expressed to me their grief, that the ruling powers regarded them as useless pensioners." (Ibidem)

10. "The ancient Telugu classics were in a deplorable state; like that of Greek and Latin authors before the invention of printing." (Ibidem)

11. "......a revision made in my house grounded on a collation of manuscripts, has successfully reproduced the leading Telugu poems in a pure and complete state." (Ibidem)

ఇచ్చివేసినచో, వారు నిస్సంకోచముగా సాయము చేయుదురనియు, 'ధనము' ఈ విషయమున వారి యెద్ద చాలవరకు పనిచేయదనియు; బ్రౌనుదొర వ్రాసెను[12].

ఈ లిఖిత ప్రతుల సేకరణకై, బ్రౌనుదొర దూరగ్రామముల కెన్నియో జాబులు వ్రాసెను[13]. ఎక్కడ లిఖిత ప్రతియున్నను, దానిని సంపాదించుటకై ఎన్నియో ప్రయత్నములు చేసెడివాడు. తెలుగు దేశమునకు దక్షిణ సరిహద్దున గల తమిళదేశము నుండియు, ఉత్తర సరిహద్దున నున్న ఉత్కళదేశము నుండియు కూడ, లిఖిత ప్రతులను తెప్పించుటకై కృషిచేసినాడన్నచో అతని ప్రయత్నముల 'విస్తీర్ణత' తెలియగలదు. "వొడయారుపాళము"నకుచెందిన ఒక పండితుని యొద్ద ఒక పుస్తకమున్నదని వినిన బ్రౌనుదొర, దానికై ప్రయత్నము చేసిన సందర్భమున; ఆ పండితుడు వ్రాసినలేఖలోని ఈ భాగము, బ్రౌనుదొర యొక్క కృషిని, మనకు కనుల ఎదుట పెట్టును:

"ఆన 1830, సంవత్సరములో దొరగారు యిక్కడ తిరిచినాపల్లిలో వుండగా, మా అన్నగారు నేనున్న తమ వద్దకి వచ్చినప్పుడు, శింగరాచార్యులుంగారి ద్వారా, మావుభయులకున్న దొరవారి దర్శనము తటస్థమయి, నాలుగు నెలల పరియంతం సముఖమందు కనిపెట్టుకొని వుండగా, వొక పుస్తకము కావలెనని తమరు సెలవు యిచ్చినందు మీదట, మా నివాస స్థలమునకు రాగానే, నా వొంట్లో నిమ్మళములేక వున్నందుచేత, నేను మళ్లీ రావడమునకు అనుకూలించక, రామినాయడి ద్వారా ఆ పుస్తకమును దొరవారికి పంపించినాను, అది తమకు

---

12. Hindus are jealous of lending manuscripts, and are shocked at the idea of selling them ; but when they find us punctual in restoring volumes lent, they will freely aid us." (Ibidem)

13. "I had to write letters in Telugu to distant villages sending my requests for manuscripts through local magistrates...I found that by courtesy and gentleness, I easily obtained every volume, however sacred or secret. Herein, money has no power." (Ibidem)

చేరినదని, శింగరాచార్యులగుండా, వుత్తరము పంపించడములో, నన్ను సముఖముకు బయలుదేరి రమ్మన్నట్టు వ్రాశివుండెను".[14]

బ్రౌనుదొర యొక్క కృషి ముఖ్యముగా తెలుగునకు సంబంధించిన దైనను, ఏ భాషలో లిఖితప్రతి యున్నను సంపాదింపవలెనను కుతూహలము కూడ అతనికి కలదు. అందుచేతనే. అతడు సేకరించిన లిఖిత ప్రతులలో-సంస్కృతము, తెలుగు, కన్నడము, తమిళము, ఒరియా, ఉర్దూ, మహారాష్ట్రము మొదలైన భాషలకు సంబంధించినవి; ఉన్నవి. సంస్కృతములోనున్న ఒక పుస్తక ప్రతికై అతడెంత ప్రయత్నము చేసెనో, ఆతని పండిత మిత్రుడైన వఠ్యం అద్వైత బ్రహ్మయ్యశాస్త్రిగారు ఆ గ్రంథ విషయమై వ్రాసిన లేఖలోని క్రింది భాగము ఋజువు చేయగలదు:

"చల్లా సుబ్బన్న తీసుకవచ్చిన వోఢ్రాక్షరములతో వున్న కావ్యము పేరు, సంస్కృత రాఘవ పాండవీయము. యీ గ్రంథము మనదేశములో లేదు. పూర్వమందు నేనే వోఢ్రదేశమునుంచి తెప్పించినాను. యీ అక్షరములు యీ దేశములో యెవరికీ తెలియనందున, యిది తెలుగుచేసి పంపించగలందులకై, శ్రీకాకుళానకు ఐయిదు సంవత్సరముల కిందట పంపించి వుంటిని. యిప్పుడు బందరులో వోఢ్రం బాగా వచ్చిన వొక మనిషి వున్నాడు. గనుక, అతనిచేత తెలుగు అక్షరములతో వ్రాయించడమునకై, యిప్పుడు తిరిగి ఆ పుస్తకము తెప్పించినాను. మరి అంతా తెనుగు చేయించి, తమ సముఖములోకి పంపించుకొంటాను. యిదిగాక, యీ రాఘవ పాండవీయను నిమిత్తమయ్యిన్ని. దీని వ్యాఖ్యానం నిమిత్తమయ్యిన్ని జగన్నాథ సమీప దేశవర్తియైన పీతాంబరదేవుగారు అనే జమీందారు పేర. ఆయన తాలూకు వకీలు యీ గ్రామములో వుండగా, ఆయనచేత వుత్తరం వ్రాయించినాను. అందులకు ఆ గ్రంథములు వ్రాయిస్తూ వున్నాననిన్ని, కొద్ది దినములలో పంపిస్తాననిన్ని ఆ జమీందారు, ఆ వకీలు పేర తిరిగీ వుత్తరం వ్రాసినారు. గనుక, కొద్ది దినములలోనే ఆ పుస్తకములున్ను వస్తవి. అవి రాగానే, అవిన్ని తమ సముఖములోకి పంపిస్తాను......మరికొన్ని తర్క పుస్తకములు గౌడాక్షరములతో వున్నవనిన్ని, అవి తెనుగున వ్రాయించవలసినదనిన్ని, తమరు

14. The Telugu Reader by C. P. Brown; 2nd Edition; 1867. Pages - 34, 35.

వ్రాయించినారు. ఆ గౌడలిపి వచ్చిన బ్రాహ్మణుడు* ప్రస్తుతమందు యిక్కడ లేడు. గుంటూరు తాలూకాలో వున్నాడు. అతణ్ని పిలిపించి, ఆ సంగతి తమ పేర విన్నపము వ్రాసుకొంటాను. గనుక, అప్పుడు ఆ పుస్తకములు పంపించ వచ్చును[15].

ఈ విధముగా నాడు బ్రౌనుదొర, లిఖిత ప్రతుల సేకరణకై తన ధన మును, కాలమును మిక్కిలి వెచ్చించెను. తన ఉద్యోగమునకు సంబంధించిన పను లను సక్రమముగ నిర్వర్తించుచు తెలుగు భాషా సాహిత్యముల సేవ నింత సమ గ్రముగా చేసెనన్నచో, ఆతని కార్యదీక్షయు, భాషాభిమానమును స్వయం వ్యక్త ములుగదా! అతడెన్ని పనులలో మునిగియున్నను, పుస్తకముల విషయము మాత్ర మెన్నడును ఉపేక్షచేసి ఎరుగడు. తన "నవుకరులు" పుస్తకముల విష యమై ఉదాసీనముగ నుండకుండుటకై పదేపదే వారికి, వాటిని గూర్చియు, వాటి భద్రతను గూర్చియు, వ్రాసెడివాడు. తన బట్లరు, సూదాబత్తుల ఆదినారా యుడు, పుస్తకముల యందంత శ్రద్ధ వహించుటలేదని విని, ఆతనిని హెచ్చ రించుచు బ్రౌనుదొర జాబు వ్రాసెను. దానికి జవాబుగా, బట్లరు వ్రాసిన జాబు లోని ఈ క్రింది భాగము బ్రౌనుదొరకు పుస్తకముల యందెంతటి అభిమాన ముండెడిదో, తెలియజేయును:

"నేను పుస్తకములను గురించి యెంత జాగ్రత్తగా చూచుకొంటున్నానో, ఆ సంగతి యిక్కడనుంచి తమ సముఖములోకి వచ్చిన పండితులు జూలూరు అప్పయ్య పంతులు మొదలైన వారివల్ల విచారిస్తే, తమ చిత్తానకు విశదమవు తున్నది"[16] "కోర్టు రికార్డులు" కంటె, ఎక్కువ భద్రముగా లిఖిత ప్రతులను; బ్రౌనుదొర సంరక్షించినట్లు తోచును!

ఆతని సేవకులుగాని, ఉద్యోగులుగాని, పండితులుగాని, ఎవరాతనికి జాబులు వ్రాసినను, అందు పుస్తకముల ప్రస్తావన తప్పక ఉండును. కల్నల్ కాలిన్ మెకంజీ (1753-1821) పండితుల తరువాత, బ్రౌనుదొర పండితులే విశేషముగా దేశాటనముచేసి గ్రంథములను సేకరించిన వారు, బ్రౌనుదొర పండి తులకు, తెలుగు భాషా సాహిత్యములు ప్రధానములైనవి గనుక బ్రౌనుదొర ఆదే శము ననుసరించి-మెకంజీ పండితుల కంటె వీరు అధికముగా భాషాసేవ చేయగలి

---

* ఈ బ్రాహ్మణుడు అత్తిలి సుబ్బరాయశాస్త్రిలు కావచ్చును. ఈయన 8॥ సంవత్సరములు వంగదేశములో నుండెను. బెంగాలీ భాష బాగుగ వచ్చును. బ్రౌనుదొర మెచ్చిన పండితుడు.

15. Ibidem; Pages - 193- 194.

16. Ibidem, Page - 96.

గిరి. వారు - మెకంజీ దృష్టి ననుసరించి - ఐతిహాసిక సామగ్రిని ఎక్కువగా సంగ్రహింప గలిగిరి

దూర గ్రామముల నుండి వివిధములైన పాఠాంతరములుగల లిఖితప్రతులు వచ్చి చేరినవెంటనే, బ్రౌనుదొర తన పండితులతో కలిసి, ముద్రణమునకు పనికి వచ్చు శుద్ధప్రతిని సిద్ధముచేయుటకు పూనుకొనెడివాడు. ఇట్, బ్రౌనుదొర అవలంబించిన పద్ధతి గ్రీకు, లాటిను సాహిత్య గ్రంథముల విషయమున పాశ్చాత్య విద్వాంసులవలంబించినది[17]. అతనికంటె ముందే, "మదరాసు కాలేజి బోర్డు" వారు కొన్ని పుస్తకములను అచ్చొత్తించుటకు ప్రయత్నించినను. అది జయము పొందలేదు. బోర్డు అధికారులకు, పాశ్చాత్య విద్వాంసుల పరిశోధన పద్ధతులు తెలియకపోవుటయే, ఆ అపజయమునకు ముఖ్య కారణము. పరస్పరము విరోధముగనున్న సాక్ష్యమును బట్టి జడ్జి "డిక్రీ"ని తయారు చేయునటుల; ఇటలీ, జర్మనీ దేశములోని విద్వాంసులు, లోపభూయిష్ఠమైన గ్రీకు పుస్తకములనుండి సరియైన పాఠములను సంపాదించెడి వారనియు ఈ పద్ధతి కాలేజి బోర్డు వారికి తెలియదనియు బ్రౌనుదొర వ్రాసెను[18].

బ్రౌనుదొరకు చిన్ననాటి నుండియు పాండిత్య సంపాదనమున దృష్టియు వివిధ భాషలయందును సాహిత్యముల యందును రక్తియు కలదు గనుకనే తాను తలపెట్టిన సాహిత్య పునరుద్ధరణ కార్యమున దిగ్విజయమును పొందెను. అతని తండ్రియైన రివరెండ్ డేవిడ్ బ్రౌన్, అతనికి బాల్యమున భాషల విషయమున నిచ్చిన శిక్షణ వ్యర్థము కాలేదు! నాడు, భారతదేశమున సులభముగా డబ్బు సంపాదించుకొని, స్వదేశమునకు పోవచ్చునని యెంచి వచ్చిన చాలమంది ఇంగ్లీషు వారివలె, బ్రౌనుదొర సంస్కార శూన్యుడై యున్నచో, దురభిమానియై

---

17. "...but having read of the processes used by Lambinus, Erasmus, Heinsius, Casaubon, Kennicott and other restorers of learning, I followed their example so as to elicit an authentic text." (Some Account of the Literary life of C.P. Brown.)

18. "The members were not aware of the methods whereby the learned in Italy and Germany had elicited a pure Greek text out of defective manuscripts; just as a judge frames a decree out of conflicting evidence." (Ibidem)

యున్నచో; ఆతనివలన "పరిపాలన" తప్ప ఇంకేదియు జరిగెడిదికాదు. ఒకవేళ ఉద్యోగ ధర్మము ననుసరించి తెలుగు నేర్చుకొన్నను. నాడు తెలుగు నేర్చుకొన్న చాలమంది పాశ్చాత్యులవలె, మాటలాడ గలిగియుండుటతో తృప్తిపడి నిత్య వ్యవహారమును జరుపుకొని, కాలము వెళ్ళబుచ్చి యుండెడివాడు. కాని, బ్రౌను దొర అట్టివాడుకాడు, ప్రపంచములో ప్రతి దేశమున, ప్రతి కాలమున, కార్య దీక్షతో నిష్కామకర్మాచరణను చేయజాలిన అల్ప సంఖ్యాకులుందురు. వారిని దేశము, కాలము, జాతి, మతము, భాష మొదలైన పరిధులు అడ్డగింపలేవు. ఆ శాఖకు చెందినవాడు బ్రౌనుదొర. ఇట్టి వారి[19] వలననే, వివిధ జాతులు - మాన వత్వమును మరచిపోక - పరస్పరము అర్థము చేసికొనుట కొంతవరకైన జరుగు చున్నది. లేనిచో మానవ సంస్కృతి స్రవంతి, ఏనాడో ఇంకిపోయెడిది! ఇట్టి మానవత్వము కలవాడు కనుకనే, పాలకునిగా వచ్చిన పరదేశి బ్రౌనుదొర, స్వదేశస్థులకంటె తెలుగు నధికముగా ప్రేమించి, తెలుగు భాషా సాహిత్యముల అభివృద్ధికి తోడ్పడెను.

ఒక కావ్యముయొక్క పరస్పరము పొంతికలేని, వివిధ లిఖిత ప్రతుల నుండి, శుద్ధ ప్రతిని సిద్ధము చేయుటకై బ్రౌనుదొర చేసిన కృషి ఆతని నోటనే వినుట మంచిదిగదా !

"I first had a copy made from any manuscript of tolerable accuracy, the alternate pages being left blank, and the verses duly numbered; then the volume was bound. I collected twelve or fifteen other manuscripts (few of them complete) lent me by various natives. A clerk sat with the newly written copy ready ; and before him were two, each having charge of five or six manuscripts, the oldest I could

---

19. బ్రౌనుదొర ఉద్యోగము చేయుచున్న మొదటి సంవత్సరములలో, మద్రాసు నకు గవర్నరుగానున్న సర్ థామస్ మన్రో, ఇట్టివాడే, అతడు తన సోద రికి 12-12-1819 నాడు జాబు వ్రాయుచు దానిలో ఇట్లనెను:

"My attachment to both countries is so nearly equal, that a very little turns the scale. I like the Indian climate and country much better than our own...." (The Life of Sir Thomas Munro by the Rev. G R. Gleig; London — 1830; Page - 8.) బ్రౌనుదొరపై ఈతని ప్రభా వము కలదనుట సత్యదూరము కాదు.

discover. Three professors sat by, masters of Grammar Prosody, both Sanscrit and Telugu;but the others knew only their mother-tongue. Each assistant in turn read a stanza which thus was recited ten or twelve times ; the scribe recorded every deviation, the pandits formed their judgements on each line and then one of them taking the blotted copy, selected the pure text, and dictated it to a reader."[20]

ఈ వాక్యములు చదివిన ప్రతి సాహిత్య పిపాసువునకును, కంటి ఎదుట ఆ గంభీర దృశ్యము గోచరమగును. బ్రౌనుదొర యందు గౌరవాభిమానములు కల్గును. ఏ తెలుగు రాజు ఆస్థానమో జ్ఞప్తికి వచ్చును. వెంటనే బ్రౌనుదొర పాశ్చాత్యుడన్న విషయము స్మరణకువచ్చి, ఆశ్చర్య చకితుడగును. ఏజననాంతర సౌహృదము వలన బ్రౌనుదొర ఈసేవకు గడంగెను ! అని భావ సమాధిలో పడును.

ఆంధ్ర భాషా సాహిత్యముల యందు విశేషాభిమానమున్న వ్యక్తికూడ తెలుగువాడైనచో - అధికార బలముండదు గనుక - ఆనాడు, బ్రౌనుదొర చేసిన, సేవ చేయలేడేమో అనిపించును. బ్రౌనుదొర వెచ్చించిన ధనము మాట చెప్పనే అక్కరలేదు గదా! దొరికినన్ని వ్రాత ప్రతులు! పాఠభేదములను పరిశీలించి, పాఠనిర్ణయము చేయుటకు ముగ్గురు మహా విద్వాంసులు! వివిధ ప్రతులనుండి పాఠములను చదివి వినిపించుటకు ఇద్దరు! వ్రాయుటకు ఒకడు! ఈ పరిషత్తునకు అధ్యక్షుడు బ్రౌనుదొర. ఈ కృషికి. ఈ పాశ్చాత్యు డాశించిన ఫలము - తనకు మాతృభాష కాని. తన పాలితుల భాషయైన తెలుగు యొక్క అభివృద్ధి! ఇంత కన్న నిష్కామకర్మాచరణమున్నదా? సహృదయత ఉన్నదా? భాషాభిమాన మున్నదా? ఆతడు వ్రాసిన పుస్తకములుగాని, అచ్చొత్తించిన కావ్యములుగాని, ఆతనిని ధనికునిగా చేయలేదు. కొన్నింటి వలన ఆతడు వెచ్చించిన ధనమును నష్ట మయ్యెను. తరువాతి ప్రచురణ కర్తలకు ఆతని ప్రచురణముల వలన లాభము వచ్చెను. కాని, ఆతడాశించినది సాహిత్య ప్రచారము. ఆ ఆశయసిద్ధి కలిగినది[21].

---

20. Some Account of the Literary life of C.P. Brown.

21. "My books may prove valuable to some publishers, but I was never a penny the richer for any of them, and by some I lost the sum I expended ; but I looked for this result and was satisfied." Ibidem)

బ్రౌనుదొర ఏ పని చేసినను హేతుబద్ధముగ, పూర్వాపర సంబంధయుత ముగ- ఒక విధానమునకుగాని పద్ధతికిగాని కట్టుబడి- చేసెడివాడు. తెలుగు పుస్తకముల సేకరణ, సంస్కరణ, ముద్రణ చేపట్ట నిర్ణయించుకొని కృషిని ప్రారంభించినవాడుగనుక, లిఖితపుస్తకములు- తెలుగులోనివిగాని సంస్కృతగ్రంథ ములుగాని, ఇతర పుస్తకములుగాని తెలుగు దేశములో ఏయే ప్రాంతములలో ఎవరెవరి యొద్ద గలవో వ్రాసియుంచుకొనుట సహజము. దానికి సంబంధించి సొంతముగ ఆయన వ్రాసిపెట్టికొనిన వివరములు "బ్రౌన్ లేఖలు" అను పుస్తకము నుండి ఉద్ధరించి ఇచ్చుచున్నాను:

"One of the greatest acha Tenugu scholars now living, says Bramhia is జూలూరి అప్పయ్యాంతులు at వేటపాళము (alias Naydpally. near Bapatla, which is 5 Coss thence). The Pandit styles him a second Nannia. He is a వేపాం- like Jey Row. ములుపాక Buchana Sastri in Nandloor wrote the వేంక టేశ్వర మహాత్మ్యం, మాఘమహాత్మ్యం, in the Uttara Kanda of the Padma Purana. Chincholi Appanna Chari in Pata Cudpa has a noble Sanscrit Library. Runga Reddee in Nosum has a noble library సంస్థానం. In Pallapaud of Duoor the son of Raghavachari has a library, is a good fellow. Gopuraz Subbaya of వడ్లపూడి near Nelloor is a sound scholar. This is the man who brought me the Dasavatara. Condoori Chitambaram of Mogullur (South of Guntoor) near Cumbum offers me his library (a bullock load). In Avok of Covilaguntla lives అకింతల సుబ్బరాయశాస్త్రి who resided 30 years in Bengal, knows the Bengali & is a profound scholar...

"Libraries open to me: at Masulipatam that of Mamidi Vencaya, at Cuddapa that of Gajal Reddi, at Punganoor that of Raja, at Madras that of Langar Papaya....

"In Duoor, Gudipaud, in the Curnum Lakshmipathi's house is a Telugu Library. Vangipuram Venkata Crishtama Chari, very humble & proper fellow at Nagireddipally in Cumbum at 32 is a fine scholar and poet. Miduturi Lachminarasu, Curnam at Uyyalavada 3 amadas from Cumbum is a superior scholar and poet. Manchala Kristam Raz brought me 3 chapters of Appa Cavi which he knows by heart. Vidvat Cavi Krishtama Chari is a poet in the employ of Sita Rama Bhupal, Zamindar of Gadwal 50 miles S.W. of Carnul. He has a salary and land...300 Rs. a year."

"...గద్వాలలో రాజమాన రాజపూజితులైన రాజా సీతారాం భూపాల్ రావు బహాదరు . . . . . . visited me 23 Dec. 1827 . . ."

"Dantuloori Jagannatha Raz......near Cakinada is connected with the Zamindars, is a scholar and has a fine library of Sanscrit & Telugu. Chelicani Venkat Raya (baomardi to Appa Rao, the Zamindar of Gootala) sends me the Dasavatara Charitra. Cappagantula Mandapa Sastri says Simhadri Sastri's heir Bucchia of Rajahmundry has the Yoni tantra and other such book —not Collected, but inherited not understanding them. Pindiprolu Luschmana Cavi, at Cuyyeru in Dracsharama, a Curnum Mirasidar is a noble poet. Tooprani Seenaya of Rajahmundry, a Vaishnavite has a large Telugu Library...In Masulipatam....particularly Gundumall Jagannatham and Raja Jagannatha Rao......."[22]

---

22. బ్రౌన్ లేఖలు - సంశోధన: బంగోరె; పర్యవేక్షణ: జి.ఎన్. రెడ్డి; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి-1977 (ఫిబ్రవరి); పుటలు-126,127.

ఇందులో పేర్కొన్నవారిలో జూలూరి అప్పయ్య పంతులు మాకు పరిచితులే. బ్రౌనుదొర ఈయనకు సొంతముగ జీతమిచ్చి వసుచరిత్ర (వ్యాఖ్యతో ముద్రణ-1844), మనుచరిత్ర (వ్యాఖ్యతో ముద్రణ-1851) మొదలైన గ్రంథములకు వ్యాఖ్యలు వ్రాయించెను. ఇంక బ్రహ్మయ్య అనగా బ్రౌనుదొరకు గురుకల్పులైన వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రిలు, అప్పయ్య పంతులును గురించి "He is a నేపారి - like Jey Row" అని బ్రౌనుదొర గుర్తు వ్రాసికొన్నాడు. హిందువులలోని వివిధ శాఖలకు సంబంధించిన విషయములలో దొరగారికింత నిశిత పరిశీలన ఉన్నదన్నమాట! ములుపాక బుచ్చన్నశాస్త్రిలు కూడ బ్రౌనుదొర జీతమిచ్చి పోషించిన పండితుడే. కడపలోని బ్రౌనుదొర 'కాలేజి'లో పనిచేసినవాడే. మచిలీపట్టణములో బ్రౌనుదొర జిల్లా కోర్టు రిజిస్టర్ (1822-1825) గా పనిచేసిన కాలమందు ఆ కోర్టునందే వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రిలు పండితునిగ నుండెను. తరువాత, మద్రాసులోని సదర్ అదాలత్ కోర్టులో సీనియర్ పండితునిగా పనిచేసి బ్రౌనుదొరకు భాషా సాహిత్య విషయములలో చాల సాయపడెను. ఈయన 1840 లో కాలధర్మము పొందినట్లు తెలియుచున్నది. లంకావిజయము లేదా రావణ దమ్మీయము అని ప్రసిద్ధిపొందిన ద్వ్యర్థి కావ్యమును వ్రాసిన కవి పిండిప్రోలు లక్ష్మణకవి పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థమునందు బ్రౌనుదొరను దర్శించినవాడు. కుర్యేరుకరణము. గ్రంథరచన "ఇంగ్లీషు సంవత్సరంబున 1797" అని ఆయనయే వ్రాసినాడు. బ్రౌనుదొర రాజమహేంద్రవరములో నున్నప్పుడే ఆయనను కలిసియుండును (1825-అప్పుడు బ్రౌనుదొర, జిల్లా కలెక్టరునకు హెడ్డు అసిస్టెంటు). బ్రౌనుదొర వ్రాసినదానిని బట్టి (noble poet) ఈ కవియందు బ్రౌనుదొరకు గౌరవము ఉన్నట్లు తెలియుచున్నది. లక్ష్మణకవి బ్రౌనుదొరను దర్శించినప్పుడు, దొరపేరు పాద ప్రథమాక్షరములలో కూర్చి క్రింది పద్యమును చదివెనట! ప్రథమాక్షరములు కలిపి చదివిన "మహారాజశ్రీ బ్రౌనుదొర గారికి" అని అగును.

"మధువైరికిన్ వనమాలికిఁ గౌస్తుభ
హారునకును సంశ్రితావనునకు
రాధికా ప్రియునకు రామసోదరునకు
జగదీశునకు దయాసాగరునకు
శ్రీనాథునకును రక్షిత దేవ సమితికిఁ

బ్రౌఢ భావునకు నారాయణునకు
సురగేంద్ర తల్పున కరిశంఖ ధరునకుఁ
దొగలరాయని గేరు మొగము దొరకు
రణ నిహత దుష్టరాక్షస రమణునకును
గాన మోహిత వల్లవీ కాంతునకును
రిపువిదారికి హరికి శ్రీకృష్ణునకును
కిల్బిషారికి నే నమస్కృతి యొనర్తు"

(చాటు పద్యరత్నాకరము; ప్రథమ తరంగము; పుట-38).

లక్ష్మణ కవితోకూడ కలసివచ్చిన ఆతని మేనల్లుడు మంగన్న. జ్ఞాతులవలన తనకు జరిగిన అన్యాయమును దొరగారికి మనవిచేసికొనగా, పండిత పక్షపాతి అయిన బ్రౌనుదొర అంతయు విని మంగన్నకు జరిగిన అన్యాయమును, తన అధికారమును వినియోగించి, సరిదిద్దినట్లు తెలియుచున్నది.

పండితులను గురించి, గ్రంథాలయములను గురించి. గ్రంథ సంపాదనమున ఎవరెవరు సాయము చేయగలరో వారిని గురించి బ్రౌనుదొర వ్రాసి యుంచుకొనిన 'జ్ఞాపిక'లో జె. రావు (Jey Row) గారొకరు, అప్పయ్య పంతులువలెనే ఈయనయు మధ్వ సంప్రదాయమునకు చెందినవారు "వేపారి". మచిలీపట్టణమునకు చెందిన రాజా కాంద్రేగుల జగన్నాథరావుగారు. ఆనాడు వీరిది బందరులో సుప్రసిద్ధమైన జమీందారి కుటుంబము. బ్రౌనుదొర, ఈ రాజా జగన్నాథరావుగారి పేరుతో కలిపి వ్రాసికొన్న ఇంకొక పేరు గుండుమళ్ల జగన్నాథం. ఈ జగన్నాథంగారు విలియమ్ బ్రౌన్ (మృతి-1837) నకు తెలుగు వ్యాకరణ రచనలో (A Grammar of the Gentoo Language - 1817, Madras.) సాయము చేసిన గుండుమళ్ళ పురుషోత్తం (మచిలీ పట్టణము ప్రావిన్షియల్ కోర్టులో గవర్నమెంటు ప్లీడరు) గారి కుమారుడు.

ఇంకొకరు, అత్తింతల సుబ్బరాయ శాస్త్రిలు. ఈయన చిరకాలము కలకత్తాలో ఉండి కంపెనీ ఉద్యోగులకు కోర్టువారికి(మద్రాసులో వత్యం అద్వైత బ్రహ్మయ్య శాస్త్రిలవలె) పండితునిగా సాయపడిన వాడు. బెంగాలులో చాల కాలముండుటచే వంగ (గౌడ) లిపి తెలిసిన వాడు. ఈ లిపిలో నున్న తర్క

శాస్త్ర గ్రంథములను తెలుగులో వ్రాయించపలెననుకొన్న బ్రౌను దొరకు వశ్యం అద్వైత బ్రహ్మ శాస్త్రిలు ఈ పండితుని సాయముతో ఆ పనిని చేయించెను.

లంగరు పాపయ్యగారు ఆ రోజులలో మద్రాసులో సుప్రసిద్ధులైన దుబాసి. సంస్కృత పండితులు. కంపెనీ ఉద్యోగులు. వీరి ఇంటి పేరు "అవధానం" వారు. ఓడలపై సరుకుల రాకపోకలను పరీక్షించుట మొదలైనవి వీరి ఉద్యోగ ధర్మములు. ఇందువలన వీరి ఇంటిపేరు "లంగరు"గా మారినదట! మద్రాసు గవర్నరు కౌన్సిలు సభ్యులైన "హాలండ్" సోదరుల John Holland, Edward Holland) ఆశ్రితుడు. ఆంతరంగికుడు. తరువాత ఆ సోదరులు అవినీతిపాలై అపవాదులకు లోనైన ప్పుడు భారతీయులైన పాపయ్యగారు ఇంగ్లీషు వారైన ఆ సోదరులు తప్పించుకొనగా—శిక్షననుభవించిరి. వీరు మంచి పండితులను విషయము, బ్రౌనుదొరకు పనుగుల వీరా స్వామయ్యగారు 15-12-1831 నాడు వ్రాసిన లేఖలోని క్రింది భాగము వలన తెలియుచున్నది:

"నేను చెన్నపట్టణం చేరిన తరువాత కీ. శే. లంగరు పాపయ్య గారి భార్యను కొమాళ్ళను కలుసుకొని వారి దగ్గర నున్న స్కాంద్దం అనే గ్రంథం యొక్క వివరాల నడిగి తెలుసుకొన్నాను. ఈ స్కాంద్దంలో 6 సంగుంహితలు, 50 కాండ్లలు ఒక లక్ష గ్రంథం ఉన్నది...... ఈ యారు సంహితలలో పాపయ్యగారు అయిదవదైన శంకర సంహిత నిర్దుష్టమైన చక్కని తెలుగు పద్యములలోని కనువదింప జేశారు. దానిని నేను తెచ్చినాను. తమరు పంప మంటే ఆ ఆరు సంహితలను బంగీలో పంపుతాను. లేదా శంకర సంహిత తెలుగు పద్యమూ మాత్రమే పంపుతాను. ఏ సంగతిన్నీ తెలుపకోరుతాను..."[23]

ఈ విధముగా* లంగరుపాపయ్యగారి గ్రంథములతో బ్రౌనుదొరకు పరిచయ మున్నదని తెలియుచున్నది. ఇందువలననే మద్రాసులోని పాపయ్య గారి గ్రంథాలయమును ఆయన జ్ఞప్తియందుంచుకొనెను.

---

23. కాశీయాత్ర చరిత్ర: పనుగుల వీరాస్వామయ్య: సంపాదకుడు: దిగవల్లి వేంకట శివరావు; బెజవాడ, 1941. తృతీయ ముద్రణము పుట— 9.

* ఈయనను గురించి ఇంకను తెలిసికొనదలచిన వారు ఈ గ్రంథ (సి.పి. బ్రౌన్) కర్తయే వ్రాసిన "తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము" 1986-ముద్రణ) చూడవలసినది. పుటలు-157, 158, 169.

ఆ కాలమునాడు సుప్రసిద్ధులైన పండితులలో మచిలీ బందరునకు చెందిన మామిడి వెంకయ్యగారొకరు (1764-1834) సంస్కృతాంధ్రములలో గొప్ప పండితులు. ఆంగ్ల భాషా పరిచయ ముండెను. ఆయన కాలమునకు చెందిన-విలియమ్ బ్రౌన్, కాంబెల్, ఎల్లిస్, సి. పి బ్రౌన్ మొదలైన విద్వాంసు లందరును ఆయన రచనలను, పాండిత్యమును మెచ్చుకొన్నవారే వారి రచనల నుపయోగించుకొన్న వారే. వెంకయ్యగారు - సంస్కృతములోని నామలింగాను శాసనము నాధారముగా చేసికొని ఒక సంస్కృత నిఘంటువును, 'ఆంధ్రదీపిక' అనుపేర నొక తెలుగు నిఘంటువును కూర్చిన విద్వాంసులు.

ఈ రెండు నిఘంటువులను కొనవలసినదిగా ఆ నాటి ప్రభుత్వము వారిని 'కాలేజి బోర్డు' సభ్యులైన కాంబెల్ మొదలైన దొరలెంత ప్రార్థించినను దానిని పెడచెవిని బెట్టి 'ఆంధ్ర దీపిక' ను మాత్రము వేయిపూల వరహాలకు (వేయి పగోడాలు = రూ. 3,500/-) కొనుటకు అంగీకరించిరి. 1824 లో బ్రౌనుదొర దీనికి 'కాపీ' వ్రాయించెను.

("This copy was prepared under my directions and is very accurate. It was transcribed from the original copy in the author's own hand writing"- C P. Brown, 12 th. August 1824. ఈ వ్రాత "ఈ కాపీ" మీద ఉన్నది.)

ఈ పండితులలో, బ్రౌనుదొర నిఘంటువులను ప్రత్యక్షరముగా పరిశీలించిన-ముప్పది రెండు సంవత్సరములకే మంచి పండితునిగ, కవిగ బ్రౌను దొర ఆదరాభిమానములను చూరగొన్న - వంగీపురం వెంకట కృష్ణమాచార్లు గారున్నారు.

ఇంగ్లీషులో డాక్టరు జాన్సన్ కూర్చిన నిఘంటువునకుమధ్య తెల్ల కాగితములు వేసి బైండు చేయించి ఆ కాగితముల మీద తెలు గర్థములను వ్రాయుచువచ్చి ఇంగ్లీషు - తెలుగు నిఘంటువును కూర్చుచు పెంచుచు వచ్చెను. ఇది రెండు సంవత్సరములు తీసికొనెనట! ఈ చిత్తు ప్రతి నుండి 1839, 1840 సంవత్స రములలో శుద్ధప్రతిని సిద్ధము చేసెను. తరువాతి సంవత్సరములో (1841), మరల ప్రత్యక్షరము శోధించు పని తలపెట్టి, ఇతర నిఘంటువులతో మాటలను అర్థములను పోల్చి చూచి సంతృప్తి పడి పనిముగించెను. ఈ పనిలో నే

కృష్ణమాచార్లులు సాయము చేసినట్లు బ్రౌను దొర ఇట్లు వివరించెను : In this I had the assistance of Krishtama Chari, a learned bramin of remarkable genius, industry and patience who revised each article with me making such observations as occurred. This was the finishing process and was nearly as laborious as any that preceded it."

ఈ విధముగా బ్రౌనుదొరకు యావదాంధ్ర దేశములోని పండితులతో, భాషా సాహిత్య పోషకులుగ నుండిన గద్వాల, నూజివీడు, పిఠాపురము మొదలైన తెలుగు జమీందారులతో, ఫలప్రదమయిన పరిచయ ముండెనని తేలుచున్నది. తెలుగు కావ్యములను సంపాదించుటలో, వ్యాఖ్యానములు రచింపించుటలో ఈపరిచయము ఆయన కెంతయో తోడ్పడినది. దానికి, అధికారము సాయపడి 'సువర్ణమునకు సుగంధ మబ్బినట్లు' ఆంధ్ర సాహిత్యోద్యానవనముల సువాసనలు గుబాళింప జొచ్చెను.

వ్యాఖ్యానములతో శుద్ధముగ బ్రౌనుదొర అచ్చొత్తింపగా సహృదయ హృదయ సీమలను సుగంధ బంధురము చేసిన రెండు ఉద్గ్రంథములను గూర్చి కొంత విపులముగ వ్రాయుదును. ఇంచుమించుగా ఆతడన్ని ప్రశస్త గ్రంథములను సంపాదించి శుద్ధ ప్రతులను, విద్వాంసుల చేత వ్యాఖ్యానములను సిద్ధము చేయించినాడన వచ్చును. కొన్నింటిని తానే మొదటిసారి ప్రచురించెను. అచ్చు వేయించు కొందమని అడిగిన ప్రచురణ కర్తలకు ప్రతిఫలమేమియు తీసికొనకుండ, తాను సిద్ధము చేయించిన శుద్ధ ప్రతులను ఇచ్చివేసెను. తెలుగు పుస్తకములు అచ్చయి ప్రచారమునకు రావలెనను నదియే ఆయన దృష్టిగాని వాటి వలన ధన సంపాదన కాదు. బ్రౌనుదొర సిద్ధము చేయించిన శుద్ధ గ్రంథములను ఉచితముగ పొంది వాటిని ముద్రించుకొని లాభములు పొందిన వారిలో- పురాణం హయగ్రీవ శాస్త్రులు, పువ్వాడ వెంకటరావు (వర్తమాన తరంగిణి పత్రికా సంపాదకుడు) మొదలైన వారున్నారు!

ఆంధ్రుల కతి ప్రియమైన - మను చరిత్ర, వసు చరిత్రలను బ్రౌనుదొరయే మొట్టమొదట జూలూరి అప్పయ్య పంతుల వ్యాఖ్యతో అచ్చు వేయించినా డన్నచో మనమాతని కెంత ఋణపడి యుంటిమో తెలియును. ఈ రెండింటిలో,

వసు చరిత్ర పూర్తిగా వ్యాఖ్యానముతో 1844 లో అచ్చయినది. దీని ముఖపత్ర మిట్లున్నది :

వసు చరిత్ర

సప్రతిపదటీక

ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ దొర వారి అనుమతిని

జూలూరి అప్పయ్య పంతుల వారిచేత వ్రాయబడ్డది

The

Vasu Charitra

A Celebrated poem in the Telugu Language

Written by Bhattu Murti

About A. D. 1450

with a Commentary written in the same Language

By Zuluri Appaya

Madras

Printed by R. W. Thorpe,

At the Christian Knowledge Society's Press

1844

ఈ గ్రంథమునకు 'నోటిస్' అను పేర బ్రౌనుదొర చిన్న పీఠిక వ్రాసినాడు :

NOTICE

The Vasu Charitra, written by Bhattu Murti (about the year A. D. 1450.) is esteemed the most perfect poem in the Telugu Language. Three Commentaries have been framed to explain it, and of these the third, (in familiar Telugu) written at my desire by a learned bramin in my employ, (in the year 1833) is now printed. The former

annotators have chiefly criticised the peculiarities of rhetoric, rhyme, or orthography; but the present notes have a very different object being intended to explain the text, word by word, in the clearest manner, so as to do away the necessity of oral instruction. Similar commentaries have been prepared, explaining the Manu Charitra, the Vijaya Vilasam, the Tara Sasanca Vijayam, the Cavi Carna Rasayanam, the Saranga Dhara Charitra, the Dasavatara Charitra and several other Telugu poems of celebrity, Madras, Feb. 1844.

C. P. Brown

గ్రంథాంతమున ఇట్లున్నది :

"ఆన ౧౮౩౪ సంవత్సరం యేప్రిల్ నెల ౮ ది. చార్ లిస్ ఫిలిప్ బ్రౌన్ దొర గారి ఉత్తర్వు చొప్పున వసు చరిత్ర ఆరు ఆశ్వాసములకున్ను జూలూరి అప్పయ్య పండితులు యీ ప్రతి పదటీక వ్రాయడమైనది." మూడు ఆశ్వాసముల చివరి వరకు "౧౮౩౭" అని కలదు.

నాటి కింకను, ఐతిహాసిక సామగ్రి సమగ్రముగా లభింపకుండుటచే, వసు చరిత్ర రచనా కాలము 1450 క్రీ॥శ॥ అని బ్రౌనుదొర వ్రాసెను. రామ రాజ భూషణుడు అని వ్రాయక భట్టు మూర్తి అని కూడ వ్రాయుట గమనింప దగినది.

తెలుగు ప్రబంధములలో మిక్కిలి ప్రౌఢమైన వసుచరిత్రకు సుబోధ సుందర మైన వ్యాఖ్య ఆవశ్యకమని బ్రౌనుదొర ఆలోచించుటలో ఆశ్చర్యము లేదు. ఒక గ్రంథమునకు వ్యాఖ్యానము, ఆ గ్రంథమును గురువు సాయము లేకుండ చదివి అర్థము చేసికొని ఆనందించుటకే అని బ్రౌనుదొర విశ్వాసము. వ్యాఖ్యాతల పాండిత్య ప్రకర్షకే వ్యాఖ్యానములను నమ్మకమున్న ఆ రోజులలో (ఈ నమ్మకము నేటికిని లేకుండ పోయినదా ?) బ్రౌనుదొర వ్యాఖ్యానములను సులభముగా వ్రాయించి ప్రజలకు మహోపకారము చేసెను.

వసు చరిత్ర వ్యాఖ్యాన రచనకు మొట్టమొదట నందలూరు గ్రామవాసియైన ములుపాక బుచ్చయ్య శాస్త్రిలను నియమించెను. ఈ శాస్త్రిలు, మాఘమాహాత్మ్యమును (పద్మపురాణములోని ఉత్తర ఖండములోనిది) వేంకటేశ్వర మాహాత్మ్యమును రచించి పేరు పొందియుండెను. "సకల లక్షణ శాస్త్ర చక్రవర్తి, శబ్దశాసన సూత్రసహిత వృత్తి, లక్ష్యలక్షణ గురులఘు వర్ణ గణ వార్తికావృత్తి, విద్వన్మతానువర్తి" బ్రౌనుదొర తనను పిలిపించి వసుచరిత్రకు వ్యాఖ్యానము వ్రాయవలసినదని కోరినట్లు బుచ్చయ్య శాస్త్రిలు వ్రాసికొన్నాడు :

> "నను బిలిచి పలికె విద్వ
> జ్జనములు నుతియింప నీవు సరళోక్తులచే
> ఘనమైన వసుచరిత్రకు
> మన మారగ టీకచేయు మా మహివెలయన్"

ఈ సందర్భముననే బ్రౌనుదొర ఉదారతను, వితరణను ఇట్లు వర్ణించెను :

> "నూర్లార్లు లెక్కసేయక
> పేర్లందిన విబుధ జనులఁ బిలిపించుచు వే
> మార్లర్థమిచ్చు వితరణి
> చార్లీసు ఫిలిప్పు బ్రౌను సాహెబు కరుణన్"

ఇంతటి వితరణశీలుడు, దొర తనను ప్రోత్సహించినాడన్న ఆనందముతో వ్యాఖ్యానమున కుపక్రమించి :

> "అందరి కర్థంబై యా
> నందం బొనగూర్చగా జనంబులు మెచ్చన్
> మందార కుసుమ మాధ్వీ
> కందళితోక్తులను టీక గావింతుదగన్"

అని ప్రతిజ్ఞ చేసినాడు. 1829-1830 లో బ్రౌనుదొర 'కాలేజి' అని ప్రసిద్ధి పొందిన కడపలోని బంగాళాలో వ్యాఖ్యాన రచన ప్రారంభించి ముగించినాడు.

బ్రౌనుదొర జీతమిచ్చి పోషించిన పండితులలో నితడొకడు. బుచ్చయ్య శాస్త్రిలు తన వ్యాఖ్యానమునకు ముందు పీఠికాప్రాయముగ బ్రౌనుదొర గుణగణములను కీర్తించుచు వ్రాసిన పద్యములలోని పద్యములే పైనుదాహరించినవి.

బుచ్చయ్యశాస్త్రిలు వ్రాసిన 'ప్రతిపదార్థ ప్రకాశిక', 175) ప్రాంతములో సోమమంత్రి వ్రాసిన 'విద్వజ్జన రంజని' వ్యాఖ్యను ఆధారముగా చేసికొని బయలుదేరినది. "సరళోక్తులతో" వ్రాయవలసినదని బ్రౌనుదొర చెప్పినను, "అందరి కర్థంబై యానందం బొనగూర్పగా" టీకను గావింతునని శాస్త్రిలు ప్రతిజ్ఞ చేసినను, బ్రౌనుదొరకే టీక-కష్టముగా నుండుటచే గాబోలు-నచ్చలేదు. ఒక సంవత్సరము (1829-1830) శ్రమపడి వ్రాసినను బ్రౌనుదొర అచ్చుసంగతి తలపెట్టలేదు. నిరుత్సాహముతో బుచ్చయ్య శాస్త్రిలు బ్రౌనుదొరకు, "తమ శెలవు ప్రకారము కృష్ణారెడ్డి పంపించిన వసుచరిత్ర ప్రతిపదార్థ ప్రకాశిక తమరు అంగీకరించినదీ లేనిదీ తెలియలేదు. యిక్కడనైతే బహుమంది పెద్దలు అంగీకరించి బహుదేశములవారు వ్రాసుకొని పోతూనూవున్నారు. ఆ ప్రకారము బహుమంది విద్యార్థులు వ్రాసుకొని వల్లిస్తూవున్నారు. తమపేరిటి కృతి గనుక తనంతటనే విస్తరిల్లుతూ వున్నది..." అని వ్రాసికొన్నాడు. బ్రౌనుదొర, ఆనాటి పండితులలో మంచి పేరున్న "వేటపాళము"నకు చెందిన జూలూరి అప్పయ్య పంతులును ("one of the greatest acha Tenugu scholars now living, says Bramhia is జూలూరి అప్పయ్య పంతులు at వేటపాళము alias Naydpally, near Bapatla, which is 5 coss thence") వసుచరిత్రకు వ్యాఖ్యాతగా నియమించినాడు. ఈ వ్యాఖ్యానము 1832-1834 నడుమ కొనసాగినది. అచ్చగుచున్నప్పుడు (1839-1840) దానిని పర్యవేక్షించుటకు పత్యం అద్వైత బ్రహ్మయ్య శాస్త్రిలు నియుక్తుడైనాడు. కాని ఇది మధ్యలో ఆగిపోయినది. పత్యం వారి ఆరోగ్యము చెడిపోయి ఆయన మద్రాసు విడిచి స్వస్థలమునకు వెడలిపోవుటతోడనే పని నిలచిపోయినది. ఆ సందర్భమున బ్రౌనుదొర తన కాప్తుడైన పండితునకు వ్రాసిన జాబు-తెలుగు ప్రబంధమైన వసుచరిత్ర విషయమున దొరకున్న శ్రద్ధను, తొందరగా నది ముద్రణ పొంది ప్రజల కందుబాటులోనికి రావలెనను తహతహను, పడిన శ్రమ వ్యర్థమగునేమో అని భయమును తెలియచేయుచున్నది. ఇదిగాక, బ్రౌనుదొర తెలుగు

కావ్యముల పునరుద్ధరణ కార్యక్రమములో ఎంత నిమగ్నుడై యుండెడివాడో తెలియును :

"రాజశ్రీ వఠెం అద్వైత బ్రహ్మయ్య శాస్త్రుల్లగారికి సల్లాం. ॥

ఆ దేశముకు మీరు చేర్ని తరువాత మీకు ఆరోగ్యమైన సంగతిన్ని కాని సంగతిన్ని వినకపోవడమువల్ల నిండా విచారముగా వున్నాము. దైవ సహాయం వల్ల త్వరగా ఆరోగ్యము కావలెనని కోరియున్నాము. మెట్టుకు యిందును గురించి త్వరగా వుత్తరాకు యెరుకచేస్తే బహు సంతోషిస్తూ వున్నాము.

ప్రస్తుతం వ్రాయించే సంగతి యేమంటే పోయిన నెల ఆరంభంనుంచి పసుచరిత్ర ఛాపాచేశే పని పూర్తిగా నిల్చిపోయినది. యిందువల్ల మనకు చాలా ఫలం రావలశినందుకు ఫలం రాకుండా నష్టం సంభవించబోతున్నదని చింతపడి యున్నాము. యీ పని యెందుకు నిల్చిపోయినదో అని విచారించినంతల్లో ఛాపా చేశేవాండ్లకు మనము అయినమందల రూపాయలు మట్టుకు బాకీ పడినట్టుగా తెల్సినది.

యీపని యింతదూరం జర్గించి వుండి మధ్య చాలించుకోవడం మహా హానికరంగాని మరివకటి కాదు. ఇంటికి గోడలు కట్టిన తర్వాత పైకప్పు మాత్రం బాకీవుంచి ఆ కొంచెం కుదిరించకుండా యిల్లు యావత్తు పాడుచెయ్యడం యెంతపని అవునో యిదిన్ని అలాగున్నదే వున్నది. యీపని చాలించే బుద్ధి మీకు వకవేళ ఉదయించినదేమో అని సందేహించి మనకు ప్రత్యామ్నాయం యితరులు యీ పనిమీద పడేటట్టు యోచించి యున్నాముగాని ఆ చొప్పున కుదరక పోయింది.

యెందునుంచి అంటే పని సఘంమట్టుకు జర్గివుండగా పరులు యిందులో చెయ్యి వేశేటందుకు సంకోచిస్తూ వున్నారు. మరిన్ని వాండ్లు అట్లా సంకోచించడం న్యాయమేలే. యెందుకంటే వకరు ఆరంభించిన పనిని మరివకరు ఉద్యోగించి తీర్చడం అపరూపమై బుద్ధి దూరమైవుండును. యీ పని యీ తీరుగా పడి యుంటే మనకు యావత్తు నష్టి సంభవించకుండా మీకు యెరుకచేయడం మాకు ధర్మమే. మీరై యీ పని కడాపు జర్గించడానకు బుద్ధిలేకపోయ్ని పక్షముకు ఉత్తరోత్తరావరులు యిందులో ప్రవేశించి కడాకు సాగించిన పక్షమందు దీని

యొక్క ఫలమేమి పెట్టుబడి గాకలు యేమి తిర్గి మనకు రావడానకు ఆకరం కనుపించలేదు.

దివ్యఫలమున్నూ శాశ్వతమైన పేరున్ను రావలశ్ని పనియొకల సుఖం యంతమాత్రం సంభవించకుండా నష్టం తెచ్చుకోవడం లేతని అవునుగన్కు మీరు అవశ్యకరముగా నేను యీసారి చెప్పుకున్న బుద్ధిని ఆలోచనకు తెచ్చి, ఆ వర్సగా మన సుప్రీంకోర్టు వు యీ పని ఆఖరు పర్యంతం కాజేశేలాగు మీరు - వశ్య ముగా యేర్పరచవలెనని యీ జాబు మీపేరట వ్రాయించడమైనది.

యిదిగాక మేము చెప్పకున్న ఆంధ్ర వ్యాకరణమున్ను ఆంధ్ర నిఘం టున్ను యింగిలీషు నిఘంటున్ను యీ మూడు గ్రంథములును. తామే అయి చాపా చెయ్యించుకు యిక్కడ వుండే వక పుస్తకాల వర్తకుడు యత్నపడి మాదగ్గెర దరఖాస్తు చే నాడు గన్క యీ మూడు పొస్తకాలున్ను నేను యేర్ప రించిన ప్రకారమే స్వచ్ఛంగా పుట్టే సమయం వచ్చినది కాబట్టి యీ సమా చారం మీకున్ను సంతోషకరమే గన్క వ్రాయించడమైనది

యింతే సల్లాం.

1840 జనవరి 31. C.P. Brown[24]

వసుచరిత్ర, జూలూరి అప్పయ్యపంతుల వ్యాఖ్యతో 1834 నాటికీ సిద్ధ మైనను, 1839-1840 లో అచ్చు మొదలైనను పని సక్రమముగా జరిగినట్లు లేదు. పై ఉత్తరమునుబట్టి; అచ్చుపనిని పర్యవేక్షించుటకై నియమితుడైన బ్రహ్మయ్య శాస్త్రులు అనారోగ్య కారణముగా స్వదేశమునకు తిరిగి పోయినట్లును అట్లు పోయిన తరువాత "మాటామంతి" లేకుండా అక్కడనె ఉండిపోవుటచేత బ్రౌను దొర శాస్త్రులును హెచ్చరించుచు ఉత్తరము వ్రాయవలసి వచ్చెనను విషయము తెలియుచున్నది. ఈ శాస్త్రులు స్వస్థలములో 1840 లోనే దివంగతులగుటచే బ్రౌనుదొరకు జవాబుగాని తిరిగివచ్చి వసుచరిత్ర ముద్రణమును పర్యవేక్షించుట గాని జరగలేదు. దీనికాధారముగా 'ఫోర్ట్ సెయింట్ జార్జి గెజట్' 13 మే, 1840, లో ఆచ్చయిన క్రింది 'వార్త'ను గ్రహింపవచ్చును :

"The Court of Sudr Udalut have made the following appointments :

---

24. బ్రౌన్ లేఖలు-సంశోధన : బంగోరె; పర్యవేక్షణ: జి.ఎన్. రెడ్డి; శ్రీ వేంక టేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి-1977 ఫిబ్రవరి, పుటలు-52, 53.

"S. Anuntachary, Junior Pundit of the Court of Sudr Udalut, to be Senior Pundit in the said Court, Vice Advaita Brumma Sastry deceased" - 4th May, 1840.[25]

1840 లో జనవరి 31 వ తేదీని బ్రౌనుదొర వ్రాసిన లేఖనుబట్టి, వసు చరిత్ర ముద్రణ 1839 లోనే ప్రారంభమయినదని నిర్ణయింపవచ్చును. వర్యం వారికి బ్రౌనుదొర జాబు వ్రాయునాటికి పని ఎక్కువగానే జరిగినది. లేకపోయి నచో. "యీ పని యింతదూరం జర్గించివుండి మధ్య చాలించుకోవడం మహా హాని కరంగాని మంచివకటి కాదు" అనియు. "పని సఘంమట్టుకు జర్గివుండగా పరులు యిందులో చెయ్యివేసేటందుకు సంకోచిస్తూవున్నారు" అనియు బ్రౌనుదొర తన జాబులో వ్రాయుట యుండదు.

1840 నాటికే, ఇంచుమించుగా, సగము పని అయినను 1842 ఆగస్టు నాటికి కూడ నాలుగు ఆశ్వాసములే అచ్చయినవి. బ్రౌనుదొర "పనిసఘం" అని నప్పుడు, పని ఎక్కువగనే జరిగినదని గ్రహింపవలెను. ఈ నాలుగు ఆశ్వాసములు, అమ్మకమునకు సిద్ధముగా నున్నవని 'వర్తమాన తరంగిణి' 4వ తేదీ, ఆగస్టు 1842)లో, ఇతర గ్రంథములతోబాటు "వసుచరిత్ర" కూడ నున్నది. తరువాత నింక రెండు సంవత్సరములకు (1844) పూర్తి గ్రంథము[26] అచ్చయి విడుదల అయినది.

---

25. Ibidem Page - 54.

26. "ఈ దిగువను మా పత్రికలో ప్రసిద్ధపరచియుండే సకల గ్రంథములున్ను రొఖ్ఖ యాకలకు క్రయానికి యీ చాపాఖానాలో దొరకడమవును..."

| | | |
|---|---|---|
| తెనుగు - టీకాసమము | రు. 7. | |
| మూలం అమరము | రు. 1 | అ.8 |
| మనుచరిత్ర మూలము | రు. 2. | |
| ఆదిపర్వం | రు. 8. | |
| వసుచరిత్ర టీకతో 4 ఆశ్వాసము పర్యంతము తయారుగా వున్నవి. మిగిలిన రెండు అశ్వా సములున్ను పూర్తికాగానే యిప్పించడ మవును. | రు. 10." | |

(బ్రౌన్ జాబులు - తెలుగు జర్నలిజం చరిత్ర 1832 నుంచి 1857 దాక; బంగోరె సంకలనం, ప్రచురణ. 1973, పుటలు - 43, 44).

వసుచరిత్రకు 1829-1830 (విరోధినామ సంవత్సరము)లో ములుపాక బుచ్చయ్య శాస్త్రులుచేత, కడపలో తన "కాలేజి"లో వసతి ఏర్పాటుచేసి వ్యాఖ్య వ్రాయించినాడు: ఆ వ్యాఖ్య అంత నచ్చక, జూలూరు అప్పయ్య శాస్త్రులుచేతకూడ వ్రాయించినాడు. ఇది 1832-1834 నడుమ పూర్తి అయినది. దీనిని అచ్చువేయించుటకు మదరాసులోనున్న "అమెరికన్ మిషన్ ప్రెస్" నుండి కొటేషన్ తెప్పించినాడు. దానినిబట్టి ఆనాడున్న అక్టోబరు, 1838 ధరల వివరములు తెలియుచున్నవి :[27]

"To printing 500 copies of the Telugu poem

| | |
|---|---|
| 300 pages 4° at 3 Rs. | 900-0-0 |
| 31 reams of superfine paper at $11\frac{1}{2}$ Rs. | 356-8-0 |
| Binding 500 copies at 1 Rs. | 500-0-0 |
| | 1756-8-0 |

(Price per copy Rs. 3-8-3)

Further : for 500 additional copies of the

| | |
|---|---|
| first volume 150 pages at $11\frac{1}{2}$ Rs. | 225-0-0 |
| $15\frac{1}{2}$ reams of paper at $11\frac{1}{2}$ Rs. | 178-4-0 |
| Binding 500 copies at 1 Rs. | 500-0-0 |
| | 903-4-0 |

(Price per copy Rs. 1-13-0)

"The charge per page of the 1st vol. is charged at Rs. 1-8-0... if they be printed at the same time with the above. The probable time in which the work will be completed is eight months".

27. Ibidem. పుట-78. (మదరాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీలో జూలూరు అప్పయ్యగారి వసుచరిత్ర టీక ప్రతి డి 759 సంపుటం 2. ఉన్నవి).

వసుచరిత్ర, జూలూరు అప్పయ్య పంతులు వ్యాఖ్యతో 1844 లో క్రిస్టియన్ నాలెడ్జ్ సొసైటీ వారి ప్రెస్‌లో ఆర్.డబ్ల్యు. థార్ప్ ద్వారా అచ్చయిన విషయము మనకు తెలియును. ఈ విధముగా, అచ్చువేయించిన పదులకొలది పుస్తకములకయిన అచ్చు ఖర్చులు, వాటి శుద్ధ ప్రతులను సిద్ధముచేయించుటకయిన ఖర్చులు-పండితుల జీతములు మొదలయినవి-అచ్చువేయించక ఇతరులకిచ్చిన తాను తన గ్రంథాలయమునందుంచిన శుద్ధ ప్రతుల తయారీకయిన ఖర్చులు - ఇంచుమించుగా ముప్పది, నలుబది సంవత్సరముల కృషిలో-మొత్తము చేసి చూచినప్పుడు మనకు "మతి" పోవును. "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు" అను గీతా వాక్యమునకు ఇంతకంటె మంచి ఉదాహరణ ఎక్కడ లభించును!

తెలుగు సాహిత్య పిపాసువుల హృదయ క్షేత్రములలో శాశ్వత స్థానమును సంపాదించిన 'మనుచరిత్ర' ముద్రణము-వ్యాఖ్యానముతో కూడ- 1851 వరకు కాలేదు. దీని వ్యాఖ్యానము కూడ జూలూరి అప్పయ్య పంతులే. వసుచరిత్ర వచ్చిన ఏడు సంవత్సరములకిది వచ్చినది. వసుచరిత్ర ముద్రణములో జరిగిన జాప్యము - కారణము లేవియైనను-బ్రౌనుదొరను కొంత నిరుత్సాహ పరచినదని చెప్పక తప్పదు. ఇందువలననే కావచ్చును-వసుచరిత్రకంటె కూడ ఎక్కువ ప్రజాభిమానమును చూరగొన్న మనుచరిత్ర ముద్రణము, పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధము ప్రారంభమగువరకు (1851) జరగలేదు. ముద్రిత మనుచరిత్ర ముఖపత్ర మిట్లున్నది:

Swarochisha

Manu - Charitra

A Celebrated Poem in the Telugu Language

Written about the year A. D. 1550,

By.

Allasani Peddanna

With a Commentary Written in Telugu,

at the Desire of Charles Philip Brown

By

Zuluri Appayya

— —

Published by

Bhuvanagiri Chinn Rangaya Sethi

Madras

1851

'వసుచరిత్ర' రచనా కాల విషయమునందు వలనే 'మనుచరిత్ర' రచనా కాల విషయమునందుకూడ ఐతిహాసిక విషయములు సమగ్రముగ లభింపని కాలము గనుక బ్రౌనుదొర పొరబడుట జరిగినది.

వ్యాఖ్యానముతో కూడిన మనుచరిత్ర ముద్రణము 1851 లోజరిగినను, మనుచరిత్ర మూలము మాత్రము 1842 నాటికే అచ్చులో వచ్చినట్లు చెప్పుటకు 'వర్తమానతరంగిణి' (1842 ఆగస్టు 18వ తేది) లోని "మనుచరిత్ర మూలము, రు. 2," అను వ్యాపార ప్రకటన ఆధారమగుచున్నది. దీనిని బ్రౌనుదొర అచ్చు వేయించెనో లేదా ఇతరులెవరైన వేయించిరో నిష్కర్షగ చెప్పుట కష్టము. దీని తరువాత (1851) ప్రసిద్ధికి వచ్చిన ముద్రణము 1875 లో వచ్చెను. దీని ముఖ పత్రము ఇట్లున్నది:

శ్రీరస్తు

— —

శ్రీ మదాంధ్ర కవితా పితామహ సర్వతో ముఖాంక పంకజాతు పాదాంబుజాధీన మానసేందిందిరానంద నందపుర వరవంశోత్తంసళఠగోప తాపన

ప్రసాదాసాదిత కవితా మతల్లి కాల్లసాని

చొక్కయా మాత్యపుత్ర,

పెద్దనార్య ప్రణీతంబైన,

— —

స్వారోచిషమను సంభవంబను నిమ్మహా ప్రబంధంబునకు

నన వద్య విద్యా సాగర విహార సుజనోప కార

తారహారహీర డిండీర విస్తార,

యశోదారులగు,

చార్లెస్ - సీ - పి. బ్రౌన్ దొర వారి యుత్తరువు ప్రకారము,

పండిత మండల మండితులగు-

జూలూరు - అప్పయ పండితులచే,

సరసముగా విరచింపఁబడిన - ప్రతిపదటీకాసహితముగా

ఆ - సరస్వతి - నృసింహాచార్యుల చేతఁ

బరిష్కరింపఁబడి,

పిళ్ళారిసెట్టి - రాఘవయ్యనాయన వారి

స్వకీయ,

శ్రీ భారతీ నిలయ ముద్రాక్షర శాలయందు

ముద్రింపించి ప్రచురము చేయఁబడియె,

౧౮౨౫ ॥సం॥

చెన్నపురి.

జూలూరి అప్పయ పండితుల వ్యాఖ్యాన స్వరూపమును, ఆయన భాషను తెలిసికొనుటకు ఉదాహరణ ప్రాయముగా మనుచరిత్రలోని మొదటి పద్యము "శ్రీవక్షోజ కురంగనాభ మెదపైఁజెన్నొంద" అను దాని తాత్పర్యమును చూపింతును :

"అనగా విష్ణుమూర్తి వక్షస్థలమందు లక్ష్మీస్తన కస్తూరి అంటితే నల్లని దేహకాంతి గల భూదేవిని గూడా లక్ష్మీదేవి సరసను నిల్పినాడా యేమి అనే టట్టుగా సనందనాదులకు తోచబడెనని తాత్పర్యము."

ఇది జూలూరి అప్పయ్య పండితుని భాష వ్యావహారికాంధ్రము. ఆశ్వాసములను —" మొదటి ఆశ్వాసం; రెండో ఆశ్వాసం; మూడో ఆశ్వాసం; నాలుగో

ఆశ్వాసం; అయిదో ఆశ్వాసం; ఆరో ఆశ్వాసం" — అని పిలిచినారు. Canto అను పదమును కూడ వాడినారు.

ఇంక ప్రతి ఆశ్వాసము చివరను — "ఈ టీక చెప్పినది జూలూరు అప్పయ్య శాస్త్రి, మచిలీ బందరు జిల్లా జడ్జీగారైన చార్లీసు ఫిలిపు బ్రౌన్ దొరగారు యిందున గురించి జీతము యిచ్చి యీ పని 1832 సంవత్సరములో జరిగించి నారు — " అని కలదు. 1832 నాటికే టీకతో సిద్ధమైన ఈ గ్రంథము, 1851 నాటికి అచ్చయినది.

ఆరవ ఆశ్వాసము చివరను మాత్రము ఇట్లున్నది — "ఖరనామ సంవత్సర మార్గశిర బ 11 గురువారం ఆన 1831 సంవత్సరం డిశంబరు నెల 29 తేదీవరకు మహారాజశ్రీ చార్లీసు ఫిలిపు బ్రౌన్ దొరగారి సెలవు ప్రకారం జూలూరి అప్పయ్య యీ స్వారోచిష మనుసంభవమునకు అనగా మనుచరిత్రకు టీక చెయ్యడమైనది."

ఇప్పుడు ప్రచారములో నున్న మనుచరిత్ర ప్రతులలో, తృతీయాశ్వాసము లోని 123 వ పద్యము ("మనసు కకుఱితి మెల్లనలేచి చేతులగాంతుని జబ్బుగా గౌగిలించు") బ్రౌనుదొర పుస్తకములో లేదు. ఈ విషయమై, బ్రౌను దొర ప్రతిలో ఇట్లున్నది. "మూడవ ఆశ్వాసము.......గర్భిణీ లక్షణము చెప్పే టప్పుడు కొన్ని ప్రతులలో యీ పద్యము చెప్పియున్నది. (ఇక్కడ "మనసు కకుఱితి" అను పద్యము పూర్తిగా నీయబడినది.) దొరవారి పుస్తకములో లేదు. దీనిపై పద్యము అంత వియచ్చరుడు" అని. గ్రంథము చివర, 1851 లో సంవత్సరము-మహారాజశ్రీ-సి.పి. బ్రౌన్ దొరవారి అనుమతి ప్రకారము భువన గిరి చినరంగయ్య శెట్టిగారు స్వముద్రాక్షరశాల యందు అచ్చువేయించినారు" అని ఉన్నది.

ఈ విధముగా, తెలుగువారికి అత్యంత ప్రీతిపాత్రములైన రెండు ప్రబంధ ములు సవ్యాఖ్యానముగ అచ్చయినవి. 1844 లో అచ్చయిన 'వసుచరిత్ర'కు బ్రౌనుదొర పీఠికా ప్రాయముగ వ్రాసిన 'నోటీస్'లో చెప్పినట్లు, అప్పటికే- విజయవిలాసము, తారాశశాంక విజయము, కవికర్ణ రసాయనము, సారంగధర చరిత్ర,దశావతార చరిత్ర మొదలైన ఉద్గ్రంథములెన్నియో ఆయన ప్రోత్సాహ

మున, ధన సాహాయ్యమున, విద్వాంసులు వ్రాసిన వ్యాఖ్యానములతో అచ్చునకు సిద్ధముగా నుండెను.

బమ్మెర పోతనామాత్యుని ఆంధ్ర భాగవతమును ఆదరాభిమానములతో భక్తి గౌరవములతో ఆదరింపని తెలుగువారుండరు. దీని ముద్రణమునకు శుద్ధ ప్రతిని సిద్ధముచేసి ఇచ్చినది బ్రౌనుదొర. పరిష్కృత పాఠములతోనిది 1827 నాటికే సిద్ధమైనది. ఇట్లు సిద్ధమైన అనేక గ్రంథములను బ్రౌనుదొర, "అచ్చువేసి కొందుము" అని అడిగినవారికి ఇచ్చి వేయుచుండెడివాడు. ఈ విధముగా లాభమును పొందిన వ్యక్తులలో పురాణం హయగ్రీవ శాస్త్రిగారు ఒకరు. 1840 లో ఏప్రెల్ 10 వ తేదీని ఆయన వ్రాసిన ఒక ఉత్తరంలోని క్రింది భాగమును పరిశీలించినప్పుడు ఈ విషయము తెలియును :

"ప్రకృతమందు కావలసిన పుస్తకములు తారాశశాంకము, కుచేలోపాఖ్యానము, సారంగధర చరిత్రము, మైరావణ చరిత్ర, సుభద్రాపరిణయము, రాధికాస్వాంతము, రాఘవ పాండవియ్యము, సవ్యాఖ్యానము, మనుచరిత్ర సవ్యాఖ్యానము, తెలుగు పద్యములలోకూడా వుండే కర్ణామృతములు 3 శతకములున్ను. కొద్ది రోజులకు పిమ్మట కావలశిన పుస్తకములు భారతము యుద్ధ పంచకము, రంగనాథ రామాయణము, తెలుగు భాగవతము, హరిశ్చంద్రనలోపాఖ్యానము సవ్యాఖ్యానము, వీటిలో యెవరికైనా అచ్చువేయుటకు యిచ్చేలాగున ముందు వాగ్దత్తము చేశియున్న పక్షమందు ఆ పుస్తకములను దక్కతక్కిన పుస్తకములను నాకే యిచ్చేలాగున దయచేయవలెనని కోరుతున్నాను."

"తమరు యీ విషయమందు సర్వజ్ఞులు గనక యింకా యే పుస్తకములు అచ్చువేయించుటకు నుపయుక్తంగా తమకు తోస్తున్నదో వాటిని తెలియచేయవలెనని కోరుతున్నాను."

"యీ అచ్చువేశే విషయమును గురించి తమరు సర్వ సాధారణముగా సహాయము చేయవలెనని దలంపుగల ప్రభువులయినందువల్లనున్ను, ఆంధ్ర భాషయందుగల పుస్తకములు సుష్టుగా దిద్దివేయించవలెననే కోరిక గలవారైనందునున్ను నావిషయముగా అచ్చుకు కావలశిన పుస్తకములనిచ్చి సహాయము చేస్తామని లోగడ నొక తూరి జాబు వ్రాపి పంపించియుండడము వలనున్ను, సదరహి

మూడు హేతువులవల్ల ఈ రీతిగా వ్రాయడమైనది. చిత్తగించవలెను" 28

ఈ జాబును చదివినప్పుడు,హయగ్రీవశాస్త్రిలు ఎంత విశ్వాసముతో తనకు తప్పక సాయము చేయునని) బ్రౌనుదొరకు ఈ లేఖ వ్రాసెనో తెలియును ! సొంత డబ్బు ఖర్చుపెట్టి పండితులచేత పరిష్కరింపజేసిన గ్రంథములను అచ్చువేసి కొనుటకు ఇతరుల కిచ్చుట బ్రౌనుదొరకు అలవాటు అను విషయము ఈ ఉత్తరము వలన స్పష్టముగ తెలియుచున్నది. ఈ శాస్త్రిగారు చిన్నయసూరి గారికి సమ కాలికులు. మద్రాసు విశ్వవిద్యాలయ పాఠశాలలో సూరిగారు ప్రథమ పండి తునిగా నున్నప్పుడీయన ద్వితీయ పండితుడు. ఈయన 'వి. వేకాదర్శ ముద్రణా లయను' అను పేర నొక ప్రెస్సును నిర్వహించుచు స్కూలు పుస్తకములను, భాగవతాది ప్రసిద్ధ గ్రంథములను ముద్రించు చుండెను బ్రౌనుదొర నుండి పరిష్కృత భాగవతమును గ్రహించి దానిని 1848 లో తన ప్రెస్సులోనే ముద్రించెను.[29]

ఈ శాస్త్రిగారే, తాను అచ్చొత్తించిన భాగవతమునకు పీఠిక వ్రాయుచు దానిలో కడపదగ్గర నున్న ఒంటిమిట్టయేపకశిలానగరమని వ్రాసెనని బ్రౌనుదొర తన

---

28. మదరాసు ఓరియంటల్ మేన్యుస్క్రిప్టు లైబ్రరీలోని బ్రౌన్ జాబుల సంపుటం, ఎమ్ 401, పేజీలు 297-99. As quoted in బ్రౌన్ లేఖలు; పర్యవేక్షణ: జి.ఎన్. రెడ్డి; సంశోధన: బంగోరె; శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం, తిరుపతి. ఫిబ్రవరి, 1977; పుట-53.

29. "A corrected edition was prepared at my expense in the year 1827. The Telugu Bhagavat was printed in Quarto at Madras in the year Kilaca 1770 that is A.D. 1848". (Telugu-English Dictionary: C. P. Brown, 1852; Page-VII .

నిఘంటువునకు వ్రాసికొనిన ఒక 'నోట్'లో వివరించెను.[30]

"నల చక్రవర్తి కథ, ద్విపద" (Tale of Nala, Written in Telugu, Dwipada Metre, by Raghava) రాఘవ కవి ప్రణీతమైన దానిని బ్రౌను దొర 1841 లో మద్రాసులో ముద్రించెను. దీని కథా ప్రారంభ మిట్లున్నది :

"సలలితసారాంధ్ర శబ్ద సంగతుల
వలనొప్పగ నల చక్రవర్తి చరిత్ర
విరచింతు నా నేర్పు విధమెల్ల దెలియ
కరమొప్ప తత్కథా క్రమ మెట్టిదనిన"

ఈ "రాఘవ" కవి ఎవరో, ఆయన పూర్తి పేరు ఏదిగాగా స్పష్టముగా తెలియదు 'రాఘవాచార్యులు' కావచ్చును. దీనికి బ్రౌనుదొర ఒక 'అడ్వర్ టైజు మెంటు' ప్రారంభములో ఇట్లు వ్రాసెను:

Advertisement

THE TALE of NALA has been written in various modes by different Telugu poets who have introduced such incidents and employed such a style as the public taste approved. As envisaged by the poet Raghava it is remarkably popular, and has been selected for publication because so easy as to suit beginners in the language. A translation has also been prepared which may probably be hereafter published. C.P.B

---

30. "It is the Village now called ఒంటిమిట్ట Wantimitta, a little South of Cuddapa, on the route to Madras, says హయగ్రీవ శాస్త్రి in his introduction to the printed Telugu Bhagavat" (బ్రౌను లేఖలు : పర్యవేక్షణ; జి.ఎన్. రెడ్డి ; సంశోధన : బంగోరె ; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి ; ఫిబ్రవరి, 1977 ; పుట-86.)

బ్రౌనుదొర వ్రాసిన "మున్నుడి" (Foreword)తో మద్రాసులోని వేపేరి మిషన్ ప్రెస్‌లో 1842లో అచ్చయిన ఇంకొక ప్రసిద్ధమైన ద్విపద కావ్యము, గౌరన మంత్రి వ్రాసిన 'హరిశ్చంద్ర'. దీని ముఖ పత్ర మిట్లున్నది :

ఈ గ్రంథము గౌరనమంత్రిచేత చెప్పబడ్డ సమగ్రమైన
హరిశ్చంద్ర ద్విపద కావ్యమున్ను
ఆయననే చెప్పిన నవనాథ చరిత్ర
ద్విపద కావ్యములో యుండేటి యొక కథయున్ను గలది.

—

THE CALAMITIES OF

HARISCHANDRA;

with Extracts from the

NAVANATHA CHARITRA;

Being Telugu Poems,

Written in (Dwipada) Couplets by

GAURANA MANTRI,

about the year A.D. 1600.

—

MADRAS:

Printed for the Proprietor, by **R.W.** Thorpe,
at the Vepery Mission Press.

—

1842

నల చరిత్ర, నవనాథ చరిత్ర, హరిశ్చంద్ర చరిత్రల ప్రస్తావనయున్న క్రింది జాబును బట్టి ఆయా గ్రంథములను సంపాదించుటలో, ఆ నాడు ప్రభుత్వోద్యోగములో నున్న గుండ వరపు కృష్ణయ్యగారు సాయము చేసినట్లు తెలియుచున్నది. ఈ జాబు భారతీయుడైన ఒక కంపెనీ ఉద్యోగికి, కంపెనీ ఉద్యోగియే అయిన ఒక ఇంగ్లీషువాడు వ్రాసినది కూడ గనుక బ్రౌనుదొర పాటించిన "మర్యాద" గమనింపదగినది :

మహారాజ శ్రీ గుండవరపు కృష్ణయ్యగారికి-

సలాములు. త॥

ఆ జిల్లాలో కుంఫిణి పనిలో మీరు అభివృద్ధిని పొందిన॥ విని సంతోషించినాము. యింతట నుంచి మీ సుఖ సమాచారములు మాకు యరకచేస్తూ రావలెనూ॥ మరిన్ని వ్రాయవలశ్నిదియే॥ కవి గౌరన మంత్రి చెప్పినటువంటి నవనాథ చరిత్ర అనె ఆంధ్ర ద్విపద కావ్యము అయిదు అశ్వాసములు కల ప్రబంధము 140-160 ఆకులుగల ప్రబంధం మాకు ప్రస్తుతం జరూరుగా కావలశ్నిది. యీ ప్రబంధం చేబ్రోలులో శంభుదేవరగారి మఠంలో కలిగినట్లు విన్నాముగన్క యీ జాబు మీ పేరట వ్రాయడం అయ్నిది.

మీరు ఆ మనిషిని బహుశా గుర్తెరిగి వుండగా ఆ గ్రంథం మాకు అందేలాగున చెయ్యవలశ్నిది. ఆ మాతృక యిక్కడికి అంపించడాన్కి ధైర్యం లేకుంటే అందుకు ప్రతిక పుట్టించవలశ్నిది. ఆ ప్రతికి వచన రీతిగా త్వరగా కరడా కాగితాల మీద వ్రాయించవలశ్నిది. మేము యిక్కడ వేరే ప్రతిక పుట్టించబోతున్నాము గనుక మీరు విడివిడి కాగితాల మీద వ్రాశినా చింతలేదు. కాని కాగితాల లెఖ్క క్రమముగా వ్రాయవలశ్నిది. అక్షరాలు బాగా వుండవలెనన్న మాట అక్కరలేదు. తప్పులు మాత్రం లేకుండా దిద్ది వ్రాయించవలశ్నిది. అయితే మాత్రుక గ్రందం యిక్కడికి అంపించే పక్షమందు నెల రోజులకు లోపల ప్రతిక వ్రాయించి తిరిగి నిరాయాసంగా మీ దగ్గరకు చేరేటట్టు చేస్తున్నాను. మరిన్ని యిది శైవ గ్రంథం గనుక అక్కడ వుండే ఆరాధ్యులలో విచారించవలశ్నిది.

యీ జాబు పంపిన వెంటనే నలచక్రవర్తి చరిత్ర ద్విపద గ్రంథం మీ తావుకు అంపించడం అయినది. యింకా కొన్నాళ్ళకు హరిశ్చంద్ర చరిత్ర ద్విపద ప్రభులింగలీల ద్విపద మొదలయినవి కొన్ని ప్రబంధనులు అచ్చువేయించడంకు వుద్యుక్తులైనాము. పైగా చెప్పిన నవనాథ చరిత్ర ఈ సారంగధర చరిత్ర సహితం కలిగినది గనుక కొందరు భ్రమపడి నవనాథ చరిత్ర అనిపేరు యెరగకుండా సారంగధర అనే పేరు అన్యాయంగా పెట్టుతారు గన్క యిప్పుడు దొరికే గ్రంథం సారంగధర చరిత్ర అన్న పక్షమందు కవి నామం చూడవలశ్నిది. గౌరన అనే అహ్వాయం వుంటె నాకు కావలశ్నిటువంటి గ్రంథం

యిదేను అని గ్రహించవలశ్నిది. దీనిపోబిడి తెలిశినవెంటనే ఆ వయినం మాకు తెలియజేశి గ్రంథం తరువాత బంగీ తపాలమీద వచ్చేటట్టు జాగ్రత్త చెయ్యవలశ్నిది.

యిదే సలాములు C.P. Brown[31]

గౌరనమంత్రి హరిశ్చంద్ర ద్విపద, నవనాథ చరిత్రలో కొంత భాగము 1842 లో బ్రౌనుదొర అచ్చువేసినాడు గనుక ఈ జాబు 1841 లో వ్రాసినదని భావింపవచ్చును.

"యిది శైవగ్రంథం గనుక అక్కడ వుండే ఆరాధ్యులలో విచారించవలశ్నిది" అని బ్రౌనుదొర వ్రాయుట; లోగడ తనకు అందుబాటులో నుండెడి గ్రంథాలయములను గూర్చియు. వ్యక్తులను గూర్చియు వ్రాసి ఉంచుకొనినచోట, జూలూరి అప్పయ్య పంతులు ప్రస్తావన రాగానే "He is a వేపారి — like Jey Row" అని గుర్తుచేసికొనుటను (ఈ పరిశోధన గ్రంథములో పుట-143.) సర్వవిధముల పోలియున్నది. మన మతశాఖలను గూర్చియు, కులములను గూర్చియు, మన సాహిత్యములో ఏయే గ్రంథములు ఏయే శాఖలవారికి ఆదరణీయములో అన్నియు బ్రౌనుదొరకు క్షుణ్ణముగా తెలియునని-అనగా ఆయన కృషిచేసి తెలిసికొనెనని — స్వయం వ్యక్తమగుచున్నది. సారంగధర చరిత్ర విషయమునగూడ నిశ్చితాభిప్రాయమున్న బ్రౌనుదొర, నవనాథ చరిత్రను సారంగధర చరిత్రతో ముడిపెట్టుకొని మోసపోవలదని హెచ్చరించుచు కవినామము చూచి నిర్ణయించుకోవలసినదను సూచనకూడ ఇచ్చెను. ఇవన్నియు — భాషా సాహిత్యములతో, విజ్ఞాన సంస్కృతులతో లోతైన పరిచయమున్నగాని తెలియునవి కావు! ఈ భ్రమకు కారణముగా "పైగా చెప్పిన నవనాథ చరిత్ర ఈ సారంగధర చరిత్ర సహితం కలిగినది గనుక కొందరు భ్రమపడి"అని స్పష్టముగా వ్రాసినాడు. ఇది చాలదు అన్నట్లు "గౌరన అనే ఆహ్వాయంవుంటే నాకు కావలశ్నిటువంటి గ్రంథం యిదేను అని గ్రహించవలశ్నిది" అనికూడ చేర్చినాడు!

మన పుస్తకముల విషయమై ఇంతి పరిజ్ఞానము ఉన్నదిగనుకనే, పెద

---

31. Ibidem. 115 మదరాసు ఓరియంటల్ మేన్యుస్క్రిప్టుసు లైబ్రరీలోని బ్రౌన్ జాబుల సంపుటము ఎమ్. 411, పేజీ 36.

గంజాం కాపురస్థుడైన గంజాం పెద అప్పయ్య హారిదాసు, బ్రౌనుదొరకు పల్నాటివీర చరిత్ర ప్రతి పంపుటవిషయములో కొంత మోసమున్నట్లుతోచినందున వెంటనే "...యిది చూస్తె మేము అపేక్షించిన గ్రంథము కాకపోయెను— యిది యెవడో అల్లించిన జబ్బు కథలుగా విచారించియున్నాము.... యిటువంటి నిరాధారమైన ప్రస్తావములు వ్రాసినది చూడగా ఈ గ్రంథము నిజముగా మీవద్ద లేదోయేమో.......మీకు యిది అది చేయవలెనని కలక్టరు సాహేబు ఫేరట మేము జాబులు వ్రాయవలెనని మనవి చేసుకోవడము పెద్దమనిషి నడతకాదు... ఆ గ్రంథము మాతృక అయినా పుత్రిక అయినా అనాయాసముగా మావద్దికి పంపిస్తే మేము చెప్పిన రూపాయలు యిప్పించడానకు ఆటంకములేదు యిది త్వరగా చేయకపోతే మీ మాటలు వట్టి మాయగా తెలుసుకొని ఈ గ్రంథము వేరే మార్గంగా రాబట్టుకొనేటందుకు విచారింతుముగనుక మీరు బుద్ధితెచ్చుకొని ఆ గ్రంథము అనాయాసముగా పంపించవలసినది" అని కటువుగా జాబు వ్రాయించెను.

ఈ గ్రంథమునకు బ్రౌనుదొర ఇంగ్లీషులో వ్రాసిన "మున్నుడి" వలన ఆయనకు మన సాహిత్యముపై గల అధికారము వ్యక్తమగుచున్నది. వివిధ యుగములకు, వివిధ రచనా పద్ధతులకు చెందిన తెలుగు సాహిత్యమును విశ్లేషించి విభజించి ఆయా రచనలను ఇంగ్లీషు సాహిత్యములోని వివిధ కవుల రచనలతో పోల్చుట దీనిలోని విశేషము. ఈ తులనాత్మక పద్ధతి, తెలుగులో మొదట ప్రవేశపెట్టిన ఖ్యాతి బ్రౌనుదొరదని చెప్పవచ్చును. ఇది 1842 నాటి రచన అని గ్రహించినప్పుడు బ్రౌనుదొర విశిష్టత మనకు తెలియును. ఆయన మాటలలోనే దీని లోని కొన్ని భాగములు ఇవి :

"Telugu literature abounds with poems which are distinguished as learned, unlearned and rustic: the Vasu Charitra, the Manu Charitra, the Vishnu Chittiyam etc. are placed in the first or rhetorical series; analogous to that of Pindar in Greek or Milton in English. The Vijaya Vilasam, the Anriruddha Charitra and many more which we may compare to the poems of Byron or Pope, stand in the second. These are in stanzas. The third, equivalent to that of Walter Scott or Goldsmith contains numerous

poems written both in (Padya Cavyam and Dwipada Cavyam) stanzas and couplets: and some romances which (like that of Harichandra) being very popular are written by various poets in both modes The present volume contains the dwipada version and there are two padya versions written in high and the low styles, besides the Harischandra Nalopakhyanam written by Bhattu Murti in Telugu which is in the highest mode of enigmatical intricacy..."

ఈ "మున్నుడి" కి ఐతిహాసిక ప్రాముఖ్యము చాల కలదు. తెలుగు కావ్యములను మూడు తెగలుగా (Learned, Unlearned, Rustic) విభజించుట, అ మూడు తెగలకు మన కావ్యముల నుండి ఉదాహరణలిచ్చుట వాటిని గ్రీకు, ఇంగ్లీషు భాషలలోని రచనలతో పోల్చుట - అనునవి దీనిలోని విశేషములు.

పింగళి సూరనార్యుని కళా పూర్ణోదయమునకు వ్యాఖ్యానము వ్రాయించి అచ్చునకు సిద్ధము చేసెను [32]

పంచతంత్రమును జాగరూకతతో పరిష్కరింపించి 1827లో దానికి శుద్ధ ప్రతిని టీకతో బాటు బ్రౌను దొర సిద్ధము చేయించెను. దీనికొరకు ఆరు లిఖిత ప్రతులను తైపారువేసి చూచుట జరిగినది. ఈ ప్రతి సిద్ధమైన తరువాత, ముగ్గురు పండితులు కలిసి దీనికి వ్యాఖ్య రచించిరి ప్రతిపదటీకతో బాటు, గ్రంథాంతమున 'మాటల పట్టిక' ఇచ్చుట కూడ జరిగినది.[33] పంచతంత్రము,

---

32. "A Telugu commentary was written, at my desire, explaining it. The work is well worthy of publication" (Telugu-English Dictionary; C. P. Brown, 1852; Page-X).

33. "The work was carefully edited, under my directions (in the year 1827) and the text is corrected from six manuscripts. I employed three learned men to frame a commentary, explaining each word: and a verbal index has also been prepared." (Ibidem; Page-XI).

ప్రపంచములోని నీతికథలకు మూలభూతమైనదని పరిశోధకుల భావము. అట్టి గ్రంథమును పాశ్చాత్యులు చదివి బాగుగా నర్థము చేసి కొనుటకు వీలగునని బ్రౌనుదొర ఇట్టి శ్రమ తీసికొనెను.

'భానుమద్విజయము' అను ప్రబంధమును పరిష్కరింపించి వ్యాఖ్యానము వ్రాయించి అచ్చునకు సిద్ధము చేసినాడు. దీని నిట్లు సిద్ధము చేయుటకు నాలుగు ప్రతులను పోల్చిచూడవలసి వచ్చినది. ఈ గ్రంథమును, ఇతర గ్రంథములను సంపాదించుటకు సొంత డబ్బు ఖర్చు చేసినాడు. గ్రంథ సేకరణ విషయము చక్కగా తెలియుటకు. బ్రౌనుదొర ధర్మపురం సుబ్బన్నకు వ్రాయించిన లేఖలోని క్రింది భాగమును చూడవలసియున్నది :

ధర్మపురం సుబ్బన్నకు —

మహారాజ శ్రీ శి. పి. బ్రౌనుదొర వారు వ్రాయించిన ఆజ్ఞ యేమంటే — నీవు మా పేర వ్రాశిపంపించిన వుత్తరం చద్వుకోంగా చాలా సంతోషమయినది. వుత్తరం పట్టుకుని వచ్చిన మనిష్యికి ఖత్యాఖర్చుకింద వకరూపాయి యిప్పించి వున్నాము. మాకు కొన్ని గ్రంథములు కావలశివుండగా జాగ్రత్తచేస్తానన వ్రాసినావు గనుక సంతోషించినాము. అట్లాచేశిన పక్షమందు అయ్యే ఖర్చు ముజరా యిప్పిస్తున్నాము.

"భానుమద్విజయం అనే తెలుగు గ్రంథం కడపలో యిప్పుడు దొరికితే ధానికి, ప్రతి పుట్టించుకుని పది రూపాయిలు యినాం యిప్పిస్తున్నాము. మాతృక మాదగ్గెరకు పంపించడానకు అభ్యంతరమయ్యే పక్షమందు అక్కడనే ప్రతి పుట్టిస్తున్నాము. ముఖ్యంగా యిది శైవకావ్యము. అయిదు ఆశ్వాసములు గలది. వెలగపూడి కృష్ణయ్య కవి చెప్పినది యిది తెలుగు కావ్యము గనుక వకవేళ కడపలో దొరకవచ్చును. పయిగా పయిడిమ్మర్రి వెంకటపతి చెప్పిన చంద్రాంగద చరిత్ర అయిదు ఆశ్వాసములు గలది ముఖ్యం కావలశి యున్నది. యిది గాక జంగిమ పుస్తకాలలో కొన్ని కావలశి యున్నవి. అవి కన్నడభాష గనుక కన్నడ వాండ్లవద్ద విచారించవలెను. యేవంటే — ప్రభులింగలీల 1 బసవ కాల జ్ఞానం 1 వీటిలో ముఖ్యంగా లీల కావలసినది గనుక దానికి రెండు మూడు ప్రతులు దొరికే పక్షమందు చాపా చేయించేటందుకు మాకు భావం కలిగి వున్నది. ఈ పనికిగాను అక్కడ యేదయినా వక పుస్తకం వ్రాయించవలసి వచ్చే పక్ష

మందు సాధారణంగా వచనం రీతిగా వ్రాయవలశినది. పద్యములు నాలుగేశి చరణములుగా యేర్పర్చి వ్రాయవలశిన జరూరులేదు.

"వ్రాత అయిన తరువాత మొకాబిలా చేయించవలసినది. యీ మనిషి నీ తావుకు పొయ్యేటప్పుడు వీని పరంగా ని తావుకు, కొన్ని పుస్తకములు దానంగా పంపిస్తున్నాము. సదరహి వ్రాశిన గ్రంథములే కాకుండా యీ దిగువను వ్రాశిన గ్రంథములు కూడా మాకు కావలిశి వున్నవి గనుక వీటిని గురించి కూడా తలాషు చేశి పంపించవలెను.

1 సూర్యతనయాపరిణయం

1 చారుచంద్రోదయం

1 పండితారాధ్య చరిత్ర

1 రత్నావళి పరిణయం

---

4

---

యీ పుస్తకములు కూడా జాగ్రత్త చేశి పంపించవలెను.

ది. 12 డిశంబరు ఆన 1840 సం॥ యిటని మా వ్రాలు

C.P. Brown[34]

పుస్తకములను-అవి తెలుగు పుస్తకములైనను, కాకున్నను-సేకరించుట యందు బ్రౌనుదొర చూపెడి శ్రద్ధను వాటిని సంపాదించు విషయమున ధనవ్యయమునకు జంకకుండుటను తెలువునట్టి అనేక లేఖలలో దీని నొకదానిని లక్ష్యముగా చూపుటకు పూర్తిగా నుదాహరించితిని.

---

34. కడప జాబుల సంకలనం-పర్యవేక్షణ: జి.ఎన్.రెడ్డి. సంశోధన: బంగోరె. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతి; డిశంబరు 1977. పుటలు-౬౫, ౬౬.

బ్రౌనుదొర అనేకములైన సంస్కృత గ్రంథములను కూడ సేకరించి వాటిలో కొన్నింటికి పండితులచే వ్యాఖ్యానములు వ్రాయించి ముద్రణమునకు సిద్ధముచేసెను కొన్ని తంత్రశాస్త్ర గ్రంథములకు, మంత్ర శాస్త్ర గ్రంథములకు ఆయా విషయములు బాగుగ తెలిసిన వారిచేత వ్యాఖ్యానములు వ్రాయించుటచే, అంతకు పూర్వమున్న వ్యాఖ్యానములను పరిశీలింపజేయుటచే- మంత్ర తంత్ర శాస్త్రములకు చెందిన ఉద్గ్రంథములు తెలుగు నాట సులభముగా లభ్యములై తరువాతి వారికి ముద్రణమునకు వీలిచ్చినవి. భారతీయ సాహిత్య తత్త్వశాస్త్రముల ప్రభావము క్రిందికి వచ్చిన- విల్సన్, కోల్ బ్రూక్ మొదలైన పాశ్చాత్య విద్వాంసులవలె, బ్రౌనుదొర వీటి ప్రభావను క్రిందికి రాకపోయినను (బ్రౌనుదొర తన జీవిత కాలమంతయు "ఆంగ్లికన్ చర్చి" (Anglican Church) కి చెందిన క్రైస్తవునిగనేయుండెను.) విద్యలయందు, గ్రంథములయందు ఆయనకు సహజమైన ఆదరాభిమానములను బట్టి ఇట్టి గ్రంథముల విషయమునను శ్రద్ధవహించెను. గూఢతత్త్వవిషయముల మీద మోజులేక పోయినను విషయ వివరణకు ఆవశ్యకమైనంతవరకు బ్రౌనుదొర వాటిని అర్థము చేసికొనుచునే యుండెనను విషయము మరచిపోరాదు.

గ్రంథ సేకరణ విషయములో, ఈ పుస్తకము ఆ పుస్తకము అని ఆలోచించుట బ్రౌనుదొరలో కన్పట్టదు. ప్రాచీన గ్రంథమేదియైనను — ఆ పుస్తకము తన పండితులకు నచ్చినను నచ్చకపోయినను (జంగముల సాహిత్యము నిట్లే సేకరించెను), అది తెలుగైనను, సంస్కృతమైనను, ఇంకే భాషలోనున్నను (తమిళ, కన్నడ, మలయాళ భాషలలోని గ్రంథముల నెన్నింటినో ఆయన సేకరించెను. బర్మాభాషలోని గ్రంథములను సంపాదించెను. లాటిన్, గ్రీక్, ఫ్రెంచి, ఇంగ్లీషు, పార్సీ భాషలలోని వానికి సేకరించెను. హిందుస్తానీ కవి "సౌద" కవిత్వమును సేకరించి చక్కని లిఖితప్రతిని తయారుచేయించి ("...a new and complete edition of the Hindustani Poet Sauda was prepared at my expense. The manuscript of this I have presented to the India House Library in Westminster...") ఇండియా హౌస్ లైబ్రరీకి బహూకరించెను — గ్రంథ సేకరణమే ప్రధాన కర్తవ్యముగ ఆయన వ్యవహరించెను.

హిందువుల మంత్ర తంత్రములపై బ్రౌనుదొరకు విశ్వాసము లేకున్నను, వాటికి సంబంధించిన గ్రంథముల సేకరణ విషయములో మాత్రము తన ఇష్టానిష్టములను మానదండముగా గ్రహింపలేదు. బ్రౌనుదొర, ఈ శాఖకు సంబంధించిన 'ఆనంద తంత్రము' అను గ్రంథమును సంపాదించి వివిధ తాళపత్ర ప్రతులను సంప్రదించి శుద్ధప్రతిని సిద్ధము చేయించిన తరువాత దాని సంస్కరణ బాధ్యతను వఠ్యం అద్వైత బ్రహ్మయ్య శాస్త్రులకు నిచ్చినాడు. వఠ్యం వారికిమంత్ర శాస్త్ర తంత్ర శాస్త్రములలో గాఢ పరిచయముండెను. వ్రాత తప్పులను చాల విడిచి వేసినట్లు బ్రౌనుదొర వ్రాయటయేగాక, ఆ లిఖిత ప్రతిపైన తెలుగులో "సేసై దిద్దుకొంన్న గ్రంథం యిదే" అనికూడ వ్రాసికొనెను.[35] ఇది ఆయన శ్రద్ధకు తార్కాణము.

ఆనంద తంత్రమునకు శుద్ధప్రతి తయారయిన తరువాత, దానికి గ్రంథం వంగీపురం నరసింహాచార్యులుగారిచేత ప్రతిపదటీక బ్రౌనుదొర వ్రాయించెను.[36]

---

35. "This copy is corrected by Brahmaya Pandit- Who has however not always, corrected the vulgar errors of spelling as శ for స etc..."(కడప జాబుల సంకలనం; పర్యవేక్షణ: జి.ఎన్. రెడ్డి, సంశోధన: బంగోరె; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, డిసెంబరు 1977 పుట-87).

36. "ఇదం శాస్త్రమాధునికం ప్రాచీనంవేతిశంకానిరాసార్థం తన్మూల గ్రంథోదాహరణం। ఇద మానందతంత్రం ద్వాత్రింశత్కోటి గ్రంథ సంఖ్యా విశిష్ట నిత్యాషోడశికార్ణవ తంత్రనామక గ్రంథాంతర్గత శత సహస్రసంఖ్యాక గ్రంథ పరిమాణ విశిష్ట భగమాలిని సంహితాఖ్య గ్రంథ స్థితమిద మానందతంత్రాఖ్య శాస్త్రమిత్యర్థః। ఆనంద తంత్ర గ్రంథే ప్రథమాధ్యాయస్యటీకారచితా।"

"శ్రీమద్రాజాధిరాజాతితర వినుత వాక్చాతురీ వైభవేన। ఫిల్లిప్చార్లీసుబ్రౌన్మాభ ప్రవృథమణినా సంతతం పోషితేన। శ్రీమౌద్గల్యాన్వవాయ ప్రజనిత నరసింహార్య నామ్నా ప్రణీతా। టీకాలోకోత్కర శ్రీ విజయతు విదుషాం మానసంతోషయంతీ।" (Ibidem; పుట-87.)

ఈ ఆచార్యులుగారు రాఘవ పాండవీయమునకు కూడ వ్యాఖ్య వ్రాసిరి.[37] ఇది కూడ బ్రౌనుదొర ఆజ్ఞననుసరించి చేసినదే. ఈ ఆచార్యులుగారు "బ్రౌను కాలెజి"లో ఇరువది సంవత్సరములకంటె ఎక్కువగనే పనిచేసి 1852 లో కాలము చేసిరి. సంస్కృతాంధ్రములలో మంచి పండితులు. ఆ రోజులలో బ్రౌను దొర పోషణ లేనిచో ఈ పండితులందరు ఏమయ్యెడివారనిపించును! తెలుగు సాహిత్యము ఏమయ్యెడిది అనిపించును!

బ్రౌనుదొర సేకరించుటకు ప్రయత్నించిన వాటిలో ఆచార్య శంకరుల సౌందర్యలహరి వ్యాఖ్యానాదులు ఉన్నవి. ఈ కృషి విషయమై అయోధ్యాపురం కృష్ణారెడ్డిగారు 1-11-1829 నాడు కడప నుండి తిరుచునాపల్లిలో నున్న బ్రౌను దొరకు వ్రాసిన లేఖలోని క్రింది భాగము వలన తెలియ వచ్చుచున్నది:

"........కొత్రపాటి చిదంబరంమును సముఖానకు పంపించెలాగున్ను ఆగ్న దయ చేశిపున్నారు. ఆగ్నమేరకు సముఖానకు వచ్చివున్నాడు......కొత్రపాటి చిదం బరంవల్ల యిక్కడి సంగతులు యావత్తు చిత్తానకు వేద్యం అవుతూవున్నవి. సౌందర్యలహరి వ్యాఖ్యానం * లోల్లా చిద్వల్లి యీ రెండున్నూ యీ దేశ

37. "......నన్ను రాఘవపాండవీయానకు టీక జరిగించవలశ్నిదని ఆజ్ఞ అయి వున్నది గనుక సదరహీ గ్రంథం ప్రారంభించి రెండో ఆశ్వాసములో అరువై పద్యముల వరుకు ప్రతి పద్యముకు రెండు అర్థములు విశదముగా యేర్పడేలాగున జరిగించడమయినది. యీ రాఘవ పాండవీయానకు వేర్వే ప్రతులు యిక్కడ హాజరు లేనందున మరివక పరిశుద్ధ ప్రతికూడా సంపా దించడమైనది..." 18-8-1834నాటి ఆచార్యులుగారి లేఖలోని భాగము. (Ibidem; పుటలు-౬౮, ౨౦.)

* ఆచార్య శంకరుల సౌందర్యలహరికి వ్యాఖ్యానములు వ్రాసిన వారిలో లోల్ల లక్ష్మీధర దేశికులు సుప్రసిద్ధులు. వీరి వ్యాఖ్యానమునకు ఇంటిపేరును బట్టి "లోల్ల" అనియు, వారి పేరునుబట్టి "లక్ష్మీధరము" అనియు పేర్లు వచ్చినవి. వీరాంధ్రులు. వీరు పార్వతీ విశ్వనాథ భట్టారకుల పుత్రులు. హారిత సగోత్రులు. వీరి పూర్వులు గోదావరీ తీరస్థులు. ఒరిస్సాను పాలిం చిన వీరరుద్ర గజపతి ప్రభువులు వీరి సమకాలికులు. వీరి కాలము క్రీ. శ. 1465-1530 అని తెలియుచున్నది.

ములో విచారించి వ్రాయించేది అని ఆజ్ఞ అయివుండెను. యిప్పట్లో అవధానుల అప్పయ్య మూలం లొల్లా అనే వ్యాఖ్యానం సంపాదించుకొని చిద్వల్లి అనే వ్యాఖ్యానం దారిలో కంచి ఆ ప్రాంత్యాల వున్నది అది సంపాదించుకొని సముఖానకు పోవలెనని ప్రయాణం అయివచ్చివున్నాడు. చిత్తానకు రాలెను. చితంబరం లోగడనుంచి తమ ప్రాపకమే నమ్మి వుండె సంగతి చిత్తానకు తెలిసె వున్నది. ప్రస్తుతం తమ్మ ప్రాపకమే నమ్మి సముఖానకు వున్నాడు. రక్షించి కాపాడగలందులకు తాము ఖావందులు వున్నారు."[38]

ఈ జాబు వ్రాసిన తరువాత, మరి రెండున్నర సంవత్సరముల లోపు 2?-2-1832నాడు కృష్ణారెడ్డిగారు వ్రాసిన జాబువలన కొర్రపాటి చిదంబరంగారు. అప్పయ్యగారు సంపాదించిన పై గ్రంథములకు ప్రతులు వ్రాయుచున్నట్లును. ఖర్చు చాల పెరుగుట వలన ఆ వ్రాతను తాత్కాలికముగా బ్రౌనుదొర ఆపించి నట్లును తెలియుచున్నది:

"చిద్వల్లి, లొల్ల, కలార్ణవం- యీ గ్రంథములు వ్రాయించడానకు ఖర్చు ఖానా పెర్గుతున్నదనిన్ని ప్రస్తుతం నిలిపి చెయ్యవలశ్నిదనిన్ని ఆజ్ఞాపించి వున్నారు. అందుపైకి యిదివరకు కొంత చిదంబరం వ్రాసుకుని వున్నాడు యిఘుమీదట నుంచి నిలిపి వేశేలాగున యేలినవారు ఆజ్ఞాపించిరి సంగతి ఆయనకు తెలియ చేశినాను...... సదరు గ్రంథములు వ్రాయడ నికి చిదంబరం వద్దన్నుయిచ్చిన శిక సనులు గాక చిక్కిన .34 శిక్సనులు హాజరు వున్నవి. అవి దాచిపెట్టుకున్నాను చిత్తానికి రావలెను."[39]

బ్రౌనుదొర శుద్ధ ప్రతులను వ్రాయించెడి కార్యక్రమమున కొర్రపాటి చిదంబరంగారు ప్రముఖపాత్ర వహించిరనవచ్చును. బ్రౌను దొరకు కృష్ణారెడ్డిగారు వ్రాసిన చాల జాబులలో ఈ గున ప్రస్తావన, గ్రంథసేకరణ ప్రస్తావన, ప్రతులు వ్రాయుటకు పనికివచ్చు కాగితముల "తాలు వేశ్నిశికసనులు" మొదలైన వాటి ప్రస్తావన వచ్చును. చీనా కాగితాలమీద పుస్తకములను

38. కడప జాబుల సంకలనం; పర్యవేక్షణ: జి. ఎన్. రెడ్డి సంశోధన:బంగోరె; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి; డిసెంబరు 1977: పుట - ౩౧, ౩౨.

39. Ibidem పుట - ౫౨.

వ్రాయించి వాటిని గట్టి అట్టలతో కట్టించి కంభములో తానున్నప్పుడు కడపలో భద్రముగ కృష్ణారెడ్డి గారి అజమాయిషీలో నుంచెడివాడు.

కాలేజి బోర్డు వారికి బ్రౌనుదొర- మంచి పుస్తకములు కొని సేకరించి- గ్రంథాలయము నొకదానిని, 1812లో స్థాపితమైన ఫోర్టుసెయింటు జార్జి కాలేజికి అనుబంధముగా నిర్వహించుట మంచిదని సూచన లిచ్చుచు 1827 లో జాబు వ్రాసెను. దీనికి బోర్డువారంగీకరించక బ్రౌనుదొర దగ్గర నుండి 500 రూపాయల విలువగల పుస్తకములను మాత్రము కొనగలమని వ్రాయవలసినదని గవర్నరు కౌన్సిలునకు సిఫార్సు చేసిరి. వాటిలో- ఆంధ్రకౌముది, కవిశిరోభూషణము, లక్షణ దీపిక, అప్పకవీయము, సులక్షణ సారము, శివాంధ్రము, విష్ణు ఆంధ్రము, ఆంధ్రభాషార్ణవము ఆంధ్ర భాషాభూషణము, కావ్యాలంకార చూడామణి, ప్రబంధరాజీయము, పంచతంత్రము, రసిక జనమనోభిరామము, రాధా మాధవ సంవాదము, వైజయంతీ విలాసము, హంస వింశతి కలవు. ఇవిగాక- బాల సరస్వతీయము, విష్ణుపురాణము మొదలైనవన్నియు తన గ్రంథాలయములో (బ్రౌన్ కాలేజి, కడప) సంపాదించి పెట్టెను. తారాశశాంక విజయము, విజయ విలాసము మొదలైనవాటిని పై వాటివలెనే పరిష్కరింపజేసి వ్యాఖ్యలు వ్రాయించి సిద్ధముగ నుంచుకొనెను. ఈ విధముగా లక్షణ గ్రంథములను, కావ్యములను, పురాణేతిహాసములను "చెదలపాలు" కాకుండ బ్రౌనుదొర కాపాడెను.

తెలుగు కావ్యములకు వ్యాఖ్యానములు వ్రాయుటలో- జూలూరి అప్పయ్య పంతులుగారు, వంగీపురం నరసింహాచార్యులుగారు, ములుపాక బుచ్చయ్య శాస్త్రిగారు, గరిమెళ్ల వెంకయ్యగారు అనువారి పేరులు బాగుగ తెలియుచున్నవి. ధరణిదేవుల రామన్న కవి వ్రాసిన పది ఆశ్వాసముల దశావతార చరిత్రకు బ్రౌనుదొర కోరిక ననుసరించి గరిమెళ్ల వెంకయ్య గారు వ్యాఖ్యానము వ్రాసిరి. ఈ వ్యాఖ్యానము 14వ తేది మార్చి 1834 న ముగిసినట్లు రచయిత తెల్పెను.

బ్రౌనుదొరను దీనిలోని "అహల్యా కథ" బాగుగ ఆకర్షించెను. దశావతార చరిత్రలోని ఆ భాగమును వేరుగా వ్రాయించుకొని ఇంగ్లీషులోనికి అనువాదము కూడ చేసికొనెను. పద్మపురాణములోని (మడికి సింగన) అహల్యా కథను, సముఖము వెంకటకృష్ణప్ప నాయకుడు వ్రాసిన "అహల్యా సంక్రందనమును" కూడ

నిశ్లే సిద్ధముచేసి యుంచుకొనెను. ఈ ర్వాచీన కాలములో వేమనారాధ్యుల సంగ మేశ్వరుడు వ్రాసిన "అహల్యా సంక్రందన విలాసము"ను కూడ సేకరించెను. దీని ప్రతిని తూములూరు కొండయ్యగారు వ్రాసినట్లు కృష్ణారెడ్డిగారి జాబువలన తెలియుచున్నది.

దశావతార చరిత్రనుగూర్చి బ్రౌనుదొర ఇంగ్లీషులో వ్రాసికొనిన నోటు ఆసక్తికరముగా నున్నది. భారత భాగవతాదులతో పోల్చి దశావతార చరిత్ర పై శిష్ట్యము నిట్లు తెలిపెను:

"Note. The Dasavatara Charitra is considered a particularly difficult book being a masterpiece of poetry. In Telugu, as classicks, the Ramayana (of Bhascara) is the easiest It contains 16,000 or 18,000 Stanzas. The Bharatam (of Nannia Batt, Errapragada and Ticcana Somiazulu is the next most difficult 80,000 or 90,000 verses. Then the Bhagavata of Bammera Potu Raz containing more Vedanta than the rest, 10,917 verses. All these are easier than the Dasavatara Charitra "[40]

ఈ పుస్తకము కఠినమైనది గనుక దీనికొక పద పట్టికను కూడ తయారు చేయించిన బాగుగ నుండుననుభావమున సొంత ఖర్చుతో నొకదానిని తయారు చేయించెను. అది 3-4-1850 నాడు ముగిసినదని వ్రాసికొనినాడు.

అచ్చువేయగలిగినన్ని కావ్యములను తానచ్చువేసెను. తానచ్చునకు సర్వ విధముల సిద్ధము చేసిన గ్రంథములను, మేమచ్చొత్తించుకొందుమని యడిగినవారికి కొన్నింటి నిచ్చెను. మిగిలిన వాటిని మంచి కాగితములమీద వ్రాయించి భద్ర పరిపించెను. ఏ శబ్దార్థము కాని, పద్యార్థము కాని సులభముగా కుదురనిచో, ఆ విషయమున పండితుల నడుమ జరిగిన వాద ప్రతివాదములను వ్రాయించి, ఉత్తమ కావ్యములకు వ్యాఖ్యలు రచించుటయందు మార్గము చూపించెను. ఈ చర్చ లన్నియు లిఖితరూపమున నుండుటచే తరువాత వ్యాఖ్యానములు వ్రాయు వారికి వివిధ పండితుల అభిప్రాయములు తెలిసి చక్కని నిర్ణయములు చేసికొని ఉత్తమ

---

40. Ibidem. పుట - 83.

వ్యాఖ్యలు వ్రాయుటకు సాయము చేసెను.[41] ఇట్లు నిరంతరము తాను కృషి చేయుచు. నితరులచేత చేయించుచు వచ్చుటచేత ఇరువది సంవత్సరములలో ముఖ్యమైన తెలుగు కావ్యముల కన్నింటికి వ్యాఖ్యలు బయలుదేరెను.[42] అనగా అన్ని సంవత్సరములు బ్రౌనుదొర పండితులను, వ్రాయసకాండ్రను, లిఖిత ప్రతులను సేకరించు వారిని పోషించెనన్నమాట! లేఖన సామగ్రికైన ఖర్చు. తానచ్చువేసిన గ్రంథములకైన ఖర్చుకూడ దీనితో కలిపినచో బ్రౌనుదొర సొంతముగా ఎంత డబ్బు ఖర్చుపెట్టి యుండునో ఊహించుటకూడ కష్టము! ఇంక, ఆయన ప్రతిభా వ్యుత్పత్తులకు, నాయకత్వమునకు "ఖరీదు కట్టే షరాబు లే." ?

తెలుగు వారికి అత్యంత ప్రియమైనది, వారి సామాజిక జీవితమును చిత్రించునది, సంస్కృత మూలములు లేనిది, సమస్త విధముల దేశీయమైనది పండితులంతగా మెచ్చుకొననిది "పల్నాటి వీర చరిత్ర" ద్విపద. ఇది బ్రౌనుదొరను విశేషముగాఆకర్షించినది. భాషాసౌలభ్యము,భావనవ్యత,జన జీవితచిత్రణము ఉన్న ఏ గ్రంథమైనను-ముఖ్యముగా ప్రారంభ విద్యార్థులకు పనికి వచ్చునని ఆయననమ్మినది- ఆనాడు బ్రౌనుదొర నాకర్షించెను[43]ఇదిగాక- మత విషయమున, కుల విషయమున, ఛాందసాచార విషయమున స్వేచ్ఛను ప్రదర్శించిన, ప్రచారము చేసిన గ్రంథములు కూడ నాయన నాకర్షించినవి. వేమన పద్యములు, పల్నాటి వీర చరిత్ర, వీరశైవ (జంగముల) సాహిత్యము బ్రౌనుదొరను ప్రత్యేకముగా నాకర్షించినవనుటలో విప్రతిపత్తి లేదు. తెలుగు ప్రజలను విశేషముగ- వారితో

---

41. "When any doubt arose about the meaning of a word or verse I directed that the result of the consulations should be at once recorded in Telugu; thus opening the way to the preparation of a verbal commentary." (Some Account of the Literary life of C.P. Brown.)

42. "...in twenty years, notes were appended to all the leading Telugn poems." (Ibidem)

43. "The Volume is despised by the learned but is of value to the student...An edition of this has been prepared". (Telugu-English Dictionary : C.P. Brown, 1852; Page-xi).

సామాజికమైన రాకపోకల సంబంధములు అంతగా పెట్టుకొననున్నను- గౌరవించిన బ్రౌనుదొర, క్రైస్తవ మతము- ముఖ్యముగా తాను చెందిన శాఖ- ఉత్తమమైనదను గాఢ విశ్వాసమున్న బ్రౌనుదొర, సనాతనుల సమ్మకములను విమర్శించిన బ్రౌనుదొర, ఈ గ్రంథముల నాదరించుటలో నాశ్చర్యము లేదు. పల్నాటి వీర చరిత్ర ద్విపదవలెనే తానెక్కువగా అభిమానించిన "వేమన పద్యములు" తన ఆంగ్లానువాదముతో ముద్రింపబడెను. 'పల్నాటి వీర చరిత్ర'కు ఆ అవకాశము రాలేదు. అందువలన గూడ మనము ఈ గ్రంథ విషయమున ఆయన చేసిన కృషిని పరిశీలించుట ఎక్కువగా సమంజసము.

బ్రౌనుదొర. తానే గ్రంథమునకు తన పండితులచేత శుద్ధప్రతిని సిద్ధము చేయింప నెంచినను, దేశము నాలుగుమూలలనుండి దాని లిఖితప్రతులను తెప్పించి వాటిని తైపారు వేసి పరిశీలింపించి శుద్ధప్రతిని సిద్ధము చేయించెడివాడు ప్రబంధముల విషయమున- మనుచరిత్ర, వసుచరిత్ర మొదలైన వాటిని ఉదాహరణములుగా గ్రహింపవచ్చును- చేసినట్లే, వేమన పద్యముల విషయమున చేసినట్లే, మహాభారతాదుల విషయమున చేసినట్లే, పల్నాటి వీర చరిత్ర విషయమునను జరిపించెను.

బ్రౌనుదొర వివిధ ప్రాంతములనుండి తెప్పించిన "పల్నాటి వీర చరిత్ర" లిఖిత ప్రతులు నలుబది, ఏబది వరకు నున్నవి. పల్నాటి సీమనుండియు, రాయల సీమ నుండియు తీరస్థాంధ్ర ప్రాంతమునుండియు వివిధ ప్రతులను తెప్పించెను. శాస్త్రీయ దృష్టితో- మౌఖికముగ ప్రచారమున నున్న ఈ వీరగాథను- పాడించి విని వ్రాసిపెట్టుకొని ఒక ప్రతిని సిద్ధము చేసెను! 1834 నాటికే, పల్నాటి వీర చరిత్ర శుద్ధప్రతి నొకదానిని సిద్ధము చేయించినట్లు తన నిఘంటువులో పేర్కొనెను. ఈ ప్రతులను సంపాదించుటలో ఆనాటి గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలో చేరిన పెద గంజాం నివాసి గంజాం అప్పయ్య హరిదాసు (హరిదాసు బ్రౌనుదొరకు 1852లో జూన్ 14వ తేదీని, జూలై 24వ తేదీని వ్రాసిన జాబులు, బ్రౌనుదొర హరిదాసుకు వీరభద్రయ్యగారి పేరుతో వ్రాసిన సమాధానములు) కొంతవరకు, నెల్లూరుజిల్లా కోట తాలూకాకు చెందిన చిట్టేటి లక్ష్మీరాఘవప్ప నాయడు (1852 నవంబరు 16 వ తేదీని, 1853 జనవరి 18 వ తేదీని బ్రౌనుదొరకు వ్రాసిన జాబులు) కొంతవరకు సాయము చేసినట్లు ఆయా జాబుల వలన తెలియుచున్నది. ఇంతకు పూర్వమే చాల ప్రతులను సంప్రదించి శుద్ధప్రతిని సిద్ధము చేయించిన సంగతి ఆయన వ్రాతల వలననే తెలియుచున్నది. తాను సేక

రించి పెట్టుకొనిన ప్రతులలో సముచితములైన స్థానములలో ఇంగ్లీషులో వివరణలు చాల వ్రాసి భద్రపరచుకొనెను. ఒక ప్రతి తుదను "Finished first perusal 29 May 1843" అని గుర్తు వ్రాసికొనెను.[44]

తన ప్రతులలో బ్రౌనుదొర వ్రాసపెట్టుకొనిన వివరణలు ఆయనకు తెలుగు సాహిత్యముమీద; తెలుగు ప్రజల సామాజిక, తాత్త్విక దృక్పథముల మీద నున్న అవగాహనకు నిదర్శనలు. ఇదిగాక, ఆయన పాశ్చాత్య కవులను వారి రచనలను ఈ రచనతో పోల్చి వ్రాసియుంచుకొనెను ఈ పోలికలను చూపుట బ్రౌనుదొరకు పాశ్చాత్య సాహిత్యమునందును- లాటిన్ మొదలైన వివిధభాషలలోను- గల పాండిత్యముకు నిదర్శనము:

"The easy flowing metre of this book is only a few steps removed from prose; and may be analogous to that used by Terence in Latin- unless they more nearly resemble the style used in the fables of Phadrus and Gay. This collequial vein is despised by those Telugus who pretend to learning.........The author, though often a Powerful writer, was no great scholar. His stanzas are often as rude as the artless verses we find in PILGRIM'S PROGRESS: or, more precisely he is the Telugu Chaucer. Yet no- He certainly does not rank lower (than Swift or Somerville)......"

"Yes, on reconsideration he is the Chaucer of the language; but is not so antiquated in dialect. Many pages are in the easy dialect of the present day. To use the words of Gibbon (Chapter 61 note 23), 'in a barba-

---

44. Madras Government Oriental Manuscripts Library, Vol. No. D. 1130 (Telugu) bol. 1-3. As quoted in బ్రౌన్ లేఖలు. పర్యవేక్షణ: జి.ఎన్. రెడ్డి; సంశోధన: బంగోరె; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి. ఫిబ్రవరి 1977; పుట-46.

rous style it deserves the praise of an original and classic work."[45]

వీరగాథలకు "పాట" ప్రాణము ఈ పాట; గాయకుని బట్టి, ప్రాంతమును బట్టి, వాతావరణమునుబట్టి మార్పులకు లోనగుచు నుండును. లిఖిత ప్రతిలోవలె నుండదు. ఈ విషయమునే బ్రౌనుదొర ఇట్లు వ్రాసికొనెను:

"From one man's dictation I caused a copy of more than a thousand lines to be written down- but like the Homeric rhapsodists these men rarely can repeat the same episode without material fluctuations. They are mere odds and ends...."[46]

తెలుగు భాషా సాహిత్యముల విషయమున, ఛందస్సు విషయమున (బ్రౌను దొర "ఆంధ్ర గీర్వాణచ్ఛందము"ను 1827లోనే ప్రకటించెనను విషయమును ఈ సందర్భమున స్మరించుకొనవలెను) బ్రౌనుదొరకున్న పరిజ్ఞానమును, పాండిత్యమును తెలియజేయునవి క్రింది వాక్యములు:

"The Palanati Vira Charita bears every mark of antiquity. The structure of the metre is rude and rhymes are careless; the PRASA rhyme is rarely used; in the YATI rhyme the consonants are generally correct but the vowels are quite at random. Many verses are without any rhyme and will not even scan."[47]

పల్నాటి వీర చరిత్ర భాషను పురాణములైన ఇంగ్లీషు వీరగాథల భాషతో పోల్చి వ్రాయుచు నిట్లనును :

"The language is on a par with that of the old

---

45. Ibidem. పుట - 46, 47.

46. Ibidem. పుట - 47.

47. Ibidem. పుట - 47.

English ballads : several words being obsolete but the style clear though vulgar. The poet evidently had little learning : yet is forced to lower his style to suit his illiterate audience."

"The manners have a Homeric simplicity; with a chivalric degree of homage to ladies ; who take a prominent part in the story".[48]

దీని తరువాత, పల్నాటి యుద్ధ మెప్పుడు జరిగి యుండును ? గ్రంథరచన (లేదా వీరగాథా రచన) ఎప్పుడు జరిగి యుండును ? మొదలైన చర్చలు కొన్ని చేసినాడు బ్రౌనుదొర. బసవ పురాణమున కానాడాంధ్ర దేశమునకున్న ప్రాముఖ్యమును గురించి కూడ కొంత వ్రాసికొనుచు "The BASAVAPURAN and the MAHABHART are named as books of equal sanctity!" అని గుర్తు పెట్టుకొనినాడు. తన దగ్గరనున్న ఒక ప్రతిలో పీఠికా ప్రాయముగ వ్రాసికొనిన వివరణలోని భాగము లివి.

తాను సిద్ధముచేయించి దగ్గర నుంచుకొన్న ఇంకొక ప్రతిలో "PALNATI CHRONICLE" అని ఒక పెద్ద ఉపోద్ఘాతము (Introduction) వ్రాసి పెట్టుకొనెను. దీనిలో పల్నాటి వీర చరిత్ర ప్రత్యేకతను గూర్చి వివరించెను. ఈ వివరణలో ప్రసంగవశమున, తెలుగు సాహిత్యము (మనము 'మార్గ సాహిత్యము' అనవచ్చును) సంస్కృత సాహిత్యముపై విశేషముగ ఆధారపడి యున్నదనియు, ఈ విధముగ బయలుదేరిన సాహిత్యము విదేశీయులకు - ముఖ్యముగా ప్రారంభ దశలో- అనావశ్యకమనియు, వారి కర్థమగు సాహిత్యము తెలుగు సమాజములో విద్య అంతగాలేని ప్రజలాదరించునది అగుటచే పండితులు దాని నీసడింతురనియు వ్రాసెను. పల్నాటి వీర చరిత్రను, వేమన పద్యములతో బాటు ఆదరింపదగినదనియు ఈ కోవకు చెందిన రచనలు హరిశ్చంద్ర ద్విపద మొదలైనవనియు వ్రాసెను. పై విషయములను తెలిపిన ఆంగ్ల భాగమిట్లున్నది:

"The Telugu Language abounds in translations from

---

48. Ibidem. పుట. - 48.

Sanscrit, Canarese and even Tamil: but possesses few original poems of any great length or merit. Those fashionable "works that are considered original are infact copied in every page from sanscrit: and few are sufficiently easy to encourage a foreigner in his study of the Telugu language. He indeed must descend to a rustic class of works so low that natives of education reject with scorn. Such are the vernacular volumes which the unlearned read with delight; and which a foreigner will find not only entertaining but exactly suited to his wants. The DWIPADA "Couplet" versions of the Tales of HARISCHANDRA and NALA, and SARANGADHARA, with PRABHU LINGA LILA, and the BASAVAPURAN, all seem easy to a native but all may appear somewhat difficult to a foreigner. He may therefore, commence with the Palnati Chronicle which is but one grade above the verses of Vemana. It is infact a prolonged ballad, much in the style of the antique poems whereupon the Lay of the Last Ministrel is founded.[49]

పల్నాటి వీర చరిత్రను గూర్చి ఇంత. సేకరించి పరిశోధించి వ్రాసిపెట్టుకొనినను బ్రౌనుదొర దానిని ప్రచురించుటకు వీలు కాలేదు. బహుకార్యవ్యగ్రుడైన ఆయన దాని ముద్రణ చేయకయే మనదేశమును విడిచిపెట్టి (1855) పోయెను. తన బ్రౌణ్య నిఘంటువు (1852 లో బ్రౌనుదొర వివిధ గ్రంథములను గూర్చి వ్రాయుచోట పల్నాటి వీర చరిత్రను గూర్చి ఇట్లు వ్రాసెను:

The పల్నాటి వీర చరిత్ర ద్విపద or Wars of the Palnadu;

---

49. Madras Government Oriental Manuscript Library; Vol. No. D. 1156 (Telugu) fol. 99 as quoted by బ్రౌన్ లేఖలు; Ibidem. పుట — 49.

to the west of Guntoor : the occurances described took place about the year A. D. 1160. Wilson (Mackenzie Mss. Vol. 1, P. 305) reckons the date of this war A. D. 1080-1087 : which is too early. The poem is interesting as giving a picture of the primitive Telugus, as they lived before the Musulman invasion. It is written in a style sometimes learned, elsewhere rustic : in about ten thousand three hundred lines. The volume it despised by the learned but is of value to the student. It is amusing and very profitable to the biginners. An edition of this has been prepared."

ఈ రచనలోని భాషనుబట్టి, కథాగమనమును బట్టి, సామాజిక చిత్రణమును బట్టి కవి కాలాదులను, ప్రాంతమును నిర్ణయించుటకు బ్రౌనుదొర శాస్త్రీయ పద్ధతిలో కృషి చేసెను. బ్రౌనుదొర సూక్ష్మముగా పరిశీలించి ఈ రచనలోని మత విషయములను గూర్చి కూడ వ్రాసెను. పల్నాటి యుద్ధములో తుపాకుల ఉపయోగము లేదు గనుక ఈ యుద్ధము మునల్మానులు దక్షిణమునకు రాక పూర్వము జరిగి యుండుననియు, కాని పలనాడులో మునల్మానులున్నట్లు రచనలో కలదు గనుక రచన అర్వాచీనమైన దనియు బ్రౌను దొర ఇట్లు వ్రాసెను :

"In Brigg's History of the Mohomedan Power (translated from FERISHTA) anno A. D. 1015 (Vol. 1, Page 55) there is no notice of any transaction in the South of India-yet this poem speaks of the Musulmans as residents in the Palnand. Hence I conclude it belongs to a later age. Yet in the description of the battle (page - 138) bows, arrows and spears are described but no guns - now this shows that the fight must have taken place many centuries back."

తరువాతి కాలములో ఈ గ్రంథమును ముద్రించిన పండిత పరిశోధకులు బ్రౌను దొర కృషిని - ఉపయోగించుకొను మాట అటుంచి - గుర్తించినారా? అను సంశయము కలుగును.

శ్రీమద్భాగవతము శుద్ధ ప్రతి సిద్ధమగు విషయమున బ్రౌనుదొర చేసిన కృషిని గూర్చి తెలిసికొని యుంటిమి. దానిని అచ్చు వేయించుకొందునని పురాణం హయగ్రీవ శాస్త్రిగారు అడిగిన తోడనే దాని నాయనకు ఇచ్చివేసెను. ఇది 1848 లో శాస్త్రులుగారు నిర్వహించుచుండెడి 'వివేకాదర్శముద్రణాలయము'లో ముద్రిత మయ్యెను. ఈ విషయమును బ్రౌన్యా నిఘంటువులో దొరగారు పేర్కొనిరి. (ఈ పరిశోధన గ్రంథములో పుటలు — 162, 163)

ఇంక, తెలుగు మహాభారతము విషయమై బ్రౌనుదొర చేసినకృషిని గూర్చి కొంత తెలిసికొనవలసియున్నది. తాను తెలుగు భారతమును చదువుట 1825 లో ప్రారంభించినట్లు బ్రౌనుదొర తన జీవితచరిత్రలో నిట్లు వ్రాసికొనెను :

"When I was first reading the Telugu Mahabharat in 1825 (having first numbered each stanza) when I came to a new word, my learned assistant gave me the meaning in colloquial Telugu or Sanscrit or Hindi ; and this I recorded in my dictionary..."

బ్రౌనుదొర, భారతమును చదువుచు దానిలోని మాటలను అర్థములను (ఆయన పండితుడు చెప్పికొనుచుపోయెడి అర్థము) వ్రాసికొనుచువచ్చి నిఘంటు నిర్మాణమునకు పునాదులు వేసికొనెను. వివిధ ప్రాంతములనుండి వచ్చిపడుచుండిన భారత ప్రతులను సమీక్షించుచు పండితుల సాయముతో శుద్ధ ప్రతులను - పర్వముల ప్రకారము - సిద్ధము చేయుచుండెను.

పాఠభేదములు కుప్పతిప్పలుగ నున్న ప్రతుల నుండి బ్రౌను దొర శుద్ధ పాఠము నెట్లు గ్రహించెనో తెలిసికొనుటకు ఆయన 1827 లో ముద్రించిన "ఆంధ్ర గీర్వాణచ్ఛందము" న కున్న అనుబంధము - నాలుగు (Appendix-4) లో "The State of Telugu Books (Maha Bharata)" ను పరిశీలించిన

తెలియును. మచ్చునకు ఒక పద్యమును ఆయన అచ్చువేయించిన పద్ధతిలో నిచ్చు చున్నాను :

Maha Bharata, book 2 (Sabha Parva), Part 2, Verse 155 - 168.

సభాపర్వం — — ఆ ౨॥ పద్యం ౧౫౫ మొదలుకొని ౧౬౮ వర్కు

మాడ గంగనుటయు

| | | |
|---|---|---|
| యిమ్మగ | మ్మాడగ గనిన | |
| యిమ్మల | మ్మాడగ గాన్పు | మది |

కం॥ నెమ్మని] ధర్మజుతోజూద [మ్మాడగవలయు] నాకు ధరణీశ్వరయజ్ఞం [మది

| | | |
|---|---|---|
| | బడయంగ | మభిహిత శిద్ధిఁ |
| యాల | వడయగ | మవహిత బుద్ధిఁ |

యు] సమస్తైశ్వర్యములు [బడయగ] నుపాయ మభిమత శిద్ధిఁ

ఈ విధముగా పదునాల్గు పద్య గద్యము లిచ్చిన తరువాత వాటికన్నింటికి తాము నిర్ణయించి సిద్ధముచేసిన పాఠములనిచ్చెను. పై పద్యమునకు సిద్ధమైన శుద్ధ పద్యమిది :

౧౫౫ ॥క॥ యిమ్మగ ధర్మజుతో జూ

దమ్మా'డగ వలయు, నాకు ✱ ధరణీ'శ్వర య

జ్ఞమ్మ' దియు సమస్తై ' శ్వ

ర్యమ్ములు బడయగ నుపాయ ✱ మ'భిమత సిద్ధిఁ

ఇందులో మనము గుర్తింపవలసినవి ఆయన నిర్ణయించిన పాఠములేకాక, కంద పద్యము నచ్చువేయించిన పద్ధతి, యతిని గుర్తించుట — ఇంకను ముఖ్యమైనది — సంధులు వచ్చిన చోట (అవి తెలుగు సంధులైనను, సంస్కృత సంధులైనను) ఆ పదముల సంధి స్థానమును అపోస్ట్రఫీ (apostraphy) తో గుర్తించుట (జూదమా'డగ ధరణీ'శ్వర... అనునవి.

పదునాల్గు పద్య గద్యములైన తరువాత వాటికి ఇంగ్లీషులో అనువాదము నిచ్చెను :

"Maha Bharata, book 2, (Sabha Parva) Part 2. (Duryodhana relates the splendour of the palace wherein the Pandavas resided.)

Verse 155 I desire O king Dhritarashtra, to game with King Dharma, to vanquish him ; - to all the sacrifices he performs I will oppose this one device."

అనువాదమంత ఒప్పుగ లేకున్నను — తెలుగులో పాండిత్యమునకై ఆయన కృషి చేయుచున్న ప్రారంభ కాలమది — ప్రయత్నము హర్షింపదగినది. ఇదిగాక, కాలేజీ బోర్డు వారు అనువాదము లుండవలెనని కూడ నిర్ణయించినట్లు పీఠిక (Preface) లో వ్రాసెను :

"It was also deemed necessary by the College Board that translations should be appended to the verses quoted as examples from the Telugu poets, and such have accordingly been added...".

ఈ విధమైన నిర్ణయము వలన బ్రౌను దొర అనువాదములు తప్పక ఈయ వలసి వచ్చెను. అనువాదములోని కష్టమును - అందులో ఆంధ్రాంగ్లముల కున్నంత భేదములున్న భాషల నడుమ — అనువాదములో మూలములోని అంద మును తెచ్చుట ఇంచుమించుగా అసాధ్యమని గుర్తించుచు నిట్లు వ్రాసెను :

"It is well known, however, that a literal translation into English of any language so widely different from it as the Telugu, would convey but a poor idea of the beauty of the sentence, and approximate but in a very distant degree to the spirit of the original......

1825 లో తెలుగు భారతాధ్యయనమును ప్రారంభించిన బ్రౌనుదొర, 1827 లో ముద్రించిన 'ఆంధ్ర గీర్వాణ ఛందము'లో భారత పాఠ నిర్ణయము

తానెట్లు చేయుచువచ్చెనో లక్ష్యము లిచ్చుచు వివరించెను. దీనిలోనే అనుబంధము-2 లో (on Orthography Spelling & c. భారతములోని పర్వముల పేరులను ప్రతి పర్వములోనున్న ఆశ్వాసముల సంఖ్యను నిచ్చుచు మొత్తము 68 ఆశ్వాసములనియు నాలుగు పాదముల పద్యములు 28,000 అనియు వ్రాసెను. ఆ సందర్భములోనే "The Mahabharata is divided into eighteen Parvas, or Books each of which is cited by its title, (as the Iliads are by certain letters) not its number". అని వ్రాయుచు ఆయా పర్వములకు కలిపి ప్రచారములోనున్న సాంప్రదాయిక నామములిట్టిచ్చెను :

"Of these the first five books are commonly designated the Adi Panchacam; the next five, the Yuddha Panchacam; the term Antya Panchacam includes five more; while the last three books have no peculiar designation".

అంతటితో నాగక, "Last five books are sometimes called the అంత్యపంచకం while the intermediate three (XI, XII, XIII) are termed the శాంతిత్రయం" అని కూడ నోట్ వ్రాసెను. ఇవన్నియు ముఖ్యముగా పాశ్చాత్యులను దృష్టిలో నుంచుకొని వ్రాసిననుకొనవచ్చును. కాని, తన పండితులనుండి ఎంత శ్రద్ధతో విషయమును స్వాయత్తము చేసికొనెనో చూచినప్పుడు ఆశ్చర్య గౌరవములు కలుగక మానవు. తాను నేర్చుకొనిన విషయమును సొంతము చేసికొనుటకు బ్రౌనుదొర వింత వింత మార్గములు త్రొక్కుట కలదు. భారతమ లోని పర్వముల పేరులను. క్రమమును జ్ఞాపకముంచుకొనుటకు వీలుగా లాటిన్ పదములతో కూర్చిన పద్యము నిచ్చెను : "By the aid of the following lines the names and order of the books may be recollected".

[1]Adi, [2]Sabh', [3]Aranyamque. [4]Virat [5]Udyogaque, quinque; [6]Bhishmas. [7]Dro, [8]Car. [9]Salyaque, [10]Sauptica (proelia quinque;) [11]Stri, [12]Sant, atque, [13]Anusas' [14]Asw'

[15]Asrama, quindecimum fit, [16]Mosala, [17]Prasthanic et Swargam, Bharata Magna.

ఈ మాటలలో quinque అనగా ఐదు. Quindecimum అనగా పదునైదు. Magna అనగా 'మహా' అని అర్థము. మహా భారతము నందలి పర్వముల పేరులను క్రమమును జ్ఞాపకముంచుకొనుటకు — మన వారు విషయమును ఛందోబద్ధము చేసికొనునట్లే — లాటిన్ భాషలో కూర్పుట జరిగినది. ఈ సందర్భమున రామాయణమును గూర్చి కూడ ఇట్లు వ్రాసెను : "The Candas, or books of the Ramayana are named [1]Balas, [2]Ayodhya Canda, et [3]Aranyam, [4]Kishkindhaque, [5]Sundara, [6]Yuddh' atque, [7]Uttara ; sunt Ramaide Septem".

తెలుగు మహా భారతమునకు ప్రజలలోనున్న ప్రాచుర్యమును గుర్తించిన బ్రౌనుదొర, భారతమునకు శుద్ధ ప్రతిని సిద్ధము చేయించి ఊరకుండెననుటకు వీలు లేదు. ముద్రణమునకు ప్రయత్నించి యుండుననుట సహజము. ఆయన వ్రాతలు ఆనాటి పత్రికాధిపతులు ప్రచురణకర్తలు ఆయనతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరములు, పత్రికా ప్రచురణలు ఈ విషయమై మనకు తగినన్ని వివరములు ఇచ్చుచున్నవి.

బ్రౌనుదొర 1842 లో గౌరన మంత్రి హరిశ్చంద్ర ద్విపద కావ్యమును సమగ్రముగను, నవనాథచరిత్రలో ఒకకథనుకలిపి ఒక పుస్తకముగా వేపేరి మిషన్ ప్రెస్ లో అచ్చు వేయించెను. ఈ పుస్తకములో తానప్పటికి ముద్రించిన, ముద్రించుచున్న గ్రంథముల పట్టిక నొకటి ఇచ్చెను. దానిలో 'ఆదిపర్వము' అచ్చగుచున్నట్లున్నది ఇది 1842 వ సంవత్సరము, 1866 లో తాను వ్రాసి లండనులో ప్రచురించిన తన 'సాహిత్య జీవితము' చివర, Telugu books printed under my direction అని ఇచ్చిన పట్టికలో ఆదిపర్వము కలదు. ఇది 1843 వ సంవత్సరము. 1840 ఏప్రెల్ 10 వ తేదిని పురాణం హయగ్రీవ శాస్త్రిగారు బ్రౌనుదొరకు వ్రాయుచు- తానచ్చు వేయించుకొనుటకు దొరగారు శుద్ధ ప్రతులను సిద్ధము చేయించిన తెలుగు పుస్తకములను కొన్నింటిని దయచేయవలసినదనియు తాను ఆఫీసును ఏప్రిల్ 20 తేదీని ఏర్పాటు చేసికొనుచున్నట్లును- మనవి చేసికొనెను. ఆ సందర్భమున తాను సిద్ధము చేసి ఉంచుకొన్న తెలుగు

అక్షరములను గురించి వ్రాయుచు. "ఆ అక్షరములు తమరు ప్రకృతమందు వేయించే ఆదిపర్వములో అక్షరముల వంటివి అయి వాటికంటే కుదిరికెగా నున్నవి..." అని వివరించెను. దీనిని బట్టి బ్రౌనుదొర 1840 ఏప్రిల్ నాటికే తన 'ఆదిపర్వము' ను అచ్చు కిచ్చినట్లు తెలియుచున్నది. ఇది 1842 నాటికి అమ్మకము నకు సిద్ధమగుటలో విప్రతిపత్తిలేదు. ఇదిగాక, 1842లో ఆగస్టు 4, 18 తేదీలలో వర్తమాన తరంగిణి పత్రికలో వ్యాపార ప్రకటనలో అమ్మకమునకు లభించు వసుచరిత్ర మొదలైన ఇతర పుస్తకములతో బాటు "ఆదిపర్వం రు 8" అని కూడ కలదు. అనగా 1842 ఆగస్టు నాటికి ఆదిపర్వము వెలకు లభించుచున్న దన్న మాట! బ్రౌనుదొర Madras Journal of Literature and Science, Madras (July - December 1839) లో ధారావాహికముగా ప్రచురించిన 'Essay on the Language and Literature of the Telugus' లో మహాభారతమును గూర్చి ఇట్లు వ్రాసెను :

"The Text of Mahabharat has unavoidably been much-corrupted, in the course of years; and the Adi Parvam, or first book, being a common school book, has suffered more than the rest. The whole has now been revised and the devious readings found in different manuscripts have been recorded; on this foundation a new edition is now in progress, and the first book is in the Press".

దీనిని బట్టి 1839 లో ఆదిపర్వము అచ్చులోనున్నట్లు నిశ్చయమగుచున్నది. శుద్ధ ప్రతులను సిద్ధము చేయించునపుడు ఒక్కొక్క పండితునకు కొంత కొంత భాగమిచ్చి బ్రౌనుదొర ఆయా భాగములను తీర్పు చేయించెడి వాడు. ఒక భాగ మచ్చగుచుండ ఇంకొక భాగము తీర్పుజరుగుచుండెడిదని చెప్పుటకాధారము లున్నవి. ఉదాహరణకు - 1839 లో ఆదిపర్వము అచ్చగుచుండగా గరిమెళ్ళ వెంకయ్యగారిచే అరణ్యపర్వము తీర్పు జరుగుచుండెను. ఈ "తీర్పులు" చాల వరకు కడపలోని 'బ్రౌన్ కాలేజి' లో కూర్చుండి పండితులు కావించు చుండిరి. గరిమెళ్ళ వెంకయ్యగారు అరణ్యపర్వము ప్రథమాశ్వాసము చివర వ్రాసిన "వికారి నామ సం॥ మార్గ శిరశుద్ధ 15 లుక్కు సరియైన 1838 డిసెం రు

నెల 1 తేది అరణ్యపర్వం తీర్పు ఆరంభించి ఆ సంవత్సరం పుష్య బహుళ 14లు- 1839 సం॥ జనవరి నెల 14 తేదీవరకు ఆశ్వాసం సమాప్తం", అను దానిని బట్టి రెండు పనులును - ఒక భాగము అచ్చుపని, రెండవ భాగము 'తీర్పు'పని సమాంతరముగ జరుగుచుండినట్లు తెలియును. పూర్తి అయిన అరణ్యపర్వము లిఖిత ప్రతి మీద బ్రౌనుదొర, "This is the new edition, corrected and ready for printing" అని గుర్తు వ్రాసి పెట్టుకొన్నాడు. ఈ తీర్పుపని జరుగుచుండగనే, 1838 డిసెంబర్ 17 వ తేదిని గరిమెళ్ళ వెంకయ్యగారు బ్రౌను దొరకు వ్రాసిన లేఖలోని క్రింది భాగమును బట్టి - భారతము విషయమై బ్రౌను దొర తీసికొనిన శ్రద్ధ, పండితుల కృషి, వ్రాతకు కావలసిన పరికరములను అంద జేయుట మొదలైన సంగతులన్నియు తెలియును :

"తమరు పంపించిన భారతం బొక్కులు వుత్త కాగిదాల సిక్కములు నాకు చేరగానే తమపేర జ్ఞాపన పత్రిక వ్రాసుకొని వుంటిని.......... యిక్కడ పేనాలు దొరకడం ప్రయాస అయినందున కొన్ని పేనాలున్ను ఒక పేనాకత్తిన్ని శెలవు దయచేసి పంపించవలెనని ఆఉత్తరంలో వ్రాసుకొని వుంటిని...

గ్రంథం తీర్పుచేసి వ్రాయిడానకు ఆరభించినాను. యిదివరకు 150 పద్యములు తీర్చి వ్రాయడమైనది. అయితే యీ ఆరణ్యపర్వమంతా యితిహాసములు కథలు కనుక నడుమనడుమ శ్రుత్యర్థములు స్మృత్యర్థములు చాలాగా వస్తుంటవి గనుక కొన్నిచోట్ల సందేహములు తట్టుతూ వచ్చినందున రెండు గీర్వాణ ప్రతులు తెచ్చి దగ్గర వుంచుకొనివున్నాను. అందువల్ల సందేహములు చక్కగా నివర్తి అవుచూవున్నవి.

గ్రంథం జరుగుతూవున్నది. లోగడ తమరు బొక్కులలో అధ్యాయములు కూడా తగిలించివుంచుట యిప్పుడు సందేహం వచ్చిన చోట గీర్వాణములో నేను శానాసేపు వెతుక్కోకుండా నాకు చక్కగా పువయోగించివున్నవి...." [50]

---

50. కడప జాబుల సంకలనం - పర్యవేక్షణ: జి.ఎన్. రెడ్డి; పరిశోధన: బంగోరె; శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి; డిసెంబరు 1977, పుట-28. (మదరాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరిలోని బ్రౌన్ జాబుల సంపుటం 419, పేజి 487 నుండి గ్రహీతమై పై పుస్తకములో నుదాహృతమైనది.)

బ్రౌనుదొర లిఖిత ప్రతులను సిద్ధము చేయించుటలో పడిన శ్రమయేకాక; పాశ్చాత్య పద్ధతి ననుసరించి అధ్యాయసంఖ్యలు, పద్యముల సంఖ్యలు మొదలైనవి వేయుంచుటవలన కలిగిన సౌలభ్యమును మన పండితులు గుర్తించి సంతోషించిరనుటకు పైజాబులోని చివరి పేరాయే తార్కాణము. ఇదిగాక, మన పండితులు వ్యావహారికములో జాబులు వ్రాయనప్పుడు అక్షరముల తప్పొప్పులవిషయములో అంత శ్రద్ధవహించెడివారు కారని కూడ తెలియుచున్నది. వత్యం అద్వైత బ్రహ్మయ్య శాస్త్రిలవంటి వారు కూడ ఈ విషయమున విశేష శ్రద్ధ చూపించెడి వారు కారని బ్రౌనుదొర వ్రాతలవలన తెలియుచున్నది. (ఈ పరిశోధన గ్రంథములో పుట-178; అధసూచిక-35.)

గ్రంథమునకు తీర్పు పని జరుగుచున్నప్పుడు, పండితునకు కలిగిన సంశయములన్నింటిని వేరుగా వ్రాసియుంచవలసినదని బ్రౌనుదొర ఆదేశము.ఆ సంశయములను తరువాత పండితులతో చర్చించి తీర్చుకొనవచ్చుననియు అప్పుడు పరిష్కృతపాఠములను శుద్ధ ప్రతులలో చేర్చుకొనవచ్చుననియు ఆయన యూహ. ఉదాహరణకు- గరిమెళ్ల వెంకయ్యగారు తీర్పు చేయుచువచ్చిన అరణ్యపర్వ భాగములోని సంశయములన్నియునిట్లు పర్యాంతమున వ్రాసియున్నవి:

"గరిమెళ్ళ వెంకయ్య కడపలో వుండి మహాభారతం అరణ్యపర్వం తీర్పు చేసి వ్రాసే సమయమందు సంభవించినవి (సందేహాలు): ఆ 1.167, ఆ 5.64, 365 (పద్యాలలో) అఖండయతులు, ఆ4. 3,9 (పద్యాలలో) రలలకు విశ్రమం చెప్పియున్నది.ఆ7.287 అరుణ శబ్దమునకు నెత్తురు అని ప్రయోగంవున్నది. 1అశ్వాసం మొదలుకొని 4 ఆశ్వాస పర్యంతంవున్న మధ్యాక్కరలు అన్నింటికి లక్షణ రీత్యా గణములు సరిపడి* యతిస్థానం నాలుగు గణాలపైన లక్షణ విరుద్ధమై

* అక్కరలు అయిదు విధములు. వాటిలో 'మధ్యాక్కర' రెండవది. ప్రతి పాదముననుండెడి గణక్రమము: 2 ఇంద్రగణములు, 1 సూర్యగణము; మరల 2 ఇంద్రగణములు 1 సూర్యగణము. మొత్తము ఆరు గణములు; ప్రాస నియమము కలదు. నన్నయభట్టు తరువాత, లాక్షణికులందరు ప్రతి పాదమున చతుర్థ గణాద్యక్షరమునకు యతి చెల్లునని వ్రాసిరి. నన్నయభట్టు మాత్రము పంచమ గణాద్యక్షరమునకు యతి చెల్లించెను. యుద్ధమల్లుని బెజవాడ శాసనమందలి మధ్యాక్కరలకు నిట్లే యతి కలదు. అర్వాచీనులైన లాక్షణికులు మధ్యాక్కర పాదము సమాన గణములతో చక్కగా రెండుగా విరుగునట్లుండాయని కాబోలుమూడు గణములతరువాత చతుర్థ గణాద్యక్షరమును యతిస్థానమనిరి.గరిమెళ్ళ వెంకయ్యగారు ఈ దృష్టితో నన్నయ మధ్యాక్కరలనుగూర్చి వ్రాయుచు "1ఆశ్వాసం మొదలుకొని 4 ఆశ్వాస పర్యంతంవున్న మధ్యాక్కరలు అన్నింటికి లక్షణరీత్యా గణములు సరిపడి యతిస్థానం నాలుగు గణాలపైన లక్షణ విరుదమై వున్నది" అని వ్రాసిరి.

వున్నది." 51

ఇంత శ్రద్ధ తీసికొని పని చేయించెడివాడు బ్రౌనుదొర. దీనివలన ఆయనకు వచ్చిన లాభమేదియు లేదు. సొంత డబ్బు ఖర్చుపెట్టి భాషా సాహిత్యములకు సేవచేసిన పూర్వ మహారాజులకు ఏవిధముగను తీసిపోనివాడు బ్రౌనుదొర. వారికంటె ఘనుడనుటయు యుక్తము. వారు దేశీయులు. ఈయన విదేశీయుడు. వారికంటె కూడ ఎక్కువగ అన్ని వర్గములవారికి, వారి సాహిత్యములకు ఒక విధముగా అంతయు తెలుగు సాహిత్యమే అయినను-సంధియుగమున సేవచేసి మన సాహిత్యము నష్టము కాకుండ కాపాడుటయే గాక అచ్చుద్వారా విశేష ప్రచారమును కూడ దానికి తెచ్చెను. బ్రౌనుదొర ప్రతి పుస్తకమునకు శుద్ధప్రతిని సిద్ధము చేయుంచుటకు, అచ్చు వేయించుటకు (వసుచరిత్రను అచ్చువేయించుటకగు ఖర్చు 'ఎస్టిమేటు' ఈ పరిశోధన గ్రంథములో పుట-157) ఎంత ఖర్చు ఆగునో 'ఎస్టిమేటు' వేసికొనెడివాడు. ఆ విధముగా ఆంధ్ర మహాభారతము విషయమున వేసికొనిన 'ఎస్టిమేటు'ను - అనగా వివిధ ప్రతులను తైపారువేసి చూచి తీర్పుచేసి శుద్ధప్రతిని సిద్ధము చేయించునప్పుడగు ఖర్చు (కాగితములు, పేనాలు, బైండింగులు మొదలైన వాటితో కలిపి) నకు సంబంధించిన దానిని - క్రింద నిచ్చుచున్నాను :

Payment

[52] Estimate of cost of correcting the Telugu Maha Bharata

The rate of correction is about fifty verses per day and of fair transcription about the same including variations, but allowing for Sundays, feasts sickeness & say 30 verses per day, the month, being 30 days = 900 padyams per month. Then for 23,000 verses, which is the extent of the

---

51. Ibidem. పుట - 82. మదరాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీలో తెలుగు వ్రాతప్రతి సంఖ్య డి. 211: నుండి గృహీతమై పై పుస్తకములో నుదాహృతమైనది.)

52. Ibidem. పుట-103 (ఈ పుస్తకములో ముద్రితమైన ఫొటో - ప్రింటును చూచి వ్రాసినది )

work, allow two years and a quarter at least (more exactly 2y 1.m 15 days)* B'han writers of the rough copy do about 50 or 60 verses per day at 200 verses per rupee. Then the monthty charge is

| | |
|---|---|
| 2 sastrics at 15 Rs | 30 |
| 1 corrector | 12 |
| 3 readers | 24 |

Rs 66 per month (for 900 vsrses)

| | |
|---|---|
| For 27 months is Rs 1782 for correction alone | 1782 |
| Rough - copy, 23,000 verses at 200 per Rupee | Rs 115 |
| Fair - copy with variations at 100 ... | Rs 230 |
| Fair do without — | 115 |
| Paper for 3 copies at | 288 |
| Pens, binding &c | 184 |
| | 2714 |

ınd very cheap indead at the rate

ఈ సందర్భములో మనకు ముందు స్ఫురించునది - తెలుగు సాహిత్యమును పునరుద్ధరించుటకు పూనుకొనిన బ్రౌనుదొర వెచ్చింపనున్న, వెచ్చింప సిద్ధపడిన సొంతడబ్బు! తనజీతములో నుండి మిగిల్చి ఖర్చుచేయవలసినది! మహాభారత పఠనము ప్రారంభించునాటికి (1825) బ్రౌనుదొర జీతము (అలవెన్సులు కలిపి) పట్టుమని అయిదారు వందల రూపాయల కంటె ఎక్కువ లేదు. ఉద్యోగములో చేరిన (ఆగష్టు 1820 - లో కడప కలక్టరునకు అసిస్టెంటు) మూడు నాలుగేళ్ళు జీతము

* Bramhan అని వ్రాయుటకు బదులు అప్పుడప్పుడు 'B'han' అని వ్రాయుట బ్రౌనుదొరకు అలవాటు.

(అలవెన్సులు కలిపి) మూడు నాలుగు వందలకు మించలేదు. ఈ పరిస్థితులలో సొంత డబ్బు వెచ్చించి భాషా సాహిత్యములకు సంబంధించిన ఈ పనులన్నియు చేసి చేయించినాడన్నచో ఆయనకు తెలుగుమీద నున్న ఆదరాభిమానములు ఎంత లోతైనవో తెలియును. "పువ్వుపుట్టగనే పరిమళ" మన్నట్లు, కడపలో ఉద్యోగములో చేరుచునే స్థానికుల పిల్లల చదువుల కోసము తెలుగు ఫార్సీ హిందుస్థానీ భాషలను బోధించు రెండు ఉచిత పాఠశాలలను స్థాపించెను. "నాతమ్ముడు అయిన నారాయణరెడ్డి అనేవాడు యేమి పనిలేక వూరికెవున్నాడు. పారిశిన్ని తమబడిలో అభ్యశించినాడు "అని కృష్ణారెడ్డిగారు 20-3-1830లో బ్రౌనుదొరకు వ్రాసిన జాబును బట్టి కడపలో బ్రౌనుదొర స్థాపించిన పాఠశాలల సంగతి తెలియుచున్నది. వీటినన్నింటిని పరిశీలించినప్పుడు బ్రౌనుదొర కృషి ఎంత నిష్కామమైనది తెలియును.

మహాభారతము విషయములో 1825లో ప్రారంభమైనకృషి కొనసాగి 1842 నాటికి ఆదిపర్వం అచ్చుగువరకువచ్చినది. దీనికి సంబంధించిన వివిధ దశలను గూర్చి కొంత తెలిసికొంటిమి(ఈపరిశోధనగ్రంథంలో పుటలు-186-192).ఇది ఇట్లుండగా శాలివాహనశకము ౧౭౬౫ సంవత్సరము శుభకృన్నామ సంవత్సరము (౧౮౪౩ నందచ్చయిన ఆదిపర్వభాగము ఒకటి లభించినది. దాని ముఖపత్రమిట్లున్నది:

ఆదిపర్వము

---

పూంబావై - శృంగార మొదలారి

పొయిగై - అప్పాస్వామి మొదలారి

వీరిరువురిచేతను

సైదాపురం - ఉమాపతి మొదలారి కల్విక్కళంజమనె

ముద్రాక్షరశాలలో అచ్చువేయించి ప్రచురము చేయబడెను

శాలివాహనశకం ౧౭౬౫ సం॥ అగునేటి

---

శుభకృన్నామ సంవత్సరమునకు
సరియైన ఇంగ్లీషు
౧౮౪౩

ఆదిపర్వమునకు జరిగిన ఈ ముద్రణమునకు బ్రౌనుదొరకును గల ప్రత్యక్ష పరోక్ష సంబంధములను గూర్చి మనకు తెలియదు 1842 లోనే బ్రౌనుదొర ఒక ముద్రణమును చేయించెనా? అను విషయమునుగూర్చియు పరిశీలింపవలసియున్నది 1825-1826లో భారతాధ్యయనమును ప్రారంభించెను 1839 July-December, Madras Journal of Literature and Science లో "..... the first book is in the press" అని తన Essay on the Language and Literature of the Telugus లో మహాభారతమును గూర్చి వ్రాసెను. 1840 ఏప్రెల్ నెలలో పురాణం వారు బ్రౌనుదొరకు వ్రాసిన జాబునుబట్టి ఆదిపర్వము అచ్చులోనున్నట్లు తెలియుచున్నది. ఈ 1842 సంవత్సరమునందే ముద్రించిన "గౌరనమంత్రి హరిశ్చంద్ర ద్విపద" కావ్యములో నిచ్చిన తాను ముద్రించిన ముద్రించుచున్న గ్రంథముల పట్టికలో ఆదిపర్వము అచ్చులో నున్నట్లున్నది. 1842 ఆగస్టులో 'వర్తమాన తరంగిణి' లోని వ్యాపార ప్రకటన వల్ల ఆదిపర్వము వెలకు దొరకుచున్నదని తెలియుచున్నది. 1866 లో లండనులో ముద్రించిన (పరిమిత ముద్రణము) తన "సాహిత్య జీవితము"లో నిచ్చిన ముద్రిత గ్రంథముల పట్టికలో ఆదిపర్వము 1843 లో ముద్రితమైనట్లున్నది. 1842, 1843 సంవత్సరముల తేడాను మనము విశేషముగ పట్టించుకొననక్కరలేదు. లోపలి ముఖపత్రపు పుటలో ఒక సంవత్సరము పైనున్న పత్రముపై ఇంకొక సంవత్సరము ఉండుట బ్రౌనుదొర అచ్చువేసిన ఇతర గ్రంథములలో కూడ కొన్నిచోట్ల కనంబడుచున్నది. ఉదాహరణకు బ్రౌనుదొర ఇంగ్లీషు-తెలుగు నిఘంటువును గ్రహింపవచ్చును. ఒకటవ పుటలో 1858 అనియు, మూడవ పుటలో 1852 అనియు కలదు. ఇదిగాక, తెలుగు సంవత్సరములను వ్రాసినప్పుడు, ఒక తెలుగు సంవత్సరమునందు రెండింగ్లీషు సంవత్సరముల భాగములు వచ్చును. ఉదాహరణకు గరిమెళ్ళ వెంకయ్యగారు అరణ్య పర్వమును తీర్పుచేసిన విళంబి నామ సంవత్సరమును గ్రహింపవచ్చును. "విళంబి నామ సంవత్సర మార్గశిర శుద్ధ 15లుక్కు సరియైన 1838 డిసెంబరు నెల 1 తేది అరణ్య పర్వం తీర్పు ఆరంభించి ఆ సంవత్సరం పుష్య బహుళ 14లు 1839 సంవత్సరం జనవరి నెల 14 తేదివరకు ఆశ్వాసం సమాప్తం" ఇందులో 'విళంబి'లో కొంతభాగము 1838 లోను, కొంతభాగము 1839 లోను వచ్చినది. అట్లే 'వికారి'లోని కొంత భాగము 1839 లోను, మిగిలిన భాగము 1840 లోను వచ్చినది. పుస్తకమును

ముద్రించినప్పుడు,మానము పేరుచెప్పక 'విళంబి' అన్నప్పుడు 1888 కావచ్చును లేదా 1889 కావచ్చును. ఇంగ్లీషు సంవత్సరములు వేసినప్పుడు కూడ, పందొమ్మిదవ శతాబ్ది తుది పాదములో అచ్చయిన పుస్తకముల విషయమునను - ఉదాహరణకు వావిలాల వాసుదేవ శాస్త్రిగారి *'జూలియస్ సీజర్' తెలుగు అనువాదమును గ్రహింపవచ్చును - దీని ఇంగ్లీషు పీఠిక 1876 జనవరి 4వ తేదీని, తెలుగు పీఠిక సెప్టెంబరు 21 వ తేదీని వ్రాసినట్లు కలదు. ముఖ పత్రముమీద అచ్చయిన సంవత్సరము 1874 అని ఉన్నది. ఆనాటి పుస్తకములలో చాల భాగమిట్లున్నట్లు కనవ్పట్టును. గ్రంథము పూర్తి అయిన తరువాత, ఆ సంవత్సరము మాత్రమే వేయునాచారముకాక, అచ్చునకు సంబంధించిన వివిధ దశలలోని తేదీలు వేయుట కలదు.

శృంగార మొదలారి, అప్పాస్వామి మొదలారిగారలు అచ్చువేయించిన ఆదిపర్వము, శుభకృన్నామసంవత్సరమున ఉమాపతి మొదలారిగారి కల్వికళంజమనె ముద్రాక్షరశాలనుండి ౧౮౪౩ లో వెలువడినట్లున్నది ఈ శుభకృన్నామ సంవత్సరము ౧౮౪౨ లో ప్రారంభమై ౧౮౪౩ లో కూడ కొనసాగినది. ఇటులనే, బ్రౌనుదొర ఆదిపర్వము కూడ 1842, 1843 సంవత్సరములలో కొనసాగి వెలువడి యుండుటచే ఈ రెండు సంవత్సరములు, ఆయన భిన్న భిన్న స్థలములలో ఇచ్చుట జరిగినదని మనము సమర్థించుకొనవచ్చును.

దీని తరువాత, 1847 లో వైయాకరణ రామానుజాచార్యులుగారు, చిన్నయసూరిగారు సరిచూడగా అచ్చువేసిన ఆదిపర్వము వచ్చును. దీని ముఖపత్రమునందిట్లున్నది :

"చెన్నపట్టణములోని కాంచీపురము పచ్చయప్ప మొదలారిగారి విద్యాశాలయందాంధ్ర గీర్వాణ ప్రధానోపాధ్యాయులయిన వైయాకరణ రామానుజాచార్యుల వారిచేత లేఖక ప్రమాదాది దోషంబులు లేక పరిశోధింపబడి, హానరేబిల్ కంపెనీవారి యూనివర్సిటీ యనుశాస్త్ర పాఠశాల యందాంధ్రోపాధ్యాయులయిన ప. చిన్నయగారిచేత సరిచూడబడి, దీనికి శాస్త్ర నిబంధనములను మెండుగా నుంచక వైయాకరణ రామానుజాచార్యులవారి చేతనే భారత వచనంబను పేరుగలదిగాఁ జేయఁబడిన ఛాయా వ్యాఖ్యానముతోడ శాలివాహన శక వర్షంబులలో ౧౭౬౯ వదియగు ప్లవంగనామ సంవత్సరాధిక జ్యేష్ఠ శుద్ధ ౩

---

* తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము - కొత్తపల్లి వీరభద్రరావు హైదరాబాదు. ద్వితీయ ముద్రణ - 1986; పుటలు-450, 451, 452.

(క్రీ.శ. 1847 మేనెల 17వ తేదీ) సోమవారంబునందు సరస్వతీపీఠ ముద్రాక్షరశాలయందు అచ్చువేయబడినది".

భూతపురీ మాహాత్మ్యము, కవిజన మనోహరము అను కావ్యములను రచించిన పండిత కవులు కరాలపాటి రంగయ్య (మృతి 1863 గారు 1852 లో సోమసుందరం పిళ్లగారను ధనవంతుని సాయముతో ఆంధ్ర మహాభారతమును ముద్రించిరి. ఆనాటి విద్వాంసులలో పేరుపొందిన వీరు భాస్కర, రంగనాథ రామాయణములను కూడ ముద్రించిరి. కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'ఆంధ్ర కవుల చరిత్ర'లో కూడ స్థానమును సంపాదించిరి. చిన్నయసూరిగారితో కొంతకాలము, వారి తరువాత నొక సంవత్సరము రాజధాని కళాశాలలో వీరు పండిత పదవిలో నున్నట్లు తెలియుచున్నది. అంతకు పూర్వము పచ్చియప్ప మొదలి పాఠశాలలోను మద్రాసు హిందూ బాలికోన్నత పాఠశాలలోను కొంత కాలము రంగయ్యగారు పనిచేసిరి ఆనాటి సంస్కృతాంధ్ర పండిత కవులలో వీరు ప్రముఖులుగా నుండిరి.

ఆంధ్ర మహాభారత ముద్రణమునకు సంబంధించిన విషయములిట్లుండగా, కొందరు భాషాభిమానులైన తెలుగువారు - పండితులు. లౌకికులు - కలిసి "ముద్రాక్షరాంకనీయాంధ్ర భారత పర్యాలోచన సభ" అనుదానిని ఏర్పర్చుకొని ఆంధ్ర భారత ముద్రణమునకు పూనుకొనిరి. ఈ ఉద్యమ ప్రారంభకులు "ఆలూరి యేకామ్రజోస్యులవారు". అనేకులను భాగస్వాములుగ చేర్చుకొని జోస్యులవారి జ్యోతిష్కళానిధి ముద్రాక్షరశాల యందును, పువ్వాడ వేంకటరావుగారి వర్తమాన తరంగిణి ముద్రాక్షరశాల యందును ఆంధ్ర భారతము పదునెనిమిది పర్వములు ముద్రించి సంకల్పసిద్ధులైరి.

ఇంత శ్రమపడి సాధించిరి గనుకనే, "....భాగస్థుల యైకమత్యముతో భగవత్కటాక్షమువలన నిర్విఘ్నముగా నీ భారతము - 18 పర్వము లచ్చు ముగియునటుల ఘటించినదని తెలియఁజేయుటకు సమాజికులమయిన మేమందఱము మిక్కిలి సంతోషింపుచున్నారము" అని సగర్వముగా వ్రాసికొనిరి.

కాని, వీరి శ్రమలో కీర్తిలో భాగమున్నవారిలో బ్రౌనుదొర ప్రముఖుడను విషయము మరువదగినదికాదు. ఇది రుజువుచేయుటకు విశేషముగ కష్టపడ నక్కరలేదు. బ్రౌనుదొర దగ్గర జీతము తీసికొని పనిచేసిన పండితులుగాక, మిగిలినవారిలో చాలమంది ఎప్పుడో ఒకప్పుడు, "తాము సిద్ధము చేయించిన గ్రంథములను మాకు అచ్చువేసికొనుటకు ఇప్పింపుడు" అని ఆయనను ప్రార్థించినవారే!

అయన ఇచ్చుట వీరు ముద్రించుకొని లాభముపొందుట ఆనాడు పరిపాటి అయి నది. పురాణం హయగ్రీవశాస్త్రిగారు మొదలుకొని పువ్వాడ వేంకటరావు గారి వరకు అందరును అడిగినవారే! పురాణం వారు 1840 లో భాగవతమును బ్రౌను దొర దగ్గరనుండి గ్రహించి 1848 లో దాని నచ్చువేయించుట మనకు తెలిసిన విషయమే! (ఈ పరిశోధన గ్రంథములో పుటలు-162, 163). ఈయన "భారతము యుద్ధపంచకము" కూడ ఇప్పించవలసినదని కోరెను.

ఇంక, వర్తమాన తరంగిణి పత్రికాధిపతులైన పువ్వాడ వేంకటరావుగారి సంగతి చూచినప్పుడు అయనకు బ్రౌనుదొరతో ఉన్న పరిచయము వ్యక్తమగును. అనాడు, వర్తమాన తరంగిణి పత్రిక ప్రముఖస్థానము నాక్రమించి యుండుటచే దానిలో పడిన వార్తలను, జాబులను బ్రౌనుదొర శ్రద్ధగా గమనించుటయేగాక విలక్షణముగా నున్నవాటిలో కొన్నింటిని వేరుగా కాపీచేయించి ఉంచెను.పత్రిక తాలూకు సంచికలను బైండుచేయించి భద్రపరచెను. ఇవన్నియు ఈనాటి పరిశోధ కులకు అమూల్యమూలధనము. పరిశోధనకు వస్తుసామగ్రి. పువ్వాడవారు భారత మునకు సంబంధించి బ్రౌనుదొరకు వ్రాసిన జాబులన్నియు భారతము అచ్చగు టలో బ్రౌనుదొర చేసిన కృషిని తెలియజేయజాలియున్నవి. ఉదాహరణగా ఒకటి రెండు జాబులనుండి కొన్ని భాగములు:[58]

"జనవరి రోజున తమ సముఖములో శ్రుతపరచుకొన్న ప్రకారం సంస్కృత భారతం ఆదిపర్వ సభా పర్వములనున్ను ఆంధ్ర భారతం ఆదిపర్వము సభాపర్వము అరణ్యపర్వము ఉద్యోగపర్వము.... సముఖమునకు పంపించు కుని యున్నాను. దాఖలు చిత్తగించవలెను..."

"....తమ సముఖములో మనవిచేసుకొన్న ప్రకారం అంధ్ర భారతంలో ద్రోణపర్వం మొదలుకొని రెండేశి పర్వముల చొప్పున దయచేయించుచూ వచ్చిన పక్షమునకు తమ నిఘంటుకు విరోధములేకుండా తాము వేయించి యుండిన లెక్కల ననుసరించే అచ్చు వేయించుచున్నాను. ప్రస్తుతము - ద్రోణపర్వము కర్ణపర్వము అచ్చు జరుగుచున్నది గనుక ముఖ్యముగా ప్రతులను దయచేయించ వలయునని ప్రార్థించెదను. చిత్తగించవలెను."

(1852 సంవత్సరము, జనవరి 10)

---

58. బ్రౌన్ జాబులు : బంగోరె సంకలనం; నెల్లూరు-అక్టోబరు 1978. పుటలు-37, 38.

"... తాము లోగడ దయచేయించిన శల్యపర్వము అచ్చు ముగించి తిరిగి సదరు ప్రతిని పంపించడమైనది గనుక దాఖలు చిత్తగించి స్త్రీ పర్వ శాంతిపర్వములు దయచేయించగలందులకు ప్రార్థించుచున్నాడను..."

(1852 సంవత్సరము, మే 17)

ఈ జాబులనుబట్టి భారత విషయమున పువ్వాడవారికి బ్రౌనుదొరకు గల సంబంధము తెలియుచున్నది. ఆనాడు, ప్రత్యక్షముగనో పరోక్షముగనో బ్రౌను దొర సిద్ధముచేయించిన తెలుగు శుద్ధ ప్రతులను వినియోగించుకొనని ప్రచురణ కర్తలుగాని పండితులుగాని లేరనుట సత్యదూరముకాదు.

ఇందువలననే, ఏకాంబ్రమజోస్యులవారి జ్యోతిష్కళానిధి ముద్రాక్షరశాల లోను పువ్వాడ వేంకటరావుగారి వర్తమాన తరంగిణి ముద్రాక్షరశాలలోను మా. వెంకట కృష్ణమాచార్యులు, రా. వెంకట కృష్ణశాస్త్రి, తో. విజయరాఘవ కవిగారలచే "లేఖక ప్రమాదజనిత దోషంబులు వారింపబడి" అచ్చయిన శ్రీమదాంధ్ర మహాభారతము పీఠికలో-"వెండియు నీ భారత గ్రంథము - బరిష్కరించుటకు వలయు మాతృకలప్పుడప్పుడు మాకు దయచేయుచు వచ్చినట్టియు - నానావిధ భాషా గ్రంథంబు లపారంబుగ సంగ్రహించి భాండాగారంబుగఁ జేర్చియున్నట్టియు - దద్గ్రంథార్థసార గ్రహణ కళాకౌశలంబునం బ్రసిద్ధుండయి యున్నట్టియు - నింగిలీషు ప్రభుండునగు చార్లిస్ ఫిలిప్-బ్రౌన్ యిస్క్వయర్ గారిని ... మేమందఱు మమందానందంబున నభినందించుచున్నారము" అని వ్రాయుట జరిగినది. ఈ పీఠిక యున్న గ్రంథము-[54] పరీధావి నామ సంవత్సర పుష్య శుద్ధ 1 సోమవారము (1853) అచ్చయినట్లున్నది. ఎందరో పండితులు, లౌకికులు కలిసి అచ్చువేసిన ఈ గ్రంథములో దేశీయులైన ఇతరులతోపాటు బ్రౌనుదొరను కూడ నిట్లు శ్లాఘించిరన్నచో ఆనాటి విజ్ఞాన లోకమున ఆయన కున్న స్థానమునుగూర్చి వేరుగా వ్రాయనక్కరలేదు!

1853 తరువాత ననేకులు ఆంధ్ర మహాభారతము నచ్చొత్తించిరి. ఇప్పటికి ఈ కృషి జరుగుచునేయున్నది. ఈమధ్యనే ఉస్మానియా విశ్వవిద్యాలయమువారి తెలుగు శాఖ చేపట్టిన "ఆంధ్ర మహాభారత సంశోధిత ముద్రణప్రతి పథకము"

---

54. Ibidem. పుట-110.

క్రింద కూడనిది అచ్చయినది (ప్రథమ సంపుటము - 1968). వీరందరు— వీరే కాదు, భావితరములవారు కూడ - బ్రౌనుదొర భారత ముద్రణ విషయమున చేసిన సాయమును కీర్తింపక తప్పదు! గ్రంథముల ముద్రణ సంవత్సరముల నిచ్చినప్పుడు సాధారణముగా ముఖపత్రము మీదనున్న వత్సర సంఖ్య నిచ్చుట జరిగినది. ఎడనెడ లోపలి పుటలోని సంఖ్యకు అట్టమీదనున్న సంఖ్యకు భేదము (ఒకటి, రెండు సంవత్సరములు) ఉండుట కలదు. వీటిని, అచ్చు ప్రారంభించిన సంవత్సరము ముగిసిన సంవత్సరములుగ గ్రహించుటలో పెద్ద దోషమేమియు లేదు.

ఈనాడు విశ్వవిఖ్యాతిని పొందిన వేమన పద్యములను ఆనాడు మొట్టమొదట ఆంగ్లానువాదముతో ప్రచురించిన ఘనత బ్రౌనుదొరకు దక్కినది. వివిధ ప్రాంతములనుండి గ్రంథముల లిఖిత ప్రతులను తెప్పించి, వాటిని పరిష్కరించి, వ్యాఖ్యానములు వ్రాయించి తరువాత వాటిలో కొన్నింటిని తానే అచ్చువేసి కొన్నింటిని ఇతరుల కిచ్చి అచ్చువేయించి తెలుగు కావ్యములకు సేవచేసిన బ్రౌనుదొర 1829లో వేమన పద్యములను The Verses of Vemana అను పేర ఇంగ్లీషు అనువాదముతో అచ్చువేసెను. తెలుగు నుండి ఇంగ్లీషు లోనికి అనువదింపబడి అచ్చయిన పుస్తకములలో విస్తృతమైన ప్రథమ గ్రంథమిది అని చెప్పవచ్చును. దీని వలన వేమన పేరు పాశ్చాత్యులకు - ముఖ్యముగా ఇంగ్లీషు భాషాభాషీయులకు - పరిచితమయ్యెను. వేమన తత్త్వదృష్టి, సంస్కరణ దృష్టి కూడ వారికి తెలిసెను. ఇవిగాక, వేమన హిందూ సమాజములోని లోపములను నిర్దాక్షిణ్యముగ, నిశితముగ ఖండించి వ్రాయుటవలన, ఆ లోపములను పాశ్చాత్యులకు తెలిసెను.

పందొమ్మిదవ శతాబ్దిలో - భారతదేశమును సంపూర్ణముగ వశపర్చుకొని పరిపాలింపనెంచుచున్న ఇంగ్లీషు అధికారులకు;అంధ విశ్వాసములనుండి,అజ్ఞానము నుండి భారతీయులను మరలించి తమ విశ్వాసములవైపు, ధర్మమువైపు త్రిప్పుకొనవలెనని బద్ధ కంకణులై కృషి చేయుచుండిన క్రైస్తవ మిషనరీలకు - వేమన నమ్మి బోధించిన మానవతా దృష్టి, సర్వసమభావములకంటె ఆయన ఖండించిన హిందూ సమాజములోని లోపములు బాగుగా వర్థమగుటలో, ఆకర్షకములగుటలో ఆశ్చర్యములేదు! ఇట్లర్థము చేసికొని, ఆకర్షితుడై అబే జే.ఏ. దుబాయ్ (1765 - 1848) అను ఫ్రెంచి మిషనరీ ఫ్రెంచి భాషలో వ్రాసిన పుస్తకమునకు ఇంగ్లీషు అనువాదమే "Description of the Character, Manners,

and Customs of the People of India, and their Institutions, Religious and Civil" అనునది. క్రైస్తవ మతములోని రోమన్ కేథలిక్ శాఖకు చెందినవాడు. ఈయన 1792లో భారతదేశమునకు వచ్చి 1823 వరకు మద్రాసు ప్రెసిడెన్సీలో కాలము గడిపెను. తమిళము బాగుగా తెలిసినవాడు. ప్రజలతో కలిసిమెలిసి తిరిగి వారి ఆచారవ్యవహారములను - తన దృక్కోణము నుండి పరిశీలించి హిందువుల ఆచారవ్యవహారములపై ఒక బృహద్గ్రంథము వ్రాసెను. ఎ.డి. కాంబెల్ ఈ పుస్తకము యొక్క లిఖిత ప్రతిని మద్రాసులో 1815లో చూచి ఇంగ్లీషు కంపెనీ వారు ఆ పుస్తకమును కొనుటకు నిర్ణయించుకొనుచున్నప్పుడు ఇట్లు వ్రాసెను :[55]

"I soon found enough to satisfy me that it would be unfair to proceed further in this pursuit without first affording the author an opportunity or revising his work, being convinced that the increased experience of the Abbe Dubois and his further acquaintance with the customs and habits of the Hindus would enable him to correct many parts of the MS ..."

కాని ఈ పుస్తకము చదువుట కంపెనీ ఉద్యోగులకు చాల లాభదాయకమని ఆనాటి గవర్నర్ జనరల్ లార్డ్ విలియం బెంటింక్ భావించి తన అభిప్రాయము నిట్లు వ్యక్తము చేసెను :[56]

"I am of opinion that in a political point of view, the information which the work of the Abbe Dubois has to impart might be of the greatest benefit in aiding the servants of the Government ..."

---

55. History of Dubois MSS - XV (Hindu Manners etc, పుస్తకములో, 1906 ముద్రణ).

56. Ibidem,

మత దృష్టితో అబే దుబాయ్ వ్రాసిన ఫ్రెంచి పుస్తకమును రాజకీయ దృష్టితో కంపెనీవారు రెండు వేల పూల వరహాలకు కొని దానిని ఇంగ్లీషులోనికి అనువదింపజేసి 1816 - 1817 లో ముద్రించిరి.* దానిని బ్రౌనుదొర చదువు నప్పుడందు వేమన ప్రస్తావన ఇట్లు వచ్చినది : [57]

"one Hindu poet, Vemana, expresses himself thus on the subject: 'It is water which causes mud, and, it is water which removes it. It is Your will that makes You commit sin, and it is by Your will alone that you can he purified' (page - 194) తరువాత వేమన రచనలనిట్లు ప్రస్తుతించెను : "one of the most famcus is Vemana, whose poems, originally written in Telugu, have since been translated into several other languages.... His writings, from which I have seen several extracts, appear to me to be most interesting, and are distinguished by much discernment and independence" (page - 275)

పాపమును గురించి హిందువులు ఏమనుకొందురో చెప్పు సందర్భమున వేమనను అబే దుబాయ్ ఉదాహరించి ఆయన రచనను గురించి తన అభిప్రాయమును వ్యక్తము చేసెను.

---

*క్రొత్త అనువాదముతో (A.K. Beauchamp చేసినది) కొన్ని మార్పులతో ఈ గ్రంథము 1897లో మరల ముద్రితమైనది. తృతీయ ముద్రణము 1906 లో జరిగినది. పేరు Hindu Manners, Customs and Ceremonies గా మారినది. ఇందు మార్పులంతగా లేవు. ఈ ముద్రణ ప్రతియే నేటి వరకు మరల మరల ముద్రితమగుచు (1958 Oxford Press) వచ్చుచున్నది. సుమారు 170 ఏండ్ల క్రిందట మొట్టమొదటి సారి ప్రకటితమైన ఈ పుస్తకమే ఈ విషయముపై (హిందువుల ఆచార వ్యవహారములపై) నేటికిని- ఈ మధ్య కాలములో హిందూ సమాజములో మార్పు లెన్ని వచ్చినను, దేశమునకు స్వాతంత్ర్యము కూడ వచ్చినను వాటిని పరిగణింపకయే- చాలమంది పాశ్చాత్యులచే శిరోధార్యముగ పరిగణింపబడుచుండుట ఆశ్చర్యము !

57. Hindu Manners, Customs and Ceremonies, 1906.

అబే దుబాయ్ వ్రాసిన వాక్యములవలన వేమన పేరు బ్రౌనుదొర మొట్ట మొదట తెలిసికొని ఆతని పద్యములను చదువనెంచి 1824లో వాటినిసంపాదించు ప్రయత్నమారంభించెను. తెలుగు వారిలో బహుళముగా ప్రచారమున నున్నవి, తేటతెలుగు మాటలతో ఉండి భాష అంతగా రాని విదేశీయులకు పనికివచ్చునవి; ఏవైన పద్యములున్నవా అని అన్వేషించుచున్న బ్రౌనుదొరకు 'వేమన పద్యములు' పేదకు పెన్నిధివలె లభించెను. ఏపనిని తలపెట్టినను పరిపూర్ణముగ చేయు స్వభావముగల బ్రౌనుదొర, తన అధికారమును వినియోగించి, ఆంధ్ర దేశములోని వివిధ ప్రాంతముల నుండి వేమనపద్యములుగల లిఖిత ప్రతులను తెప్పించి వాటిలోగల పాఠ భేదములన్నింటిని పరిశీలించి పాఠ నిర్ణయము చేసి అచ్చునకు చక్కని ప్రతినొక దానిని సిద్ధము చేసెను[58]. విశ్రాంతి దొరికినప్పుడెల్ల వాటిని అనువాదము చేయుచువచ్చి, కొంత కాలమునకు తాను నిర్ణయించు కొనిన పద్యసంఖ్యను బ్రౌను దొర ఇంగ్లీషులోనికి పరివర్తనము చేసెను

పాశ్చాత్యులు, వేమన పద్యములను అభిమానించి సేకరించుట బ్రౌనుదొర కంటె చాల ముందే ప్రారంభమయినది. ఫ్రెంచి మిషనరీలు తెలుగులో మంచి కృషి చేసిరి. కాని, ఇంగ్లీషు ప్రభావము అధికమగుటతో, ఇంగ్లీషు తెలిసిన భారతీయుల సంఖ్య అధికమగుటతో, ఇతర పాశ్చాత్య భాషా భాషీయులు చేసిన కృషి మనకు తెలియకుండ పోయెను. ఇది అన్ని భారతీయ భాషల విషయము నందు వలెనే తెలుగు విషయమునను సత్యము. తెలుగునకు ఫ్రెంచివారు చేసిన

---

58. "After collecting such copies as were to be found at Masulipatam where I was then stationed, I gradually procured others from Vizagpatam, Nellore, Guntur, Cuddapah and Madras" (The Verses of Vemana; 1829; Preface)

సేవలలో నిఘంటు నిర్మాణము[59] (తెలుగు - ఫ్రెంచి) నకు సంబంధించిన కృషి గణనీయమైనదని బ్రౌనుదొరయే వ్రాసెను. ఈ కృషి క్రీ॥ శ॥ 1700 ప్రాంతము నకు చెందినది. ఇటులనే తెలుగు వ్యాకరణ విషయమునను కృషి జరిగి, తెలుగు వ్యాకరణ[60] మొకటి ఫ్రెంచిలో తనకు లభించినను అది అంత సంతృప్తిగా లేదని

---

59. "The French Missionaries who laboured about A.D. 1700 wrote a French - Tamil Dictionary and another lexicon Telugu and French, (of which the title is Dictionnaire Telongou ou Badaga) filling a folio manuscript volume. It was finely written in a minute French hand but not always easy, to decipher. The authors have not given their names; I observe that they were indefatigable in recording the colloquial dialect alone. I never saw this work until I returned to England in 1855. It supplied more than a thousand phrases."
(Some Account of the Literary Life of C.P. Brown)

60. "A reference in the first instance was made to a Gentoo Grammar, published a series of Years ago by a Frenchman, of which an imperfect copy was procured from a Missionary then residing at Guntoor-But though ample in the material,it was found to be superfluously minute and perplexing in the detail; and so extremely incorrect in doctrine as well as matter, that little other use was derived from it, except that of prompting the formation of the present Grammar with the greater alacrity; if for no other reason than that of rescuing the proper Gentoo from the perversion and misconstructions, with which this French production is amply teemed". (A Grammar of the Gentoo Language by William Brown; 1817, Page XII, Preface).

విలియమ్ బ్రౌను 1817 లో అచ్చయిన తన "జెంటు వ్యాకరణము పీఠికలో వ్రాసెను.

వీటినన్నింటిని బట్టి ఫ్రెంచి మిషనరీలు తెలుగు ప్రాంతములో పదునెని మిదవ శతాబ్ది ప్రారంభమునుండియు కృషిచేయుచు తెలుగు భాషనభ్యసించుటయే గాక ఏతదభ్యాసమునకు సాయపడు వ్యాకరణ నిఘంటువులను కూడ నిర్మించి రని తెలియుచున్నది. మన దేశమున చాలకాలమువరకు ఇంగ్లీషు వారికి ప్రతి ద్వంద్వులై నిలిచి రాజ్యసంపాదనకు పోరాడిన వారు ఫ్రెంచివారే. ఇట్టి వారి ఉద్యోగులు, మత ప్రచారకులు తెలుగు బాగుగా నభ్యసించి యుందురనుటలో ఆశ్చర్యపడవలసినది లేదు. తెలుగు ప్రాంతమందలి బొబ్బిలి, విజయనగరను మొదలైన స్వదేశీయ రాజవంశములలో, నిజాము కర్ణాటక నవాబులతో వారి కున్న రాజకీయ సంబంధములు చరిత్ర సత్యములు[61]. తెలుగు ప్రాంతములోని 'యానాం' (1750లో ఇక్కడ ఫ్రెంచివారు ఒక గిడ్డంగిని నిర్మించుకొనిరి) సంగతి తెలియని తెలుగువారుండరుగదా! ఆనాటి మన సాహిత్యములో ఫ్రెంచి మాటలు కూడ చాల చేరినవి.[62] మనకింత సన్నిహితముగ వచ్చిన ఫ్రెంచి వారి మిషనరీలకు వేమన సంగతి తెలియుటలో ఆశ్చర్యము లేదు.

వేమన పద్యములను బ్రౌనుదొర సేకరించుటకు దాదాపు నూరేండ్లకు ముందే ఫాదర్ లెగాక్ (Father Le Gac) అను ఫ్రెంచి మిషనరీ ఒకరు వేమన పద్యములను, వివిధ భారతీయ భాషలలోని కొన్ని ఇతర గ్రంథములను ఫ్రాంసులోని Library of Louis XV అను సంస్థకు పంపినట్లు, అవి 1731 లో జూలై 31 తేదీన అక్కడికి చేరినట్లును తెలియుచున్నది. అబే దుబాయ్ కూడ ఫ్రెంచివాడగుట వలన వేమన పద్యములను మొట్ట మొదట అక్కడనే (ఫ్రాంసు)

61. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము - కొత్తపల్లి వీరభద్రరావు; హైదరాబాదు,ద్వితీయముద్రణ-1986. పాశ్చాత్య వాణిజ్య సంఘములు : ఆంధ్రదేశ భాషా సంస్కృతులు (ఫ్రెంచివారు - పుటలు 28 నుండి 46 వరకు)

62. Ibidem; పుటలు - 37 నుండి 46 వరకు.

చూచి యుండవచ్చును.[63]

విశేష ప్రచారము పొందిన ఈ పుస్తకమును అబే దుబాయ్ వ్రాయ లేదనియు అంతకుముందు తరమునకు చెందిన జెసూట్ మిషనరీ ఎవరో ఫ్రెంచి భాషలో వ్రాయగా దానిని అబే దుబాయ్ కాపీ చేసినాడనియు అది ఆయన సొంతము కాదనియు ఈ మధ్య కాలములో ఫ్రాంసుదేశమునకు చెందిన డా॥ సిల్వియా మర్ (Dr. Sylvia Murr) సిద్ధాంతీకరించెను.*

ఈ జెసూట్ మిషనరీ ఫాదర్ లెగాక్ కావచ్చును. వేమన పద్యములు మొట్టమొదట ఫ్రాంసు పంపినవాడీయనయే! అబే దుబాయ్ తాను వేమన పద్యములను చూచినట్లు వ్రాసినాడు. వాటిని చూచినవాడు, ఫాదర్ లెగాక్ వ్రాసి కొనిన - భారతదేశమునకు సంబంధించిన- జ్ఞాపికలను, ఆయన కాగితములను కూడ చూచియుండవచ్చుననుకొనుట అసంగతము కాదు.

వేమన పద్యములు, బ్రౌనుదొరకంటె ముందే గుర్తించి పరిశీలించిన పాశ్చాత్యులున్నను, ఆయనవలె వివిధ ప్రతులు తెప్పించినవారుగాని, పాఠభేదములు పరిశీలించిన వారుగాని, పండితులచేత పరిష్కరింపించినవారుగాని, ఇంగ్లీషులోనికి అనువదించినవారుగాని ఎవరునులేరు. తెలుగు కావ్యములకు ఆయన చేసిన సేవకు సాటి ఆయన సేవయే అని మనము అనన్వయాలంకారమును ఆశ్ర యింపవలసినదే! వేమన పద్యముల సేకరణకు ఆయన చేసిన ప్రయత్నములు, భావి కాలములో ఆయన ఇతర కావ్యములను సేకరించుటకు చేసిన ప్రయత్నములకు

---

63. "...... His (Vemana's) writings, from which I have seen several extracts, appear to me to be most interesting and are distinguished by much discernment and independence........"
(Hindu Manners, Customs and Ceremonies- Abbe J.A. Dubois, 1906; page - 275)

* Indian Society and the Beginnings of Modernization 1830 - 1850 C. H. Philips and M. D. Wainwright (Editor) London, 1976 Pages - 199, 227 (R.E. Frykenberg - The impact of Conversion and Social Reform upon Society in South India)

నాంది ప్రస్తావనలు నిర్వహించిన వనవచ్చును. వేమన పద్యముల సేకరణ 1824 లోనే ప్రారంభమైనదనిన, ఆయన మనదేశమునకు వచ్చిన ఏడవ సంవత్సరము లోనే తన కర్తవ్యమును గ్రహించినా డనవచ్చును!

1829లో జరిగిన వేమన పద్యముల ప్రథమ ముద్రణకు, "ముద్రణప్రతి"ని సిద్ధముచేయుటకు, తాను తెప్పించిన లిఖితప్రతులనన్నింటిని పరిశీలింపగా 2,500 పద్యములున్నట్లు స్థూలదృష్టికి గోచరించెను. కాని, జాగరూకతతో ముందువెనుకలు పరిశీలించి పోల్చిచూడగా ఆ సంఖ్య 2,000 పద్యములకుదిగెను. ఆపద్యములు కల గూర గంపవలె నుండెను. విషయము ననుసరించిగాని, మరి ఏ నియమము నను సరించిగాని విభక్తములై లేవు. అల్లిబిల్లిగ అడవివలె అల్లుకొని యున్న ఆపద్య ముల గుంపులను విషయమును బట్టి విడదీసి వాటిని బాగుగ అర్థము చేసికొను టకు మార్గమేర్పరచెను. వీటి ఇంగ్లీషు అనువాదము 1824లో మార్చి 5వ తేదీని ప్రారంభించి 1825లో ఏప్రెల్ 21వ తేదీకి ముగించినట్లు తెలియుచున్నది. రోజు నకు సగటున ఎనిమిది పద్యముల అనువాదము జరిగినట్లు ఆయనయే వ్రాసికొనెను. మొదటి ముద్రణమునకుపయోగించు కొనిన పద్యములు ఆయన అనువాదము చేసి నవి - 693 నకు దిగెను. బ్రౌనుదొర వీటిని విషయమునుబట్టి ఐదు భాగములుగ విభజించి కూర్చెను[64]. ఇందు - మత, నీతి, అధిక్షేప, మర్మ విషయకములైన నాలుగు భాగములు, ముఖ్యమైనవి. వీటిలో దేనియందు చేరనివి ఐదవ భాగ మగు 'కలగూరగంప'లో చేర్చబడినవి. వీటిలో చివరి రెండు భాగములను (మర్మ విషయకములు, కలగూరగంప.) విడిచి మిగిలిన వాటిని బ్రౌనుదొర ఆంగ్లీక రించెను. ఇంగ్లీషులోని 'మిల్టన్' మహాకవి యొక్క 'పారడైజ్ లాస్ట్' మొదలగు కావ్యములు విభాగింపబడినట్లు; వేమన పద్యములను, మొదటి పుస్తకము (Book One) రెండవ పుస్తకము (Book Two) అని బ్రౌనుదొర విభజించెను. ప్రథమ భాగమనియు తెలుగులో కలదు. తరువాత వావిళ్ళ వారు అచ్చువేసిన పుస్తక ములో రెండవ ఆశ్వాసము, అనియు కలదు. బ్రౌనుదొర 1829 ముద్రణమున 'భాగము' అని వాడబడినది. ఈ ముద్రణము యొక్క ముఖపత్రము,

64. "I at length formed the whole into five tolerably consistent divisions - religious, moral, satirical, mystic." (The Verses of Vemana, Madras 1829; Preface)

మొదటి పుట ఈయబడుచున్నవి. నాటి తెలుగు లిపి స్ఫుటముగా బాగుగనే యుండెను.

[ముఖపత్రము] వేమన పద్యములు

The Verses

of

VEMANA,

Moral, Religious and Satirical,

Translated

By Charles Philip Brown,

of the Madras Civil Service,

Madras :

Printed At The College Press.

1829

[మొదటిపుట] వేమన పద్యములు

ప్రథమ భాగము

వేమన' నగయోగి వెలసె లోకములోన ;

పూజలి'డుడు, పుణ్య - పురుషులార ;

పూజలి'డిన యంత, భుక్తిముక్తుల ని'చ్చు

విశ్వదాభిరామ వినర వేమ.

పలుకుమ'న్న నే'ల పలుకక యున్నావు :

పలుకుమ'య్య నాతో ప్రబలముగను ;

పలుకుమ'య్య నీదు పలుకు నేనె'రిగెద. ౧.

## The Verses of Vemana

### Translation

### Book I

1. The Yogi named Vemana hath shone forth in the world; Bow to him ye men of virtue! while ye reverence him he will bestow on you sustenance and perfection, Listen O Vema, dear to the Lord of all!

2. When I cry "Speak, O God," Why speakest thou not? O speak to me and powerfully! speak O father, surely I shall recongnise thy voice!

ఈ విధముగ ముఖపత్రము, మొదటి పుట గలవు. బ్రౌనుదొర ఆంగ్లీకరించిన మూడు భాగములలోను మొత్తం 693 పద్యములుగలవు.

విభజనమిట్లున్నది : Book I - ౨౦౦ (52 pages)

Book II - ౨౧౪ (53 - 99)

Book III - ౨౭౯ (100 - 159)

---

మొత్తము - ౬౯౩ పద్యములు.

---

గ్రంథాంతమున ; మాటల పట్టిక, మొదటి పాదముల సూచిక కలవు. (Glossarial Index, Index of first lines).

ఈ ఒక్క గ్రంథమునకు ఆయన చేసిన సేవయే చాలును, ఆయనకు మన భాషయందున్న అభిమానమునకు నిదర్శనముగ చూపుటకు. ఇదంతయు, ఆయన ఉద్యోగములో చేరిన మొదటి దశలోనే జరిగిదన్న, ఆయన అభినివేశ మెంత గాఢమైనదో తెలియును. ఈ పద్యములను ఏర్చి కూర్చున్నపుడు, "అసభ్యతలేని పద్యములనే చాలవరకు చేర్చితిని" అని ఆయన వ్రాసెను. ఈ పద్యములతో కలిసి పోయిన - సుమతి, భాస్కర, తిరుమలేశ మకుటములు గల పద్యములను శుద్ధ ప్రతిని సిద్ధముచేయు నప్పుడు బ్రౌనుదొర పరిహరించెను.

వేమన పద్యములవంటి వాటినిగూర్చి వ్రాయుచు, ఇంగ్లీషులో కూడ అతి ప్రాచీన కవులిట్లు వ్రాసిరనియు - మాలికలు, శతకములు(Garlands, Centuries) అట్టి వానిని సంగ్రహ పరుచునప్పుడు ప్రత్యేకముగ నూరు, నూరు పద్యములుగ విభజించుట ఆనావశ్యకమనియు. విషయమును బట్టి విభజించుట లాటిన్, గ్రీకు మొదలయిన భాషలలో కలదనియు పీఠికలో బ్రౌనుదొర వ్రాసెను. ఈ పద్ధతిని పరిశీలించినచో ఈయన అవలంబించిన విధానము యొక్క ఔచిత్యము వ్యక్తమగును. విషయమునుబట్టి విభజించు పద్ధతి మనకు క్రొత్తగాదు. సంస్కృతములోని భర్తృహరి శతకము మొదలగునవి ఇట్లున్నవే.

పీఠికలో, బ్రౌనుదొర, వేమన కాలమునుగూర్చియు, కులమును గూర్చియు చర్చించెను ఈ చర్చను పరిశీలించినచో (ఫలితములతో సర్వదా మనము ఏకీభవింప లేకున్నను) బ్రౌనుదొరకు గల చరిత్ర జ్ఞానము. నిష్పక్షపాతబుద్ధి విదితమగును. వేమన జన్మస్థానమును గూర్చి వ్రాయుచు బ్రౌనుదొర, వేమన తన పద్యములలో ఉపయోగించిన మాండలికమును బట్టి, అతడు తెలింగాణములోని దక్షిణ-పశ్చిమ ప్రాంతము వాడని తోచుచున్నదని వ్రాసెను[65]. ఈవ్రాత మనకు రెండు విషయములను వ్యక్తముచేయును. విదేశస్థుడగు బ్రౌనుదొర, కవి ఉపయోగించిన మాండలికమును బట్టి స్థలనిర్ణయముచేయ సంకల్పించెనన్న, ఆయన మన భాషకుగల వివిధ మాండలికములను ఎంత చక్కగా పరిశీలించెనో మనకు తెలిసి ఆశ్చర్యము కలుగుట మొదటిది. వాడుక భాషలోని ప్రయోగములనుపయోగించిన కవియొక్క రచనను బట్టి, అతని ప్రాంతమును నిర్ణయింపబూనుట అను విమర్శన పద్ధతి ఏర్పరుచుట రెండవది

వేమనకు కవులలోగల స్థానమును గూర్చి వ్రాయుచు, బ్రౌనుదొర అతనిని గ్రీకు భాషలోని "లూసియన్"తో పోల్చెను. "లూసియన్" వలెనే వేమనయును జనాదరణమును చూరగొన్న కవి. భాషాభ్యాసమునకు గడంగువారికి మిక్కిలి

---

65. "Yet his dialect in few passages renders it probable that Vemana was a native of the south western parts of Telingana........" (Preface) ఇక్కడ 'తెలింగాణ' శబ్దమును తెలుగు దేశమునకంతటికి వర్తించు నర్థమున వాడెను.

ఉపయోగించువాడు. కవితలో అంత ఉదాత్తతగాని, గాంభీర్యము గాని ఉండవు అని బ్రౌనుదొర ఊహ. ఈ అభిప్రాయముతో ఏకీభవింపనివా రుండవచ్చును[66] గాని బ్రౌనుదొర నిష్కాపట్యమును శంకించువా రుండరు

వేమన పద్యములలోని "విశ్వదాభిరామ వినురవేమ" అను మకుటమును గూర్చి కూడ చర్చించి, అది అంత ఉపయోగకారి కాదనియు, అది లేకున్నను పద్యముయొక్క భావమునకు హానిరాదనియు[67] వ్రాసెను. ఈ ఆంగ్లానువాదము 1829 లో ప్రచురింపబడెను. ప్రచురింపబడినదానిలో లోపములు లేకపో లేదనియు అది ప్రాథమికమైన కృషియనియు తరువాతదానిలో చాలా మార్పులు తాను తెచ్చినట్లును బ్రౌనుదొర వ్రాసెను[68].

బ్రౌనుదొర "వేమన"ను పాశ్చాత్యుల కందరకు అందచేయుటవలన వేమన కీర్తితోపాటు తెలుగువారి కీర్తికూడ వ్యాప్తి చెందెను. తెలుగు నుండి ఇంగ్లీషులోనికి అనువదింపబడిన సుదీర్ఘమైన ప్రప్రథమ తెలుగు రచన ఇదియే అనవచ్చును. ఆంధ్రేతరులలో వేమనను గురించి వ్రాయువారికి

---

66. "This author is in Telugu what Lucian is in Greek-a familiar writer, useful to a beginner, though neither poetical nor classical." (Preface)

67. "The import of the chorus is obscure but the sense of each verse is complete without it." (Preface)

68. It was a juvenile effort, and I have since remodelled several pages." (Preface)

బ్రౌనుదొరయే ముఖ్యమైన ఆధారము[69].

ఆంగ్లములోనికి వేమన పద్యములను పరివర్తన చేయునపుడు బ్రౌనుదొర, మూలములోని భావమంతయు వచ్చినదా లేదాయని పరిశీలించినేగాని, మూలములోని భాషకు సమీపముగా తన ఆంగ్ల భాష వచ్చినదా లేదాఅని అంతగా పరిశీలింప లేదు. ఈ అనువాద సంప్రదాయము మనకు భాగవతకవుల నుండియు పరిచితమైనదియే. కేవలము ఆంగ్లానువాదమే కాక కొన్ని కొన్ని చోటుల విపులమైన శబ్దచర్చ చేయుచు పద్యములకు వ్యాఖ్యానమువంటిదికూడ వ్రాసెను. ఈ వ్యాఖ్య విదేశస్థులకు ముఖ్యముగా, మూలములోని కొన్ని కష్టములయిన పదములను, భావములను, హిందూమత సంబంధములైన విశేషములను, అర్థముచేసికొనుటకు పనికివచ్చును. కొన్ని కొన్ని తావులందు, తెలుగు పద్యములతో పోలికలు గల

---

69. ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు చెందిన డాక్టరు ఈశ్వర టోపాగారు మొదట ఉర్దూభాషలోను, తరువాత ఆంగ్లభాషలోను Saint Vemana: His Philosophy by Dr. Ishwara Topa Hyderabad Telugu Academy, Hyderabad; 1950) 'వేమన'పై పుస్తకమును వ్రాసిరి. ఆంగ్లగ్రంథమునకు ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు పీఠిక వ్రాసిరి. ఈ గ్రంథ రచనకు 'బ్రౌనుదొర అనువాదము' తోడ్పడినదని గ్రంథకర్త వ్రాసెను:

"The ignorance of the Telugu language was his (author's)first difficulty.Charles Phillip Brown's version of Vemana's verses was the only source - book that he could lay his hands upon for his studies in the exposition of the saint's philosophy."

వేమన గొప్పదనమును గూర్చి వ్రాయుచు డా॥ టోపా గారు ఇట్లనిరి. "... He (author) is quite convinced that Vemana, among the galaxy of Indian saints like Kabir, Nanak, Basava, Shah Latif, Dadu and others, was really a great saint who lived for humanising the life of man by serving the cause of divine worship."

భావములుగల ఆంగ్లపద్య భాగమును బ్రౌను దొర చూపెను.[70] ప్రసంగవశమున, తెలుగు పద్యముల భావములను పోలిన భావములుగల సంస్కృత శ్లోకములను ఉదాహరించెను.[71] బ్రౌనుదొర యొక్క "వేమన పద్యములు" ఆంగ్లానువాదమును, వ్యాఖ్యను పరిశీలించినవారికి; ఆయన బహుముఖ పాండితి స్వయం వ్యక్తమగును

కొన్ని కొన్ని శబ్దములకు అర్థవివరణ చేయునపుడు, బ్రౌనుదొర తన పాండిత్యమును వినియోగించి, క్రొత్త క్రొత్త అర్థములను చెప్పుటయు కలదు. "మరుని కళల మించి మనముc బారు" అను పాదమునగల "కళ"కు, ఇంగ్లీషులో వివిధార్థము లిచ్చి ("degree, grade, shade, tint") తరువాత వ్యాఖ్యలో, "కళ" శబ్దము తెలుగు వ్యాకరణములో కూడ వచ్చుననియు; ఇది చంద్రుని

---

70. 'బ్రహ్మమన్నిటందు పరిపూర్ణమైయుండు' అను పద్యపాదమును, "God dwells in all things in his complete fulness" అని అనువాదముచేసి, ఆంగ్ల కవియైన 'పోప్' (Pope) రచనుండి సజాతీయమైన భావముగల పద్యభాగమును బ్రౌనుదొర ఇట్లు చూపెను—

"Lives in all life, extends through all extent,

Spreads undivided, animates unspent." (Pope)

"The whole of this passage, in Pope's 'Essays on Man conveys the precise ideas entertained regarding the deity or ruling spirit, by those who hold the Vedantic creed"
(C. P. Brown

'ప్రస్తుతంపు వేళ పద్యంబు చదివిన

తప్పుc గలిగియున్న నొప్పియుండు'

"This verse appears to be translated from the following by Pandita Rayalu." (C. P. Brown)

"అవసర పఠితా వాణీ

గుణ గణ రహితాపి సహతి పరిమోదం" (Page—181

"కళ"ల ననుసరించి ("తెలుగులో బహువారు విధములైన శబ్దములకు కళలని పేరు గలదు గనుక") వచ్చియుండుననియు వ్రాసెను.[72]

"ముప్పిరి గొనునయ్య మొనసిన మోహంబు" అను పద్యపాదమున గల "ముప్పిరి"శబ్దముయొక్క వ్యుత్పత్త్యర్థమును చెప్పుచు; అది తరుచుగా భావప్రకోపమునకు ఉపయోగింపబడుననియు, "పురి" ("త్రాటి పురి") శబ్దము, "మూడు" శబ్దముతో అతిశయార్థమున వాడబడినదనియు, బ్రౌనుదొర వ్రాసినాడు.[73]

ఇటులనే, "కూడు విడిచి శతకోటి పడగలెత్తి" అను పద్యపాదమునకు ఆంగ్లానువాదముచేసి "The misers who starve themselves, and place a dragon's crest as a guard over the treasures") "కోటి పడగలెత్తి" అనుదానికి వ్యాఖ్యానము వ్రాయుచు, నిధులను సర్పములు రక్షించునను నమ్మకము లాటిన్ కవుల రచనలయందును కన్పట్టుచున్నదని ఉదాహరించినాడు బ్రౌను

---

72. "In Telugu grammar, the term cala is applied to "Sixteen classes of words, the last of which is very dubious" The reason for using this title is given in none of the grammars but I imagine it is borrowed from the calas or phases (so to call them) of the moon.... In my opinion, the calas in the grammar are all easily reducible to four or five classes instaed of sixteen.' (page—61.)

73. "Muppiri; perhaps from ముప్పురి. (from పురి a thread or strand in a cord) and mu for mudu, three: It is commonly applied in the poets to strong passions:

So—నొప్పించి పెద్ద కోపము
ముప్పిరిగొన, నాగపాశముల బంధించెన్ (Vishnu Purana VIII; 189; page-754)

దొర. ఇంతటితో తృప్తిపొందక, జక్కన కవి యొక్క విక్రమార్కుని చరిత్ర నుండి ప్రయోగము చూపినాడు[74].

"అనిమిషులకునైన దెలియదంత్యము వేమ" అను పద్యపాదమునకు ఆంగ్లానువాదమిచ్చి ("the gods themselves know not what shall hereafter happen") "అనిమిష" శబ్దమును గూర్చి వ్రాయుచు, దేవతలకు రెప్పపాటు లేదనియు, సామాన్యముగా వారు విగ్రహముల రూపమున ప్రదర్శింప బడుదురు గనుక, రెప్పపాటు లేకపోవుట సహజముగా వర్ణింపబడుననియు[75] బ్రౌనుదొర తెలిపెను. ఇది ఆయన రమణీయమైన ఊహ !

వేమన పద్యములకు వ్యాఖ్యానము వ్రాయునప్పుడు బ్రౌనుదొర ఛందస్సునకు సంబంధించిన వాక్యములును తెల్పుచు వచ్చెను. "ఓటి కుండ నీరు పోసిన విధాన" అను పద్యపాదమును గూర్చి వ్రాయుచు, దీనిలో పద్యగమనము బాగుగా లేదనియు, చిన్నఘటము నీరు చన్న చందమున", అని యున్నచో బాగుండి యుండుననియు వ్రాసెను[76]. కవి అటులనే వ్రాసినాడేమో అనెను. అటులనే పాదపూరణము కొరకు వ్యర్థములైన మాటలు కవులు వాడుట కలదనియు,

---

74. "The idea that hidden treasures were guarded by dragons occurs in several Latin authors; in particular Phoedrus. (Book IV, fable 19). It is also alluded to in the Vicramarca Charitra, a Telugu poem, written by Zaccan, in eight books; this is a work of considerable merit and particualry useful to a beginner in the language."

"అపరిమిత ధనంబులను వ్రాలు పడగలు

గట్టు వైశ్యజనము పట్టణమున" (I; 77.) [Page—122]

75. "Animisha; a god literally, one whose eyelids do not move : The gods are represented by statues or pictures; the eyelids of which or of course fixed; and this name I imagine to originate in that circumstance". (Page—18)

76. "The Rhyme in this line is evidently wrong. Possibly the author wrote చిన్నఘటము నీరు చన్న చందనమున".(Page-18)

ధాత్రిన్, మహిలో, భూమి, మరి, వినరా, జూడర మొదలైన మాటలు కలవనియు బ్రౌనుదొర వ్రాసెను.[77]

తన మాతృభాష యందును, ఇతర పాశ్చాత్య భాషల యందును మంచి పండితుడైన బ్రౌనుదొర, తెలుగు పద్యములకు అనువాదమును మంచి నేర్పుతో చేసెను. అయన అనువాదము శబ్దానువాదమనుటకంటె, భావానువాదమనుట లెస్స. అట్లని, మూలములోని ముఖ్యమైన మాటలకు శబ్దానువాదము లేదని కాదు. దీనిని నిరూపించుటకై కొన్ని ఉదాహరణలను చూపుచున్నాను:

> అత్మశుద్ధిలేని యాచార మదిమేల?
> భాండశుద్ధిలేని పాక మేల?
> చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా ? వి॥

అనువాదము—

"Observances void of purity of heart ! to what end are they? to what end is the preparation of food without cleaning the vessel? Void of purity of mind, to what end is the worship of God?

> పెట్టిపొయ్యలేని వట్టి నరులు భూమి
> పుట్టనేమి? వారు గిట్ట నేమి?
> పుట్టలోన చెదలు పుట్టవా గిట్టవా? వి॥

అనువాదము—

"Profitless are those men, who will bestow neither meat nor drink; What though they be born in the world? What

---

77. తనరుచున్న రెంటి స్థలమేల తెలియరు. "The word తనరు is here only a పాదపూర్ణక, being inserted merely to fill the metre (Page - 88) "The words యిల, ధాత్రిన్, మహిలో, or భూమి are often used in this author to fill up the metre. So also the words మరి, వినరా, జూడరా, etc." (Page—15)

though they die? Are not the white ants of the hillock also born? and do they not die also"?

ఈ పద్యమందలి మొదటి పాదము యొక్క అనువాదము ను బ్రౌనుదొర ఆంగ్ల సంప్రదాయానుసారము చేసినాడనుట గ్రహింప వలసిన విషయము.

మాయను చెరసాల, మనసను గొలుసౌను:
భేదమనెడు బొండ బెరసియుండు:
ఇట్టి బద్ధజీవి కెన్నడు మోక్షంబు ? వి॥

అను పద్యమును చాల సొగసుగా, సంప్రదాయానుసార మిట్లు అనువదించెను:

"We are imprisoned in delusion; our inclinations are as chains; empty distinctions are the shackles attached to us; When shall be the deliverance from this life of bondage?

ఇక, వేమన పద్యపాదములలో బహుళ ప్రచారమున నున్న వాటిలో కొన్నింటికి బ్రౌనుదొర చేసిన అనువాదములను చూపుచున్నాను:

బ్రతుకుచెల్ల తమకు బ్రహ్మకల్పంబులా?
("Shall our life be to us as the eternity of God?")

కంచు మోగినట్లు కనకంబు మోగునా?
("Consider, Will gold ring like bell-metal" ?)

కులములో నొకండు గుణవంతు డుండెనా?
("If there in a tribe one of excellence' )

ఓగు నోగు మెచ్చు
("The vile countenances (or applauds) the vile")

పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా?
("The swine delights in mud, will it take pleasure in rose water?")

బైట కుక్కచేత భంగపడును
స్థాన బలిమిగాని. తన బల్మి కాదయా
("But out of the stream it is discomfited even by a dog. It's might then is local, not individual."

పరిగె యేరినట్లు
("...gather mere gleanings")
కొలకులింకెనేని కొంగలందుండునా
("If the pond is dry, will cranes remain in it?")
పొసగ మేలు చేసి పొమ్మనుటే చావు
(".... this is death to him")

వేమన పద్యములలో బ్రౌనుదొర అంగీకరించిన "పాఠములు" కొన్ని చాల సొగసుగా నున్నవి. ఈనాడు ప్రచారములో నున్న పాఠముల కంటె రమణీయము లవి. ఉదాహరణగా- "పొసగ మేలు చేసి పొమ్మనుటే చాలు" అని నేడు ప్రచారములో నున్నది గదా! బ్రౌనుదొర పాఠము "పొసగ మేలు చేసి పొమ్మ నుటె చావు" అనునది. 'లు' ను 'వు' గా కూర్చుటలో ఎక్కడలేని తీక్ష్ణత ఆ ప్రయోగమునకు వచ్చినది! మన పురాణగాథలనుండి ఉపమానములు, ఉదాహరణ ములు ఉన్న పద్యముల అనువాదములో బ్రౌనుదొర తీసికొనిన శ్రద్ధను బట్టి వాటినన్నింటిని ఆయన చక్కగా - పండితుల తోడ్పాటుతో - అర్థము చేసికొని నట్లు మనకవగతమగును. ఉదాహరణగా "కొండ రేడు మామ, కొండ కూతురు యాలు, కొండయిల్లు, పసిడికొండ విల్లు" అను దానిని గ్రహింతము. దీనిలోని పౌరాణిక విషయములన్నియు తెలిసికొనెను గనుకనే అనువాదము చక్కగా నిట్లు చేయగలిగెను:

"The king of hills (Himavat) is his father-in-law, the daughter of the hill (Parvathi) his wife, a hill Kailas is his home; and gold hill, Meru, his bow..."

"గువ్వకొరకు మేను గోసిచ్చి శిబిరాజు
వార్తకెక్కె చాల వన్నె కెక్కె
యోగు నెంచబోడ యుపకారి నెంతురు, విశ్వదాభి."

"King Sibi cut a piece out of his body to give for a dove to a hawk. He became the topic of report and attained

fame. They will not esteem him who is wicked, but will praise him who is charitable"

ఈ విధముగా చూపుచు పోవచ్చును. ఈ అనువాదములలో కొన్ని చోట్ల మూలములోని సొగసు వచ్చినట్లు తోచదు. కొన్ని చోట్ల చక్కగా కుదిరినట్లు ఉండును. ఈ వ్యత్యాసమునకు ముఖ్య కారణములు రెండు ఆంగ్లాంధ్రభాషల నిర్మాణమున గల భేదము, ప్రాక్పశ్చిమముల భావనా సద్ధతులలో తేడా అనునవి ఈ రెండింటిని మనస్సులో నుంచుకొనినప్పుడు, బ్రౌనుదొర పడిన శ్రమకు సముచితమైన గౌరవ మీయగలము.

1829లో తన ఆంగ్లాను వాదముతో వేమనపద్యములను బ్రౌనుదొర ప్రచురించినను దానితో తృప్తిపడి కూర్చుండలేదు. వేమన పేరు మీదుగా వేలకొలది పద్యములు లభించుచుండగా తాను ప్రచురించిన 693 పద్యములతో ఎట్లు తృప్తి పడగలడు? లభించిన పద్యములకు పండితులచేత పరిష్కరణచేయించుచునేయుండెను. వారు పండితులు కావచ్చును గాని పరిష్కరణ విధానమున తన అభిప్రాయములు వారివి కాక పోవచ్చును. వారి దృష్టికి తన దృష్టికి - వేమన పద్యముల ప్రాముఖ్యము విషయము మొదలుకొని పరిష్కరణ పద్ధతి వరకు—చాల భేదముండునని, ఉన్నదని తనకు తెలియును గనుక వారికి పని అప్పగించి నిర్లిప్తుడై నిరీక్షణ సాగింపలేదు. 1834లో జనవరి 2వ తేదీన తన పండితుడైన పైడిపాటి వెంకట నరసయ్య గారికి వ్రాసిన జాబును బట్టి ఈ విషయము తెలియుచున్నది. వేమన పద్యములు చదివిన కలుగు భాషా జ్ఞానమేమి? అని మనపండితులు ప్రశ్నించుకొని తటస్థులైయుందురని ఆయనకు తెలియును గనుకనే ఈ జాబు ప్రారంభముననే తనకు వాటి మీద నున్న అభిమానమును ఇట్లు తెలిపెను :

"వేమన పద్యములను గురించి మీరు యెంత దూరం జర్గించినారో ఆ సంగతి తెలియ చేయవలసినది. యిది యిబ్బు కార్యం అయినా సరె దీని మీద నాకు బహు దయ కలిగినట్టు విచారించి తొందరపడి తీర్పు చేస్తూ రావలసినది."[78]

---

78. బ్రౌను లేఖలు. పర్యవేక్షణ : జి.ఎన్. రెడ్డి ; సంశోధన : బంగోరె; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి; ఫిబ్రవరి 1977; పుట– 65. (మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోని బ్రౌనుదొర జాబుల సంపుటము, ఎమ్. 401; పుటలు 185-187.)

బ్రౌనుదొర పోష్యవర్గములోని పండితులు ఆయన "దయ"కు విరుద్ధముగా ఏ పనియు చేయరుగదా! ఇది తెలిసియే బ్రౌనుదొర ఇట్లు వ్రాసెను. ఈ వ్రాతలో "పండితులైన మీకు వేమన పద్యములు నచ్చినను, నచ్చకున్నను, నాకు నచ్చినవి గనుక పని సాగింపవలసినది" అని వ్యక్తమగుచునే యుండెను. పద్యముల "తీర్పు" సమయమున సంశయములు కలిగినచో వాటిని ఉపేక్షింపక ఆవిషయమును తెలుప వలసినదని ఈ జాబులోనే ఇట్లు వ్రాసెను :

" ప్రతి భేదములలో లేనష్టువంటి శబ్దమైనా వ్రాయించడానికి మాకు యంత మాత్రం ఆపేక్ష లేదు గాని, అట్లా వ్రాయవలసిన అవసరం వస్తే పక్కను తోచిన తీర్పు లేక సందేహము అనే మాటలు వ్రాయిస్తూ రావలెను. వేరే కొండొక చోట యీ పద్యములు మహా అసాధ్యంగా వున్నది. భావం స్ఫుటం కాలేదు. తోచినమట్టుకు యేర్పరచుతున్నామని యిష్టు వంటి షరాలు వ్రాస్తూ రావలసినది."

వేమన పద్యముల ప్రచురణ (1829)కు ముందే మన ఛందశ్శాస్త్రమును బాగుగా నభ్యసించి 1827లోనే 'ఆంధ్రగీర్వాణచ్ఛందము' ప్రకటించియుండుటచే. వేమన పద్యములలో ఛందస్సునకు సంబంధించిన సమస్యలు పొడగట్టినప్పుడు వాటిని పరిష్కరింప గలిగిన శక్తిని కూడ బ్రౌనుదొర గలిగియుండెడి వాడనుటకు తార్కాణముగా పైడిపాటి వారికి వ్రాయించిన జాబులోని క్రింది వాక్యములను గ్రహింపవచ్చును:

"కొన్ని పద్యములందు 5, 6, 8 చరణములువుంటే సరి యెన్ని కలిగినా తగిలించి అందులో వుండరాని చరణములకు షరా పెట్టవలసినది. వేదములన్నీ వాదములు సుమ్మీ అనే పద్యం పిచ్చి తప్పులతో వున్నట్టు గుర్తెరిగివున్నాము. అది వక గణంగా లేనందున వచనంగా యేర్పరచుకొని 10,12 చరణములుదనుకా సాగినాసరి. గాని యీ పద్యము నాకు వక దర్వు మర్యాదగా వున్నదని తెలుస్తుంది. దీని వక న్యాయం తేలలేనందున ఆయిన మట్టుకు కొంచం దిద్ది వ్రాయించినామని షరా వ్రాయించవలసినది. "

మన ఛందస్సునకు సంబంధించిన పరిజ్ఞానము, అవగాహన పూర్ణముగ ఉన్నవి గనుకనే, "పద్యము నాకు వక దర్వు మర్యాదగా వున్నదని తెలుస్తుంది' అని బ్రౌనుదొర చెప్పగలిగినాడు!

శ్రమపడి డబ్బు ఖర్చుపెట్టి వివిధ ప్రాంతముల నుండి లిఖిత ప్రతులను తెప్పించి పండితుల చేత పరిష్కరింపించుచున్న బ్రౌనుదొరకు ఈ ప్రతుల ప్రాముఖ్యము తెలియును గనుకనే వెంకటనరసయ్య గారికి వ్రాసిన జాబులో వాటి విషయమై తీసికొనవలసిన జాగ్రతల నిట్లు తెలిపెను:

"నడుమ నడుమ తగిలించిన కాగిదములు విరిగిపోకుండా పడిపోకుండా మహాపదిలంగా చెయ్యవలశినది. యేయే సెక్షన్ పని అయిపోయిందో అది చెడి పోకుండా ప్రత్యేకంగా దాచి పెట్టవలసినది యీ చిత్తు గ్రంథము మాకు ముఖ్యమైన దస్తావేజు అవుతూవున్నది గనుక యిది పడిపోతే తిర్గి వకనాటికి కుదరవు. అయినమట్టుకు యెత్తి వ్రాసిన గ్రంథం పునహాసరి చూచుకొని జూలూరు అప్పయ్య శాస్త్రికూడా చిత్తులమీద ద్రిష్టివుంచి పునహా పరిష్కారం చెప్పుతూ రావలసినది. తరువాత మీరుయిద్దరు పరిష్కరించిన గ్రంథం యిక్కడికి పంపించవలసినది. కాని నష్టపడకుండా దానికి రెండు ప్రతులు పుట్టిస్తూ రావలసినది. మరిన్ని యిందులో కష్టమైన పద్యములు వస్తే వాటి అర్థం మీరు తలుచుకున్న వెంటనే కొద్ది వకటీక తగిలించవలసినది."

ఈ వాక్యములను బట్టి ఈ పనిమీద ఆయనకున్న శ్రద్ధ స్వయంవ్యక్తమగును. ప్రతి స్వల్పాంశమును గుర్తించుకొని వ్రాయించుట చూడగా, ఆయనకు మన పండితుల పాండిత్యము మీద ఉన్నంత నమ్మకము, వారు లిఖిత ప్రతులను భద్రపరచెడి విషయమున లేదనిపించును! ఇదిగాక, "వేమన పద్యముల విషయమున ఇంత శ్రద్ధ ఏమిటి!" అని కూడ వారి మనస్సులలో ఉండవచ్చునను సంశయము బ్రౌనుదొర కుండి యుండవచ్చును.

పండితులు "తగిలించవలసిన టీక" విషయమున కూడ బ్రౌనుదొరకు నిశ్చితాభిప్రాయములున్నవి. జనబాహుళ్యములో విశేష ప్రచారమునను‌న్న వేమన పద్యములకు టీక, పండితజనైక వేద్యములైన కావ్యముల టీకవలె నుండరాదని ఆయన భావము. అట్టి కఠిన కావ్యముల టీకలే సులభ సుందరముగనుండవలెనను భావము ఆయనకు మొదటి నుండియు నుండుటచేతనే, వసుచరిత్రకు 1829- 830 ప్రాంతమున ములుపాక బుచ్చయ్య శాస్త్రిగారు తన కోరిక మీద వ్రాసిన వ్యాఖ్య కఠినముగ నుండుటచే కాబోలు దానిని మెచ్చక 1832-1834 నడుమ జూలూరి అప్పయ్య శాస్త్రి గారిచే తిరిగి వ్యాఖ్య వ్రాయించి దానిని ముద్రించెను (ఈ పరిశోధన గ్రంథములో పుటలు - 152, 153). ఇందువలన, వెంకట

నరసయ్య గారికి 1884లో వ్రాసిన ఈ లేఖలో వేమన పద్యములకు టీక ఎట్లుండవలెనో తెలిపెను :

"యిటు పిమ్మట సర్వ గ్రంథములకు మహా సులభమైన వక వ్యాఖ్య అల్లించేటందుకు బుద్ధి వున్నదిగాని ప్రస్తుతం కష్టపద్యములకు మాత్రం అల్లించినా ప్రతిదానికి మీరు అల్లించినా మాకు సంతోషమౌను. యిది గ్రామ్యోక్త గ్రంథం అయినా సరే. అనేక పద్యముల యందు కవియొక్క తాత్పర్యం బోధపడడము మహా ప్రయాసగా వున్నది గనుగ టీక అవస్యంగా వుండవలశినది. మెట్టుకు ప్రబల కావ్యములందు కావలసిన భక్కిక వేరు. దీనిదివేరు. అనగా శబ్దమునకు శబ్దము యంత మాత్రం అల్లించకుండా తేలే తాత్పర్యం మాత్రం చెప్పుకుని అపురూప శబ్దములు తాత్పర్యం బోధ చేస్తే చాలుతుంది."

ఇంక వేమనపద్యములలోని గూఢతత్త్వముల విషయమైకూడ బ్రౌనుదొరకు నిశ్చితాభిప్రాయములున్నవి. అవి ఆయనకు అనావశ్యకములు. "నిరర్థకపువిద్యలు" అయినను వాటిని "దాట వెయ్యడం మంచిది గాదు గనుక" గ్రంథావతారికలో వాటి చర్చ కొంత చేసిన చాలునని ఆయన భావము. ఈ లేఖలోనే ఈ విషయమై నిష్కర్షగ ఇట్లు వ్రాయించెను :

"పైగా గూఢతత్త్వ పద్యములందు కళలు బెళుకులు నాదములు యిత్యాదులై ప్రసంగములు చెప్పేటప్పుడు యీగూఢ తత్త్వనిర్ణయములు టీకలో విశదపరచేటందుకు మాకు యంత మాత్రం జరూరులేదు. అనగా సాధువులు గ్రహించవలసిన మాత్రం బోధపరచి లేనిపోని నిరర్థకపు విద్యలు టీకలో పరిష్కారం చేయించేటందుకు మాకు అవసరం లేదు. అయితే యిది యావత్తు దాటవెయ్యడం మంచిదిగాదు గనుక గ్రంథముకు అవతారిక రచియించుకొని అందులో వృత్త సంభాషణ మాటలతో యీ తత్త్వశాస్త్రం మరియాదలు విశదపరిచితేచాలుతవి."

ఈ జాబుకు వ్రాసిన "తాజాకలం"లో ఇట్లున్నది. "కంథం నృసింహాచార్యులతో చెప్పవలసినది ప్రస్తుతం రాఘవ పాండవీయ్యముక్కు వ్యాఖ్య పుట్టించవలసినది."

1884 జనవరి 8వ తేదీన వ్రాయించిన పై జాబు తరువాత ఫిబ్రవరి 16వ తేదీన బ్రౌనుదొర, వేమన పద్యముల విషయమై ఇంకొక జాబు పైడిపాటి వెంకట నరసయ్య గారికి వ్రాయించినట్లున్నది. దానికి జవాబుగా, "తమ కాలీజా నవుక

రయ్ని పైడిపాటి వెంకట నరసయ్య వ్రాసుకున్న అర్జీ విన్నపం..."అని"మహా రాజశ్రీ సీ. పీ. బ్రౌను యిసోక్వియరు ధొర వారి సముఖమునకు...." పైడిపాటి వారు ఫిబవరి 19వ తేదీన ఇట్లు వ్రాసిరి :

"యేమంటే ది 16 ఫెబ్రేవరు తారీఖున తమరు దయచేయించిన హుకుము అందిఅందుల సంగతులు గ్రహించినాను. వేమన పద్యములను గురించి యిదివరకు యెన్ని పద్యములు తీర్పు అయినవో ఆవైనం వ్రాయవలశినదనిన్ని తీరిచే యడల కఠినంగా వున్న పక్షమందు ఆయాయి పద్యముకు ఫలానా హేతువు చాత తీర్పు చాయలేదని పరాలు వ్రాయవలశినదనిన్ని వ్రాయించినారు."

"యిదివరకు 12 వందల పద్యముల పరియంతం తీర్చినాను. యెక్కడ నైనా అర్థం సందర్భంగా వుండకుండా మిక్కిలి కఠినమని తోచ్చి పక్షమందు ఫలానా హేతువచేత యీ పద్యం తీర్చకుండా నిలపడమైనదని పరాలు వ్రాస్తూనే వున్నాను. సదరహీ నేను తీర్చిన పద్యములలో యీ దినం వరకు 200 పద్యముల పరియంతం అప్పయ్య పండితులుగారు చిత్తు ప్రతి కూడా దగ్గర వుంచుకొని సాపు తీర్పు చేశినారు. అప్పయ్య పండితులుగారు వకపూట వసుచరిత్రకు టీక చాయడమున్ను వకపూట యీ పని జరిగించడం అయినందున్ను దినానికి 10-20 పద్యములు తీర్పు ఆవుతూవున్నది."

"అయ్ను వసుచరిత్ర ఆరో ఆశ్వాసం ఆరంభించి టీక చేస్తూవున్నారు. కంభం నరసింహాచార్యులు గారున్ను తమశెల్వు ప్రకారం రాఘవపాండవీయం ప్రతిపదటీక ఆరంభించి జరిగిస్తూవున్నారు. యీమట్టుకు వక ఆశ్వాసముకు టీక చాయడం అయినది గనుక యీసంగతులు చిత్తానకు విశదం కాగలందులకు విన్నపం వ్రాసుకున్నాను, దివ్యచిత్తానకు తేవలెను."

ఈ జాబులవల్ల వేమన పద్యముల అర్థవివరణమునందు జూలూరి అప్పయ శాస్త్రిగారు బ్రౌనుదొరకు సాయపడినట్లు తెలియుచున్నది. ఇదిగాక, 1834 ఫిబ్ర వరి 19వ తేదీ నాటికి జూలూరి వారు వసుచరిత్ర ఆరవ ఆశ్వాసమునకు టీక వ్రాయుచుండినట్లు తెలియుచున్నది. 1844లో అచ్చయిన వసుచరిత్ర గ్రంథాంత మున. "ఆన ౧౮౩౪ సకవత్సరం యేప్రల్ నెల ౯వది చార్లిస్ ఫిలిప్ బ్రౌన్‌దొర గారి ఉత్తర్వు చొప్పున వసుచరిత్ర ఆరు ఆశ్వాసములకున్ను జూలూరి అప్పయ్య పండితులు యీ ప్రతిపదటీక వ్రాయడమైనది." అని కలదు. దీనిని బట్టి ఫిబ్రవరిలో

ఆరంభింపబడిన ఆరవ ఆశ్వాసపు టీక ఏప్రెల్ 5వ. తేదీ నాటికి ముగిసినదన వచ్చును. (ఈ పరిశోధన గ్రంథములో పుట-151)

కంభం నరసింహాచార్యులు గారు రాఘవపాండవీయమునకు టీక వ్రాయుచుండినట్లును ఈ టీక 1834 ఫిబ్రవరి 19వ తేదీ నాటికి (అనగా ఈ జాబు వ్రాయునాటికి) ఒక ఆశ్వాసము పూర్తి అయినట్లు కూడ దీని వలననే తెలియుచున్నది. ఈ కంభం నరసింహాచార్యులు గారి ఇంటి పేరు వంగీపురం. కంభంలో నివసించుటవలన "కంభం" కూడ ఇంటి పేరు వలె వాడుట జరిగిన దనచ్చును. ఈ ఆచార్యులు గారే 1830 జూలై 2వ తేదీని బ్రౌనుదొరకు వ్రాసిన జాబులో "తమ ఆశ్రితుడు కంభంలో వుండ్డె వంగివురం నృసింహాచార్యులు అనేక సలాములు చేసి" అనుటను బట్టి ఈ విషయము స్పష్టమైనది. ఆనందతంత్రమునకు కూడ ఈయనయే టీక వ్రాసి బ్రౌను దొరకు పంపించినాడు. (ఈ పరిశోధన గ్రంథములో పుటలు - 173, 174) ఈయన కూడ బ్రౌనుదొర ఆశ్రితుడే. 1830లో వ్రాసి కొనిన జాబులో "మహారాజ రాజశ్రీ సి.పి. బ్రౌన్ యిస్కోయర్ అశిస్టాంట్టు జెడిజి ధొరగారి సముఖానకు-తమ ఆశ్రితుడు....'' అనిన ఆచార్యులుగారు, 1834 మార్చి 18వ తేదీని వ్రాసినజాబులో "తమ కాలేజీ పండితుడు కంభం నరశింహాచార్యులు అనేక నలాములు చేసి వ్రాసుకున్న అర్జీవిన్నపం" అన్నాడు. ఈ విధముగా తన పాండిత్యము చేత బ్రౌనుదొరను మెప్పించి "కాలేజీ పండితుడు" అయినాడు నరసింహాచార్యులు గారు. ఈ జాబులోనే "యీ మధ్య పైడిపాటి వెంకట నరసయ్య పేరట వేమన గ్రంథమును గురించి వ్రాయించిన హుకుములో నన్ను రాఘవ పాండవీయానకు టీక జరిగించవలశ్నిదని ఆజ్ఞ అయివున్నది గనుక నద రహీ గ్రంధం ప్రారంభించి రెండో ఆశ్వాసములో అరువై పద్యముల వరకు ప్రతి పద్యముకు రెండు అర్థములు విశదముగా యేర్పడే లాగున జరిగించ డమయినది. యీ రాఘవ పాండవీయానకు వేరే ప్రతులు యిక్కడ హాజరు లేనందున మరివక పరిశుద్ధ ప్రతి కూడా సంపాదించడమైనది. ఆనందతంత్రం టీక సమగ్రం జరిగించడానకు అప్పట్లో ఆ తరహా కాగిదములు హాజరు లేనందున్న పని నిలిచి వుండగా సదరహి హుకుము ప్రకారము రాఘవ పాండవీయం ప్రారంభించి జరిగించ డమయినది...."

ఈ ఆచార్యులుగారు ఏప్రెల్ 7వ తేదిని (1834) వ్రాసిన లేఖలో-వసు

చరిత్ర వ్యాఖ్య, వేమన పద్యములు, రాఘవ పాండవీయ వ్యాఖ్య ప్రస్తావన లిట్లున్నవి:

"ప్రకృత మందు జూలూరు అప్పయ్య పంతులు గారు చేసే వసుచరిత్ర టీక 6 అశ్వాసములకు సమగ్రంగా అయినది. అప్పయ్య పంతులుగారు వెంకట నరస్సయ్య గారు కూడా వేమన పద్యముల తీర్పు జరిగిస్తూవున్నారు. నేను చేశే రాఘవ పాండవీయం టీక రెండో ఆశ్వాసం 80 పద్యముల మట్టుకు అయినది. ఈ గ్రంథంస్వల్పం ప్రతులు వుండడమున్ను ప్రాచీనవ్యాఖ్య అతి సూక్ష్మమున్ను నిండా స్ఖాలిత్యములు గనుక కొంచెం ఆలశ్యంగా జరుగుతూ వున్నది గనుక దివ్య చిత్తానకు విశదం కాగలందులకు విన్నపం వ్రాసుకున్నాను."

ఈ జాబులనన్నింటిని బట్టి వేమన పద్యముల విషయమున బ్రౌనుదొర తీసికొనిన శ్రద్ధ తెలియుచున్నది. 1829లో ఆంగ్లానువాదములో వేమన పద్యములను (Verses of Vemana) ముద్రించినను తృప్తిపడక క్రొత్త పద్యములను సేకరించుచునేయుండెను. ఈ సేకరణ, పరిష్కరణల పర్యవసానమే 1889 లోని ప్రచురణ. బ్రౌనుదొర సేకరించిన వేమన పద్యములు పదులకొలది సంపుటములు కాగా వాటిలో నుండి కొన్నింటిని ఏరి అనువదించి ప్రకటించెను. ఆయన సేకరించి భద్ర పరచిపోయినవి "సుమారు ఏబది వ్రాత ప్రతులను జూచితిని.... అని రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు వ్రాసిరి [79] 1967లో బ్రౌనుదొర ఇంగ్లీషు అనువాదములో వేమన పద్యములను (Verses of Vemana) ప్రచురించిం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారు, మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో నవంబరు డి. 1774 వ్రాత ప్రతిని ఆధారముగా గ్రహించిరి. దీనిలో 1215 పద్యములున్నవి. వీటిలో - అటవెలదులే కాక కందములు, వృత్తములు, సీసములు కూడ నుండుట విశేషము "కవిస్తోత్రము, వేమన జ్ఞాన మార్గ పద్యములు, చిల్లర భాగము, ఉపభాగము" అను విభాగములు ఈ ముద్రణమున

---

79 వేమన - రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ; ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణ, వాల్తేరు (ప్రథమ ముద్రణ, 1929. ద్వితీయ ముద్రణ, 1945. పుట-12)

కనబడుచున్నవి. ఇంచుమించుగా యథాతథముగ దీనిని ముద్రించినట్లు ముద్రాపకులు వ్రాసిరి.[80]

ఈ ప్రతికి, 1824లో నవంబరు 28వ తేదిన బ్రౌనుదొర ఒక పీఠిక (Preface) వ్రాసెను. దీనికిని, 1829లో అచ్చయిన వేమన పద్యములకు వ్రాసిన పీఠిక (Preface) కు భేదములు చాల గలవు. పద్యముల సంఖ్యలో, ఎన్నికొన్న పద్యములలో కూడ చాల భేదములు కన్పట్టుచున్నవి. దీని పీఠికలో బ్రౌనుదొర తెలుగు భాషను గురించి. వేమనను గురించి, తన గురువులను గురించి వ్రాసిన వాక్యములు (ఇవి 1824లో వ్రాసినవి. అప్పటికి బ్రౌనుదొర మనదేశము వచ్చి (1817) ఏడు సంవత్సరములు మాత్రమే అయినది.) మనకు చాల ముఖ్యమైనవి. ఇవి ఈయన అవగాహనకు, సత్యసంధతకు, జాత్యహంకారము లేకుండుటకు నిదర్శనములనవచ్చును. తాను పాలకవర్గమునకు చెందిన వాడనను అహంకారము కనపడదు. మనలను, మన సాహిత్యమును పొగుడుట తెగడుటలు రెండును అయన వ్రాతలలో కనబడుచున్నను వాటి వెనుక సత్యనిష్ఠయే కనపడు ననవచ్చును. మెచ్చుకొనవలసిన చోట మనలను, మన సాహిత్యమును మెచ్చుకొనెను. ఆయనకు నచ్చని చోట నిస్సంకోచముగ ఆ విషయమును వ్యక్తము చేసెను. తెలుగు భాషా సాహిత్యములను గురించి ఇట్లు వ్రాసెను:[81]

---

80. "The present edition, with about 1220 stanzas, contains the Telugu original along with Brown's English translation and is based on manuscript No.D. 1774, available with Government oriental Manuscripts Library Madras. The manuscript is published almost un edited in order that the readers may note the exact readings prepared by Brown. A few verses have been omitted as they are indecent and of doubtful authorship" (Verses of Vemana-in the Telugu original with English rendering by C.P. Brown; Andhra Pradesh Sahitya Akademi, Hyderabad; First Edition 1967. Second Edition 1977. Publisher's Note.)

81. Ibidem ; Preface to Vemana, page I.

"Telugu is a principal language of the peninsula of India. It is anciet; and has been highly cultivated, The nation of the Telugus was in former times very powerful, and its princes gave considerable encouragement to Literature. The works of its ancient poets are numerous and very voluminous. It possesses a very scientific grammar, and a system of prosoday nearly as highly polished as that of the Grecks. In this and some other respects the language is aeknowledged to be more difficult than Sanskrit."

"It is peculiarly smooth and elegant in its sound, and the poets have cautiously preserved its euphony. Hence Europeans have called it the Italian of India..."

దీని తరువాత, సంస్కృతమునకును తెలుగుకునుగల సంబంధమును గూర్చియు, ఇంగ్లీషు భాషా సంపన్నతతో పోల్చియు కొన్ని వాక్యములు వ్రాసెను.[82]

"With Sanscrit it is closely connected; as closely as English is with Latin. But at the same time it is as truly original and nearly as, ccpious as English. Like English it has borrowed its scientific terms from another tongue; and these Sanscrit additions are daily increasing. Thus the language is becoming less pure."

ఇక్కడ, సంస్కృతమునకు తెలుగునకును గల సన్నిహిత సంబంధమును ఇంగ్లీషు లాటిన్ భాషల సన్నిహిత సంబంధమును పోలినదని బ్రౌనుదొర వ్రాసినను; తెలుగు సంస్కృతములకు జన్యజనక సంబంధమున్నదని గాని, ఒకే భాషా కుటుంబమునకు - ఇంగ్లీషు, లాటిన్‌లవలె - చెందినవనిగాని బ్రౌనుదొర భావించినట్లెంచనక్కరలేదు. అప్పటికప్పుడే (1816, 1817) కాంబెల్, విలియమ్ బ్రౌన్‌లు తమ వ్యాకరణములలో తెలుగు సంస్కృత భాషాజన్యము కాదని వ్రాయుటయు, ఎల్లిస్ వ్రాసిన "నోటు"(ఇది కాంబెల్ తెలుగు వ్యాకరణములో

82. Ibidem.

ముద్రితమైనది)[83] నందుకూడా ఈ భావమే ఉండుటయు బ్రౌనుదొరకు తెలియ దనుకొనుటకు వీలులేదు. తప్పక తెలియును. సంస్కృత శబ్దములు తత్సమ తద్భవ రూపముల విశేషముగా తెలుగులో ప్రయుక్తములగుటను బట్టి అట్లు వ్రాసెనను కొనవచ్చును. దేశీయ విద్వాంసులు తెలుగును సంస్కృత జన్యముగా గ్రహింతురని కూడా బ్రౌనుదొరకు తెలియకపోలేదు.

తన కాలమునాటి తెలుగు భాషా సాహిత్యముల, వివిధ శాస్త్రముల స్థితిగతులను గూర్చి కూడ ఈ పీఠికలో వ్రాసెను.[84]

"During the eighteenth century, the incursions of the Mohamedans effectually crushed the literature of Telangana; it has fallen low; and the colloquial dialect has become equally corrupt - men are now rarely met with among them who can read or explain the classical authers of the language; knowledge of prosody is yet more rare"

"Twentyfive years of peace in Telangana under the British government have now afforded opportunities for some revival of literature.The establishment of the Honourable Company's College at Madras, and the encouragement there held out to good scholars in the language may have effected some revival; but much remains to be done. No poem or classical composition in Telugu has hither to been

---

83. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము - కొత్తపల్లి వీరభద్రరావు, హైదరాబాదు, 1986. పాశ్చాత్యుల భాషాసేవ - దాని ప్రభావము; పుటలు - 120, 121, 122, 123, 124, 125)

84. Verses of Vemana - in the Telugu original with English rendering by C.P. Brown; Andhra Pradesh Sahitya Akademi, Hyderabad; First Edition 1967; Second Edition 1977. Preface to Vemana, Pages - I, II.

printed: and I believe no translaaion of a classic into English has been attempted."

ఈ వాక్యములవలన ఆనాటి భాషా సాహిత్యముల, శాస్త్రముల స్థితి గతులు తెలియటమేగాక, మద్రాసులో కంపెనీవారు కాలేజి పెట్టుటవలన "తెలుగు అధ్యయనము" ఎట్లు కొంత అభివృద్ధికి వచ్చెనో తెలియుచున్నది. బ్రౌనుదొర తెలుగు ప్రాంతమునంతటిని "తెలంగాణ" అని వ్యవహరించుట గమనింపవలసిన విషయము. ఆనాడు ముస్లిమ్‌పాలకులిట్లే పిలుచుచుండినట్లు తెలియుచున్నది. ఇదిగాక కొందరు పాశ్చాత్య చరిత్రకారులు తెలుగుప్రాంతమును "తెలంగాన" లేదా "గోల్కొండ" అని పిలుచుటకూడ కలదని బ్రౌనుదొర తన "సాహిత్య జీవితచరిత్ర"లో వ్రాసెను. (ఈ పరిశోధన గ్రంథములో పుట - 61) తెలుగు ప్రాంతమంతయు, ఇంచుమించుగా, గోల్కొండ కుతుబ్‌షాహి నవాబుల ఏలుబడిలో నుండుటచే ఆనాడు తెలుగునాడునకు ఆ పేరు ప్రచారమున నుండియుండ వచ్చును.

వేమన జీవితచరిత్రను గురించి, ఆయన తాత్త్వికసిద్ధాంతమును గురించి బ్రౌనుదొర ఇట్లు వ్రాసెను.[85]

"Of his history, little is known. He was not a Bramin but a Capoo, or farmer; a native of the Cuddapa district and born, I believe, in the neighbourhood of Gandicota. He lived in the beginning of the eighteeth century ... Many verses, however, prove satisfactorily that he wrote in the latter part of the seventeeth century when the Mohamedans were governors of that part of India. His family was powerful but he renounced the world and became a Sanyasee or ascetic. He calls himself a Yogee...."

"The poems have attained very great popularity and parts are found translated into Tamil and Malayalam or

85. Ibidem. Pages - II, III

Canarese. Their terse closeness of expression sometimes renders them difficult to translate with elegance; but such passages exemplify the manly force of a language that in the common dialect is often weak and verbose."

"Of his aphorisms many have become common proverbs. Parts of them are evidently close translations from Sanscrit works, particulary the Hitopadesa and Bhagavat Gita..."

"Vemana was evidently, in philosophy, of the Vedanta school, a disciple of Vyasa, whom Sir William Jones has (in the Asiatic Researches, Vol I, page 362) entitled the Plato of India. With the mystic tenets of Plato, those of Vemana closely, correspond while his moral doctrines as closely, answer to those of Democritus."

ఈ పీఠికలో, బ్రౌనుదొర వేమన పద్యములను మూడు తరగతులకు ("moral, satirical and mystic") చెందినవాటిగా విభజించెను. 1829లో అచ్చయిన పుస్తక పీఠికలో వీటిని నాలుగు ముఖ్యభాగములుగ ("religious, moral, satirical, mystic") విభజించి దేనిలోను చేరని వాటిని "కలగూర గంప"గా ("Miscellaneous") ఐదవ భాగమున చేర్చెను.

మార్మిక భాగమునకు చెందిన వేమన పద్యములు తెలుగు భాష సామర్థ్యమును తెలుపజాలి ఉన్నవనియు, వాటి భావములు సునిశితమై అంతర్దృష్టి కల మనస్సు సత్యాన్వేషణము చేయుచుండుటను వ్యక్తపరచునవై యున్నవనియు బ్రౌనుదొర వ్రాసెను.[86]

"The mystic portion is chiefly of use as exemplifying the powers of the language. The reveries contained in this chapter are of a strangely abstruse nature and furnish a remarkable instance of a powerful mind searching for the

---

86. Ibidem. Page - 111

light of truth which is lost in the darkness of heathen* ignorance. The style of this and some other parts render it easier to translate the verses into Latin than into English."

ఈ పద్యములలో అర్థవిషయమున "కొఱుకుపడని కొయ్యలకు", తెలుగులో వ్యాఖ్య వంటిది చేర్చితిననియు, ఈ విషయమున-తనకు భాష, వ్యాకరణము, ఛందస్సు నేర్పిన-ఇద్దరు విద్వాంసుల (తిప్పాభొట్ల వెంకట శివశాస్త్రి, అద్వైత బ్రహ్మయ్య) సాయము లభించినదనియు, వారికి తాను ఋణపడి యుంటిననియు వ్రాసెను: [87]

**"To the more difficult nerses I have sub-joined a Telugu interpretation. For some part of this comment written in Telugu, I am indebted to two very learned Bramins who taught me the language, its grammar and prosody. They are Tippabhotla Venkata Siva Sastri Masulipatnam and Advyta Brahmia, the Pandit belonging to the court in which I have the honour of being assistant judge".**

వేమన పద్యములలో చాల భాగము ఆటవెలది ఛందస్సులోనే ఉన్నవనియు, నాలుగు పాదముల ఈ పద్యములో నాల్గవ పాదము "పల్లవి" వలె అన్నింటికి

---

* మన భాషలలో - ముఖ్యముగా తెలుగులో - ఇంత పాండిత్యము సంపాదించినను, ఇంచుమించుగా నలుబది సంవత్సరములు హిందువులైన పండితుల నడుమ మన భాషా సాహిత్యముల అభివృద్ధికి కృషి చేసినను, బ్రౌనుదొర-ప్రాచ్య విద్యావిజ్ఞానములలో విద్వాంసులైన ఇతర పాశ్చాత్యులలో విల్సన్, జోన్స్ మొదలైన వారివలె గాక — హిందూ ధర్మాదికము నంతగా గౌరవింపని ("darkness of heathen ignorance") తన "శాఖ"కు చెందిన క్రైస్తవుడిగనే జీవితము గడిపెనను విషయమును-సత్యముగనుక-మరువరాదు. దీనివలన మన భాషా సాహిత్యములకు ఆయన చేసిన కృషి విలువ ఏ మాత్రము తగ్గలేదు. మన కృతజ్ఞతలకును అర్హుడైనాడు. మతధర్మము వ్యక్తిగతమైనదను "ఆధునిక భావము" ఆనాడే ఆయనకున్నదను కొనవచ్చును.

87. Ibidem, Pages - III, IV.

సమానమనియు వ్రాసెను : [88]

"Most of the verses in Vemana are written in ataveladi meter which, consists of four lines; but the fourth line, with some exceptions, is a mere refrain or chorus in these words — Viswadabhirama Vinura Vema".

బ్రౌనుదొరతో కలిసి ఓడలో (ఇంగ్లండు నుండి ఇండియాకు) ప్రయాణము (1887) చేసిన బిషప్ కాల్డ్వెల్, బ్రౌనుదొర పాండిత్యాదికమును మెచ్చుకొన్న దే కైస్తవ మత విషయమున - కొందరు పాశ్చాత్య విద్వాంసులవలెగాక - బ్రౌను దొరకున్న అభినివేశమును, విశ్వాసమును మెచ్చుకొనెను. (ఈ పరిశోధన గ్రంథములో పుట - 101).

ఈ పద్యముల లిఖిత ప్రతి (డి 1774) సిద్ధము చేయుటకు, తొమ్మిది లిఖిత ప్రతులను—వివిధ ప్రాంతముల నుండి తెప్పించిన వాటిని (బళ్ళారి, కడప, మద్రాసు, విశాఖపట్టణము, మచిలీపట్టణములనుండి) సంప్రదించుట జరిగినదనియు; ఏ ప్రతిలోను పూర్ణముగ అన్ని పద్యములు లేవనియు ; ప్రతులన్నింటిలోను శబ్ద సంబంధమైన, లిపి సంబంధమైన, ఛందస్సంబంధమైన దోషములు కుప్పతిప్పలుగ నున్నవనియు బ్రౌనుదొర పీఠికలో వ్రాసెను. వివిధ దృక్కోణముల నుండి చూచినను ఈ పీఠికకు విశేష ప్రాముఖ్య ముండుటచేతనే దీని నింత విపులముగ పరిశీలించుట జరిగినది.

ఇదే విధముగా ఆయన సేకరించిన వేమన పద్యముల సంపుటములకు ఇంగ్లీషులో వివరములు వ్రాసియుంచినాడు. లిఖిత ప్రతుల సంపుటములలో డి. 1778ను గురించి ఇట్లు వ్రాసెను :

"The verses of Vemana corrected with the text and metres from a comparison of various manuscripts and translated from the original Telugu by C. P. Brown. Translated between 1st August & 4 th November 1824".

ఇటులనే డి. 1721 నవంబరు సంపుటములో ఇట్లువ్రాసెను. ఇది 1840 నాటిది :

---

88. Ibidem, Page - IV.

"In this edition the text has been carefully revised by a learned Telugu Pandit. The arrangement also is somewhat changed. The verses which appear spurious being placed at the end of the volume apart from the rest. The volume contains 1165 stanzas selected.

వేమన పద్యముల పాఠభేదములను నిర్ణయించునప్పుడు ఛందస్సంబంధమైన జ్ఞానమెంత ఆవశ్యకమో బ్రౌనుదొరకు తెలిసివచ్చి ఆయన ఛందోరీతుల నర్థము చేసికొనుటకు ప్రోత్సాహకమయ్యెను. దీని పర్యవసానమే 1827 లో కాలేజీ బోర్డువారి సిఫార్సు మీద ప్రభుత్వము వారు కాలేజి ప్రెస్సులో అచ్చువేయించిన "ఆంధ్ర గీర్వాణచ్ఛందము", 1817 లో మద్రాసులో అడుగు పెట్టునాటికి తెలుగను భాష ఒకటి ఉన్నదనియే తెలియని బ్రౌనుదొర, పది సంవత్సరములలో తెలుగు, సంస్కృత భాషల ఛందస్సు మీద ఒక పుస్తకము వ్రాసి ముద్రించెను! ఈ పది సంవత్సరములలో భాష నేర్చుకొనుటకు మూడు సంవత్సరములు పట్టె నను కొన్నను, 1824 వచ్చువరకు ఆయనకు తెలుగు సాహిత్యమునకు సంబంధించిన మంచి అవగాహన కలుగలేదన వచ్చును. ఈ కాలముననే వేమన పద్యముల సేకరణ, అనువాదము జరుగుచుండెను, పాఠ భేదములను సరిచూచుటకు ఛంద స్సంబంధమైన జ్ఞానమావశ్యకమని ఆయన గుర్తించిన వెంటనే ఆ పనికి పూనుకొని ఆ జ్ఞానమును సంపాదించి 1825 నాటికే ఒక గ్రంథము వ్రాసి కాలేజి బోర్డువారికి సమర్పించె నన్నచో ఈ శాస్త్రములో ఎంత త్వరితముగా ఆయన పాండిత్యము సంపాదించెనో స్వయం వ్యక్తమగుచున్నది. భాషాసాహిత్య విషయమైన అవగాహనయు క్రమక్రమముగా నభివృద్ధిపొందెను.

"ఆంధ్రగీర్వాణచ్ఛందము"ను సిద్ధముచేసి దానిని ప్రకటించుటకు సాయపడ వలసినదని కాలేజి బోర్డు వారిని కోరినట్లే, వేమన పద్యముల ప్రకటనకును సాయ పడవలసినదిగా అధికారులను బ్రౌనుదొర అభ్యర్థించెను. - పుస్తకముల ప్రచుర ణార్థము సాయము చేయుటకు ముందు, అధికారులు ఆ పుస్తకముల, రచయితల యోగ్యతలను పరీక్షింపజేసెడి వారు. ఈ సందర్భమున కాలేజి బోర్డు అభిప్రాయ

మును ఆ నాటి కాలేజి బోర్డుకా ర్యదర్శి హెచ్. హార్క్ నెస్ (H. Harkness) తన జాబు 28 జూలై (1827) లో ఛీఫ్ సెక్రెటరీకి ఇట్లు తెలిపెను : [89]

"I have the honour, by desire of the Board for the College of Fort St. George and for Public Instruction, to acknowledge the receipt of ... .. their sentiments on Mr. Brown's edition and English translation of the Vemana Shattacam".

"Mr. Brown's edition of the Vemana Shattacam and his English version of the same, although not quite free from errors, the Board beg to recommend to the favourable notice of the Honorable the Governor in Council. It is the second work which that gentleman has submitted for the patronage of Government. The former one, his treatise on Telugu Prosody, will shortly leave the press ; and should the Honorable the Governor in Council be pleased to countenance the labours and abilities of Mr. Brown in this instance, by authorizing the printing and publishing of the English Version, when corrected, at the collage press, the Board respectfully submit that the sum of one thousand Pagodas may be presented to Mr. Brown as a remuneration as an acknowledgement of his laudable exertions".

ఈ సిఫార్సుననుసరించి గవర్నరు, బ్రౌనుదొర కృషికి ప్రతిఫలముగా వేయి పగోడాలు (మూడు వేల అయిదు వందల రూపాయలు) ఈయవచ్చునని లండన్‌లోనున్న "ఆనరబిల్ కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్" (Hon' ble Court of Directors) నకు సిఫార్సు చేసినట్లుగా ఛీఫ్ సెక్రెటరీ 1827 ఆగస్టు 7 వ తేదీని ఒక జాబు వ్రాసెను. కాని, ఈ డబ్బు మూడు సంవత్సరములకు కూడ బ్రౌను దొరకు ముట్టలేదు. "నాకు ఈ డబ్బు ముట్టలేదు" అని ఆయన 1830 మార్చి 9 వ తేదీని అధికారులకు వ్రాసికొనెను. లాభమేమియు లేకపోయినది, కారణము

---

89. The Prosody of the Telugu and Sanscrit languages explained by C. P. Brown ; Historical Introduction. Pages - XIII, XIV. 1977 Edition, Sri Venkateswara University, Tirupati ; Chief Editor- G. N. Reddy; Editor - Bangorey.

లేవి అయినను ఈ డబ్బు ఆయనకు ఎన్నడును ముట్టలేదు. తన సాహిత్య జీవిత చరిత్రలో ఈ విషయము - తనకెన్నడును అధికారుల నుండి ప్రత్యేకముగా ఏ విధమైన ధన సాహాయ్యమును లభింపలేదనునది - ఇట్లు వివరించెను : [90]

"The Indian Government patronizes learning, and those who have published useful books have generally been liberally rewarded. My earliest publications were recommended by the College to this patronage. But, Sir Thomas Munro has then died ; and I was refused any reward ; from that time to the close of my labours, no remuneration was granted me for any work. It may be said that the appointments conferred on me were equivalent to rewards. But similar appointments were bestowed on others who never did anything extraordinary".

ఎందుచేతనో, బ్రౌనుదొరయందు మొదటి నుండియు కంపెనీ ఉన్నతాధికారులకు, డైరెక్టర్లకు అభిమానము తక్కువ. గవర్నరు తానే మంజూరు చేయగలిగిన సొమ్మును అట్లుచేయక, డైరెక్టర్ల అనుమతి కొరకు వ్రాసెను ! ఆయన సిద్ధపరచిన ఒక తెలుగు నిఘంటువునకు సాయము చేయుట అటుంచి, కాలేజి బోర్డువారు దానిని అణగద్రొక్కిరి ! ఏ మంచి "కళ"నో ఉండి ధనసాహాయ్యము చేయవలసినదని బోర్డు సెక్రెటరీ వ్రాసినప్పుడు గవర్నరు దానిని పెడచెవిని పెట్టెను !

ఆ నాటి ఉన్నతోద్యోగులకు- ఇంచుమించుగా అందరికి అన్నను, దోషము లేదు - భారతీయ భాషా సాహిత్యములమీద[91], భారతీయులమీద, వారి ధార్మిక సంపత్తి మీద గౌరవము తక్కువ. దీనికి అపవాదముగ ఏ సర్ విలియమ్ జోన్స్, సి. పి. బ్రౌన్, విల్సన్ మొదలైన వారో కొందరు ఉన్నను— వారి సంఖ్య అత్యల్పము. ప్రతిభావంతులు, పాలకవర్గమునను చెందిన, "తెల్ల" వారు అయిన, తమ ఉద్యోగులు ఈ "నల్ల" వారి విజ్ఞాన సంస్కృతులను అర్థము చేసికొనుటకు, వాటిని ప్రచారము చేయుటకు ఇంత శ్రమ ఎందుకు పడుచున్నారో అర్థముకాని- అది అనర్థదాయకమని కూడ నమ్మిన - వారు చాల మంది ఆ నాడుండిరి !

---

90. Some Account of the Literary Life of C. P. Brown.

91. ఉదాహరణగా, ఆనాటి మేధావులలో ఒకడైన లార్డ్ మెకాలే మాటలను గ్రహింపవచ్చును.

ఛీఫ్ సెక్రెటరీ కాలేజి బోర్డు వారికి 1827 ఆగస్టు 7 వ తేదీని వ్రాసిన లేఖలోనే క్రింది వాక్యములును ఉండెను :

**"The Governor in Council is of opinion that such talents as Mr. Brown's might be more 'advantageously employed in placing European works of Science and Literature within the reach of the natives".**

దీనిని బట్టి, గవర్నరు ఆయన సలహాదారులైన కౌన్సిలు మెంబర్లు అందరు బ్రౌనుదొర కృషిని గూర్చి ఏమనుకొను చుండిరో తెలియుచునే యున్నదిగదా! వేయి పగోడాలు తానే మంజూరు చేయక — ఏలాగునసైనను డైరెక్టర్లు ఈయరను నమ్మకముతోడనే — గవర్నరు ఉత్తరువుల కొరకు లండన్ వ్రాసెనా యని పించును !

ఆ నాటి కంపెనీ అధికారులకు బ్రౌనుదొర యందంతటి అభిమానము లేదనుటకు తార్కాణముగా, 1834 లో ఆయనను చాల స్వల్ప కారణమున ఉద్యోగము నుండి సస్పెండు చేయుటను చెప్పవచ్చును. (ఈ పరిశోధన గ్రంథములో పుటలు — 87, 88, 89, 90, 91) మూడేళ్ళ సెలవుమీద లండనుపోయి తన పైనున్న, అంతులను తొలగించుకొన్నను తిరిగి వచ్చిన తరువాత కూడ (1837) కంపెనీ అధికారులు బ్రౌనుదొరకు అర్హమైన ఉద్యోగములను - న్యాయ శాఖలోను, విత్తశాఖలోను - ఈయక ప్రాముఖ్యములేని ఉద్యోగముల నిచ్చిరి. ఎన్ని మహజర్లు ఆయన పెట్టుకొన్నను లాభము లేకపోయినది. కాలేజి బోర్డు సభ్యులతో కూడ ఆయనకు - తెలుగు సిలబస్సు విషయమున పరీక్షా విధాన విషయమున - అభిప్రాయ భేదములుండెడివి. ఇవన్నియుగాక, తెలుగు నేర్చు కొన్న ఆ నాటి ఇంగ్లీషు ఉద్యోగులలో చాల మందికి బ్రౌనుదొర విషయమున కొంత ఈర్ష్యా ద్వేషము లుండెడివనవచ్చును. కాంబెల్, మారెస్ ప్రభృతులు ఎప్పుడో ఒకప్పుడు ఆయన యందు ఈర్ష్య ప్రకటించిన వారే! ఏ. డి. కాంబెల్ నకు తనకంటె "పెద్ద" అను గౌరవముతో బ్రౌనుదొర "ఆంధ్రగీర్వాణచ్ఛందము" నంకిత మిచ్చుట (1827), తన తెలుగు వ్యాకరణమున కాంబెల్‌ను ఉచిత రీతిని శ్లాఘించుట, వ్యాకరణ ప్రతి నొకదానిని చక్కగా బైండు చేయించి ఆ దొర

కిచ్చుట మొదలైనవి ఎన్ని చేసినను ఆ ఈర్ష్యాద్వేషములు పోయినట్లు లేదు.[92]

తన శ్రమకు తగిన ప్రతిఫలమును కంపెనీ అధికారులు మంజూరు చేయక పోయినను, సోదరోద్యోగులు అప్పుడప్పుడు ఈర్ష్యాద్వేషములు ప్రదర్శించుచు వచ్చినను బ్రౌనుదొర వీటిన్ని లెక్కచేయక తనపని తాను చేసికొనుచు పోయెను. ఇతర కార్యములందు వలెనే ఇందును ఆయన చేతిసొమ్ము చాల ఖర్చయినది.

వేమన తనను గురించి "వెర్రివేమన" అని చెప్పికొనుటను గూర్చి బ్రౌను దొర వ్రాయుచు; పాశ్చాత్య దేశములందును, సమాజము యొక్క సంస్కరణకు పూనుకొని, సమాజముచే "వెర్రివారు" అని వెక్కిరింపబడిన కవులు, తమ్మ ఆ విధముగా సంబోధించుకొనుట కలదనియు; అట్టివారు గ్రీకు, లాటిన్ మొదలైన భాషలలోను కలరనియు చెప్పెను.[93] బహుళముగా వ్యాపించియున్న దురాచారములను నిర్భయముగా వ్రేలుపెట్టి చూపించు ప్రాజ్ఞులు లోకులకు "వెర్రివారు" గదా !

1829 లోనే అచ్చువేసిన ఈ "వేమన పద్యములు" అను గ్రంథమున, పాశ్చాత్య పద్ధతులను ప్రవేశపెట్టి బ్రౌనుదొర గ్రంథమునెట్లు సంపాదింపవలెనో ఎట్లు ముద్రింపవలెనో చూపి మనవారికి మార్గదర్శకుడయ్యెను. విషయము ననుసరించి వర్గీకరణ, అకారాది సూచన, పీఠిక, అనుబంధము మొదలైన వాటిని ఇందు ప్రవేశపెట్టెను. ఈ పద్ధతులన్నియు, ఇంకను సమర్థవంతముగ, నిర్వహించుట భావికాలములోని ఆయన గ్రంథములలో మనకు కనంబడును. "వేమన

---

92. "My Telugu Grammar appeared in the end of 1840, and at once became popular. In my grammar I had given Mr. Campbell due praise, and wishing to appease his jealousy, I sent him a splendidly bound copy, with a respectful letter.. ......"
(Some Account of the Literary Life of C. P. Brown)

93. "Vemana has in many passages called himself a madman . . . . . Thus also Lucian and Rabelais assumed the garb of fools and men while the arguments, coneyed in their writings were undermining the polytheistical systems of their times. Erasmus too in his book . . . . . . . . has adopted this method with a like object."
(The Verses of Vemana, 1829. Page - 63.)

పద్యములు" 1839 లో ద్వితీయ ముద్రణము పొందినను, ఇంకను కొన్ని క్రొత్త పద్యములు చేరుట పాఠాంతరము లుండుట తప్ప ప్రత్యేకముగా చెప్పదగిన విశేషము లిందు లేవనవచ్చును.

ఈ రెండింటి యందు చేరని అనేక పద్యములుండుట వలన (సేకరించినవి ఇంచుమించుగా మొత్తము మూడువేల పద్యములు) వీటిని కూడ చేర్చి మూడవ ముద్రణ కొరకు 1842 నాటికే ఒక శుద్ధప్రతిని సిద్ధము చేసినను ఆ పని ఆయన చేతుల మీదుగా జరుగలేదు. ద్వితీయ ముద్రణ ప్రతిలో 1164 పద్యము లుండగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1967 లో ప్రచురించిన గ్రంథములో 1215 పద్యములున్నవి. కనుక వేమన పద్యము లిన్నియని చెప్పలేము. తాను ముద్రించిన ముద్రణల కొరకు బ్రౌనుదొర ముప్పది వరకు ప్రతులను సంప్రదించెను. ఇవి, దేశములో వివిధ ప్రాంతముల నుండి తెప్పించిన వను విషయము మనకు తెలిసినదే! వేమనయందు బ్రౌనుదొర కెంత గౌరవ ముండెగా తాను వ్రాసిన Essay on the Creed, Customs and Literature of the Jangams (The Madras Journal of Literature and Science; Vol XI, Madras, 1840; The Journal of the Royal Asiatic Society; Vol V; N. S. Pages 141-146; London 1871) అను వ్యాసమునందును, తన సాహిత్య జీవిత చరిత్రయందును వేమన్నను పేర్కొనెను.

వేమన పద్యముల వలెనే తెలుగు దేశమున విశేష ప్రచారమునన్న శతకము సుమతీ శతకము: ఈ శతకములోని పద్యములను బ్రౌనుదొర ఆంగ్లీకరించెను. ఈ ఆంగ్లీకరణ 1832 లో జూలై 30 వ తేదిని ప్రారంభించినట్లు తెలియుచున్నది. తా నాంగ్లములోనికి దీని ననువాదము చేయుటయే గాక, ఒక తెలుగు టీక కూడ వ్రాయించెను. దీనిని 1842 లో బ్రౌనుదొర ముద్రించి యుండవచ్చునను కొనుటకు ఆధారములు రెండున్నవి. 1842 లో ఆ నాటి ప్రముఖ పత్రికయైన "వర్తమాన తరంగిణి"లో పుస్తకముల వ్యాపార ప్రకటనలో దీని పేరు కూడ నున్నది ఈ సంవత్సరముననే బ్రౌనుదొర ప్రచురించిన హరిశ్చంద్రోపాఖ్యాన కావ్యమున అచ్చొత్తించిన ప్రకటనల భాగమున "సుమతీ శతకము" పేరు కనంబడుచున్నది. ఈ మధ్యకాలములో, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 1978లో దీనిని-డి. 3090 లిఖితప్రతి (ఇది కాగితపుప్రతి) ననుసరించి-బ్రౌనుదొర అనువాదముతో ముద్రించెను.

సుమతీ శతకమన్న వెంటనే అందరికి జ్ఞప్తికివచ్చు "శ్రీరాముని దయచేతను, నారూఢిగ సకల జనులు నౌరాయనఁగా" అను పద్యము బ్రౌనుదొర ప్రతులలో లేదు. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోని లిఖిత ప్రతులలో గాని, సరస్వతీ మహల్ గ్రంథాలయములో గల లిఖిత ప్రతులలో గాని ఈ పద్యము కానరాదు. శ్రీ కారముతో తెలుగు కావ్యములు ప్రారంభమగుటను బట్టి అర్వాచీన కాలమున, సుమతీ శతకమును శ్రీకారముతో ప్రారంభమైన దనుటకు, ఈ పద్యమును చేర్చియుందు రనునది పండితుల యభిప్రాయము.

ప్రాచీన తెలుగు కావ్యముల లిఖిత ప్రతులకు సహజమైన విధముగనే, సుమతీ శతక లిఖిత ప్రతులలోను పద్య సంఖ్య భేదించుచునే యున్నది. సాహిత్య అకాడమి ప్రచురించిన దానిలో 150 పద్యములున్నవి. కాని, ఇందులో 85 పద్యములకే బ్రౌనుదొర ఆంగ్లానువాదము కనబడుచున్నది. సుమతీ శతక కర్తృత్వ విషయమునను చాల వాదములున్నట్లు బ్రౌనుదొర కూడ గుర్తించి దానిని వ్యక్తము చేసెను. బద్దెన అను భద్ర భూపాలుడు (తెలుగు చోడ రాజు), వ్రాసెనని కొందరు, భీమన అను కవి వ్రాసెనని కొందరు, జైనకవి ఎవరో వ్రాసి యుండవచ్చునని కొందరు చెప్పుచున్నట్లు బ్రౌనుదొర వ్రాసెను. సుమతీ శతకమును * తమిళములోనికిఎగ్మూరుసమరపురిముదలియార్ గారుఅనువదింపగా పి. యతిరాజులు నాయుడు గారు దానిని 1904లో ముద్రించినట్లు కూడ తెలియు చున్నది. ఈ ముదలియార్ గారు తమిళానువాదముతో బాటు ప్రతిపదార్థ తాత్పర్యములను కూడ ఇచ్చినట్లు తెలియుచున్నది. నీతి సూక్తుల విషయమున ఇది తమిళములోని "తిరుక్కురళ్" ను పోలియుండుటచే కూడ ఈ శతకము తమిళులకు నచ్చియుండవచ్చును.

---

* సుమతీ శతకమును, వేమన శతకమును శ్రీ ఎస్. టి. జి. వరదాచార్యులు గారు (చిట్టిగూడురు) సంస్కృతములోని కనువదింపగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ఈ రెండింటిని 1963 లో ప్రచురించెను. 1969 లో శ్రీ వి. కృష్ణమూర్తిగారు (సికిందరాబాదు) సుమతీ శతకమును ఇంగ్లీషులోని కనువదించి ప్రచురించిరి.

బ్రౌనుదొర అనువాదపు తీరుతెన్నులు తెలిసికొనుటకు ఒకటి రెండు పద్యముల (బ్రౌనుదొర పాఠములు) అనువాదము నిచ్చుచున్నాను :

"ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ, వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడె నేర్పరి సుమతీ" (పద్యము - 15)

**"That kindness should be shown to the kind is no marvel, for it is merely an exchange. But he who shows kindness to the unkind without laying a fault to him is the wisest of men".**

"బలవంతుడ నాకేమని
పలువురతో నిగ్రహించి పలుకుట మేలా
బలవంతమైన సర్పము
చలిచీమల చేత జిక్కి చావదె సుమతీ" (పద్యము - 74)

**"I am strong, what care I? Says he; but what good will he get of incurring the hatred of others? Did never a snake however mighty die by falling into the power of black ants?"**

అనువాదములలో కొన్ని కొన్ని చోట్ల — ముఖ్యముగా ధార్మిక, సాంస్కృతిక విషయములు వచ్చినప్పుడు — భావము బాగుగా ఇంగ్లీషు వారికి (పాశ్చాత్యులకు) అర్థమగుట కొరకు ఆయా నుడికారములను, ఉపమానములను వాడుటకలదు. ఉదాహరణముగా కొన్నింటిని గ్రహింపవచ్చును. మూలములో "పూరణములేని బూరెలు" అనియున్న చోట "... Cheese Cakes without Pudding" అనియు; "పొలయలుకనాటి కూటమి, వెలయింతని చెప్పరాదు..." అనియున్న చోట "......... the embraces of women after a curtain lecture are sweet beyond all telling అనియు ; "తన కలిమి యింద్ర భోగము........ తను వలచిన యదియె రంభ..." అను పద్యమున "your own wealth is to you the treasures of Plutus......

she indeed whom you love is Venus..." అనియు; "పరతరుణి గోష్ఠి నుండిన, పరుషుడు గాంగేయుడైన (భువి) నిందపడున్ ; (ధర) యువతి సీతయైనం, బరపురుషుని గోష్ఠి నిందపాలగు సుమతీ "అను పద్యమును" "If he be in conversation with his neighbour's wife, were a man a second Joseph he would assuredly incur reproach. Were she Penelope herself in chastity, intercourse with men will leave woman a prey to scandal" అనియు; అనువాదములు కలవు. ఈ అనువాదముల ఔచిత్యమును గూర్చి వేరుగా చెప్పనక్కర లేదు గదా !

పౌరాణికోపమానములను పోలిన ఉపమానములు పాశ్చాత్య సంస్కృతిలో లభింపనప్పుడు వాటిని యథాతథముగ మార్చకుండ నుంచుటయు కలదు. ఉదాహరణ ॥ "ధనపతి చెలికాడై యెపు, డె (వయంగా) శివుడు భిక్షమెత్తగ వలసెం......" అనుచోట, "Though the god of wealth is his ally, still is Siva constrained to live on alms ......" అనియే అనువదించెను. కొన్ని కొన్ని చోట్ల అనువాదములు సరిగా లేకపోవుటయు కలదు. "భూమీశుల నమ్మికలును ......... " అనునది "the promises of Bramins" అని అనువదింపబడెను !

ఏది ఎట్లున్నను, బ్రౌనుదొర శతకముల విషయమున కూడ ప్రసిద్ధ కావ్యముల విషయమునందు వలెనో శ్రద్ధ ఉంచెను గాని, అవి శతకములుగదా యని వాటిని చిన్నచూపు చూడలేదు. ఆయన, ఎనుబది కంటె అధికముగనే శతకములను సంపాదించి వాటిని పండితుల సాయముతో సంస్కరించి శుద్ధ ప్రతులను సిద్ధము చేసెను. పదివరకు తానే అచ్చు వేయించెను. తాను సేకరించిన శతకములను — శృంగార, నీతి, వైరాగ్య, హాస్య శతకములుగా స్థూలముగా విభజించెను. ఇందు — కలువాయి, చౌడప్ప, కాళహస్తి, లావణ్యసీమ, కోదండ రామ, కాంతాలలామ, చంద్రవదన, జగన్నాయక, దేవకీనందన, శివ ముకుంద, సిద్ధరామ శతకాదులు కలవు. వేమన, సుమతి, భాస్కర శతకములు ప్రసిద్ధములై అందరికి తెలిసియున్నవి. ఈ శతకములను నిర్లక్ష్యము చేయక, జూలూరి అప్పయ్య శాస్త్రిగారి వంటి ప్రసిద్ధ పండితులచేత వాటిని తన పర్యవేక్షణమున

సంపాదింపించెను. సంపూర్ణముగా లభింపని శతకములు కొన్ని ఇండియా ఆఫీసు లైబ్రరీలో పూర్తిగా నున్నవని తెలిసికొని అక్కడ నుండి వాటిని తెప్పించెను. ఇట్టి వాటిలో దేవకీనందన శతకాములు కలవు.

శతకముల ప్రాముఖ్యమును బట్టి వాటికి పద పద్య సూచికలు, టీకలు వ్రాయించెను. కొన్నింటిని ఆంగ్లములోని కనువదించి ప్రకటించెను. సుమతీ భాస్కర శతకములకు పదసూచికలు, టీకలు; వేమన, చౌడప్ప శతకములకు పద్య సూచికలు సిద్ధము చేయించెను. వేమన సుమతీ శతకముల నాంగ్లాను వాదములతో క్రమముగా 1829, 1842 లలో ప్రకటించెను. శతకములలోని కఠిన పదములకు అర్థములు వ్రాయించెను. దీని కుదాహరణముగ సుమతీ శతకమును చెప్పవచ్చును. శతకముల లిఖిత ప్రతులున్న వారు వాటిని తనకు అమ్మినచో డబ్బిచ్చి కొనెడివాడు, ఊరక ఇచ్చినచో కృతజ్ఞతా పూర్వకముగా తీసికొనెడి వాడు లేదా అచ్చువేయుటకు ఎరవిచ్చినచో అవి అచ్చయిన తరువాత, వారికి కొన్ని ప్రతులను ఉచితముగ నిత్తునని "ఎర" చూపి వాటిని గ్రహించెడి వాడు. అన్ని గ్రంథముల లిఖిత ప్రతులను ఇట్లే సంపాదించెడి వాడు. "ఫలానా" పుస్తకముల తాళ పత్ర ప్రతులు కావలెను అని వ్రాయించి ఆఫీసులలో నోటీసులు కూడ పెట్టించెడివాడు! మన పండితులు విశేషముగా ప్రాముఖ్యమీయని శతకములకు, వీరగాథా కావ్యములకు - పురాణ ప్రబంధాది రచనలతో తుల్య ప్రాధాన్యమిచ్చి బ్రౌనుదొర వాటిని కూడ సేకరించి, పరిష్కరించి — కొన్నింటిని — ముద్రించి ఆవి మరుగున పడిపోకుండ కాపాడెను.

ఆ నాడు, జీర్ణస్థితిలో నున్న తెలుగు కావ్య సరస్వతిని పునరుజ్జీవితను చేసిన ధన్వంతరి బ్రౌనుదొర. ఆయన "హస్తవాసి" మంచిది. ఆ స్పర్శవలన మన కావ్యములకు అమరత్వమును ప్రాప్తించినది. ఇట, కావ్య శబ్దము తెలుగు రచనల కన్నింటికి ఉపలక్షణముగా వాడబడినది. మన కావ్యములకు ఆయన చేసిన మొదటి సేవ వాటి సేకరణ. ఇందువలన-వివిధ ప్రాంతములలో, వివిధపాఠములతో, వివిధ రూపములతో (చెదలు కొట్టి, కొట్టక, సంపూర్ణముగ, అసంపూర్ణముగ) నున్న వివిధ కావ్యములు ఒకచోట చేరుట జరిగినది. రెండవ సేవ—సాధ్యమైనంత వరకు పాఠభేదముల గుర్తింపుతో, పండిత పరిష్కరణతో - ఆ కావ్యములను కాగితముల మీద వ్రాయించుట. దీని వలన — మన కావ్యములకు శుద్ధప్రతులు సిద్ధమైనవి. అంతకు పూర్వము ఇంతటి విస్తృత పరిధిలో ఏ రాజాస్థానమున

ఇది జరుగలేదనుట అతిశయోక్తి కాదు! మూడవ సేవ - శుద్ధప్రతులు సిద్ధమైన వాటిలో ప్రసిద్ధములైన వాటికి పండితులచే సులభశైలిలో టీకలు, వ్యాఖ్యలు వ్రాయించుట. నాలుగవసేవ- ఆయా గ్రంథములలో కొన్నింటినైనను తాను ముద్రించుట; ముద్రించుకొందుమన్నవారికి (పురాణం హయగ్రీవ శాస్త్రిలు మొదలైనవారు)- వాటి ప్రచారమునే మనస్సునందుంచుకొని- ఉచితముగ నచ్చు వేసికొనుటకు ఇచ్చివేయుట. ఇంక, ఐదవసేవ- వీటిలో కొన్నింటినైనను (వేమనపద్యములు, సుమతీశతకము ఉదాహరణలు) ఆంగ్లానువాదములతో చేర్చి ముద్రించుట; తెలుగు కావ్యములను గూర్చి ఆంగ్లమున-వ్యాసముల రూపమున, లిఖితప్రతులలో ఉపోద్ఘాతముల రూపమున, నిఘంటువులలో పీఠికల రూపమున, ఛందోవ్యాకరణాది గ్రంథములలో వాచకములలో ప్రాసంగికముగ జ్ఞాపికల రూపమున వ్రాయుట. ఈ వ్రాతలలో కొన్నిచోట్ల గ్రీకు, లాటిను, ఇంగ్లీషు మొదలైన భాషా సాహిత్యములతో తెలుగు భాషా సాహిత్యములను తులనాత్మకముగ పరిశీలించి వ్రాయుట కూడ కలదు. ఆ నాటికింకను మన మనవారంతగా చేయలేని ఈ పనిని చేసిచూపి పరోక్షముగ భాషాసాహిత్యముల తులనాత్మకాధ్యయనమునకును బ్రౌనుదొర పథ నిర్దేశకుడయ్యెననవచ్చును!

బ్రౌనుదొర, భారత భాగవతముల శుద్ధప్రతులను సిద్ధము చేయించిన విధమును గూర్చి కొంత తెలిసికొంటిమి (ఈ పరిశోధన గ్రంథములో పుటలు-162, 163 భాగవతము; భారతము పుట-185) శుద్ధప్రతులను సిద్ధము చేయునప్పుడు మంచి పండితుల సాయము పొందుచున్నను, విషయమంతయు వారికే విడిచి వేయక అనుక్షణము తానుకూడ వారిపనిని పర్యవేక్షించుట బ్రౌనుదొరకు అలవాటు. దీనివలన పండితులు తమ పనిలో జాగరూకులై యుండుటయు; అశ్రద్ధ వలనగాని, సమయమునకు స్ఫురింపకగాని వారేదైన పొరపాటుపడిన, దానిని తాను సవరించుటకుగాని, వారికి దానిని చూపి సవరింపించుటకు గాని బ్రౌనుదొరకు అవకాశము లభించుటయు జరిగినవి.

భాగవతశుద్ధ ప్రతి 1827 నాటికే సిద్ధమైనదిగనుక, 1848 లో దానిని తనవద్దనుండి గ్రహించి హయగ్రీవశాస్త్రిలు సంపూర్ణముగ ముద్రించులోపలనే, 1840 లో బ్రౌనుదొర భాగవత సప్తమ స్కంధమును ముద్రించెను. ప్రహ్లాద చరిత్రయున్న ఈ స్కంధమునకు నాటివలెనే నేడును ప్రచార మధికమే! పురాణ మనగా ఏమిటి? అనుసంశయము పాశ్చాత్యులకు కలుగవచ్చునను భావముతో

దానిని గూర్చి "తెలుగు" ఇట్లు తన ఆంగ్ల వ్యాసమున వ్రాసెను:[94]

"Puranam or Chronicle denotes a fable, or poem like Ovid's Metamorphoses : describing the four ages of the world, called Crita, Treta, Dwapara and Cali; or gold, silver, brazen, and iron..."

వివిధ ప్రతుల సాయముతో పాఠ నిర్ణయము గావించి శుద్ధప్రతిని సిద్ధము చేయించిన తెలుగు కావ్యములలో వెన్నెలకంటి సూరనార్యుని విష్ణుపురాణ మొకటి. విష్ణుపురాణములోని శైలి బ్రౌనుదొరకు నచ్చినట్లున్నది. కొన్ని పద్యముల తాత్పర్యమును, ప్రారంభకుల కనువుగా నుండునను భావముతో, ఇంగ్లీషులో తెలిపెను.

తెలుగువారి కతిప్రియమైన క్షేత్ర మాహాత్మ్యము శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యము. తిన్నని కథ తెలియని తెనుగు వారుండరు! ఇట్టి శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యమునకు బ్రౌనుదొర చక్కని శుద్ధప్రతిని తయారు చేయించెను. వివిధ ప్రాంతములనుండి ప్రతులను తెప్పింపవలెనని ప్రయత్నించినను ఎక్కువ ప్రతులు లభింపలేదు. లభించిన మూడు నాలుగు ప్రతుల సాయముతో 1840నాటి కొక పరిష్కృత ప్రతిని సిద్ధము చేయింపగలిగెను. ఇంగ్లీషులో దీనికి కథా సంగ్రహముకూడ వ్రాసెను. అచ్చు మాత్రము ఆనాడు కాలేదు. 1895లో క్రొత్తపల్లి పద్మనాభశాస్త్రిగారు శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యమును మొదటిసారి ముద్రించిరి. ఆయన చెప్పకున్నను దీనికి బ్రౌనుదొర పరిష్కరింపించిన ప్రతి ఆధారమనుకొనవచ్చును. దీని ద్వితీయ ముద్రణమును 1930లో, వావిలకొలను సుబ్బారావుగారి సాయముతో క్రొత్తపల్లి అన్నపూర్ణమ్మగారు వెలువరించిరి. ఆనాడు బ్రౌనుదొర శ్రమపడి ప్రతులను సంపాదించి పరిష్కృత ప్రతిని సిద్ధము చేయనిచో ఇంతటి ఉత్తమ గ్రంథము మనకు లేకుండెడిది!

తిక్కన రచించిన నిర్వచనోత్తర రామాయణమునకు, కంకంటి పాపరాజు వ్రాసిన ఉత్తర రామాయణమునకు వివిధ ప్రాంతములనుండి ప్రతులను సంపా

---

94. Essay on the Language and Literature of the Telugus-C.P. Brown (The Madras Journal of Literature and Science (Vol-X) Madras, July - Oct. 1839 - Pages : 43-59; 360-367). (Reprint) Asiatic Journal, London 1841).

దించి పండితుల సాయముతో వాటిని పరిష్కరించి శుద్ధమైన కాగితపు ప్రతులను సిద్ధము చేసెను. తన సాహిత్య జీవిత రచనతో పాటు తాను ముద్రించి నట్టిచ్చిన గ్రంథ పట్టికలో ఒక ఉత్తర రామాయణమున్నది. అది ఎవరి రచనయో తెలియుటలేదు! ఇట్లనే, భాస్కర రామాయణము విషయమునను-ముద్రిత గ్రంథముల పట్టికలో- కనంబడుచున్నది.

మడికి సింగన వ్రాసిన పద్మపురాణోత్తర భాగమును వివిధ ప్రతుల సాయముతో బ్రౌనుదొర పరిష్కరింపించెను. ఇందులో నున్న అహల్య కథ ఆయన నాకర్షింపగా దానిని "The Story of Ahalya" అని ఇంగ్లీషులోని కనువదించెను. ధరణి దేవుల రామన్న (య్య) వ్రాసిన దశావతార చరిత్రలో నున్న అహల్య కథను కూడ "The Loves of Ahalya and Indra" అని అనువదించెను. (ఈ పరిశోధన గ్రంథములో పుటలు-176, 177). ఆయనకు నచ్చిన కథా భాగములను ఇంగ్లీషు వచనముగను, కొన్నికొన్ని చోట్ల ఛందోరూపమునను బ్రౌనుదొర అనువాదము చేయుచువచ్చెను. ఇవిగాక, కథా సంగ్రహములను- ఇంచుమించుగా అన్ని ప్రముఖ కావ్యములకును- ఆయన రచించెను.

తన పండితుల సాయముతో బ్రౌనుదొర పరిష్కరింపించి శుద్ధమైన కాగితపు ప్రతులను సిద్ధము చేయింపించిన గ్రంథములలో- ఎఱ్ఱన హరివంశము (1832) శ్రీనాథుని కాశీఖండము (1843), సంకుసాల నృసింహకవి కవికర్ణ రసాయనము (1832), కనుపర్తి అబ్బయామాత్యుని అనిరుద్ధ చరిత్రము (1834), అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయము (1850), పింగళి సూరన రాఘవ పాండవీయము ఘట్టు ప్రభువు కుచేలోపాఖ్యానము ("Cuchelopakhyanam"), ముద్దుపళని రాధికాసాంత్వనము, కూచిమంచి జగ్గకవి చంద్రరేఖా విలాపము మొదలైనవి కలవు.

ప్రసిద్ధములైన ద్విపద వీరశైవ గ్రంథములలో బ్రౌనుదొర పరిష్కరింపించి శుద్ధ ప్రతులు తయారు చేయింపించిన వాటిలో పాల్కురికి సోమనాథుని బసవ పురాణము (1839), పండితారాధ్య చరిత్ర (1841) కలవు. చాల శ్రమపడి ప్రతులను సంపాదించి, పండితులచేత వాటిని పరిష్కరింపించి ఇంగ్లీషులో కథా సంగ్రహములను కూడ బ్రౌనుదొర వ్రాసెను. మెకంజీ సేకరించిన ప్రతులును ఆయనకు సాయపడెను. ద్విపద రామాయణములలో గోన బుద్ధారెడ్డి వ్రాసిన రంగనాథ రామాయణము (1840). ఆయన పుత్రులు కాచవిభుడు, విట్ఠలనాథుడు

రచించిన ఉత్తర రామాయణము (1841) కూడ ఈ సందర్భమున పేర్కొనదగినవి. వీటి ప్రతులను వివిధ ప్రాంతములనుండి తెప్పించుటయేగాక వాటిని పరిష్కరించు నప్పుడు సంస్కృత మూలమును కూడ పరిశీలించుచు వచ్చెను. ఉత్తర రామాయణపు ప్రతి నొకదానిని ప్రొఫెసర్ విల్సన్ ద్వారా ఇండియా ఆఫీసు లైబ్రరీ నుండి కూడ తెప్పించె నన్నచో ఇట్టి విషయములలో బ్రౌనుదొర పట్టుదల మనకు తెలియును.

వ్యావహారిక భాషాభిమానియైన బ్రౌనుదొర వివిధ కథల సంపుటు లవదగిన పాలవేకరి కదిరీపతి శుకసప్తతి, అయ్యలరాజు నారాయణామాత్యుని హంస వింశతి (1827), కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశత్ సాలభంజిక (1842) మొదలైన వాటికి కాగితములపై శుద్ధ ప్రతులను ("...critically exact copy...") వ్రాయించుటేగాక ఇంగ్లీషులో ఉపోద్ఘాతాదులు వ్రాసి వాటిని పరిరక్షించెను. ఈ కావ్యములనుండి తన నిఘంటువులకు వాడుకలోనున్న అనేక పదములను గ్రహించెను.

ఆముక్తమాల్యదవంటి ప్రౌఢ ప్రబంధమునకు, వివిధ ప్రతుల సంప్రదింపు తరువాత శుద్ధ ప్రతిని తయారు చేయించుటయేగాక (1884) దానికి అతఃపూర్వ మున్న వ్యాఖ్యలను కూడ తన పండితులచేత సరిదిద్దించెను.

తెలుగు సాహిత్యములో బ్రౌనుదొర ముద్రపడని ప్రాచీన కావ్యము లేదనుట స్వభావోక్తులలో స్వభావోక్తి. వీటిలో – ఇతిహాసములు, పురాణములు, ప్రబంధములు, శతకములు, వీరగాథలు, కథాకావ్యములు మొదలైనవన్నియు నున్నవి. నిర్వచన కావ్యములు, వచనకావ్యములు, చంపూకావ్యములు, ద్విపద కావ్యములు మొదలైనవన్నియుగలవు. వైదిక, జైన, బౌద్ధ, శైవ, వైష్ణవ, శాక్త, క్రైస్తవ, ఇస్లాం మొదలైన వివిధ ధర్మములకు చెందిన రచనలున్నవి. భాషాభిమాని, గ్రంథాభిమాని అయిన ఆయన అన్ని భాషలలోని గ్రంథములను – తెలుగు నందు ప్రత్యేకాభిమానమున్నను-తనకు లభించినవాటిని పరిరక్షించుచువచ్చెను. ఈ విషయమున సంకుచితత్వములేదు. సంస్కృత ప్రాకృతాది ఆర్యభాషాకుటుంబ మునకు చెందిన గ్రంథములు, తమిళ కన్నడాది ద్రావిడ భాషాకుటుంబమునకు చెందిన గ్రంథములు ఆయనచే సమముగనే ఆదరింపబడినవి, సేకరింపబడినవి, వీలైనచో పరిష్కరింపబడినవి. గ్రంథాలయములకు బహూకరింపబడినవి. కాని,

ఆయన తెలుగు భాషా సాహిత్యముల సేవకు తన జీవితమునంకితముచేసిన వాడగు టచే మనకు విశేషముగా గౌరవపాత్రుడు.

తాళపత్రములలో జీర్ణించిపోవుచున్న మన కావ్యములను కాగితములమీద వ్రాయించుటయేకాదు ఆయన చేసిన పని. ఈ మాత్రము చేసినను ఘనమైన విషయమే! కాని, గ్రంథముల విషయమున ఆయన అల్పసంతోషికాడు. సామదానాది వివిధోపాయముల సాయమున వివిధ ప్రాంతములనుండి లిఖితప్రతులను తెప్పించినాడు; తన పండితులచే పాఠ భేదములను గుర్తింపించి వాటిని పరిష్కరింపించినాడు. వారి "తీర్పు" ననుసరించి కాగితములపై శుద్ధ ప్రతులను వ్రాయించినాడు. అడుగడుగున తన పాండిత్యమును, విమర్శదృష్టిని, పాశ్చాత్య పద్ధతులను వినియోగించి పండితుల పనిని పర్యవేక్షించుచు; వారు మరచిపోయి చేసిన తప్పులను, విషయావగాహనలేక చేసిన తప్పులను వేయికన్నులతో పరీక్షించి దిద్దుచు దిద్దించుచు మన కావ్యముల సముద్ధరణకు బద్ధకంకణుడై వారితో బాటే కాక వారికంటె ఎక్కువగా కూడ అహర్నిశలు శ్రమించెను.

ముద్రణకు గ్రంథమును సిద్ధముచేయుటను మనవారికి బ్రౌనుదొర నేర్పెననవచ్చును. పద్యపాదములకు పద్యములకు అంకెలనువేయుట, పుటల సంఖ్యలను వేయుట, విరామ చిహ్నములు పదవి భాగముననుసరించివేయుట, మార్జిను విడుచుట మొదలైనవన్నియు - కొంతవరకు ముద్రణమున, అంతకుపూర్వమే యున్నను — బ్రౌనుదొర తెలుగు కావ్యముల ముద్రణ విషయమున శ్రద్ధతో అమలుచేయించెను.

టీకలు, వ్యాఖ్యలు వ్రాయించు విషయమున ప్రత్యేక శ్రద్ధ వహించి వ్యావహారిక భాషలో గ్రంథములను అర్థము చేసికొనుటకు పనికివచ్చునట్లుగా - పండితైక వేద్యముగాకాక లేదా పాండిత్య ప్రకటనార్థముగాకాక — వాటిని వ్రాయించెను. టీకలకు గ్రంథములనెన్నుకొను విషయమునగూడ ఆయన స్వాతంత్ర్యమును వహించెను. ఇందువలన, పండితులు మెచ్చుకొను ఉద్గ్రంథములతోబాటు సామాన్యులు ఆదరించు రచనలకును టీకలు ఏర్పడెను. మనుచరిత్ర, వసుచరిత్రాది ప్రబంధములతోబాటు హరిశ్చంద్ర ద్విపద కావ్యమును, నవనాథ చరిత్రలో కొంత భాగమును కూడ ముద్రించెను. గ్రంథముల పరిష్కరణ విషయమున రాఘవపాండవీయాది ద్వ్యర్థికావ్యములకెంత ప్రాముఖ్య

మిచ్చెనో నీలాసుందరీపరిణయాది అచ్చతెలుగు కావ్యములకును అంత ప్రాముఖ్య మిచ్చెను. ఇందువలన తెలుగు కావ్యములకు అన్ని వర్గములకు చెందిన తెలుగు వారిలో మంచి ప్రచారము వచ్చెను. ఇదిగాక, ఆయన చేసిన ఆంగ్లానువాదముల వలన వేమనాది కవులకు విశ్వవిఖ్యాతి వచ్చినదనవచ్చును.

శుద్ధ ప్రతులు సిద్ధమైన అనేక కావ్యములకు ఇంగ్లీషులో ఉపోద్ఘాతములు, కథా సంగ్రహములు, విషయ సూచికలు మొదలైనవి పాశ్చాత్య విమర్శన పద్ధతుల ననుసరించి వ్రాయుటయేగాక తెలుగు సాహిత్యమునుపై, వీరశైవ సాహిత్యముపై, అనేకములైన ఇతర విషయములపై ఇంగ్లీషులో వ్యాసములు వ్రాసి వాటిని The Madras Journal of Literature and Science లోను The Asiatic Journal (London) లోను ప్రచురించి తెలుగు భాషా సాహిత్యములను గురించి ఆంధ్రేతరులకు—ముఖ్యముగ పాశ్చాత్యులకు-తెలియ జేసెను. బహుభాషా కోవిదుడైన బ్రౌనుదొర తెలుగు కావ్యములలోని పాత్రలకు, సన్నివేశములకు, కల్పనలకు గ్రీకు, లాటిను, ఇంగ్లీషు మొదలైన భాషల లోని కావ్యములలో నున్న ఆయా విషయములకు పోలికలున్నప్పుడు వాటిని చూపించెను. ఈ విధముగా ఆనాడు చూపగలిగిన తెలుగువారుండుటకు అవకాశములు లేవుగనుక, ఆ పనిని తాను చేసి భాషా సాహిత్యముల తులనాత్మకాధ్యయనమునకు బ్రౌనుదొర పథనిర్దేశకుడయ్యెను. వీరశైవుల సాహిత్యమును గూర్చియు, జంగముల ఆచార వ్యవహారములను గూర్చియు వ్రాసి సర్వ సామాన్యముగా ఉపేక్షితములగు విషయములకు కూడ ఒక జాతి వికాసమున స్థానము గలదని చూపెను.

కేవలము తాళపత్ర ప్రతులకు కాగితములపై "పుత్రికలు" పుట్టించుటతో తృప్తిపడక బ్రౌనుదొర ఆయా కావ్యములకు పద సూచికలు, పద్య సూచికలు వ్రాయించెను. ఆయా కావ్యములలోని తత్సమాచ్ఛిక శబ్దములను, సమాసములను వేరువేరుగ వ్రాయించి భాషా పరిశోధనకు మార్గదర్శకుడయ్యెను. కావ్యములకు శుద్ధప్రతులను సిద్ధముచేయునప్పుడు లభించిన విశేష ప్రయోగములు, పలుకుబడుల నన్నింటిని గ్రహించి తన నిఘంటువులు "దినదినాభివృద్ధి" పొందుటకు తగిన అవకాశములు కల్పించుకొనెను. సామాజిక పరిస్థితులను చక్కగా చిత్రించిన హంస వింశతి, శుకసప్తతి మొదలైన కావ్యముల వలన ఈ పనిలో ఆయనకు విశేషముగా సాయము లభించెను.

మొట్టమొదటినుండియు ప్రజల వాడుకభాషకు గల జవసత్వములను ప్రాముఖ్యమును గుర్తించిన బ్రౌనుదొర మహా విద్వాంసులైన తన పండితులు తమ వ్యాఖ్యలు మొదలైనవి వ్యావహారిక భాషలో వ్రాయుటను ప్రోత్స హించెను. ప్రజలు తమలో తాము ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుకొనునప్పుడు సహజమైన భాష ఉపయోగింతురని ఎరింగిన బ్రౌనుదొర జాబులకు — తనకు ఇత రులు వ్రాసినవి, ఇతరులకు తాను వ్రాయించినవి, పత్రికలలో అచ్చయినవి — విశేష ప్రాముఖ్యమిచ్చి వాటిని సంపుటములుగా చేయించి తరువాతి తరముల వారికి వాటిని భద్రపరచి ఉంచెను. ఆనాటి భాషా విషయములు, సామాజిక సాంస్కృతిక విషయములు గ్రహించుటకు ఇవి "మూలధనములు"గా నేర్పడినవి. కావ్యముల సేకరణ పరిష్కరణ మొదలైనవాటి వలన కలిగిన మేలుతో సర్వ విధముల పోలిన మేలే ఈ జాబుల సంపుటముల వలన మనకు కలిగినది. కాని దురదృష్టవశమున, వాటి ప్రాముఖ్యము నింకను మన పరిశోధకులు గ్రహింప జాలకున్నారు. వాటిపై జరుగవలసిన పరిశోధనలు చాల గలవు. బ్రౌనుదొర వివిధ కావ్యములకు వ్రాసిన ఉపోద్ఘాతములు, కథా సంగ్రహములు, వ్యాస ములు పరిష్కరించి ప్రచురించినచో మన సాహిత్య విషయమున ఆయనకున్న అవగాహన, విమర్శదృష్టి మనకు తెలిసి ఆయన వ్యక్తిత్వము పూర్ణముగా నర్థ మగును.

మన భాషా సాహిత్యముల విషయమున ఆయనకున్న అవగాహన తెలుగు సాహిత్యముపై ఆయన వ్రాసిన వ్యాసము (Essay on the Language and Literature of the Telugus : 1839-1840, MJLS) సంపూర్ణముగ తెలియజేయగలిగి యున్నది. మన మహాభారతమును గురించి, తెలుగు కవుల అనువాదపద్ధతులను గురించి బ్రౌనుదొర అన్న క్రింది వాక్యములు, ఈనాటి పరి శోధకుల, సాహిత్య చరిత్రకారుల అభిప్రాయములతో పూర్తిగా సంవదించుచున్న వన్నచో - ఇంచుమించుగా - నూట ఏబది సంవత్సరములకు పూర్వమే ఒక విదే శీయుడు - మన సాహిత్య విషయముల నింత చక్కగా గుర్తించినాడన్నచో - ఆయన దృష్టి నైశిత్యము మనకు తెలియుచున్నది:

"The Mahabharata......is considerably abridged from the Sanscrit original,many hundred verses being often condensed into a paragraph, written in prose; indeed prose is interspersed in all the Telugu legends and poems, but no where so profusely as in the Bharata...''

"...In this ancient version of the Mahabharata some episodes are omitted; being too sacred to be translated. These are, the Bhagavat Gita (a portion of the Bhishma Parva or sixth book), the Vishnu Sahasranama, the Bhishma Stava Rajam and the Anusmriti..."

"...We may here remark that the Telugu translators take liberties (more than poetical) with their originals, for they consider a general outline quite sufficient to form a copy : thus they omit, transpose and insert, whatever they please..."

".. Besides (possibly wishing to conceal these deviations), the Telugu translation in all books set aside the numerical order of the Sanscrit, melting down ten or twelve (adhyaya) chapters into one (asvasa) book or canto. Thus it is not easy to trace in the original any passage regarding which comparison may be required..."

మహాభారతమును గూర్చి వ్రాసినట్లే తన వ్యాసములో బ్రౌనుదొర శ్రీమద్భాగవతమును గూర్చి కూడ నిట్లు వ్రాసెను :

"Next in popularity is the Telugu version of the Bhagavat: of which the tenth book (Dasamam) describing the life of Krishna, is eagerly perused; yet even in this their knowledge is very slight. Two or three favourite legends (as the Rucmini Kalyanam and Gajendra Moxam) with the (Jalacrida or Krishna Lila), Sports of Krishna with the Maids are in general use - other parts of the Bhagavat that teach a mysterious and incomprehensible sort of philosophy are likewise popular; but we rarely find any Telugu who pretends to understand what he so devoutly reads . "

బ్రౌనుదొర తాను పరిష్కరింపించిన అన్ని గ్రంథముల (ఇంచుమించుగా) లోను ఆయా పుస్తకములను గురించి కొన్నింటియందు దీర్ఘముగను, కొన్నింట లఘువుగను ఆంగ్లములో వ్రాసెను. ఇట్లు వ్రాసినవేగాక ఆయన తన వ్యాసములలో, లఘు రచనలలో, వాచకములలో, వ్యాకరణములలో, నిఘంటువు

ఐలో ప్రాసంగికముగ మన సాహిత్యమును గూర్చి ఇంగ్లీషులో చాల వ్రాసెను. వీటినన్నింటిని పరిశీలించి విషయములు అంతటిని గ్రంథములవారిగా కూర్చి ప్రచురించిన పరిశోధకులకు చాల ఉపయోగముగ నుండును.

మన సాహిత్యములోని ప్రముఖమైన ప్రతి కావ్యముపై మొగమోటమిలేక బ్రౌనుదొర తన అభిప్రాయమును తెలియజేసెను. పొగడవలసి వచ్చినప్పుడుగాని తెగడవలసి వచ్చినప్పుడుగాని నిస్సంకోచముగ బ్రౌనుదొర వ్యవహరించెను. కవులు పాండిత్యప్రకర్ష కోసము వ్రాసిన కావ్యములను, పండితులు తమ పాండిత్య ప్రదర్శనార్థము వ్రాసిన వ్యాఖ్యలను సమముగనే ఆయన దుయ్యబట్టెను. వసుచరిత్రాది శ్లేష కావ్యములు స్వదేశీయుల నాకర్షించినట్లు విదేశీయుల నాకర్షింపవనియు, వాటి ప్రయోజనము కూడ పరిమితమనియు ఆయన అభిప్రాయము. తాను వ్రాసిన 'తెలుగు సాహిత్య చరిత్ర' వ్యాసములో, శబ్ద చమత్కృతికి ప్రాముఖ్యమిచ్చి వ్రాసిన ఇంగ్లీషు కవులును గలరనియు, వారు శబ్దములతో చేసిన "గారడీ"ని మహా విద్వాంసుడైన డా॥ జాన్సన్ ఖండించినాడనియు ఈ సందర్భమున వ్రాసెను :

"Performing innumerable feats of perverted ingenuity which as Dr. Johnson says" are so difficult that we are inclined to wish they had been impossible".

నిన్నమొన్నటి వరకు పండితులలో చాలమంది నమ్ముచు వచ్చినట్లే బ్రౌనుదొర కూడ- ఆయన "కాలేజి పండితుల" ప్రభావమున కావచ్చును- అముక్తమాల్యదను అల్లసాని పెద్దన వ్రాసెనని నమ్మినట్లున్నది. ఈ వ్యాసములోనే, "Allasani Peddana, author of the Manu Charitra or Swarochisha Manu Charitra (C) who also wrote the Vishnu Chittiyam or Amucta Malyada" అని వ్రాసెను. మనుచరిత్ర సులభముగ నున్నదని పండితులాక్షేపించినప్పుడు తన పాండిత్య ప్రకర్ష కోసము విష్ణుచిత్తీయమును ఆయన వ్రాసినట్లు బ్రౌనుదొర విశ్వసించినట్లున్నది.

ఈ వ్యాసములో పరిష్కృత గ్రంథమును పేర్కొన్నప్పుడు (T) అనియు, దానికి వ్యాఖ్య కూడ నున్నప్పుడు (C) అనియు బ్రౌనుదొర సంజ్ఞ లేర్పరుచుకొని

వ్రాసెను.[95] పైని పేర్కొన్న ఇంగ్లీషు వాక్యములో మనుచరిత్రను (C) తో నిరూపించినట్లే, కుచేలోపాఖ్యానమును (T) తో నిరూపించెను. ("The Cuchelopakhyanam (T) in three cantos is likewise a very popular work".)

పాండిత్య ప్రకర్ష లేకుండ రమణీయముగనున్న కావ్యములు బ్రౌను దొరను విశేషము ఆకర్షించెను. ఈ ప్రకర్ష అధికముగనున్న కావ్యములలోని పద్యముల దగ్గర తాను సిద్ధము చేయించిన లిఖిత ప్రతులలో "Wretched pedantry" అని చాలచోట్ల వ్రాసికొనెను. తెలుగు రామాయణములలో అయనకు నచ్చిన రంగనాథ రామాయణమును గురించి తన వ్యాసములో "The reader will perceive...that the style of the Dwipada Ramayana though poetical is clear, easy and free from pedantry..."

1827 లో తాను అచ్చువేసిన "ఆంధ్ర-గీర్వాణ-ఛ్ఛందము" నకు వ్రాసిన Preface లో తెలుగు భాషాసాహిత్యములను గూర్చి చేసిన ప్రస్తావనలు, 1827 నాటికే(అనగా మనదేశమునకు వచ్చిన (1817) పది సంవత్సరముల కే) మన కావ్యముల విషయమున ఆయనకున్న అవగాహనకు మచ్చుతునుకలు. తెలుగు భాషా సాహిత్యములను గురించి ఇట్లు వ్రాసెను :[96]

"The Telugu language is perhaps no less, conspicuous among these spoken in India, for the extent, antiquity, and critical refinement of its literature, than were either of the languages of Greece or Rome. Every department of learning appears to have been cultivated in this tongue with zeal and success; it contains not only a long

---

95. "The (T) is used to denote that the text has in the last few years been completed and corrected . ..... Such are marked (C) have, besides a corrected text, a commentary written in familiar Telugu which explains every word" (Essay on the Language and Literature of the Telugus — The Madras Journal of Literature and Science : 1839 - 1840).

96. The Prosody of the Telugu And Sanscrit Languages Explained (ఆంధ్ర-గీర్వాణ-ఛ్ఛందము) Madras, 1827, Preface.

series of original compositions, but Mahabharata, the Bhagavata, and most of the principal sanscrit poems have been translated by Telugu poets in remote times into their own language. To these also are added numerous versions of the lesser productions".

తెలుగు కావ్య భాషకు ప్రజల వ్యావహారిక భాషకు గల భేద సాదృశ్యములు; ఇంగ్లీషు కావ్యభాషకు ఇంగ్లీషు వారి వాడుక భాషకుగల పోలికలు తేడాల వంటివే అని బ్రౌనుదొర వ్రాసెను. తెలుగులో నుండి జారిపోయిన ప్రాత పలుకుబళ్లు, సంస్కృత శబ్దములు కొన్ని ఇంగ్లీషు నుండి భ్రష్టమైన "శాగ్జన్" (Saxon) పదముల వంటివేయని వ్రాసెను. ఈ సందర్భమున ఆయన వ్రాసిన క్రింది వాక్యములు పరిశీలనార్హములు:[97]

"The language in which many of these are written is indeed different from the spoken dialect, but not in general more so than the language of Shakespeare or Milton differs from the English of the present day. Some poetical expressions have become obsolete, and some Sanscrit words in the Telugu, as Saxon in the English, may have fallen into disuse.. ..."

కొన్ని ప్రాతపలుకుబళ్లు ఉన్నంత మాత్రముచేత ప్రసిద్ధములైన కావ్యములు భాష నభ్యసించువారికి అనావశ్యకము లనుకొనుట పొరపాటనియు వాటి ఆవశ్యకమెంతయో కలదనియు నిట్లు వ్రాసెను.[98]

"......the old established authors of reputation in each language form the standards to which the poet and the grammarian, the native and the foreigner must ultimately have recourse in solving every doubt regarding exactitude and purity of style".

తెలుగు చదువుకొను విదేశీయులు – వేమన పద్యములతో ప్రారంభించి తరువాత నలచరిత్ర; రంగనాథ రామాయణము; మహాభారతములోని కొన్ని భాగములు; శ్రీమద్భాగవతములోని ఎనిమిదవ, పదవ స్కంధములు క్రమక్రమముగా చదువుచు వచ్చుట ఉపయోగకరమని ఆయన భావించెను. ఆయన దృష్టిలో,

97. Ibidem : Preface.

98. Ibidem : Preface.

తెలుగు సాహిత్యములో నివి ముఖ్యమైన భాగములు:[99] "The Puranas in general, and these works in particular, embrace the easiest part of the literature of the language".

ఇవి చదివిన తరువాత చదువదగిన కావ్యములను ఆయన "అలంకార కావ్యములు" (Alancara Cavya) అనెను. ఇవి శైలిలో, క్లిష్టతలో పై వాటి కంటె భిన్నములని ఆయన తెలిపెను. వీటిలో-తారాశశాంకము, సుభద్రాపరిణయము, మనుచరిత్ర, దశావతార చరిత్ర, హంసవింశతి మొదలైనవి చేరునని వ్రాసెను. వీటి తరువాత, దేశీయ విద్వాంసులకును కష్టము లనిపించు రచనలు కలవని ఇట్లనెను:[100]

"...... beyond which are placed works some parts of which are difficult to the most accomplished native scholars, such as the Raghava Pandaviyam, the translation of the Naishadham, the Vishnu Chittiyam, and finally the Vasu Charitra, which is unanimously considered the most elaborate work in the language."

వివిధ భాషలలో నిష్ణాతుడైన బ్రౌనుదొరకు తెలుగు రచనలను పాశ్చాత్య భాషలలోని రచనలతో పోల్చి కొన్ని వాక్యములు వ్రాసినగాని తృప్తి తీరదనిపించును. తెలుగు పురాణములను పోలినవి గ్రీకునను గలవని ఇట్లు వ్రాసెను:[101]

"Thus Ovid's Metamorphoses, the writings of Hesiod, and the other Greek Theogonies are precisely Puranas."

తెలుగులోని "అలంకారకావ్యము"లైన సుభద్రాపరిణయ తారాశశాంకాదులను ఇతర భాషలలోని కావ్యములతో పోల్చుచు నిట్లు వ్రాసెను:[102]

"......are poems each of which contains a single tale, but highly ornamental, embellished with episodes and elaborate descriptions of beauty, war, love, and natural scenery; their object being amusement, and their subjects usually confined to the actions of

---

99. Ibidem : Preface.
100. Ibidem : Preface.
101. Ibidem : Preface.
102. Ibidem : Preface.

men. They may therefore, be compared to Pope's Rape of the Lock, the principal poems of Byron and Scott, the tale of Joseph and Zuleica in Persian, and similar compositions."

బ్రౌనుదొర ఇంగ్లీషులో వ్రాసిన ఈ భాగములన్నియు ముఖ్యముగా ఇంగ్లీషువారికొరకే గనుక, ఆయా పోలికలు వారికి సులభముగనే అర్థమగునని తలంచెను. ఇట్లు చూపుటవలన, తెలుగు కావ్యముల ఉదాత్తత- ఒక్కమాటలో వాటి కలరూపు- ఇంగ్లీషువారికి సులభముగా అర్థమయియుండు ననుటలో సంశయములేదు. బ్రౌనుదొర ఆశించినదియు నదియే!

తెలుగు కావ్యములను వెలుగులోనికి తెచ్చుటతో బ్రౌనుదొర తృప్తి పడ లేదు. తెలుగు లక్షణ గ్రంథములను కూడ క్షుణ్ణముగ అధ్యయనము చేసిన వాడగుటచే ఆంధ్ర సంస్కృత భాషలలో నున్న వాటిలో కొన్ని లక్షణ గ్రంథము లను యథోచితముగ ఆంగ్లీకరించెను. ఆయా రచయితలను గురించి ఆయా రచన లను గురించి ఆయన అన్న మాటలు ఆయన విమర్శ దృష్టికి తార్కాణములు. నిస్సంకోచముగ ఆ రచనలలోని లోపముల నెత్తి చూపెను. కవి శిరోభూషణమును గురించి ఇట్లనెను: [103]

"In the Cavi Siro Bhushanam, a voluminous Sanscrit. commentary on the Telugu grammar, the critic remarks that "deviations from the rules of Cala are allowable, only if poetical authority is adducible." Such expressions leave the subject in great uncertainty: which can only be removed by a careful examination of the language as used by the poets".

ఆంధ్రశబ్దచింతామణిని బాలసరస్వతీయముతో కలిపి రెండుసార్లు ఇంగ్లీషులోని కనువదించిన బ్రౌనుదొరకు, వాటి ఉపయోగము పరిమితమని తెలిసి ఇట్లనెను: [104]

"After twice* translating the grammar of Nannaia Bhatt, with the comment upon it written by Bala Saraswati (if that really be the name of the author) into English, I am obliged to conclude that these works contain merely the outlines of a grammar; and that to comprehend them requires a previous acquaintance both with Telugu itself and with the rules of Sanscrit, as explained in the ancient grammarians.

---

103. Ibidem : On Orthography, Spelling etc. 104. Ibidem.

* మొదటిసారి అనువాదము, 1825. రెండవసారి, 1827.

The whole of these treatises are arranged in a manner so studiously abstruse, that unless the reader has a previous acquaintance with the principles to be explained, it is hardly possible for him to understand the mode adopted to define them. Several important rules also are omitted, while some points comparatively unprofitable are laboriously investigated."

మన ఛందస్సును చక్కగా అధ్యయనము చేసి "ఆంధ్రగీర్వాణచ్ఛందము" వ్రాసిన (1837) బ్రౌనుదొర ఆ శాస్త్రమునకు ప్రాణభూతములైన గ్రంథములను ఇంగ్లీషులోనికి అనువాదము చేసెను. భీమన ("Bhimana, or rather his son Mallaya Reca — who composed his work under his father's name....") కవిజనాశ్రయమును Refuge of Poets అని అనువాదము చేసెను. ఆయనకు - సులక్షణసారము, అప్పకవీయము అను వాటిపై గౌరవమధికము. ఆంధ్రగీర్వాణచ్ఛందము" తరువాత ఈ రెండింటిని చూడవలెనని ఇట్లు వ్రాసెను : [105]

"If, afrer perusing the present volume, the advanced student should refer (as I trust some will) to the native prosodians, among whom the Sulacshana Saram and Appa Caviyam alone deserve his attention...".

అప్పకవియన్న గౌరవమున్న ఆయన (అప్పకవి అన్ని భావములతో బ్రౌను దొర ఏకీభవించినాడని కాదు!) అప్పకవిని గూర్చి ఒక చోట, "Appa Cavi the chief critic in Telugu learning" అనియు; ఇంకొక చోట "Appa Cavi, the Chief critic in Telugu literature" అనియు వ్రాసెను.

ఛందస్సు విషయమున మన తెలుగు కవులు తీసికొనిన స్వాతంత్ర్యమును, పాటించిన నియమములను చక్కగా గ్రహించిన బ్రౌనుదొర, తెలుగు కావ్యముల శుద్ధప్రతులను సిద్ధము చేయుటలో ఈ పరిజ్ఞానమును వినియోగించుకొనెను ఛందశ్శాస్త్రము నభ్యసించినగాని తెలుగు కావ్యముల పాఠభేదములను పరిష్కరించుట

105. Ibidem. On Rhyme.

కష్టమని గుర్తించిన బ్రౌనుదొర; తెలుగు కవులు ఛందస్సూత్రముల విషయమున అవలంబించిన వివిధ దృక్పథములు, శాస్త్రవేత్తలు నిర్ణయించిన సూత్రములు, అపవాదములు, కవులు చేసిన ఉల్లంఘనలు - అన్నింటిని తన పరిశీలనకు విషయములుగ చేసి విమర్శించెను. తాను వ్రాసిన గ్రంథము 'ఆంధ్రగీర్వాణచ్ఛందము' గనుక, సంస్కృతాంధ్రముల ఛంద స్సూత్రములకు గల సామ్య వైషమ్యములను నిశితముగా గుర్తించి నిష్కర్షగా చెప్పుటయే గాక, గ్రీకు, లాటిను, ఇంగ్లీషు మొదలైన భాషలలోని చంద స్సూత్రములతో వాటిని పోల్చిచూచి ఫలితములను నిరూపించెను. ఈ తులనాత్మక పద్ధతి చాల విశిష్టమైనది. సంస్కృత విషయములను ప్రస్తావించునప్పుడు పాశ్చాత్యులైన హెన్రీ థామస్ కోల్ బ్రూక్ (Henry Thomas Colebrooke : 1765-1837), రివరెండ్ విలియమ్ యేట్స్ (Rev. William Yates : 1792-1845) వంటి సంస్కృత విద్వాంసుల వ్యాకరణాదులను, దేశీయ విద్వాంసులైన రాధాకాంతదేవ్ (1784-1867 : శబ్దకల్పద్రుమమను సంస్కృత నిఘంటు నిర్మాత) వంటి వారిని సంప్రతించినట్లే ఇంగ్లీషు విషయమున డా॥ శామ్యూయల్ జాన్‌సన్ (Dr. Samuel Johnson 1709-1784) వంటి వారి రచనలను సంప్రతించెను.

ఛందస్సూత్రముల విషయమున- ప్రత్యేకముగ శకటరేఫల ప్రయోగమున స్వాతంత్ర్యము నవలంబించిన "ఆధునిక" కవులకు చాలమందికి పోతరాజు భాగవత ప్రయోగములు అండగా నున్నవనియు, ఈ రేఫల సాంకర్యమంతగ పట్టించుకొనవలసినది కాదనియు వ్రాయుచు "ఇంగ్లీషు స్పెల్లింగ్" విషయమున డా॥ జాన్‌సన్ అవలంబించిన విధానముతో పోల్చి వ్రాసెను: [106]

"The discrepancy between the two letters R is, I believe disregarded by all modern Telugu poets ; who may fairly justify themselves by the high example of Potu Razu, the writer of the Bhagavata. The difference is, I imagine, of very small consequence, and may be compared to that between the spelling used by Dr. Johnson and that of the present day in the words intercessour, governour, emperour ; these we now write without the penultimate u, which however, we retain at pleasure in a few other words as favour, honour, honourable, etc..........".

---

106. Ibidem ; On Orthography, Spelling & C.

ఛందోవ్యాకరణాదుల విషయమున పోతన స్వాతంత్ర్యము నవలంబించి యుండుటచే, అప్పకవ్యాదులు ఆయన కవిత్వమును లక్షణ విరుద్ధముగ జమకట్టి భాగవతము నుండి లక్ష్యములు నీయరైరి. ఈ విషయమును బ్రౌనుదొర ఇట్లు ఆంగ్లమున వివరించెను : [107]

"The author of the Telugu Bhagavata has taken great liberties in rhyme, so that his works are not often quoted by criticks in the language ; he allows the hard and soft letters to rhyme in prasa which is contrary to rule",

లాక్షణికులు భాగవతము విషయములో మౌనము వహించినను సహృదయులు దాని కవిత్వమును మెచ్చుకొందురని ఇట్లు వ్రాసెను : [108]

"None, but criticks however, would object to that version which is a remarkable specimen of the purity, richness and hormony of the language ; and all scholars give it this due praise".

తెలుగు కావ్యముల సేకరణ, సంస్కరణ, ముద్రణ విషయమునందు బ్రౌనుదొర చూపిన శ్రద్ధాభినివేశముల వలన మన కావ్యములకు జరిగిన ఉపకారముతో సర్వ విధముల పోలిన ఇంకొక ఉపకారము, ఆయా కావ్య భాగములకు ఆయన చేసిన ఆంగ్లానువాదముల వలన జరిగెను. ఈ అనువాదములన్నియు ఒకే స్థాయిలో లేకున్నను వీటివలన మొట్టమొదటిసారి విదేశీయులకు తెలుగు సాహిత్యములోని ప్రసిద్ధ కవుల రచనల రుచి వాచవిగానైన లభించినదనుట నిర్వివాద విషయము.

తానను వాదమునకు గ్రహించిన పద్యముల మూలసౌందర్యము చెడకుండ ఆంగ్లానువాదములు చేయవలెనను దృఢ సంకల్పముతో బ్రౌనుదొర చాలవాటిని ఇంగ్లీషులో వచన రూపము గాక ఛందోరూపమున ప్రదర్శించెను. ఈ సందర్భమున ఆయన వినయముతో వ్రాసిన వాక్యములు ఆయన చిత్తశుద్ధికి నిదర్శనములు : [109]

---

107. Ibidem. On Rhyme. Foot Note No. 2

108. Ibidem.

109. Ibidem. Preface.

"It is well known however that a literal translation into English of any language so widely different from it as the Telugu, would convey but a poor idea of the beauty of the sentence, and approximate but in a very distent degree to the spirit of the original. The author has therefore thought it best to take advantage of the license given by verse to approach as far as his limited poetical powers allowed him, to the style of the quotations ; and most of these will accordingly be found in English metre. He does not profess however to be a poet, and he accordingly craves the indulgence of his readers for his attempts in poetry".

బ్రౌనుదొర అనువాదములను పరిశీలించినప్పుడు, ఆయనకు తెలుగు సాహిత్యము నందున్న పాండిత్యము; మాతృ భాష యైన ఇంగ్లీషు నందున్న అధికారము, రచనా పాటవము స్వయం వ్యక్తములగును. ఇంగ్లీషు మాతృ భాషగా గల ఆయన సమకాలికులైన ఉద్యోగులలో చాల మందికి, ఆ భాషా సాహిత్యములతో బ్రౌను దొరకున్నంత సాధికారమైన సంబంధము లేదు. బ్రౌనుదొరకు ఇంగ్లీషు లోనే గాక గ్రీకు, లాటిను, ఫ్రెంచి మొదలైన అనేక పాశ్చాత్య భాషలలో ; ఫార్సీ, హిందుస్థానీ, బెంగాలీ, తమిళ, కన్నడాదులైన అనేక ప్రాచ్య భాషలలో పాండిత్య ముండుటవలన భాషా విషయకముగ ఆయన ఏ కృషిచేసినను దానికొక ప్రామాణ్యము, గాంభీర్యము లభించుట జరిగినది. ఆయన చేసిన అనువాదములు చాలవరకు ఛందో రూపమున నుండుట ఇంకొక విశేషము. తెలుగు సాహిత్యము లోని కొన్ని ఉద్గ్రంథములలోని కొన్ని పద్యములకు ఆయన చేసిన అనువాదము లను పరిశీలింతము. *

భారతము ఆదిపర్వములో ప్రథమాశ్వాసమున వచ్చు సహస్ర పాదుని వృత్తాంతములోని క్రింది పద్యమును బ్రౌనుదొర అనువదించిన పద్ధతిని పరిశీలింతము :

ఉత్పలమాల॥ "భూనుత కీర్తి బ్రాహ్మణుఁడు పుట్టఁగఁ దోడనె పుట్టునుత్తమ
జ్ఞానము సర్వ భూతహిత సంహిత బుద్ధియుఁజిత్తశాంతియున్
మానమద ప్రహారము సమత్వము సంతత వేద విద్యను
ష్ఠానము సత్యవాక్యము దృఢ వ్రతముం గరుణాపరత్వమున్."

---

* ఈ ఉదాహరణలు బ్రౌనుదొర 'ఆంధ్రగీర్వాణచ్ఛందము' (1827) నుండియు 'తెలుగు వాచకము' నుండియు గృహీతములు.

(ఈ నడుమ అచ్చయిన ఆదిపర్వమున "పుట్టుదు (దోడన", "మానమద ప్రవాహము" అని పాఠాంతరము లున్నవి.)

బ్రౌనుదొర అనువాదము :

"With him who is of spirit pure
Are wisdom born, and love of all ;
For he is gentle, humble, chaste,
And never from the truth will fall ;
Austerity, veracity,
And kind benevolence has he".

ఈ అనువాదము క్రింద ఇచ్చిన అధఃసూచికలో బ్రౌనుదొర, "If the word క్రీస్తునుడు be substituted for బ్రాహ్మణుడు, it will scan equally well, and the sentiment may appear better applied", అని వ్రాసెను. ఈ గ్రంథములో సొంతముగా చాల లక్షణగ్రంథములు వ్రాసిన బ్రౌనుదొరకు ఈ మాత్రము మార్పు సూచించుట కష్టమైనది కాదు! స్వమతానురాగియని ఈ మాత్రము మెచ్చుకొనుటనుకూడ మనము అర్థము చేసికొనగలము !

దేవదానవుల యుద్ధమును వర్ణించు ఘట్టముననున్న క్రింది పద్యమును, ఆంగ్లానువాదమును పరిశీలించిన బ్రౌనుదొర అనువాద కౌశలము వ్యక్తమగును. (ఆదిపర్వము, ద్వితీయాశ్వాసము).

మహాస్రగ్ధర॥ అమరేంద్రారాతు లిట్లాహవ ముఖమున నేయంగ(దీక్ష్ణబాణౌ
ఘముఘోరంబై సురానీకముపయి(బెలుచంగప్పినం జూచిదైత్యా
ధముల౦ గోదండ చక్రోద్ధత భుజులు మహాదారుణుల్ వీరవిక్రా
రమణుల్ దుర్వార వాక్యారయమున నరనారాయణుల్
దాకిరల్కన్".

బ్రౌనుదొర అనువాదము :

"The Demons, foes of the Immortals, hurl'd
Along the battle's front their dreadful darts,
And arrows wing'd with wo ; which all obscur'd

The hosts on either side ; but arm'd with bow,
And moonydisc on their broad shoulders slung,
Glorious, in panoply of light array'd
Narayana, and Arjun (Nara nam'd)
Rush'd forth, and on the hosts devoted fell".

(ఈ నడుమ అచ్చయిన ఆదిపర్వమున "దైత్యోత్తములం" అనియు, "చక్రోద్యత భుజాలు" అనియు పాఠాంతరములున్నవి.)

ఈ అనువాదములలో కొన్నిచోట్ల మూలమందున్న విశేషణాదులన్నియు ఇంగ్లీషులోనికి తీసికొనిరాక, ఇంగ్లీషు నుడికారమునకు తగినట్లు- అతిశయోక్తులను తగ్గించి- మూలభావము చెడకుండ సంక్షిప్తముగ బ్రౌనుదొర అనువాదము చేసిన భాగములును గలవు.

బ్రౌనుదొరకు నలదమయంతుల కథ అన్న ఇష్టము. దీనిని ఆయన "....beautiful tale of Nala and Damayanti...." అని వర్ణించినాడు. "దేవతలను విడిచి, మనుష్యమాత్రుడనైన నన్ను వరించుట తగదు" అని నలుడు దమయంతితో చెప్పు సందర్భముననున్న భారత పద్యమును, బ్రౌనుదొర అనువాదమును పరిశీలించిన పై విషయము తేటతెల్లమగును :

మత్తకోకిల॥ "భూరిసత్త్వులు సర్వలోక విభుత్వ భూతిసమృద్ధి లి
ద్ధోరుకీర్తులు నిన్ను గోరుచు నున్నవారు సురోత్తముల్;
వారి పాదరజంబుఁబోలని వాని నన్ను మనుష్య సం
సారిఁ గోరఁగఁ జన్నె నీకుఁ బ్రసన్నులై సురలుండగాన్"

బ్రౌనుదొర అనువాదము :

"While the noble in battle, while princes compete
Thy worthier consort to be,
Shall I, who am but as the dust of their feet
Sweet maid be accepted by thee ? "

తెలుగు సాహిత్యముతో పరిచయ మనగా; తెలుగు కవులను గూర్చి తెలుగు కావ్యములను గూర్చి లోకములో ప్రచారములో నున్న ఐతిహ్యములు కూడ తెలిసియుండుట యని భావించిన- జనులలో వాడుకలో నున్న కథల

ప్రాముఖ్యమును కూడ గుర్తించిన- బ్రౌనుదొర తిక్కన పద్యము నుదాహరించు నప్పుడు ఇట్లు వ్రాసెను :

"Ticcana Somayaji, who wrote a part of the Telugu Bharata, being asked which of his verses he considered most perfect, adduced the following, which appears in his translation of the Virata Parva, or fourth book of that poem. It is in the Sardula metre."

శార్దూలవిక్రీడిత॥ సింగం బాకటితో గుహాంతరమునం జేర్పాటు మైనుండి మా
తంగస్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చు నో
జం గాంతార నివాసఖిన్నమతి యన్మత్సేనపై వీడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్".

బ్రౌనుదొర అనువాదము :

"As when a lion, stung with hunger, views
From out his cave, of elephants a herd
And springs with sudden rage abroad, his heart
Full of the bitter grief of solitude,
Behold, against our army rushes forth
The Third, who joys in battle, with a form
Impenetrable ; dreadful Arjun he".

భాగవతలోని అత్యంత ప్రసిద్ధమైన గజేంద్ర మోక్షణములోని సుప్రసిద్ధ పద్యమైన :

"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితఃపరం బెరుగ మన్నింపందగుం దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా".

అనుదానికి బ్రౌనుదొర చేసిన అనువాదములు రెండు- ఒకటి వచనమున, ఇంకొకటి ఛందోబద్ధముగ- గనంబడుచున్నవి. ఈ అనువాదములు ఆయన ప్రచురించిన తెలుగు వాచకము (Telugu Reader, 1852) లో నున్నవి :

బ్రౌనుదొర అనువాదము :

"I have not the cast strength : resolution is dissolved : my spirits have left me : fainting comes o'er me : my limbs are wasting away : it is ill with me : I know none but thee : it is right that thou shouldst rescue me : Come to aid me O Lord ! Deliver me thou who grantest our prayers ! "

"దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింప మేలు దీవన బొందన్
దీనావన నీ కొప్పును
దీనపరాధీన దేవదేవమహేశా !"

శ్రీమన్నారాయణుని భక్తవత్సలత ప్రత్యక్షముగ నీక్షించిన లక్ష్మీదేవి ఇట్లనును.

బ్రౌనుదొర అనువాదము :

"To listen to the prayer of the wretched, to rescue the humble, to gain the highest praise, O Saviour of the helpless, is thine alone ! hou who art the refuge of the miserable ! "

"లావొక్కింతయు లేదు...." అను పద్యమునకు ఆంగ్లమున పద్యానువాద మిట్లున్నది :

"I faint for breath ! my strength is gone ! I die
My soul is spent; this is my latest sigh
I sink, my limbs are yielding, I am gone,
Thou art my sole reliance, thou alone !
Save me O Lord, rescue my sinking heart
My hope, my life, my all alone thou art ! "

మూలభావమును పోనీయకుండ, ఇంగ్లీషు నుడికారము చెడకుండ బ్రౌను దొర చేసిన అనువాదము, తెలుగులో ఆయనకు గల పాండిత్యమును ఇంగ్లీషులో ఆయన కున్న స్వాతంత్ర్యమును తెలియజేయుచున్నది.

అశరీరవాణి మాటలు విని దేవకిని చంపనుద్యుక్తుడైన కంసునితో వసుదేవుడు పల్కిన పల్కులను, పోతన భాగవతము నుండి గ్రహించి బ్రౌనుదొర ఇట్లనువదించెను :

మత్తేభవిక్రీడిత ॥ చెలియల్ కన్నియ ముద్దరా లబల నీ సేమంబె చింతించు ని

ర్మల దీనిం బయిలాడు మాటలకు నై మర్యాద పోఁగొట్టి స

త్కుల జాతుండవు పుణ్యమూర్తి వకటా కోపంబు పాపంబు నె

చ్చెలి నోహో తెగ వ్రేయఁ బాడియగునే చింతించు భోజేశ్వరా!"

బ్రౌనుదొర అనువాదము :

"She is thy little sister, a virgin, simple and powerless, she wishes thy prosperity alone; Do not for a word uttered from the sky cast off all rectitude, and murder this pure one ; O thou of noble descent, and virtuous mind, alas, wrath is a sin ! ah, does it become thee to kill thy sister O lord of Bhoja ! "

'అహల్యా చరిత్ర' బ్రౌనుదొర నాకర్షించినదనియు, వివిధ కావ్యములలో నున్న ఆ కథా భాగములను పృథక్కరించి వాటి కాంగ్లానువాదములు బ్రౌను దొర చేసినాడనియు తెలిసికొంటిమి. (ఈ పరిశోధన గ్రంథములో పుట - 176).

బ్రౌనుదొర, పద్మపురాణమందు మూడవ ఆశ్వాసములోని అహల్యా కథ నాంగ్లీకరించెను. ఇంద్రుని స్వగతమైన క్రింది పద్యమును దాని యాంగ్లాను వాదమును పరిశీలించిన బ్రౌనుదొర ప్రతిభా వ్యుత్పత్తులు అర్థమగును:

ఉత్పలమాల ॥ "ఇచ్చట నున్న నన్నుగని యీ ముని యేమని శాపమిచ్చునో?

వచ్చిన చేటు వచ్చెనని వామవిలోచనఁ బట్టికొంటినే ?

యిచ్చనెఱుంగ కేమనునొ యీ పని గాదని యూరకుంటినే ?

పచ్చని వింటిజోదు నను బాణపరంపర నొంపుఁదెంపునన్".

బ్రౌనుదొర అనువాదము :

"It he perceives me in the bower,

The hermit's wrath I dread ;

If I defy his magic power

And seize the rosy maid ;
My suit she may reject with scorn !
If hopeless I retire,
The cureless wounds of love to mourn,
I perish with desire !

దశావతార చరిత్ర పదవ ఆశ్వాసములో కూడ అహల్య కథ వచ్చును. దానినికూడ బ్రౌనుదొర వేరుగ ఇంగ్లీషులోని కనువాదము చేసెను. అందలి యుదాహరణమొకటి :

చం|| "సురపతినట్టె చూచుఁదను జూచిన యంతన చూపుఁద్రిప్పు వే
మరుఁగను సన్నసేయఁగని మార్మొగమౌఁగన నట్లదీనుఁడై
కరమున మ్రొక్కవేగ నెదఁ గ్రమ్మరగేల్గవ మోడ్చుచున్ నిజా
దరమరకంట నొక్కఁగని తన్విని చుక్కనునొంటిపాటునన్."

బ్రౌనుదొర అనువాదము :

"She gaz'd on him until his eye
Met her's — then sudden turn'd ;
His wink with sidelong glance would spy
As if she nought discern'd.

If he his hands despairing clasp'd,
She gently clos'd her own ;
His lip he bit — "For shame !" she cried,
When him she met alone."

శృంగారము వెల్లివిరిసియున్న పద్యముల నెంత కోమలముగ ననువదించెనో అంత సుకుమారముగను, జడభరతుని మనస్సు నాహరించిన లేడిపిల్ల అందమును బ్రౌనుదొర - స్వకపోలకల్పిత కవితయా అన్నట్లు- అనువాదమున తెచ్చి వర్ణించెను. విష్ణుపురాణము తృతీయాశ్వాసములోని పద్యమిది :

సీసము॥"పూర్ణమేయంగ దవ్వులబోయి యెవ్వేళ చూచు దిగులుచే గ్రమ్మర దిరిగివచ్చి

సారెసారెకు నాశ్రమ సమీపంబున వేడ్కతో గంతులు వేయుచుండు

మలయుచు వచ్చి కోమల శృంగయుగ్మంబుచేత నెమ్మదిని గండూతి దీర్చు,

యోగాసనంబున బాగుగ నుండు మొవ్వంపుతోడి పై వీక్షించు

ఆ॥వె॥ పర్ణశాలచుట్టు పసవులు పెట్టును

తేటయైన పూర్ణమేత మేయు

అనుదినంబు నిట్టు లా మృగశాబంబు

ముద్దు చూపుచుండు మునివరునకు".

బ్రౌనుదొర అనువాదము :

"If, grazing in the distant plain

The fawn a tiger spied,

All timid she would turn again,

And near the hermit hide,

She frolic danc'd about his bower,

And, at the stilly vesper hour,

While mute he sat and pray'd,

Approaching close, with gesture bland

In his soft lap, beneath his hand,

Her forehead fair she laid,

On dewy buds she still would graze

His hermitage around,

And woo'd her fostering master's gaze

With high elastic bound".

బ్రౌనుదొర అనువాదములు స్వకపోల కల్పిత కవితలవలె కన్పట్టుట విశే

షము. ఆయనది కవిశాస్త్ర ఆయన జీవించిన కాలము (1798-1884), ఇంగ్లీషు సాహిత్యములో కాసారకవులు (Lake Poets) ఇతర కాల్పనిక (Romantic) కవులు * – కవితలో నూతనత్వమును సాధించిన కాలమునకు అత్యంత సన్నిహితమైనది. ఇంచుమించుగ సమకాలికమన్నను దోషము లేదు. బైరన్ (Byron) కాని బ్రౌనుదొర ఉదాహరించినాడుకూడ! కాల్పనిక కవితకు మేలుకొలుపులు పాడిన "లిరికల్ బేలెడ్స్" (Lyrical Ballads) వెలుగు చూచిన 1798 సంవత్సరమే బ్రౌనుదొర జన్మ సంవత్సరము! ఇవన్నియు ఆయన సహృదయ సౌకుమార్యమును జాగృతముచేసి, ఆయన వ్రాసిన ఇంగ్లీషుభాషకు, ఇంగ్లీషు కాల్పనిక కవుల శబ్దసౌందర్యమును సంతరించి పెట్టెను.

'సుభద్రాపరిణయము'లోని పద్యమున కాయన చేసిన అనువాదము సులభము, సుందరము. మొత్తము మీద బ్రౌనుదొరను మనము బహుభాషా కోవిదునిగ, పండిత పరిశోధకునిగ, పరిపాలనాదక్షునిగ పరిగణించినను; ఈ అనువాద భాగములు చూచినప్పుడు మాత్రము ఆయన సుకుమార హృదయుడు,సుకవి అని అనకుండ నుండలేము. తన ఛందశ్శాస్త్రమునగల లక్షణములకు లక్ష్యములుగ పనికివచ్చు పద్యముల నేరికొనిన సందర్భమున గూడ, వాటి అనువాదముల నింత మనోహరముగ చేసినాడన్నచో ఆయన ఆంగ్ల రచనాపాటవము కూడ మనకు స్వయం వ్యక్తమగుచున్నది గదా!

---

* William Wordsworth (1770 - 1850) ; Samuel Taylor Coleridge (1772 - 1834) ; Lord Byron (1788 - 1824) ; Percy Bysshe Shelley (1792 - 1822) ; John Keats (1795 - 1821).

చాల సంవత్సరముల వరకు తనకు కూడ కవితా రచన యన్న మక్కువ యనియు, ఇంగ్లీషు కవులైన - పోప్ (1688 - 1744) బైరన్, స్విఫ్ట్ (1667 - 1745) ల ననుసరించి వ్రాసెడివాడననియు ఆయన తెలిపెను. (ఈ పరిశోధన గ్రంథములో పుట-76).

సుభద్ర అంతఃపురములోనికి పోవుచు అర్జునుని క్రీగంట చూచినట్లు వర్ణించిన పద్యమిట్లున్నది :

తేటగీతి ॥ "అంతఃపురమున కరుగుచో నింతిమరలి

వారగాఁ జూచినపుడు శృంగార రసము

పారమైయుబ్బి జాలైతె నౌరదాని

చలమనోహర లోచనాంచలము చెలువు".

బ్రౌనుదొర అనువాదము :

"Ent'ring her room, the maid aside

With sudden glance her warrior spied ;

A flood of loveliness around

In welling joy his spirit drown'd".

బ్రౌనుదొర చేసిన అనువాదములన్నియు - ఇంచుమించుగా - ఆంగ్లాంధ్ర భాషలలో ఆయనకున్న స్వాతంత్ర్యమును పాండిత్యమును తెలుపజాలియున్నను. కొన్నికొన్ని చోట్ల తెలుగు మూలమునకును ఆంగ్లానువాదమునకును భేదమున్న భాగములను కన్పట్టుచున్నవి. ఉదాహరణకు, విష్ణుపురాణములోని క్రింది పద్యమును దాని ఆంగ్లానువాదమును గ్రహింపవచ్చును :

"నీరదములు లేక నిర్మలాకారమై

యాకసంబుఁ జూడ నతిశయిల్లె

విగ్రహంబు లెల్ల విడిచి సమ్యగ్జ్ఞాన

యుక్తుఁడైన దివ్యయోగి బోలె"

బ్రౌనుదొర అనువాదము :

"Devoid of clouds the azure sky

In stainless glory shone,

Like souls that idol - homage fly

And worship God alone".

తెలుగు పద్యములోని మూడు నాలుగు పాదముల ఆంగ్లానువాదమును పరిశీలించిన ఈ విషయము తేటతెల్లమగును.

ఇవన్నియు వ్రాయునాటికి బ్రౌనుదొర వయస్సు ముప్పదికిలోపు! అప్పటికప్పుడే పది సంవత్సరములనుండి గ్రంథ సేకరణ సంస్కరణాది కార్యక్రమములలో నిమగ్నుడైయుండె ననవచ్చును. పాలకవర్గమునకు చెందిన నవయువకుడైన ఒక తెల్లదొర- వయస్సుమళ్ళిన లేదా మధ్యవయస్కులైన తెలుగు పండితుల నడుమ కూర్చుండి తెలుగు కావ్యముల సముద్ధరణ కార్యక్రమమును నిర్వహించుచుండెడి దృశ్యము, ఈనాడు కూడ నమ్ముటకు కొంత కష్టమైన, అనాటి నగ్న సత్యము! "ఆంధ్రగీర్వాణచ్ఛందము" 1827 లో అచ్చయినను, దాని లిఖితప్రతిని కాలేజి బోర్డు వారికి అయన 1825 నాటికే అందజేసెను! ఛందశ్శాస్త్రాధ్యయనము 1824 లో ప్రారంభించెను! ఒక్క సంవత్సరములో ఎంత కృషి!

1829 లో వేమన పద్యములను ఇంగ్లీషు అనువాదముతో ముద్రించునాటికే (అప్పటికి ఆయన వయస్సు ముప్పది ఒకటి) తెలుగు కావ్యముల సేకరణకు అయన శ్రీకారము చుట్టి చాలకాలమైనదనవచ్చును. వేమన పద్యముల లిఖిత ప్రతులకు - ఆ సేకరణోద్యమములో ప్రథమ స్థానమున్నను, మిగిలిన తెలుగు కావ్యముల సేకరణయు జరుగుచుండెనని చెప్పుటకు 1827లో అచ్చయిన "ఆంధ్రగీర్వాణచ్ఛందము"లో నుదాహృతములైన వివిధ గ్రంథములలోని పద్యములే సాక్ష్యములు.

ఈ గ్రంథసేకరణ కార్యక్రమము ఆయన ఉద్యోగములో చేరినప్పటి నుండియు కలదని స్థూలముగా చెప్పవచ్చును. కాని, ఆయన కడపలో ఉద్యోగములో చేరునాటికి (1820) తెలుగు కొంత మాటలాడగలిగినను దానిలో సామర్థ్యము మాత్రము క్రమక్రమముగ గాని వృద్ధి పొందలేదు. కడపలో నున్న కాలములో (1820 - 1822) ఎక్కువగా - గ్రీకు, హిబ్రూ, ఫార్సీ మొదలైన భాషల అధ్యయనమును తన విశ్రాంతి కాలములో చేసినట్లు ఆయనదే వ్రాసెను. (ఈ పరిశోధన గ్రంథములో పుట - 85) దీనితోడు, తెలుగు వ్యాకరణ నిఘంటువులను నిర్మించిన విలియమ్ బ్రౌన్ (ఈయన బ్రౌనుదొర బంధువు కాదు.) తెలుగులో సాహిత్యము లేదనియు, దాని అధ్యయనము వృథా అనియు నమ్మబలికి ఆయనకు కొంత నిరుత్సాహము కలిగించెను. ఇంతలో 1822 లో మచిలీపట్టణమునకు- ఆయనదే వ్రాసినట్లు "Masulipatnam, the Capital of the

Telugu Country...."—"జిల్లాకోర్టు రిజిస్టర్"గా బదిలీవచ్చెను.అక్కడ కోర్టు పండితుడు (సదర్ అమీన్), తాను జీవించి ఉన్నంతకాలము బ్రౌనుదొర గౌరవాదరములను పొందినవాడు అయిన వఠ్యం అద్వైత బ్రహ్మయ్య శాస్త్రిలుతో పరిచయమయ్యెను. ఈయనను గురించి బ్రౌనుదొర "....my very learned friend..." అనియు, "....Advyta Brahmia, the pandit belonging to the court in which I have the honour of being assistant judge..." అనియు వ్రాసెను. తరువాత ఈ శాస్త్రిలుగారు మద్రాసు కోర్టులో కూడ పండితునిగ నుండుటయు, బ్రౌనుదొర సాహిత్యకృషికి ముద్రణాదికమునకు సాయపడుటయు మనకు తెలిసిన విషయములే. (ఈ పరిశోధన గ్రంథములో పుటలు-188, 154, 155).

1820 లో కడపలో హన్‌బరీకి అసిస్టెంటుగా చేరిన బ్రౌనుదొర, ఆయనకు తెలుగు మాటాడుటలో గల అసర్గళతను మెచ్చుకొనిన బ్రౌనుదొర; 1824 లో హాన్‌బరీతో కలిసి తిరిగి పనిచేయుట తటస్థించినప్పుడు (ఈ మారు రాజమహేంద్రవరములో) తెలుగులో తాను సాధించిన ప్రగతికి హాన్‌బరీ మెప్పునుపొందినట్లు తన "సాహిత్య జీవిత చరిత్ర"లో తెలిపెను :

**"...At Cuddapah, I had been assitant to Mr. Hanbury, who spoke Telu gu easily ; indeed his example filled me with emulation. He had been twenty years in India. Four years after, he again was with me at Rajahmundry, and was surprised at the ease with which I spoke Telugu ; he remarked, "I think in English and then put it into Telugu ; but you seem to talk Telugu without care or forehought..."**

కడపలో ఉన్న రెండు సంవత్సరములు (1820-1822) గ్రీకు, హిబ్రూ పార్సీ చదవుచువచ్చినట్లే, ("In my leisure hours, while at Kadapa I read Greek, Hebrew and Persian....... I did not study Telugu ; though I daily corresponded in it..."); మచిలీపట్టణములో ఉన్న సంవత్సరములలో (1820-1824) లాటిన్‌లో బాగుగా కృషి చేసెను. ("I gave my leisure hours to Latin reading"). దీని అర్థము- తెలుగులో ప్రత్యేక కృషి చేయలేదని గాని, తెలుగులో వ్రాత

కోశలు మానినాడని కాదు ఈ కాలములోనే దేవనాగరి లిపిని, బెంగాలీ లిపిని కూడ (మచిలీపట్టణములో) నేర్చినట్లు తెలియుచున్నది.

ప్రత్యేక శ్రద్ధతో తెలుగు అధ్యయనమును 1824 లో ప్రారంభించి ఏడు సంవత్సరములు నిరంతర దీక్షతో చదివినట్లాయన వ్రాసెను :

**"At last in the year 1824, I was induced to commence a regular study of the Telugu poets ; and I read for seven years steadily..."**

ఈ ఏడు సంవత్సరములలో ఆయనకృషికి విజయ స్తంభములు — 1827 లో ఆయన పుస్తక రూపమున ప్రచురించిన "ఆంధ్రగీర్వాణచ్ఛందము", 1829 లో ప్రచురించిన "వేమన పద్యములు". పరిష్కరణకు సేకరించిన పదులకొలది తెలుగు కావ్యముల లిఖిత ప్రతులు. ఆయన భావికృషికి బలిష్ఠమైన పునాదులు ఈ కాలములోనే పడెను. తెలుగు కావ్యముల లిఖిత ప్రతుల సేకరణయేకాక, వందల కొలది ఇతర గ్రంథములను ఆయన సేకరించెను. 1836 నాటికి సంస్కృతాంధ్ర గ్రంథముల సేకరణకు 30,000 రూపాయల కంటె అధికముగనే సొంత డబ్బు వెచ్చించినట్లాయన తెలిపెను :

**"The Library of Sanscrit and Telugu manuscripts which I have collected cost me more than 30,000 rupees".**

సేకరణకైన ఈ ఖర్చునకు, శుద్ధ ప్రతులను తయారు చేయించుటకగు ఖర్చు — పండితుల జీతములు, వ్రాయసగాండ్ర జీతములు, కాగితములు మొదలైన వాటి ఖరీదు — కలిపినచో (వీరందరితో బాటు బ్రౌముదొర ప్రతిదినము పని చేసిన గంటల విలువ ? అది, అమూల్యము !) ఇంకను ఎన్ని వేలగునో అంచనా వేయుట కష్టము. 1836 నాటికి ఇంత ఖర్చయినప్పుడు, ఆయన 1884 లో కీర్తిశేషుడగు నాటికి — లేదా అధమపక్షమున 1855 లో మనదేశమును విడిచి పోవునాటికి — ఈ ఖర్చు ఎన్ని లక్షలకు పెరిగి యుండునో ఊహించుట కూడ అసాధ్యము ! ఈ లిఖిత ప్రతులలో, గ్రంథాలయము కొరకు సేకరించినవి కొన్ని యున్నవనుకొన్నను, మిగిలిన వాటికి - పరిష్కృత ప్రతుల తయారీకి - చాల ఖర్చయి యుండుననుటలో అతిశయోక్తి లేదు గదా !

ఈ సందర్భముననే - పండితులకు, వ్రాయసగాండ్రకు ఆయన ఇచ్చిన జీతములను గురించి కొంత తెలిసికొన్నచో ఆ నాటి పరిస్థితులు, బ్రౌనుదొర త్యాగము మనకు తెలియును. ఆలనా పాలనా లేక పండితులు అలమటించి

పోవుచున్న కాలమది! తమ్ము, ఎందులకును కొరగాని ఫించనీదార్లుగా అందరును పరిగణించుచున్నారని కళాశాల పండితులు తనతో చెప్పినట్లు బ్రౌనుదొరయే వ్రాసెను. (ఈ పరిశోధన గ్రంథములో పుట - 186) ఈ పరిస్థితులలో పండితులకు నెల జీతములిచ్చి విశ్రాంతిగా పనిచేయుటకు వసతి కల్పించి (కడపలో బ్రౌనుదొర ఇల్లే "కాలేజి") వ్రాయసగాండ్రను, "తీర్పు" చేయువారిని ఏర్పాటు చేసి, దేశము నాలుగు మూలలనుండి లిఖిత ప్రతులు తెప్పించి తెలుగు కావ్యముల పునరుద్ధరణ కార్యమును చేపట్టిన బ్రౌనుదొర ఆనాటి పండితులకు "సరస్వతికి... నివాస స్థానముగా" దర్శన మిచ్చుటలో ఆశ్చర్యములేదు!

తనచే నియోజితులై తెలుగు కావ్యముల సముద్ధరణ కార్యక్రమములో పాల్గొన్న వారికి వారి వారి పని క్రమమునుబట్టియు, పాండిత్యమునుబట్టియు బ్రౌనుదొర జీతము లిచ్చుచుండెను. ఈ పనికి మనుష్యులను ఎన్నుకొనుటలో కూడ ఆయన ప్రత్యేక శ్రద్ధ వహించెను. ఒక కావ్యములో ఎన్ని పద్యములున్నవో; ఆ పద్యముల పాఠాంతరములు పరిశీలించి తీర్పుచేసి శుద్ధప్రతిని సిద్ధముచేయుటకు ఎంతకాలము తీసికొనునో; పని వివిధ దశలలో, ఏయే దశలో ఎంతెంతమంది కావలసి యుందురో - అన్ని విషయములు సాకల్యముగ పరిశీలించి ఒక నిర్ణయమునకు వచ్చి తదనుసారము పనిలోనికి ఆయన దిగెడివాడు. కావ్యముల పరిష్కరణ విషయములోనేగాక; పరిష్కృత గ్రంథములకు శుద్ధ ప్రతులను తయారు చేయించుటలో, బైండు చేయించుటలో, ఉపయోగింపవలసిన సిరా, పేనా కాగితముల విషయములో కూడ ఆయన ప్రత్యేక శ్రద్ధ వహించెడివాడు. ఇందువలననే ఆయన సేకరించి పెట్టిన పరిష్కృత గ్రంథముల లిఖిత ప్రతులు నేటికి చెక్కు చెదరకుండ నున్నవి. మెకంజి సేకరించిన సామగ్రిని తిరిగి వ్రాయించినప్పుడుగాని, వర్తమాన తరంగిణిలో నచ్చయిన జాబులు మొదలైనవి కాపీ చేయించినప్పుడుగాని సిరా, కాగితము మొదలైనవాటి విషయములోకూడ శ్రద్ధ వహించెను. ("I therefore caused copies to be made on English paper with country ink"). వ్రాయసగాండ్రు, పండితులు తాము పనిచేయుచున్న చోట (కడపలో "బ్రౌను కాలేజి") మంచి పేనాలు దొరుకుటలేదనియు వాటిని దయచేసి పంపవలసినదనియు బ్రౌనుదొరకు వ్రాయుట కలదు ("యిక్కడ పేనాలు దొరకడం ప్రయాస అయినందున కొన్ని పేనాలున్ను ఒక పేనా కత్తిన్ని శెలవు దయచేసి పంపించవలెనని ఆ పుత్తరములో వ్రాసుకొని

వుంటిని. యిదివరకు ఆజ్ఞ దయచేయనందున నాకు వ్రాయడమును గురించి ప్రయాసగా వున్నది. త్వరగా శెలవు దయచెయ్యవలెనని కోరుతూవున్నాను" - గరిమెళ్ల వెంకయ్య, కడప. 1838 సం॥ డిశంబరు నెల 17 వ తేది).

మహాభారతమునకు పరిష్కృతమైన శుద్ధప్రతిని సిద్ధముచేయుటకు ఎంత ఖర్చగునను అంచనా బ్రౌనుదొర వేసుకొనినప్పుడు - పండితులకు, వ్రాయస గాండ్రకు పాఠకులకు ఎంతెంత ఈయవలసి యుండునో వ్రాసికొనెను. దానిని బట్టి మనకీ విషయములు తెలియుచున్నవి :

సాధారణముగా సగటున రోజునకు 80 పద్యములు పరిష్కృతములగును ఆదివారము ఇతరములైన పండుగ రోజులు, అనారోగ్య కారణమున పని జరుగనిరోజులు పరిగణించినప్పుడే సగటున 80 పద్యములు రోజునకు పరిష్కృతము లగునని తేలినది. బ్రాహ్మణ లేఖకులు సగటున రోజునకు ఏబది, అరువది పద్యములు చిత్తుప్రతిని వ్రాయుదురు. రెండు వందల పద్యములకు ఒక రూపాయి వ్రాతకూలి. పండితుడైన శాస్త్రికి నెలకు 15 రూపాయిలు, దిద్దువానికి నెలకు 12 రూపాయలు, పాఠకునకు నెలకు 8 రూపాయలు జీతములు. శుద్ధప్రతి వ్రాయుటకు 100 పద్యములకు ఒక రూపాయి కూలి. శుద్ధప్రతులు నిజముగా శుద్ధముగా నున్నవా లేవా అని ఒక పండితుడు పరిశీలించి, తాను చూచినట్లు తెలియజేయుటకై ఆ ప్రతిమీద సంతకముచేయు పద్ధతిని కూడ బ్రౌనుదొర ప్రవేశబెట్టెను. పండిత లేఖకులకు, భారత దేశములోని ఇతర ప్రాంతములందున్న విద్యా కేంద్రములలో ఎంతెంత ఇచ్చెడివారో ముందుగా తెలిసికొని ఆ మార్గమునే తానును అవలంబించి తెలుగు పండితులకు కష్టనష్టములు రాకుండ చూచెను. చేయవలసిన పని శ్రద్ధగాచేయనివారికి ; తప్పులను, పాఠ భేదములను దిద్దక, గుర్తింపక విడిచివేసిన వారికి జరిమానా కూడ వేసెడివాడు ! అనగా, ఈ పండితులు, తీర్పరులు సిద్ధముచేసిన శుద్ధప్రతుల నన్నింటిని ఆయన తిరిగి శ్రద్ధగా పరిశీలించెడి వాడన్న మాట ! ఆయన "కాలేజి"లో పనిచేయు వారందరు దినమునకు రెండు పూటలు - మొత్తము ఎనిమిది గంటలు - వారమునకు ఆరు రోజులు పనిచేసెడి వారు. వారు గ్రంథముల శుద్ధ ప్రతులను సిద్ధము చేయునప్పుడు అవలంబించెడి పద్ధతులు, ఆ కార్యక్రమములో పాల్గొనెడి వారి పనులు మొదలైన వాటిని గురించి ఇంతకుముందు తెలిసికొనియే యున్నాము (ఈ పరి

శోధన గ్రంథములో పుటలు - 141, '42). వీరందరితో కలిసి వారమునకు ఆరు రోజులు తానుకూడా పనిచేసెడివాడు.

(" ..My leisure for these pursuits was chiefly between five and ten in the morning, six days every week".)

బ్రౌనుదొర తెలుగు కావ్యములకు శుద్ధ ప్రతులను సిద్ధము చేయించుటలో తీసికొనిన శ్రద్ధయే ముద్రణ విషయమును తీసికొనెను. ఆయన వ్రాసిన పుస్తకములలో అచ్చయిన మొదటి పుస్తకము "ఆంధ్రగీర్వాణచ్ఛందము". దీని పీఠిక (Preface) లో ఆయన తెలుగు ముద్రణమునుగూర్చి వ్రాసిన వాక్యములు ఆ నాటి 827 ముద్రణ పరిస్థితులను తెలిసికొనుటకు పనికి వచ్చును. ఇదిగాక, తెలుగు ముద్రణమును చక్కదిద్దవలెనను కామము ఆయనకు అప్పటికి చాలకాలము నుండి యుండెనను విషయమును తెలియును. ఆ నాటి తెలుగు ముద్రణ, ముద్రణ ప్రారంభదశలో యూరపులో ఉన్నట్లే యుండెననియు, లిఖిత ప్రతికి ఎంత సన్నిహితముగనున్న అంతవరకు ముద్రణము ఆమోద యోగ్యమని ప్రజలు భావించు చుండిరనియు వ్రాసెను. ఇందువలన, మొట్టమొదట అచ్చయిన తెలుగు పుస్తకములలో - కలిపివ్రాతలోవలె - మాటలను, వాక్యములను వేరు చేయక ముద్రించుచుండిరి. [10]

---

110. "......a small approximation has been attempted towards an improvement in Telugu printing, which the author has long had in view. Printing in this language has hitherto been in the same state which was originally the case in Europe . ...".

ఈ సందర్భమున బ్రౌనుదొర History of Inventions Beckford) నుండి ఈ వాక్యముల నుదాహరించెను :

"It was endeavoured to render printed books as like as possible to manuscripts ; it was imagined that this invention could only be approved in proportion as it imitated them ; it being not as yet perceived that it could far excel the art of writing".

దీని తరువాత తన కాలము నాటి తెలుగు ముద్రణమును గూర్చి ఇట్లు వ్రాసెను :

"Such is the state of Telugu printing also at the present day ; it has been endeavoured to assimilate it as much as possible to the native manuscripts ; neither the words nor sentences being divided ......".

(ఆంధ్రగీర్వాణచ్ఛందము (1827, Preface).

తాళపత్ర ప్రతులలో ఆశ్వాస సంఖ్య, పద్య సంఖ్య సరిగా సూచింపక పోవుటవలన చదువు వారికి కష్టమగుటయే గాక, సులభముగా రెండు ప్రతులను పోల్చి చూచుటకు గాని పాఠాంతరములను గుర్తించుటకు గాని, ఆవశ్యకమైనచో దిద్దుటకు గాని వీలులేకుండెడిది. [111] అనావశ్యకమైన ఈ శ్రమ నుండి తప్పించుకొనుటకు, తెలుగు కావ్యములను మొట్టమొదట - సరిగా ఆశ్వాస సంఖ్య పద్య సంఖ్య గుర్తింపించుచు - తెల్ల కాగితములపై బ్రౌనుదొర వ్రాయించెను. ఇట్లు వ్రాయించిన తరువాత ఆయా తాళ పత్ర ప్రతులలో - కాగితపు ప్రతుల ననుసరించి - ఆశ్వాస సంఖ్య, పద్య సంఖ్య వేయించెను. ఇందువలన వివిధ ప్రతులను పోల్చిచూచుట సులభమయ్యెను. [112]

మనకు ఇవన్నియు ఇప్పుడు నిత్యానుభవములో సహజములై పోవుటవలన, వీటిని గూర్చి వ్రాసినప్పుడు వింతగా నుండుటలో ఆశ్చర్యములేదు. ఆ నాటి ఇంగ్లీషు వారికి అప్పటికే వారి భాషలోనివి సహజములగుటవలన, వారు ఆనాటి తెలుగు వ్రాతప్రతుల స్థితిని గుర్తించుటగాని తానుపడిన శ్రమను అర్థము చేసికొనుట గాని కష్టమగునను భావముతో వారికొరకిట్లు వ్రాసెను ;

"...the inconveniencies they presented to the student will at once be comprehended, if we attempt to read any passage of English verse written without seperating the words or lines from each other".

---

111. Ibidem. "Palm - leaf manuscripts, on the other hand besides the impossibility of correcting an error,and other inconveniencies, possess no facility whatever for reference".

112. Ibidem. "As a means of finding places required in manuscripts none of which correspond in the paging, I first have a copy prepared on paper, numbered throughout, and then cause all the leaves of the various manuscripts to be marked with the number of the asvasa, or section, and that of the first verse occurring in it. This arrangement renders comparison very easy, and is less obvious than, after explanation, it may seem to be".

గ్రంథ సేకరణమును గూర్చి ముచ్చటించుకొనుచున్న ఈ సందర్భముననే, బ్రౌనుదొర సేకరించిన ఇతర సాహిత్య సామగ్రినికూడ స్మరింపవలసియున్నది. ఇవి గ్రంథరూపమున నున్నవి కావు. ప్రజల - వీరిలో పండితులు, పామరులు కూడ నున్నారు - నోళ్ళలో నలిగిన చాటుపద్యములు, జానపద గీతములు మొదలైనవాటిని బ్రౌనుదొర చాల సేకరించెను. ఇటులనే సామెతలను, రకరకాల పలుకుబళ్ళను ఆయన సేకరించి పెట్టుకొనెను. తన కాలమునాటి పత్రికలలో పడిన వ్యాసములు, సంపాదకీయములు, వార్తలు, లేఖలు మొదలైనవాటినన్నింటిని సేకరించి మంచి కాగితములమీద ప్రతులు వ్రాయించి తన తరువాతి తరములవారికి పైతృకముగా బ్రౌనుదొర ఇచ్చిపోయెను. తాను వినిన కథలను, గాథలను వ్రాయించి ఆయన ఉంచెను. ఇట్టివాటి ప్రాముఖ్యమును గుర్తించినవాడుగనుకనే, తన పండితులైన కావలి సోదరుల సాయముతో మెకంజీదొర (1758-1821) సేకరించిన "స్థానిక చరిత్ర"లను మంచి కాగితములపై తిరిగి వ్రాయించి బ్రౌనుదొర వాటిని కాపాడెను. ఇవి *62 వాల్యూములయ్యెను! వీటిని గురించి ఆయన ఇట్లు వ్రాసెను :

"The Local Records (transcribed under my orders and at my expense) fill sixty two volumes : which (with the Telugu letters) I bestowed on the Library of the Madras College; where in are also lodged the original records, collected by Mackenzie. Many of his volumes are perishing : being written with English Ink (which soon fades) on country paper which the worms rapidly destroy. But the copies made under my directions, and at my cost, are written on English paper with country ink : which being made with lamp black does not fade."[113]

---

* 1821లో మెకంజీదొర చనిపోవునాటికి-తెలుగు, సంస్కృతము, కన్నడము, తమిళము, మలయాళము, ఓఢ్రము, మహారాష్ట్రము, హిందీ, ఫార్సి, అరబ్బీ, బర్మా భాషలకు సంబంధించిన గ్రంథములు 1568; స్థానిక వృత్తాంత పత్రములు 2,070; శాసనములు 8,076; నాణెములు 6,218; పురాతన భవనముల నిర్మాణ ప్రతిరూపములు 79; శిల్పముల చిత్రములు 2,630; విగ్రహములు 106; పురాతన శిథిలావశేషములు 40-కలవు. ఇతర వివరములకు, ఈ రచయితయే వ్రాసిన "తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము" (ద్వితీయ ముద్రణ, 1986) అను గ్రంథములో పుటలు - 118, 119 చూచునది

113. బ్రౌణ్య మిశ్రభాషా నిఘంటువు. 1854 Preface, Page-IV.

విజ్ఞానాభివృద్ధికి పనికివచ్చు సమస్త సామగ్రి లభించినంతవరకు – సేకరించి భావితరములవారికి అందజేయవలెనను గాఢాభిలాష ఉన్న మెకంజీ దొర ప్రారంభించిన కార్యక్రమమును బ్రౌనుదొర సంపూర్ణముగా కొనసాగించెనన వచ్చును. మెకంజీదొర నిర్వహించిన 'సర్వేయరు–జనరలు' ఉద్యోగము ఒకచోట స్థిరముగా నుండి పనిచేయనిచ్చునదికాదు. ఏ ఒక భారతీయ భాషకు అంకితమై కృషిచేయుటకును వీలిచ్చునది కాదు. ఉద్యోగరీత్యా ఆయన భారతదేశము విడిచి వెళ్ళినాడు కూడ! బ్రౌనుదొర విషయమట్టిదికాదు. ఒక ప్రముఖ భారతీయ భాష ప్రచలితముగనున్న ప్రాంతమున దశాబ్దులకొలది ఉండి కృషిచేయుటకు తగిన అదను కల్పించిన ఉద్యోగములు బ్రౌనుదొర చేసినవి. ఇందువలన ప్రత్యేకముగ తెలుగున కుపకారము జరిగినది.

బ్రౌనుదొర సేకరించినవాటిలో గ్రంథరూపమున లేని ఉత్తమ సాహిత్య సామగ్రి చాటు పద్యములు. వివిధ ప్రాంతములలో పండితుల–కొంతవరకు, పామరుల నోళ్ళలో నలుగుచు వచ్చిన రచనలే ఇవి. బహిర్గతమైనప్పుడు అవి చాలవరకు ఆశురచనలే! తాత్కాలిక విషయములపై, సమస్యలపై, వ్యక్తులపై– హాస్యమునకుగాని, ఆర్తికి వ్యక్తరూపముగా గాని, అవహేళనమునకు గాని, సమాజ సంస్కార దృష్టితోగాని – ఇంచుమించుగా తత్క్షణమే – చెప్పిన రచనలే అవి. తాను సేకరించిన చాటు పద్యములను గురించి బ్రౌనుదొర ఇట్లు వ్రాసెను:

"These verses I collected either on account of their beauty, the celebrity of the composers, or their utility in illustrating the language. Many both ancient and modern may be found, that have been preserved by oral tradition alone. I propose to arrange them in books containing four or five hundreds in each..."

"Such short compositions often have more real, poetical merit than those which being longer are in many cases turgid and lifeless, while these, framed in the inspiration of the moment are true to nature and proportionably attractive.

"It is probable that some of these verses will ultimately be found to belong to fragments to some regular poem, whether still preserved or lost. Several of these are found in the writings of Appa Cavi and other old grammarians who cite them in support of them only".

"The value of such collections is attested by the pains that the soundest criticks in Greek, Latin and other languages have taken in compiling anthologies..."

చాటు పద్యములకున్న ప్రాముఖ్యమును బ్రౌనుదొర ఇట్లు గుర్తించినాడు గనుకనే వాటి సేకరణకు, రక్షణకు-మారి కాగితములమీద వ్రాయించి, పండితులచేత ఆవశ్యకమైన చోటులందు తెలిపెడి వ్రాయించి-పూనుకొనెను. అయన సేకరించిన ఇతర గ్రంథముల వలెనే, ఇతర సాహిత్య సామగ్రివలెనే ఇవియును చెన్నపురి * ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో నున్నవి. ఈ శతాబ్దిలో తెలుగు భాషా సాహిత్యముల అభివృద్ధికి కృషిచేసిన పండితులందరు-ముఖ్యముగా మదరాసుతో సంబంధమున్నవారందరు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి (1888-1950), శ్రీ మానవల్లి రామకృష్ణకవి (1875-1957), శ్రీ నిడుదవోలు వేంకటరావు(1903-1982) శ్రీ గిడుగు వేంకట రామమూర్తి(1863-1940), శ్రీ గిడుగు వేంకట సీతాపతి, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి మొదలైనవారు అధునికులలో-శ్రీ ఆరుద్ర, డా॥ జి. ఎన్. రెడ్డి, శ్రీ బంగోరె ప్రభృతులు కలరు. వీరందరు ఈ భాండాగారమును చక్కగా వినియోగించుకొనినవారే, బ్రౌనుదొర కృషిని గుర్తించినవారే అయనయందు గౌరవాభిమానములు కలవారే అనుటలో అతిశయోక్తిలేదు !

---

* ఈ శతాబ్ది పండిత పరిశోధకులలో - ఈ పుస్తక భాండాగార ప్రాముఖ్యము, మెకంజీ బ్రౌనుదొరల కృషి ప్రాముఖ్యము గుర్తించి - శతాబ్ది ప్రారంభ దశాబ్దులలోనే తెలుగువారికి తెలియజేసిన ప్రముఖులలో వేటూరి ప్రభాకరశాస్త్రి (1888-1950) గారు అగ్రగణ్యులు. 4-3-1911 నాడు కృష్ణా పత్రికాధిపతులకు వారు వ్రాసిన లేఖలో ఈ విషయమునిట్లు ప్రస్తావించిరి.

"హైందవ సారస్వతమునకు గనియని చెప్పదగు చెన్నపురిలోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునగల విషయరత్న విశేషములు ప్రపంచమునకు దప్పక వెల్లడి కాదగినవి. మెస్తరు మెకంజీ, బ్రౌన్ అను నాంగ్లేయులు మనకు జేసిన మహోపకారము మఱవరానిది. పత్రికాధిపతులును, భాషాభిమానులును నిందలి విషయములను వెలిపుచ్చ బ్రార్థితులు."

(మణిమంజరి వాఙ్మయ యోగపరిశోధన విశేష సంచిక, ఆగస్టు 1984; బ్రౌన్ - ప్రభాకర వర్ధంతి సంస్మరణ సంచిక. సంపాదకులు : డా॥ వేటూరి ఆనందమూర్తి; వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు, హైదరాబాదు-500013; పుట-15).

బ్రౌనుదొర తెలుగు కావ్యములకు శుద్ధ ప్రతులను సిద్ధముచేయించుటలో తీసికొనిన శ్రద్ధయే ముద్రణ విషయమునను తీసికొనెను. ఈ శ్రద్ధ, తెలుగు కావ్యముల ముద్రణ విషయమునసేగాక తెలుగు నేర్చుకొను పాశ్చాత్యులకు పనికివచ్చునట్లుగా తాను వ్రాసిన పుస్తకముల ముద్రణ విషయమునను ఆయన తీసికొనెను. ఇదిగాక, ముద్రణ కళ అభివృద్ధి పొందుటకు వీలిచ్చు కొన్ని సాంకేతిక విషయములందును ఆయన శ్రద్ధ వహించెను. వీటినన్నింటిని పరిశీలించుటకు ముందు; బ్రౌనుదొర తెలుగు ముద్రణ విషయమున ప్రత్యేక శ్రద్ధ వహించుటకు పూర్వమును, ఆయనకు కొంత సమకాలికముగను తెలుగు ముద్రణ స్థితిగతులను గ్రహించుట సముచితము. ఈ కాలమున ఆచ్చయిన తెలుగు పుస్తకములలో (తెలుగును గూర్చి చెప్పుచు ఇతర భాషలతో కలిసి అచ్చయినవాటిలోకూడ) ముఖ్యమైన వాటిని కొన్నింటిని ఈ సందర్భమున పేర్కొనవచ్చును.

ప్రప్రథమముగా తెలుగులో ముద్రణకు పూనుకొనిన ఘనత– ఆ కాలములో ఆ గ్రంథములు క్రైస్తవమత సంబంధములగుటలో ఆశ్చర్యములేదు – రివరెండ్ బెంజమిన్ షూల్ట్జ (Rev. Benjamin Schultze : 1689-1760) నకు దక్కినది. ఈయన ఆరు తెలుగు పుస్తకములను 'హ్యాలే' (జర్మనీ) పట్టణములో అచ్చువేయించెను. వీటిలో మూడు 1746 లోను, మిగిలినవి 1747 లోను అచ్చువేయించినట్లు తెలియుచున్నది. పుస్తకముల పేరులు లాటిన్, తెనుగు భాషలలో నున్నవి. ఆనాటి "అచ్చు తెలుగులిపి"ని తెలిసికొనుటకు ఇవి పనికివచ్చును[114].

ఇంతకంటె పూర్వమే అచ్చయిన పుస్తకములు కానరావు. పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభ దశాబ్దులనుండి అచ్చయిన తెలుగు వర్ణమాల, పుస్తకములు లభించుచున్నవి ఇంచుమించుగా ఇవి అన్నియు భారతదేశమున అచ్చయినవే! 1837 లో కెప్టెన్ హెచ్. హార్క్‌నెస్ (Captain H. Harkness) దాక్షిణాత్య భాషా లిపులను తులనాత్మకముగ పరీక్షించుచు వాటిని లండన్‌లో

---

114. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము : కొత్తపల్లి వీరభద్రరావు; హైదరాబాదు, ద్వితీయ ముద్రణ 1986, "నాటి విద్యావంతులు : పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులు - తెలుగు ముద్రణ వికాసము" పుటలు - 271, 272.

ముద్రించెను. (Ancient and Modern Alphabets of the Popular Hindu Languages of the Southern Peninsula of India: Captain Henry Harkness, London 1837). జర్మనీలో అచ్చయిన తెలుగు పుస్తకముల లిపికంటె దీనిలోని తెలుగు లిపి పరిణతి పొందినట్లు, కనం బడును.

ముద్రణ ప్రారంభదశలో మనదేశములో ముద్రితములైన తెలుగు భాగ ములు - మత సంబంధములేనివి - పాశ్చాత్యులు ప్రచురించిన వ్యాకరణములు, నిఘంటువులు, వాచకములు మొదలైనవాటిలో దర్శనమిచ్చును. వీటిలో ఎడ నెడ తెలుగు వచనములు, పద్యములు కనంబడినను ప్రత్యేకముగ తెలుగు కావ్య ములు మొదలైనవాటి ముద్రణ ప్రచురణములు ప్రౌనుదొర రంగములోనికి దిగు వరకు రాలేదనవచ్చును. ఈ లక్షణ గ్రంథములుగాక విశేషముగా ముద్రణ భాగ్యమును పొందినవి, తెలుగు నేర్చుకొను విదేశీయులు సులభముగా చదివి అర్థము చేసికొనగలిగినవి, ఉద్యోగరీత్యా వారికి నిత్యజీవితములో పనికివచ్చునవి అయిన - సంభాషణలు, అర్జీలు జాబులు మొదలైనవి. ఆనాటి ప్రతి తెలుగు వాచకమునందును ఇవి ఉండెడివి, వీటిలో వ్యాకరణ విశ్లేషణాదికము కూడనుండి ప్రారంభకులకు చాల నుపయోగపడుచుండెడివి.

ఆనాటి వాచకములలోని అర్జీలలో ఏయే భాగములుండెడివియో తెలిసి కొనుటకు బేతవూడి సుందర రాయడుగారి "నీలగిరి చరిత్ర" (నీలగిరి యాత్ర 1846 లో జరిగినను గ్రంథ ముద్రణము మాత్రము 1864లో జరిగినది లోని రెండవ భాగము(అర్జీలు)సాయపడును[115]. అర్జీలు — "రెవిన్యూ అండ్ మేజిస్ట్రేట్ డిపార్టుమెంటు, జ్యూడిసైయాల్ డిపార్టుమెంటు, పబ్లిక్ వర్కు డిపార్టుమెంటు, మిలిటేరి డిపార్టుమెంటు" అను నాలుగు శీర్షికలుగ విభజింపబడి యుండెను. చెప్ప దలచుకొన్న విషయము సూటిగా ప్రజల భాషలో సులభశైలితో చెప్పుట అర్జీ లలో జరుగుటకవకాశముండును గనుక తెలుగు నేర్చుకొనువారికి ఇవి చాల నుపయోగకరములను భావముతో, ఆనాటి తెలుగు వాచకములలో "అర్జీలు" విధిగా ఒక భాగముగ నుండెను.

---

115. Ibidem - 216, 217, 218.

తెలుగు నేర్చుకొనువారికి పనికివచ్చుటకు ప్రత్యేక దృష్టితో వ్రాయబడిన-కథల పుస్తకములు, వాచకములు, పదజాలములు, సంభాషణలు, వ్యాకరణములు, నిఘంటువులు మొదలైనవి ఆ రోజులలో చాల వచ్చినవి. వీటిలో పాశ్చాత్యులు కూర్చిన వాటిని గురించి సంగ్రహముగా ముందు తెలిసికొందము. అచ్చయిన ఈ తరగతి పుస్తకములలో ప్రాచీనమైనవి మత గ్రంథములను ముద్రించిన బెంజమిన్ షూల్జ్ అచ్చువేయించినవే! ఇవికూడ వాటివలెనే "హ్యాలే" (జర్మనీ) నగరములోనే ముద్రితములైనవి. వీటిలో (Conspectus Litteraturae Telugicae Vulgo Warugicae అనునది 1747లో అచ్చయినది. దీనిలో తెలుగు అక్షరములు, గుణితములు మొదలైనవాటితో ఆంధ్ర వర్ణమాల తెలుగు లిపిలోను, రోమను లిపిలోను కూడ కలదు. ఇంక రెండవది 1750లో ముద్రితమైన తెలుగు సంభాషణల పుస్తకము. తెలుగురాని పాశ్చాత్యులకు సామాన్యముగా నిత్య జీవితములో పనికివచ్చు "ముప్పది" సంభాషణలున్న పుస్తకమిది. పనివారితో, బజారులో, దుకాణములవారితో, ఇతరులతో మాటలాడుటకు పనికివచ్చు శబ్దజాలముతోనున్న సంభాషణలున్న పుస్తకమిది. తెలుగు మాటలకు ఇంగ్లీషులో అర్థ వివరణమున్నది. మొదట నిది తెలుగులో రచితమై తరువాత ఆంగ్లములోని కనూదితమైనదనుటకు ఆధారములున్నవి. ఈ రెండు పుస్తకములునుగాక The Symphona Symphona Sive Undecim Lingvaram Orientalism అను పదునొకండు భారతీయ భాషలలోని పదజాలమున్న నిఘంటు తుల్యమైన పుస్తకమొకటి ఈ సందర్భమున పేర్కొనదగినది. దీని లిపి రోమను లిపి. 1782లో అచ్చయిన దీనిలో తెలుగు భాషలోని పదములు కూడ గలవు. ఈ గ్రంథములన్నియు విదేశములలో పదునెనిమిదవ శతాబ్దిలో అచ్చయినవి.

ఈ గ్రంథముల తరువాత భారతదేశములో పాశ్చాత్యులు ముద్రించి వెలువరించిన కొన్ని ముఖ్య గ్రంథములను గూర్చి కొంత తెలిసికొందము. వీటిలో-డా॥ విలియం కెరే (Dr. William Carey : 1761-1834) వెలువరించిన A Grammar of the Telinga Language (శ్రీరామపురం, 1814); విలియం బ్రౌన్ (William Brown - మృతి 1837) వ్రాసి ముద్రించిన A Grammar of the Gentoo Longuage (మద్రాసు, 1817); A Vocabulary of the Gentoo Language (మద్రాసు, 1818); జె. మెకరెల్ (J. M'ckerrell - మృతి 1835) ముద్రించిన Telugu Vocabulary; ఏ.డి.

కాంబెల్ (A.D. Campbell - మృతి 1857) వ్రాసిన A Grammar of the Teloogoo Language (మద్రాసు, 1816, A Dictionary of the Teloogoo Language (మదరాసు, 1821); జె.సి. మారిస్ (J.C. Morris 1798-1858) ప్రచురించిన Teloogoo Selections (మదరాసు 1828) Dictionary of English and Teloogoo (2 వాల్యూములు. మద్రాసు 1835, 1839); జె. నికలస్ (J. Nicholas) ముద్రించిన Telugu vocabulary (మద్రాసు, 1382) మొదలైనవి కలవు.

బ్రౌనుదొర (C.P. Brown : 1798-1884) రంగములోనికి దిగువరకు తెలుగు కావ్యముల ముద్రణ పెద్దఎత్తున ప్రారంభము కాలేదనుటలో (అసలు కాలేదన్నను) అతిశయోక్తిలేదు. తెలుగు భాష నేర్చుకొనుటకు పనికివచ్చునట్లు వ్రాసిన పుస్తకములలో అక్కడక్కడ తెలుగు పద్యములు మొదలైనవి కొన్ని ఉన్నను వాటిని "కావ్య" ముద్రణగా పరిగణింప నక్కరలేదు. మిగిలిన భాగము లలోనున్న అర్జీలు మొదలైనవాటి "కావ్యత్వ" విషయమై చెప్పుట అనావశ్య కముగదా ! అనగా, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధములో మొదటి కొన్ని దశాబ్దులు జరుగువరకు తెలుగు కావ్య ముద్రణ జరుగలేదని తలంచుట సత్య దూరము కాదు.

బ్రౌనుదొర వ్రాసిన పుస్తకములలో అచ్చయిన మొదటి పుస్తకము "ఆంధ్ర గీర్వాణచ్ఛందము" : The Prosody of the Telugu and Sanscrit languages explained (మద్రాసు, 1827). దీని తరువాత "వేమనపద్య ములు" : The verses of Vemana (మద్రాసు, 1829), A Familiar Analysis of Sanscrit Prosody (London, 1837) A Grammar of the Telugu Language (మద్రాసు, 1840) మొదలైనవి. వీటి తరువాత, తెలుగు కావ్యముల సేకరణకు, సంస్కరణకు ముద్రణకు ఆయన విశేషముగ కృషిచేసి యుండుట మనకు తెలిసిన విషయమే. కాలక్రమమున తెలుగులో ముద్రణ కళ వికాసమును పొందుటయు మనకు తెలిసిన సంగతియే !

తెలుగు ముద్రణములో మార్పులను తెచ్చుటవలన కావ్య పఠనము సులభ మగుననియు, ఇంగ్లీషులో ముద్రణము పొందిన మెరుగులన్నియు తెలుగులోనికి కూడ తీసికొని రావచ్చుననియు మొట్టమొదట పండితులు కొంత వీటికి వ్యతి రేకత చూపినను వాటి సౌకర్యమును గుర్తించిన తరువాత ఆయా మార్పులను ఆనందముతో ఆమోదింతురనియు, ఇంగ్లీషులో కూడ ఈ మెరుగులన్నియు వచ్చి చాలకాలము కాలేదనియు బ్రౌనుదొర వ్రాసెను.[116]

మాటలు వాక్యములు, పాదములు విడివిడిగా వ్రాసినప్పుడు, అట్లే అచ్చు వేసినప్పుడు పాఠకులకు బాగుగా అర్థమై శబ్దజ్ఞానము కలుగుననియు ఈ పద్ధతిని, మద్రాసు కాలేజిలోని తెలుగునకు హెడ్ మాస్టర్ అయిన రావిపాటి గురుమూర్తి శాస్త్రిలు ఆమోదించినట్లును, ఆయనకూడ తన ఉపయోగమునకు వ్రాసికొనిన తెలుగు కావ్యములనట్లె వ్రాసికొనెననియు బ్రౌనుదొర తెలిపెను.[117]

బ్రౌనుదొర కాలక్రమమున తానచ్చువేసిన నిఘంటువులు మొదలైన వాటిలో ముద్రణమున ఇంకను మార్పులు తెచ్చెను. ఈ మార్పులు కొన్ని అక్షరములకు, గుణితములకు కూడ సంబంధించినవి. మొట్టమొదట అచ్చువేసిన "ఆంధ్రగీర్వాణ చ్ఛందము"లో నుదాహృతములైన కావ్య పద్యములను తన సిద్ధాంతమునను సరించియే అచ్చువేసెను.[118] ఇట్లు అచ్చువేయుటలో, శుద్ధప్రతుల తయారీలో గణ నీయమైన విజయముల నాయన సాధించెను.

---

116. "...every distinction introduced into English is also admissible in Telugu printing, and he trusts that the day is not distant when capital letters, all the stops, elisions, and so forth, may be equally made use of in both languages. Even among us these were introduced only in modern days, and while all Telugus are very naturally averse in the first instance to such innovations, I have found that they soon understand these improvements and acknowledge their utility". (ఆంధ్రగీర్వాణచ్ఛందము)

117. "Indeed, from conversation with Ravipati Gurumurty Sastry, the Head Master of Telugu in the College at Madras, it appears that this accomplished scholar has already taken the first step, in preparing some Telugu poems for his own use, wherein each word is distinguished ; he perfectly concurs also in the practicability and utility of adopting the other improvements above mentioned". (Ibidem).

18. "...as far as regards a division of words, of lines, and sentences it has been carried into effect in the present work." (Ibidem)

ఈ సందర్భముననే, తనకు వచ్చినవన్నియు కష్టములే కావనియు, చికాకు కలిగించిన అపజయములెన్నియో వచ్చినవనియు (Vexatious failures) బ్రౌనుదొర వ్రాసెను. ఈ సత్య కథనమందే, ఆయన ఘనత కలదు. ఆయన ఈ కార్యమును చేబట్టుటకు పూర్వము మన దేశములో పండితులు లేకపోలేదు. జమీందారులు, ధనవంతులు లేకపోలేదు. కాని, నాటి రాజకీయ సామాజిక పరిస్థితుల ననుసరించి; వారెవ్వరును ఇట్లు వివిధశక్తులను, ప్రజ్ఞలను సంఘటితపరిచి, వాటిని ఏకోన్ముఖముగ సమీకరింప లేకపోయిరి. బహుశః ఇది ఆనాడు పాలకులైన ఆంగ్లేయులకే సాధ్యమైయుండెను. బ్రౌనుదొర ఇది గుర్తించినట్లున్నది !

గ్రంథములను సేకరించి, వాటిని పరిష్కరించి శుద్ధప్రతులను సిద్ధముచేయు విషయములందేగాక, వాని ముద్రణమునను బ్రౌనుదొర తన ప్రభావమును చూపి, ఎన్నియో మార్పులను తెచ్చెను. వీటిని గురించి కొంత తెలిసికొని యుంటిమి. ఆయనకు ముందే తెలుగులో ముద్రణమున్నను, దానిని ఆంధ్రమున విశేష ప్రచారమునకుదెచ్చి, పూర్ణముగ నుపయోగించుకొనినవాడు బ్రౌనుదొర. 1832లో ఆయన మచిలీపట్టణములో ఒక తెలుగు ముద్రణాలయమును స్థాపింప యత్నించినను, అది సఫలముకాలేదు. ఆయన పనికై నియమించిన ఇంగ్లీషువాని అయోగ్యత, బ్రౌనుదొరను ఆశ్చర్యచకితునిచేసెను.[119]

ముద్రణమును ప్రచారమునకు తెచ్చుటయేగాక, తెలుగు అక్షరముల ఆకారమున, అచ్చులో కొన్ని మార్పులనాయన చేసెను. 1846లో ప్రభుత్వమునకు అనువాదకునిగ నియమింపబడిన వెంటనే బ్రౌనుదొర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి ఒక లేఖ వ్రాయుచు దానిలో ఫోర్టు సెయింటు జార్జి గెజిట్‌లో తెలుగు ముద్రణ బాగుగ లేదనియు కొన్ని అక్షరములను మార్చవలెననియుకూడ వ్రాసెను. కొన్ని ధ్వనులకు క్రొత్త గురుతులను కల్పించెను. ఇవన్నియు ముద్రణమునకై చేయు "అక్షరముల కూర్పు" వేగముగా సాగుటకొరకు చేసిన మార్పులు. ఈ మార్పులలో ముఖ్యమైనది రేఫమునకు సంబంధించినది. ఆ రోజులలో "రావడి"కి చిహ్నముగా నుపయోగింపబడుచున్న "అచ్చు గుర్తు", అక్షరములు కూర్చునప్పుడు సరిగా కూర్చుటకు వీలియ్యని విధముగా (క్ర) నుండెనట.

---

19. "......baffled by the dishonesty of the Englishman, I employed."
(Some Account of the Literary Life of C.P. Brown).

దీనిని తీసివేసి క్రొత్త గుర్తులను (క్ర లేక క్రి) బ్రౌనుదొర కల్పించెను.[120] ఈ గుర్తును శాసనములలో కానవచ్చు, "రావడి" గుర్తుననుసరించి బ్రౌనుదొర వ్రాసి, చిహ్నమును పోతపోయించెనట : ఈ మార్పువలన తెలుగునిప్పుడు ఇంగ్లీషుభాష యంత వేగముగను అచ్చున కూర్పవచ్చుననియు, తాను కల్పించిన చిహ్నమునకు "బ్రౌన్ రకారము" అను పేరు వచ్చినదనియు ఆయన వ్రాసెను.[121]

అచ్చులో—"ప"ను "వ"గను, "స"ను "న"గను పొరపడుట కవకాశ మున్నదని; "ప, స"ల తెలుగు చిహ్నముల స్థానమున, కన్నడ "ప, స"ల చిహ్నములను; బ్రౌనుదొర కూర్పించెను.[122]

---

120. In those days Telugu printing was tedious because the (crara) letter 'R' was shaped as a cup containing another letter (క్ర). To remedy this I invented two substitutes, one resembling a a rectangle like '[', the other like the numeral '9'. The compositors found that this contrivance removed the difficulty." (క్ర లేక క్రి)

(Telugu-English Dictionary by C. P. Brown ; 1852' Page Xv.)

121. "This improvement was copied from the shape seen in some ancient inscriptions. It has removed the difficulty, and Telugu can now be printed as rapidly as English. The type "[" is now called "బ్రౌన్ రకారము". Ibidem)

122. "As the letter ప(Pa) may easily be mistaken for వ (Va) and as స (Sa) resembles న (Na), I have substituted the Karnataca types ప (Pa) and స (Sa)."

"This improvement removes doubts in many places." (Ibidem)

తెలుగులో పండితులు కానెంచువారికి అర్ధానుస్వార శకటరేఫల "బెడద" ఈనాటికి తప్పలేదన్నప్పుడు, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమున ఎట్లుండి యుండునో ఊహింపవచ్చును. బ్రౌనుదొర తెలుగుకు పాండిత్య సంపాదనార్థము అధ్యయనముచేయుట ప్రారంభింపగనే ఈ రెండింటి ప్రశ్న వచ్చెను. ఈ విషయమై ఆయన 1827 లో ముద్రించిన "ఆంధ్రగీర్వాణచ్ఛందము"లో (Remarks on the technical terms) వ్రాసినదానినిబట్టి ఆనాటి వాటి స్థితి మనకు తెలియును :

"There are two desiderata in elegant composition in this language; one is. a certain rule for the insertion or exclusion of the Artha-Bindu or semi-nasal, which appears in వీఁకు, వాఁడు and other words: the other is, a fixed rule for the use of the two letters R (ర and ఱ) in orthography. Criticks declare these to be so entirely dissonant that in Yati or Pras. they cannot even rhyme together....".

కాని అనుభవపూర్వకముగ తాను గ్రహించినదియు, సమకాలికులైన విద్వాంసులనుండి తాను గ్రహించినదియు ఈ నియమమునకు భిన్నముగ నున్నదనియు; వీటి భేదమును గుర్తించుట కష్టమని అందరును అంగీకరించిరనియు బ్రౌనుదొర వ్రాసెను. ఈ సందర్భమున ఆనాటి విద్వాంసులైన వఠ్యం అద్వైత బ్రహ్మయ్యశాస్త్రిలు ఈ విషయమై తనకు ఒక లేఖ వ్రాసినట్లు తెలిపెను :

"In a letter to me on the subject, that distinguished scholar remarks that one point only is indisputable ; viz, that wherever double r occurs, the word is Telugu, not Sanscrit, and spelled with ఱ not ర్ర, the latter of which forms is unallowable. Regarding them the letter ్ర subscribed to the initials of several Telugu words (as తోవ, కొత్త, పత్తి, పొద్దు likewise spelt త్రోవ, క్రొత్త, ప్రత్తి, and ప్రొద్దు), he remarks that it is generally inelegant to omit the ్ర; that a few words never admit it, and some are never used without it. It is never added, I believe, to any but the following

eight letters in Telugu క, గ, త, ద, ప, బ, మ, స; in Sanscrit words however; it is added to nearly all the consonants".

తెలుగు మాటలలో సాధురేప శకటరేఫలను గుర్తించుట కష్టముగనుక, వఠ్యం అద్వైత బ్రహ్మయ్య శాస్త్రిలు వీటిని సరిగా గుర్తించుచు- బ్రౌనుదొర కోరిక ననుసరించి కావచ్చును- మహాభారతము మొదలైన గ్రంథముల నుండి మూడువేలకంటె అధికముగనే తెలుగు మాటలను ఏరి ఒక గ్రంథముగా గ్రథిత మొనర్చెను. "రేఫ అకారవచ్ఛబ్ద జ్ఞాపక లోకోపకారము" అను పేరనిది లిఖిత ప్రతిగ నున్నది. ఈ కూర్పు వఠ్యంవారిదని "ఆంధ్రగీర్వాణచ్ఛందము"లో పారి. భాషిక శబ్దములను గూర్చి వ్రాసిన అధ్యాయములో నున్న క్రింది వాక్యము వలన తెలియుచున్నది:

**"...after long examination I find that the best Telugu scholars living declare the variation imperceptible ; One of these is the learned Advaita Bramhaya, Pandit, in the Zillah Court of Masulipatnam, who has compiled a work on this subject, where in the correct orthography of more than three thousand words is decided by citations from the Maha Bharata and other works .."**

ఇంత శ్రమనే ఈ రెండింటి (ర, ఱ) భేదములను గుర్తించుటకు పండితులు కృషి చేయుచున్నను, లిఖిత ప్రతులలోనే- పద్య కావ్యములలో తప్ప- చాలవరకు ఇది కనబడుట లేదనియు, దీనిని పునరుద్ధరించుటకు ప్రయత్నించుట అంత ఉపయుక్తము కాదనియు బ్రౌనుదొర 1827 నాటికే అభిప్రాయపడి తన "ఛందో గ్రంథము"లో నొక అధస్సూచికలో నిట్లు వ్రాసెను:

**"The letter ఱ is wholly obsolete, excepting in poems; and even in these none of the common manuscripts exhibit it. There is perhaps no practical utility in reviving the use of this letter."**

ఈ అర్ధానుస్వార శకట రేఫల విషయమున 1827 నాటికే సుస్థిరాభిప్రాయముల నేర్పర్చుకొన్న బ్రౌనుదొర, 1852లో తాను ప్రచురించిన "తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు"లో కూడ ఈ విషయమును చర్చించి అవి నిరుపయోగము

అను నిర్ణయమునే వెలిబుచ్చెను.[123]

ఈ సందర్భముననే వ్రాయుచు, ఈ రెండు చిహ్నములనుగూర్చి (అర్ధానుస్వార శకటరేఫలు) బ్రౌనుదొర కొంత చర్చ చేసెను. క్రీ.శ. 1500 ప్రాంతమున కొందరు పండితులు, వీటిని పునరుద్ధరింపవలెనని ప్రయత్నము చేసిరనియు, కాని అవి వాడుకలో భ్రష్టములగుటచే, ఆ పండితుల కృషి ఫలవంతము కాలేదనియు; కాని తన కాలమున కొందరు పండితులు, వార్తాపత్రికలవారు వీటిని శ్రమపడి ప్రయోగించుచున్నారనియు, అందువలన ఉపయోగము తక్కువ అనియు—

---

123. "Two letters found in the ancient Telugu alphabet are now obsolete : one is [ఁ] అర్ధబిందువు the ardha binduvu or semi-circle ; also called అర్ధానుస్వారము, the 'half N'. In some words, as అతడు, తమ్ముడు (atadu, tammundu) the [ఁ] semi-circle being inserted అతఁడు, తమ్ముఁడు (atandu, tammundu) is the spelling used in older ages. This was sounded as the 'n' in the French words facan, son, ton, sans. But this letter, or nasal accent has for atleast four hundred years been disused. Occasionally the circle is used, as అతండు, తమ్ముండు; or else a mere dot as అత.డు, తమ్ము.డు. But the semi-circle [ఁ] has long since disappeared in writing ; though the nasal sound is still used in speaking."

"The other obsolete letter is ఱ R, called బండిరేఫ or శకటరేఫ "The car or chariot." The words వెరవు మరచి, ఎరుగు, గుర్రము, కర్ర and a few others were written వెఱవు, మఱచి, ఎఱుగు, గుఱ్ఱము, కఱ్ఱ, veravu, marachi, erugu, gurramu, carra. This character is still used in Cannadi but we cannot often find it even in ancient Telugu manuscripts or inscriptions upon marble."

(Ibidem ; Pages XV, XVI)

ఆయన చర్చయొక్క సారాంశము.[124]

ఆ రోజులలో, ఈ రెండింటిని బ్రౌనుదొర ఉపేక్షించుటచే, కొందరు పండితులాయనను విమర్శించినట్లున్నది. ఆ విమర్శనలకు సమాధానముగా- తనకు మార్గదర్శకులు, ఉత్తమ పండితులునైనవారు; తన సహజము, ఉచితమునైన మార్గమును హర్షించిరనియు, ఆ రెండు చిహ్నములను ఉద్ధరింప బూనుట ఫలప్రదము కాదనియు; బ్రౌనుదొర వ్రాసెను.[125] భాషా విషయకమైన ఈ సూక్ష్మ పరిశీలనము బ్రౌనుదొరకు తెలుగు భాషపై గల ప్రభుత్వమునకు, వ్యావహారిక భాషపై ఆయనకు గల విశ్వాసమునకు తార్కాణముగా గ్రహింపవచ్చును.

అర్ధానుస్వార శకటరేఫలను గూర్చి నేటికిని చర్చలు పండిత లోకమున సాగుచునే యున్నవి. కాని, ఇచ్చట మనము గుర్తింపవలసిన విషయము ... ఆ రెండింటికి బ్రౌనుదొర నాటికే (19 వ శతాబ్ది పూర్వార్ధము) పదచ్యుతి కలిగినదని. బ్రౌనుదొర వాటిని ఆదరింపలేదు. ఆయనకు మార్గదర్శకులైన పండిత ప్రకాండులు, వాటి నంతగా పాటించినట్లు లేదు. నాటి పండితులకు, నేటి పండితులకు వ్యావహారిక భాష విషయమున చాల అభిప్రాయ భేదమున్నట్లు కనపట్టుచునే యున్నది. 19 వ శతాబ్దిలోని పండితులు చాలమంది, వ్యాఖ్యానాదులలో వాడుకభాష నుపయోగించుటకు- నేటివారివలె- జంకలేదు. నాటి పండితులు బ్రౌనుదొరకు వ్రాసిన జాబులు. కావ్యములకు వ్రాసిన వ్యాఖ్యానములు మొదలైనవి పరిశీలించినచో ఈ విషయము సువిదితమగును. ఇట్టి పండితుల సాయము బలిమిని, బ్రౌనుదొర వాడుకభాషకు కూడ తన నిఘంటువులలో స్థానమిచ్చెను!

---

124. "Some grammarians who wrote about the year A.D.1500 attempted to bring these two characters again into use; and in modern days some natives are again striving to revive these obsolete forms : which are absurdly used in Telugu newspapers; and some teachers carefully instruct their pupils in these idle elegancies." (Ibidem ; Page - XVI)

125. "But the nation having for five centuries laid aside these antiquated characters, the attempt to revive them will be of no avail. There refinements are disregarded by sound scholars among brahmans ; who have been my guides. And I mention thees matters, because some pretenders to learning have disapproved the rational method, which I follow." (Ibidem; Page—XVI)

బ్రౌనుదొర తెలుగు కావ్యములకు చేసిన సేవవలన, చాలమంది తెలుగు ముద్రాపకులు బయలుదేరిరి. గ్రంథ సంపాదనమునకు పెద్దపెట్టున పూనుకొనుట జరిగినది. ముద్రణ కళకూడ అభివృద్ధికి వచ్చెను. 1860, 1870 నాటికి పేజీలకు అంకెలు. విరామ చిహ్నములు, పద విభాగములు, ప్రకరణ విభజనలు మొదలైన వన్నియు[126] - ఇవన్నియు మొట్టమొదట అచ్చయిన పుస్తకములలో కూడ కొంతవరకు గలవు - పూర్తిగా అచ్చు పుస్తకములలోనికి వచ్చి, తెలుగు పుస్తకముల ప్రచురణమున నవ్యశక మారంభమైనది. నాటి పండితులలో కొందరు, సామాన్యముగా ప్రజలును - తమ జాతీయ కవుల రచనలను, చదివి ఆనందించినను-పుస్తకములను అచ్చు వేయుట అనిన;ఆ గ్రంథములను ఆ కవులను అపవిత్రము చేయుటగా భావించెడి వారన్నచో[127]; "ముద్రణ కళ" మన సాహిత్య సంస్కృతులలో ఎంత విప్లవము తెచ్చెనో ఊహించుటకు విశేషముగా శ్రమపడనక్కరలేదు. క్రమక్రమముగా ఛాందస భావములు పోయి. "ముద్రణకళ" దేశమున పాదుకొని ప్రజల చైతన్యమున- గ్రంథ పఠనము వలన - మార్పు తెచ్చెను.

సమాజమున, సాహిత్యమున "ముద్రణము" తీసుకొనిరాగల విప్లవమును ప్రజలు, ప్రచురణ కర్తలు గుర్తించిన వెంటనే, ముద్రణాలయముల సంఖ్య, ముద్రిత గ్రంథముల సంఖ్య విశేషముగ పెరిగిపోయినది. ఎన్నియో తెలుగు గ్రంథములు, తెలుగు లిపిలో ఎన్నియో సంస్కృత గ్రంథములు[128], "అసూర్యంపశ్య"లై ఉన్నవి, సూర్యాలోకమును పొందెను. ఈ అభివృద్ధికి, బ్రౌనుదొర విరామ మెరుగక చేసిన కృషి. దోహదము చేసినది. ఈ అభివృద్ధిని చూచి బ్రౌనుదొర మిక్కిలి సంతోషించెను. తాను తలపెట్టి ప్రారంభించిన కార్యము; నిర్విఘ్నముగ, ప్రజల ఆదరణాభివృద్ధితో దిన దిన ప్రవర్ధమాన మగుటనుచూచి,

---

126. "Numerals of pages, running titles, printer's stops, divisions of chapters,and (in a slight degree) spaces between words; all these and other innovations are coming more into vogue; as I perceive in the Telugu volumes printed in 1860, and 1870."
(Some Account of the Literary Life of C.P. Brown.)

127. "The Hindus read their national poems with delight ; yet the printing of their authors was regarded as a profanation."
( bidem)

128. "These (Telugu poems) have been printed ; and to these are added many sanscrit volumes in the Telugu character".
(Ibidem)

ఆనందించినాడు. తాను చూపిన మార్గమును సోత్సాహముగ అనుసరించుటను చూచి, తృప్తిపడినాడు[129].

ఇరువది సంవత్సరముల కంటె పైగా, బ్రౌనుదొర "చెవి నిల్లు కట్టుకొని పోరిన" ఫలితముగా; తెలుగుదేశములో, పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధము వచ్చు నాటికి, గ్రంథ ముద్రణము "బాలారిష్ట దోషము"లను దాటి, స్థిరపడినది. ఇది స్థిరపడనిచో తెలుగు సాహిత్యమునకు భవిష్యమే లేదనియు, పుస్తక ప్రచురణ కర్తలు వ్యాపార దృష్టితో గ్రంథముద్రణమును స్వీకరించినకాని, సాహిత్య వికాసము కలుగదనియు బ్రౌనుదొర వ్రాసెను. తెలుగులో ముద్రణము బాగుగా స్థిరపడుటకుముందే; బెంగాలీలోను, అంతకు ముందే తమిళమున, ముద్రణము స్థిరపడినదనియు వ్రాసెను.[130]

తెలుగు సాహిత్యాభివృద్ధికి ఇంత దోహదము చేసిన బ్రౌనుదొర కూడ, తాను విదేశస్థుడననియు, తానెంత చేసినను పూర్తిగా ఒక భాషయొక్క సాహిత్యమును ఉద్ధరించుట సులభసాధ్యము కాదనియు[131] వ్రాసి, తన వినయమును ప్రకటించెను. పాశ్చాత్యుడైన బ్రౌనుదొర ఇంత కృషిచేసి మార్గముచూపిన తరువాత, ముద్రణము లాభదాయకమైనదని నాటి ప్రచురణ కర్తలు గుర్తించిరట[132] !

ఈ గుర్తింపు కలిగినవెంటనే, దేశములో ముద్రాలయములు చకచక స్థాపింపబడినవి. గ్రంథ ముద్రణము అధికమైనది. బ్రౌనుదొర తన తెలుగు -

---

129. "I have done what I could to awaken the Telugus to the advantages of printing and after more than twenty years of exhortation, they are following my leading".

"I knew that this literature would never flourish until the book-sellers took it up as a profitable business." (Ibidem)

130. "I now see my advice is followed, and in 1865 the Telugu printing trade is as fairly established as the Bengali was eighty years before, and the Tamil earlier still." (Ibidem)

131. "To revive the literature of a language was an arduous task for one man, and he a foreigner." (Ibidem)

132. "The Hindoos have at last discovered that printing is lucrative." (Ibidem)

ఇంగ్లీషు నిఘంటువు కూర్చునాటికి 1852 భారతీయులే అధిపతులుగానున్న ఎన్నో ముద్రాలయములు, పాశ్చాత్యులు నడుపుచున్న ముద్రాలయములు, వార్తాపత్రికలు బయలుదేరినవి.[133]

*తెలుగులో ముద్రణాభివృద్ధి కింత దోహదముచేసిన, తెలుగు కావ్యముల కింత సేవచేసిన, బ్రౌనుదొర మనకు చిరస్మరణీయుడనుట అనావశ్యకమైనమాట! ఆయన సేవను ఎవరు విస్మరింపగలరు!

ఈ సందర్భముననే పేర్కొనదగినది, ఆయన లిఖిత ప్రతుల సేకరణము. బ్రౌనుదొర మనదేశములోనున్న కాలమంతు, తెలుగును విశేషముగ అభిమానించి అందు కృషిచేసినను; ఆయన మిగిలిన భారతీయ భాషలను కూడ ఆదరించి నాడు.[134] ఆయా భాషలకు సంబంధించిన లిఖిత ప్రతులు లభించినప్పుడు, వాటిని కూడ భద్రపరిచినాడు. అట్లు తాను సేకరించిన లిఖిత ప్రతులను, 1845 జనవరిలో "మదరాసు సాహిత్య సంఘము" (Madras Literary Society) నకు ఇచ్చి వేసెను. వీటితోబాటు,"ఇండియా హౌస్ లైబ్రరి"లో నున్న ఈ భాషలకు సంబంధించిన లిఖిత ప్రతులును, బ్రౌనుదొరయొక్క పలుకుబడివలన; మదరాసు కాలేజి లైబ్రరికి చేరినవి. ఈసమయమున,వాటి చరిత్రను కొంత తెలిసికొనవలసియున్నది.

1884 లో బ్రౌనుదొర - 17 సంవత్సరములు మనదేశములో నున్న తరు వాత - మొట్టమొదటిసారిగా, మూడు సంవత్సరముల సెలవుమీద స్వదేశమునకు పోయెను. అక్కడకూడ విశ్రాంతి అనునది లేకుండ ఆయన తెలుగుభాషకొరకు. అహోరాత్రము శ్రమించెను. లిఖిత ప్రతులను సరిదిద్దుటయందు. గ్రంథా

---

133. "At present many volumes continually issue from Telugu pressess managed by Hindoos alone. There are at least eight such pressess, at work, besides those which are under the management of Englishmen. Native newspapers, both Telugu and Tamil exist......" (Telugu-English Dictionary by C. P. Brown; 1852. Page - VI).

* తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము - కొత్తపల్లి వీరభద్రరావు (ద్వితీయ ముద్రణ, హైదరాబాదు, 1986) "తెలుగు ముద్రణ వికాసము" (పుటలు 269-331).

134. "Distinguished by his attainments in nearly every other language of India, whether vernacular or classical, Mr. Brown particularly attached himself to the study of Telugu." (A Catalogue Raisonnee of Oriental Manuscripts in the Library of the (Late) College, Fort Saint George; by the Rev. William Taylor (Vol. I) Madras, 1857 - యొక్క Preface లో C. F. Carmichael, Secretary 28-3-1858 నాడు వ్రాసినది).

లయములలో వెదకి కూలబడిన పుస్తకములను పైకి తీయుటయందును, ఆయన సంపాదించిన కీర్తి అనుసరించె ముందే ఇంగ్లండు నకుపోయి, ఆయనకు ఆదేమును పని కల్పించెను. బ్రిటిష మ్యూజియము లోను, బోడ్లియన్ గ్రంథాలయము (Bodleian Library) లోను గల ప్రాచీన లాటిన్ కవుల కావ్యముల లిఖిత ప్రతులను తైపారు వేసి చూచి సరిదిద్దుటయందు. ఆయన సాయము పేక్షింపబడెను.[135] దీనిని బట్టి చూచినచో, బ్రౌనుదొరకు పాశ్చాత్య భాషలపై కూడ నెట్టి ప్రభుత్వము కలదో తెలియును ఆయన కేవలము ఒక భాష మాత్రమే తెలిసిన పండితుడు కాడు!

లండనులో ఉండగనే బ్రౌనుదొర 1837లో, "ఇండియా హౌస్ లైబ్రరి"లో కట్టలు కట్టలుగా పడియున్న లిఖిత ప్రతులను చూచుట సంభవించినది. వాటిలో చాల భాగము—తెలుగు, కన్నడము, తమిళ లిపులలో నుండుటచే, ఎవరును—ఆ భాషలు తెలిసిన విద్వాంసులు లండనులో లేకుండుటచే - వాటిజోలికిపోలేదు. అవి బ్రౌనుదొర కొరకు నిరీక్షించుచున్నట్లు పడియున్నవి! వాటిలో చాలభాగము, డాక్టర్. లెయిడన్ (Dr. Leyden) సేకరించినవట! అతడు చనిపోయిన 28-8-1811 తరువాత, వాటిని "తూర్పిండియా కంపెనీ" వారు కొని, భద్రపరచిరి. బ్రౌనుదొర వాటిని పరిశీలించి, కేటలాగులు తయారుచేసి; కంపెనీవారికి-వాటిని మదరాసు పంపినచో ఎక్కువగా నుపయోగముండునని, సలహా ఇచ్చి; "మదరాసు సాహిత్య సంఘము" (Madras Literary Society) వారిచే వాటిని అడిగించి. "ఇండియా హౌస్ లైబ్రరి"లోని-దాక్షిణాత్య లిపులలోగల లిఖిత ప్రతులను మద్రాసునకు చేర్పించెను[136] (సెప్టెంబరు 1844) ఈ విధముగా,

---

135. "......to assist in collating antique manuscripts of some Latin poets, in the British Museum and Bodleian Libraries."
(Some Account of the Literary Life of C.P. Brown.)

136. "This collection was discovered in the India House Library by Mr Charles Philip Brown, of the Madras Civil Service, in 1837. The Manuscripts composing it are mainly in the Telugu, Tamil and Canarese characters, and had lain in the library many years unexamined and unnoticed from the want of scholars in England learned in the languages current in Southern India. Mr. Brown formed catalogues and at his suggestion, the whole store was transferred in 1844, on the application of the Madras Literary Society, to the custody of that body. In forwarding it to Madras, the Honourable Court mentioned that the collection was chiefly made by Dr. Leyden, whose Manuscripts the Company had purchased at his death." (D.F. Carmichael in the Preface to 'A Cataloque Raisonnee of Oriental Manuscripts; Madras, 1857; Page—XVIII.)

తాను 1827లో లండనునుండి సంపాదించిన ఒరిజి - లిఖిత ప్రతులకు సంబంధించినది - పూర్తిచేసినాడు. బ్రౌనుదొర 1844లో లండనునుండి వచ్చిన లిఖిత ప్రతులు, 1845లో బ్రౌనుదొర "మద్రాసు సాహిత్య సంఘము"నకు ఇచ్చిన లిఖిత ప్రతులు కలిసి, "కాలేజి లైబ్రరీ"కి చేరి, మదరాసులోని "ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము"నకు పునాదివేసినవి. ఈ కృషిని చేసినవాడు బ్రౌనుదొర. దీనిని "సి.పి. బ్రౌన్ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము" అనుట సమంజసము !

"ఇండియా హౌసు లైబ్రరీ" నుండి మదరాసుకు పంపబడిన (1844) లిఖిత ప్రతుల సంఖ్య 2,1[illegible]6. భాషానుసారముగ వీటినిట్లు విభజింపవచ్చును. ఇవి, వివిధ భారత లిపులలో గలవు

| భాష | లిపి | సంఖ్య |
|---|---|---|
| సంస్కృతము | తెలుగు | 272 |
| ,, | కన్నడ | 446 |
| ,, | గ్రంథ | 378 |
| ,, | దేవనాగరి | 165 |
| ,, | మలయాళ | 41 |
| ,, | ఒరియా | 7 |

సంస్కృతభాషలోనున్న పై గ్రంథముల సంఖ్య - 1,304

సంస్కృతేతర భాషలలోగల లిఖిత గ్రంథముల సంఖ్య, క్రిందివిధముగా నున్నది: (ఇందు "బర్మా" భాషలోని గ్రంథములుండుట విశేషము. "బర్మా" చాలకాలము భారతదేశభాగముగ నుండుట దీనికి కారణము కావచ్చును.)

| భాష | లిపి | సంఖ్య |
|---|---|---|
| తెలుగు | తెలుగు | 108 |
| కన్నడము | కన్నడ | 528 |
| తమిళము | తమిళ | 56 |

| | | |
|---|---|---|
| మలయాళము | మలయాళ | 11 |
| ఒరియా | ఒరియా | 9 |
| బర్మా | బర్మా | 90 |
| వివిధభాషలలో గల పై గ్రంథముల సంఖ్య - | | 802 |

ఈ లిఖిత గ్రంథములలో చాలభాగము, డా. లెయిడన్ సేకరించినవి.

బ్రౌనుదొర సేకరించి, "మదరాసు సాహిత్యసంఘము"నకు ఇచ్చిన (1846 జనవరి) లిఖిత గ్రంథముల సంఖ్య 2,400. భాషానుసారముగ వీటినిట్లు విభజింపవచ్చును. ఇందుకూడ, కొన్ని బర్మా భాషలోని గ్రంథములు కలవు. ఈయన సేకరించిన గ్రంథములును వివిధ లిపులలోనే యున్నవి. సంస్కృత గ్రంథములు వివిధములైన ప్రాదేశిక లిపులందును, ప్రాదేశిక భాషలలోని గ్రంథములు, ఆయా లిపులలోను గలవు.

| భాష | లిపి | సంఖ్య |
|---|---|---|
| సంస్కృతము | తెలుగు | 1,273 |
| ,, | దేవనాగరి | 16 |
| ,, | మలయాళ | 5 |
| ,, | వంగ | 5 |
| సంస్కృత భాషలోనున్న పై గ్రంథముల సంఖ్య - | | 1,299 |

మిగిలిన భాషలలోని గ్రంథముల విభజన మిట్లున్నది:

| భాష | లిపి | సంఖ్య |
|---|---|---|
| తెలుగు | తెలుగు | 1,116 |
| కన్నడము | కన్నడ | 18 |
| మలయాళము | మలయాళ | 3 |
| బర్మా | బర్మా | 4 |
| వివిధ భాషలలోని పై గ్రంథముల సంఖ్య - | | 1,141 |

పై 'పట్టిక'లను బట్టి, బ్రౌనుదొర సేకరించి ఇచ్చిన లిఖిత గ్రంథముల సంఖ్యయే అధికమని తెలియుచున్నది. లండను నుండి మదరాసునకు లిఖితప్రతులు పంపబడుటకును బ్రౌనుదొరయే కారణభూతుడని గ్రహించినప్పుడు, ఆయనలిఖిత ప్రతుల విషయమున కావించిన కృషియొక్క వైశిష్ట్యము, స్వయంవ్యక్తమగును. ఇట్లు లిఖిత గ్రంథములు సేకరింపబడి, మదరాసు కాలేజి లైబ్రరీకి - మదరాసు సాహిత్య సంఘమునుండి - తుట్టతుదకు చేర్చబడినవి. బ్రౌనుదొర, మనదేశమును విడిచి స్వదేశమునకు పోవువరకు, లిఖిత గ్రంథములను సేకరించుచు, పైవాటి సంఖ్యను పెంచుచునే వచ్చెను ! [137]

ఇవిగాక; మెకంజీ దొర సేకరించిన లిఖిత ప్రతులును, అతని పండితులు వ్రాసి తెచ్చిన ప్రాంతీయ గాథలును; శిథిలము లగుట చూచి, బ్రౌనుదొర వాటి నన్నింటిని 'ఇంగ్లీషు కాగితము'పై 'మసి సిరా'తో వ్రాయించి సంపుటములుగ చేయించి, భద్రపరిచెను. ఇవియే 'స్థానిక చరిత్రలు' అనుపేర, తరువాతి పరిశోధకు లకు పనికివచ్చినవి. నా డీపని బ్రౌనుదొర చేయింపకున్నచో, ఈ 'రికార్డులు' అన్నియు నేడు మనకు పనికిరాకుండ పోయి యుండెడివి.

పైన పేర్కొనబడిన విధములుగా, బ్రౌనుదొర గ్రంథ సేకరణమున, సంస్కరణమున, ముద్రణమున కృషిచేసి; ఆంధ్ర సాహిత్యాభివృద్ధికి? సాటిలేని సేవ చేసినాడు. తాను లిఖిత గ్రంథముల సేకరణమున (తానచ్చువేసిన తెలుగు కావ్యములను గూర్చి అందరికిని తెలియును గనుక, వాటిని గూర్చి ఇందు వ్రాయలేదు.) కావించిన కృషిని గూర్చి బ్రౌనుదొర; 1863లో లండను నుండి ప్రచురింపబడిన 'కర్ణాటిక్ క్రోనాలజీ' (Carnatic Chronology) అను పుస్తకముయొక్క పీఠికలో విపులముగా నిట్లు వ్రాసెను : [138]

---

137. "To this donation Mr. Brown was continually making additions up to the date of his departure for England, in 1855". (Ibidem)

138. Carnatic Chronology by C. P. Brown; Preface; Page—VI London, 1863.

"Being in London in the year 1837, I found a pile of manuscripts n Sanscrit and other languages, chiefly written on palm leaves, in the East India House Library; where they lay useless. I arranged these and wrote a catalogue. In consequence of a notice which I printed on the subject the whole hoard was in 1844 transmitted to Madras, where I arranged the volumes in the College Library, and also presented my own Library collected in several years past, of similar manuscripts in Sanscrit, Telugu, Cannadi, Tamil, and other languages; adding all the volumes (formerly placed in the Literary Society's shelves) which had been accumulated by Mackenzie. I then caused catalogues to be framed by learned natives; each catalogue is written in the language to which it belongs. A Catalogue Raisonnee of the entire collection is being prepared; the first volume. in 678 pages was printed at Madras in 1857."

"The historical records collected by Mackenzie are chiefly written on flimsy country paper, which the worms are rapidly destroying but the country ink, being made with lampblack, never fades. A few volumes are written on English paper, but unluckily, with English ink; this fades rapidly, and the writing in many places is nearly illegible. I therefore caused copies to be made on English paper with country ink. These copies, including many additional papers which I had myself discovered, now fill forty-eight volumes in small quarts, of "Local Records." In the margins I have generally marked the years in the Salivahana and the Christian reckoning."

తెలుగు కావ్యములకు ఆయన చేసిన సేవను ఆనాటి పండితులును చాల మెచ్చుకొనిరి. వ్రాయించిన వ్యాఖ్యానములను అత్యంతోత్సాహముతో ఆదరించిరి. ఈ విషయముల నాయనయే తన "సాహిత్య జీవితము"న నిట్లు తెలిపెను:

"In course of time, notes were appended to all the leading Telugu poems; a list of these is given in the introduction to my Telugu Dictionary. The commentaries framed at my expense have been greeted with much applause as illustrating and perpetuating Telugu literature."

వివిధ వ్యక్తులనుండి గ్రంథములను సంపాదించుటకు బ్రౌనుదొర నాలుగు పాయములను ప్రయోగించెనవచ్చును. అవశ్యకమైనచో వ్యక్తులనుండి-వారు సామాన్యులు మొదలుకొని జమీందారుల వరకు నుండిరి-వంశపారంపర్యముగ వచ్చుచున్న గృహ గ్రంథాలయములను-ఎక్కువ డబ్బుకూడ నిచ్చి-బ్రౌనుదొర కొనెను. ఆ నాటికి విజ్ఞాన కేంద్రములుగనున్న మచిలీపట్టణము, రాజమహేంద్రవరము మొదలైన పట్టణములనుండి గ్రంథములను కొనెను. తెలుగువారితో చక్కగా తెలుగులో మాటలాడి వారి గౌరవాభిమానములను చూరగొనియు, ఆంగ్ల భాషా పరిచయమున్నవారికి ఆ భాషలోని తన గ్రంథములను ఎరువిచ్చియు గ్రంథసేకరణ కార్యమును నెరవేర్చుకొనుచు వచ్చెను. అన్నింటిని డబ్బిచ్చి కొనుటగాని, తన అధికారము నుపయోగించి సంపాదించుటగాని జరుగదుగదా! హిందూమతములోని శైవ వైష్ణవాది వివిధ శాఖలను గూర్చిన పూర్ణ పరిజ్ఞానమున్న ఆయన ఆయా శాఖలకు సంబంధించిన గ్రంథములను ఆయా శాఖల అనుయాయులనే అడుగుట మంచిదని, కార్యసాధకమని భావించెను. తన శాఖేదారులకు కూడ ఈ విషయమున నిట్లే సలహోలిచ్చెను.

అవశ్యకమైనప్పుడు లిఖితప్రతులను భారతదేశములోని వివిధ ప్రాంతములనుండి - ముఖ్యముగా సంస్కృతాది గ్రంథములను - బ్రౌనుదొర తెప్పించెడివాడు. కలకత్తా, కాశీ మొదలైన ప్రాంతములనుండి తెప్పించిన లిఖిత ప్రతులలో కొన్నింటికి స్త్రీలు వ్రాయసగత్తెలగుట విశేషమనియు అట్టివాటిలో లేఖక దోషములు తక్కువగ నుండుననియు ఆయన అభిప్రాయపడెను.

ఇట్టి మహోత్కృష్టమైన సేవ, తెలుగు కావ్యములకు-అచ్చుకాని గ్రంథములకు-చేసినాడు గనుకనే, ముద్రణ కళను ప్రోత్సహించినాడు గనుకనే, కునుకుచున్న ఆంధ్ర సాహిత్య దీపమును ప్రజ్వలింపజేసినాడు గనుక బ్రౌనురదొ మిత్రుడైన వఠ్యం అద్వైత బ్రహ్మయ్య శాస్త్రిలు బ్రహ్మానందభరితుడై,

ఆయనకిట్లు తన ఆనందమును తెలుపుకొన్నాడు : [139]

"సరస్వతికి ప్రస్తుతమందు తమరు వొకరే నివాసస్థానముగా కనపడు తున్నారు. గనుక, యెక్కడ యేయే విద్యలు దాచబడి వున్నవో, అవి అన్ని తమంతట తామే తమ సన్నిధికి వస్తూవున్నవి. యీలాగు రావడమువల్ల, ఆయా విద్యలు అభివృద్ధి అవుతూవున్నవి. యీ కాలములో యీ విద్యలను తమవలె అభివృద్ధి చేయించేవారు నేను యెరిగి వున్నంతమట్టుకు యెవరూ కనపడలేదు. యిందున గురించి తమరు పుచ్చుకొన్న ప్రయాసవల్ల తేలిన పరిష్కార గ్రంథములు ఆ కల్పాంతమున్ను తమయొక్క కీర్తిని విస్తరింపచేస్తూ వుంటవి"

ఆనాటి తెలుగు వార్తాపత్రిక 'వర్తమాన తరంగిణి' బ్రౌనుదొర కృషి నిట్లు కీర్తించెను : [140]

"సమస్త ప్రాణి సంరక్షణ కర్తయగు భగవంతుడు.... లోకోపకారులయి నటువంటిన్ని హూణ ప్రభువులయినటువంటిన్ని మహారాజ శ్రీ సి. పి. బ్రౌన్ దొరగారిని తమ ప్రేరణముచేతనే యీ హిందూదేశమునకు రప్పించి మన గ్రంథములయందు వారికి మిక్కిలి యభిమానమును జనింపజేసినందువల్ల వారు విశేష ద్రవ్యమును ఖర్చుచేసి సంస్కృతాంధ్ర ద్రవిడాది యనేక గ్రంథములలో నొక్కొక్క ప్రతి కనేక ప్రతులను ద్రవ్య వ్రయముచేత సంపాదించి మిక్కిలి విశేషజ్ఞులయిన పండితులకు తగిన జీతములిప్పించి శుద్ధ ప్రతులుగా సిద్ధముచేయించి మనవారి కుపయోగార్థము పుస్తక బండారము నేర్పరచియున్న యీ మహోపకారుని మనమున్ను మన కుటుంబములవారున్ను అహోరాత్రములయందుసువిశేషములయిన వాక్యములచేత తలంచుచుండవలెనని ప్రార్థింపుచున్నాము''.

139. The Telugu Reader by C.P. Brown; 2nd Edition; 1867. Pages—193, 194. First Edition, 1852.

140. వర్తమాన తరంగిణి, 1847, ఫిబ్రవరి-4.

# వ్యా క ర ణ ర చ న

తెలుగు నేర్చుకొనగోరు పాశ్చాత్యుల కొరకు బ్రౌనుదొర నిఘంటువులను నిర్మించెను. వ్యాకరణము రచించెను. వాచకములను వ్రాసెను. ఇంకను లఘు గ్రంథముల నెన్నింటినో వ్రాసెను. వీటిలో నిఘంటు నిర్మాణమునకును, వ్యాకరణ రచనకును, ఆయనయే మొట్టమొదటివాడు కాకపోయినను; ఆయన గ్రంథములు ప్రజలలో పొందిన వ్యాప్తిని తక్కిన గ్రంథములు పొందకుండుటచే, 'పాశ్చాత్యులు వ్రాసిన గ్రంథములు' అన్న వెంటనే, బ్రౌనుదొరయే మనకు జ్ఞాపకము వచ్చును. ఆయన గ్రంథములనియే మనమూహింతుము ఈయన గ్రంథముల వ్యాప్తికి రెండు ముఖ్యములైన కారణములు గలవు. ఈయన రచనలన్నియు – తెలుగు ఎడల అభిమానము, తెలుగువారితో సానుభూతిగల రచనలగుట మొదటి కారణము. తెలుగుభాషలో కృషిచేసిన పాశ్చాత్యులందరిలో ఈయనయే పాండిత్యమున మిన్నయగుట రెండవ కారణము. ఈయన కృషి గమ్యస్థానము లేనిదికాదు. ఆయన కనుల ఎదుట చేరవలసిన గమ్యస్థానము అనుక్షణము కన్పట్టుచునే యుండెను. కనుకనే, ఆయన జయము పొందెను.

బ్రౌనుదొర తెలుగు నేర్చుకొనునాటికి, పండిత జనాంగీకారమును పొందిన పద్ధతి - నిఘంటువులను, వ్యాకరణములను - 'వల్లె' వేయుపద్ధతి. ఇది తెలుగు మాతృభాషగా గలవారికి పనికివచ్చునేమోగాని, తెలుగురాని పాశ్చాత్యులకు పనికివచ్చునదికాదు. వారి దృక్పథము, బోధనాపద్ధతి, ధ్యేయము – అన్నియు మనవానికంటె భిన్నములు. కనుక, పాశ్చాత్యులెవరు భారతీయ భాషలను నేర్చుకొన మొదలిడినను, ముందాభాషలను పఠించుచునే, వారి పద్ధతి ననుసరించి ఆయా భాషలకు ప్రాథమికములైన వ్యాకరణములను వ్రాసికొనిపోవుచు వచ్చెడివారు. జీవద్భాషల విషయమున, ఈ మార్గమునే ముఖ్యంగా వారనుసరించుచు వచ్చిరి. అట్లువారు రచించిన వ్యాకరణాదులను తరువాత దేశీయ పండితుల ఎదుటపెట్టి; వారి సవరింపులనుగాని, మన్ననలనుగాని పొందెడివారు. బ్రౌనుదొర

కూడ ఈ పద్ధతినే అవలంబించెను. ఏయే స్థలములందు దేశీయ పండితుల పద్ధతులు తనకు నచ్చలేదో, ఆయా స్థలములందు తన పద్ధతుల వైశిష్ట్యమును స్థాపించుకొనెడి వాడు. వారి పద్ధతులు సోపపత్తికములైన పట్టులందు, వాని ననుసరించెడివాడు. వారికి తన కృతజ్ఞతలను తెలిపెడివాడు.

నాడు, తెలుగు పాఠములను పాశ్చాత్యులకు చెప్పు పండితులను గూర్చి వ్రాయుచు; అనావశ్యకములైన పదజాలములను మొట్టమొదటనే కంఠస్థము చేయుడని వారు కోరుదురనియు, దానివలన ఉపయోగము తక్కువ అనియు, కవుల కావ్యములను చదివి అందు వచ్చిన మాటలను గ్రహించినచో చాలినంత పద జాలము వచ్చుననియు, వారిని విమర్శించుచు; "మనము ధాన్యమడుగగా, గడ్డిని కూడ దానితోబాటు తినుట కంగీకరించినచో, దాని నిచ్చుట కియ్యకొందరు" అని తీవ్రముగా వ్రాసెను[1].

తెలుగురాని, తెలుగు నేర్చుకొనుచున్న పాశ్చాత్యులను మనస్సులో నుంచు కొని వ్రాయుటచే; బ్రౌనుదొర ఇంత కఠినముగ, నిష్కర్షగ వ్రాయవలసి వచ్చెను. కాని, మన పండితులయందు గౌరవము లేకకాదు. తెలుగు నేర్చుకొను పాశ్చాత్యులకు, తెలుగు పండితులపై తన మాటలవలన గౌరవము కలుగదేమో అను భయముతో, వెంటనే – ఆ పండితులు మంచి ఉపాధ్యాయులనియు, వినయ విధేయతలు, ఓర్పుకలవారనియు, చక్కని నైపుణ్యము కలవారనియు, ఏడు సంవత్సరములు వారితో కలిసి చదివినప్పుడుగాని తనకు వారి పాండిత్య వైభవము గోచరము కాలేదనియు వ్రాసి; తన సత్యతత్పరతను, సహృదయతను చూపెను[2].

---

1. "We ask for grain : they give it us on the condition that we will, with it, submit to eat the straw......They counsel us to learn, as they do, long vocabularies by rote, whereas by reading the poets we can easily acquire an ample stock of all the words that are in use."

(A Grammar of the Telugu Language., Preface, Page V., 1840, 1857, 1863.)

2. "But the Brahmans are excellent Instructors; patient, humble, and admirably skilful. Until I had studied the poems with them for seven years, I did not perceive how perfect they are in learning." (Ibidem—Preface, Page IV.)

బ్రౌనుదొర నిఘంటువుల తరువాత, మిక్కిలి వ్యాప్తికి వచ్చినది ఆయన తెలుగు వ్యాకరణము. ఇది 1840లో మొదటిసారి అచ్చయినది. రెండవ ముద్రణము 1857లో జరిగినది. ఈ రెండు ముద్రణములకు నడుమగల కాలములో, విద్యార్థుల సలహాల ననుసరించి, బ్రౌనుదొర గ్రంథమున మార్పుల నెన్నింటినో చేసి, రెండవసారి ముద్రించెను[3].

అనేకులు అనేక విధములుగ ఆయనకు వ్యాకరణ రచన విషయమున సలహాలనిచ్చిరట! అన్నింటిని చెవియొగ్గి విని, తనకు సత్యమై తోచినట్లు తాను చేసెను. భాషలోనున్న రూపములను కూడ కొన్నింటిని మార్చి, నవ్యరూపములను సృష్టింపుడని కూడ కొందరు కోరిరట! కాని, ఆ ఉత్తమ పరిశోధకుడు, వ్యాకరణ రచన నెరింగినవాడు; ఆ వాక్యములను పెడచెవిని బెట్టి; భాషను మార్చుటకు కవులకేగాని తనకు అర్హత లేదనియు, ఆ కవులు చేసిన మార్పులును ఒకప్పుడు ప్రచారమునకు రాకపోవచ్చుననియు, ఉన్నది ఉన్నట్లు, కన్నది కన్నట్లు, విన్నది విన్నట్లు; నిష్కర్షగ, నిశితముగ చెప్పుటయే తన పనియనియు, తన అభిప్రాయమును బలపర్చు ప్రయోగము నెత్తి చూపుటతో తన కార్యము ముగియుననియు; వ్రాసెను[4]. బ్రౌనుదొర ఇంత చిత్తశుద్ధిగల పరిశోధకుడు. వ్యాకరణ రచన అనగా, ఉన్నవానికి గతి కల్పించుట అని గుర్తెరింగిన విచక్షణుడు, కనుకనే, వ్యావహారికాంధ్రమును ఆయన పర్యవేక్షణమునకు వచ్చినది.

---

3. Many years have passed since the first edition of the Grammar was printed. In that period I have re-composed nearly every page; particularly attending to the remarks made by students" (Ibidem—Preface, Page V.)
4. "Some have urged me to simplify the grammar by rectifying irregularities. But innovations can only be made by poets; and even such as they make do not always become current. My province was merely to observe, record, arrange, and explain focts, and to produce quotations in proof of my statements." (Ibidem, Preface, Page V.)

బ్రౌనుదొర 'తెలుగు వ్యాకరణము' యొక్క ముఖపత్రము ఇట్లున్నది:

A Grammar

of the

Telugu Language

By

Charles Philip Brown

of The Madras Civil Service

Madras :

Printed by R.W. Thorpe,
At The Veperty Mission Press,
of the Society for promoting
Christian Knowledge.
1840

ఇది 'తెలుగు వ్యాకరణము'యొక్క మొదట ముద్రణమునకు సంబంధించి నది. రెండవ ముద్రణము (1857) జరుగునాటికి, బ్రౌనుదొర మనదేశమును విడిచి (1855) స్వదేశమునకు వెడలిపోయెను.

ఆ రోజులలో పండితులు, తెలుగు బాగుగా మాటలాడుట రాకపూర్వమే, పాశ్చాత్యులను – ఆంధ్ర భాషా భూషణము, అమరము, అప్పకవీయము, నన్నయ భట్టీయము మొదలగునవి చదువుడని చెప్పుచుండెడివారట! బ్రౌనుదొర మాత్రము, తెలుగు బాగుగా మాటలాడగలుగు వరకు, వీనిని చదువకుండ తప్పించుకొనెను[5]

తెలుగు నేర్చుకొనగోర పాశ్చాత్యులు ఇన్ని శ్రమలు పడవలసియుండుటచే వారికి ఉత్సాహము తగ్గుచుండెడిది. ఇది చూచి బ్రౌనుదొర, తెలుగు వ్యాకరణ

---

5. **"Telugu assistants counsel us to read……the Sanscrit vocabulary by Amara, the versified set of Telugu synonyms called Andhra - Bhasha - Bhushanam, or the treatises on grammar written by Nannaiia Bhatta and Appa Cavi. Happily for me I never read one of these books until I had already (about the age of twenty-seven) acquired a command of the spoken Telugu." (Ibidem-Preface, Page III)**

రచనకు పూనుకొనెను. ఈయన వ్యాకరణము రచించి ప్రచురించుటకు (1840) ముందే, పాశ్చాత్యులు వ్రాసి ముద్రించిన వ్యాకరణములు రెండు, మూడు కలవు. అందు ముఖ్యమైనవి ఈ రెండును -

(1) కాంబెల్ దొర "తెలుగు వ్యాకరణము" A Grammar of the Teloogoo Language By A.D. Campbell, of the Honorable East India Crmpany's Civil Service on the Madras Establishment; 1816, 1820).

(2) విలియమ్ బ్రౌన్ "జెంటు భాషా వ్యాకరణము" (A Grammar, of the Gentoo Language by William Brown, M.C S. 1817).

కాంబెల్ దొర వ్రాసిన వ్యాకరణము, ప్రచురింపబడిన క్రొత్తలో కొంత ప్రచారమునకు వచ్చినను; బ్రౌనుదొర వ్యాకరణము ప్రచురింపబడిన తరువాత, దాని వ్యాప్తి తగ్గుచువచ్చెను. ఇందులను ముఖ్య కారణము గ్రంథముల తార తమ్యమే. దేశీయ పండితుల మెప్పును మనస్సులో పెట్టుకొని కాంబెల్ దొర వ్యాక రణమును వ్రాసినట్లుగా బ్రౌనుదొర అభిప్రాయపడెను. తాను మాత్రమట్లుగాక, తెలుగు నేర్చుకొనగోరు పాశ్చాత్యులను మనస్సులో నుంచుకొని, దేశీయ పండి తులు మెచ్చుకొను కఠిన విషయములను, గ్రంథ ప్రారంభమునగాక, వెనుకకు నెట్టి, అరంభమున సులభ విషయముల నుంచెను[6].

కాంబెల్ దొర, తన వ్యాకరణములో గ్రాంథిక భాషకును, వ్యావహారిక భాషకును సమమైన ప్రాధాన్యమిచ్చి వ్రాసితినన్నను, అతని వ్యాకరణములో గ్రాంథిక భాషకే ప్రాధాన్యము కొంత హెచ్చుగా నున్నట్లు కన్పట్టును. తన వ్యాకరణము కావ్యములు చదువు వారికిని, వ్యావహారిక భాషను మాత్రమే నేర్చుకొన నెంచువారికిని కూడ ఉపయోగపడునట్లు తాను రచించినట్లు చెప్పు

---

6 "Native tutors urge us first to learn the very subjects which have placed at the end of the work. The native method is followed by Mr. A.D. Campbell in his "Teloogoo Grammar", an accurate, though very imperfect work, too intricate to aid the beginner." (Ibidem—Preface, Page IV)

కొనెను, ఈతడు తన వ్యాకరణమును దేశీయ పండితుల సలహాల ననుసరించి వ్రాసెను[7]. ఈతనికి సలహాలిచ్చి, సాయము చేసినవారిలో ముఖ్యులు - ఉదయగిరి వేంకట నారాయణయ్యగారు, వేదము పట్టాభిరామశాస్త్రిగారు అనువారు. వీరిని గూర్చి వీరి సాయమును గూర్చియు కాంబెల్ దొర తన వ్యాకరణము యొక్క పీఠికలో వ్రాసెను[8].

ఈ వ్యాకరణమునకు బ్రౌనుదొర వ్యాకరణము వచ్చిన తరువాత ప్రచారము తగ్గెను. ఇందువలన కాంబెల్ దొరకు ఈర్ష్యకలిగి, మొట్టమొదట బ్రౌనుదొర వ్యాకరణమును నిరసించెనట! కాని, సహృదయుడైన బ్రౌనుదొర ఇది గ్రహించి, తన వ్యాకరణ ప్రతినొక్కదానిని బైండుచేయించి, చక్కగా మర్యాద ఉట్టిపడుచున్న జాబుతో కలిపి, కాంబెల్ దొరకు పంపి, ఆతని ఈర్ష్యను పోగొట్టెను. కాల

---

7. "An attentive examination of the two may possibly lead to a very different conclusion : at all events, as this work is intended as much to enable the student to understand the rules which regulate the classical compositions of the Natives, as to teach him to speak or write the common Teloogoo, I have deemed it my duty to follow the Native Grammarians by tracing the language to its original sources in the superior dialect—at the same time. I have not neglected its more usful branches in the inferior dialect, which, as being vulgar, Native authors have considered beneath the notice of the learned." (A Grammar of the Teloogoo Language by A.D. Campbell, 1816; Introduction, Page-XVII.)

8. "In examining the principles inculcated by the best native grammarians, I was assisted by my Teloogoo instructor Woodiagherry Vencatanarrain Ayah, a young bramin of superior intelligence and remarkable acquirements, who, by his own merits alone, subsequently rose to the situation of Head English master at the College of Fort St. George, and lately to the more honorable office of Interpreter to the Supreme Court of Judicature at the Presidency. He generally sat by me while I wrote the notes from which this Grammar has been compiled, and I may therefore be said to have availed myself of his aid and advice throughout the work."

క్రమమున బ్రౌనుదొర వ్యాకరణము వ్యాప్తిని పొంది కాంబెల్ వ్యాకరణము మూలపడినది[9]. కాని, 1816 లోను, 1[illegible]2 లోను రెండుసార్లు ముద్రింపబడిన "కాంబెల్ వ్యాకరణము" మొట్టమొదట మంచి ప్రచారమునే పొందినది. ఇది మూడవసారి 1849లో అచ్చగుటయే ఇందుకు తార్కాణము. దీనిని ప్రభుత్వము వారు కొని, "కాలేజీ ప్రెస్సు"లో అచ్చువేయించిరి[10] నాటి గవర్నర్ జనరల్ (Earl of Moira, K.G.) నకు ఈ పుస్తకము అంకితమీయబడినది.

కాంబెల్ దొర వ్యాకరణమునకు ఇంచుమించు సమకాలికమైన ఇంకొక తెలుగు వ్యాకరణము విలియమ్ బ్రౌన్ (William Brown) అను నాతడు వ్రాసినది. ఇతనికిని బ్రౌనుదొరకును ఏ విధమైన బంధుత్వమును లేదు. ఇతడు గాక ఇంకను కొందరు "మిలిటరి" ఉద్యోగులు, ఈ పేరుగల వారుండిరి. వారికిని

---

"I have only further to add that on all intricate points of grammar I have invariably consulted the learned Pundit Putabhi Rama Sastry, Head Sanscrit and Teloogoo master at the College, and where I found the native grammarians at variance, have been regulated chiefly by his opinions, in attempting to reconcile their differences, or in selecting that authority to which the preference has been given." (Ibidem, Introduction - Page XXV.)

9. My Telugu grammar appeared in the end of 1840, and at once became popular. In my grammar I had given Mr. Campbell due praise, and wishing to appease his jealousy, I sent him a splendidly bound copy, with a respectful letter : thereupon he countenanced my book, which soon superseded his own."

('Some Account of the Literary Life of C. P. Brown')

10. "The manuscript, thus prepared, was submitted to the Government of Fort St. George, whose approbation it having been so fortunate as to obtain, the copyright was purchased on the public account, and the the Right Honorable the Governor in Council was pleased to direct the work should be printed at the College Press, whence it now issues to the Public."

(A Grammar of the Teloogoo Language by A. D. Campbell· Advertisement.)

బ్రౌనుదొరకును కూడ ఏ చుట్టరికము లేదు[11]. విలియమ్ బ్రౌన్ వ్యాకరణము పేరు "జెంటూ భాషా వ్యాకరణము". ఇది 1817లో అచ్చయినది (A Grammar of the Gentoo language). విలియమ్ బ్రౌన్‌ను, సి.పి. బ్రౌనుదొర ఎరుగును. ఆ వ్యాకరణమును ఎరుగును. కాని దానిమీద ఆయన కంత గౌరవము లేదు[12]. తెలుగు భాషకు సాహిత్యమేమియు లేదని, విలియమ్ బ్రౌన్ సంభాషణలో బ్రౌనుదొరకు చెప్పెనట![13] "జెంటూ భాషా వ్యాకరణము" విషయమై అంతకు పూర్వము ఎనిమిది సంవత్సరముల క్రిందటనే ప్రకటన జరిగినను, అది కారణాంతరములచే 1817 వరకు అచ్చుకాలేదు అంత మాత్రముచే, ఈ వ్యాకరణముయొక్క ప్రాముఖ్యముగాని, ఆవశ్యకతగాని కొరవడలేదని దీని పీఠికలో నున్నది[14]. ఇదిగాక, ఈ ఆలస్యము గ్రంథమును పునః పరిశీలించుటకు సదవకాశమును కల్పించినదని విలియమ్ బ్రౌన్ ఊహ[15]. "ఆంధ్ర దీపిక"ను వ్రాసిన మామిడి వెంకయ్యగారు ఈ వ్యాకరణ రచనలో, విలియమ్ బ్రౌన్

---

11. "At this period there were in Madras other officers of the same name : none were connected with me, one was William Brown, who died in 1837" (Some Account of the Literary life of C. P. Brown.)

12. "..... he printed a poor vocabulary and a poorer Grammar." (Ibidem)

13. "I recollect that he assured me the language (which he called Gentoo) possessed no literature." (Ibidem)

నామసామ్యమునుబట్టి, కొందరు తెలుగు పండితులు; విలియమ్ బ్రౌన్ చార్లెస్ ఫిలిప్ బ్రౌన్, ఒకరే అని పొరబడుట కలదు. అట్లు వ్రాసిరికూడ!

14. "It is true, that nearly eight years have gone by since it was first ushered in to that notice, which was expected to have made it long since familiar to the student. But; althouh fortuitous circumstances have intervened to prevent this desirable event there is no reason to suppose that the offer of it at this day is either out of place, or unimportant to the object it holds in view". (A Grammar of the Gentoo Language - preface ; page 1.)

15. "......the incidents ... which have retarded the publication of this work, for so many years as have elapsed since the first introduction of the manuscript to official inspection, have afforded a desirable leisure for considering and revising the whole..." (Ibidem ; page—XVII).

నకు సాయపడెనట[16]. దీని రచన మచిలీపట్టణములో జరిగినది. ఇది అచ్చగుటకు కొన్ని నెలల ముందు మామిడి వెంకయ్యగారు అటనుండిరి. ఈతడేకాక, గుండు మళ్ళ పురుషోత్తముగారను నాతడును, ఈ వ్యాకరణ రచనమున సాయపడెను[17].

విలియమ్ బ్రౌన్ తన వ్యాకరణమునకు "జెంటూ భాషా వ్యాకరణము" అని పేరు పెట్టుటకు కారణము, ఆ రోజులలో తెలుగునకు పాశ్చాత్యులలో "జెంటు" (Gentoo) అను పేరుండుటయే[18]. ఆ రోజులలో తెలుగునకు, తెలుగు వారికి తెలుగు దేశమునకు "జెంటూ" అని పాశ్చాత్యులు వాడుచుండిరనుటకు నిదర్శనము అనేకములు గలవు. విలియమ్ బ్రౌన్ మాత్రమేకాక, కాంబెల్ కూడ తన తెలుగు వ్యాకరణముయొక్క ముఖపత్రమున "జెంటు" అను శబ్దమును తెలుగునకు పర్యాయ పదముగ వాడెను[19].

---

16. **"There lived till within these few months past, a Banian in the Town of Masulipatnam, where the present work was originally constructed, whose name was Maamedy Venkiah ..The assistance of this man in the compilation of both grammar and vocabulary, has been of the greatest advantage."**
**(Ibidem; Page—XIII)**

తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము - కొత్తపల్లి వీరభద్రరావు. హైదరాబాదు, ద్వితీయ ముద్రణ 1986.

మామిడి వెంకయ్యగారికి సంబంధించిన వివరములకు: పుటలు - 282, 283, 284, 285.

17. **"A Bramin by name Goondmulla Poorshottum, now no more, who was Government pleader of the Provincial Court at Masulipatnam, also afforded very able aid". (Ibidem; page—XIII)**

18. A Grammar of the Gentoo Language - William Brown. 1817. ఈ వ్యాకరణము మదరాసు గవర్నరు అయిన 'హ్యూగ్ ఎలియట్' Hugh Elliot) నకు 28-3-1817 నాడు అంకితమీయబడినది.

19. A Grammar of the Telugoo Language, commonly termed the Gentoo, peculiar to the Hindoos inhabiting the North Eastern Provinces of the Indian Peninsula - A.D. Campbell, 1816. ఇది 1816, 1820, 1849 సంవత్సరములలో ముద్రణములను పొందినది. ఇది నాటి గవర్నరు జెనరల్ అయిన 'ఎరల్ మ్యారా' (Eral of Moira, K.G.)కు అంకితమీయబడినది.

"జెంటు" అను మాట "జెంటియో" (Gentio) అను పోర్చుగీసు మాట యొక్క భ్రష్టరూపము. దీని అర్థము "క్రైస్తవేతరుడు". కాని, పోర్చుగీసువారు క్రైస్తవేతరులైన హిందువులకే, ఈ పదమును వాడెడివారు. ముస్లిములకు "మూరు" (Moor) శబ్దమును వాడెడివారు. ఈ రెండు శబ్దములును, పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధమున, వాడుకలోనుండి, క్రమక్రమముగా, పోయినవి. కాని, "జెంటు" అను శబ్దము ఆంగ్లభాషలో; తెలుగు ప్రజలకు, తెలుగు భాషకు 'అడప తడప', పర్యాయ పదముగ వాడుకలో కనబడుచున్నది[20].

విలియమ్ బ్రౌన్‌నకు "తెలుగు" అను మాట తెలిసియున్నను తన వ్యాకరణమునకు "జెంటు" భాషా వ్యాకరణమని పేరుపెట్టుటను బట్టి చూడగా, అతని కాపదమే నచ్చినట్లు తోచుచున్నది. అంతేకాక, "జెంటు" అను పదమునకు బదులుగా "తెలుగు" అను శబ్దమును వాడినవారి నతడు విమర్శించినాడు![21]

మొట్టమొదట పోర్చుగీసువారిచే "జెంటియో" పదము ఏ దేశమునకు చెందినవానికైనను. క్రైస్తవేతరుడు (Heathen) అయినచో ఉపయోగింపబడినది[22]. కాలక్రమమున, ఈ పదము హిందువులకు పర్యాయపదముగ పాశ్చా

---

20. "I mean to amuse myself with learning Gentoo, and have brought a Moonshee with me. Gentoo is the language of this part of the Country (Godavary delta), and one of the prettiest of all the dialects" Letters from Madras during the years 1836—1839. By a Lady—1843. ఈ వాక్యములు 1887లో వ్రాసిన ఒక జాబులోనివి; (Page—281; A Glossary of Anglo-Indian Colloquial words and Phrases).

21. "And this leads us to notice the pertinacity of some writers who fix upon the word Tenoogoo, or Telinga as a more appropriate term than Gentoo. The word Gentoo is condemned as beneath the notice of the learned." (A Grammar of tne Gentoo language; Preface—Page—XVII).

22. "A very famous Corsair who was called Hinimilaw, a Chinese by nation, and who from a Gentio as he was, had a little time since turned Moor ....." (The Voyages and Adventures of Fernand Mender Pints; A Portugal; done into English by H. C. Gent, London. 1653; Folio. దీని మాతృక, 1614 పోర్చుగీసు భాషలో, లిస్బన్ నగరమున ప్రచురింపబడెను. (A Glossary of Anglo-Indian colloquial words and phrases; Londen 1886; Page—280.)

త్యులలో రూఢమైనది. "జెంటైల్" అను పదము మొట్టమొదట ఇంకొక అర్థము (జ్యూకానివాడు) నందు వాడబడినను, కాలక్రమమున "జెంటియో" అర్థమే దానికిని సంక్రమించినది. పోర్చుగీసువారి వ్రాతలలోనిది విశేషముగ కనప్పట్టును. వారి తరువాత భారతదేశమునకు వాణిజ్యమునకై వచ్చిన పాశ్చాత్యు లందరును, నాడు విదేశస్థులలో బహుళ ప్రచారమున నున్న "జెంటు" శబ్దమును హిందువులకు పర్యాయపదముగ వాడిరి. ఈ మాట పదునారవ శతాబ్ది యొక్క ఉత్తరార్ధమునుండి ఉపయోగింపబడు చుండినట్లు, విదేశ యాత్రికుల వ్రాతల నుండి ఉదాహరణలు చాల గ్రహింపవచ్చును. పోర్చుగీసు యాత్రికులలో ముఖ్యులైన వారందరు, హిందువులను వర్ణించి చెప్పునప్పుడు ఈ పదమునే వాడిరి. సిమో బొటెల్హో (Simao Botelho)[23], గార్షియ (Garcia)[24], కాష్టనీడ (Castaneda)[25] మొదలగువారి గ్రంథములలో ఈ పదములు విశేషముగ కనప్పట్టుచున్నవి.

17, 18 శతాబ్దులలో "జెంటు" (Gentoo) అను పదము ఇంగ్లీషు భాషలో విశేష ప్రచారమునకు వచ్చినది. తక్కిన పాశ్చాత్యులవలెనే ఇంగ్లీషు వారును మొట్టమొదట ఈ పదమును, హింతువులకు పర్యాయపదముగ వాడుచు

---

23. "......for there are some of them who often try to make Christians by force, and worry the Gentoos (Jentios) to such a degree that it drives the population away." (Simao Botelho-1548; Ibidem. Page—280.)

24. "...this ambergris is not so highly valued among the Moors, but it is very highly prized among the Gentiles." (Garia-1563; Ibidem. Page—280.)

25. "A Gentile...whose name was Canáca." (Castaneda-1582 Ibidem. Page—210.)

26. లండనులో అచ్చయిన ఒక పుస్తకము పేరు. 'A Code of Gentoo Laws or Ordinations of the Pundits. From a persian Translation, made from the original written in the Sanskril Language; London, printed in the year 1776. By Nathaniel Brassey Halhed. (Ibidem; page—281.)

వచ్చిరి. కాని, కాలక్రమమున ఇది తెలుగువారికిని, తెలుగు భాషకును పర్యాయ పదముగ వాడుకలోనికి వచ్చెను[27].

ఈ విధముగా "జెంటు" అను పదము రెండు విధములైన అర్థములలో వాడుకలో నుండెను. "హిందువు" అను అర్థమున ఈ పదమునకు ప్రయోగము కాలక్రమమున తగ్గిపోయినను; తెలుగువారు, తెలుగుభాష, అను అర్థమున ప్రయోగము మాత్రము పందొమ్మిదవ శతాబ్దిలో కూడ ఇంగ్లీషు భాషలో నుండెను. ఎందులకీ విధముగా, ఈ శబ్దము తెలుగువారి విషయమున రూఢికెక్కినదో నిర్ణయింపవలసియున్నది.

పోర్చుగీసువారు భారతదేశమునకు వచ్చినప్పుడు, విజయనగర సామ్రాజ్యము ఉచ్చస్థితిలో నుండెను. నా డించుమించుగా, దక్షిణదేశమంతయు వారి ఏలుబడిలో నుండెను. ఇది తెలుగు సామ్రాజ్యము గనుక, ఉన్నతోద్యోగులలో చాలమంది తెలుగువారు. వీరందరు, ఇంచుమించుగా, హిందువులు, హిందువులకు సామాన్యముగా ఆనాడు వాడబడుచుండిన "జెంటు" లేక "జెంటైల్" లేక "జెంటియో" శబ్దము తెలుగువారికి పర్యాయపదముగ వాడబడి రూఢమైనది[28]

---

27. "The Heathens who inhabit the kingdom of Golconda..... are called Jentives." Jehan Van Twist—1648 (Ibidem; page—281.)

"Their Language they call generally Gentio...the peculiar name of their speech is Telinga"—by John Fryer, M. D. (A New Account of East India and persia, in letters from 1672-1681; London—1698) Ibidem; (page—281.)

బ్రౌనుదొర తన 'జిల్లా నిఘంటువు' (The Zillah Dictionary, 1852)లో ఇట్లు వ్రాసెను. "In the Year 1682 the inhabitants of Madras are, in a proclamation, described as English, Portuguese, Gentoo and Malabar." (Poge-30)

28. "For the terms Gentio and Gentoo were applied in two senses :

(a) To the Hindus generally,

(b) To the Telugu speaking Hindus of the peninsula specially, and to their language."

ఆ రోజులలో ఎక్కువ విమర్శలేకుండ, పాశ్చాత్యులచే వాడబడుచుండిన ఇంకొక పదము "మలబార్" అనునది. ఈ శబ్దమును. ఎప్పుడో ఒకప్పుడు, వివిధభాషలు మాటలాడు పాశ్చాత్యులందరును, తప్పుగనే ప్రయోగించిరనుట సత్యదూరము కాదు. దక్షిణ దేశ భాషల కన్నింటికి ఈ శబ్దము ఎప్పుడో ఒకప్పుడు వాడబడియేయుండెను. ముఖ్యముగా, తమిళమును "మలబార్" అని వ్యవహరించుట ప్రసిద్ధముగా నుండెను[29]. మొట్టమొదట ఈ రెండు భాషలకును గల భేదమును పాశ్చాత్యులు—ముఖ్యముగా పోర్చుగీసువారు—గుర్తింపలేకున్నను, కాలక్రమమున ఈ భేదము గుర్తింపబడినను, తమిళమును "మలబార్" అను పేరుతో వ్యవహరించుట లేకపోలేదు. ఈ పొరపాటు వచ్చుటకు కారణము; పడమటి కోస్తా భాషకును కోరమండల్ కోస్తా భాషకును పోలికలుండుటయే. పోర్చుగీసువారు ఈ పోలికలనే గ్రహింపగలిగిరి కాని, ఆ భాషల భేదమును గుర్తింపలేకపోయిరి[30].

---

"The reason why the term became thus specifically applied to the Telugu people is probably because, when the Portuguese arrived, the Telugu Monarchy of Vijayanagara dominated over great part of the peninsula. The officials were chiefly of Telugu race, and thus the people of this race, as the most important section of Hindus, were par excellence the Gentiles, and their language the Gentile language"—(A Glossary of Anglo-Indian Colloquial words and phrases—H. Yule and H.C. Burnell—London 1886; page—280.)

29. "Two distinct languages are necessarily required; one is the Damulian, commonly called Malabarick (Propagation of the Gospel in the East, part III; page-33; 3rd Edition. 1718. As quoted in A Glossary of Anglo-Indian Colloquial words and phrases By H. Yule and A.C. Burnell. London, 1896. page-413)

30. "The Portuguese ..sailing from Malabar on voyages of exploration...made their acquaintance with various places on the Eastern or Coromandel coast and finding the language spoken by the fishing and sea-faring classes on the Eastern coast similar to that spoken on the Western, they came to the conclusion that it was identical with it, and called it in consequence by the same name viz. Malabar..."

(A Comparative Grammar of the Dravidian Languages by Bishop Caldwell, 2nd Edition; pages 10-12; 1875.)

"మలబార్" అను పదమును క్వాచిత్కముగ తెలుగునకు కూడ వాడుట కలదు[31]. కాని ఇది అపవాదముగానే గ్రహింపవలెను. మద్రాసులోని తెలుగులో తమిళ భాషా పదములు విశేషముగ నుండుటచే కాబోలు. దానిని "దక్షిణ జెంటు"(జెంతు)లేదా"తెలింగి తముళ"అని "విలియమ్ బ్రౌన్" ప్రయోగించి,దానిని నిరసించి, తెలుగు నేర్చుకొనువారు పరిహరింపవలెనని వ్రాసెను. ఇంతేకాక దీనిని, నాడు భారతదేశములో వాడుకలోనున్న భ్రష్టమైన పోర్చుగీసుతో పోల్చి నాడు[32]. ఈతని దృష్టిలో; కృష్ణానదికి ఉత్తరమునగాని మంచి "జెంటు" (జెంతు) మాటలాడుటలేదనియు, కృష్ణానదికి దక్షిణము నందంతట "మలబార్"పదజాలము కలిసిన భాషయేయనియు, కన్పట్టుచున్నది. "జెంటు"(జెంతు) నేర్చుకొనునప్పుడు "మున్షీ"ని ఏ ప్రాంతమునుండి తీసికొనవలయు ననునది చెప్పుచు ఈ వాక్యములు వ్రాసెను[33].

కాని, విలియమ్ బ్రౌన్‌నకు సమకాలికుడగు కాంబెల్, తన తెలుగు వ్యాకరణముయొక్క ముఖపత్రమున"జెంటు"(జెంతు)శబ్దమును వాడినను, తెలుగు నిట్లు

---

31. "The language spoken at Madras is the Talinga, here called Malabars." (Journal of a Residence in India By Maria Graham; 1812. Edinburgh-page—128. As quoted in A Glossary of Anglo-Indian Colloquial words and phrases; page—413.)

32. "The Language these people now speak is perfect jargon; which in Europe, the people of Portugal would scarcely comprehend... In the same manner, or somewhat similar, may the Gentoo spoken at Madras and in the South of the Peninsula be considered; and it would be perfectly justifiable to designate it by the appellation of Southern Gentoo; or the Telinga Tamula of Madras."

(A Grammar of the Gentoo language—By William Brown; 1817; preface—page—page-IX).

33. "...let him be assisted in his studies by a Tutor from the Northern side of the Kistnah so that the barbarous incrustation of a Malabar diction may be avoided, ...(Ibidem - page - VIII.)

పిలుచుటకు పాశ్చాత్యులకు తగదనియే పీఠికలో వ్రాసెను[34]. బ్రౌనుకొర తరువాత 1873లో తెలుగు వ్యాకరణమును రచించిన ఎ.హెచ్. ఆర్డెన్ కూడ ఇటులనే వ్రాసెను[35] బ్రౌనుదొర తన తెలుగు వ్యాకరణములో దీనికి ప్రాముఖ్యమే ఈయలేదు. "జెంటు"(జెంతు)అను పదమును, తెలుగునకు పర్యాయపదముగ వాడుటను అపహాసించి,పోర్చుగీసువారు ప్రవేశపెట్టిన ఈ పేరు పరిహరించుట ఉత్తమమని వ్రాసెను[36]. ఈ వాక్యమును వ్రాయునప్పుడు బ్రౌనుదొర మనస్సులో ఈ ఇరువురును (కాంబెల్, విలియమ్ బ్రౌన్) కలరేమో!

ఈ రెండు వ్యాకరణములేగాక, బ్రౌనుదొర వ్యాకరణమునకు ముందు, మరి రెండు వ్యాకరణములున్నటుల; కాంబెల్, విలియమ్ బ్రౌనుల వాక్యములు తెలుపుచున్నవి. ఈ రెండు వ్యాకరణములలో, వీరిరువురును పేర్కొని విమర్శించినది "డాక్టరు కెరేయొక్క వ్యాకరణము" డాక్టరు విలియమ్ కెరే, (Dr. William Carey, D.D. 1761 - 1834) వంగదేశమునకు 1794లో వచ్చెను. క్రైస్తవమత వ్యాప్తికై కృషిచేసినవారిలో ప్రముఖుడు. ఈతడు అనేకములైన భారతీయ భాషలకు వ్యాకరణములను నిర్మించెను[37], ఈతడా కాల

---

34. "The language of which a Grammar is now offered to the public is commonly, but improperly, termed by Europeans the Gentoo."

(A Grammar of the Teloogoo Language by A.D. Campbell, 1816. Introduction; page-1).

35. "The language now under consideration is called Telugu or Tenugu. The Sanscrit name is Andhra. It has also sometimes, though improperly, been called by Europeans-Gentoo."

(A Progressive Grammar of the Telugu Language By A.H. Arden 1873. Chapter I; page-1.)

36 "It is high time to abolish the absurd name Gentoo which was introduced by the Portuguese, and is ignorantly used by some persons for the name Telugu.

(A Grammar of the Telugu Language by C.P. Brown; 2nd Edition, 1857; Book First; page-13.)

37. మహారాష్ట్రి (1805); సంస్కృతము (1806); పంజాబి (1812); తెలుగు (1814).

డా. కెరేకు సంబంధించిన వివరములకు: పుటలు-27[illegible], 278. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము-కొత్తపల్లి వీరభద్రరావు, హైదరాబాదు, ద్వితీయ ముద్రణ 1936.

ములో ప్రాచ్య భాషాకోవిదునిగ పేరుపొందెను. ఈతని సంస్కృత వ్యాకరణము ప్రసిద్ధికెక్కినది. ఈతడు 1814లో "తెలింగ వ్యాకరణము"ను (Telinga Grammar) ప్రకటించెను. ఈతడు తెలుగు, సంస్కృత భాషాజన్యమన్నట్లు వ్రాయగా, కాంబెల్[88] విలియమ్ బ్రౌన్‌లు దానిని ఖండించిరి[89].

---

38. "It has been very generally asserted, and indeed believed, that the Teloogoo has its origin in the language of the Vedams, and many of the most eminent Oriental scholars have given their authority in support of this opinion......on this, and on several other material points connected with the structure of the Teloogoo I regret that my sentiments should be entirely at variance with those of so celebrated an Orientalist as Dr. Carey, one of the learned professors in the college of Fort William, to whom the public are indebted for a very copious Grammar of the Sanscrit language, and for a series of works on the elements of the spoken dialects of India."

(A Grammar of the Teloogoo Language By A.D. Campbell. 1816, 1820, 1849. Introduction; page-XV.)

39. "And this leads to the mention of a Grammar of the Gentoo Language more recently published in Bengal, by an English Missionary of considerable repute in the Philological world, whose name has already been quoted as the framer of a Shanscrit Grammar(Dr.William Carey,D.D.)...when the compiler of that small tract on another occasion asserts, that the Shanscrit "is the immediate parent of the Maharatta, the Orissa, the Telenga, the Caranatic, the Gujurat, and the Malabar and Tamul Languages; and that the knowledge of the Shanscrit places all those in our power, as it will generally furnish four words out of five of them all;" We cannot help smiling at the gross mistakes exhibited in a grammar of the Gentoo, compiled as it has been by one who is so professedly competent in the Shanscrit Language".

(A Grammar of the Gentoo Language-By William Brown 1817, Preface; page XII-XIII.)

ఈ వ్యాకరణమునేగాక విలియమ్ బ్రౌన్ ఇంకొక వ్యాకరణమునుగూడ తన 'జెంటు (జెంతు) భాషా వ్యాకరణము'నందు పేర్కొనెను. అది ఒక ఫ్రెంచిదేశస్థుడు వ్రాసినది. దానిని విశేష ప్రయత్నముమీద, గుంటూరులో నున్న ఒక మిషనరీ ద్వారా విలియమ్ బ్రౌన్ తెప్పించి చూచెనట! అది అతనికి నచ్చలేదు. దాని యందు అనావశ్యకములగు విషయములు చాల గలవనియు, విషయ విభాగము నందును, విషయమునందును, రచనాపద్ధతి యందును, దోషములు చాల గల వనియు; తన వ్యాకరణమును తొందరగా ప్రకటించి, "జెంటు" (జెంతు) భాషా విషయమై, ఆ ఫ్రెంచి దేశస్థుని వ్యాకరణములోని దోషములను, తొలగింపవలె నను కోరికను అధికముచేయుటకు మాత్రమే, ఆ వ్యాకరణమును[40] చూచుట ఉప యోగపడెననియు, విలియమ్ బ్రౌన్ వ్రాసెను. ఈ వ్యాకరణమంత ప్రచారము నకు వచ్చినట్లు లేదు (ఈ పరిశోధన గ్రంథములో పుటలు — 205, 208).

తన వ్యాకరణమునకు (1840) ముందే ప్రచురింపబడిన ఈ వ్యాకరణముల నన్నింటిని బ్రౌనుదొర చూచినాడని చెప్పవచ్చును. కాంబెల్, విలియమ్ బ్రౌనుల వ్యాకరణములు చూచినాడనుటకు ప్రత్యక్ష నిదర్శనములను పరిశీలించితిమిగదా! కాని, వీటియందు ఆయనకు అంత ఆదరముగాని, గౌరవ భావముగాని ఉన్నట్లు లేదు. ఇవన్నియు రచయితల భాషా భేషజమును చూపుటకు పనికివచ్చునవిగాని, విద్యార్థులు తెలుగు నేర్చుకొనుటకు ఎక్కువగా సాయపడునవికావని బ్రౌనుదొర అభిప్రాయపడినాడనవచ్చును. "కాంబెల్ వ్యాకరణము"పై బ్రౌనుదొర వెలిబుచ్చిన అభిప్రాయమే, పై ఊహకు ఆధారముగా గ్రహింపవచ్చును.

---

40. "A reference in the first instance was made to a Gentoo Grammar, published a series of years ago by a Frenchman, of which an imperfect copy was procured from a Missionary then residing at Guntoor - But, though ample in the materials it was found to be superfluously minute and perplexing in the detail; and so extremely incorrect in doctrine as well as matter, that little other use was derived from it, except that of prompting the formation of the present Grammar with the greater alacrity; if for no other reason than that of rescuing the proper Gentoo from the perversion and mis-constructions, with which this French production so amply teemed." (Ibidem. page-XII).

హిందూ వైయాకరణులు వ్యావహారిక భాషను పేక్షింతురనియు, ఈ విష యమున చైనాదేశపు పండితులు వీరికి పోలిక వత్తురనియు ఆయన వ్రాసెను.[41] వ్యావహారిక భాషకుగల ప్రాముఖ్యమును గూర్చి చెప్పుటయందు బ్రౌనుదొరకు విసుగులేదు.

సంస్కృతమునకు తెలుగునకు గల సంబంధమును గూర్చి బ్రౌనుదొర చక్కగా చెప్పెను. మొట్టమొదటి ఆంగ్ల వ్యాకరణములు, లాటిన్ పద్ధతిపై రచింపబడినట్లే, తెలుగు వ్యాకరణములు కూడ సంస్కృత వ్యాకరణ పద్ధతులపై రచింపబడినవనియు, దేశీయ విద్వాంసులు "సంస్కృతము తెలుగునకు తల్లి" అన్న ప్పుడు, దీనిని జన్యజనక సంబంధముగ గ్రహింపక, సంస్కృత పదజాలముపై తెలుగు ఎంత ఆధారపడియున్నదో తెలియజేయు భావముగా గ్రహింపవలె ననియు, సంస్కృత పదము ఉపయోగింపకుండ తెలుగు మనము మాటాడలేక పోవుట ఇందులకు నిదర్శన మనియును వ్రాసెను.[42]

బ్రౌనుదొర తన తెలుగు వ్యాకరణములో, విద్యార్థిని భ్రమింపజేయు పాండిత్య ప్రకర్షకై పాటుపడలేదు. సంప్రదాయసిద్ధములు గదాయని కఠినమైన, నిరుపయోగమైన మార్గములను అనుసరింపలేదు. అటులని తన వ్యాకరణమును

---

41. "Hindu Grammarians, like those of China, neglect the colloquial dialect, which they suppose is already known to the student, and teach only the poetical peculiarities. They are willing to aid our studies, either in Telugu poetry or in Sanscrit : they are reluctant to teach us the language of common business."

(A Grammar of the Telugu Language By C.P. Brown. 2nd Edition 1857. Preface, page-II).

42. "Our earliest English grammars were arranged on the Latin system; and the oldest grammatical treatises on Telugu were constructed on the Sanscrit plan, though the two languages are radically different. The native grammarians of the present day are fond of the expression that "Sanscrit is the mother"; but this does not allude to its origin; it merely denotes dependance, because we cannot speak Telugu without using Sanscrit words." (Ibidem; page-VI).

పేలవముగ చేయలేదు. అంతకు పూర్వము సర్వత్ర వ్యాపించియున్న "భాషా భేషజము"ను మాత్రము ఆయన తొలగించెను.[43]

ఇంక ఆయన వ్యాకరణ రచనాపద్ధతిని కొంత పరిశీలింపవలసి యున్నది. ఈ వ్యాకరణము పండ్రెండు భాగములుగ విభజింపబడినది. ఇందులో మొదటి పది భాగములలో వ్యాకరణ భాగమంతయు పూర్తియగును. పదునొకండవ భాగము ఛందస్సునకు సంబంధించినది. ఇంతకు పూర్వమే, 1827లో 'ఆంధ్ర గీర్వాణ చ్ఛందము' ముద్రించుటవలన, వ్యాకరణ గ్రంథములోని ఈ ఛందోభాగమును లఘువుగా రచించెను. పండ్రెండవ భాగము 'ద్రుత ప్రకృతికములు, కళలు' మొదలగువానికి సంబంధించినది. ఈ భాగములకు వెనుక అనుబంధముగ "లెక్కలకు సంబంధించిన మానములు" మొదలగునవి ఈయబడినవి. "ద్రుత ప్రకృతికములు, కళలు" మొదలగునవి గ్రంథముయొక్క చివరి భాగమందుంచుటకు ముఖ్య కారణముగా క్రింది వాక్యములను - పాశ్చాత్యులకు పాఠముచెప్పు "తెలుగు మున్షీ"ల ఉపయోగార్థము - బ్రౌనుదొర తన వ్యాకరణములో వ్రాసెను. ఉపాధ్యాయులు, ప్రారంభకులైన విద్యార్థులకు అనావశ్యకములగు విషయములను, వర్ణసమామ్నాయము తరువాతనే మొదలుపెట్టిన, వారిచే క్రింది వాక్యములను, విద్యార్థులు చదివింపవలెననియు, వ్రాసెను.[44]

"ఇంగిలీషువారు ఆంధ్రము చదవ నారంభించేటప్పుడు కేవలం సంస్కార దూరులై వున్నారు గనుక శబ్దపరిచ్ఛేదం, క్రియాపరిచ్ఛేదం, మాత్రము తొలుత నేర్చుకోవలసినదే గాని కళ - ద్రుతం - సంధి - సరళాదేశం - తద్భవం - తత్సమం - దేశ్యం - యిత్యాది ప్రమేయములను గురించి ప్రస్తుతం తలపెట్ట పనేలేదు - యీ హేతువువల్లనే యీ ప్రమేయములు యీ వ్యాకరణములో ఆది భాగములో వ్రాయక అంత్యభాగములో వ్రాయడమైనది. పైగా ఆరంభములో పద్యాలు చదవడము అన్నివిధాలా నిష్ఫలము గనక తొలుత అక్షరాలు - జాబులు - వాజ్మూలములు - గాక మరి యేదిన్ని చదవ నగత్యము లేదు."

43. "Hitherto every path was over grown with gay weeds of pedantry which I have cleared away." (Ibidem; page-VI).

44. "The ordinary teachers are apt to speak to student on some learned subjects which are ill suited to beginners. The tutor should on such occasions be desired to read the following caution." (Ibidem. Book First; page-32.)

ఈ ఇంగ్లీషు వాక్యముల క్రింద పైని ఉదహరింపబడిన తెలుగు వాక్యములు గలవు.

బ్రౌనుదొర అనేక పాశ్చాత్య భాషలలో పండితుడు గనుక, వీలున్నప్పుడెల్ల తెలుగు భాషను, తెలుగు పలుకుబడిని ఆయా భాషలతో పోల్చి వ్రాయుచు వచ్చెను. ముఖ్యముగా తెలుగును "ఇటాలియన్" భాషతో చాలసార్లు పోల్చెను. ఈ పోలిక కేవలము భాషయొక్క మాధుర్యము విషయమునకేగాక, పదముల కూర్పు విషయమునను కలదని నిరూపించెను.[46]

క్రియయొక్క పురుషలను గూర్చి చెప్పుచు: సాధారణముగా ఇంగ్లీషు వారు చెప్పెడి – ఫస్ట్‌పర్సన్ అనగా ప్రథమ పురుష, అని అనుకొను దోషమును గూర్చి వ్రాసెను[47]. ఈ దోషము ఇంగ్లీషు చదువుకొన్న మనవారిలో కూడ తరుచుగ కన్పట్టుచుండును గదా! ఇది స్వల్పవిషయమని భావించి వ్రాయుట మానలేదు.

ఈ వ్యాకరణములో 'నామవాచకము'లను గూర్చి చెప్పు భాగమును చదువుట, 'నవల'లోని భాగమును చదువుటవలె నుండును. మన ఇంటిపేరులు, మొదలగువాటిని గూర్చిన విషయ మెంతయోగలదు. అన్నింటికంటె ముఖ్యమైనది - పాశ్చాత్య నామములకును, భారతీయ నామములకును గల పోలికలు, భేదాలు మొదలగువాటిని చర్చించు భాగము. మనలో క్షత్రియ స్త్రీలు మొదలగువారు, 'అమ్మ' అని పేరుచివర ఉంచుకొనుటకు బదులుగా 'అయ్య' అని పేరు చివర ఉంచుకొనుట తెలిసిన విషయమేగదా! దీనిని గురించి వ్రాయుచు బ్రౌనుదొర స్కాట్లండు దేశములో గొప్పయింటి స్త్రీలకు 'సర్' (Sir) అని వాడుట కలదని ఉదాహరణ చూపెను.[48]

---

46. "The Telugus are a people quite as highly civilized as any in Europe : occasionally their modes of speech resemble those of Italy. Thus instead of 'Sir you told me to do so' the phrase is ఇది చేయుమని దొరగారు శెలవు యిచ్చినారు" (Ibidem; page-165.)

47. "When we converse with a native who knows Sanscrit but not English we must remember that I, we, are called ఉత్తమ పురుష; Thou, you, are called మధ్యమ పురుష; and He, she, it, they, are called ప్రథమ పురుష the first person." (Ibidem; page-68.)

48. "But Telugu ladies of rank use the masculine affix; and sign their names as సీతయ్య or రంగయ్య; instead of సీతమ్మ or రంగమ్మ".

"Thus Mariamur pro rege nostro Maria Theresa. The Highland Scotch use the word 'Sir' respectfully to ladies." (Ibidem. page-212.)

తన తెలుగు వ్యాకరణమును 1840 లో అచ్చువేయునాటికి బ్రౌనుదొరకు తెలుగు భాషా సాహిత్యములను గురించి, తెలుగు వారి ఆచార వ్యవహారములను గురించి పరిపూర్ణమైన అవగాహన ఉండెను. అప్పటికప్పుడే, ఇరువది మూడు సంవత్సరముల నుండి (1817-1840) తెలుగు భాషా సాహిత్యముల అధ్యయనము, కృషి ఆయన కొనసాగించుచుండెను. ఆంధ్ర గీర్వాణచ్ఛందము 1827లోను, వేమన పద్యములు 1829 లోను అచ్చువేయించెనను విషయము మనకు తెలిసినదే! ఇందువలన తెలుగు వ్యాకరణములో నామవాచకములను గురించి వ్రాసినప్పుడు జనరంజకముగ వ్రాయగలిగెను.

వ్యాకరణ రచన విషయమున మొదటి నుండియు ఆయనకు నిశ్చితాభిప్రాయము లుండెను. తెలుగు మాతృభాషగాగల వారికి వ్రాసెడి వ్యాకరణములు కూడ సులభముగ నుండవలెను గాని, ఆవశ్యకమైనను కాకున్నను గుడ్డిగా సంస్కృత వ్యాకరణ మర్యాదలను పాటించునవి కానక్కరలేదని ఆయన భావించినప్పుడు: తెలుగు రానివారికై వ్రాసెడి వ్యాకరణము లెంత సులభముగ, విషయావగాహనకు తోడ్పడునవిగా ఉండవలెనని ఆయన ఊహించి యుండునో, శ్రమలేకుండ మనకు భావింపవచ్చును. ఈ విషయమును ఆయన 1827 లోనే ముద్రితమైన ఆంధ్రగీర్వాణచ్ఛందములో (పుట - 91) నిట్లు వ్రాసెను:

**"It is to be hoped that a Telugu Grammar may eventually be written for the use of the natives, in a plain and intelligible manner, free from the difficulties hitherto imposed upon it by a superstitious adherence to the Sanscrit system, and clear to the ordinary reader."**

వ్యాకరణ విషయకమైన సాంప్రదాయిక భావములను వాటి ఉచితానుచితములను ప్రశ్నింపక అంగీకరించుట అలవాటయిన మన పండితులను గూర్చి ఇట్లు పై గ్రంథమునందే (పుట - 89) వ్రాసెను:

**"Accustomed to receive traditionary opinions without venturing to question their accuracy, the Telugu grammarians, with the exception of a few enlightened men, always denominate "Sanscrit the mother and Telugu the daughter." Were this the truth, how are we to account for the curious fact, that not one professed scholar in a hundred, among bramins, is to be found, who is equally versed in both languages? Many who have studied Sanscrit with distinguished success, remain so entirely ignorant of their native tongue, that the plainest points in Telugu grammar, orthography, and prosody, are beyond their knowledge. This is the effect of the intricate and**

**pedantic manner in which Philology has been treated by the native criticks; and when a more rational mode is adopted, we may certainly hope it will be attended by a beneficial restoration of learning."**

తాను చెప్పిన సత్యమునకు ఆధారమైన ఉదాహరణను తెలుగు విభక్తుల నుండి గ్రహించెను. తెలుగు విభక్తుల వింగడింపు సంస్కృత పద్ధతిపై ఆధారపడి యున్నది గనుక దాని నెరుంగని వారికి ఈ వింగడింపు అంత ఉపయోగకారి కాదని వ్రాసెను ("...these allusions however, increase the difficulty to those who possess no such previous knowledge").

## తెలుగు విభక్తులు

I will here give the cases of the noun, with their names, as defined in the native Telugu grammars" (ఆంధ్ర గీర్వాణచ్ఛందము. పుటలు - 90, 91).

1. Prathama Vibhacti, the nominative case.

| | | |
|---|---|---|
| 2. Dvitiya | do | is the accusative or objective and is likewise governed by కూర్చి, or గురించి for, concerning etc., |
| 3. Tritiya | do | (the instrumental) తో, తోడ, చే, చేత with, by. |
| 4. Chaturthi | do | కై, కొరకు, కోసరము, for, on account of; the dative. |
| 5. Panchami | do | కంటె, కన్న, వలన, వల్ల. పట్టి, than, by, through; the ablative. |
| 6. Shashthi | do | యొక యొక్క, (the genetive, of) with, కి, or కు (the dative, to, for) also లో, లోపల in, within; the possessive. |

7. Saptami do అందు, అందు, and న. by, in, etc. called the locative.

8. Sambodhana , the vocative: usually considered the same as the first case *

"The student... will find it necessary to recollect the Telugu affixes signified by the numerical designations of the cases, he will however, perceive the absurdity of applying such an arrangement (though laid down by the ancient criticks) to the Telugu noun; which infact, has only the same cases as are used in Latin : several of the commonest affixes, as పైన, and మీద, above, కింద, under, అవతల beyond etc. etc. are excluded from the list; they have indeed no claim to be placed in it, but the other words here adapted to the Sanscrit classification has no better reason to support them. (ఆంధ్రగీర్వాణచ్ఛందము, పుటలు - 90, 91).

మన వ్యాకరణ విషయమున, ఛందస్సు విషయమున ఇంత అవగాహన 1827 నాటికే ఉన్న బ్రౌనుదొర తన వ్యాకరణమును సర్వులకు పనికి వచ్చునట్లు తీర్చిదిద్దుటలో ఆశ్చర్యము లేదు. తెలుగు చదువుట ప్రారంభించి నప్పటి నుండి, కష్టమైన మాటలకు అర్థములు వ్రాసికొనిపోవుచు తన నిఘంటువులకు పునాదులు వేసికొనినట్లే భాష నేర్చుకొనుట ప్రారంభించినప్పటి నుండి వ్యాకరణాంశములను గుర్తించుకొనుచు వచ్చి తన వ్యాకరణమునకు పునాదులు కల్పించుకొనెను. ఈయనకు ముందున్న వ్యాకరణములు, నిఘంటువులుకూడ ఆయనకు కొంత సాయపడినవనుటలో సంశయము లేదు గాని వాటియందు బ్రౌనుదొర కంత గౌరవము లేదు.

---

* వీటిని జ్ఞాపక ముంచుకొనుటకు వీలుగా 'లాటిన్'లో బ్రౌనుదొర ఇట్లు వ్రాసెను :

1. Primus, Nominativus : 2. Curchi, gurinchi, Secundus, Accusativus et est : sed 3. to, che, Tertius optat : 4. Quartus, cui, Coracum : 5. Quintus, cante, valla, patti : 6. Sextus, lopala, lo' Genitiva Datinaque confert : 7. Septimus, ind' and' et na requirit et ille Localis : 8. Octavus casus, Sambodhana, qui Vocativus.

బ్రౌనుదొర కంటె ఉద్యోగములో సీనియర్ అయిన కాంబెల్, ఆనాటి ప్రభుత్వమునకు తెలుగునకు సంబంధించిన అన్ని విషయములలో సలహాదారు డగుటచే, బ్రౌనుదొర విషయమున ఆయన రచనల విషయమున అభిప్రాయములు చెప్పవలసిన - చెప్పగలిగిన - బాధ్యత వహించి యుండెను. కొన్ని కొన్ని విషయములలో బ్రౌనుదొరకు అనుకూలముగ నున్నను, బ్రౌనుదొర పాండిత్య విషయమున ఆయన పుస్తక ప్రచురణ విషయమున కాంబెల్ కొంత ఈర్ష్య వహించి యుండెను. ఇంక జె.సి. మారిస్ ఆనాడు తెలుగులో మంచి విద్వాంసుడని పేరు పొందెను. మద్రాసు కాలేజి పరీక్షలలో ఇతడు బ్రౌనుదొర కంటె ఉన్నత శ్రేణిలో ఉత్తీర్ణుడైన సమకాలికుడు. ఇతడు బ్రౌనుదొర కంటె ఒక సంవత్సరము ఆలస్యముగ- మద్రాసు కాలేజిలో చేరినను (26 ఆగస్టు 1818) తెలుగులోను, హిందుస్థానీలోను మంచి పాండిత్యమును సంపాదించి అధికారుల మన్ననలను పొందెను.) "......the great and unprecedentea rapid progress of Mr. Morris in the acquirement of the Teloogoo language, and we also mentioned very favourably his progress in Hindustanee...... We now have to report that his progress in both the languages which he has studied (more especially in Teloogoo) has been such; as within three months and a half, from the period of his entering the college to rank him, as regards general merit above all the students.......In regard to rapidity of progress Mr. Morris stands unrivalled on the records of the institution ....." - Madras College Board.)

తరువాత తెలుగులో అద్భుత కృషిచేసి నేటికిని మన మన్ననలను పొందుచున్న బ్రౌనుదొర ఆనాటి పరీక్షలలో అధికారుల ఆదరమును పొందలేక పోయెను ! తెలుగులో కూడ సాధారణముగానే యుండెను !
("Although Mr. Brown prossesses a considerable knowledge of the Teloogoo language, it is not well grounded. His excercises show that the meaning of many words has been gathered from the context. and in conversation he evinces an habitual disregard of grammar and precision, though he succeeds in conveying his general meaning...")
బ్రౌనుదొర మూడు సంవత్సరముల కాలములో ఆరు అర్ధ సంవత్సర పరీక్షలు తీసికొని 1820 జూన్ నాటికి ఎట్లో మదరాసు కాలేజి చదువు పూర్తి చేసెను. ఇందువలన కూడ కాంబెల్, మారిస్‌లకు బ్రౌనుదొర విషయమై అంత సదభిప్రాయము మొదటి నుండియు లేదనవచ్చును. వీరిరువురు బ్రౌనుదొర కంటె ముందే కాలేజి బోర్డు సభ్యులుగ నుండిరి (1828). అప్పటికి, బ్రౌనుదొర ఆంధ

గీర్వాణచ్ఛందము అచ్చు (1827) వేసెను. వేమనపద్యములు అచ్చునకు (1829లో అచ్చయ్యెను) సిద్ధమగుచుండెను. కాంబెల్‌ను మంచి చేసికొనుటకు తన ఆంధ్ర గీర్వాణచ్ఛందమును అతనికి* అంకితమిచ్చెను. కాంబెల్ కొంత తృప్తిపడి బ్రౌను దొరకు సదర్ అదాలత్ కోర్టులో ఉద్యోగమిప్పించుటకు ప్రయత్నించెను. కాని బ్రౌనుదొర తాను తెలుగు - ఇంగ్లీషు నిఘంటువును సిద్ధము చేయుచున్నట్లు చెప్పగనే, వెంటనె తటస్థత వహించెను! మే నెల 1829 లో కాలేజి బోర్డు వారికి, ముద్రణమునకు సాయపడవలసినదని తన నిఘంటు లిఖిత ప్రతిని పంపుకొనినను, ఫిబ్రవరి 1830 లో ఒక జ్ఞాపిక వ్రాసికొనినను బ్రౌనుదొరకు ఫలితము శూన్యమయ్యెను! కాంబెల్‌కు ఆనాటి కాలేజి బోర్డులోనున్న పలుకుబడి అట్టిది!

జనవరి 7 వ తేది 1838 లో బ్రౌనుదొర లండను నుండి తిరిగి వచ్చిన తరువాత, మారిస్ స్థానమున ఫార్సీ అనువాదకునిగ (23 జనవరి) నియుక్తుడయ్యెను. కాంబెల్ సెప్టెంబరు నెలలో బ్రౌనుదొరను కాలేజి బోర్డు సభ్యునిగ చేయించెను. కాని, తాను తెలుగువ్యాకరణము వ్రాసినట్లు బ్రౌనుదొర చెప్పగనే

---

*DEDICATION

TO

**A. D. CAMPBELL Esq.**

OF THE MADRAS CIVIL SERVICE

WHO FIRST RENDERED THE TELUGU LITERATURE

ACCESSIBLE TO THE ENGLISH READER,

THE PRESENT WORK

IS VERY RESPECTFULLY INSCRIBED

— C. P. Brown.

కాంబెల్ మౌన భావమును వహించెనట! మారిస్‌నకు ఈ విషయమును బ్రౌను దొర చెప్పినప్పుడు ప్రదర్శితమైన అతని వైఖరిని బ్రౌనుదొర ఇట్లు వర్ణించెను :

**"The following day (21st December) I spoke to Morris about it. He bluntly replied that he never would take a step (in approving my grammar) which might give umbrage to Campbell. Adding that he was prevented from condemning my book solely by reason that I was now a member of the College Board : and that he could not act thus to a brother member. Right and wrong were thus put out of the question. I then got back my manuscript Grammar from the College and in the end of 1840 it was printed and published."**

దీనిని బట్టి, ఈ ఇద్దరు "తెలుగు పండితులు" బ్రౌనుదొర యందెంతటి "అభిమానము" కలవారో తెలియుచున్నది. అయినను 1840 లో తాను తెలుగు వ్యాకరణము ప్రకటించినప్పుడు, కాంబెల్ మంచిని సంపాదించుటకు—తోగడ, ఆంధ్రగీర్వాణచ్ఛందమును అంకితమిచ్చినట్లే—బ్రౌనుదొర తన వ్యాకరణ ప్రతి నొకదానిని కాంబెల్‌కు బహుకరించెను. ఈ విషయమును, ఆ ఇద్దరిని పురస్కరించుకొని తాను ప్రవర్తించిన విధమును బ్రౌనుదొర ఇట్లు వివరించెను :

**"I know there was small probability that Campbell would ever read my Grammar. But as his opinion would have great weight I got a copy of the book bound in scarlet and gold and sent it to him with a complimentary letter. This completely disarmed him : and Morris followed his example. But, lest they should have me in their power, I never presented the grammar to the College, and the book quietly came into vogue and easily superseded Campbell's Grammar."**

**"The Dictionaries printed by Campbell and Morris were at once discarded, when mine were published."**

బ్రౌనుదొర తన తెలుగు వ్యాకరణ రచనను మిక్కిలి శ్రద్ధగా లండనులో కొనసాగించెను. తన నిఘంటువునకు శుద్ధమైన లిఖిత ప్రతిని సిద్ధము చేసికొనెను. ఈ విషయమై ఆయన ఇట్లు వ్రాసెను :

**"I enjoyed England vastly...... But visiting my relations and friends......still left me daily some hours of leisure ; which I occupied in completing a transcript of the Dictionary and in writing a Telugu Grammar."**

బ్రౌనుదొర తెలుగు వ్యాకరణము ప్రథమ ముద్రణము 1840 లో వచ్చినను, నిఘంటువులు మాత్రము 1854 వరకు రాలేకపోయినవి. ఈ రెండు పనులకు గల తారతమ్యము, కృషిభేదమే నిఘంటువుల ఆలస్యమునకు కారణములుగా చెప్పవచ్చును. బ్రౌనుదొరను ఓడలో కలిసికొనిన (1837) బిషప్ కాల్డ్వెల్, ఆయన తెలుగు వ్యాకరణమును గూర్చి, ఎనిమిది వాల్యూములలోనున్న నిఘంటు లిఖిత ప్రతులను గూర్చి తన రెమినిసెన్సెస్ (Reminiscences) లో పేర్కొనెను. అనగా అప్పటికే అవి సిద్ధమై -తరువాత చాల చేర్పులు, మార్పులు జరిగినను — ఉన్నట్లు గ్రహింపవచ్చును. కాంబెల్, మారిస్‌లు - తన వ్యాకరణమును, నిఘంటువులను మెచ్చుకొనలేదనియు, తనకు ఈయవలసినంత ప్రాముఖ్యము ఈయలేదనియు, తనయందు ఈర్ష్య వహించి చాలసార్లు అడ్డుపడినారనియు బ్రౌనుదొర విస్మరింపలేదు. తన సాహిత్య జీవిత చరిత్రలో వారి కృషిని త్రుణీకరించి వ్రాసెను. దేశీయ విద్వాంసులు చేసిన కృషిని వారు వినియోగించుకొని ఆయా రచనలకు తమ పేర్లు పెట్టుకొనిరని వ్రాయునంత దూరమే పోయెను; ఈ రచన చేయునాటికి పైఇరువురు ప్రముఖముగ లేరు. జీవిత సంధ్యాకాలములో (కాంబెల్ మృతి — 1857; మారిస్ మృతి — 1858) నుండిరి అనవచ్చును. అదియుగాక బ్రౌనుదొర రచన - 1866 లో లండనులో మొదటిసారి ముద్రితమగువరకు - "ప్రైవేటు" గానే ఉండెను. ఆనాటి ప్రభుత్వము, వీరి కృషికి ధనరూపమున చాల పారితోషిక మిచ్చినది (కాంబెల్ నిఘంటువునకు 14000 రూపాయలు; మారిస్ నిఘంటువునకు 15,000 రూపాయలు). బ్రౌనుదొరకు ఇచ్చెదమన్న ధనము ఈయలేదు! ఇవన్నియు బ్రౌనుదొర మనస్సులో నుండుటచే ఆయన వీరి గ్రంథముల విషయమై ఇట్లు వ్రాసెను:

"In 1816 Mamidi Vencayya completed his Andhra Dipica : a lexican of the poetical dialect explained in Sanscrit and Telugu. Government rewarded him......It is not printed. This was translated by two skilful natives, aided by Wilson's Sanscrit Dictionary. Thus for instance, the words Ollu, Chettu, Kukka were rendered deham, Vrixam, Sunaka : and by referring to Wilson they found that the Englisn words were body, tree, dog. This was superintended by Mr. Campbell who in 1821 published it in his own name......"

"Campbell was rewarded with Rs. 14,000 besides all his expenses : and Mr. Morris also received Rs. 1,750 for his juvenile production, Teloogeo Selections. Of this the native author was Adak

Subba Rao, who next began to write the English - Telugu Dictionary. In 1825 Mr. Morris received from Government Rs. 15,000 for the work : which was not completed until 1836. It was entirely grounded on Reeve's English - Cannadi Dictionary. ...... Campbell and Morris I therefore left unmentioned in my own work. To the end of their lives they had but a slender acquaintance with Telugu."*

ఈ సందర్భములోనే, విలియమ్ బ్రౌన్ 1818లో ప్రచురించిన Gentoo vocabulary and Grammar ను గురించి వ్రాయుచు అవి మచిలీ పట్టణమునకు చెందిన అకుల మన్నాటి నరసయ్య సంకలనముగా ("...are completed by Acula Mannati Narasia of Masulipatnam...") పేర్కొని, ఇందువల్లనే విలియమ్ బ్రౌన్ తన పేరు పుస్తకముపై వేసికొనక "a Civil Servant long resident in the Northern Circars") అని వ్రాసికొనెనని చెప్పెను.

ఇట్లు వ్రాసినంత మాత్రమున, గుణమున్నచోట దానిని గ్రహింపని లేదా గ్రహింపలేని వాడని బ్రౌనుదొరను గూర్చి మనమనుకొన నక్కరలేదు. కాంబెల్ వ్యాకరణము అసంపూర్ణమని విమర్శించినను, దానిని "....an accurate work giving the substance of the native treatises...." అని మెచ్చుకొనెను.

ఏది ఏమైనను, పాశ్చాత్యులైన ఆనాటి తెలుగు పండితులకు, ప్రభుత్వమునకు: బ్రౌనుదొరకు సరిపడలేదని గ్రహింపవచ్చును. ఇందువల్లననే, బ్రౌనుదొర 34 సంవత్సరములు మన దేశములో ఉండి తెలుగులో కృషిచేసినను; ఆనాటి ప్రభుత్వమువల్ల ఆయనకు లబ్ధి ఏమియు కలుగలేదు. ధనవిషయకమై ప్రభుత్వము చేసిన వాగ్దానములను చెల్లించుకొనలేదు. ఇదిగాక చిన్న పొరపాటునకు ఉద్యోగము పోయెడి స్థితి కూడ ఆయనకు కలిగినది ! శాశ్వతముగా పోకపోవుట ఆయన అదృష్టము కంటె తెలుగు అదృష్టమనుట సమంజసమేమో !

---

* Literary Auto Biography of C. P. Brown ; Chief Editor : G. N. Reddy Editor Bangory Sri Venkateshwara University, Tirupati, 1978, Page - 79.

ఈ వ్యాకరణములో పదునొకండవ భాగము ఛందస్సునుగూర్చి చెప్పునదని ముందు వ్రాసితిని. ఈ భాగముకూడ, బ్రౌనుదొరయొక్క పాండిత్యమునకు నికషోపలము. ఇందు తెలుగు ఛందస్సునకు కావలసిన సమస్త విషయములు ఆంగ్ల భాషలో ఉదాహరణములతో గూడ ఈయబడినవి. అటులని మారుమూల సూత్రములు కూడ ఇందున్నవని తలంపరాదు. అట్లిచ్చుట బ్రౌనుదొరయొక్క సిద్ధాంతమునకే భిన్నముగదా! మొట్టమొదట ఛందశ్శాస్త్రము నేర్చుకొనుటకు బ్రౌను దొర సుముఖుడు కాడట! కాని, దానివలన ఇతరులకు అర్థమగునట్లు సరియైన తావులలో ఆపి చదువగలుగుట వచ్చునని విని, దానిని నేర్చుకొనెనట[49]. ఇదిగాక ఛందశ్శాస్త్ర పరిజ్ఞానము ఆయనకు తెలుగు కావ్యముల సముద్ధరణమున చాల సాయపడినది.

పద్యములు చదువుటయందు కూడ తెలుగువారికిని, ఇటలీ దేశస్థులకును పోలిక కలదట! బిగ్గరగా, నొక్కి చదువుటయందు ఈ యిరువురకు పోలిక కలదట[50]! ఇన్ని పోలికలుండుటచేతనే గాబోలు తెలుగునకు తూర్పుదేశములలోని ఇటలీభాష లేక 'భారత దేశములోని ఇటలీభాష'[51] అని పేరువచ్చినది.

ఈ భాగములో లాటిన్, గ్రీక్ భాషల ఛందస్సులతో, తెలుగు ఛందస్సును పోల్చి చూపుచు తన పాండిత్యమును ప్రదర్శించినాడు. లాటిన్ గ్రీక్ భాషలతో సంబంధముగల ఏ పాశ్చాత్యుడైనను, దీనివలన తెలుగు ఛందస్సును సులభముగ నేర్చుకొనగలడు. మనకు దీనివలన పాశ్చాత్య ఛందస్సుల తత్త్వము కొంత బోధపడును. ఈ విధముగా నిది 'ఏకక్రియాద్వ్యర్థకరి'.

---

49. "I acknowledge that I was reluctant to study the art, and was persuaded to do so only because I was shewn its utility in understanding the proper stops; and in reading so as to be intelligible to others." (Ibidem. page—293.)

50. "It is the custom to read verse in a loud tone with strong intonation : and regardless of the subject : for everything is read alike. This is also the custom in Italy." (Ibidem. page—295.)

51. Telugu has been called the Italian of India."

(Ibidem. Preface; page - V.)

నిసర్గగణములను జ్ఞాపకముంచుకొనుటకై, ఆయన ప్రతిగణమునకు ఎదుట ఒక సంస్కృత శబ్దమును, ఒక లాటిన్ పదమును ఉంచి ఒక పట్టిక సిద్ధముచేసెను. ఆ పట్టికను - కుతూహలమువలన - యథాతథముగ నిచ్చుచున్నాను[52]

| Sanscrit Name and Marks | Memorial words | | | Latin Marks and Name |
|---|---|---|---|---|
| M ౦ ౦ ౦ | మంత్రాణాం | Maccenas | — — — | Molossus. |
| Y ၊ ౦ ౦ | యతిస్తే | Ymetto | ౦ — — | Bacchic. |
| R ౦ ၊ ౦ | రమయా | Reddidi | — ౦ — | Cretic. |
| S ၊ ၊ ౦ | సరసాం | Similes | ౦ ౦ — | Anapoest. |
| T ౦ ౦ ၊ | తంపశ్య | Tentare | — — ౦ | Antibacchic. |
| J ၊ ౦ ၊ | జజాప | Juvabit | ౦ — ౦ | Amphibrach. |
| B ౦ ၊ ၊ | భక్తప | Bucula | — ౦ ౦ | Dactyl. |
| N ၊ ၊ ၊ | ననుహి | Nivae | ౦ ౦ ౦ | Tribrach. |

ఇందు గణములోని మొదటి అక్షరము వచ్చునట్లును, గణలక్షణము సరిపోవునట్లుగను; సంస్కృతము లాటిన్ భాషలలోనుండి మాటలు లక్ష్యములుగ కూర్పబడినవి.

ఉత్పలమాల, చంపకమాల, శార్దూల విక్రీడితము, మత్తేభవిక్రీడితములకు లక్షణములను లక్ష్యములను చూపెను. కందపద్యమునకు లక్ష్యలక్షణ సమన్వయముచేసి చూపి, అది సంస్కృతములోని 'ఆర్య' భేదములలో నొకటి[53] యనియు, మధురమైనదనియు వ్రాసి, 'ఆర్య'కు లక్ష్యముగా, 'ఆంధ్రశబ్ద చింతామణి'లోని, "సజ్జస్థాన వేషభాషాభి మతాస్సంతో రసప్రలుబ్ధధియః" అను శ్లోక

---

52. "To facilitate recollection, I have in the following table placed opposite each Ganam a Sanscrit and a Latin word containing the requisite syllables and beginning with the letter that denotes the foot." (Ibidem page – 296.)

53. "The Canda verse is a variety of the Sanscrit Arya a very melodious metre constantly used in poems and plays; it is the metre' employed by Nannaya Bhatta in his Chintamani..." (Ibidem. page - 304.)

మును ఇచ్చెను. ఇంతేకాక, హోరేస్ (Horace) అను పాశ్చాత్య కవి రచించిన మధుర కావ్యములలో, 'ఆర్య' యొక్క భేదములలో నొకటి ఉపయోగింపబడిన దని లక్ష్యమును చూపెను[54]:

యతిప్రాసలను గురించి వ్రాయుచు ఇట్టివి ప్రాచీనాంగ్లకవుల రచనలలో కలవనియు, గోథిక్ (Gothic) భాషలలో కనబడుననియు వ్రాసెను. ఇంగ్లీషు కవులు, రచనలకు శబ్దసౌందర్యము వచ్చుటకై ఇది అచ్చటచ్చట వాడుట కల దనియు వ్రాసి, ఉదాహరణ లిచ్చెను[55]. తెలుగు 'యతి' వంటిది, స్పానిష్ భాషలో కలదని కూడ వ్రాసెను.

లయగ్రాహి, లయవిభాతి, రగడ, దండకము, తరువోజ, ఉత్సాహ, అక్కర మొదలగువాని కన్నింటికి లక్ష్యలక్షణములను చూపెను. సామాన్య ముగా, తెలుగులో లక్ష్యలక్షణము లిచ్చుటతో తృప్తిపడక, పాశ్చాత్య భాషలలో వీటికి పోలికలుగల ఛందములున్నచో వాటినికూడ చూపెను. బ్రౌనుదొరయొక్క రచనలోని వైశిష్ట్యమిదియే. వ్యాకరణ గ్రంథ పరిపూర్తికి ఛందోభాగము ఒకటి కూడ నుండుట సమంజసమని దీనిని వ్రాసెను.

ఇంత శ్రమపడి తన వ్యాకరణమును పాండిత్య స్ఫోరకముగ బ్రౌనుదొర రచించెను. ఈ వ్యాకరణము వచ్చినవెంటనే 'కాంబెల్' మొదలగువారి వ్యాకరణములు వెనుకబడిన వనుటలో ఆశ్చర్యమేమియులేదు. ఈ వ్యాకరణము యొక్క మొదటి ముద్రణము 1840లో జరిగినదని తెలిసికొంటిమి. దీని రెండవ ముద్రణము బ్రౌనుదొర భారతదేశమును విడిచి 1855 పోయిన తరువాత జరిగి నది. 1857 లో అచ్చయిన దీనికి 'పీఠిక' వ్రాయుచు ఈ ముద్రణము జరుగు

---

54. "It will be perceived that the Arya in one of its varieties is the harmonious rhythm used by Horace." (Ibidem. page - 305.)

55. "Such rhymes were used in Saxon and our oldest English poet Spenser says :" (FQ 1. XII. 23.)

"The blazing bringhtness of her beauty's beam" -

"Such alliteration is used in Icelandic and indeed throughout the Gothic Languages."

"Gray uses it, 'Ruin seize thee ruthless king'; and Byron, 'so darkly deeply, beautifully blue.' The yati "Asonancia is used in Spanish verse." (Ibidem. pages - 314-315).

చుండగనే, అనారోగ్యమువలన తాను భారతదేశమును వదలిపోవలసి వచ్చెననియు, అందువలన వ్యాకరణముయొక్క చివరి భాగములో కొన్ని పొరపాట్లుండవచ్చుననియు, కాని అవి విద్యార్థియొక్క 'చదువు'నకు అంతరాయము కలిగించునవి కావనియు వ్రాసెను[56].

తన వ్యాకరణము తరువాత, ముఖ్యముగా తెలుగులో బయలుదేరిన వ్యాకరణములను గూర్చి వ్రాయుచు—ఆ వ్యాకరణములు చిన్నవి, సులభములు అని చెప్పుకొన్నను; విషయ బాహుళ్యమును విడిచి సౌలభ్యమును సంపాదించినవనియు; ఆ పద్ధతి, భూగోళ శాస్త్రజ్ఞుడు, పట్టణములను, నదులను, సరిహద్దులను విడిచిపెట్టి, తన పటమునకు సౌలభ్యము సంపాదించినట్లున్నదనియు-నిశితముగ విమర్శించెను[57].

ఇంత మహత్తరమైన కృషిచేసినాడు గనుకనే, ఆర్డెన్ (A.H. Arden) తన తెలుగు వ్యాకరణముయొక్క పీఠికలో; తెలుగు చదువుకొను ప్రతి విద్యార్థియు బ్రౌనుదొరకు ప్రత్యేకముగ కృతజ్ఞుడై యుండవలెనని వ్రాసి, ఆయనయందు తనకు గల గౌరవభావమును వ్యక్తీకరించెను[58].

---

56. "Failing health having obliged me to return to England while this work was in the press, the latter pages contain some errors; but there are none which will impede the progress of the student." (Ibidem. preface; page - VI.)

57. "In the latter years some grammars of the language, chiefly written in Telugu have appeared, professing to be shorter and more simple than mine; but they obtain simplicity by sacrificing knowledge of detail, as a geographer might simplify his maps by omitting towns, rivers and boundaries of countries."

(From 'Some Account of the Literary life of C.P. Brown).

58. "The student of Telugu must ever feel specially grateful to Mr. C P. Brown by whose efforts so much has been done to bring the language into its present position, and to render it accessible to Europeans."

(A Progressive Grammar of the Telugu Language By A. H. Arden. 1873. preface; page-III).

# నిఘంటు నిర్మాణము

బ్రౌనుదొర రచనలలో ఆంధ్ర పండిత లోకమును విశేషముగ ఆకర్షించినవి ఆయన నిఘంటువులు. ఆయనకు నైఘంటికునిగ వచ్చినంత పేరు ఇంక దేనివలనను రాలేదు. ఆయన వ్రాసిన వాచకములు, వ్యాకరణము ఆంధ్ర పండితలోకముచే అంత ప్రశస్తి సంపాదింపలేదు. అవి, ఆంధ్రభాష నభ్యసింపగోరు పాశ్చాత్యుల కును, ఆంగ్లము నభ్యసింపగోరు దేశీయులకును ఉపయోగపడుటకై వ్రాసినవే గాని, ఆంధ్ర పండితుల కొరకుగాదు. పై గ్రంథములకు నిఘంటువులకు వచ్చినంత పేరు రాకుండుట కిదియే ముఖ్యకారణము.

ఈయన నిఘంటువులు పండిత పామర రంజకములు. అకారాదిగా తెలుగు నకు నిఘంటువును కూర్చుటలో ఆయన మొదటివాడు కాకపోయినను. ఆయన నిఘంటువులు నాటికి నేటికి కూడ వైశిష్ట్యమును కలిగియున్నవే. కొన్ని విష యములలో మార్గదర్శకములే. అవి వ్యావహారిక భాషావాదులకు, గ్రాంథిక భాషావాదులకును గూడ కావలసినవే. బ్రౌనుదొర నిఘంటువులకు ముందే సుప్రసిద్ధముగనున్న నిఘంటువు, 1821 లో "కాంబెల్" (Campbell) దొర ప్రచురించినది. అక్షర క్రమముగ నున్న నిఘంటువులలో ఇది ప్రథమ నిఘంటువని జయంతి రామయ్య పంతులుగారి అభిప్రాయము[1]. కాని "జెంతూ వకాబ్యులరీ" (Gentoo Vocabulary) అను పేర నిఘంటువు వంటిదొకటి విలియమ్ బ్రౌన్ 1817-1818 లో ప్రకటించెను.

బ్రౌనుదొర నిఘంటువులకన్న ముందే యున్న నిఘంటువులలో, జె.సి. మారిస్ (J. C. Morris 1798-1858) దొర కూర్చిన దొకటి. దీనిని కాలేజీ

1. తెలుగులో మొట్టమొదట నిట్టి యక్షర క్రమ నిఘంటువు కూర్చిన యాతడు ఏ. డి. కాంబెలు (Mr. A. D. Campbell) అను నాంగ్ల పండి తుడు"—జయంతి రామయ్యపంతులు (శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు; పీఠిక : పుట-2, పీఠికాపురము : 24-3-1936).

బోర్డువారు 1835-1839 సంవత్సరముల నడుమ ప్రచురించిరి. ఇది ఉత్తమ శ్రేణికి చెందినదైనను, బ్రౌనుదొర దీని నెందులకో పేర్కొనలేదు. బ్రౌనుదొరకు ముఖ్యముగా సాయపడిన నిఘంటువులు రెండట. మొదటిది "కాంబెల్ దొర" నిఘంటువు. రెండవది "విల్సన్" (Wilson) దొర ప్రకటించిన సంస్కృత నిఘంటువు. నిఘంటు నిర్మాణ విషయమున రెండవది బాగుగ తోడ్పడినదట.

బ్రౌనుదొర పేర్కొనిన తెలుగు నిఘంటువులలో ముఖ్యమైనది, మచిలీ పట్టణమునకు చెందిన మామిడి వెంకయ్య (1764-1834) గారి ఆంధ్ర దీపిక. ఇది 1806 నాటికే పూర్తి చేయబడినదట. తెలుగు కావ్యములలో ఉపయోగింపబడిన పదములు మాత్రమే ఇందుకలవనియు, వ్యావహారిక భాషజోలికి ఇది పోలేదనియు బ్రౌనుదొర వ్రాసెను[2].

ఆంధ్ర భాషార్ణవము, మరియు దానివంటివే పద్యములలో నున్న ఐదు నిఘంటువులను అకారాదిగా కూర్చి, బ్రౌనుదొర ఉపయోగించుకొనెను. కాని ఈ నిఘంటువులలోని పదజాలమునందు క్రియల కంత ప్రాముఖ్యము లేదనియు, క్రియలే ఏ భాషకైనను ప్రాణమువంటివనియు బ్రౌనుదొర అభిప్రాయముపడెను[3]. ఇవికాక, ఆంధ్రభాషా భూషణము[4], ఆంధ్రనామ సంగ్రహము[5], కర్కంబాడి

---

2. "The Dipica, ఆంధ్రదీపిక, A Dictionary of Telugu explained in Telugu written by మామిడి వెంకయ్య at Masulipatnam. It was completed in the year 1806. The Dipica gives a mere selection of the words used in Telugu poetry. The ordinary Telugu of common life is but slightly noticed." (C. P. Brown's Telugu—English Dictionary; Page VIII; 1852 Edition.) ఈ విషయమై ఇతర వివరములకు, తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము : కొత్తపల్లి వీర భద్రరావు; హైదరాబాదు ద్వితీయ ముద్రణ, 1986. పుటలు-232 నుండి 235 వరకు చూడవచ్చును.

3. "The Andhra Bhash Arnavam, a vocabulary of synonymes, in verse. This and five more similar works have been rearranged alphabetically at my desire. All the native vocabularies are deficient in verbs whereas verbs are the most delicate and peculiar parts of the language," (Ibidem; page VII)

4. "Andhra Bhasha Bhushanam ఆంధ్ర భాషాభూషణము a vocabulary of Synonymes, in verse." (Ibidem; page VII)

5. "A vocabulary written in verse." (Ibidem; page VII)

నిఘంటువు[6], ఒరంగల్లు పదజాలము[7] — ఆయనకు బాగుగా ఉపయోగించినవి. ఈ కర్కంబాడి నిఘంటువు అనేకములగు నిఘంటువుల చేరికవలన ఏర్పడినది. దీని యందు; ఆంధ్రనామ సంగ్రహము, ఆంధ్రనామశేషము, వేంకటేశ నిఘంటువు, సాంబ నిఘంటువు, విష్ణు ఆంధ్రము[8] మొదలగు వాటిలో గల పదజాలమంతయు కలదట. దీనిని బ్రౌనుదొరయే సిద్ధము చేయించెను. ఇంక ఒరంగల్లు పదజాలము (ఒరంగల్లు దేశీయ తెలుగులు) అనునది మామిడి వెంకయ్యగారి ఆంధ్ర దీపికకు పరిశిష్ట భాగము కావచ్చుననియు, దానికర్త పేరు తెలియుట లేదు గాని, వెంకయ్య గారే దానిని కూడ చేసియుండవచ్చుననియు బ్రౌనుదొర వ్రాసెను.

ఇవిగాక కన్నడ[9], తమిళ[10], వంగ[11], సంస్కృత[12] భాషల నిఘంటువులను గూడ పరీక్షించి, తనకు పనికివచ్చునంతవరకు బ్రౌనుదొర వాటినిగూడ వినియోగించుకొనెను. వృక్షశాస్త్రము మొదలగు శాస్త్రములకు సంబంధించిన పదముల అర్థములను వ్రాయుటకు, ఆయా శాస్త్రములకు సంబంధించిన ఆంగ్ల, సంస్కృత నిఘంటువులను పరిశీలించెను. ఉదాహరణముగ మనము "క్వాథ శాస్త్రము"[13]

---

6. "The కర్కంబాడి నిఘంటు an alphabetical glossary, framed at my desire : it contains all the words found in the ఆంధ్రనామసంగ్రహం, in the ఆంధ్రనామశేషం, in the వెంకటేశ నిఘంటు and in the సాంబ నిఘంటు." (Ibidem; Page X)
7. "The ఒరంగల్లు Orangallu Glossary : this is alphabetically arranged, and is a supplement to Mamidi Vencanna's Andhra Dipica : it is anonymous: and probably is the work of the same author. The only title is దేశీయ తెలుగులు that is, local words, or dialects. But it explains many expressions used in the leading poems."
(Ibidem; page XI)
8. "Vishnu Andhram, A glossary' included in the Karkambadi Nighant": (Ibidem; page XIV)
9. "Kannadi English Dictionary by Reeve. (Ibidem; page X)
10. Rottler's Dictionary, Tamil and English. (Ibidem; page XII)
11. Haughton's Bengali and English Dictionary (Ibidem; page IX)
12. శబ్దకల్పద్రుమ by Radha Kanta Deva (వంగలిపి)
(Ibidem; page XII)
13. "The క్వాథశాస్త్రం A Botanical Vocabulary in Sanscrit with Telugu synonymes". (Ibidem, page XIII)

అను వృక్షశాస్త్ర సంబంధమైన పదములుగల "పదజాలము"ను గ్రహింపవచ్చును' ఇట్టి శాస్త్రములకు సంబంధించిన పదములు, దేశీయ పండితులలో కూడ కొందరికి తెలియవని బ్రౌనుదొర వ్రాసెను.[14] నిఘంటువు సాధ్యమైనంతవరకు సంపూర్ణముగా నుండవలెనను ఆయన పట్టుదలయే ఈ కృషికి మూలము.

ఈ విధముగ వివిధ భాషల నిఘంటువుల నుండి, శాస్త్రముల నుండి, అంతకు పూర్వమున్న ఆంధ్రభాషా నిఘంటువుల నుండి పదములను కృతజ్ఞతతో గ్రహించుటయేగాక, తాను స్వయముగ మహాపండితుల సాయముతో తెలుగులోని ఉద్గ్రంథములను చదివి, వానిలోని వివిధ పదముల నన్నింటిని ఎత్తి వ్రాసికొని, తన నిఘంటు నిర్మాణమునకు సామగ్రిని కూర్చుకొనెను. ఈ సందర్భమున వ్రాయుచు, విశేషముగ పరిశ్రమ జరుగని భాషకు నిఘంటువును నిర్మించునపుడు, సులభముగ తప్పుదారి త్రొక్కుట జరుగునని వ్రాసెను.[15] ఇట, బ్రౌను దొరకు 1825 లో భారతము చదువుచున్నప్పుడు కల్గిన అనుభవమును గూర్చి తెల్పుట అప్రస్తుతము కాదు. ఆయనకు భారతము చదువుటయందు తోడ్పడిన విద్వాంసుడు, కష్టమైన పదములకు వ్యావహారికాంధ్రమందుగాని, సంస్కృతములోగాని, హిందీలోగాని అర్థము చెప్పెడివాడట[16]. ఆ పదమునకు ఆ యర్థము బ్రౌనుదొర వ్రాసికొనెడివాడు. ఆ పదమే గ్రంథమందు మరల రాగా, ఆ పండితుడు దానికి సందర్భానుసారముగా అర్థము చెప్పుచు వచ్చెడివాడట! కొంతసేపటికి, ఒకే పదమునకు పరస్పర విరోధముగల అర్థములు రాగా బ్రౌనుదొర ఆతనిని "ఏమిటి ఈ వింత?" అని ప్రశ్నించెనట! అందులకా పండితుడు, "అయ్యా, మీ రిలా నేను చెప్పినదంతా వ్రాసుకొంటూ, చివరికి నన్నిలా నిలదీసి అడుగుతే నేనేమి చేస్తాను. ఒకవేళ మీ రడిగిన మాటకు నాకు అప్పుడర్థం తెలియకపోవచ్చు. లేదా సమానార్థక పదం ఏదీ అప్పటికప్పుడు తట్టకపోవచ్చు", అన్నాడట! అప్పుడు బ్రౌనుదొర నవ్వి,

---

14. "Some Telugu words which I have copied from the glossaries marked ABA, (ఆంధ్ర భాషార్ణవము) or Kark (కర్కాటాడి) or Q (క్వాథశాస్త్రం) are unknown to learned natives." (Ibidem, page XII)

15. "He who writes a Dictionary of an unexplored language is often misled."

16. "My learned assistant gave the meaning in colloquial Telugu, or Sanscrit or Hindi."

"మరి, మీరిలా నన్ను తప్పుదారి తొక్కించడం న్యాయమా" అన్నాడట! కాని, ఈ క్రింది వాక్యము—ఆ పండితుని గురించియే బ్రౌనుదొర అన్నది—ఆయన సహృదయతకు తార్కాణము. "The pandit was a sound scholar but not accustomed to construing."

ఈ కార్యమున తనకు సాయము చేసిన పండితులను గురించి బ్రౌనుదొర "వారికి సంస్కృత వ్యాకరణము పరిచితము. కాని, వారి మాతృభాషకు సంబంధించిన ప్రశ్నలకు సమాధానము చెప్పుటకు వారికంత సంసిద్ధతలేదు", అని వ్రాసెను.[17] ఈ దురవస్థకు కారణము, "సంస్కృతంవస్తే తెలుగు వచ్చినట్లే", అను దురభిప్రాయము పండితులలో, కొందరి యందు ప్రబలి యుండుటయే! ఈ అభిప్రాయము ప్రబలుటకు ముఖ్య కారణము, తెలుగు తత్సమపదబహుళ మగుట కావచ్చును!

అనేకములగు వ్యయప్రయాసలకోర్చి, బ్రౌనుదొర తన నిఘంటువులను సిద్ధముచేసెను. ఇంగ్లీషు - తెలుగు నిఘంటువునకు సంబంధించిన ప్రణాళిక 1832 లోనే సిద్ధమయినను, అచ్చువేయుట ప్రారంభించునప్పటికి, అంతయు, మరల వ్రాయవలసి వచ్చెనట[18]. 'షేక్స్పియరు' మొదలైన ఆంగ్ల ఉద్గ్రంథములను క్షుణ్ణముగ అంతకుపూర్వమే చదివి యుండుటచే, తానా పనికి సిద్ధముగనే యుంటి నని ఆయన వ్రాసెను.[19] తనతోటి పనివారు కూడ, తనకు ఆంగ్ల సాహిత్యము నందున్న పాండిత్యమును మెచ్చుకొని, తనకు "బైబులు", "షేక్స్పియరు", "మిల్టను"లు; నోటికి వచ్చినట్లున్నదని పలికెడివారని కూడ బ్రౌనుదొర వ్రాసెను.[20] ఈ ఇంగ్లీషు—తెలుగు నిఘంటువు కూర్పుటలో ఆయన ముఖ్యో

17. "These instructors were familiar with Sanscrit Grammar, but were less ready to solve questions as to the syntax of their mother-tongue."

18. ".. Completed the rough sketch of the English - Telugu Dictionary in 1832 This seemed to be ready, yet in printing it I caused the whole to be rewritten..."

19. "I had been prepared by my previous study of Shakespeare and other English Classics."

20. "My fellow labourers the Brahmans, remarked that I seemed to have the Bible, Shakespeare, and Milton by heart."

ద్దేశము, ఆంగ్ల సాహిత్యము మనవారికి అందుబాటులోనికి రావలెననునది.[21] ఇట్టి సదుద్దేశముతో శ్రమించి, ఉద్దేశ సాఫల్యమును పొందెను.

ఈ ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు ప్రథమ ముద్రణము, ఫిబ్రవరి 1845లో ప్రారంభింపబడి మార్చి 1852లో పూర్తి[22] అయినదట! దీని ముఖపత్రము లిట్లున్నవి.[23]

[పుట I]

బ్రౌణ్య ఇంగ్లీషు నిఘంటు

ENGLISH - TELUGU

DICTIONARY.

MADRAS

Printed at the Christian Knowledge Society's Press,

Church Steet, Vepery.

1852

[పుట II]

WORKS PUBLISHED BY

MR. BROWN.[24]

---

21. "This work may render English literature accessible to all the Hindus who fill the Indian Peninsula." (తెలుగువారికి పర్యాయపదముగ 'హిందు' పదమును బ్రౌనుదొర చాల చోట్ల వాడెను).

22. "I began printing it in Feb, 1845 and it was completed and published (one Volume, Royal Octavo, in 1800 pages) in March 1852".

23. బ్రౌనుదొర ప్రచురించిన గ్రంథములను (అవి అన్ని గ్రంథాలయముల లోను లభింపవు) చాలమందికి చూచుటకు అవకాశము లేదు గనుక, ముఖ పత్రరచనయైనను, ఇట్లున్నదని తెలిసికొనుటకు వీలుగా, చూపుటయైనది.

24. పై శీర్షిక క్రింద ఒక పుస్తకముల పట్టిక ఈయబడినది. వీటిలో కొన్ని, ఆయన అప్పటికి ప్రచురించినవి, కొన్ని ప్రచురింపనున్నవి.

[పుట 1:1]

# A DICTIONARY, ENGLISH AND TELUGU

Explaining

The English Idioms And Phrases

In Telugu,

With the Pronunciation of

English Words.

Prepared by

CHARLES PHILIP BROWN

of The Madras Civil Service,

Telugu Translator To Government,

Senior Member of the College Board, Etc.

— —

MADRAS:

Printed At the Christian Knowledge Society's Press

Church Street, Vepery.

1852

ఈ నిఘంటువు బ్రౌనుదొర యొక్క తక్కిన నిఘంటువులవలెనే విశేష ప్రఖ్యాతిని ఆర్జించినది. దీని సాయముతో ఎందరో - బ్రౌనుదొర ఆశించినటుల - ఆంగ్ల భాష నభ్యసించి ఆ సాహిత్యమును చవిజూచి యుందురు. దీని ఉపయోగము కాని, విశిష్టత కాని నేటికిని తగ్గిపోలేదు. వ్యావహారిక భాష ప్రాబల్యమును పొందిన ఈ దినములలో, వ్యావహారిక భాషాపదములు విశేషముగనున్న బ్రౌనుదొర నిఘంటువులు, మన కింకను మిక్కిలి ఉపయోగకారులు, ఉపాదేయములు.

ఈ నిఘంటువు యొక్క ద్వితీయ ముద్రణము 1895 లో జరిగినది. బ్రౌనుదొర కీర్తిశేషుడైన (1884) తరువాత పదునొకండవ సంవత్సరమున ముద్రింపబడిన దీనిని, ప్రెసిడెన్సీ కాలేజీలో ఇంగ్లీషునకు అసిస్టెంటు ప్రొఫెసరయిన ఎమ్. వెంకటరత్నం, బి ఏ., గారు సంస్కరించి, విపులీకరించిరి. దీనియందు "బ్రౌనుదొర సాహిత్య జీవితము" (Literary Life) ముద్రింపబడినది. ఈ వ్యాసమును

మిత్రుల ప్రోత్సాహమువలన, తాను ఇండియాను విడిచి (1855 లో) పోవుటకు ముందు, బ్రౌనుదొరయే వ్రాసెనట! కాని, దీనిని ప్రచారమునకై అచ్చువేయ లేదు. గనుక, ఈ వ్యాసములోని విషయములు బహిరంగ పరుపక "కాలేజీ బోర్డు" వారును జాగరూకత వహించిరి.[25] ఆయన చనిపోయిన తరువాత అచ్చు వేసిన, ఈ నిఘంటువు ద్వితీయ ముద్రణమున, దీనిని కూడ ప్రచురించిరి.

తెలుగు — ఇంగ్లీషు నిఘంటువు కూడ, దాని తోబుట్టువగు ఇంగ్లీషు — తెలుగు నిఘంటువుతో సమానమైన ప్రాముఖ్యముగలదే. దీనిని బ్రౌనుదొర తాను తెలుగు నేర్చుకొనుచున్న దినములలో తనకు సాయముగనుండుటకు సిద్ధము చేసి కొనెనట[26]. దీనిని అచ్చువేయవలెనను సూచన 1844వ సంవత్సర ప్రారంభమునందే, వచ్చెనట! ఆ సంవత్సరము మధ్యభాగమున అచ్చుపని ప్రారంభింపబడెను. ఎన్నో మార్పులు, దిద్దుబాట్లు కూడ చేయవలసి వచ్చెనట! నూటికంటె ఎక్కువ మంది తెలుగు గ్రంథకర్తలిందు ఉదాహరింపబడిరి. ప్రతి ఉదాహరణమును పరిశీలించి, నిర్ణీత స్థానములో దానినాయనుంచెను[27], బ్రౌనుదొర వ్రాయసగాండ్రనుపెట్టి, తన పర్యవేక్షణముక్రింద పనినంతవూర్తిచేసెను. ఉదాహరించిన భాగము లేయేగ్రంథము లందలివియో సరిగా పరీక్షించి, నిఘంటువున నిలిపెను. నిరాధారములగునవేవియు

---

25. "On the eve of leaving India, their late learned colleague was induced by his friends to compile some details of his own literary life. But as this narrative was not Printed for publication, the Board do not deem it proper to make free with its contents"- D F. Carmichael, Secretary, Board of Examiners' office, March 23rd, 1858. (Preface to a Catalogue Raisonnee of Oriental Manuscripts in The Library of The College, 1857; page XXIII)
ఈ సాహిత్య జీవిత చరిత్రకు సంబంధించిన ఇతర వివరములు, ఈ పుస్తకము (సి.పి. బ్రౌన్)లోనే పుట-119లో కలవు.

26. "The present Dictionary was written to assist myself in learning the Telugu Language." (Telugu - English Dictionary, 1852; page IV.)

27. "In the beginning of 1844 I received a proposal to print my Telugu and English Dictionary. The printing commenced in the middle of the year but I soon found that the work required revision and correction. More than one hundred Telugu authors were quoted, every quotation was to be verified, transcribed and inserted."

నందులేవు. ఇట్టి ఋజుత్వము, నిష్కర్ష లేనిచో పరిశోధకుని పనికి గౌరవముగాని, ఆయన కృషివలన మిగిలిన పరిశోధకులకు లాభముగాని ఉండదు. అందుచేతనే ఉత్తమ పరిశోధకుడగు బ్రౌనుదొర తన వ్రాతలకు ఋజువులను చూపించుచు వచ్చెను[28]. నిఘంటువులో పేజీ ఒక్కొంటికి పది మొదలు ఇరువదివరకు తెలుగు కవుల రచనల నుండి యుదాహరణములు కలవనియు, వాటి నన్నింటిని తానే స్వయముగ గ్రహించితిననియు, తన యొద్దనున్న పండితులు వాటిని అచ్చునకు సిద్ధము చేసిరనియు ఆయన వ్రాసెను[29], దీనిని బట్టియే, ఆయనకు ఆంధ్రభాషలో గల పాండిత్యము, ఆంధ్రసాహిత్యముతో గల పరిచయము స్వయంవ్యక్తమగుచున్నది గదా! ఈ నిఘంటువు ముఖపత్రమునకును, ఇంగ్లీషు — తెలుగు నిఘంటువున కున్న ముఖపత్రమునకును భేదమంతగా లేదు[30].

ఈ రెండు నిఘంటువులును జోడుగా పెరిగినవి. రెండును ఇంచుమించుగ ఒకేసారి అచ్చొత్తింపబడినవి. ఒక నిఘంటువునకై ఎత్తి వ్రాసికొనినవి. కొన్ని ఉదాహరణలు, రెండవదానికిని ఉపయోగించెడివట! ఈ విధముగా రెండింటిని సమకాలీనముగ బ్రౌనుదొర పెంచుచువచ్చెను[31]. వ్రాయసగాండ్రను పెట్టి, కంపోజిటర్లు కూర్చగలిగినంత వేగముగను తాను వారికి పని చెప్పుచుండెడి వాడట[32].

---

28. "In this, as in my Grammar I have endeavoured to adduce proofs of every statement."

29. There are from ten to twenty quotations from Telugu authors, in each page. This part of the work was executed by my own pen; my learned and laborieus assitants transcribed them for the press, but seldom supplied one from their own reading."

30. A Dictionary, Telugu and English, explaining The Colloquial Style Used in Business, And the Poetical Dialect, with Explanation in English And in Telugu, 1852. ఇది కాక మిగిలిన భాగమంతయు రెండింటికిని సమానమే.

31. "Some quotations selected for one Dictionary will also fit for the other, and whenever I met with suitable phrases I noted them in each, thus building up both at tne same time."

32. "I employed Brahman copyists, and supplied work as fast as the compositors could set it up."

తెలుగు ఇంగ్లీషు నిఘంటువులో బ్రౌనుదొర చేసిన ముఖ్యమైన మార్పు-హల్లులతో ప్రారంభించు పదముల యొక్క స్థానమునకు సంబంధించినది. నేడు మనకున్న అకారాది నిఘంటువులలో 'కచటతప' అను వర్గక్రమమున పదము లన్నియు నుండుటయు, ప్రతివర్గమునకు అక్షరక్రమము తప్పకుండుటయు, ప్రతి అక్షరమునకును గుణితము అచ్చుల క్రమమున వచ్చుచుండుటయు, మనకు తెలిసినది. బ్రౌనుదొర నిఘంటువున ఈ క్రమము పాటింపబడలేదు. ఒక వర్గములోని వివిధాక్షరములతో-అనునాసి కాక్షరమును విడిచి – ప్రారంభించు పదజాలము నంతయు, అకారాది అచ్చుల క్రమమున ఒకచోటనే ఇచ్చుట; బ్రౌనుదొర చేసిన ముఖ్యమైన మార్పు[33]. ఇట్లు చేయుటవలన, నిఘంటువు నుపయోగించుట సులభమగునని బ్రౌనుదొర ఊహ, 'య ర ల వ' లు వేరువేరుగ కలవు. మరల 'శ, ష, స' లను కలిపినాడు. ఈ ఏర్పాటువలన – కోత, గోత్రము, ఘోణి - మొదలగు పదములు ఒకదాని తరువాత ఒకటి ఒకే శీర్షిక (కో, ఖో గో, ఘో) క్రింద వచ్చినవి[34]. అటులనే – జిగి, చిగురు, జిఘాంసుడు – మొదలగు పదములును[35] శాతము, షాడబము, సాతాని[36] మొదలగు పదములును అటులనే[37].

ఈ విషయమును పురస్కరించుకొని, బ్రౌనుదొర తన తెలుగు – ఇంగ్లీషు నిఘంటువు 'ఉపోద్ఘాతము'న సుదీర్ఘముగ వ్రాసినదానికి క్రింది అనువాదము: "ముప్పది* సంవత్సరముల క్రిందట నేను తెలుగు కావ్యములు చదువుచున్నప్పుడు, 'గ'తో ప్రారంభించిన పదములు (గోరువంటివి) చాలసారులు రాగా, మా గురువుగారు నన్ను 'ఆంధ్రదీపిక'లో ఆ పదమునకై 'కోరు' క్రింద చూడుమని చెప్పుచుండిరి. 'జ' మొదటి అక్షరముగ (జెలంగు) కల పదములు 'చ' క్రింద కనబడుచుండెడివి. 'ద' తో ప్రారంభించు పదములు, వాటి చిత్తమువచ్చినట్లు,

---

33. కఖగఘ, కాఖాగాఘా, కిఖిగిఘి – మొదలగునవి.

34. Telugu - English Dictionary, 1852 - page; 287.

35. Telugu - English Dictionary, 1852 - page; 330.

36. Telugu - English Dictionary, 1852 - page; 1050.

37. "I have made an improved arrangement of the consecutive initial consonants ; uniting such as in Telugu are commutable." (Ibidem, page IV)

* "This difficulty may eventually be removed by classing the commutable letters together as 'U' and 'V' have long been mingled in the English Dictionary" (ఆంధ్ర గీర్వాణచ్ఛందము సి. పి. బ్రౌన్ – 1827. "On Orthography, Spelling, etc.")

'త'తో ప్రారంభించెడివి, దోవ, తోవ[38]. రెండును 'రోడ్డు' అను పదములే. 'పులి' అనగా పులి గదా! కాని సమాసములలో 'ప' అను అక్షరము 'బ'గా మారి 'బెబ్బులి' అను రూపము వచ్చుచున్నది. 'శ'తో ప్రారంభించు కొన్ని పదములు 'స'తో కూడ వ్రాయవచ్చును గదా. ఈ సంశయమునుండి నన్ను పెద్దలు కూడ విముక్తుని చేయలేదు. నేను వారినడిగినప్పుడు. "రెండు విధములుగను వ్రాయవచ్చును" అనుచుండిరి. చివరకు, నిఘంటువు రమారమి సగమువరకు పూర్తి అయిన తరువాత, మార్పును అంగీకరించు ప్రథమాక్షరములు గల పదములను కలిపివేసి, మరల నిఘంటువును వ్రాసి, ఈ సంశయమును తొలగించివేసితిని."

"ఇక్కడ ఒక ఉదాహరణను ఇచ్చెదను. 'దీపిక'లో 'తువాళించు'[39] అను క్రియ ఒకటి కలదు. కొందరు కవులు దీనిని 'త'తో ప్రారంభింపగా, కొందరు 'ధ'తో ప్రారంభించిరి. కనుక, ఈ క్రియ నిఘంటువులో మూడుచోట్ల కనబడవలసి వచ్చును. కాని, ప్రథమాక్షరములను కలుపుటవలన, క్రమలేకుండ అవి కనబడును. ముందుముందు, వీనిని విడదీసి చూపవలెనని ఎవరైనను అనుకొనినను అది అంత కష్టముకాదు. కాని, అట్లు చేయుటవలన భాషను నేర్చుకొను ప్రారంభకులకు కష్టమగును. తెలుగులో కొంత కృషిచేసినవారి కందరకును, నేను చేసిన మార్పులోని విలువ తెలియగలదు. పూర్వపద్ధతిలో పండితులకే సంశయము కలిగెడిది. ఇప్పుడు మార్గము సుగమమైనది"[40].

ఈ పద్ధతి దేశీయులైన పండితుల ఆదరాభిమానములను అంత చూరగొన్నటులలేదు. బ్రౌనుదొర కాలముననే పండితులందరును ఈ పద్ధతిని ఆదరించినట్లులేదని, ఆయన వ్రాసిన క్రింది వాక్యములే తెలియచేయుచున్నవి. "ఈ నిఘంటువువిషయమున నాకు నా పండితుల సమ్మతి ఉన్నది. కాని కొందరు పండితులు (శాస్త్రులు) నా వర్ణ క్రమ పద్ధతిని అంగీకరింపలేదు"[41].

---

38. తోవ, త్రోవ, దోవ N.S. Way Road, Way or Means.
(Ibidem, page 465)

39. తువాళించుట, ధువాళించుట V.N. To leap, To dance.
(Ibidem, page 462)

40. Ibidem; Preface; pase IV.

41. "...In composing this work I have had the approbation of many learned assistants. But some (Sastris) scholars have disapproved the spelling here exhibited." (Ibidem; page V)

బ్రౌనుదొర తరువాత, నైఘంటికులు ఈ పద్ధతిని అంతగా ఆదరింపలేదు. నిఘంటువులో ఆయన వ్యావహారిక పదములను - ఉచ్చరించెడి రీతిగానే - చేర్చుట, పండితులకు నచ్చినట్లులేదు. తరువాతి నైఘంటికులలో బ్రౌనుదొరను తీవ్రముగ విమర్శించినవాడు శ్రీ శంకరనారాయణ. ఆతడు తన ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులో,[42] "on the contrasts between English and the Indian vernaculars and a common Alphabet for the different languages of India" అను శీర్షిక క్రింద వ్రాయుచు; బ్రౌనుదొరకు తెలుగు సంధి సూత్రములు బాగుగా తెలియవు అనుట మొదలుకొని, అతడు వ్యావహారిక పదములకు తన నిఘంటువులో స్థానమిచ్చి, తెలుగును పాడు చేసినాడన్నంతవరకు; విమర్శించెను. ఇటుల విమర్శించినను, బ్రౌనుదొర నిఘంటువులను ఉపయోగించుకొను విషయములో శ్రీ శంకరనారాయణ వెనుకాడినట్లు లేదు. ఈ తీవ్ర విమర్శకు కారణము. బ్రౌనుదొర వ్యావహారిక భాషకు తన నిఘంటువున అతి ప్రముఖ స్థానమిచ్చుటయే కావచ్చును. శ్రీ శంకరనారాయణకు కోపకారణమైన వ్యావహారిక పదములలో కొన్ని క్రింద నిచ్చుచున్నాను - అరవయ్యో (Sixtieth) ఆంధ్రుణ్ని, వొప్పుకోవడము, పధ్నాలుగు, అదీ నేను.

ఏది ఎట్లున్నను, తన నిఘంటువు పండిత పామర జనోపయోగము కలదిగా నుండవలెనని ఆయనాశించెను గాని వేరుకాదు. కేవలము ఛాందసులైన పండితుల మెప్పు పొందవలెనని ఆయనఎన్నడును కృషిచేయడు. ఆయన విదేశస్థుడగుట ఇట్టి సందర్భములలో ఆయనకు ఉపకారకమయ్యెను దేశీయ పండితులలో కొందరను పట్టి బంధించి బాధించు సంప్రదాయ శృంఖలములు ఆయననంటలేదు. కనుకనే ఆయన పామరులను, వారి భాషను ఈసడించలేదు. విశాలదృష్టిగల విజ్ఞాని గనుక, పండితుల ప్రతిభను గుర్తించి, వారినెన్నడును తూలనాడలేదు. ఈ తటస్థదృష్టి,

---

42. An English-Telugu Dictionary By P. Sankaranarayana Published by V. Ramaswamy Sastrulu & Sons. 1928. ఈ ముద్రణమునకు డాక్టరు. జి.వి. సీతాపతిగారు సంపాదకులు. సంపాదకులు Preface లో, "This edition of Sankaranarayana's English-Telugu Dictionary is the first edition published after the lamented death of the author...." అని వ్రాసిరి. దీనియందు; శ్రీ శంకరనారాయణ మూలగ్రంథమునుండి, పై శీర్షికగల వ్యాసమును తీసి పునర్ముద్రించిరి.

అతనికి కలుగుటకును; దానిని నిలుపుకొనగలుగుటకును, అతడు స్వదేశస్థుడగుట మిక్కిలి అక్కరకు వచ్చినది.

వీలున్న చోటులందెల్ల అతడు ప్రజల భాషకు ప్రాముఖ్యమిచ్చుచునే యుండెను. నిజమైన విద్వాంసులు, సాహిత్య ప్రియులు, తన ఉద్యమములో బాసటగా తనకు నిల్చిరని అతడే వ్రాసెను. సాధారణముగా పద్య కావ్యములలోను, వ్యవహారమునందును ఉపయోగింపబడు పదములు కాక, మారుమూల పదములను వాడుచు, అందులకు గర్వించుచు విఱ్ఱవీగు విద్వాంసుల నాతడు గౌరవింపలేదు.[43] వానివలన నుపయోగములేదని అత డెరుంగును.

తన నిఘంటువులు సాధ్యమైనంతవరకు పూర్ణముగ జీవద్భాషకు పరిపూర్ణ నిఘంటువు అనునది ఉండదని అతనికి తెలియును) నుండుటకు చేయవలసిన కృషినంతను బ్రౌనుదొర చేసెను. కొన్ని కొన్ని పదములకు అర్థవివరణ పండితులచే చేయించియు, వారు దూరస్థులైనచో ఉత్తరముల ద్వారా సమాధానములు తెప్పించుకొనియు, వారి నిర్ణయములను సంపాదించి తన నిఘంటువునందు కూర్చుకొనెను ఈ సందర్భమున ఒకటి, రెండు ఉదాహరణలను పరిశీలింపవచ్చును.

ఆ రోజులలో మదరాసులో సుప్రసిద్ధులగు ఆంధ్రులలో ముఖ్యుడు ఏనుగుల వీరస్వామయ్యగారు (1780 ప్రాంతమున జననము. 3-10-1836 న మృతి) ఈతడు చెన్నపట్టణములో, ఇప్పటి హైకోర్టుకు పూర్వమున్న సుప్రీమ్‌కోర్టులో తెలుగు, అరవము, ఇంగ్లీషు భాషలలో "దుబాసి". బ్రౌనుదొరకు స్నేహితుడు. ఈతడు 1830-1831 సంవత్సరాల నడుమ (18-5-1830 నుండి 3-9-1831 వరకు) కాశీయాత్ర చేసెను. ఆ చరిత్ర చక్కని వ్యావహారిక భాషలో లేఖలరూపమున తన మిత్రుడగు శ్రీ కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లకు వ్రాసెను. ఇది "కాశీయాత్ర చరిత్ర" అను పేర ఇప్పటికి మూడుసార్లు

---

43. "Instead of that found in poems and used in ordinary life they (Sastris) wish us to practice style : which is admired because conceited and far from clear. Such refinements are disregarded by men of real learning, who are therefore considered vulgar by some who are inferior in sound scholarship."

(Preface : page V—Telugu-English Dictionary 1852.)

ముద్రింపబడినది.[44] ఈ విధముగా గ్రంథకర్తగా కూడ పేరుపొందిన "పీరా ప్వామయ్యగారిని, బ్రౌనుదొర తన తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులో ఇంద్రాణి, పల వర మొదలగు పదముల అర్థ వివరమునకు ప్రమాణముగ గ్రహించెను.

"ఇంద్రాణి - Name of the wife of Indra; A sort of bracelet, Orangallu Glossary; 'Dowager' a Bramin widow, Enugula, 28th July 1830"[45].

"పలవర - The name of a certain tree much cultivated in the neighbourhood of the Hyderabad for its fruit. పలవరి ఆకులు its leaves, are used to manure land. See description in the Kasi Yatra, date 7th September, 1830.[46]

విక్రమార్కుని కథలు (1819) పంచతంత్రము (1834) తెలుగు వ్యాకరణము (1836) మొదలగు గ్రంథములను వ్రాసిన, "చెన్నపట్టణ పాఠశాలలో ఆంధ్రభాషకు మొదటి యుపాధ్యాయుఁడైన"[47] రావిపాటి గురుమూర్తి శాస్త్రి గారు (1770-1836) బ్రౌనుదొరకు గురుతుల్యుడు. అతడు బ్రౌనుదొరకు కొన్ని కఠిన పదముల అర్థ వివరణము చేయుచుండి దూరమున నున్నచో వివరణము జాబుమూలముగ కూడ పంపుచున్నట్లు తెలియజేయు లేఖ నొకదానిని, ఉదాహరణగా ఇచ్చుచున్నాను.

(1827 నవంబరు 22 తేదీని రావిపాటి గురుమూర్తి శాస్త్రి గారు బ్రౌను దొరకు వ్రాసిన లేఖకు నకలు)[48].

---

44. కాశీయాత్ర చరిత్ర. ప్రథమ ముద్రణము 1838లో శ్రీనివాసపిళ్ళగారి బాధ్యతను జరిగినది. ద్వితీయ ముద్రణము 1869 లో 'గవర్నమెంటు వారి ఉత్తరువు'చే జరిగినది. తృతీయ ముద్రణము 1941లో జరిగెను. తృతీయ ముద్రణ భారమును శ్రీ దిగవల్లి వేంకట శివరావుగారు వహించిరి.
45. Telugu-English Dictionary; page 80.
46. Telugu-English Dictionary; page 564.
47. రావిపాటి గురుమూర్తి శాస్త్రి 'తెలుగు వ్యాకరణము' ప్రథమ ముద్రణము (1836) పీఠికలోని వాక్యము. ఈ వ్యాకరణము A. D. Campbell దొరకు అంకితమియబడినది.
48. రావిపాటి గురుమూర్తి శాస్త్రి 'తెలుఁగు వ్యాకరణము'నకు 1951వ సంవత్సరములో ముద్రణము పీఠికలో ఈ లేఖ ముద్రింపబడినది.

"మహారాజ రాజశ్రీ ఛా. పి. బ్రౌనుదొరవారి సముఖానకు—ఆశ్రితుఁడు రావిపాటి గురుమూర్తి శాస్త్రి అనేకములైన సలాములుచేసి వ్రాసుకొన్న విజ్ఞాపన పత్రిక—

తమరు అలవోక—డాబాలు అనే శబ్దములకు అర్థము వ్రాసి పంపించుమని వ్రాయించినారు. అలవోక శబ్దమునకు స్వేచ్ఛ - అనిచ్ఛ - అప్రయత్నము - అశ్రమము - కారణము - అని నానా అర్థములు వున్నవి. ఆయా స్థలములకు తగినట్లుగా చెప్పుకోవలసినది.

డాబాలు అనేది డాబా అనేదానికి బహువచనాంతము. డాబా అనగా వెండితోగాని బంగారుతోగాని చేసిన మొలత్రాడుయొక్క బిళ్ళ. ఉత్తరదేశములో బంగారుతోగాని వెండితోగాని చేసిన మొలత్రాడు నాలుగైదు వరుసలుగా చుట్టి అతికించి బిళ్ళలు వేసి మొలను ధరించడము కద్దు. అటువంటి త్రాడు డాబా మొలత్రాడు అని చెప్పబడుచున్నది.

కాలేజీవారు కోరిన 500 రూపాయల పుస్తకముల వైనం నాకు యెంత మాత్రమున్నూ తెలియదు. చిత్తగించవలెను. ఇదిగాక తమరు హంసవింశతిలోని కొన్ని పద్యాలకు శబ్దార్థమున్నూ తాత్పర్యమున్నూ వ్రాసి పంపించుమని వ్రాయించినారు. తోచినమట్టుకు వ్రాసి యిందులో బిడాయించి సముఖానకు పంపించినాను. చిత్తగించవలెను. నేను నడుచుకోగలందులకు ఆజ్ఞాపత్రిక దయ చేయించవలెను. ఇదె అనేకములైన విజ్ఞాపనకులు.

చెన్నపట్నం రా. గురుమూర్తి శాస్త్రి.
1827 నవంబరు 22 తేది.

ఈ విధముగ లేఖల మూలమున తనకు కావలసిన శబ్దములకు అర్థవివరణము తెప్పించుకొనియు, విద్వాంసులైన తన మిత్రుల గ్రంథములనుండి ప్రయోగములను గ్రహించియు, బ్రౌనుదొర తన నిఘంటువున కొక వైశాల్యమును కల్పించుకొనెను. సమకాలికులగు పండితుల ప్రయోగములను గౌరవించి, వానికి తన నిఘంటువున స్థానమిచ్చి; సమకాలమువారి రచనలను గౌరవించుటలో దోషములేదను సంప్రదాయము నొకదానిని నెలకొల్పెను.

1855లో తాను మనదేశమునువిడిచి ఇంగ్లండు వెడలిపోయినను, బ్రౌనుదొర ఈ రెండు నిఘంటువులను మఱచిపోలేదు. తనకు ఆరోగ్యము సరిగలేకున్నను,

వయస్సు మళ్ళినను తన కృషిని మానలేదు. వీలుచిక్కినప్పుడెల్ల, వానిని సవరించుచునే యుండెను. క్రొత్త క్రొత్త పదములను చేర్చుచునే యుండెను. జీవద్భాషకు శాశ్వతమైన నిఘంటు వనునది ఉండజాలదనియు, భాషతోబాటు నిఘంటువును, వ్యాకరణమును మార్పులను పొందుచుండవలెను పరమసత్యము ఆతనికి తెలియనిదికాదు. లండనులో తనకు తీరిక దొరికినప్పుడెల్ల తన నిఘంటువులకును, వ్యాకరణమునకును అతడు చేర్పులు, మార్పులు చేయుచునే యుండెనట. దీని వలన అవి మొదటికంటె రెట్టింపు పెరిగినవని ఆయనయే వ్రాసెను.[49]

బ్రౌనుదొరకు, నిఘంటువులకు క్రొత్త పదములను అందిచ్చుటలో ఒక ఫ్రెంచి-తెలుగు నిఘంటువు, మిక్కిలి ఉపయోగించెనట. దాని నాతడు 1855లో ఇంగ్లండు పోవువరకు పరిశీలించుటయే జరుగలేదట! 1700 ప్రాంతమున మన దేశమున కృషిచేసిన మిషనరీలు తమిళ-ఫ్రెంచి; తెలుగు-ఫ్రెంచి నిఘంటువులను కూర్చిరట. ఆ నిఘంటువులలో తెలుగు-ఫ్రెంచి నిఘంటువునకు Dictionaire Telongou ou Badaga అని పేరట. దీనిలో వ్యావహారిక భాషాపదములే విశేషముగ కలవని బ్రౌనుదొర వ్రాసెను ఈ నిఘంటువును సిద్ధపరచిన మిషనరీలు తమ పేరులను ఇయ్యలేదట, దీనినుండి బ్రౌనుదొర వేయివరకు పదబంధములను గ్రహించెనట.[50]

ఇంగ్లీషు - తెలుగు; తెలుగు — ఇంగ్లీషు నిఘంటువులను కూర్చుటలో బ్రౌనుదొర మహా ప్రతిభను చూపుటయేగాక; దూరదృష్టిని, హృదయ వైశాల్యమునుగూడ ప్రకటించెను. తన రచనలు, "ముఖ్యముగ తెలుగు నేర్చుకొనువారికి" ఉపయోగపడవలెనను ఉద్దేశముతో వ్రాసినను; వానికి విశేషవ్యాప్తి, తెలుగు వారిలోకూడ వచ్చుటకు ముఖ్యకారణము వాటి పాండిత్య ప్రౌఢిమ.

---

49. "I resumed Telugu reading, merely carrying on the work then I happened to be in London and at leisure. I daily made additions in the Dictionaries, and the Grammar, which are now more than doubled."

50. The French Missionaries who laboured about A. D. 1700 wrote a French - Tamil Dictionary and another lexicon Telugu and French...The authors have not given their names ; I observe that they were indefatigable in recording Colloquial dialect alone. I never saw this work until I returned to England in 1855. It supplied more than a thousand phrases".

దేశభాషలలో కృషిచేయు విదేశస్థులు, ఆయా భాషల సాహిత్య సంస్కృతులను అర్థముచేసికొని కృషిచేయవలెనేగాని, ఆ భాషల ప్రకృతులనే మార్చవలెనని కృషి చేయుట కష్టమనికూడ అతడు గ్రహించినాడు. ఏ భాషనైనను మార్చగల్గిన వారు, నూతన పదజాలమును సృష్టించగలవారు ఆ భాషా భాషీయులైన ప్రజలే గాని అన్యులు కారను చరిత్ర సత్యమును బ్రౌనుదొర ఎన్నడును మరువలేదు. తెలుగులో తానెంత కృషిచేసినను, ఎంత పాండిత్యమును సంపాదించినను, ఎన్ని గ్రంథములు రచించినను; ఈ భాష విషయమున "తుదిమాట" తెలుగు ప్రజలదే అను చరిత్రసత్యమును గుర్తించియే బ్రౌనుదొర తన కృషిని చేసెను. తన కృషి ఫలించుటకై, అతడనేకుల సలహాలను స్వీకరించెను పండితుల భాషను పామరుల భాషను సమానముగనే గౌరవించి ఆదరించెను. అహంకారమును విడిచి ప్రజల యొద్దనుండి వారి అభిప్రాయములను గ్రహించి వానిని మన్నించెను. తన నిఘంటువులలో, తెలుగు ప్రజలకు సులభముగా అర్థముకాని నూతన పదములను - అనావశ్యకమైనప్పుడు, కేవల పాండిత్య ప్రదర్శనకై - సృష్టింపలేదు తన 'ఎల్లలను' తాను గుర్తించి కృషిచేసినాడు గనుకనే బ్రౌనుదొర శిష్టులలో విశిష్టుడు[51].

నిఘంటువులో ఆంగ్లము నభ్యసింపగోరు తెలుగువారికి వీలగునట్లు, మార్పుల నెన్నింటినో చేసెను. కొన్ని కొన్ని ఇంగ్లీషు పదములకు తెలుగులో అర్థమును వ్రాయుచు; అర్థము బాగుగా అగుటకు, తెలుగువారికి బాగుగా తెలిసెడి, వారి సాహిత్యమునుండియే ఉదాహరణలిచ్చి, నిఘంటువు విశేషముగ నుపయోగకారి యగునట్లు చేసెను [52] చేసిన కృషికలన ఎంత ఎక్కువమంది ఉపయోగ

---

51. "...But I have avoided all fabricated words and meanings: I have never admitted a new Telugu phrase without duly warning the reader. To coin a new phrase is easy : but no foreigner has the power to give it currency. I am not one of those who fancy that we can alter or improve the languages used in India."

(English - Telugu Dictionary - Preface; Page - 5)

52. "Writing particularly to assist Hindus, I have given some minute explanations which Englishmen may deem superfluous. But to the Hindu they are advantageous. Elsewhere (as under the word Humour) I have alluded to such Telugu authors and phrases as seemed useful."

(English - Telugu Dictionary - Preface : Page - 5).

మును పొందునురు, అని ఆలోచించి బ్రౌనుదొర గ్రంథములను రచించెనుగాని, స్వీయపాండిత్య ప్రకటనకై కాదు. ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు పీఠికను మనము జాగరూకతతో పరిశీలించిన యెడల, బ్రౌనుదొరకు తెలుగుభాషలో ఎంతటి నిశిత మైన పాండిత్యము కలదో స్వయం వ్యక్తమగును. ఆంగ్ల భాషా సంపర్కమువలన తెలుగు భాష మారుచున్నదనియు, ఈ మార్పు సహజమేయనియు; అంతకు పూర్వము ముస్లిము ప్రభుత్వ కాలమునగూడ తెలుగు భాష, పాలకుల భాషను బట్టి మార్పులను జెందినదనియు వ్రాసి తన చరిత్ర దృష్టిని చూపెను. ఈ ఆంగ్ల భాషా సంపర్కమువలన ఎన్నియో పదములు తెలుగులోనికి వచ్చి చేరుచున్న వనియు, పండితులు ఆంగ్ల పదములను ఒల్లక, తత్సమ పదములను సృష్టించి వాడుచున్నను, ప్రజలు మాత్రము ఆంగ్ల పదములనే ఉపయోగించుచున్నా రనియు బ్రౌనుదొర వ్రాసెను.[53] దీనినిబట్టి, బ్రౌనుదొర నాటికి, వ్యావహారి కాంధ్రమందు ఆంగ్ల పదములు బాగుగ స్థిరపడినవనెంచవచ్చును.

"ఆంగ్ల భాషాపఠనము హిందువుల మనోవికాసమునకు మార్గము కాగ లదు" అని వ్రాసిన బ్రౌనుదొర, తన కృషికి గల చరిత్రలోని స్థానమును పూర్ణ ముగ గ్రహించినాడనియే చెప్పవలెను. తన కృషి సార్థకమగునుగాని వ్యర్థము కాదని గ్రహింపగలిగిన దూరదృష్టి అతనిది.

బ్రౌనుదొర యొక్క నిఘంటువులను ఎవరెట్లు విమర్శించినను, అతని నిష్కాపట్యమును, సత్యనిష్ఠను శంకించువారుండరు. ఒక యుగసంధిలో అతడు కృషిచేసి, దాని ఫలితముగ ఒక సమన్వయ ప్రధానమైన దృక్పథమును పండిత పామరులలో ప్రచారమునకు తెచ్చెను. తరువాత నైఘంటికులు-అంగీకరించినను, అంగీకరింపకున్నను - బ్రౌనుదొరకు, అతని నిఘంటువులకు ఎంతయో, ఋణపడి

---

53. "Under the Musulman rule, Telugu, Kannadi and Tamil were filled with Arabic words. At present these are retained and many English expressions are added......I am aware that the Hindus prefer using the English word without any translation. They have lately fabricated a few words from Sanskrit. Thus they speak of a President as Agrasanadhipati, and of a Secretary as Caryadarsi. At present the Telugu used in conversation and business is becoming more thickly sprinkled with English words." (Ibidem, Preface. Page - 5.)

యున్నారు.[54] కాని మనవారికి ఋణగ్రస్తులగుట తెలిసినట్లు, కృతజ్ఞతను తెలియ జేయుట అంతగా తెలియదుగనుక, తరువాత నైఘంటికులలో అనేకులు బ్రౌను దొరను "ఉపయోగించుకొని", మాటాడక మిన్నకుండిరి. ఏది ఎట్లయినను బ్రౌణ్య నిఘంటువుల[55] తరువాత బయలుదేరిన నిఘంటువులలో, బ్రౌణ్యము నుపయోగించుకొననిది[56] లేదని చెప్పిన సత్యదూరము కాదు.

జగత్ప్రసిద్ధములైన ఈ రెండు నిఘంటువుల తరువాత చెప్పుకొనవలసిన నిఘంటువుల నింకను కొన్నింటిని బ్రౌనుదొర కూర్చెను. కృషి విషయమునను, పాండిత్య విషయమునను పైవాని కేమాత్రమును ఇవి తీసిపోవు. వీనిలో 'మిశ్ర భాషా నిఘంటువు' ఒకటి బ్రౌనుదొర ప్రతిభకు తార్కాణముగ నున్నది. ఇట్టి నిఘంటువు నొకదానిని కూర్చవలెనను భావము కలుగుటలోనే అతని వైశిష్ట్య మును, భావమును క్రియగా ప్రవర్తింపజేయుటలోనే అతని ప్రతిభా ప్రాగల్భ్య మును కానవచ్చును. దీనిలో తెనుగు, పర్షియను, ఇంగ్లీషు లిపులు మూడును వాడబడినవి; తెనుగు లిపిలో పదము, దానికి పర్షియను లిపిలో వ్రాత ఆంగ్ల లిపిలో పర్షియను ఉచ్చారణ, ఇంగ్లీషులో అర్థము-ఇవిగాక తెలుగులో ఆ పదము నకు అర్థవివరణము. "తెలుగు భాషనుండి కాలక్రమమున ఈ అన్యభాషా పద ములు తొలగించుటకు వీలుగా, ప్రతి పదమునకును పర్యాయపదముగ తెలుగు

---

54. "శబ్దరత్నాకరమునకు బ్రౌణ్య నిఘంటువే ఆధారము" - కళాప్రపూర్ణ శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు (శ్రీ సూర్యరాయాంధ్ర నిఘం టువు - విమర్శనము - 12-8-1939) ఈ వ్యాసము శ్రీవారి స్మారక సంచికయందు (ప్రతిభ, సంపుటి-౪) ప్రకటింపబడినది కూడ. అందు పై వాక్యము 41వ పేజీలో గలదు.

55. "..... was written at the request of the Society for Promoting Christian Knowledge and is printed at their expense." (Telugu - English Dictionary ; Preface - Page V)

56. "ఈ నిఘంటు నిర్మాతలు (సూర్యరాయాంధ్ర నిఘంటువు) బ్రౌణ్య నిఘం టువు ప్రమాణముగా స్వీకరించినారు. అందుకు నేను చాలా సంతోషిస్తు న్నాను." శ్రీ గి॥ రామమూర్తి పంతులుగారు (శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు - విమర్శనము - ప్రతిభ, సంపుటి-౪ - 20వ పేజీ).

పదమును ఇచ్చితిని"[57] అని వ్రాసిన బ్రౌనుదొర తెలుగు భాషాభిమానమును ఏమని కొనియాడుదుము.

ఈ మిశ్రభాషా నిఘంటువు (A Dictionary of the Mixed Dialects and Foreign words used in Telugu) 1854లో ముద్రింపబడినది[58] పీఠిక తరువాత దీనిలో "ఆంధ్రభాషతత్వము"లను గూర్చిన దీర్ఘ వ్యాసమొకటి కలదు. ఆంధ్ర వ్యాకరణమునకు ఇది ప్రథమ వాచకముగ గ్రహింపవచ్చునని బ్రౌనుదొర వ్రాసెను. అతడు వ్రాసిన తెలుగు వ్యాకరణము రెండవ ముద్రణమునుండి ఇది కొలది మార్పులతో గ్రహింపబడినదట.[59] ఈ భాగమును చదువుచున్నప్పుడు: బ్రౌనుదొరకు గల తెలుగు భాషా పాండిత్యమేగాక, అతని సమన్వయ దృష్టి, మన సంఘ సంప్రదాయములను గూర్చి అతనికిగల విజ్ఞానము మనలను ఆశ్చర్యచకితులనుగ చేయకమానదు. మన ఆచార వ్యవహారములతో, మంచి చెడ్డలతో అతనికిగల సానుభూతి మనలనాతనిని గౌరవించునట్లుచేయును.[60]

ఈ నిఘంటువును కూర్చుటలో అతని ముఖ్యోద్దేశము; ముస్లిముల పరిపాలనవలన తెనుగు భాషలోనికి వచ్చి చేరిన అన్యదేశ్యములను అర్థవివరణముతో చూపుటయే. అరబ్బీ, పారసీక, ఉర్దూ భాషలోని పదములనేగాక, ఇతర భాషల నుండికూడ తెలుగులోనికి వచ్చి చేరిన పదములనుగూడ అతడు గ్రహించెను.

---

57. To each word in this vocabulary I have appended a Telugu synonyme. This will help those who wish to get rid of these foreign words." (Dictionary of Mixed Telugu, 1854 — Preface ; Page IV).

58. "This Dictionary is printed at the expense of the Society for Promoting Christian knowledge."

(Ibidem : Preface, Page IV)

59. "These remarks are reprinted with some amendations, from the second Edition of the Telugu Grammar."

(Ibidem — Page XXVIII)

60. "The native tutors also complain that English pupils touch their mouths with their hand : and then defile books with hands thus dirtied. Hindus hold spittle in abomination. We should respect their prejudices, and treat them kindly."

(Ibidem - Page X - Foot Notes)

బ్రౌనుదొర — న్యాయస్థానములలోను, వాణిజ్య కేంద్రములలోను విరివిగా వాడబడు ఈ "మిశ్రమ భాషను"ను; లా-లాటిన్ (Law-Latin) తోను, లా-ఫ్రెంచి (Law-French) తోను పోల్చి; వాక్యనిర్మాణ విషయములోను, కారకమునందును ఈ భాషకును "తెనుగు"నకు పోలిక చాల తక్కువ అని చెప్పుచు-ఈ ఉదాహరణను ఇచ్చెను. "ఈ నంబరులో డిఫెండంటు సమ్మను చూచి సైను (or-దస్ఖత్) చేసి వాయిదాచొప్పున కోర్టులో హాజరు అయి అన్సరు యియ్యకపోయినందున యిందులో యెక్సపార్టి దర్యాప్తు చేయవలెనని ప్లైంటిఫ్ ప్లీడరు మోశను చేసినాడు గనుక ఆ మోశను రికార్డులో దాఖలు (or ఫయిలు) చేసి అందులో దర్ఖాస్తు చేసిన చొప్పున నడిపించేలాగున ప్రొసీడింగుసులో ఆర్డరు యెంటరుచేయడం అయినది."[61]

ఈ నిఘంటువు తన తెలుగు-ఇంగ్లీషు నిఘంటువునకు పరిశిష్ట భాగమువంటిదనియు, సాధారణముగా ప్రజలు వాడుచున్న పదములేగాని, వాడుకలో లేని "అన్యదేశ్యము" లిందు లేవనియు బ్రౌనుదొర, ఈ నిఘంటు పీఠికలో[62] వ్రాసెను. అవసరము లేనప్పుడు మాటలలోగాని, వ్రాతలోగాని ఈ "మిశ్రభాష"నుపయోగించుట మంచిది కాదనియు, సాధ్యమైనంత వరకు దీనిని వర్జింపవలెననియు[63] వ్రాసిన బ్రౌనుదొరయొక్క ఆంధ్రభాషాభిమానమును గూర్చి వేరుగా నొక్కి చెప్పవలెనా!

ఈ నిఘంటు నిర్మాణములో ఆయనకు బాగుగా తోడ్పడినవి (i) ఆయనే ఎనిమిది వాల్యూములలో సేకరించియుంచిన జాబులు; (ii) వాల్యూములలో నున్న "స్థానిక చరిత్రలు"[64]. వీని సాయముతోను, తాను కోర్టు వ్యవహారము లలోనున్నప్పుడు సేకరించిన "రికార్డు"లతోను, ఈ నిఘంటువును బ్రౌనుదొర చక్కగ కూర్చెను.

---

61. Ibidem – Preface; page III (ఇది మచిలీపట్టణము 'కోర్టు జర్నలు' నుండి సంగ్రహింపబడినది.

62. "... . forms a requisite supplement to a Dictionary of the Telugu language : and it contains only those phrases which are current among the natives." (Ibidem - Preface; Page III)

63. "......But in talking and writing Telugu we ought to avoid this mixed dialect." (Ibidem - Preface : Page IV).

64. Ibidem - Preface ; Page IV.

ఈ పెద్ద నిఘంటువులేగాక, తాను వ్రాసిన వాచకాదులందు; చిన్న నిఘంటువులను, "పదజాలముల"ను ఎన్నింటినో బ్రౌనుదొర తెలుగు నేర్చుకొన గోరువారికి వీలుగనుండుటకై ముద్రించెను. తెలుగు భాషలో కృషిచేయ నెంచు వారికి ఏ కష్టమును-తనకు మొదట కలిగినట్లు-కలుగకుండుటకై ఎంతవరకు శ్రమింపవచ్చునో అంతవరకును ఈయన కష్టపడి పనిచేసెను. ఆ పని, ఉత్తమ గ్రంథముల రూపమును పొందినది.

ఇవిగాక, జిల్లాలలో జరుగు కార్యకలాపములకు సంబంధించిన పదజాలము గల, జిల్లా నిఘంటువు (1852) నొకదానిని బ్రౌనుదొర ప్రకటించెను. ఆయన చేసిన పనులలో ఇది అత్యల్పమైనదైనను, దీనిమీది విమర్శమాత్రము కఠినముగ వచ్చినది. తరువాత ఇది విల్సన్ దొరయొక్క "కోర్టు-రెవెన్యూ పదముల పట్టిక"లో 1355లో విలీనమైనదట.[65]

బ్రౌనుదొర ఆంగ్ల నిఘంటువునకు గూడ ఒక అనుబంధమును కూర్చెను డాక్టరు జాన్సన్‌యొక్క నిఘంటువును తీసికొని, అచ్చు కాగితముల నడుమ తెల్ల కాగితములు వేయించి సిద్ధముచేసిన ప్రతిలో, ఎన్నో క్రొత్త ప్రయోగములను-టాడ్, వెబ్ట్సర్, క్రైగ్. మొదలగు వారు చూపక విడిచిన వాటిని-సేకరించి వ్రాసియుంచెనట.[66] దీనినిబట్టి ఆయనకు స్వభాషయైన ఆంగ్లమున ఎంతటి పాండిత్యము కలదో వ్యక్తమగుచున్నది. ఆయన మన దేశమునకే రాకయుండిన స్వభాషకే సేవచేసి, ఆంగ్లసాహిత్యమున శాశ్వత కీర్తి నార్జించియుండెడివాడు. ఆయన

---

65. "I added a fourth volume called the Zillah Dictionary giving in the English Character all the words that occur in 'Zillah business' in India. I regretted this thing. It was the puniest of my work, and the only volume which was peevishly criticised. It was afterwards Merged in Wilson's Glossary of Judicial and Revenue Terms, 1855......".

66. "At leisure, I also prepared an appendix to the English Dictionary. Taking a quarto copy of Samuel Johnson's work interleaved, I collected a series of quotations, both ancient and modern, which even Todd, Webster, and Craig had overlooked." (ఈ వ్రాత ప్రతి తనకు లభింపలేదని, 'ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు' ద్వితీయ ముద్రణమును సంస్కరించిన ఎమ్. వెంకటరత్నంగారు వ్రాసిరి)

కీర్తికి ఎక్కడైనను అడ్డములేదు. కాని,ఆయన ఇచ్చటకు రాకున్నచో మన భాషా సాహిత్యములకు, ఆయన ప్రతిభతోగూడిన సేవ లభించెడిదికాదు.

ఇంతేకాక "ఫ్లెమింగ్", "టిబిన్"లు కూర్చిన ఫ్రెంచి నిఘంటువునకు కూడ నూటికంటె ఎక్కువగ పదములను చేర్చెనట.[67] చిన్ననాటనే ఆయన నేర్చిన "ఫ్రెంచిభాష", ఆయనకీ విషయమునను, బాగుగా తోడ్పడినది.

ఈ విధముగా బ్రౌనుదొర సర్వతోముఖ ప్రజ్ఞను చూపి, కృషిచేసెను గనుకనే, ఆయన ధైర్యముగ, "నేను ఒక్కరికొరకే శ్రమింపలేదు"[68] అని వ్రాయగలిగెను. వ్రాసినది సార్థకమును గూడ.

కాని,ఇంచుమించుగ, భారతదేశములోని సమస్తభాషలతోను పరిచయమున్న బ్రౌనుదొర[69], తెనుగు భాషను తన అభిమాన భాషగ స్వీకరించి కృషిచేయుట మన భాషకు జరిగిన మహోపకారము. పురాణోక్తులలో చెప్పవలెనన్న - భాషా యోషల విషయమైన ఆయన దక్షిణ నాయకత్వము, ఆంధ్రభాషను పట్టమహిషిని చేసికొని గాని "తృప్తాస్మ" అనలేదు - అనవలెను! ఇట్టి మహానుభావుని కృషిలో, కొన్ని లోపములున్నవని అనువారును లేకపోలేదు. దోషములును లోపములును అందరికిని గలవుగాని, ఇంత కృషిచేసిన ఘనత మాత్రము అందరికిని లేదు. "ఏకోహి దోషోగుణ సన్నిపాతే నిమజ్జతి"*.

---

67. "I further made some hundred additions to Fleming's and Tibbin's quarto French Dictionary."

68. "I did not labour for one tribe alone."

69. Distinguished by his attainments in nearly every other language of India, whether vernacular or classical, Mr. Brown particularly attached himself to the study of Telugu"— D. F. Carmichael, Secretary, Board of Examiners' Office, March 23rd, 1858. (Preface to a Catalogue Raisonnee of Oriental Manuscripts in the Library of the College, 1857.)

* [దీనిలో ఉదాహృతములైన ఇంగ్లీషు భాగములు (వేరుగా చెప్పనివి) Some Account of the Literary life of C.P. Brown నుండి సంగృహీతములు.]

# లఘు రచనలు

బ్రౌనుదొర వ్యాకరణము, నిఘంటువులు, తెలుగువారికి సుపరిచితములు. మనవారికంత పరిచితములుకాని లఘురచనల నెన్నింటినో ఆయన చేసెను. అవి ఆయన మిక్కిలి శ్రమపడి విషయసేకరణమునకు చాల ధనము వెచ్చించి చేసిన రచనలేకాని, సామాన్యమైనవికావు. వాని లఘుత్వము, విషయ వివరణమునందే గాని విషయ గుణమునందు కాదు. ఈ రచనలలో చాలభాగము ప్రత్యక్షముగనో, పరోక్షముగనో తెలుగు భాషా సాహిత్యములకు సంబంధించినవే.

బ్రౌనుదొర సివిలు సర్వీసులో చేరిన కొంతకాలమునకు, 1820 ప్రాంతము, తెలుగులో కృషి ప్రారంభించి, క్రమక్రమముగా నందు ప్రవీణత సంపాదించెను. ఈ ప్రారంభ కాలములోనే ఆయన మద్రాసు కాలేజిబోర్డు సభ్యులలో ఒకరయిన రిచర్డ్ క్లార్కు కోరికపైని, 'ఆంధ్ర సంస్కృతభాషల ఛందస్సు' అను గూర్చి ఒక పుస్తకమును వ్రాసి, 1827 లో మద్రాసునుండి ప్రచురించెను[1]. దీని 'ముఖపత్రము' ఇట్లున్నది:

ఆంధ్ర - గీర్వాణ - చ్ఛందము.

The
PROSODY
of the
Telugu and Sanscrit
Languages
Explained

By Charles Philip Brown,
of the Madras Civil Service.

Madras:
Printed At The College Press.
1827.

---

1. The Prosody of the Telugu and Sanscrit Languages explained by C.P. Brown.; College press; Madras-1827.

దీనియందు సంస్కృతమునకు తాను చేసిన వివరణముతో తృప్తిపడక, బ్రౌనుదొర ప్రత్యేకముగా 'A Familiar Analysis of Sanscrit Prosody' అను వ్యాసమును వ్రాసి (June, 1837) దానిని, తానప్పుడు సెలవుమీద లండనులో నుండుటచే, ఏషియాటిక్ జర్నల్[2]లో (పుటలు-153; 241) ప్రకటించెను. దీనిని తరువాత లండనులో చిన్న పుస్తకము రూపమున గూడ అచ్చువేయించెను[3]. ఇది అసమగ్రము, సామాన్యమునయిన రచన ఐనను; ఇది అచ్చయిన వెంటనే కోనింగ్స్‌బెర్గ్‌లో నున్న 'గోల్డ్‌స్టక్కర్'(Goldstiicker) అను యువకుని చేతిలోబడి, ఆయనను సంస్కృత భాషాధ్యయనమునకు ప్రోత్స హించెనట! ఈ యువకుడు తరువాత సంస్కృతములో గొప్ప విద్వాంసుడై, లండను విశ్వవిద్యాలయమున ఆచార్యునిగ నుండగా, బ్రౌనుదొర ఆతనిని కలిసి కొనుటయు, ఆతడు బ్రౌనుదొరతో ఈ విషయమును చెప్పుటయు జరిగెను[4]. ఆతని ప్రోత్సాహముచే బ్రౌనుదొర ఈ చిన్న పుస్తకమును పెంచి వ్రాసి - తాను ఉద్యోగమునుండి రెటైరు అయి, లండనులో నుండగా - 1869 లో అచ్చువేయించెను[5].

ఈ పుస్తకము[6] చిన్నదయినను (56 పుటలు), బ్రౌనుదొరయొక్క బహు ముఖ ప్రతిభకు చక్కని నిదర్శనము. విషయ సంగ్రహణమున, వివరణమున ప్రత్యేక మార్గము నవలంబించి 'ఛందస్సు'ను పాశ్చాత్యులు సులభముగా నర్థము చేసికొనుటకు వీలు కల్పించెను. అడుగడుగున, గ్రీక్, లాటిన్ భాషలలో

---

2. The Asiatic Journal; May-August, 1837; London. (153-166, 241-246.)

3. A Familiar Analysis of Sanscrit prosody by C.P. Brown; extracted from the Asiatic Journal (page-20), J.L. Cox & Sons: London 1837.

4. "......the publishing of an imperfect work may be useful; thus, my 'Analysis of Sanscrit Prosody', 1837 found its way to Konigsberg and there fell into the hands of a young literate named Goldstiicker. In 1860 I met him in London where he was a Professor of Sanscrit. He told me this little book encouraged him to undertake the study." (Some Account of the Literary Life of C.P. Brown.)

5. "He persuaded me to re-write the Prosody, and make it more complete. I consented ..." (Ibidem)

6. Sanskrit Prosody and Numerical Symbols explained by C.P. Brown; Triibner & Co : London, 1869.

ఈ 'ఛందస్సు'నకు గల పోలికలను చూపుచు; పాశ్చాత్యులైన కోల్ బ్రూక్ (Colebrooke) మొదలైన ఇతర పండితులతో నేకీభవింపని విషయములను తాను నొక్కిచెప్పుచు; ఈ పుస్తకమును విశిష్టమైనదానినిగా చేసెను. భారతీయ పండితుల, వారి ననుసరించిన పాశ్చాత్య విద్వాంసుల - రచనలు, వివరణలు, చాల కష్టములై, భాషాభేషజము నడుమ విషయమును గహనముచేయగా, తానొక క్రొత్తదారిని త్రొక్కి, విషయమును సుగమము చేయనెంచితినని బ్రౌనుదొర వ్రాసెను[7]. ఇందీయన చాలవరకు కృత కృత్యుడయ్యెను.

సంస్కృతములోని ఛందములకు వేరువేరుగ పేరులుండుటను-త్రిష్టుభ్, జగతీ, అతిధృతి మొదలైనవి - గూర్చి వ్రాయుచు, బ్రౌనుదొర, సగము కష్టమునకు కారణమివి యని వ్రాసెను. ఆయన దృష్టిలో వీటిని; పదునొకండు మాత్రల వృత్తము, పండ్రెండు మాత్రల వృత్తము, పందొమ్మిది మాత్రల వృత్తము - పాద పాదమున - అనుట సులభమని, మన భాషలతో, పేర్లతో పరిచయములేని పాశ్చాత్యుల విషయమున నిది మంచిదని ఆయన యూహ కావచ్చును 'ఈ వృత్తము త్రిష్టుభ్వృత్తముయొక్క జాతికి చెందుననకుండ, పదునొకండు మాత్రల వృత్తమునకు చెందును' అనరాదా యని ఆయన ప్రశ్న[8]. దీనితో మన వారందరు ఏకీభవింపకపోవచ్చును.

వివిధములైన పాశ్చాత్య భాషలలో పండితుడైన బ్రౌనుదొర ప్రసంగము వచ్చినప్పుడెల్ల, సంస్కృత చ్ఛందములను ఆయా పాశ్చాత్యభాషలలోని ఛందము

---

7. "The system of Sanscrit Prosody is short and easy; but it has been treated in ancient native writers in a mode that has rendered it very obscure. Mr. Colebrooke's Eassy on the subject has made it accessible to the English reader; but .. ..has adhered to the ancient routine......a consecutive explanation is yet wanting, if it were only to draw the line between what is essential and what is mere verbiage."

"I...perceived that the art may be rendered easy, by adopting a new method, free from the mysterious pedantry which has hitherto darkened every statement. This easier mode I now propose to describe .." (Ibidem)

8. "One of the chief difficulties arises from using a variety of useless names : for instance, instead of saying that a verse contains eleven syllables in the line, or twelve......a peculiar name is given to each number......Accordingly, instead of saying that a species of verse has eleven syllables in the line, it is said to "belong to the genus Trishtubh." Nor is this all. As there are four lines in the verse, it is stated to contain not eleven but forty-four syllables." (Ibidem)

లతో పోల్చి వ్రాసెను. 'ఇంద్రవజ్ర' వృత్తమును గూర్చి వ్రాయునప్పుడు, అది 'హోరెస్' (Horace) కవి వ్రాసిన ఛందమునకు సరిపోవుచున్నదని సోదాహరణముగా చూపెను. ఈ సందర్భముననే; ఇంద్రవజ్ర - ఉపేంద్రవజ్ర వృత్తములకుగల పోలికలను గూర్చి వ్రాయుచు; ప్రథమాక్షర భేదము తప్ప రెండింటికిని భేదమే లేదనియు, అదిచెప్పక వేరువేరుగ పేరులుంచుటవలన తికమక కలుగుచున్నదనియు, బ్రౌనుదొర వ్రాసెను.[9] మన భాషా సంప్రదాయములతో పరిచయమంతగా ఉండని పాశ్చాత్యులను - ముఖ్యముగా - మనస్సులో నుంచుకొని ఆయన అట్లు వ్రాసినాడనవచ్చును.

'దండకము'ను గూర్చి వ్రాయుచు నది గమకముగల వచనమనియు, దానిని ఇంగ్లీషులోని 'బ్లాంక్ వెర్స్' (Blank Verse)తో పోల్చవచ్చుననియు, దానికి- సాధారణముగా - పాదనియమము లేదనియు, బ్రౌనుదొర వ్రాసెను.[10]

బ్రౌనుదొర, గణములను గూర్చి వ్రాయునప్పుడు; లాటిన్, గ్రీక్ మాటలను ప్రక్కప్రక్క-చూపి; వివిధ గణములలోని గురులఘువులను, పాశ్చాత్యులు సులభముగా జ్ఞాపకముంచుకొనుటకు వీలు కల్పించెను. వివిధ వృత్తములకు లక్షణమును చెప్పునప్పుడు, లక్ష్య సమన్వయము కూడ చేసి చూపెను. ఈ లక్ష్యములు వివిధములైన సంస్కృత గ్రంథములలోనుండి ఎత్తి చూపబడినవి. ఈ కృషి యందాయనకు, నాటి తెలుగు పండితులు సాయము చేసినారనుటలో సంశయము లేదు. బ్రౌనుదొర వారికి కృతజ్ఞతను తెలుపుకొని, సహృదయతను వెల్లడించి

---

9. "This very common metre (Indra Vajra) is the same as is used by Horace :-

'Trahuntque siccas machinae carinas.' But the initial may be long at pleasure. Instead of mentioning this liberty, native writers called the variety of upendra Vajra (Ibidem)

10. "...what is longer, falls under the denomination of (Dandaka) measured prose, which, like the English blank verse, is unlimited in length; but a love of obscure phrases leads the native teachers to state, that this verse extends from 26 to 999 syllables. In plain English, it has no limit". (Ibidem)

నాడుకూడ[11], ఇట్లని ఆయన కేవలము పండితులు చెప్పిన పద్ధతినే అనుసరించుచు వచ్చినాడనుటకు వీలులేదు. ప్రస్తారమువలన సాధింపనగు వృత్తసంఖ్యనుగూర్చి వ్రాయుచు, వాటికని కవులుపయోగించు వృత్తముల సంఖ్యకును చాల భేద మున్నదనియు, ఛందశ్శాస్త్రములో చూపబడిన వృత్తసంఖ్య. సాధింపఁగు అవ కాశమునే చూపునదిగాని యథార్థముగా వాడుకలోనున్న వాటి సంఖ్య చూప దనియు, వాటి ఉపయోగము తక్కువ అనియు; నిష్కర్షగ బ్రౌనుదొర చెప్పెను[12].

"అర్ధసమ వృత్తము"లను గూర్చి వ్రాయుచు, అట్టివి "హొరెస్", (Horace) "మిల్టన్" (Milton) మొదలైన కవుల రచనలలో కలవనియు; సామాన్యముగా ఇట్టి ఛందస్సు, ఇంగ్లీషు గీతములలో వాడుకలో నున్నదనియు, సోదాహరణముగా బ్రౌనుదొర చూపెను[13]. ఈ గ్రంథము. పాశ్చాత్యులను

---

11. "I will further confess that, without the aid of these living instructors, I should have found the greatest difficulty in comprehending the meaning of that illustrious light of Sanscrit literature".

12. "Another conceit ... is, that the number of metres is many millions; yet .....less than fifty are in use ....All the remainder are fabrications of prosodians, which poets reject; and the "millions" are merely the possible sum of a geometrical series of numbers, which has not the smallest connexion with the art."
(Ibidem)

13. "Some fixed meters are on one form in the even lines, and another in the uneven; just as in Horace; 1.8.

    Lydia, dic, per omnes
  To deos oro, Sybarin cur properas amando .
    Perdere ? cur apricum
  Oderit Campum, patiens pulveris atque solis ?

Here we see that the second part of the verse is precisely similar to the first couplet. So also in English, to borrow an instance from Milton :

    The oracles are dumb, No voice or secret hum
  Runs round the arched roof with words deceiving,
    Appollo from his shrine, Can no more devine,
  With hollow shriek the steep of Delphi leaving. & c.

Here the first half is parallel to the second, as is the case in most of our metres used in songs. Such are called "Ardha Sama Vrittani", or half-equal metres". (Ibidem)

మనస్సులో పెట్టికొని వ్రాసినదగుటచే, బ్రౌనుదొర పాశ్చాత్య భాషలనుండి పోలికలను ఎత్తి చూపుట జరిగినది. వీటికి సంస్కృతములో రఘువంశాది గ్రంథములనుండి ఉదాహరణలు చూపబడినవి. అట్లు చూపబడిన లక్ష్యములకు బ్రౌను దొర, ఆంగ్లానువాదము కూడ నిచ్చెను[14].

సంస్కృతములోని "ఆర్య"ను గూర్చి వ్రాయునప్పుడు; దానిని లాటిన్ భాషలోని(a metre named after Asclepiades)వృత్తముతో పోల్చుటయే గాక, తెలుగులోని కందపద్యమునకు దానికిగల పోలికలను కూడ చూపెను. ఈ సందర్భములోని వాక్యములు, ఉదాహరణలు క్రింద చూపబడినవి.[15]

"But it is common enough in the modern poetry of the Telugu language ; as follows :

(పద్మపురాణము; III, ప. 84.)

Tela Tela Vegudu bulugulu
(తెల తెల వేగుడుఁ బులుగులు)

Cala Cala balucanga jagamu cannulu danai
(కల కల బలుకంగ జగము కన్నులుఁ దానై)

Tela Tela vegucu dammula
(తెల తెల వేగుచుఁ దమ్ములు)

Cheli yallana yudaya sikhiri sikharam bekken".
(చెలి అల్లన ఉదయ శిఖరి శిఖరం బెక్కెన్)

---

14. "Here (Pushpitagram) the first and third lines have twelve syllables, while even lines have thirteen......The seventh book of the Magham opens in this metre. Thus also in the Raghu Vamsam

Salalita cusuma pravala sayyam
Jwalita mahaushadhi dipica sanaatham
Narapati rativahayam babhuva
Cwachi dasameta parichhada striyamam (IX, 70)

(The prince, without his retinue, passed the night in a sequestered spot reposing on a bed of leaves and blossoms, illumined by wild fire alone.) (Ibidem)

15. (Ibidem.)

కందపద్యములో, సరిపాదములలో మూడవగణము, "నల" మగుట కిది ఉదాహరణముగా బ్రౌనుదొర చూపెను. ఈ పద్యమున కాయన ఆంగ్లానువాద మిది:

"The dawn awoke, melodious notes

Burst forth on every spray ;

While gently, O'er the brightening hill

Arose the orb of day."

క్రింది పద్యమును, కందపద్యములో సరిపాదములలో మూడవ గణము "జ" గణమగుట కుదాహరణముగా, బ్రౌనుదొర ఇచ్చెను:

(విష్ణుపురాణము; II, ప. 156.)

"Zunnulu gala yadavulu mahi
(జున్నులు గల యడవులు మహి)

Dunnaca vittaca phalincu torapu modavul
(దున్నక విత్తక ఫలించు తోరపు మొదవుల్)

Cannavasi palu biducunu
(చన్నవసి పాలు బిదుకును)

Vannega nela nela cu mudu vanalu guriyan."
(వన్నెగ నెల నెల కు మూడు వానలుఁ గురియున్)

దీనికి బ్రౌనుదొర ఆంగ్లాను వాదము నిట్లు చేసెను:

"Within the honey-dropping woods,

Spontaneous harvests rise ;

The kine pour forth their milky floods,

And bounteous are the skies."

"The rhyme in this language (Telugu) is very peculiar : the four lines are alike in the second syllable (Prasa) ; and in the even lines, the initial of the fourth (seventh) foot (Ganam) rhymes to the (fourth) beginning of the line. This variety is called Canda Padyam, and is the favourite metre in all the larger Telugu poems."

"In all varieties of the Arya metre, we should notice that the amphibrach (Ja ganam) is uniformly excluded from the uneven feet."

ఈ రీతిగా బ్రౌనుదొర; సంస్కృతములోని "ఆర్య"ను, తెలుగులోని కందమును, లాటిన్ గ్రీక్ భాషలలో గల- వీటిని బోలిన - ఛందోరూపములను తులనాత్మకముగ పరిశీలించెను. ఇది ఆయన పాండితికి నికషోపలము.

భీమన పేర ప్రచారమున నున్న "కవిజనాశ్రయము"ను Refuge of poets అను పేరుతో బ్రౌనుదొర ఇంగ్లీషులోనికి అనువదించెను. "అప్పకవీయము"మీద కూడ ఇంగ్లీషులో కొంత నోట్సు వ్రాసెను. (ఈ పుస్తకములో పుటలు-256, 257 కూడ చూడవలసినది) పద్య లక్షణమును చెప్పుకొని లక్షణ పద్యములను తాను సొంతముగా వ్రాసినట్లు కొన్ని పట్టులందు తెలియజేసెను :

"The following memorial verses I composed two in April and the rest in August 1825."

వీటిలో ఒకటిగా క్రిందిదానిని గ్రహింపవచ్చును. దీని రచయిత బ్రౌను దొర అని నిస్సంశయముగా నిర్ణయింప వీలులేకున్నను లిఖిత ప్రతులలో ఇది కలదు;

"కందమందు మొదటికాలు తక్కువయుండు
నాట వెలదియందు నరయసీస
ములకు రెండవదియు వెలతియై దనరారు
నితరములకు నాల్గు నేకసమమునూ."

తాను పద్యములను సొంతముగా వ్రాయుటకు గల కారణమును క్రింది విధముగా తన 'ఆంధ్ర గీర్వాణచ్ఛందము'నందు Preface లో తెలియజేసెను :

"Some apology also may be considered requisite for the Telugu verses which are given as examples of the rules of prosody. In behalf of these, the author is willing to believe that their utility may counterbalance what is wanting to them in elegance ; and he has only to regret the necessity which caused the greater number of them to be the productions of his own pen ; his endeavours to induce natives versed in this branch of study to compose easy and intelligible rules for the purpose, having very generally been unsuccessful."

ఇది మనసులో నుంచుకొని బ్రౌనుదొర పద్య లక్షణమునకు సరిపడు పద్య రచనకు పూనుకొనెను. "ఆంధ్ర గీర్వాణచ్ఛందము"లో On the Fixed Metres అను అధ్యాయమున ఆయన తెలుగు రచనలు చాల గలవు. ఈ విషయము నాయనరయే పదవ (ఈ అధ్యాయములో నిది చివరిది) అధస్సూచికలో నిట్లు తెలిపెను :

"All these memorial lines I composed, excepting those for this verse, the preceeding three, and the Sanscrit instances."

ఇందు పేర్కొనబడిన పద్యము (Verse) కవిరాజ విరాజితము. బ్రౌను దొర పేరు వచ్చిన దీనిని ఇతరులెవరో వ్రాసియుందురు. ఆ పద్యపాదములివి :

"రసమగు నీకవి రాజవి రాజిత
రాగము బ్రౌనను రాజొన గెన్"

ఈ సందర్భమున "....my name has been introduced into the rule but I cannot alter it conveniently" అని వ్రాసెను.

ఈ అధ్యాయమున వివిధ వృత్తములకు సంబంధించి ఆయన వ్రాసిన పద్యములలో వ్యావహారిక ప్రయోగములుండుట విశేషము.

ఉత్పలమాల : "ఉన్నత నీలహారమున నుత్పల మాలిక చెప్పినా నయా"

చంపకమాల : "చవిగల పూలదండవలె చంపక మాలిక చెప్పినా నయా"

ఈ రెండింటికి గల సన్నిహితత్వమును చూపించుటకై, చంపకమాల మొదట "నల"ను వేరుచేసి చూపి ఆ విషయమును "Champacamala... differs from the preceding merely by dividing the initial long into two shorts" అని తెలిపెను.

ఇటులనే శార్దూల మత్తేభములను కూడ చూపెను :

శార్దూలము : "శాంతంబౌ ధ్వనితో డవెళ్ళ వలదా శార్దూల విక్రీడితా"
మత్తేభము : "మదముఃబాయె నుగవెళ్లుతున్న వలనే మత్తేభ విక్రీడితా"

అని వ్రాసి, "....the Mattebha vicridita varies only in dividing the first long into two shorts" అని తెలిపెను. మత్తేభ వృత్త విభజనను బట్టి ఇందు గణములు మారినట్లు కనబడునుగాని, ఆయన దృష్టి ఈ రెండింటికి గల పోలికలను చూపించుటయేయని గుర్తించినప్పుడు ఈ విభజన అర్థవంతమగును.

ఇటులనే, మత్తకోకిల తరళ వృత్తములకు గల పోలికలు కూడ చూపి వ్రాసెను :

మత్తకోకిల : "మాటమా టికిపా డుతుండ గ మత్తకో కిలవిం టివా"

తరలము : "తరల లోచన తోట లోపల తారసి ల్లినరి శిగా"

ఈ సందర్భమున కూడ, "...Tarala varies only in dividing the initial long into two shorts" అని వ్రాసెను.

ఈ విధముగనే - స్రగ్ధర, మహాస్రగ్ధర; మానిని, మాలిని; పంచచామర, భుజంగప్రయాత; దోధక (తోడక), తోటక మొదలైనవాటిని కూడ పోల్చి చూపెను. ఈ విశ్లేషణమును పరిశీలించిన మనకు ఛందస్సు విషయమున బ్రౌను దొరకు గల అవగాహన అర్థమగును.

సంస్కృత ఛందస్సు విషయమున సంశయములు గలిగినప్పుడు, ఆనాటి మహా విద్వాంసులలో నొకరైన శ్రీ రాధాకాంతదేవు (1784-1877) నడిగి సంశయ నివృత్తి పొందినట్లు Remarks on the technical terms used in prosody etc." అను అధ్యాయమున అధసూచికలో నిట్లు తెలిపెను :

"In reply to a query on this subject, the learned Radha Canta Dev, of Calcutta, author of the great Sanscrit Lexicon now printing, (see preface to wilson's Sanscrit Dictionary, P. XXXVIII) had the kindness to inform me, that in Devanagari and Bengali, as well as in Telugu, the mark (I) is laghu : while the guru, In Devanagari resembles the Persian (/) hamza, and Bengali is very similar to the number six in that language...".

ఇన్ని విధముల శ్రమపడి "ఆంధ్ర గీర్వాణచ్ఛందము"ను సర్వాంగ సుందరముగా తీర్చిదిద్దెను. ఇది 1827లో అచ్చయినదని గ్రహించినప్పుడు బ్రౌను దొరకు తెలుగు విషయమున శ్రద్ధాసక్తులు మొదటినుండియు కలవని తెలియును.

సంస్కృతముయొక్క ఛందశ్శాస్త్రమును పఠించుటవలన చాల లాభము లున్నవనియు, సంస్కృత గ్రంథముల సంస్కరణమున ఈ జ్ఞానము పనికివచ్చు ననియు, ఆయన వ్రాసెను.[16]

అనన్య సామాన్యమును, బహుముఖమును అయిన ప్రజ్ఞ కల బ్రౌనుదొర భారతీయ శిల్పశాస్త్ర విషయములును గ్రహించెను. విగ్రహములను చెక్కు శిల్పితో జరిగిన సంభాషణము వలన, బ్రౌనుదొర, హిందువుల "విగ్రహములు" శిల్పశాస్త్రము ననుసరించి చెక్కబడుననియు, వాటి కొలతలు నిర్ణయమై యున్న వనియు గ్రహించెను. తరువాత నాయన, ఆ శాస్త్రములో విగ్రహముల కొలత లను గూర్చి చెప్పిన ప్రమాణములను, ఎన్సైక్లోపీడియా బ్రిటానికాలో వర్ణితము లైన పాశ్చాత్య దేశములలోని ప్రఖ్యాత విగ్రహముల ప్రమాణములను పోల్చి చూచి; రెండింటికి సమానమైన ప్రమాణములే యుండుటను గాంచి, ఆశ్చర్యపడి, తాను గ్రహించిన విషయమును "మెడ్రాస్ గెజట్"లో వ్రాసెను. అది తరు వాత "ఏషియాటిక్ జర్నల్"లో అచ్చయినది.[17]

---

16. "...... it furnishes a yet more important aid in those passages wherein it enables us to detect ommissions and spurious insertions. These occur in nearly all Sanscrit manuscripts, and often impede the progress of the reader." (Ibidem)

17. "In a late conversation with a Hindu statuary, I was informed that the proportions of the human form, as exhibited in all indian sculptures, are derived from an ingenious rule laid down in the Silpi Sastra which is an ancient Sanscrit work. I have compared these proportions with those of some celebrated ancient statues, as given in the Encyclopaedia Britannica, and find the rule surprisingly parallel." దీని తరవాత, ఒక చిత్రము ద్వారమున కొలతల నిష్పత్తులను బ్రౌనుదొర చూపెను. దాని తరువాత నిట్లు వ్రాసెను:

"These proportions correspond very nearly to those of the Apollo Bevedere, the Grecian Shepherdess, the Antinous, and some other standard works of Greek sculpture" (The Asiatic Journal ; Nov. 1828, Page-596.)

సాధారణముగా ఈ కొలతలను భారతదేశములో-పొడుగుపాటి గడ్డి పోచతోగాని, అరటి ఆకుతోగాని, కొబ్బరి ఈనె (వార)తోగాని, తీసికొందురనియు; తనకు ప్రమాణములను గూర్చి చెప్పిన శిల్పి కాగితమును మడచి చూపెననియు, అతడు చూపుచుండగా చాల సులభముగా అర్థమైనదనియు, దానిని మాటలలో చెప్పుట కష్టమగు చున్నదనియు. బ్రౌనుదొర ఈ సందర్భమున వ్రాసెను.[18] విగ్రహముల చేతులు మాత్రము హిందూ శిల్పులు-పాశ్చాత్యుల దృష్టి ననుసరించి-చాల దీర్ఘముగ చేయుదురనికూడ ఆయన వ్రాసెను.[19] మన దృష్టిలో పురుషోత్తముడు ఆజానుబాహువు గదా !

తా నే ప్రజలనడుమ జీవించుచుండెనో వారి దైనందిన చర్యలను, వారు ముఖ్యముగా కొను వస్తువులను, నిత్యజీవితములో వాడుకొను వస్తువులను సూక్ష్మముగ పరిశీలించుచు వచ్చిన బ్రౌనుదొర హిందువులకు ముఖ్యముగా కావలసిన పదార్థములను గూర్చి-వాణిజ్యదృష్టి ననుసరించి-ఒక వ్యాసమును వ్రాసి 1830 ఫిబ్రవరినెలలో ఒక మద్రాసు పత్రికలో ప్రచురించెను.[20] దాని ప్రాముఖ్యమును బట్టి, ఆ వ్యాస మొక వంగదేశములోని పత్రికలో కూడ ప్రకటింపబడెను.

---

18. "A curious circumstance connected with these Indian measures is, that they are always made with a straw, a strip of coconut or plantain leaf. The sculptor who explained the secret to me used a piece of paper, the folds in which may all be made in a few moments, though it has proved so difficult to explain them in writing." (Ibidem ; Page-597.)
19. "......but the arms are always (according to European ideas) made disproportionately long." (Ibidem ; Page-59T.)
20. "In February 1830, I printed in a Madras newspaper, a statement regarding trade; showing what goods are most in request among the Hindus. This was copied into the Bengal newspapers ; and twenty years after I saw it in an American edition of Miss. Roberts's."Characteristics of Hindustan", (Note on Chapter 29.)" (Some Account of the Literary Life of C. P. Brown).

తరువాత నది, మిస్. రాబర్ట్స్‌యొక్క పుస్తకములో[21] బ్రౌనుదొర చూచి, తన వ్యాసము ప్రజల దృష్టినాకర్షించినందులకు చాల సంతోషించెను. తన సలహా వృథాకాలేదని ఆనందించెను.

బహుభాషా కోవిదుడును, సంకుచితత్వము ఏకోశమున లేనివాడును అయిన బ్రౌనుదొర, ఉర్దూలో మహాకవిగా పేరుపొందిన "సౌడా" యొక్క రచనలను సంస్కరింపించి, వాటిని అచ్చునకు సిద్ధముచేయించెను. "సౌదా" (1713-1780)కు, ఉర్దూ సాహిత్యములో గొప్ప వ్యంగ్యరచయిత అని పేరు. ఇట్లు సిద్ధముచేయబడిన, ప్రతిని "ఇండియా హౌస్ లైబ్రరీ" (The India House Library, Westminster)కి బ్రౌనుదొర ఇచ్చెను[22].

బ్రౌనుదొర ఇంత పరిశోధనాత్మకమైన కృషిని చేయుచు కూడ తీరిక చూచుకొని-నాటి విద్యా విధానముమీద, హిందువుల ఆచార వ్యవహారముల మీద, తెలుగు సాహిత్యముమీద, చాల వ్యాసములు రచించి, వాటిని మద్రాసు పత్రిక (Madras Journal of Literature and Science)లోను, రాయల్ ఏషియాటిక్ సొసైటి జర్నల్ (The Journal of the Royal Asiatic Society)లోను అచ్చువేసెను. ఇవి తెలుగు సాహిత్యమునకు, ఆంధ్రేతర ప్రాంతములలో మంచి ప్రచారమును తెచ్చెను.

వీటిలో తెలుగు సాహిత్యముమీద వ్రాసిన వ్యాసము సుదీర్ఘమై, విషయ వైపుల్యము కలదై, నాడు (1839) ఆంధ్రేతర ప్రాంతములలో మన సాహిత్యమును గూర్చి ప్రజలకు తెలిపెను[23].

---

21. మిస్ రాబర్ట్స్ వ్రాసిన, 'Scenes and Characteristics of Hindostan, with skeches of Anglo-Indian Society' మొట్టమొదట లండన్‌లో, మూడు వాల్యూములలో 1835 లో అచ్చయినది. దీనిని గురించి 'The Asiatic Journal' (May, 1835) లో వ్రాయబడినది. అమెరికాలో ప్రచురింపబడిన 'ఎడిషన్', 1850 ప్రాంతమున విడుదలైనది.

22. "At this time I caused a new and complete edition to be prepared of Sauda, the best poet in the Hindustani language. I have presented this manuscript to the India House library, in Westminster." (Ibidem).

23. The Madras Journal of Literature and Sciencs. 'Essay on the language and literature of the Telugus' 1839; July-October; Pages: 43-59; 360-367. Vol. X.

తెలుగు భాషలోగల, క్రైస్తవ గ్రంథములను గూర్చి-పింగళి ఎల్లనార్యుని "తోభ్యచరిత్ర", మంగళగిరి ఆనందకవి "వేదాంత రసాయనము"[24]. బ్రౌనుదొర "నోటీసు"ల ద్వారమున ప్రజలకు తెలిపెను. ఇవి నాడు "మదరాసు జర్నల్" (The Madras Journal of Literature and Science)లో ప్రచురింపబడినవి[25].

మరాఠీ భాషకూడ తెలిసిన బ్రౌనుదొర - కొన్నాళ్ళు తెలుగు చదివిన తరువాత, నాయనను మొదటిలో "కంపెనీవారు మరాఠీ" చదువ నాదేశించిరి[26] - ఆ భాషనుండి, మరాఠీ బ్రాహ్మణుల శాఖలకు సంబంధించిన వ్యాసము నొకదానిని (Mackenzie Collection - No. 851.) ఆంగ్లీకరించెను.

బ్రౌనుదొర, బ్రహ్మాండపురాణాంతర్గతమైన లలితోపాఖ్యానమును లాటిన్ భాషలోనికి అనువదించి దానికి ఇంగ్లీషులో కూడ 'నోట్సు' వ్రాసెను. "లలిత అను పేరుతో దేవి, భండాసురుని చంపి శివుని వివాహమాడిన కథ ఇది" అని ఆయన వ్రాసెను. దీనిని ఆయన ఇంగ్లీషులో "Legend of Venus" అని పిలిచెను. సంస్కృతములోని తాంత్రిక సాహిత్యముతో ఆయనకున్న పరిచయమును తెలియజేయుటకు డా॥ కాల్డ్వెల్ యొక్క Reminiscences లోని క్రింది వాక్యములు పనికివచ్చును :

"Last of all in Sanscrit, he is so intimate with the 'Tantras' ...... that he has been urged strenuously to devote himself to the sect of those who secretly belong to it ; and while in England was urged to translate and publish some of the books that teach it, for the information of the public".

సంస్కృతములో గల జాతక గ్రంథములందును, జ్యోతిష గ్రంథములందును వచ్చు రాశుల (మేషాది) పేరులను; గ్రీకు భాషలోని (Zodiac) పేరు

24. "The Vedantarasayanam వేదాంతరసాయణం a Telugu poem in four books written by a Roman Catholic Christian named Ananda, son of Mangalagiri Timmaia about A. D. 1700. It is a summary of the life of our Lord, selected from the Gospels ; with an introduction. The style of this poem is greatly admired". (Telugu-English Dictionary ; Page -XIV.)

25. Madras Journal of Literature and Science, Vol. XII ; 1840 ; Page-5.

26. "After I had a litte Telugu I was desired to read Maratta." (Some Account of the Literary Life of C. P. Brown.)

లతో పోల్చుచు నొక వ్యాసమును బ్రౌనుదొర వ్రాసెను. తరువాత నిది "కర్ణాటిక్ క్రోనాలజీ" (Carnatic Chronology) లో ముద్రింపబడినది.

నాడు విద్వాంసులలో విశేషముగ ప్రచారమునలేని, తెలుగులో గల వీర శైవుల సాహిత్యముపై బ్రౌనుదొర ఒక మంచి వ్యాసమును రచించి, మొట్ట మొదట మద్రాసులోను (The Madras Journal of Literature and Science. Vol XI P. 145; 1840), తరువాత ఆ విషయమునే రాయల్ ఏషియాటిక్ సొసైటీ జర్నల్ (The Journal of Royal Asiatic Society, New Series; Volume V; pp, 141 - 148; 1871) లోను ప్రచురించెను. ఈ వ్యాసమునందు (Essay on the Creed and Customs of the Jangams) వీరశైవుల (జంగములు) ఆచార వ్యవహారములను గూర్చియు, వారి సాహిత్యమును గూర్చియు; విమర్శనా పూర్వకముగ చర్చించి, బ్రౌనుదొరవారి వైశిష్ట్యమును చూపెను. ఈ పరిశోధనా వ్యాసమును వ్రాయుటకు బ్రౌనుదొరను హెచ్. హెచ్. విల్సన్ ప్రోత్సహించెనట[27].

సమస్త విషయములను నిష్పక్షపాత బుద్ధితో, సత్యదృష్టితో చూడగలిగిన బ్రౌనుదొర; శివలింగమును గూర్చి పాశ్చాత్య లోకమున గల దురభిప్రాయములను విమర్శించి శివారాధకుల మనస్సులలో, లింగవిషయమై ఎట్టి అసభ్య భావమును కానరాదని వ్రాసి, భక్తుల మనోగతాభిప్రాయమును వ్యక్తము చేసెను[28].

బసవేశ్వరుని మాహాత్మ్యమును వర్ణించు బసవ పురాణమును; కుదించి, ఆంగ్లములో నికి పరివర్తనమును బ్రౌనుదొర చేసినాడన్నచో, ఆయనకు దానియం దెంతటి మక్కువకలదో తెలియును[29]. వారి ఆచార వ్యవహారములకును, మిగిలిన హిందువుల ఆచార వ్యవహారములకును గల పోలికలను భేదాలను గూర్చి వ్రాయుచు, వారికి ముఖ్యమైనవి - గురు, లింగ, జంగములనియు; బసవేశ్వరుడు

---

27. "When I was in England in 1836 the learned H. H. Wilson desired me to as certain and describe the peculiarities of the Jangams..."

    (The Journal of the Royal Asiatic Society, New Series; 1871; page-141.)

28. "This symbol is as separate from indecency in the Hindu mind as circumcision is in the Musulman mind." (Ibidem; page-142.)

29. "The adventures of Basava, and his death in A. D. 1168 (Coeval with that of Thomas-a-Becket) are narrated in the Bssava Puran: of which I many years ago printed an abridgment in English." (Ibidem; page-142).

కర్మకాండను చాలవరకు తగ్గించి, ధర్మమును సుగమము చేసెననియు బ్రౌనుదొర చెప్పెను[30]. ఈ వ్యాసమున బసవేశ్వరుని జీవిత చరిత్రను గురించియు, తత్కాల రాజకీయ సాంఘిక పరిస్థితులను గూర్చియు కూడ వ్రాసెను. వీరశైవమునకు సంబంధించిన రచనలన్నింటిలోను "ప్రభులింగ లీలలు" ఉత్తమమైనదని అభి భావించెను[31]. వ్యాసముయొక్క తుదను, జంగములును మిగిలిన హిందువుల వలెనే యోగ్యులని వ్రాసి తన సౌజన్యమును బ్రౌనుదొర ప్రకటించెను.[32]

"రాయల్ ఏషియాటిక్ జర్నల్"లోనే, బ్రౌనుదొర "మలబార్, కోర మండల్, క్విలాన్" ('on Malabar, Coromandel, Quilon etc' ) అను మాటలమీద ఒక వ్యాసమును వ్రాసి, వాటికి వ్యుత్పత్తిని తనకు తోచినట్లు చెప్పెను "మలబార్" అను మాట "ము-అబ్బర్" (Mu-abbar) అను మాట నుండి ("from beyond" the sea.) వచ్చినదనియు, అదియే కాలక్రమమున, ట్రావెన్కూర్ (Travancore) లోని స్థానికులైన 'సిరియా క్రైస్తవులు' (Syrian Christians) సిరియా లిపిలో వ్రాయుటలో పొరపాటువలన "మలబార్"గా మారి యుండవచ్చుననియు, అతన ఊహించెను[33]

---

30. "Basava......declared that all holiness consisted in three things Guru, Linga, Jangam... .. " (Ibidem. page-143).

    13వ శతాబ్దిలో బయలుదేరిన పాల్కురికి గ్రంథములను-15, 16 శతాబ్దులలో శ్రీనాథుడు, పిడుపర్తి సోమనాథుడు ప్రచారములోకు తెచ్చిరి. 19వ శతాబ్దిలో C.P. Brown వాటిని ఉద్ధరించెను.

31. "The Prabhu Linga Lila is the most pleasing of these volumes...,, (Ibidem ; page-144.)

32. "......I consider them quite as good as other Hindus : and the English...will find agreeable and profitable reading in the volumes written in verse by the Jangams". (Ibidem ; page-146.)

33. "The Arabs and Africans who first visited the West coast of India, came "Mu-abbar": "from beyond" the sea. In the voyages of Ibn Batuta...the country is called Muabbar, without any surmise that this is Malabar. The Syrian Christians who live in Travancore wrote in Syriac characters... and it has occurred to me that in careless writing this may have been altered into .. Malabar : ". (Ibidem ; page-147.)

మద్రాసునకు సమీపమునగల "కురుమణల్" ("Black sand" అను గ్రామ నామమునుబట్టి, పోర్చుగీసువారు తీరమునకు "కోరమండల్" (Coromandel) అని పేరుపెట్టిరనియు, ఇది వారి ఉచ్చారణవలన వచ్చిన మార్పనియు బ్రౌనుదొర వ్రాసెను[34]. "కొల్లం" అను మాట పాశ్చాత్యుల ఉచ్చారణలో "క్విలాన్" (Quilon) గా మారినదనియు నాయన వ్రాసెను[35].

బ్రౌనుదొరకు "మరాఠీ" కూడ బాగుగ తెలియును. ఆ భాషలో "హైదరలీ-టిప్పుసుల్తానుల చరిత్ర" గల గ్రంథమొకటి ఆయనకు లభింపగనే, దానిని విషయ వివరణముతోబాటు ఆంగ్లమున అనువదించి, 1849లో ముద్రించెను. ఇది చరిత్ర పరిశోధకులకు చాల సాయపడు గ్రంథము. ఇది బ్రిటిషు మ్యూజియమునందు గలదు.[36].

"మిరాశీ స్వామ్యము" (ఎల్లిస్, బ్లాక్ బర్న్, మన్రో దొరలు సేకరించిన గ్రంథ విషయము)నకు సంబంధించిన గ్రంథమును, నూతన సంస్కరణలతో ముద్రణమునకు 1850లో బ్రౌనుదొర సిద్ధముచేసి, 1852లో దానిని ముద్రించెను. నాడిది మంచి ప్రచారమున నుండెను.[37].

బ్రౌనుదొర తెలుగులోనుండి ఇంగ్లీషులోనికి అనువాదముచేసిన గ్రంథములలో, "రాజుల యుద్ధములు" (The Wars of the Rajas) అను "అనంతపురం చరిత్ర", ఐతిహాసిక ప్రాముఖ్యము గలది. 1750-1810 ప్రాంతమున

---

34. "A mile or two north of Madras-town there is a fishing village called Kurumanil కురుమనిల్ or 'Black sand' : the earliest Portuguese sailors pronounced this Coromandel, and called the whole coast by this name ; which is unknown to the Hindus".

(Ibidem page-148.)

బ్రౌనుదొర వ్యుత్పత్తులను అందరును అంగీకరింపకపోవచ్చును :

35. "...and Kollam is modernized into Quilon." (page-148.)

36. "Ramachandra Rava Panganuri - Memoirs of Hyder and Tippoo... Translated...and illustrated with annotations, by C. P. Brown, 1849."

37. "Th.ee Treatises on Mirasi Right : by...F. W. Ellis ... Lieutenant Colonel Black Burne... Sir T. Munro...with the remarks made by the ... Court of Directors, 1822 and 1824 ... Edited by C. P. Brown ; Madras-1852".

రచింపబడిన ఇది, బ్రౌనుదొరచే, ఆంగ్లానువాదముతోబాటు మద్రాసునుండి 1858లో ప్రచురింపబడినది. దీని ముఖపత్ర మిట్లున్నది:

The
Wars of the Rajas
being the
History of Anantapuram

— —

Written in Telugu; in or about the year
1750 - 1810
Translated into English
by
Charles Philip Brown
of the Madras Civil Service
Telugu Translator to Govt.
Senior Member of the College Board Etc.

— —

Madras
Printed at the C. K. S's Press
Church Street, Vepery,
1858

ఇది తెలుగులో తొమ్మిది అధ్యాయముల, డెబ్బది తొమ్మిది పుటల గ్రంథము. చక్కని వ్యావహారిక భాషలో రచింపబడినది. అనంతపురం జిల్లాలో ప్రచలితమై యున్న కథ లిందుగలవు. డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి గారిచే రచింప బడి పేరు పొందిన "ముసలమ్మ మరణము" కావ్యమునకు మూలమైన కథ ఇందు న్నది. ఒక విధముగా చూచినచో, ఇది "హండే" వారి వంశ చరిత్ర అని చెప్ప వచ్చును. ఆ వంశము యొక్క చరిత్ర; ప్రారంభము నుండి గ్రంథము ముగియు నప్పటికి "జీవంతుడై" ఉన్న "శిద్ద రామప్ప" వరకు, ఇందు వర్ణితమైనది. గ్రంథాంతమునగల, క్రింది వాక్యములే ఇందులకు నిదర్శనము :

"శాలివాహన శకం 1733 అగు నేటి ప్రజోత్పత్తి నామ సం॥ వైశాఖ శుద్ధ॥ 15 ల నరికి జీవంతుడై వున్నాడు. (శిద్ద రామప్ప), యీ హండేవారి మర్యాదలు;

వీరు శివభక్తులు, లింగవంతులు. వీరికి కులదైవమున్ను యిష్టదైవమున్ను అయిన విజాపురం శీమలోవున్న సొన్నలాపురం శిద్ధరామేశ్వరుణ్ని గాని యితర దేవతలను కొలవరు. శివపూజచేయకగాని, గంగపానం చేయరు. మధురాహారముతే గాని, మధుమాంస భక్షణ చేయరు. యీడేరిన చిన్నదాన్ని వివాహము చేసు కోరు. కాలప్రమాణం తీరి నష్టము అయితే, వీరశైవాచార పద్ధతిగా సమాధి చేస్తున్నారు[38].

ఈ గ్రంథముయొక్క ప్రారంభ మిటున్నది —

"పంపాతీరమందు, విద్యానగరమును బుక్క రాయలవారు యేలు చున్నండగా, అతనికి ప్రధానియైన చిక్కప్పవొడయరు శాలివాహన శకం 1286 అగు నేటి క్రోధి సంవత్సరమందు ఆ విద్యానగరమునకు దక్షిణ ప్రాంత్య మందు, నందేల తాలూకాలో దేవడకొండ దగ్గిర కంబుగిరి స్వామి కొండలో పుట్టివస్తూవుండిన పాండునదిని చూచి, దాన్ని దేవడకొండకు అడ్డము కట్టి, వొక తటాక నిర్మాణముచేసి..."[39]

ఇంకు తూర్పిండియా కంపెనీ వారితో, ఈ "పాండే" వారికి సంభవించిన లావాదేవీలు కూడ వర్ణితము అగుటచేతను, తరువాత ఉభయులకు పొత్తుకుదురుట కూడ వర్ణింపబడుటచేతను; దీనికి నాడు రాజకీయ ప్రాముఖ్యముకలిగి, బ్రౌను దొర దీనిని ఆంగ్లీకరించుట జరిగినది. ఆంధ్రదేశములోని అనంతపుర ప్రాంత మున "కంపెనీ" వారి పలుకుబడి ఎట్లు వ్యాపించినదో తెలిసికొనుటకు ఈ ఐతి హాసిక రచన మిక్కిలి ఉపకరించును. ఆంగ్లానువాదము నాటి పాశ్చాత్యుల కుప యోగించినట్లే, తెనుగు రచన నేటి తెనుగువారికి పనికివచ్చును.

ఉద్యోగ ధర్మము ననుసరించి ఆంధ్రభాష నేర్చుకొనుచున్న ఆంగ్లేయోద్యో గులకొరకు, నాడు క్రొత్తగా ప్రభుత్వముచే స్థాపింపబడిన బడులలో బాలురు చదువుటకొరకు; బ్రౌనుదొర కాలమునాడు, ఆంధ్రదేశమున కథావాఙ్మయము విశేషముగ వ్యాప్తికివచ్చినది మహాపండితులైనవారు వ్యావహారికభాషలో ఈసాహి త్యమునుసృష్టించుట నాటి వింత. రావిపాటిగురుమూర్తిశాస్త్రిగారి వంటిపండితా

38. The Wars of the Rajas - 1853; page - 79. (para - 18.)

39. Ibidem. Page - 1 (Para - 1.) డాక్టరు కట్టమంచి రామలింగా రెడ్డిగారు "ముసలమ్మ మరణము" మొదటి కూర్పులో – "ఒకానొక త్రిలింగ దేశీయు నిచే వ్రాయబడి, బ్రౌన్ దొరగారిచే ప్రకటింపబడిన" అనంతపుర చరిత్రము అను గ్రంథము నుండి ఇందలి కథ గైకొంటిని", అని వ్రాసిరి.

ఖండలుడు (1770-1838)· వ్యావహారిక భాషలో "విక్రమార్కుని కథలు" (1819). "పంచతంత్ర కథలు" (1834) మొదలైనవి రచించి ఈ ఉద్యమము నకు చాల సాహాయ్యము చేసెను.

ఈ మార్గముననే పోయినవి "తాతాచారి కథలు", వీనిని తన పండితు డైన తాతాచారి చెప్పగా బ్రౌనుదొర సంకలనముచేసి 1855లో ప్రకటించెను.[40] దీనికి ఆంగ్లమున "పాప్యులర్ తెలుగు టేల్స్ (Popular Telugu Tales) అని పేరు. ఈ పండితుని మెచ్చుకొనుచు, పీఠికలో బ్రౌనుదొర వ్రాసినదానిని

---

40. గ్రంథము యొక్క Preface, ఏప్రిల్ 17 వ తేది (1855) ని, మద్రాసులో వ్రాయబడినది. ఇందలి మొదటి పేరాను - తాతాచారికి సంబంధించిన దానిని - ఇచ్చుచున్నాను. "Preface".

**"The following tales were recited to me by Tatachari, a learned Bramin (a native of Nellore) who died in my employ in the year 1843. Tatachari uses a style free from pedantry ; his tales were written down from his dictation : and furnish good models of the colloquial Telugu. Several turn upon points of Sanscrit learning." (17th April, 1855 Madras) Charles Philip Brown.**
"విషయములు" తరువాత "Notice Regarding Tatachari." అని, తెలుగు భాషలో క్రింది వాక్యములు కలవు :

"నెల్లూరు దేశస్థుడైన తాతాచార్యులు కావ్యతర్క వ్యాకరణముల యందు నిండా ప్రవీణత గలవాడు. యితను ప్లవనామ సంవత్సరమునకు సరిఅయిన ౧౮౪౧ లో సం॥లో చెన్నపట్నములో వుండే, సి.పి. బ్రౌన్ దొర గారి వద్దకి వచ్చి తాను బ్రతికివుండిన పర్యంతరము ఆయనవద్ద కొలువులో వుండినాడు. యీ తాతాచార్యులు నిండా పెద్దమనిషి సరసుడు గనుక, సంభాషణలో సమయోచితమైన చిత్ర చిత్రకథలు చెప్పుతూ వచ్చినాడు. ఆ కథలు క్రమముగా వొక గ్రంథముగా వ్రాయించి వాటితో కూడా వేరే కొన్ని కథలు చేర్చి వొక గ్రంథముగా అచ్చువేయడమైనది." C.P. Brown.

బట్టి; ఆ పండితుని వ్యక్తిత్వమును, బ్రౌనుదొర సౌజన్యమును మనకు తెలియుచున్నది. దీని ముఖపత్ర మిట్లున్నది :

తా తా చా రి క థ లు

Popular Telugu Tales

By

Tatachari

---

Collected And Published by

Charles Philip Brown

---

Madras

Printed by D.P.L.C. Connoe, At the Christian Knowledge Society's Press, Church street, Vepery.

1855

ఆనాటి పండితులు, పాఠశాలలలో ఈ వ్యావహారిక కథలను పాఠముచెప్పినట్లు తెలియుచున్నది. వారు, వీటిని తరచుగా పరీక్షలలో విద్యార్థులకు అనువాదము నకై ఇచ్చెడివారు. ఈ కథలు వ్యావహారిక భాషకు చక్కని నిదర్శనములని బ్రౌనుదొర అభిప్రాయపడెను.

ఈ కథలతోబాటు- హైదరలీ జీవితమునకు సంబంధించిన ఒక ఘట్టము ("హాలీముఖాన్ మోసపోయిన కథ") కూడ ముద్రింపబడినది. ఇంక కొన్ని ఆఖ్యానాత్మకములైన వచనములు ("గాలివాన కథ") కూడ ఇందులో కలవు. ఈ గాలివాన 1851 మే నెలలో మద్రాసు, తత్పరిసరములయందు వచ్చినది. ఇంకను తనదగ్గిర ఉన్న కొన్ని కథలను ముద్రించుటకు ముందే, అనారోగ్య కారణమున బ్రౌనుదొర స్వదేశమునకు తరలిపోయెను.

ఆ రోజులలో, ప్రజలు నిత్య వ్యవహారమున తెలుగు పంచాంగమునే వాడుచుండిరి. శాలివాహన శకమే వాడుకలోనుండెను. కాని, క్రమక్రమముగా ఇంగ్లీషువారి పరిపాలన స్థిరపడజొచ్చిన తరువాత; శక సంవత్సరమును, క్రీస్తుశకమును కూడ ప్రజలు నిత్యజీవితమున ఉపయోగింపజొచ్చిరి. ఐనను, ప్రజలు తమ జాబులలో అధికారులకు చేసికొను విన్నపములలో, గ్రామాధికారులు

పంపు రిపోర్టులలో, తెలుగు తిథులనే వాడుచుండిరి. కాలక్రమమున, ఇంగ్లీషు-తెలుగు తేదీలు గల పంచాంగములు అచ్చయిన తరువాత, ఇంగ్లీషు తేదీలు ప్రచారమునకు వచ్చెను. "తెలుగు రీడరు"నకు తాను చేసిన ఆంగ్లానువాదములో, తేదీలను గూర్చి వ్రాయునప్పుడు, నాటి పరిస్థితులను బ్రౌనుదొర, ఇట్లు రెండు స్థలములందు, ప్రస్ఫుటీకరించెను :

"The Villager's reports are always dated according to the Hindu Calendar : explained in the Ephemeris which I lately printed. But in all the police offices, there are printed Telugu or Tamil almanacks which show the English date. Thus the English system is becoming known throughout Southern India."[41]

"The English dates are coming into use among Hindus : and are ascertained by means of almanacks printed yearly in Sanscrit, in the Telugu character. But among themselves the Hindus still use only ancient Hindu method."[42]

ఇందు బ్రౌనుదొర పేర్కొన్న "పంచాగము"ను ఆయనయే, 1850లో అచ్చు వేయించెను. ఇది ఆయన పర్యవేక్షణమున జ్యోతిష్య డొకడు గుణించెను. క్రీ॥ శ॥ 1751 నుండి 1850 వరకును గల కాలమానమునకు సరియైన ఆంగ్ల, హిందు, ముస్లిమ్ కాలములను తెలుపు పంచాంగమిది. ఇది ఆరువందల పుటల గ్రంథము. ఒక్కొక్క పుట, రెండు నెలల పంచాగము నిచ్చును. గవర్నమెంటు ఆఫీసులలో ఉపయోగించుట కొరకు బ్రౌనుదొర దీనిని ప్రభుత్వము కోరికపై సిద్ధము చేయించెను[43]. దీని విషయమై ఆయన కావించిన పర్యవేక్షణము, ఆయన సర్వతోముఖ ప్రతిభకు నిదర్శనము.

తన నిర్విరామకృషిచే బ్రౌనుదొర అలంకరించిన ఇంకొకరంగము చరిత్రకు సంబంధించినది; కాలనిర్ణయ విషయకమైనది. కల్నల్ కాలిన్ మెకంజీ, సేక

---

41. English Translation of the Telugu Reader; Page - 34.

42. Ibidem ; Page-55.

43. "...Ephemeris, showing the corresponding dates according to the English, Hindu and Mussalman Calendars, from A. D. 1751 to A. D. 1850."

(Some Account of the Literary Life of C. P. Brown.)

రించిన లిఖిత పుస్తకములను, ఐతిహాసిక సామగ్రిని, పరిశీలించునప్పుడు; కాల క్రమ నిర్ణయముచేసి, చరిత్రను పరిశోధింపవలెనను కుతూహలము బ్రౌనుదొరకు కలిగెను. వివిధ దాక్షిణాత్య భాషలలోగల, సామగ్రిని ఉపయోగించుకొనుటకు తగిన పాండిత్యమును, ఉత్సాహమును గల బ్రౌనుదొర ఈ పనికి పూనుకొనెను. నాడు తెలుగుదేశ చరిత్ర, కాలక్రమాను సారముగ వ్రాయబడిలేదు. ఆధారములును తక్కువ నే యుండెను. ఉన్న సామగ్రియు, 'దారి తెన్ను' లేని మహారణ్యమువలె గజిబిజిగా ఉండెను. ఆ మహారణ్యములో దారి ఏర్పరిచి, కొన్ని కొన్ని మజిలీలను స్థాపించుటకు బ్రౌనుదొర సంకల్పించినను; ఆయనకు సాయము చేసిన వారుగాని, చేయగలిగిన వారుగాని ఎవరును లేరైరి. తుదకు సహజమైన ధైర్యముతో బ్రౌనుదొర మిక్కిలి శ్రమపడి, చరిత్రయందు పూర్వాపర తిథులను నిర్ణయించి; తేదీ ప్రక్కను ఐతిహాసిక విషయమును వేయుచువచ్చి ఐదు సంవత్సరముల కృషి తరువాత తొమ్మిదివందల సంవత్సరముల చరిత్రను కాలక్రమాను సారముగా సరిపెట్టెను[44]. ఈ పని చాల కష్టముతో కూడినది. సామగ్రి చాల వరకు సిద్ధముగనున్న నేటి కాలమందే, ఈపని "ప్రత్తిపని"! నాటి సంగతి చెప్ప నక్కర లేదుగదా!

తెలుగు కన్నడ దేశముల చరిత్రకు సంబంధించిన "పట్టికలు" (Cyclic Tables of Hindu and Mahomedan Chronology, regarding the History of the Telugu and Kannadi Countries) మద్రాసులో

---

44. "At the end of five years, reading whenever I had leisure, I was in possession of a complete clue through nine centuries."

"......Next to the Telugu Grammar, this is the most intricate task I ever undertook. The book will have few readers, but it will solve many a doubt." (Ibidem)

ఎప్పుడో కలుగు సంశయము నివారింపబడుటకై బ్రౌనుదొర ఇంత శ్రమ పడినాడన్నచో, ఆయన పరిశోధనా దృష్టి స్వయం వ్యక్తముగదా!

1850 లో బ్రౌనుదొరచే ముద్రింపబడెను. ఇందలి విషయసూచికలో. గ్రంథమున పది అంశములున్నట్లుగా చూపబడినది. అవి ఇవి :

1. Cyclic Tables A. D. 967 until 1866.
2. Synonymous key.[45]
3. Index to Dates.[46]
4. Table of Kali, Salivahana Sakam, and A. D.
5. Enigmatical phrases for Numerals.
6. On names used in the Zodiac.
7. Geneological Notices— మైసూరు, యాదవ, విజయనగర, చాళుక్య, కొంకణ, కొల్లం family and era.
8. On fragments of earlier History.
9. On the Kali era.
10. On Hejri, Vilayati and Samvat.

ఈ "విషయ సూచిక"యే, గ్రంథము సిద్ధముచేసిన బ్రౌనుదొర యొక్క పాండిత్యమునకు "విజయపతాక".

ముస్లిముల "హిజరి" ని గురించి వ్రాయుచు బ్రౌనుదొర, అది దక్షిణమున క్రీ॥ శ॥ 1600 నుండి బాగుగా కన్పట్టుచున్నదనియు, "ఫసలీ" ననుసరించిన లెక్క క్రీ॥ శ॥ 1660 కంటె ముందు కన్పట్టుట లేదనియు వ్రాసెను[47].

---

45. "In the following two tables any cyclic year in the last three centuries (between the 77th and 82nd cycles) may be easily found... In the first table the sixty names stand in the Indian Cyclic order. In the second they are arranged according to the English alphabet" (Cyclic Tables by C. P. Brown-1850.)

46. ఉదాహరణార్థము, ఒక పేరు దగ్గర వ్రాయబడినదానిని చూపుచున్నాను

"Tanisha, Tannashah ; a title borne by Abdul Hasn Padshah : who ruled Golconda from 1529. His ministers were Accanna and Madanna, 1539." (Ibidem ; Index )

47. "The Musulman Aera named Hejri was introduced into the Indian Peninsula about A. D. 1600 ; and the Fasli reckoning cannot be discovered in any document earlier than A. D. 1660 "

(Ibidem ; Page - 63.)

తూర్పిండియా కంపెనీ యొక్క "హిందూ గుమాస్తాలు" మాత్రమే "ఫసలీ" లెక్క నుపయోగించు చున్నారనియు ; క్రీ॥ శ॥ 1800 నాటికి దేశము ఇంగ్లీషు వారి చేతులలోనికి రాగానే ఈ లెక్కకు ప్రాముఖ్యము హెచ్చినదనియు, అప్పుడు "ఫసలీ" సంవత్సరము జూలై 13 వ తేదీని వచ్చినందున, నాటినుండి ఇది సౌర మాన సంవత్సరముగ మారి, లెక్కలలోనికి వచ్చినదనియు దీనికి నెలలు లేవనియు; బ్రౌనుదొర విపులముగా వ్రాసెను[48].

తరువాత "కొల్లం" శకమును గూర్చి వ్రాయుచు, ఇది "క్విలాన్" (Quilon) అని నేడు పిలువబడుచున్న నగరమునకు మళయాళ నామమనియు, ఈ శకము కేరళ దేశమున ప్రచారము నందున్నదనియు, ఇది క్రీ॥ శ॥ 825 నుండి వాడుకలో నున్నదనియు, బ్రౌనుదొర వ్రాసెను[49].

"కలి" శకమును గూర్చి ఇందు బ్రౌనుదొర విపులముగా చర్చించెను. క్రీస్తు పూర్వము 3101 లో నిది ప్రారంభమైనదనియు. నాటినుండి హిందువులు, కాలమును అరువది సంవత్సరముల ప్రమాణము ననుసరించి, భాగములుగ విభజించుచు వచ్చిరనియు నాతడు వ్రాసెను. హిందువులు కలియుగము — ప్రమాదినామ సంవత్సర చైత్ర శుద్ధ శుక్రవారము నాడు ప్రారంభమైనదని అందురనియు. అది-అంతకు పూర్వమున్న అరువది సంవత్సరముల ప్రమాణములో, 13 వ సంవత్సరమనియు బ్రౌనుదొర వ్రాసెను. ప్రభవనుండి, మొదటి అరువది సంవత్సరముల

---

48. "The Fasli is used solely by Hindu clerks in the East India Company's service...About the year A. D. 1800 when the country became subject to the English, the Fasli year happened to commence on the 13th of July. Whereupon the English constituted that day as the beginning of the Fasli year : which thereupon was metamorphosed into a solar reckoning : but devoid of months : being a mere official year". (Ibidem ; Page-64.)

48. 'The town of Collam, which we call Quilon has given its name to the aera used in the Malayalam country. That aera is reckoned from about A. D. 823".

ప్రమాణమును లెక్కించినచో, అది కలియొక్క 48 వ సంవత్సర మగుననియు ఆయన విమర్శించి వ్రాసెను[49].

ఈ "పట్టిక" ల తరువాత; ఈ రంగమున వనే ఆయన చేసినకృషి, 1863 లో లండను నుండి "కర్ణాటిక్ క్రోనాలజీ" (Carnatic Chronology) అను పేర గ్రంథ రూపమున వెలువడెను. మనదేశమును విడిచి వెళ్ళిపోయిన తరువాత ఎనిమిది సంవత్సరములకు ఈ పుస్తకము అచ్చయినది. ఇందు "పట్టిక"లోని విషయము కూడ కొంత చేర్చబడినది. "పట్టిక"లు అచ్చగు నాటికి తెలియని విషయములు — చరిత్రకు సంబంధించినవి — కొన్ని తెలియగానే, ఆ విజ్ఞానదృష్టి ననుసరించి "పట్టిక"లలోని విషయమును దిద్ది, ఈ గ్రంథముగ బ్రౌనుదొర పునర్ముద్రణము కావించెను. ఇట్లు "క్రోనాలజీ" కాల పరిణామము ననుసరించి బయలుదేరిన సమగ్ర గ్రంథము. కాని, ఇందును నేటి ఐతిహాసిక విజ్ఞానము ననుసరించి పరీక్షించినచో, దొసగులు కన్పట్టును. తనకాలమునాటికి ఉపలభ్యమానములైన "సామగ్రి"ని బ్రౌనుదొర ఎట్లు వినియోగించుకొనినాడో చూడవలసిన బాధ్యత ముఖ్యమైనది. గనుక, ఆ పరిశీలనమే ఇట చేయబడుచున్నది. ఆధారములంతగా లేని, సామగ్రి విస్తృతముగా లభింపని, ఆ రోజులలో ఈ మాత్రమైనను చేయగలిగినాడే! చేసినాడే! యని మనమాతని కృషిని మెచ్చుకొనుచున్నాము.

"కర్ణాటిక్ క్రోనాలజీ" (Carnatic chronology) యొక్క విషయ సూచికను పరిశీలించినప్పుడు. దీనికిని "కాలనిర్ణయ పట్టిక" (Cyclic Table) కును గల పోలికలు - భేదాలు పొడగట్టును.

---

49. "The Kali Aera or Age of the World commences in the year 6101 before Christ: and the Hindus have measured the years after that date by dividing time into cycles of sixty years each ... they declare that the Kali Yuga is reckoned from Friday (Sudha) the first day of the moon, in the month Chaitra in the year ప్రమాది; which is not the first but the 13th year of the preceding cycle. For the first cycle is reckoned from Prabhava which is the 48th year of the Kali Aera." (Ibidem; Page - 68.)

"Contents"

"Uali, Salivahana, Hejri, Kollam, Samvat, Northern and Southern reckoning ;

On Symbols used for Numbers ;

The Katapayadi System ;

Zodiac ;

A New Titular method of Memory ;

Method of Lunation ;

A Page of The Ephemeris ;

Tippoo's system ;

Historical Notices — Inscriptions A.D. 990 until 1500;

Historical Records — A.D. 1500 to 1868.

Appendix — On the Cycle of Sixty Years ;

On Eclipses;

On Initial days ;

Names of lands and languages ;

Numerous names of the Telugu Country;

Variations in the Calender;

Memoir of Col. Mackenzie ;

List of C. P. Brown's books."

ఈ విధముగా ఇది ఐతిహాసిక విషయములకు. గణిత జ్యోతిష విషయములకు, సాహిత్య సంబంధములైన వాటికి, కూడలి. ఆనాడు తనకు తెలిసిన హిందువుల విజ్ఞాన విషయముల నన్నింటిని, ఈ పుస్తకమున బ్రౌనుదొర ఒక చోటికి చేర్చి నాడు. దీని తరవాత, బ్రౌనుదొర వ్రాసిన ముఖ్యమైన పుస్తకము లేదు. ఈ విధ ముగా 1868 లో అచ్చయిన ఇది. ఆయన రచనలలో విశిష్టమైనది.

ఈ పుస్తకములో, చరిత్రకు సంబంధించిన సామగ్రి నంతటిని, నిర్ణీత పద్ధతిలో చక్కదిద్ది, కాలక్రమానుసారముగా ఒక చోట బ్రౌనుదొర చేర్చినాడు. క్రీ. శ. 1500 వరకు గల చరిత్రను తెలుపుటకు శాసనాధారములను. 1500 మొదలు 1868 వరకు గల చరిత్రను తెలుపుట గ్రంథస్థ సామగ్రిని. బ్రౌనుగారు

ఎనియోగించుకొనెను. క్రీ. శ. 1500 పూర్వమునగల ఐతిహాసిక విషయ వివరణకు : మెకంజీ దొర పండితులు సేకరించి ఉంచిన శాసనములే ముఖ్యాధారములనియు, ఆతని పండితులు కృష్ణానది మొదలు కన్యాకుమారి అగ్రము వరకుగల ప్రాంతమున పర్యటించి, ఐతిహాసిక సామగ్రిని సేకరించిరనియు, బ్రౌను దొర వ్రాసెను[50]. ఆనాటికి, ఈ శాసనములలో చాల భాగము ప్రచురింపబడలేదు. ఈ సామగ్రినంతటిని పరిశోధనాదృష్టితో పరిశీలించి; బ్రౌనుదొర ప్రాచీన రాజ వంశముల వంశవృక్షములను సిద్ధముచేసెను.

ఈ రాజవంశములలో, ఐతిహాసిక ప్రసిద్ధిని పొందిన వంశములనే-యాదవ, చాళుక్య, కొంకణ, విజయనగర, మైసూరు. కొల్లం రాజవంశములనే — బ్రౌను దొర పరిశీలనకు తీసికొని, వారి వారి వంశవృక్షములను, ఆయా రాజుల పరిపాలనా కాలమున జరిగిన ముఖ్య విషయములను ; ఆయన చేర్కొనెను[51]. ఈ రాజుల కాలమును నిర్ణయించుటకు ; హిందువుల కాలనిర్ణయ పద్ధతులు, కాల పరిగణన పద్ధతులు, ముందు తెలిసికొనవలెను గనుక, వాటిని గూర్చి బ్రౌనుదొర ఈ పుస్తకమున తెలిపెను. ఇట్లీ పుస్తకము, ఐతిహాసికముగ - నాడుపలబ్ధమానములైన సామగ్రితో కూడినంత వరకు — పూర్ణమైనదని చెప్పవచ్చును.

ఈ సందర్భమున వ్రాయుచు; కొందరు హిందువుల పద్ధతులను ఖండింతురనియు, తన పని అది కాదనియు, లభించిన సామగ్రి ననుసరించి నిర్వహించుట

---

50. "The following statements... .. are chiefly taken from Sanscrit Inscriptions, engraven on rocks or on temples in Southern India. They were transcribed under the directions of Col. Mackenzie, whose messengers seem to have searched the country between the Krishna and Cape Comorin" (Carnatic Chronology Page-50.).

51. "Having explained the methods of reckoning time, we proceed to various genealogies of Rajas...I have noticed only the families that are of historical importance; the yadavas, Chalukyas, Koncan, Vijayanagar, Mysore, and Collam". (Ibidem ; Preface; Page-V)

మాత్రమే తన పనియనియు వ్రాసి, పరిశోధనలో ఒక ముఖ్యమైన సూత్రమును - సమన్వయము చేయుట అను దానిని—ప్రకటించెను[52].

ఐతిహాసిక కాలమును బ్రౌనుదొర మూడు భాగములుగ విభజించెను. ప్రాచీన కాలమునుండి, క్రీ. శ. 1500 వరకు మొదటి భాగము; 1500 మొదలు 1750 వరకు రెండవ భాగము. 1750 మొదలు 1857 చివరి వరకు మూడవ భాగము[53]. మొదటి భాగములో — హిందూ రాజులు, ముస్లిము నవాబులు పరిపాలించిన కాలమునాటి పరిస్థితులు చెప్పబడినవి. హిందూరాజులను గూర్చి వ్రాయుటకు శాసనాదికమును ప్రజల వాడుకలో నున్న గాథలను, బ్రౌనుదొర వినియోగించుకొనెను. ముస్లిము నవాబులను గూర్చి వ్రాయుటకు "ఫెరిష్టా" యొక్క "దక్కను చరిత్ర" (Ferishta's History of the Deccan) బ్రౌను దొర ఆధారముగా తీసికొనెను[54].

రెండవ భాగమున-మన దేశములో పరాసు, పోర్చుగీసు, డచ్చి కంపెనీల చరిత్ర, వ్రాయబడినది. ప్రారంభమునందు వాటి జయము, రాను రాను అవి అన్నియు అపజయమును పొంది, ఇంగ్లీషు వారికి తావిచ్చిన విధానమును అందు చెప్పబడెను.

---

52. "Some readers will condemn this system as arbitary and intricate. This cannot be helped. It is their plan, and it is my business to explain it." (Ibidem; Preface; Page-II).

53. "In the first portion of this, I have noticed chiefly the occurrences in the Peninsula... drawn chiefly from unpublished Sanscrit inscriptions. The next pages, as far as the year 1750, there are some curious details regarding the rise and fall of the Portuguese dominions, and the prosperity and failure of the French conquerors. After 1750, the English period commences......"

(Ibidem ; Preface; Page-V.)

54. "Regarding Musulman history my chief guide has been Farishta's History of the Deccan; his account, beginning about A. D. 1100 and ending in 1585, is excellently translated by Colonel Briggs, who has rendered the dates clear." (Ibidem)

1750 తరువాత, ఇంగ్లీషు యుగము ప్రారంభమగునియు, దానికి తాను ప్రత్యేకమైన స్థానమిచ్చితిననియు వ్రాయుచు, యావద్భారత చరిత్రలో దక్షిణ ప్రాంతమునకెక్కువ ప్రాముఖ్యమిచ్చితినని బ్రౌనుదొర చెప్పెను. "ఇంగ్లీషు యుగము" చరిత్రను, పూర్ణము చేయుటకై, వివిధములైన పాశ్చాత్య దేశముల రచయితలు, అప్పటప్పట చెప్పిన వాక్యముల నన్నింటిని ఒకచోట చేర్చినట్లును, ఇంత సమగ్రముగ ఐతిహాసిక విషయములు ఒక స్థలమందంతకు పూర్వము ఎచ్చటను లేనట్లును; బ్రౌనుదొర సగర్వముగ వ్రాసెను.[55]

ఇది క్షమింపదగిన గర్వము, నూరు సంవత్సరములకు పూర్వము (1860), మన దేశచరిత్రకు ఒక మార్గమును చూపిన బ్రౌనుదొర వ్రాసినది అతిశయోక్తి అనుటకు వీలు లేదు.

"కర్ణాటిక్ క్రోనాలజీ"లో, ఐతిహాసిక విషయములకు సంబంధించిన భాగముల తరువాత, బ్రౌనుదొర బహుముఖప్రజ్ఞకు నికషోపలములు మన ఖగోళ శాస్త్రమును గూర్చియు జ్యోతిషమును గూర్చియు, ఆయన వ్రాసిన భాగములు. "హిందువు"ల ఘనతను గూర్చి చెప్పుచునే, వారికి చరిత్ర దృష్టి లేకపోవుట శోచనీయమని తలంచినాడు[56]. ఇట్లు మంచి చెడ్డలను వేర్పరచిచెప్పు సత్యతత్పరతయే ఆయనలోని వైశిష్ట్యము.

నాడు సర్ విలియమ్ జోన్స్ మొదలైన పాశ్చాత్య విద్వాంసుల కృషి ఫలితముగా ప్రాచీనమైన భారతీయ ప్రతిభ విదేశములలో గుర్తింపబడుచు వచ్చినది. ఆ తరువాతి తరమునకు చెందిన విద్వాంసుడు బ్రౌనుదొర. ఈయనయు తన

---

55. "After 1750 the English period commences ; and, while I have given particular attention to the South, in later periods the history of all India has been described. I endeavoured to collect all the statements made by authors of all nations ; and believe that this is a more complete Chronology of India that has hitherto appeared. It closes with the end of the great mutiny and the apprehension of Nana Sahib." (Ibidem ; Preface ; Page-V)

56. "The Hindus themselves, laboriously exact in astronomical observations and calculations, have neglected history." (Ibidem ; Preface ; Page - I)

రచనలవలన, పాశ్చాత్యలోకములో — మన ఆధిక్యమును, సాంస్కృతిక రంగములో మన పూర్వులు సాధించిన ఘనవిజయములను, స్థాపించి మన దేశమునకు మహోపకారము చేసెను. "కాలవశమున భారతీయులు పర ప్రభుత్వమునకు లోబడియున్నను, వారు ప్రతిభలేనివారు కారు", అను విషయము బ్రౌనుదొర వంటివారి రచనల వలననే విదేశములలో వెల్లడైనది. నైతికముగ దెబ్బతిని యున్న మనవారికి, ఇట్టి రచనలు ఆత్మవిశ్వాసమును కలిగించినవి.

శాసనములలోను, లిఖిత ప్రతులలోను తేదీలను వ్రాయు పద్ధతిని గూర్చి బ్రౌనుదొర చెప్పుచు, ప్రాచీన భారతీయు లవలంబించినపద్ధతి, తేదీని సులభముగా జ్ఞాపకముంచు కొనుటకు పనికివచ్చునని వ్రాసెను. "దైవజ్ఞ భూషణము" అను గ్రంథమునందు తానా పద్ధతిని చూచినట్లాతడు వ్రాసెను[67]. ఇది మనకు తెలిసిన పద్ధతియే. అంకెలకుబదులుగా; ప్రచారములోనుండి సులభముగా సంఖ్యను జ్ఞప్తికి తీసికొనివచ్చు మాటలను ప్రయోగించుటయే ఆ పద్ధతి. 5 అంకెకు బదులు "శర" మని, 7 నకు బదులు "ఋషి" అని, 9 కి బదులు "గ్రహ" మని — ఇతర సంఖ్యలకు ఇతరములైన సంజ్ఞలను — వాడుట, మనకు తెలిసినదే. కాని, ఇది పాశ్చాత్యులకు క్రొత్త కనుక, దీనిని గూర్చి బ్రౌనుదొర వ్రాసి, నిఘంటువున వలె, ఇట్టి మాటల పట్టికల నిచ్చినాడు.

దీని తరువాత ఆయన "కటపయాది" సూత్రము నిచ్చినాడు. ఇది కూడ అంకెలకు సంబంధించినదే. అంకెలను సులభముగా జ్ఞాపక ముంచుకొనుటకు కల్పింపబడినదే. ఒక అంకెకు ఒక అక్షరము నియమింపబడినది. అక్షరము యొక్క వరుస, అంకె యొక్క స్థానమును (ఒకట్లు, పదులు, వందలు, వేలు) నిర్ణయించును. దీనిని బట్టి పెద్ద పెద్ద అంకెలను గూడ సులభముగా జ్ఞాపకముంచుకొన వచ్చును. పద్యములలోగాని, శ్లోకములలోగాని సంఖ్యను సులువుగా ఇమడ్చవచ్చును. లేదా, సులువుగా అక్షరములలో జ్ఞాపకముంచుకొనవచ్చును.

---

67. "Some dates in Sanscrit inscriptions of the Salivahana Sacam are recorded in words on the plan of a Memoria Technica...... These Jyotish phrases are stated in a book called Daivajna Bhush anam." (Ibidem ; Page - 20.)

## కటపయాది

|  |  |  |  |  |
|---|---|---|---|---|
| 1 | క | ట | ప | య |
| 2 | ఖ | ఠ | ఫ | ర |
| 3 | గ | డ | బ | ల |
| 4 | ఘ | ఢ | భ | వ |
| 5 | ఙ | ణ | మ | శ |
| 6 | చ | త |  | ష |
| 7 | ఛ | థ |  | స |
| 8 | జ | ద |  | హ |
| 9 | ఝ | ధ |  | ళ |
| 0 | ఞ | న |  |  |

ఇందలి హల్లులతో, ఉచ్చారణ సౌలభ్యమునకై అచ్చులు చేర్చబడినవి. వాటికి వేరుగా ఇంక ప్రయోజనము లేదు. ఉదాహరణగా 1798 ని గ్రహింతము. "అంకానాం వామతోగతిః" అను సూత్రమును బట్టి; ఇది 8971 గా వేయబడి, 1798 గా గ్రహింపబడును. పై "కటపయాది" సూత్రమునుబట్టి ఇది—"జధసట" అగును[58].

బ్రౌనుదొర, ఈ గ్రంథములో రాశులను (Zodiac) గూర్చి వ్రాసిన భాగము, మన కుతూహలమును ఇనుమడింప జేయునది. ప్రాచీన భారతీయులు, చంద్రుని యొక్క గమనమును పరీక్షించి చేసిన గణితము, పాశ్చాత్యుల నందరిని ఆశ్చర్యచకితులను చేసినది[59]. ఈ రాశుల పేరులను గూర్చి వ్రాయుచు, బ్రౌను

---

58. "The first syllable written is the unit, then the ten etc. The number 1798 would be written 8971, represented by the syllables 'Jadhasta'. The vowels are not reckoned, being used merely to form syllables. The system is named, after the Hindu fashion, by the first syllables, Ka Ta Pa Ya with adi (etcetra)

(Ibidem. Page - 22.)

59. The unremitted labour of ages has been devoted by the Hindus to perfecting the calculation of the Lunar motions—in which their correctness is surpassed only by the European improvements of very modern times." ('Treatise on the Chronology of the Hindus నుండి బ్రౌనుదొర 'Carnatic Chronology' లో ఉదాహరించెను).

దొర బృహజ్జాతక మందును, జాతక పారిజాతమందును, సంస్కృత నామములతో పాటు గ్రీకు నామములు కూడ శ్లోకములలో గలవని చూపెను. 1827 లో, విష్‌దొర (Mr. Whish) హిందువుల జాతక పరిజ్ఞానమును గూర్చి వ్రాయుచు, పైని పేర్కొనబడిన రెండు సంస్కృత గ్రంథములందును, గ్రీకు మాటలు కలవని, ఆ మాటలుగల శ్లోకములను చూపెను[60]. తనకీవిషయము ముందే తెలియుననియు, విష్‌దొర వ్రాసినది సత్యమనియు బ్రౌనుదొర వ్రాసి ఆ శ్లోకముల నుదాహరించెను. మాటలు. గ్రీకు భాషలోనివి గనుక, సంస్కృతమున వాటి స్వరూపము కొంత మారియున్నది. ఈ మాటలు గల సంస్కృత శ్లోకమున రచయిత. "రాశులకు ఈ పేర్లను గంవు" అని గ్రీకు మాటలను శ్లోకములో నిమిడ్చెను.

బ్రౌనుదొర ఈ రెండు శ్లోకములను; తెలుగు అక్షరములు, గ్రంథాక్షరములు గల మూలములనుండి, ఇంగ్లీషులిపిలో తన పుస్తకమున ఇచ్చెను[61]. బృహజ్జాతక, జాతకపారిజాతము లో ఈ పేరుల విషయమున కొన్ని పాఠభేదములు కలవు. కాని గ్రీకుభాష తెలియని వారిచే, ప్రతులు వ్రాయబడుటచే ఈ పాఠభేదములు చి వని నిర్ణయింపవచ్చును. ఇప్పుడు అచు నమున్న బృహజ్జాతకమున (వావిళ్ల - 1949) ఈ గ్రీకుమాటలు గల శ్లోకము ఇట్లున్నది :

"క్రియ తాబురి జితుమ కులీర లేయ
పాథోన జూక కౌర్ప్యాఖ్యాః ।
తౌక్షిక ఆ కోకేరో, హృద్రోగశ్చాంత్యభం
చేత్థమ్" (శ్లో॥ 8॥)

---

60. On the origin and antiquity of the Hindu Zodiac - Whish C.M.

61. జాతకపారిజాతము — Kriya tauru jutuma kulira
Leya Parthona Juka Korpakhyah
Tawxica Akokero
Hridrog aschsthasih cramasah

(బ్రౌనుదొర ఇచ్చిన పాఠము)

బృహజ్జాతకము — Kriya tavuru jituma kulira
Leya Parthona juaka korpyakhyah
Tauxica Akokero
Hridrog asch - antyabham chettham

(బ్రౌనుదొర ఇచ్చిన పాఠము)

(Carnatic Chronology : Page - 23.)

ఈ శ్లోకములోని మాటలకు గ్రీకు మూలమును, ఇంగ్లీషు అనువాదమును బ్రౌనుదొర ఇట్లు చూపెను[62].

"Krios (the Ram)—Kriya (అని వ్రాయబడినది)
Taurus (the Bull)—Tavuru
Didymus (the twins)—Juthuma, Jituma
Karkinos (the crab)—Kulira ("The only Sanscrjt word

62. Ibidem ; Page - 23.

"I was already aware of the existence of the Greek words in Sanscrit treatises, having met with them in a manuscript key to astrology. It is in the Arya metre, resembling that used by Horace," (C. P. Brown)

కందుకూరి వీరేశలింగం పంతులుగారు (1848-1919) జ్యోతిశ్శాస్త్రము ప్రకృతి శాస్త్రములలో నుత్తమమైనదను భావమున ప్రజలలో గ్రహచారాదుల విషయమున గల మూఢ విశ్వాసములను పారద్రోలవలెనను దృష్టితో 1895లో జ్యోతిశ్శాస్త్రసంగ్రహమును, ప్రాక్పశ్చిమ జ్యోతిశ్శాస్త్ర గ్రంథముల సాయముతో రచించి చిత్రపటములతో ప్రకటించిరి. ఇందు, వరాహమిహిరుడు తన (క్రీ॥శ॥ 6వ శతాబ్ది వాడు) బృహజ్జాతకమున రాశి చక్రమును వర్ణించు సందర్భమున నిచ్చిన శ్లోకము నుదాహరించిరి.

"క్రియ తావురి జితుమ కులీర లేయ పాథోన జూక కౌర్ప్యాఖ్యాః ।
తాక్షిక ఆకోకేరో హృద్రోగశ్చాంత్యభం చేత్థమ్ ॥

ఈ శ్లోకములోని గ్రీకు నామముల అర్థ వివరణ మిది : క్రియ (మేషము) తావురి (వృషభము) జితుమ (మిథునము), కులీర (కర్కాటకము), లేయ (సింహము), పాథోన (కన్య), జూక (తుల), కౌర్పి (వృశ్చికము), తాక్షిక (ధనుస్సు), ఆకోకేర (మకరము), హృద్రోగ (కుంభము, అంత్యభం (మీనము). ఈ నామములలో—కులీర, హృద్రోగ, అంత్యభ శబ్దములు సంస్కృత శబ్దములు. మిగిలినవి గ్రీకు భాషా నామములు.

ఈ సందర్భమున, మన పూర్వులకు యవనుల విజ్ఞానమునందున్న గౌరవమును తెలుపు క్రింది శ్లోకమును (గర్గ సిద్ధాంతము) కూడ పంతులు గారు ఉదాహరించిరి :

"మ్లేచ్ఛాహియవనా స్తేషు సమ్యక్శాస్త్రమిదం స్థితమ్ ।
ఋషివ త్తేపి పూజ్యంతే కింపున ర్దైవవద్ద్విజాః" ॥

I believe Karkina to be the proper word."—C. P. Brown.)

Leon—Leya (the lion)
Parthenos (the virgin)—Parthona
Zygus (the scales)—Juka
Scorpios (the scorpion)—Korpya
Taxicos (the archer)—Taukshica
Aigokeros (the sea-goat)—Akokero
Hydrochoos (Aquarius)—Hridroga
Ichthyes (the fish)—Isthusi"

ఇప్పుడు, సంస్కృత శ్లోకములోని గ్రీకుమాటలు ఎట్లు రూపాంతరములు పొందెనో తెలియుచున్నదిగదా! గ్రీకు భాష తెలియని లేఖకుల వలన ఇట్టి మార్పులు పొందిన వనవచ్చును.

ఇట్లు బ్రౌనుదొర "కర్ణాటిక్ క్రోనాలజీ" లో రాశుల పేర్లను గూర్చి సవిమర్శముగ వ్రాసి, తన పాండిత్యమును ప్రకటించెను.

ఈ అంశములపై రచనలేగాక; అందు తెలుగు, తెనుగు, ఆంధ్ర శబ్దముల విచారము, తెలుగుదేశము యొక్క ఎల్లలు మొదలైన విషయములపై చర్చలు గలవు. గ్రంథాంతమున, కల్నల్ కాలిన్ మెకంజీ యొక్క జీవిత చరిత్ర అతి లఘువుగా వ్రాయబడినది. పుస్తకము; బ్రౌనుదొర అచ్చువేసిన గ్రంథముల పేర్లతో, ముగియుచున్నది. ఈ గ్రంథమున బ్రౌనుదొర తనకు తెలిసిన విషయముల నన్నింటిని, వేరు వేరు శీర్షికల క్రింద ప్రకటించి, లఘు విజ్ఞాన సర్వస్వముగ దానిని రూపొందించినాడు. ఈ విస్తృతిని బట్టియే, దీనిలో ఐతిహాసిక విషయము లందు కొన్ని పొరపాట్లుపడినవి. అందులకు కారణము నాటి విజ్ఞానము పరిమిత ముగ నుండుటయే గాని, వేరేదియు కాదు.

ఈ పుస్తకములో బ్రౌనుదొర చేర్చిన వ్యాసములు కొన్ని, నాటి ప్రముఖ పత్రికలలో అచ్చయినవి. అన్నియు నొకచోట ఉన్నచో బాగుండునని కాబోలు, వాటిని కూడ ఆయన ఇందు చేర్చెను. తాను వేరుగా కొన్ని వందల పుటలలో ముద్రించిన "పంచాగము" (Ephemeris) నుండి, ఒక మాదిరి పుటను కూడ ఇందు చేర్చినాడన్నచో, ఈ "కర్ణాటిక్ క్రోనాలజీ" ని ఎంత సమగ్రముగా చేయ వలెనని బ్రౌనుదొర తలంచెనో తెలియుచున్నది. ఇది లండను నుండి అచ్చగుటచే

బ్రౌనుదొరకు కావలసిన సామగ్రి అంతయు అందుబాటులో నుండి ఈ పుస్తకమున దానిని చేర్చుటకు వీలైనది. దీనిలోని విషయము ఇప్పుడు కొంత పాతపడినను, బ్రౌనుదొర నాటి కృషికి విలువ తగ్గదు.

బ్రౌనుదొర క్రైస్తవ మతమునకు, సాహిత్య దృష్టి ననుసరించి చేసిన సేవ కలదు. ఆయన తన పాండిత్య వైభవమును - బైబిలు సమవాదము చేయుటలోను, వినియోగించెను. ఇట్టివాటిలో ప్రవక్త బలామ్ (Prophet Balaam) నకు సంబంధించిన విషయమొకటి[63]. హీబ్రూ భాష బాగుగా వచ్చిన బ్రౌనుదొర, దానికి సంబంధించిన వాదోపవాదములలో పాల్గొని, ప్రవక్త బలామ్ పేరు ననుసరించి వచ్చు అంకెను, సరిగా లెక్కించెను. ఇది, ఒక లేఖా రూపమున 1847 లో "క్రిస్టియన్ అబ్జర్వర్" (The Christian Observer) పత్రికలో బ్రౌనుదొర ప్రకటించెను.[64] హీబ్రూ భాషయందు దాతనికింత పాండిత్యమున్నది !

---

63. "In 1847 I wrote an article in the Christian Observer in answer to a silly story respecting the Prophet Balaam, in which the Hebrew characters are counted up as equalling 666."

(Some Account of the Literary life of C. P. Brown.

64. ఈపత్రికలో, ఫిబ్రవరి 1847లో (పేజీ.78) ప్రవక్త బలామ్‌గురించి ఇట్లున్నది "If, now, we apply the calculation which the cabalists called gematria to the word Balaam, we find its numerical value to be only 142. But if we take the full title, as it stands in Jos.XIII. 22; Balaam son of Beor Sorcerer, this gives the exact Apocalyptic number, 666." దీనికి సమాధానముగా, డిసెంబరు 1847 లో బ్రౌనుదొర ఈ క్రింది లేఖను ప్రచురించెను:

"To the Editor of the Christian Observer.

Sir,—In your Number for February, page 78, your correspondent M. J. M. has calculated that the name of "Balaam, son of Beor Sorcerer," in Hebrew, gives by caluculation the number 666. But he has not copied the Hebrew letters faithfully. The words are "Balaam, beni Baor ha-Kusem," which summed up, amount to (683) six hundered and eighty-three.

Your Servant,

G. P. O. Madras, 14th Sep. 1847. C. P. B.

(ఇది, డిసెంబరు 1847 పత్రికలో, పుట - 722 లో అచ్చయినది. The Christian Observer, Conducted by Members of the Established Church, London.)

సెయింట్ లూక్ (St. Luke) సువార్తను తెలుగులోనికి అనువాదము చేసి బ్రౌనుదొర దానిని 1838 లో ప్రచురించెను. నాడిది, క్రైస్తవమత ప్రచారము చేయుచుండిన రచనలలో పేర్కొనబడి పొగడబడినది[65]. దీనినే, ఒక పోష్య వర్గమున నున్న ఒక జంగము కవిచే, బ్రౌనుదొర పద్యములోనికి వ్రాయించెను. ఈ పద్యానువాదము 1854 లో ముద్రింపబడినది

ఫ్రాన్సు దేశమునను చెందిన ఒక క్రైస్తవ భక్తురాలి అనుభవములను, బ్రౌనుదొర సంపాదించి 1859 లో ప్రకటించెను. ఇది పద్యరూపమున నున్నది. ఈమె సామాన్యురాలు. పేదరాలు. ధనవంతుల ఇండ్లలో సేవకురాలు. అయినను భగవద్భక్తురాలని పేరు పొందినది. ఈ అనుభవముల రెండవ ముద్రణము బ్రౌనుదొర ప్రకటించెను[66].

బ్రౌనుదొర పరిశోధించి అచ్చువేసిన క్రైస్తవ గ్రంథములలో "నిస్తర రత్నాకరము" ఒకటి. క్రైస్తవ మత ధర్మములను గూర్చి తెలుగు పద్యములలో చెప్పు గ్రంథమిది. దీని పద్యరచన అంత బాగుగా లేక పోవుటవలన, ఒక కవిచే దానిని సరిచేయించి, 1852 లో బ్రౌనుదొర దాని యొక్క 3,000 ప్రతులు అచ్చు వేయించెను. ఈ గ్రంథములోనున్న హిందూమత దూషణమును తొలగించి అచ్చు వేసి, బ్రౌనుదొర తన విశాలదృష్టిని ప్రకటించెను[67].

---

65. (1) 36th Report of the British and Foreign Bible Society, Page - 51

(2) The Bible in Everyland, 1860 ; Page - 141.

66. The Experience of A. Nicolas, (in Verse) Second Edition (Edited by C. P Brown) — 1859.

"Commonly called the good Armelle ; a poormaid servant in France......and yet a noble......servant to the King of Kings."

67. "The Apostles taught Christianity without reviling idols. Why Should not modern teachers imitate this courteous method ?"

(Some Account of the Literary Life of C. P. Brown.)

బైబిలు (The Holy Bible) యొక్క ఆంధ్రానువాదముతో బ్రౌను దొరకు సంబంధమున్నది. ఈయనాంధ్రదేశములో నున్న కాలమందే (1817-1855) బైబిలును తెలుగులోనికి తీసికొని రావలెనను తీవ్రకృషి జరిగినది. తెలుగులో బ్రౌనుదొరకు గల పాండిత్యము, నాటి పాశ్చాత్యులలో సుప్రసిద్ధమైనది గనుక, బైబిలు కమిటీ వారు, ఆయన సాహాయ్యమును అర్థించుట జరిగినది. కాని, కమిటీలోని వారికి తెలుగు సరిగా రాకపోవుటవలన, ఈయన మొట్టమొదట పంపిన మాదిరి తర్జుమాలను వారు నిరాకరించిరట[68].

ఇంక కమిటీ వారికి తేలని సమస్య మరొకటి సంభవించినది. ఏ "గ్రీకు" మూలమును, ఏ "హీబ్రూ" మూలమును గ్రహించి పాఠ నిర్ణయము చేయవలెను అను ప్రశ్నకు వారిలో వారికి ఏకవాక్యత కుదురలేదు. కమిటీలో సభ్యుడయిన రివరెండు టి. బ్రోథర్టన్ (Rev. T Brotherton) అను మిషనరీ, ఈ విషయమును బ్రౌనుదొరకు లేఖ మూలమున తెలియజేయుచు, సభ్యుల వాదోపవాదములకు అంతములేదనియు, ఇవి ఇటులనే కొనసాగినచో తుట్టతుదకు బైబిలు అను వాదమే యుండదనియు, కనుక బ్రౌనుదొర స్వయముగా అనువాదమునకు పూనుకొని, తెలుగు దేశములో "చర్చి"కి పునాది వేయవలెననియు, ప్రార్థించెను[69].

మూల గ్రంథము యొక్క పాఠనిర్ణయమున శ్రమలిట్లుండగా, అనువాద విషయమున బ్రౌనుదొర పడినపాట్లు లెక్కలేనన్ని. తెలుగులోనికి, బైబిలును

---

68. "Meanwhile the Telugu translation of the Bible was carried on though slowly. The Bible Society Committee rejected the first specimens which I prepared, for the members knew nothing of Telugu." (Ibidem.)

69. "In a letter addressed to me by the Rev. T. Brotherton, a Zealous Missionary, a member of the Committee, I find these words. 'The Committee have not decided which edition of the Greek text they will use. The controversy will probably terminate when they have decided that no part of the text is genuine. This will show you that there is no hope of getting a Telugu version of the Old Testament Scriptures. The disputes about the Hebrew text will be endless. You must therefore yourself lay the foundation of the Church in the Telugu country or it will never be founded at all.

(Ibidem

అనువదించు నప్పుడు బ్రౌనుదొర — సంస్కృత, వంగ, తమిళ, మహారాష్ట్ర, కన్నడ భాషలలో గల బైబిలు అనువాదములను తరుచుగా సంప్రతించెడివాడు. అనువాదము పూర్తియైన భాగమును గ్రీకు, హీబ్రూ మూలములతో పోల్చి చూచెడివాడు[70], బహుభాషావేత్తయైన బ్రౌనుదొర, నలుగురైదుగురు - పండితులు చేయవలసిన పనిని తానొక్కడే నిర్వహింప గలిగినాడు. ఇంత పాండిత్యము కమిటీవారికి నచ్చలేదు కాబోలు !

బైబిలును భారతీయ భాషలలోనికి పరివర్తనము చేయుటలో గల ముఖ్య కష్టము, ఆయాభాషలలో తగిన పదజాలము లేకుండుటయే యనియు, కేవల వచనానువాదము వలన మూలములోని సొగసు చెడుననియు బ్రౌనుదొర తన అభిప్రాయమును చెప్పెను[71].

ఎల్లరును అనువాదము చేయగలమను వారేగాని, సరిగా చేయగలిగిన వారు లేరనియు, దేశభాషలను పదిసంవత్సరములైనను, అభ్యసించినగాని ఒక మాదిరి అనువాదమునైనను చేయగలుగుట అసంభవమనియు బ్రౌనుదొర వ్రాసెను[72]. కొందరనువాదకులకు గల దురభిమానము అజ్ఞాన జనితమని కూడ వ్రాసెను.

---

70. "In preparing a Telugu version of the scriptures, I continually used the translations printed in Sanscrit, Bengali, Tamil, Marata and Kannadi: in revision I compared the work with the original Hebrew and Greek. In rendering words I have chiefly adhered to D'oyly and Mants' commentary, and that by Dr. Adam Clarke." (Ibidem)

71. "Many passages which in English seem easy, are hard to translate correctly. In fact to translate the Bible into any one of the Indian Peninsular languages is a task resembling that of making bricks without straw. The words required in some important passages do not exist in Telugu. If the New Testament, written in prose originally, suffers in a literal version how much greater is the sacrifice of elegance when the poetry of Isaiah or David has its carved work beaten to pieces with the hammers of a prose translation." (Ibidem)

72. The wranglings among those who fancy they can translate, arise from want of learning; 'having little they squabble about it. Had they the patience to study for ten years they would be wiser. They talk about translating into Hindu tongues, and pass judgement on translations, while they are mere beginners." (Ibidem)

ఈ వాక్యములో, "కమిటీ" వారు తమ అనువాదమును లెక్కచేయక పోవుటకు సమాధానము కనబడును, అందును, అంతశ్శైత్యములున్నవి గాబోలు !

బైబిలును తెలుగులోని కనువదించునప్పుడు, అనువాదకునకు మూలములోని మాటలకు తగిన పదములు తెలుగులో దొరకనప్పుడు, మూలములోని మాటలనే వర్ణక్రమ పద్ధతిని వ్రాసి విడుచుట మంచిదని బ్రౌనుదొర యూహ. తన యనువాదమున కొన్నిచోట్ల బ్రౌనుదొర ఈ పద్ధతినే యవలంబించెను. క్రైస్తవ మతమునకు జీవగఱ్ఱలైన; బాప్టిజమ్ (Baptism), వైన్ (wine) మొదలైన మాటలను: అర్థానుసారముగ అనువాదము చేసినచో, వాటికిగల ధార్మికార్థము సరిగా రాదుగనుక వాటినట్లే, బ్రౌనుదొర తన యనువాదమున నుంచెను[73]. కొన్నిచోట్ల క్రొత్తమాటలను సృష్టించి, ప్రయోగించెను. మిగిలిన భాషలలో వలెనే, తెలుగులో కూడ, క్రైస్తవమతము నూతన పదజాలమును సృష్టించి, ప్రచారమునకు తెచ్చునని బ్రౌనుదొర వ్రాసెను[74].

తెలుగు బైబిలు 1857-1860 సంవత్సరముల నడుమ, మద్రాసు నుండి పూర్తిగా ప్రచురింపబడెను. ముఖపత్రమును బట్టి ఆది "గార్డన్" "ప్రిచెట్" అను దొరలచే, 1816-1840 సంవత్సరముల మధ్యకాలమున, అనువాదము చేయబడినదని తెలియుచున్నది. కాని, దానిలోని చాలభాగము బ్రౌనుదొర ఇంటిలో

---

73. "In preparing a new Telugu version of the Holy Bible (a task which I commenced twenty years age) I have retained a few words untranslated, for instance, Wine: which is derived through Greek and Latin from Hebrew. All the versions say draxa rasam (grape juice) but this is not correct. We might as well use wool for shawl or silk instead of ballon . . Some words, as "baptism" should be preserved untranslated ..." (English - Telugu Dictionary ; Page - 5)

74. "In Tamil and Telugu, as well as in Greek and Latin, Christianity will gradually produce a some what new dialect: in Tamil it is already perciptible." (Ibidem)

సిద్ధము చేయబడినదట[75]: ఇదియే 1858లో, "వార్డ్లా" "హే" దొరల అనువాదముగా (Wardlaw and Hays' version) చిన్న చిన్న మార్పులతో ప్రచురింపబడినదట : ఈ మార్పులంత పేర్కొనదగినవి కావని, బ్రౌనుదొర వ్రాసెను.

ఈ విధముగా బ్రౌనుదొర, క్రైస్తవ మత సంబంధమైన గ్రంథముల విషయమునను కష్టపడి పనిచేసెను. ఆంధ్రభాషా సాహిత్యముల అభివృద్ధికి ఆయన కృషిచేసినంత మాత్రమున, ఆయన తన దేశాభిమానమునుగాని, మతాభిమానమును గాని విడిచినాడని తలంపరాదు. నాడుగాని నేడుగాని, విడువవలెనని ఎవరును వాంఛింపరు. ఇవన్నియును వ్యక్తి గతములైనవి. వీటివలన సంకుచితత్వ పరిమితత్వములు మానవత్వమునకు రానంత వరకు, ఇతరులకివి అనావశ్యకములు. వీటివలన బ్రౌనుదొరకు, సంకుచితత్వ పరిమితత్వములు వచ్చినట్లు లేదు !

తెలుగు భాష నేర్చుకొనగోరు ఆంధ్రేతరులకు-ముఖ్యముగా నాటి ఇంగ్లీషు వారికి - పనికివచ్చు గ్రంథజాలము నంతటిని, బ్రౌనుదొర ఒక్కడును సంసిద్ధము చేయగలిగెను. తెలుగునకై వ్యాకరణము ఛందస్సు, వాచకములు, నిఘంటువులు మొదలగునవి వ్రాసి తెలుగు నేర్చుకొనుటకు కావలసిన సమగ్రపుస్తక సంపత్తిని కల్పించిన ఖ్యాతి బ్రౌనుదొరకు దక్కినది. వాచకములో మొదటి భాగములో కథలు, ఉత్తరములు, నేరముల విచారణలు : ప్రజల భాషలో ప్రజలనుగురించి కలవు. రెండవ భాగములో అంగ్లానువాదము : మూడవ భాగములో వ్యాకరణాంశములు. చిన్న నిఘంటువుకలవు. ఇది తెలుగునేర్చుకొనగోరు విదేశస్థులకును

---

75. "The title page states that it is the translation prepared by Messrs. Gordon and Pritchett in the years 1815 - 1840, but the phraseology shews that many pages are printed from the version prepared in my house." (Some Account of the Literary Life of C.P. Brown.)

అంగ్లము నేర్చుకొను స్వదేశస్థులకును కూడ ఉపయోగపడునట్లు వ్రాయబడినది. దీని ముఖపత్ర మిట్లున్నది :

The Telugu Reader

Being

A Series of Letters, Private and on Business :

Police and Revenue Matters,

with

An English Translation,

Notes explaining the Grammar

And

A little Lexicon

By

Charles Philip Brown

Madras Civil Service,

Member of the College Board, Telugu

Translator to Government, Etc.

Madras.

Printed at the Christian Knowledge Society's Press,

Church Street, Vepery.

1852

దీని పీఠికలో ; తెలుగు నేర్చుకొనగోరువారికి, ఇంగ్లీషు నేర్చుకొనగోరు స్వదేశీయులకు పనికిరావలెనను ఊహతో నిది వ్రాయబడినదని చెప్పబడెను[76].

దీనిలోని ఒక "మాదిరి కథ" క్రింద ఉదాహరింపబడెను. ఇది మొదటి భాగములోనిది. వ్యావహారిక భాషకు విశేష గౌరవమును తన నిఘంటువులందు కల్పించిన బ్రౌనుదొర, ఈ కథను వ్యావహారిక భాషయందే ఉంచెను.

ఒక దినము, వొక బ్రాహ్మణుడు వొక వూరికి పోతూవుండెను. అప్పుడు చాలా యెండగావుండెను, గనుక, అ బ్రాహ్మణుడు మిక్కిలి అలసి, దోవలో వొక తాటిచెట్టు కింద కూర్చుండి పాలుతాగుతూ వుండెను, అప్పుడు, అక్కడికి కాస్తదూరములోవున్న కొందరు బ్రాహ్మణులు అతణ్ణి చూచి, యీ బ్రాహ్మణుడు తాటిచెట్టు క్రింద కూర్చుండి, యేమి తాగినాడని, విచారించగా, తాటిచెట్టులో కల్లు అవుతున్నది ; బ్రాహ్మణులు కల్లు త్రాగరాదు : ఈ బ్రాహ్మణుడు కల్లు తాగినాడని, వారిలో కొందరు చెప్పిరి. అంతట, అందరున్ను అతణ్ని దూషించిరి కాబట్టి, చెడ్డస్థలములో చేసిన మంచి పనులున్ను చెడ్డపనులుగానే యెంచబడును."

(Page - 5.)

ఈ "తెలుగు వాచకము"లోని విషయములకు "ఆంగ్లానువాదము" నొక దానిని ; "English Translations of the Exercises and Documents printed in the Telugu Reader," సిద్ధముచేసి బ్రౌనుదొర దానిని 1852లోనే ముద్రించెను దీనిలోని విషయమును కొంత గ్రహించుటకు, ఆంగ్లానువాదములోని కొన్ని వ్యాకములను చూపుచున్నాను. Baron-రాజు ; Carriage-బండి (Bandy)"

"The student will observe that the full stop is here used in English, but in Telugu the sentence runs on."

(Page12)

తెలుగులో విరామచిహ్నములు విరివిగవాడబడుట, పాశ్చాత్య సంపర్కము మనకు కలిగిన తరువాతనే అను విషయము ప్రాచీన తాళపత్ర గ్రంథములను చూచినవారి కందరికిని తెలిసిన విషయమేగదా !

---

76. "This volume is intended to aid those gentlemen who are commencing the study of Telugu and those natives who wish to learn English" (Ibidem)

బ్రౌనుదొర, "తెలుగు వాచకము"లో తాను ముద్రించిన ఒక లేఖలోని ప్రథమభాగముయొక్క అంగ్లానువాదము, నిట్లు ప్రకటించెను:

"Addressed to my mother Achamma, sacred as the holy streams of Ganga and Bhagirathi; (this mode of address is used to widows) your son Jatalkoti Kuppaya writes as follows.'' (Page - 25)

వితంతువులను సంబోధించి వ్రాయునపుడు "గంగాభాగీరథీ సమానురాలు" అని వ్రాయుట మన సంప్రదాయముగదా! ఈ విషయమునే బ్రౌనుదొర, పై అంగ్లాను వాదములో కుండలీకరణ భాగమున వివరించెను,— మన సంప్రదాయ ములనుగురించి ఆయన కంత తెలియును!

"తెలుగువాచకము" తరువాత బ్రౌనుదొర సంసిద్ధము చేసినది "వాక్యావళి" ఇంగ్లీషు వ్యాకరణమునకు సంబంధించిన విషయములు, అభ్యాసములు ఇందుకలవు. "పియర్ సన్" వంగభాష వాల్యూము ననుసరించి ఇది వ్రాయబడినదట.[77] అది తెలుగు, హిందూస్థానీ, తమిళ భాషలలో అచ్చువేయబడినది. తెలుగు - ఇంగ్లీషు సంభాషణలు" Dialogues in Telugu and English with a Grammatical Analysis (Second Edition — 1853, Madras); "రూప భేదములతో వుండేటటువంటి ఇంగ్లీషు భిన్నరూప క్రియలయొక్క మాలిక" (A Catalogue of Irregular Verbs in the English Language, with their inflections); "లఘు నిఘంటువు" (A Little Lexicon, explaining such words as occur in the first three chapters of the Telugu Dialogues — Madras, 1852) మొదలగునవి వేరు వేరుగా అచ్చువేయించి బ్రౌనుదొర తన కృషి అందరికిని అందుబాటుగ చేసెను. తన "సంభాషణలు" (Dialogues In Telugu and English) అను పుస్తక పీఠికలో, తెలుగు పదజాలము ప్రారంభకులు గ్రహించుటకు "సంభాషణలు"

---

77. "...a series of exercises in English grammar, copied from Pearson's Bengali Volume ... (Ibidem)

చాల తోడ్పడునని వ్రాసెను. ఇది కన్నడ తమిళ భాషలలో కూడ ముద్రింప బడెనట[78] దీనిలోని రచనా విధానము తెలియుటకై ఒక ఉదాహరణము నిచ్చుచున్నాను (Dialogues - Page - 32) "నిప్పులు కురుస్తున్నవి - It rains flames. (A Hindu phrase) నిప్పులు Fires; noun. plu. of నిప్పు n.s. fire, కురుస్తున్నవి are raining, ie. are falling in showers. 3rd pers. plu. neuter pres. tense of కురియుట V.n. to rain."

బ్రౌనుదొరయొక్క తెలుగు వాచకమునకు అ రోజులలో విశేష ప్రచారముండెను. ఆంగ్లము నేర్చుకొనగోరిన మన దేశస్థులు కూడ ఈ పుస్తకమును విశేషముగా నుపయోగించినట్లు తెలియుచున్నది. ఈ గ్రంథములోని బోధన విధానమునే యవలంబించి తమిళము, కన్నడము మొదలైన భాషలలో కూడ పుస్తకములు సిద్ధమయ్యెను. ఈ "వాచకము", 1851లో "ఒరియా" భాషకు తగినట్లుగ, బ్రౌనుదొర పోష్యవర్గమున నున్న ఒక ఒరియావానిచే అనుసరింప పడినదట!

ఇంత శ్రమపడి కృషిచేసెను గనుకనే నాడు ప్రభుత్వ పరీక్షలకు పాఠ్య గ్రంథములుగ నిర్ణయింపబడిన వన్నియు బ్రౌనుదొర రచనలే. 1855లో మన దేశమునుండి ఇంగ్లాడు దేశమునకు, ఆయన ఉద్యోగమును విరమించుకొని పోయిన నాటినుండియు, ఆయన రచనలే తప్పక పాఠ్యపుస్తకములుగ నిర్ణయింపబడుచు వచ్చెనని ఆయనయే వ్రాసెను.[79] నాటికిని నేటికిని (నూరు సంవత్సరముల తరువాత) గూడ తెలుగు నేర్చుకొన గోరు ఆంధ్రేతరులకు బ్రౌనుదొర పుస్తకములను మించిన పుస్తకములు చాలవరకు ఆంగ్లములో లేవనుట అతిశయోక్తి కానేరదన్నచో ఆయన గ్రంథముల వైశిష్ట్యము వెల్లడియగును.

పైని పేర్కొనబడిన రచనలే కాక, బ్రౌనుదొర ప్రభుత్వము కొరకును, విద్యాసంస్థల కొరకును వందలకొలది పుటలను, ఆంగ్లమునుండి తెలుగులోనికి

78. "The same work has also been printed in Tamil and Kannada.' (Ibidem)

79. "Since I returned to England my publications have become the sole text - books used by the Government examiners." (Ibidem)

అనువదించెను. ఇవన్నియు, ఆయన ఉద్యోగ ధర్మము ననుసరించి చేసిన రచనలు కనుక వాటిని విశేషముగా పేర్కొనలేదు.

ఈ అముద్రితరచనలలో చేరవలసినవి బ్రౌనుదొర ఇంగ్లీషులో వ్రాసినపద్య మాలు కూడ కలవు. మన సాహిత్యమును గురించి పందలకొలది పుటలు-విమర్శ వ్యాసముల రూపమున, టిప్పణుల రూపమున, అను వాదముల రూపమున-ఆయన వ్రాసెను, ఇవిగాక సొంతముగా తన మాతృభాషయైన ఇంగ్లీషులో ఆయన వ్రాసిన రచనలు - పద్యగద్యాత్మకమైనవి - ఉండుటలో ఆశ్చర్యములేదు. బ్రౌనుదొర జీవించిన పందొమ్మిదవ శతాబ్ది (పదునెనిమిదవ శతాబ్దిచివరి సంవత్సరములలో పుట్టిన ఆయన (జననము - 1798), ఇంచుమించుగా పందొమ్మిదవ శతాబ్ది అంతయు (మృతి 1884) జీవించెననవచ్చును. ఇంగ్లీషు సాహిత్య చరిత్రలో మిక్కిలి ఫలవంతమైనది. కాల్పనిక కవులు(Romantic poets)అందురు జీవించిన కాలమది. వారి రచనలను బ్రౌనుదొర చదివినాడను విషయము మనకు తెలిసినదే! ఇందు వలన ఆయన వ్యక్తిత్వములో కూడ కాల్పనికాంశకొంత ఉన్నది. పరిశోధన, పాండిత్యములు దానిని చాల వరకు మింగివేసినను "కడిగిన మృగమద పాత్రిక విడువని పరిమళముపగిది" ఆయనను విడువని ఆ కల్పనా శక్తి పరిమళము బ్రౌనుదొర చేత కొన్ని పద్యములు వ్రాయించినది. వాటిలో చాల భాగము నశించినవి (తానే చాల వాటిని నాశనము చేసినట్లు ఆయనయే వ్రాసెను) I And My Carpet Bag అనునది ఒకటి లభించుచున్నది.*

ఇందున్న మొత్తము డెబ్బది నాలుగు పాదములును అయిదు పద్యములుగా విభక్తములై యున్నవి. వీనిలో మొదటిది, చివరిది ఇందిచ్చుచున్నాను:

"I and my carpet bag strolling along the road

Never inclin'd to lag, leisurely under the load

---

* Literary Autobiography of C. P. Brown : Chief Editor - G. N. Reddy; Editor-Bangorey. Sri Venkateswara University, Tirupati (1978) Pages - 118, 119' ఇండియా ఆఫీసు లైబ్రరీ ( I. O. L. ) లో ఉన్న ఈ పద్యమును వెలికిదీసి ప్రచురించిన పైవారు మన కృతజ్ఞతలకు పాత్రులు.

Over the hills we go and follow the foot path down
Into the Valley below with the hedge rows turning brown

Passing beside the brook
that runneth along by the mill,
Pausing awhile to look
in the mill - pond smooth and still
With a glance at the miller's abode
and a peep at his well - fed nag
Strolling along the road - go I and my carpet bag".

ఈ విధముగ, ప్రకృతిని పరిశీలించుటకు ప్రాతః కాలమువనే పాదచారియైపయనించిన కవి - పొలములను, తోటలను, చిట్టడవులను, చిన్న చిన్న పల్లెటూళ్లను దాటి, సాయంకాలమునకు ఒక "ఇన్" (Inn) చేరుకొనును. ఈ వర్ణనతో ఈ కావ్యఖండిక ముగియును :

"Fades the last blush of the day
hush'd is the low of the kine
Over an old gate - way
swingeth an ancient sign
Pleasantly sounds the din
of labourers over their beer
Gladly we greet the inn
promising noble cheer
Hail mine host of The Lamb
into your house go we

Savoury smokes the ham

fragrantly steams the tea

Dreams of the pleasant past

all forgotten the fag

Cradled to rest at last-I and my Carpet bag".

ఈ పద్యములో ఆయన కవితాశక్తి అంత విశేషముగ కనబడక పోయినను ఆంగ్లచ్ఛందస్సుపై ఆయనకున్న ప్రభుత్వము, ఆ నాటి కాల్పనిక కవుల భావనా పద్ధతి ఆయన పై చూపిన ప్రభావము మనకు కనంబడును. దీనిని గురించి ఆయనయే "... I shape forth my progress in a lyric that I hope will find at this moment many to join me in the burden and so hey for A COUNTRY CAROL", అని వ్రాసెను

ఆయన ఇంగ్లీషు రచనలు-వ్యాసములు, టిప్పణులు పద్యములు. లాక్షణిక రచనలు - ఒక్కవిషయమును రుజావు చేయును. బ్రౌనుదొర ఇండియా వచ్చి భారతీయ భాషల - ముఖ్యముగా తెలుగుభాష-అభివృద్ధికి కృషి చేయకుండినచో, ఇంగ్లండులోనే ఉండి ఇంగ్లీషు భాషాభివృద్ధికి కృషి చేసియుండెడి వాడనునది నిర్వివాదాంశము. ఊరక కూర్చుండుట ఆయన ప్రవృత్తికి విరుద్ధము. కాని, ఆ కృషివలన ఆయన కెంత పేరు వచ్చియుండెడిది మొదలైన ప్రశ్నలకు సమాధానములు చెప్పుట కష్టము! ఒక్కటి మాత్రము నిజము. తెలుగుభాషా సాహిత్యములకు మాత్రము, పందొమ్మిదవ శతాబ్దిలో ఇంతటి ఉపకారము జరిగియుండెడిది కాదు.

భారతదేశమును విడిచి (1855) వెడలిపోయిన తరువాత స్వదేశమైన ఇంగ్లండులో జీవించిన (మృతి - 1884) మూడు దశాబ్దుల కాలములో కూడ తానంతకు పూర్వము వ్రాసిన వ్రాతలను సరిదిద్దుకొని వాటి పునర్ముద్రణమునకై కృషిచేయుట కొన్నింటిని ముద్రించుట, భారతదేశమునకు సంబంధించిన వివిధ విషయములపై వ్యాసములు వ్రాయుట, వివిధ నగరములలో ఆయా విషయములపై ఉపన్యసించుట, తెలుగులో అచ్చయి తన వరకు వచ్చిన పుస్తకముల నన్నింటిని చదువుట మొదలైన వ్యాసంగములతో కాలమును గడిపెను.

ఒక్కనిమిషమునైనను వ్యర్థము చేయక, భాషాసాహిత్యములు - ముఖ్యముగా తెలుగు భాషాసాహిత్యముల - అభివృద్ధికి శ్రమించుచునే యుండెను. ముద్రణ సాగించుచునేయుండెను. ఇంత కృషిని చేసినను, వినయముతో ఆయనిట్లు వ్రాసెను:

"I have printed a good deal but I perceive in every page things which I could amend."[80]

ఇట్లాయన వ్రాసినను ఈ "లఘు రచనలు" బ్రౌనుదొరయొక్క బహుముఖ ప్రజ్ఞకు తార్కాణములు.

80. Ibidem.

# తెలుగుప్రజలు : బ్రౌనుదొర

"కంపెనీ" ఉద్యోగియైన బ్రౌనుదొర, ఉద్యోగ ధర్మము ననుసరించి కడప, మచిలీపట్టణము, రాజమహేంద్రవరము, తిరుచునాపల్లి, గుంటూరు, చిత్తూరు మద్రాసు మొదలైన నగరములలో చాల కాలము ఉండవలసి వచ్చెను. ఇంచుమించుగా ఈ నగరము లన్నియు ఆంధ్రనగరము లగుటచే, ఇవియే ఆయన భాషా సాహిత్యముల కృషికి కేంద్రములైనవి. ఈ నగరముల నుండి పరిసరములకు ఉద్యోగరీత్యా ఆయన రాకపోకలు చేయుటతో - సుమారుగా తెలుగుదేశ మంతటితోడను తెలుగు వారితోడను ఆయనకు పరిచయ మేర్పడెను. నాడు మద్రాసు ప్రెసిడెన్సీకి, మద్రాసు రాజధాని అగుటచే దక్షిణ ప్రాంతముననున్న తెలుగువారితోడను ఆయనకు పరిచయ మేర్పడెను. ఈ పరిచితులలో - సామాన్యులు (సేవకులు, ఇతరులు), ఉద్యోగులు (దేశీయులు, విదేశీయులు), పండితులు మొదలైన వారుండిరి. ఈ సందర్భమున మనము ముఖ్యముగా గుర్తింపవలసినది ఈ పరిచయముయొక్క తత్త్వము. నాటి పరిస్థితుల ననుసరించి, ఆయనకు ఆంధ్రసమాజముతో స్నేహమేర్పడుట కష్టము. అందులకై ఆయనఅంత ప్రయత్నమును చేయలేదు.[1] చేసినను, పాలకపాలితుల నడుమ నిది గాఢముగ పరిణమించుటకును అవకాశములు తక్కువ. కాని, తన భాషా సాహిత్యముల కృషికి ప్రత్యక్ష సహాయకులును, దోహదకారులునైన వారితో మాత్రము బ్రౌనుదొరకు స్నేహము కలదనుటకు నిదర్శనములున్నవి. మిగిలినప్రజల విషయమున ఆయనకు సానుభూతియుండెడిది[2]

---

1. "For the last thirty years I never mixed with Hindu Society, feasts or celebrations, and exept those who worked wirh me I had few Hindu acquaintances." (Some Account of the Literary Life of Charles Philip Brown).

2. "The Telugus are a people quite as highly civilized as any in Europe ; occasionally their modes of speech resemble those of Italy".

(A Grammar of the Telugu Language by C. P. Brown; Second Edition-1857; Page-165.)

హిందువుల ఆచారవ్యవహారములను సమాజములోని ప్రజలలో ప్రబలి యున్న ఎక్కువ తక్కువ లను భావములను పదే పదే దురాగ్రహముతో పక్షపాత బుద్ధితో విమర్శించుచు, హేళన చేసెడి ఇంగ్లీషు వారిని బ్రౌనుదొర క్షమింపలేదు. తన వ్రాతలలో ఒకచోట ఆయన ఈ విషయమై ప్రస్తావించి ఇంగ్లీషు వారిలో కూడ పాతుకొని పోయి ఉన్న ఎక్కువ తక్కువ లను భావముల నిట్లుగర్హించెను:

"We laugh at the Hindu rules about caste. But we are not free from such prejudices. In the Crimean war the French officers wished to fraternize with the English-but nr the proud islanders disliked them because (they had) risen from the ranks."

"Some twenty years ago three girls were sent to a chool near Manchester. In a few weeks it came to light that they were the children of a chimney sweeper who had succeeded to a large fortune. Thereupon they were frequ-ently insulted by their school fellows so that they were obliged to quit the school."

"Similar cases have often happened in the English army, when an ensign is found to be the son of a tradesman. Some meritorious serjeants have in consequence of excellent conduct obtained commissions as officers : their position is uncomfortable : they can no longer live among their old friends in the ranks, and the officers shun them."

ఇందువలన ఆయన మనవారిలో ప్రబలియున్న ఎక్కువ తక్కువ లను భావములను అంగీకరించినాడని కాదు. మానవ ప్రవృత్తులు ఇంచుమించుగా ఒకే విధముగా నుండునని చూపించుట ఈ సందర్భమున ఆయన దృష్టి.

కనుక తెలుగువారి నడుమ - ఇంచు మించుగా-నాలుగు దశాబ్దుల కాలము గడపిన బ్రౌనుదొరకు వారి విషయమై ఉన్న భావములను, వారితో ఆయనకున్న సన్నిహితత్వమును, ఆ ప్రజలకు(ఇందులో అన్ని తరగతుల వారును కలరు) ఆయన యందున్న గౌరవాభిమానములును మనము పరిశీలింపవలసియున్నది.

ఉద్యోగమును బట్టి, ఆయనకు ప్రజలతో మిక్కిలి పరిచయముండుటయు ధర్మముకాదు. న్యాయస్థానమున విచారణ జరిపి న్యాయాన్యాయ నిర్ణయము చేయ వలసిన ఆయన సమాజములో విశేషముగా సంచరించుటయు కని పని. ఈ పరి స్థితులు, ప్రజలకాయనను కొంత దూరమున నుంచినను; "బ్రౌనుదొర దగ్గర న్యాయముదొరకును" అని ప్రజలతో వాడుకపడుటచే, ఆయనకు ఆర్తులెందరో జాబులు వ్రాసికొనెడి వారు. వాటినన్నింటిని సావధానముగా పరిశీలించి బ్రౌనుదొర న్యాయము చేసెడివాడు. ఈ జాబులు నాటి జనజీవితమును తెలిసికొనుటకు ముఖ్యాధారములు. ఇవిగాక, లిఖిత ప్రతులను వివిధ ప్రాంతముల నుండి తెప్పించుటకై ఆయన వ్రాయించిన లేఖలును గలవు. ఇవన్నియు బ్రౌనుదొర విషయమున, నాటి ప్రజలకున్న భావములను విశదము చేయగలవు. ఈ జాబులు వ్రాసిన వారిలో ; పండితులు, పామరులు, కంపెనీ ఉద్యోగులైన తెలుగువారు ఆయనకు సలహాలను చెప్పు చిన్న ఉద్యోగులు, వర్తకులు, యాచకులు-అందరును కలరు. ఈ లేఖల వైవిధ్యమే, బ్రౌనుదొర -ఉద్యోగ మునుబట్టి మాత్రమే గాక-నాడు తెలుగు ప్రజల నడుమ సంపాదించిన ఆదరాభిమానములను, గౌరవమర్యా దలను తెలుపును. తెలుగు కావ్యముల సముద్ధరణకు బద్ధకంకణుడైన బ్రౌనుదొరకు ఇంచుమించుగా ఆ నాటి తెలుగు పండితులందరితోడను పరిచయ మున్నదన వచ్చును. వారిలో మంచి వారిని "తన" పండితులనుగా నియమించు కొనెనను విషయము మనకు తెలిసినదే !

ఏదైన ఉద్యోగమును ఇప్పించవలసినదని బ్రౌనుదొరకు నాడు వచ్చిన జాబు లకు లెక్కయే లేదు. కొంచెము చదువు వచ్చిన వారందరు, వ్రాయగలిగిన వారందరు; "మమ్ము, మీరు వ్రాయించుచున్న తెలుగుపుస్తకముల ప్రతులను వ్రాయనిండు." అని అడిగెడివారు. మిగిలినవారు, "గ్రామములలో తిరిగి గ్రంథము లను సంపాదించు పనిలో మమ్ములను నియోగింపుడు" అని కోరెడివారు. ఈ రెండు పనులలోను నియుక్తులై, బ్రౌనుదొర దగ్గర ఎప్పుడును మనుష్యులుండెడి వారు.[3] "మీరుతలచుకొన్నచో నాకు వివాహమగును" అని వ్రాసినవారుకూడ

---

3. "......Indeed there were always from ten to twenty......in my pay, employed in transcribing native authors, in preparing correct editions, in framing indexes and commentaries ......" (Some Account of rhe Literary Life of Charles Philip Brown).

కలరన్నచో, నాటి తెలుగు ప్రజలు బ్రౌనుదొరను ఎంత ఆత్మీయునిగా చూచ కొనెడివారో తెలియును గదా!

ఉద్యోగము నిప్పింపుడని వ్రాసిన వారి జాబులలో నుండి కొన్ని భాగముల నుద్ధరించి క్రింద నిచ్చుచున్నాను. ఈ జాబులలో చాల భాగము. బ్రౌనుదొర "తెలుగు రీడర్" నుండి ఉద్ధృతములు. ఇవి, నిజమైన జాబులే యనియు[4], తెలుగు నేర్చుకొనగోరు వారికి ప్రారంభమున వ్యావహారిక భాష నివి నేర్పుననియు ఆయన వ్రాసెను. ఈ జాబులను నే నింకొక విధముగా నుపయోగించుకొను చున్నందులకు బ్రౌనుదొర క్షమించును గాక!

జాబులలో కొన్ని, తనతో ఏ విధమైన పరిచయమును లేనివారు వ్రాసిన వనియు, వారి ప్రార్థన ఒక్కొక్కప్పుడు నవ్వు తెచ్చుననియు, కొన్ని కొన్ని చోటులందు బ్రౌనుదొర వ్రాసెను[5]. ఈ క్రిందివి అట్టివి:

"నేను పచ్చప్ప మొదలారి పల్లెకూటములో యింగిలీషు చదువుకొంటూ వుండగా కంటినొప్పి కనుపించి...నా కుడికన్ను పోయినందున ఆ పల్లెకూటములో చదవడము విడిచిపెట్టినాను. నాకు తెలుగు అరవము కూడా తెలుసును ..నాకు తెలి యుండే యీ రెండు భాషలలో మీ అపీసులోనైనా సరే, లేక యింకా యెక్కడ నైనా సరే, లెక్కపనిగాని, లేక తమకు యిష్టమైన యేదైనా మరివొక పనిగాని, దయచేసి నన్ను కాపాడవలసినది.." (తెలుగు రీడరు ; పుట - 23, 24)

"నేను బహు బీదవాణ్ణి; తల్లిదండ్రాదులు చనిపోయినారు ....తమరు వా యందు కటాక్షము వుంచి చదువు చెప్పించినా సరే; లేని పక్షమునకు, తమరు వ్రాయిస్తూవున్న తెనుగు గ్రంథాలలో యేదైనా వొకటి యిచ్చి వ్రాయించి,

---

4. "..... is intended to aid those gentlemen who are commencing the study of Telugu.........The documents are authentic they are printed from unpublished originals".

   (The Telugu Reader by C. P. Brown; 2nd Edition - 1867; Preface.)

5. "This simple style of address will be met in numerous letters addressed to me...... The coolness of the request may excitte a smile" (English translation of Telugu Reader, 2nd Edition; 1865; Page - 17).

నన్ను పోషించవలెనని. మనవి వ్రాసుకొంటున్నను ....” (తెలుగు రీడరు ; పుట-83,84.)

“నిరు పేదనైన నా యెడల పుత్ర వాత్సల్యత వుంచి, నా వద్ద చక్కగా నవుకరి పుచ్చుకొని, నాకు జీవనము కలుగచేసి, వృద్ధాప్యదశలోవున్న నా యొక్క తల్లిదండ్రులనున్ను, బాల్యదశలోవున్న నా సహోదరులనున్ను పోషించి, ఆ కీర్తి తాము వహించవలెనని, తమ పాదాన్ని మిక్కిలి ప్రార్థిస్తూ సముఖము కని పెట్టుకొనివున్నాను,” (తెలుగు రీడరు ; పుట – 70.)

ఇట్లు, ముక్కు మొగము తెలియని వారు వ్రాసిన ప్రార్థన లిట్లుండగా : బ్రౌనుదొరను ఎరిగియుండి తమ్మి కష్టముల నుండి ఉద్యోగము మూలమున, తప్పించగలడని నమ్మి, జాబులు వ్రాసినవారు కొందరున్నారు. వీరిలో చాల మందికి బ్రౌనుదొర వారివారికి తగిన విధముగా సాయము చేసెను. క్రింది జాబులు అట్టివి, కొన్ని :

“.... తమరు బందరు జిల్లాలో కలకటరు హోదాలో వున్నప్పుడు, మా పితంద్రిగారిని తమరున్ను యెరిగేవున్నారు అందుల సంగతులు తమకున్ను విశదమయ్యే వున్నవి. నాకున్ను తెనుగు భాష బాగా తెలుసును; మా కుటుంబ జీవనము జరగడమునకు, బహుకఠినముగా వున్నది. గనుక, తమ సముఖములో వొకపని యిప్పించి, మా కుటుంబ జీవనము జరిపించవలెనని, ప్రార్థింపుచున్నాను యిప్పుడు, యిచ్చట, పు॥ హయగ్రీవ శాస్త్రులవారి అచ్చు ఆఫీసులో గుమస్తాగా వున్నాను. అయితే, వారు యిచ్చే జీతము నాకు మాత్రము జీవనము జరగడమేగాని మా కుటుంబ జీవనము జరిగేది లేదు... గనుక, నాకు తమ ఆఫీసులో వొకపని యిప్పించి, మా కుటుంబ జీవనము జరిపించవలెనని. మిక్కిలి ప్రార్థింపుచున్నాను.” తెలుగు రీడర్ ; పుట – 37.

“....పూర్వమందు మా గ్రామ కాపురస్థుడయిన బ్రహ్మశ్రీ వలర్యం అద్వైత బ్రహ్మశాస్త్రులంగారు వారు యిచ్చట సదరుకోటుపండితుడుగా నియమింప బడ్డప్పుడు, మా అన్నగారయిన అప్పయ్య ఆ బ్రహ్మయ్యశాస్త్రులంగారితో కూడా బయలుదేరి యిచ్చటికి వచ్చి, కొంత కాలం మట్టుకు వారి సన్నిధినేవుండి, కొంత మంది ప్రభువులయొక్క వాత్సల్యతను సంపాదన చేసుకొని, యింగిలీషు మొదలయిన విద్యలను అభ్యసించి, మా కుటుంబ సంరక్షణ చేయడమునకు ప్రయత్నము

చేస్తూవుండగా, ఆయన దైవవశాత్తు యిచ్చటనే పరమపదం వేంచేసినారు...మా వూళ్ళో జీవనం జరగడమునకు మాకు యెంతమాత్రం ఆధారం లేనందున ఇప్పుడు తమ సన్నిధికి రావడమైనది... తమ సన్నిధిని మా కుటుంబసంరక్షణ జరుగ గలందులకు నాకు యేదైనా జీవనోపాయం కలగజేతురని మిక్కిలి ప్రార్థిస్తూ వున్నాను. మా అన్నగారయిన అప్పయ్యాను దేవరవారు చిత్తగించే వుందురు... (తెలుగు రీడరు ; పుట - 106, 10.7).

విద్యావంతులైనవారే కాక, సామాన్య ప్రజలును తమ కష్టసుఖములను బ్రౌనుదొరకు వ్రాసికొని, ఏదైన బ్రతుకుతెరువు చూపింపుడని కోరుకొనుటయు కలదు. అట్టి లేఖలు కొన్ని "తెలుగు రీడరు"లో కలవు. ఈ "రీడరు"నకు అనువాద గ్రంథమైన ఇంగ్లీషు పుస్తకములో, బ్రౌనుదొర కొన్ని జాబుల అనువాదముల క్రింద, ఆయా ప్రార్థనలకు, విజ్ఞాపనలకు, తాను చేసిన పనులను గూర్చి ఆంగ్లమున వ్రాసినాడు. సహజముగనే: ఆయన క్రియలు కొన్ని దరఖాస్తుదారులకు అనుకూలముగను, కొన్ని వ్యతిరేకముగను, కొన్ని తటస్థముగను నుండెను. వీటిలో, విలక్షణములైన కొన్ని జాబులను క్రింద నిచ్చుచున్నాను:

"మహారాజశ్రీ సీ-పీ-బ్రౌన్ యిస్కొయరు కలకటరు జిల్లా గుంటూరు సర్కారు ముర్తుజానగరు తా॥ పల్నాడు వగైరాగారి సముఖానకు.

పోలూరు తాలూకాలో చేరిన మ॥ తమ్మవరం కాపురస్థుడయిన తమ్మవరపు నరసిహ్మలు వ్రాసుకొన్న అర్జీ విన్నపము.

నవాబు బసాలజంగు వారికింద ముర్తుజాన్నగరు విళంబి సంవత్సరము (A.D. 1778) వరకు జరుగుతూవుండెను. అప్పట్లో హైదరు బహాదరువారు గుత్తి బళ్ళారి కడప శిద్ధవట్టం సర్కార్లు తమ స్వాధీనము చేసుకొంటూ, బలవంతులై వస్తూవుండిరి గనక, నవాబు బసాలజంగుగారు తమకు సహాయము నిమిత్తము, మీరు ఫత్తుల్లాఖానుని వారిని చెన్నపట్నము పంపించిరి. ఆయన అక్కడ అధికారిని కలుసుకొని మర్తుజాన్నగరు కంపిణీవారి స్వాధీనము చేసే కొరకు, ఫస్టుపటాళము సమేతు నాలుగు, పటాళాల బారుకర్నల్ బేలీ దొరగారితో కూడా తీసుకొని, వికారి సంవత్సర చైత్రమాసములో (A.D. 1779 March) వాడదిగి, లష్కరుతో కూడా పందెళ్ళపల్లె ప్రవేశించిరి. అప్పట్లో, ఆదోనికి లష్కరుతో కూడా పోవడానకు నవుకర్లను కుదిర్చేయెడల, మా అన్నగారిని, నన్ను, నవుకరిలో వుంచినారు".

దీని తరువాత, అర్జీదారుడు సుదీర్ఘముగా, అప్పటి పరిస్థితులను, ముట్టడులను వర్ణించి చెప్పి, యుద్ధము ముగిసిన వెనుక తనకు పని పోయినదని వ్రాయుచు జాబునిట్లు ముగించెను:

"నేను బహు దినముల నవుకరును: బహు కుటుంబిని, నా ముగ్గురు కొమాళ్ళున్ను నవుకరి చేయడానకు లాయకు అయి వున్నారు......యింకా కొన్ని సంవత్సరములు కుంఫిణీ నవుకరీ చేయవలెనని నాకు యిచ్ఛ కలిగి వుండేటందువల్ల, బహుజన పోషకులున్ను, నావంటి దీనులను అనేకమందిని పోషించే ప్రభువులున్నైని తాము, నాయందు పుత్రవాత్సల్యత వుంచి, నేను వ్రాసుకొన్న అర్జీ చిత్తగించి, నాకున్ను నా కొమారుడికిన్ని పేష్కారి అయినా, తాణా మద్దగ్గారి అయినా, దయచేయించి, పోషించవలెనని వేడుకొంటున్నాను. దివ్యచిత్తానకు తేవలెను". (తెలుగు రీడరు; పుటలు-138, 140, 141.)

ఈ అర్జీయొక్క ఇంగ్లీషు అనువాదము క్రింద; "Note - This request was granted"[6] అని బ్రౌనుదొర వ్రాసెను.

బ్రౌనుదొరకు వచ్చిన జాబులలో విలక్షణమైనది, ఆయనకు బహుళః మందహాసము తెచ్చినది, అయిన జాబునిట నిచ్చుచున్నాను. ఈ జాబు వ్రాసిన అర్జీదారుని కోరికను ఆయన తీర్చలేదు. ఆ విషయమును "రీడరు"యొక్క ఆంగ్లానువాదమున బ్రౌనుదొరయే చెప్పెను. ఈ జాబు, నాటి తెలుగు ప్రజల నడుమ బ్రౌనుదొర సంపాదించిన గౌరవమును, తమకేది కావలసివచ్చినను దానికొరకాయనను సమీపింపవచ్చునను ధైర్యమును ప్రజలు పొందుటను, సూచించును:

"మహారాజశ్రీ సీ-పీ-బ్రౌన్ యినోస్కీయరుగారి సముఖానకు, గుంటూ నాగన్న సా॥ బుట్టయ్యపేట వ్రాసుకొన్న అర్జీ విన్నపం. సకలధర్మ స్వరూపులయిన హానరేబిల్ కుంఫిణీవారి అధికారము వచ్చిన తర్వాత, యీ బందరు పట్నం బస్తీ కావడానకు, మేస్తరు తామస్ వోక్సు కల్కటరుగారు తమ పేరిట యినుగుదురు దగ్గెర వొక పేటానున్ను, కట్టించినారు. యీ పేటలు కట్టించడమువల్ల బస్తీకి బహుశోభితముగా వున్నది. తమరు అదృష్ట విశేషమువల్ల అసాధ్యకరమైన ఆంధ్ర గీర్వాణములను అభ్యసించి, సకల ధర్మశాస్త్ర పురాణ

6. Ibidem: Page - 84.

ములను పండితులను దగ్గర వుంచుకొని శోధించి వాటి సంగతులు యావత్తు ప్రకటనలోకి తెస్తున్నారు. గనుక, యీ బస్తీకి తమరు న్యాయకర్తలయివచ్చి వుండడమువల్ల సమస్తమయినవారు బహు సంతోషిస్తున్నారు".

"ఇప్పుడు నేను మనవి వ్రాసుకోవడమేమంటే; బుట్టాయ్యపేట శ్రీ స్వామివారి సన్నిధిని సకల వుత్సవములు జరిగిస్తూవున్న కరెడ్ల శీతారామనాయుడుగారు ఆ కోవెలలో స్వామివారికి నిత్యోత్సవ అలంకరింపు నిమిత్తం, తులసీ, పుష్పముల చేతతో మాలలు కట్టించి, సమర్పణ చేయిస్తూ వుండగలందులకు నన్ను చిన్నప్పటినుంచి నియమించి వుంచి. నా కుటుంబ సంరక్షణ చేస్తూవుండేవారు. నా దురదృష్టంచేత నాలుగు సంవత్సరముల కిందట ఆయన చనిపోయినారు. నాటనుండి నిరుపాధికుణ్ని అయి, స్వామివారిని కనిపెట్టుకొని వున్నాను. యీ బస్తీలో వేంచేశి వుంచే శ్రీ శివకేశవులయొక్క కోవెలలో, తులసీ, పుష్పముల చేత కట్టిన మాలికలు సమర్పణ అయ్యేలాగున తమపేర కొంత వట్టిస్థలము యేర్పరచి నా వశాన దయచేయిస్తే తులసిన్ని. అనేక పూలచెట్లున్ను నిండుగా వేయించి, రెండు నెలలకంతా తులసీ పుష్పములు స్వామి కైంకర్యమునకు అక్కరకు వచ్చేలాగు జాగ్రతచేస్తాను. తమపేర యీ బస్తీలో శాశ్వతముగా యీ కైంకర్యము జరుగుతూ వుండవలెనని కోరి, మనవి వ్రాసుకొన్నాను. దివ్య చిత్తానకు తేవలెను".

"అన ౧౮౩౨ సంవత్సరం ఆగష్టు నెల 8 తేది".

(తెలుగు రీడరు; పుటలు — 188, 189 .

పాలితుల మత విషయములందు జోక్యము కలుగచేసికొన నిష్టములేక కాబోలు, బ్రౌనుదొర ఈ "మనవి"ని చిత్తగింపలేదు. కాని, ఈ కోరికయొక్క విలక్షణతను గుర్తించియే, "This singular request was not granted"[7], అని ఆంగ్లానువాదమున వ్రాసినాడు. ఈ నిరాకరణనుబట్టి. బ్రౌనుదొరకు మత సహనము లేదనరాదు. నిస్తర రత్నాకరమను కైస్తవ గ్రంథమును 1852లో ఆయన అచ్చు వేయించుచు. ఆ గ్రంథమున గల హిందూమత దూషణను తొలగించెను. ఆ సందర్భమున ఆయన వ్రాసిన వాక్యములు, ఆయన సహన బుద్ధికి తార్కాణములు:

7. Ibidem; Page - 117.

"The Apostles taught Christianity without reviling idols. Why should not modern teachers imitate this courteous method"[8].

తమ తమ గృహ కలహములను, కష్టసుఖములను గూర్చి కూడ, బ్రౌను దొరకు జాబులు వ్రాసినవారున్నారు. న్యాయస్థానమునకు రాని విషయములతో తనకు సంబంధము లేకుండుటచే, బ్రౌనుదొర అట్టి జాబులు వ్రాసినవారికి తనకా విషయములందు ప్రసక్తి లేదని చెప్పెడివాడు. క్రింది జాబు, వారికి బ్రౌను దొర యిచ్చిన సమాధానము, పై అంశమును నిరూపించును :

"మహారాజశ్రీ సీ-పీ-బ్రౌన్ యిస్కోయరు కల్కటరు జిల్లా గుంటూరు ర్కారు ముర్తుజాంనగరు తాలూకే పల్నాడు వగైరా గారి సముఖానకు,

పోలూరు తాణా యిలాకా మ॥ దగ్గుపాటి కరణము దగ్గుపాటి రామయ్య వ్రాసుకొన్న అర్జీ విన్నపము. మజుకూరిలో నేను ముప్పై సంవత్సరముల నుంచి జమీందారి హయాంలోనేమి, కుంఫిణీవారి హయాంలోనేమి, కరిణీక ములో తిర్గాడుతూ, సర్కారు పనులు భయభక్తులు కలిగి, చక్కగా జరిగించు కొంటూ వున్నాను".

దీని తరువాత, అర్జీదారుడు తన కుటుంబ విషయములను గూర్చియు; తన ముగ్గురు కొడుకులలో, రెండవ వానిని మూడవ వానిని దత్తత ఇచ్చుటను గూర్చియు, విపులముగా వ్రాసికొని, ఈ దత్తత వలన తన పెద్దకుమారునితో తనకు విరోధము వచ్చుటను గూర్చి ఇట్లు తెల్పుకొనెను."........నా పెద్దకుమారు డైన వెంకటనరుసు నాతో కలహము పెట్టుకొని, తన తమ్ములను యిద్దరిని పరి త్యజించవలెననిన్ని, తాను మాత్రమే మా యింట్లో వుండవలెననిన్ని........నామీద తంటాలుచేస్తూ, అనేక విధముల నన్ను రొష్టుపెడుతూ వున్నాడు. యిందున గురించి వొకరితో చెప్పుకోవడానకున్ను, తగువు ఆడడానకున్ను, నాకు వుచి తముగా కనుపడలేదుగనుక; తమరు సకల ధర్మస్వరూపులున్ను, న్యాయకర్తలు అయివుండున, నాయొక్క సంగతి యావత్తు అర్జీ రూపముగా తమ చిత్తానకు

8. Some Account of the Literary Life of Charles Philip Brown.

విశదపరుచుకొన్నాను. యిందుకు న్యాయకర్తలయిన తమరు నిండా విచారణ చేయించి ముఖ్యముగా జరిగించవలసినందుకు, సెలవు దయచేయిస్తే, నేను గ్రామములో వుంటున్నాను. లేని పక్షమందు .... మిగిలిన చిన్నవాండ్లను కూడా తీసుకొని, నేను విదేశగతుణ్ని అయిపోతూ వున్నాను గనుక, ప్రభువుల చిత్తానకు విశదము నిమిత్తము మనవి వ్రాసుకొన్నాను. దివ్య చిత్తానకు తేవలెను".

(తెలుగు రీడరు; పుటలు-125, 126, 127).

దీనిక్రింద "రీడరు"లో బ్రౌనుదొర యొక్క ఈ నోటు ఉన్నది. "ఈ సంగతి మేజస్ట్రీటులోనేమి, ముల్కీ లోనేమి,చేర్చడముకు అనుకూలమైన మొకద్దమా కాదు గనుక, మేము విచారించడముకు యుక్తపడదని ఫిర్యాదితో చెప్పడమయినది" ఆంగ్లానువాదములో — "Answer. The petitioner was informed that as this matter concerns neither Revenue nor Police, I cannot interfere" అని ఉన్నది[9].

ప్రత్యక్షముగ తన ఉద్యోగమునకు సంబంధించని పనుల విచారణకు, పూనుకొనకున్నను ఆర్తులకు తన చేతనైనంత సాయమును బ్రౌనుదొర చేయుచునే వచ్చెను. జమీందారులు మొదలు తాపీపనిచేయు మేస్త్రీయొక్క భార్యవరకు— అందరు, తమ తమ అవసరములను బట్టి దరఖాస్తు జాబులు వ్రాసికొనుట కలదు. వారికి చేతనైనంత సాహాయ్యమును బ్రౌనుదొర చేయుటయు కలదు.

చనిపోయిన తన భర్తయొక్క పని, తన మరిదికి ఇచ్చినచో; ఆ మేస్త్రీ పనిచేసి అతడు తనను, బిడ్డలను పోషించుననని, చనిపోయిన మేస్త్రీ భార్య వెంకమ్మ పంపించుకొనిన ఈ క్రింది అర్జీవలన బ్రౌనుదొర పేదవారికెంత సులభుడో తెలియగలదు :

"మహారాజశ్రీ మచిలీపట్నం జిల్లా అదాలతు కోర్టు జడ్జిగారయిన సీ-పీ-బ్రౌన్ దొరగారి సముఖానకు,

కాసెమేస్త్రిరి అయిన చనిపోయిన కోట వెంకటరెడ్డికి భార్య అయిన వెంకమ్మ.......వ్రాసుకొన్న అర్జీ విన్నపము.

---

9. English translation of the Telugu Reader; 2nd Edition; 1865. Page - 76.

ఇదివరకు ౩-౬ నెలలనుంచి, నాపెనిమిటి అయిన వెంకటరెడ్డి, తమ కచేరిలో కానెమేస్తిరి పనిలోవుండి, మమ్ము్మన సంరక్షణచేస్తూ వుండేవాడు. నా దుర దృష్టముచేత, అతడు అన ౧౮౩౭ సంవత్సరము డిసెం జూలాయి తారీఖున...... చనిపోయినాడు.......మాకు అన్నవస్త్రములు జరగడమునకున్ను, బహు ప్రయాసగా వున్నది. గనక, ధర్మాత్ము్మలున్ను బహుజన పోషకులున్ను న్యాయకర్తలున్ను అయిన తమకు, మనవి వ్రాసుకొనేది యేమంటే; దీనురాలనయిన నాయందు, నా చిన్నవాండ్లయందు తమయొక్క కరుణాకటాక్షం వుంచి, మమ్ము్మన సంరక్షణ చేసే నిమిత్తం, నాపెనిమిటిపని యీ అర్జీ దాఖలుచేసిన నా మరది అయిన వెంకటస్వామికి యిప్పించిన పక్షమందు, నన్ను నా చిన్నవాండ్లను పోషణ చేస్తాడు గనక, మీరు అనుగ్రహం వుంచి, ముఖ్యముగా యీపని అతనికి దయచేయించ వలెనని వేడుకొంటూ వున్నాను. దివ్యచిత్తానకు తేవలెను". (తెలుగు రీడరు: పుటలు --78, 79).

ఇట్టివారి కెందరికో, బ్రౌనుదొర ఉద్యోగములనిచ్చి ఉపకారము చేసెను. అర్జీదారుడు యోగ్యుడు, తగినవాడు అని తనకు తోచినప్పుడు; అట్టివాని కీయుటకు పని ఏదియు సిద్ధముగా లేనప్పుడు, ఏదియో ధనరూపమున వారికి ముట్టజెప్పి, పని యున్నప్పుడు పిలిపింతునని చెప్పుటయు కలదు. ఈ క్రింది జాబు దీనికి తార్కాణము:

"దరబందగి హజరత్ పోష్టుమేష్టర్ జనరల్ సీ-పీ-బ్రౌన్ దొరగారి యొక్క పాదార విందములకు,

రాయవేట నారాయణసామి అనేక సలాములుచేసి వ్రాసుకొన్న విజ్ఞాపనములు. ౧౮౩౦ యో సం॥ జనవరి నెల ౨౮ తారీఖున......... ...వొక అర్జీ యిచ్చి వున్నాను. అందులో ... .... .... నాకు తమవద్ద యేదైనా వొక పని యిప్పించవలెననిన్ని, అట్లా తమవద్ద అదనుకు పనిలేని పక్షమందు టపాళాఫీసులో, లెటరు పియూను పనియైనా దయచేయవలెననిన్ని, కోరి వ్రాశివున్నాను. మీరు దాన్ని చదివి చూచిన తర్వాత, నన్ను పిలవనంపించి, రెండు రూపాయలు యిప్పించి, రేపు రమ్మని శలవిచ్చినారు. అట్లాగే తమ ఆజ్ఞప్రకారం మరునాడు వచ్చినాను. అప్పుడు, మీరు నన్నుచూచి పని వచ్చినప్పుడు పిలిపిస్తామని చెప్పితిరి. నాయొక్క అదృష్టము యింకా కలిసిరాలేదని, వ్యసనపడుతూ, తమ సేవకు వస్తూపోతూ వున్నాను". (తెలుగు రీడరు: పుటలు - 76, 77.)

బ్రౌనుదొరకు, జమీందారులు; క్షామ పరిస్థితులలో కంపెనీవారికి చెల్లింప వలసిన పేష్కష్, చెల్లింపలేమనియు, కొంత దయ చూపవలసినదనియు; తాము స్వయముగా వ్రాసికొనుటగాని, తమ వకీలు ద్వారా వ్రాయించుటగాని కలదు. ఈ లేఖలన్నింటి యందును; బ్రౌనుదొరయొక్క న్యాయబుద్ధి, మానవత్వము, తెలుగు భాషా సాహిత్యముల యందాయనకు గల శ్రద్ధలను గూర్చి వ్రాయుట కలదు. ఆ రోజులలో బ్రౌనుదొరను సమీపించుటకు, చదువుకొన్న పేదవాని కున్నంత అవకాశము, చదువులేని ధనవంతున కున్నట్లులేదు. పుస్తకముల వేట చెప్పినచో, ఆయన గుండె కరుగునని అందరు గ్రహించిరి. విద్యా విహీనులు తప్ప - వారాతని ఔదార్యమును నమ్మి యుండెడివారు - మిగిలిన వారందరు, ఆయన పండిత పక్షపాతమును అండగా నిడుకొని, తమ తమ కోరికలను మనవి చేసికొనెడివారు. కొందరాయన న్యాయ తత్పరతను, ధర్మబుద్ధిని నమ్మి విన్న పము చేసికొనెడివారు. ఆయనకు ప్రజలు వ్రాసికొనిన లేఖలనుండి, వీటి కన్నిం టికి ఉదాహరణలను చూపింపవచ్చును. బ్రౌనుదొరయొక్క న్యాయదృష్టియందు ప్రజలకంత నమ్మకము. అనావృష్టివలన క్షామ పరిస్థితులేర్పడుటచే, కంపెనీ వారి పేష్కష్ పూర్తిగా చెల్లింపలేమని, ఒక జమీందారుయొక్క వకీలు వ్రాసి కొనిన లేఖలోని ఈ భాగము, దీనిని రుజువుచేయగలదు:

"మహారాజశ్రీ సీ-పీ-బ్రౌన్ యిస్కొయరు బహదర్ దొరగారి సము ఖానకు, రాజమహేంద్రవరం జిల్లాలో చేరిన ద్రాక్షారామ కాపురస్థుడున్ను, శ్రీ రాజా అంగర బ్రహ్మాజి కృష్ణోపంతులు బహదరు యేన్‌షియేంటు జమీ దారుగారి వకీలున్ను అయిన, దేవరకొండ లక్ష్మీకాంతం అనేక సలాములుచేసి వ్రాసుకొన్న అర్జీ విన్నపము-తమరు యీ దేశమునుంచి, ఇంగ్లండుకు విజ యము చేయగలందులకు కోరంగి రేవుకు వచ్చినప్పుడు[10] శీమవాడ మీద వేంచేసి వుండగా, మా రాజాగారితో కూడా నేనున్ను తమ దర్శన లాభమును పొంది, సెలవు పుచ్చుకొని వచ్చినది మొదలు, తమరు కార్య సఫలమును పొంది త్వరగా విజయము చేశేలాగు, భగవంతుణ్ని వేడుకొంటూ వుంటిని. యీ జిల్లాలో వుండే

10. "17th December 1834." (Ibidem; Page-127.) బ్రౌనుదొర మూడు సంవత్సరముల సెలవుమీద ఇంగ్లండునకు పోవుచు, కోరంగి రేవు నకు వచ్చిన "శీమవాడమీద" ఉన్న తేది.

అన్యాయమనే చీకటి తమ న్యాయాధికారమనే సూర్యోదయముచేత హత మైనందున, దుర్మార్గ ప్రజలు దేశాంతర వ్యవస్థితులై పోయినారు. ఈ జిల్లాలో వుండే ప్రజలయొక్క దురదృష్టంచేత తమకు సీమకు పోవడం తటస్థమైనందున, దుర్మార్గులకు యేమి హర్షముగా వున దోగాని, యితరులు తమరు యెప్పుడు విజయము చేతురని, తమ రాక కెదురుచూస్తున్నారు".

"ఇటువంటి న్యాయకర్తలున్ను, మా రాజాగారికేమి, నాకేమి. ప్రాప కులునైన్న తమ దర్శనము కలక కుండా అయిన వ్యవధికి, మేము పొందుతూవున్న వ్యాకుల సముద్ర తరంగముల పరిమితము తెలియపరచడమునకు శక్తి చాల నందున, వివరం వ్రాసుకోలేదు......"

"ఈ సంవత్సరం యీ జిల్లాలో సంభవించిన అనావృష్టి దోషమువల్ల బహు క్షామంగా వున్నది. మా రాజాగారి తాలూకాలో బొత్తిగా వర్షములు లేనందున. సర్కారు పేష్కష్ వగయిరాకు పావుమట్టుకైనా వచ్చేటందుకు అయివజు కను పించకుండా వున్నది. దేవుడి అనుగ్రహము చేతనున్ను తమ కటాక్షము చేత నున్ను, ఈ సంవత్సరం దాటిపోవలెనుగాని, మా యత్నంచేత యేమిన్ని కని పించి వుండలేదు......... సీమ వదిలి తమరు చెన్నపట్నానికి విజయం చేయగానే, నేను పొందిన సంతోషము వెంటనే విన్నపము చేసుకోవలెనని అనుకొన్నాను. అయితే, మా రాజాగారి ద్వారా యావత్తు సంగతులు తమ చిత్తానకు విశద మవుతున్నది........ నేను తమ దర్శనము నిరీక్షిస్తూ వుండే సంగతి తమ చిత్తా నకు తెలియగలందులకు మిక్కిలి వినయ విధేయ పూర్వకముగా ప్రార్థిస్తున్నాను' అర్జీ తప్పులు క్షమించ కర్తలు. దివ్యచిత్తానకు తేవలెను"

"ఆన ౧౮౩౮ సం॥ డిసెంబరు నెల ౧౬ తేది".

(తెలుగు రీడరు; పుటలు-౨౦౩, 204, 20౫.)

బ్రౌనుదొరకు తెలుగు సాహిత్యముతో పరిచయ మున్నదని గాబోలు కొందరు అర్జీదారులు, తమ తమ విన్నపములలో తెలుగు పద్యముల నుదాహ రించుటయు గలదు, ఉద్యోగము నిప్పింప వలసినదని ప్రార్థించు అర్జీదారు డొక డును; పోలీసు అధికారులు అన్యాయముగా తనకు పన్ను విధించిరి గనుక దానిని తీసివేయింపుడని యొకడును, తాము వ్రాసికొనిన అర్జీలలో-భాగవతములోని గజేంద్ర మోక్షమునుండి పద్యములను గ్రహించి, మనవిగా చెప్పుకొనిరి. ఈ

రెండు జాబులకును - తెలుగు రీడరునకు ఇంగ్లీషు అనువాదముగా అచ్చువేయించిన పుస్తకములో (English Translations of the Exercises and Documents printed in the Telugu Reader) ఆంగ్లానువాదముల నిచ్చు సందర్భమున, జాబులలో నుదాహృతములైన భాగవత పద్యములకును, ఆంగ్లానువాదములను బ్రౌనుదొర ఇచ్చెను. ఇట్లిచ్చుటయేగాక, అవి తాను ముద్రించిన భాగవత గ్రంథమున నెచ్చట వచ్చునో; సూచించెను.

ఈ రెండు జాబులను; 1833 ప్రాంతమున, ఆంధ్ర దేశమును దుర్భర క్షామము పీడించుచుండగా, పీడితులైన అర్జీదారులు, బ్రౌనుదొరకు తమ కష్టములను నివేదించుకొనుచు వ్రాసికొనిరి.

"కచ్చేరిలో ప్రాపకములేని" కారణమున, పది సంవత్సరముల నుండి ఉద్యోగము లేక బాధపడుచున్న "సోమయాజుల రామయ్య"గారు వ్రాసికొనిన "అర్జీ విన్నపం" మొదటిజాబు, "కొల్లిపురం కాపురస్థుడయిన" ఈతడు ఈ విధముగా వ్రాసికొనెను:

"నేను పది సంవత్సరముల నుండి నవుకరిలేక బహుకష్టపడుతూ వుండి, కచ్చేరిలో ప్రాపకం లేనివాణ్ని గనుక,' మేనఙ దొరగారు ఈ జిల్లా కలెక్టరుగా వస్తున్నారని విని, సమయముకాచి, కంభం వద్దికి యెదురుగా వెళ్ళి, అక్కడ దర్శనము చేసుకొని, గుంటూరికి కూడా వచ్చి, తదారభ్య పల్నాడు వగైరా ప్రతి ప్రదేశములో, విరామము లేకుండా హాజరు జామిచేసి, పనులు ఖాలీ అయిన సమయములలో, ఇంగ్లీషున అర్జీలు వ్రాయించి, టపాల మూలముగా దాఖలు చేసుకొంటూ వచ్చినప్పటికిన్ని.... పని యిప్పించక పోయినారు. క్షామ[11] దినములు కూడా వచ్చినవి గనుక, పిల్లలు, నేను బ్రతకడానకు యే విధమయిన తారకము కనుపించక, పెద్దాపురములో మా బంధువులు వుండగా, వారు యేమయినా సహాయము చేతురేమో అని, అక్కడికి వెళ్ళిన సమయమునందు, తమరు గుంటూరు జిల్లాకు కలక్టరుగా విజయముచేసి . చిల్కలూరుపాటి తాలూకా జప్తు చేసినారు. ఆ సమయాన కూడా నేను వుండడానకు లేకపోయినది,"

---

11. "This famine lasted for three years and its effects been felt for ten years more." (Ibidem; Page-109.)

"తర్వాత, యీ సంగతి నేను అక్కడనే విని తక్షణమే ప్రయాణమై గుంటూరు వచ్చేవరకు, తమరు పల్నాడు విజయము చేసినారు. .... సనులు ఖాళీ అయ్యే సమయమందు నేను దగ్గిర వుండకుంటే, నాకు పని దొరకదు గనుకనున్ను; తమ సముఖములో వచ్చి కనిపెట్టుకొని వుందామంటే, భత్య ఖర్చుకు యిబ్బందిగా వున్నది గనుకనున్ను; యెటూతోచక, అర్జీ మూలముగా నయినా నా సంగతి తెలియచేసుకొందామని విన్నపము వ్రాసుకొన్నాను".

ఈ అర్జీ చిత్తగించి, వచ్చేలాగున ఆజ్ఞ దయచేయిస్తే, భత్య ఖర్చుకున్ను అప్పు పుట్టుతున్నది. వచ్చేటందుకు ధైర్య శక్తికిన్ని తారకముగా వుంటున్నది. .......నేను బహు దీనదశలో వున్నాను. యిప్పుడు నేను వుండే తీరు ఈ పద్య భావముగా వున్నది''.

"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్, ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిం, నీవే తప్ప నితఃపరం బెరుగ మన్నింపం దగుం దీనునిన్, రావే యీశ్వర కావవే వరద" అని విష్ణుమూర్తిని గురించి గజేంద్రుడు మొరబెట్టుకొన్న ప్రకారము, తమ్మున్న మిక్కిలి ప్రార్థిస్తున్నాను. మరిన్ని "దీనుల కుయ్యాలింపను, దీనుల రక్షింప మేలు దీవెన లొందన్, దీనావన నీ కొప్పును, దీనపరాధీన" అనే భావన తమ్ము చెంది వున్నది గనుక, రక్షకులకు తరుచుగా వ్రాసుకో గలదిలేదు. దివ్యచిత్తానకు తేవలెను".

ఆన ౧౮౩౩ సంవత్సరం ఫిబ్రవరి నెల ౨౯ తేది.

(తెలుగు రీడరు; పుటలు-178, 179) "సోమయాజుల రామయ్య వ్రాలు".

ఈ జాబులోని భాగవత పద్యములకు, బ్రౌనుదొర యొక్క అనువాద మిట్లున్నది

"I have not the Cest etrength : resolution is dissolved : my spirits have left me : fainting comes o'er me : my limbs are wasting away : It is ill with me : I know none but thee : it is right that thou shouldst rescue me : come to aid me O Lord ! Deliver me thou who grantest our prayers !"

**"To listen to the prayer of the wretched, to rescue the humble, to gain the highest praise O Saviour of the helpless, is thine alone ! thou who art the refuge of the miserable !"[12]**

"మోతరఫాపన్ను" ఇచ్చికొనలేక, దానిని "మాఫు" చేయివలసినదని ప్రార్థించుచు, "నకరకంటిపేట కాపురస్థుడయిన....గంధం సుబ్బంశెట్టి వ్రాసుకొన్న అర్జీ"లో కూడ, భాగవతములోని "లావొక్కింతయులేదు...." అను పద్యము ఉదాహరింపబడినది. ఇదికూడ, క్షామ పరిస్థితులు[13] ఆంధ్రదేశమున మర్మురముగనున్న కాలమందే (1833) "అర్జీ దారుడు" వ్రాసికొన్న జాబు.

"నేను మ॥ మజుకూరిలో కాపురము వుండి......మోతరఫా పన్ను యిస్తూవున్నంతల్లో, అదివరకు నా సంసారము చాలా క్షీణించి, వాణిజ్యము చేసుకోవడమునకు దాడుఢ్యము లేకపోయినందున, ఆ పన్ను యివ్వలేకనున్ను, యిక్కడ జీవనము లేకనున్ను నరసారావుపేట డివిజన్ యిలాకా రూపనగుంట్ల అనే గ్రామానకు లేచివస్తే, నాయొక్క స్థితి విచారించకనే నకరకంటిలో యిస్తూ వున్న........ పన్ను డవులున కట్టి నన్ను తెమ్మని తగాదా చేసినందున, వొక చెంబున్ను వొక పళ్ళెమున్ను వుండగా, అది తెగనమ్మి, ఆ సంవత్సరము పన్ను యిచ్చి ఆ వూరిలో వుండి జీవనము చెయ్యలేక, కూలిచేసుకొని అయినా, బ్రతుకుదామని, తిరిగీ నకరకల్లుకు పోతిని. అక్కడా నున్ను యెప్పటివలెనే ౧౨౪౧ ఫసలి (A.D. 1832, C.P. Brown) సాలుకు డవులు కట్టి, పయికము తెమ్మని తగాదాచేస్తే, భిక్షముయెత్తి పయికము దాఖలుచేసినాను. ౧౨౪౨ ఫసలి (A.D. 1833, C.P. Brown) సాలుకు తిరిగీ డవులు కట్టి పయికము తెమ్మని తగాదా చేస్తారనే భీతాహము చాలా వున్నది....... భిక్షము యెత్తడానకు దుర్భిక్ష కాలము అయినందువల్లనున్ను......యిప్పుడు నేను వేడుకోనడమేమంటే :

"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్, ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె తనువుం డస్సెన్ శ్రమంబయ్యెడి న్నీవే తప్ప యితఃపరం బెరుగ మన్నింపందగుం దీనునిం, రావే యీశ్వర కావవే వరద" అని గజేంద్రుడు

---

12. Ibidem; Page - 110.

13. "In this year there was a dreadful famine." (Ibidem, Page-71,)

మొరపెట్టుకొన్నట్టుగాను, 'నా విష్ణుః పృథివీ పతిః' అనే న్యాయముచేతను విష్ణు అంశా సంభూతులైన తమ్మున్న నేను వేడుకొంటున్నాను గనుక, నా స్థితి విచారించి, నాకు వన్ను మాపు దయచేయించ వలయునని కోరుతున్నాను."

(తెలుగు రీడరు : పుటలు-119, 120).

ఈ భాగవత పద్యమునకు, ఆంగ్లమున పద్యానువాద మిట్లు సాగినది:

**"I faint for breath ! my strength is gone ! I die**

**My soul is spent; this is my latest sigh**

**I sink, my limbs are yielding, I am gone,**

**Thou art my sole reliance, thou alone!**

**Save me O Lord, rescue my sinking heart**

**My hope, my life, my all alone thou art !"**

'నా విష్ణుః పృథివీ పతిః' అన్నదానికి, బ్రౌనుదొర లాటిన్ భాషలోని "Nisi Jupiter nullus rector terrae"అను వాక్యమునిచ్చి, ఫుట్ నోట్ లో, "Na Vishnuh prithivi patih. In Telugu Vishnuvu Cani Vadu razu cadu ; he who is not God is no ruler" అని ఇచ్చెను.[14]

'తెలుగు రీడరు' యొక్క ఫుట్ నోట్ లో, ఈ పద్యమును గూర్చి యిట్లు వ్రాసెను. "A stanza quoted from the గజేంద్ర మోక్షం in the 8th book of the Bhagavatam, the quarto edition 1854, page 317."[15]

---

14. Ibidem ; Page - 71.

15. The Telugu Reader (2 nd Edition-1867), Page - 119.

ఆ డామ కాలములో ప్రజలు పడిన కష్టముల నెరింగిన బ్రౌనుదొర వీరికి సాయముచేసి యుండుననుటలో సంశయము లేదు.[16]

కన్యాశుల్కమున్న ఆ రోజులలో; "...యింకా కొన్ని దినములు సంసారము చెయ్యవలెననే యిచ్ఛ" ఉన్న ఒక కరణముగారు, పెండ్లి కూతురునకు శుల్కముగా ధనమియవలసి యున్నది గనుక, తనకు ధన సాహాయ్యము చేసి, "కన్యాదానం చేయించి, యిల్లు నిలుపవలెను," అని బ్రౌనుదొరకు జాబు వ్రాసికొనెను. ఈతనికి బ్రౌనుదొర సాయము చేసెనో లేదో తెలియదుగాని, ఆంగ్లానువాదములో - ముఖ్యముగానది ఇంగ్లీషు వారికొరకు గనుక - కన్యాశుల్క మననేమో తెలిపెను. కరణముగారికి కావలసినది అరువది రూపాయలు మాత్రమే !

---

16. కీ॥శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, (1888-1950) బ్రౌనుదొరను గూర్చి ముచ్చటించు నొక సందర్భమున ; "బ్రౌనుదొరగారి కెవఁడో దీనుఁడు ఈ క్రిందిపద్యమును అర్జీగా వ్రాసి పంపుకొన్నాఁడట" అని, "లావొక్కింతయు లేదు..." అను పద్యమునిచ్చి తరువాత నిట్లు వ్రాసిరి. "బ్రౌనుదొరగారా దీనునకేదో కొంత సొమ్ముతోపాటు ఆ యర్జీ మీఁదనే 'ఎండార్సుమెంటు'గా ఈ క్రింది పద్యమును వ్రాసి పంపినారట !"

"ఏను మృతుండ నౌదునని యింత భయంబు మనంబు లోపలన్
మానుము సంభవంబుగల మానవకోట్లకు చావు నిక్కమౌఁ
గాన హరిం దలంపు మిఁక గల్గదు జన్మమునీకు ధాత్రిపై
మానవనాథ ! చెందెదవు మాధవలోక నివాస సౌఖ్యముల్."

"బ్రౌనుదొరగారికి కూడ భాగవత మింత పరిచయమయినది !" 'చాటుపద్య మణిమంజరి' యందును, ఈ విషయము 69 - 70 పుటలలో గలదు. వేటూరివారి వంటి పండిత పరిశోధకులు కూడ బ్రౌనుదొర సాహిత్యసేవను మెచ్చుకొనుచు ఆ విషయమును ఎడనెడ తెలుపుచునే యుండిరి.

ఈ 'ఎండార్సుమెంటు', మోతరఫా పన్ను ఇచ్చుకొనలేని సుబ్బంశెట్టికి పోయినదో, "కచ్చేరిలో ప్రావకములేని" సోమయాజుల రామయ్యగారికి పోయినదో !

ఆ రోజులలో డబ్బునకువిలువ ఎక్కువ గనుక ; సంవత్సరము, క్షామ సంవత్సరమైన 1833 గనుక - అంత మొత్తము లభించుట కష్టమై, అర్జీదారుడు బ్రౌనుదొరకు విన్నపము చేసికొనవలసి వచ్చెను. ఇట్టి అర్జీ పెట్టవలెనను ఊహ తట్టుటకు, బ్రౌనుదొర యొక్క మంచి తనమును గూర్చి అర్జీదారుడు వినుటయే కారణము కావచ్చును. తెలుగుప్రజలలో బ్రౌనుదొరవిషయమున ఎంతటి చనువుకలదో చూపుటకు ఈ "అర్జీ విన్నపం" చక్కని తార్కాణము:

"మహారాజశ్రీ సీ. పీ. బ్రౌన్ యిస్క్వాయరు కలక్టరు జిల్లా గుంటూరు సర్కారు మూర్తుజాన్నగరు తాలూకే వల్లాడు వగైరా గారి సముఖానకు, రాచూరి తాలూకాలో చేరిన ఆత్మకూరి కరణమైన ఆలూరి నారాయణప్ప వ్రాసుకొన్న అర్జీవిన్నపం. లోవయినం పది సంవత్సరముల కిందట నాకు వివాహమై, నిరుడు దైవోపహతంచేత నా భార్య వియోగమయినది. యీ సంవత్సరము పునః ప్రయత్నం చేసేటందుకు, కాలం బెట్టగా వుండడమున్ను, పంటలు లేక పోవడమున్ను....హేతువుల వల్ల, నిత్యకృత్యానికే చాలా శ్రమగా వున్నది.... మొదటి పెండ్లికే చిన్నదాని నిమిత్తమై వందల పరియంతం పుచ్చుకొంటారు. యీలాగంటి పనికి రెండో పెండ్లి అనగానే, నాలుగు వందల రూపాయీలు అడుగుతారు. గనుక, నా విష్ణుః పృథివీ పతిః అనే న్యాయకర్తలయిన తమకు మనవి వ్రాసుకొనేది యేమంటే ;

మా గ్రామములో .... ....పిల్ల వున్నది ... నా చేత అరువై రూపాయలు దత్తముగా పుచ్చుకొని, ఆ చిన్న దాన్ని నాకు యిస్తామనిన్ని, నెలలో పెండ్లి చేసుకొంటేనే కాని, చిన్నదానికి యేండ్లు మించి వున్నందువల్ల, తలిదండ్రులు గంగా ప్రవేశం కావలని వస్తున్నదనిన్ని, నీ చేత రూపాయలు తేలని పక్షమందు, మరి వొకరికి యిచ్చుకొంటామనిన్ని చెప్పినారు. అంతట, యీ రూపాయలను గురించి యెన్ని విధముల విచారించినా, పంటలు లేనందున, నా వల్ల వరపతి పుట్టకపోయినది. నేను వివాహము చేసుకోకుండా విరక్తి మార్గాన వుండడానకు, యింకా నాకు కొన్ని దినములు సంసారము చెయ్యవలెననే యిచ్ఛ వున్నది గనుక, తిరిగి గృహస్తాశ్రమానకు రావడము యుక్తముగా వున్నది. యీ చిన్నది పరస్పరముగా పోయిన పక్షమందు, నాలుగయిదు వందల రూపాయల పర్యంతము అడుగుతారు గనుక, అప్పట్లో నాకు వివాహంకానేరదు. సకల ధర్మ స్వరూపులయిన తమరు నావంటి దీనునికి కన్యాదానం చేయించి, యిల్లు నిలుపవలెను...."

"అన ౧౮౩౩ సంవత్సరం ఫిబ్రవరి నెల ౨౬ తేది."

(తెలుగు రీడరు ; పుటలు - 195, 196)

తెలుగు రీడరు, ఆంగ్లాను వాదమున, ఈ లేఖ ననువదించు సందర్భమున బ్రౌనుదొర 'కన్యా శుల్కము'ను.* గూర్చి ఇట్లు నోటు వ్రాసెను. ".... .... the more daughters a man has, the better off he is; as there is always a rapid demand for them; but to get a son married is difficult and costs a large sum. A widower finds the difficulty still greater."[17]

ఈ అర్జీ విన్నపమును బ్రౌనుదొర మన్నించెనో లేదో తెలియదుగాని, నాటి తెలుగు ప్రజలకు ఆయన యందున్న 'ఆత్మీయత' నీ విన్నపము రుజువు చేయుచున్నది.

కేవలము, కోర్టు పనులకు సంబంధించిన అర్జీలు లెక్కలేనన్ని గలవు. వీటి యందును, బ్రౌనుదొర విషయమై సమకాలిక ప్రజలకు గల సద్భావమును వెల్లడించు సూచన లెన్నియోగలవు. చిరకాలము నుండి; స్థానిక ప్రభువుల నడుమ గల అంతఃకలహముల వలన శాంతి భద్రతలను నోచికొనని ప్రజలు, నిరంకుశత క్రింద నలిగిపోవుచున్న జనులు — అందరికిని ఒకే విధముగ న్యాయమును ప్రసాదించుచున్న ప్రభుత్వము — అది పర ప్రభుత్వమైనను — రాగానే, ఆ ప్రభుత్వమునకు బ్రౌనుదొర వంటివాడు ప్రతినిధియైన అధికారిగా రాగానే; ఆయనకు తమ కష్ట సుఖములను — ఒక్కొక్కప్పుడు, ఉచితానుచితత్వములను గణింపకయే —

---

17. English Translations of the Exercises and Documents printed in the Telugu Reader; Second Edition; 1865. Page - 122.

* కన్యాశుల్క సమస్య ఆనాడు అంత తీవ్రముగ నుండుటచేతనే, విజయనగరం మహారాజులైన ఆనంద గజపతిగారు (1850-1897) ఆ సంబంధమైన లెక్కలను తీయించుట, గురజాడ వారు (1862-1915) కన్యాశుల్క నాటకము (1897, 1909 కూర్పులు) వ్రాయుట జరిగినదను విషయమును ఈ సందర్భమున స్మరింపవచ్చును.

మనవిచేసికొన జొచ్చిరి. తమ గృహచ్ఛిద్రములను కూడ ఆయనకు వ్రాసికొన జొచ్చిరన్నచో ఆయనయందు వారికెట్టి భావముండెడిదో మనకు తెలియగలదు.

స్వయముగ నాయనకు వ్రాసికొనిన జాబులలోనే గాక, తెలుగువారు తమలో తాము వ్రాసికొనిన జాబులందును, బ్రౌనుదొరయొక్క న్యాయదృష్టిని, సత్య తత్పరతను ఉగ్గడించిరి. ఆంధ్రదేశములోని వివిధ ప్రాంతములవారు; బ్రౌను దొర తమ తమ జిల్లాలకు ఎప్పుడు ఉద్యోగిగా వచ్చునా, ఎప్పుడాయనకు పెద్ద ఉద్యోగమగునా, ఆశ్రితులకు ఉపకారములు జరుగునా అని నిరీక్షించెడి వారన్నచో, ఆయనయందు తెలుగు ప్రజలకెంతటి ఆదరాభిమానములు గలవో తెలియును. ఈ విషయమును రుజువుచేయు జాబులలోని కొన్ని భాగములను ఇట నిచ్చుచున్నాను:

"శ్రీరస్తు కందుల సుందరయ్య మా కొమాళ్ళు గున్నయ్యను సుబ్బన్నను ఆయురారోగ్యైశ్వర్య పుత్రపౌత్రాభి వృద్ధిగాను" దీవించుచు "వైశాఖ శుద్ధ ౧౨ బుధవారము (1st May 1838)" నాడు వ్రాసిన జాబులో, తమ సంసారముయెక్క కష్టములను గూర్చి వ్రాయుచు; బ్రౌనుదొరను గూర్చి, "... మునసపులకు జీతములు యేర్పరచి, మునసపు కోర్టులలో గుమాస్తాలను నిర్ణయించబోతారని చెప్పుకొంటూ వున్నారు. యీ సమయములో మన ప్రభువు వారు యిక్కడ వున్నట్టయితే, సుబ్బన్నకు వొకపని అవశ్యం అవును. అట్లా కాక పోవడానకు వారు యిక్కడ లేకపోయినారు...... యీ వుత్తరము మీకు అంది నట్టుగానే అక్కడి, రాచకార్య విశేషములున్ను, మహారాజశ్రీ బ్రౌన్‌దొరవారు తిరిగీ యిక్కడికె వస్తారని అనుకొంటున్నారో, లేక, మరివొక చోటికి గొప్ప వుద్యోగము చేసుకొని పోతారని అనుకొంటున్నారో ఆ సమాచారమున్ను, చక్కగా ఆకళింపు చేసుకొని, వ్రాయించవలెను."

(తెలుగు రీడరు : పుటలు - 146, 147)

బ్రౌనుదొరను తిరిగి అధికారిగా మా జిల్లాకు పంపించవలసినదని, ప్రజలు ప్రభుత్వమునకు మహజరులు పంపించుట కూడ గలదు. ఇట్టి "మహజరు" నొక దానిని పంపించుచున్నామనియు, అధికారికి ఈ విషయము ముందు తెలియజేయ వలెనను భావముతో తానీలేఖను వ్రాయుచున్నాననియు తెలుపుచు, "నీలపల్లికి" చెందిన "నేదునూరి మల్లపరాజు"గారు అనునాతడు బ్రౌనుదొరకు 12 మే 1840

నాడు ఒక జాబు వ్రాసెను. అందులో "మహజరు"నకు సంబంధించిన భాగము నిట ఉదాహరించుచున్నాను:

"తమరు యీ జిల్లాలో న్యాయాధిపతులై వున్నప్పుడు, బహున్యాయముగానున్ను, బహుదర్పముగానున్ను, అధికారం చేసినందున. అబద్ధపు వ్యాజ్యగాండ్లందరు తమయొక్క ధాటికి నిలవలేక పారిపోయి, అరణ్యములలో దాగి వుండిరి. అప్పట్లో వాండ్లవల్ల మావంటి గొప్ప వర్తకులకు యేవిధమైన తొందరలు లేకుండా మేము బహు నెమ్మదిగానున్ను, బహు సురక్షితముగానున్ను వుంటిమి. తమరు యీ జిల్లానుంచి వెళ్ళగానే ఆ అబద్ధపు వ్యాజ్యగాండ్లందరు తిరిగీ రాజమహేంద్రవరం ప్రవేశించి. మావంటి గొప్ప వర్తకులమీద అబద్ధపు పాపపు వ్యాజ్యములు వేసి, చాలా తొందర పెట్టుతున్నారు. గనుక. తమరు ఈ జిల్లాకు తిరిగీ న్యాయాధిపతులయి విజయముచేస్తే, మావంటివారికేమి, యితరమైన ప్రజాసముదాయమునకేమి చాలా సౌఖ్యముగా వుండునని ఆలోచించి, తమరు లోవయినం యీ జిల్లాలో జరిగించిన న్యాయమునున్ను, ఈ ఫౌజదారి వ్యాజ్యగాండ్లు ప్రజలను బాధింపచేస్తూవుండే క్రమమునున్ను. గౌరణమెంటువారికి తెలియచేసే నిమిత్తము వొక అర్జీ వ్రాయించి, ఆ అర్జీలో ఈ చుట్టుపట్ల గ్రామాదులలో వుండే వాడ వర్తకులచేతనున్ను, యితరమైన ప్రముఖుల చేతనున్ను, మహజరు దస్కతులు చేయిస్తున్నాను. అది నేట రేపట పంపిస్తున్నాను. గనక, విశదంకొరకు వ్రాసినాను". (తెలుగు రీడరు : పుట-202).

వర్తకులలో, ప్రజలలో, చిన్న ఉద్యోగులలో, రైతులలో బ్రౌనుదొరకు, యోగ్యుడైన ఉద్యోగి అని పేరు వచ్చినది. లంచగొండులైన అధికారులు, బ్రౌనుదొర పేరు విన్నంతనే భయపడి, తాము తీసికొన్న లంచమును తిరిగి ఇచ్చివేయుటయు కలదన్నచో, బ్రౌనుదొరకున్ను పేరుఎట్టిదో తెలియును. దీని కుదాహరణ ప్రాయముగా: "మట్టపల్లి భగవానులు"గారు అను గుంటూరు వర్తకుడు, తనను చిన్న చిన్న ఉద్యోగులు వర్తకము చేసికొననీకుండ, లంచమిమ్మని ఎట్లు బాధించుచున్నారో, బ్రౌనుదొరకు అర్జీ మూలమున తెలియజేసికొనుచు వ్రాసిన జాబులోని ఈ క్రింది భాగమును గ్రహింపవచ్చును:

"....యిప్పుడు పేష్కారు నన్ను వర్తకము చేసుకోకుండా సకల నిర్బంధములు పెట్టుతూ, నిహేతుకముగా నాదగ్గిర వొక అరరూపాయి కూడా. అప

రాధము పుచ్చుకొని, తమరు విజయము చేస్తారని తెలిశి, నిన్న ఆ అర్ధరూపాయి మళ్ళీ నాకు యిచ్చివేసినాడు..." (తెలుగు రీడరు: పుట–152.)

న్యాయాధికారిగా బ్రౌనుదొర పేరున కంత విలువ ఉండెను. కంపెనీ యొక్క ఉద్యోగులైన స్వదేశస్థులచే, ఎవరు తన కధికారముగల జిల్లాలో పీడింపబడుచున్నను, బ్రౌనుదొర అచ్చట న్యాయాన్యాయ విచారణచేసి; ప్రజలకు న్యాయము నిచ్చెడివాడు. దీనికితోడు ఆయనకు దేశీయ భాషా సాహిత్యముల యందుగల ప్రీతి, పాండిత్యము కూడ, తెలుగు ప్రజలను విశేషముగ నాకర్షించెను.

బ్రౌనుదొరకు నాడుత్తరములు వ్రాసిన వారంతరు, ఆయనవలన ఉద్యోగ లాభమును పొందవలెనని తలంచినవారు కారు. ఆయన లిఖితప్రతుల సేకరణము, సేకరించిన గ్రంథములకు వ్యాఖ్యానములు వ్రాయించుటయు, చేయుచున్నాడని నాడు సర్వజన విదితము. తెలుగునకు ఆంగ్లమున వ్యాకరణాదులను రచించుచున్నాడనియు అందరికి తెలియును. కనుక, ఇట్టి కృషులందు కుతూహలమున్న తెలుగువారు, తమకు తమ పనులయందు సాయము కావలసి వచ్చినప్పుడు, బ్రౌనుదొరకు జాబులు వ్రాసికొనుటయు కలదు. ఇట్టి జాబులనుండి, విలక్షణములైన వానిని రెండింటి నిట చూపుచున్నాను. ఈ జాబులు, బ్రౌనుదొర కృషి విషయమున, సమకాలికుల కెట్టి భావముండెడిదో, తెలుపును:

"మహారాజశ్రీ–సీ–పీ–బ్రౌన్ దొరగారి సన్నిధికి, చింతాద్రిపేటలో వుండే చిత్రాల వీరాస్వామినాయుడు అనేక సలాములుచేసి వ్రానుకొన్న మనవి యేమంటే, తాము ఈ దేశములో గల నానా విద్యలను గ్రహించినదేగాక, అనేక గ్రంథములు, లేఖరులవల్ల బుట్టిన తప్పులను దిద్ది, శుద్ధ ప్రతులు చేయించి వున్నారని, బహుజనులవల్ల విని యున్నాను. నేను అనేక దినములుగా, యేదైనా భగవత్పరమయిన ఒక గ్రంథమును చాపా వేయించి, అందువల్ల భగవద్దయాపాత్రుడను కావలెనని యెంచి వుండేటందువల్ల, తమవద్ద శుకప్రణీతంబయిన కృష్ణకర్ణామృతము వుండుటకు, సందేహములేదు గనుక, దయచేసి, ఆ కృష్ణకర్ణామృతము పద్యపూర్వకముగా వుండేదాన్ని నాకు యిప్పించవలెనని వినయముతో వేడుకొనుచున్నాను. దివ్యచిత్తానకు తేవలెను".

(తెలుగు రీడరు; పుట – 115)

ఈ లేఖనుబట్టి, నాడు చదువుకొన్న తెలుగు వారిలో బ్రౌనుదొర విషయమున ఎట్టి సమ్మకముండెడిదో తెలియును. "కృష్ణకర్ణామృతము వుండుటకు, సందేహాము లేదు గనక......" అని వ్రాయుటయందే నాయుడుగారికి బ్రౌనుదొరయొక్క "కృషి" విషయమున గల విశ్వాసము వ్యక్తమగుచున్నది. ఈ జాబులోని "చాపా వేయించి" (అచ్చు వేయించి) అను మాట నాటి తెలుగు వారి వ్యవహారమున 'హిందుస్థానీ' మాటలకు గల ప్రాచుర్యమును తెలుపుచున్నది.

ఇక రెండవ జాబు: "ఇంగ్లీషు గ్రామర్ భావమునకు అనుగుణ్యాముగా తెనుగున ఒక గ్రంథము చేయవలెనని" యోచించుచున్న "నేదునూరి మల్లపరాజు"గారు తనకు ఈ రచనయందు సాయము చేయవలసినదిగా బ్రౌనుదొరకు వ్రాసినది. ఈ లేఖనుండి, ప్రస్తుత విషయమునకు సంబంధించిన పేరాను చూపుచున్నాను:

"ఇంగ్లిషువారు తెనుగు నేర్చుకోగలందులకు తెనుగు గ్రామరు చేయబడి వున్నది గాని, తెనుగువారు ఇంగ్లిష నేర్చుకోవడమునకు వుపయోగకరమైనది కాదు. కాబట్టి, తెనుగువారు ఇంగ్లీషు విద్యను సులభముగానున్ను, లక్షణయుక్తముగానున్ను, అభ్యసించడమునకు సాధనమయ్యేటట్టు, ఇంగ్లిషు గ్రామర్ భావమునకు అనుగుణ్యాముగా తెనుగున ఒక గ్రంథము చేయవలెనని యోచిస్తున్నాను. కాబట్టి యిటువంటి గ్రంథము చెన్నపట్నములో యిదివరకు యెవరైనా చేసి వున్నారో, లేదో, ఆ సంగతి నాయందు చాలా అనుగ్రహాము వుంచి వ్రాయించవలెను. ఇంగ్లీషు, తెనుగు విద్య, ఈ రెంటియందున్న సమానమైన పాండిత్యము కలవారు ఈ చుట్టుపట్ల యెవరున్ను లేరు. అయితే, తమరు ఈ రెండు విద్యలయందున్ను, విశేషమయి నటువంటిన్ని సమానమైనటువంటి పాండిత్యము కలవారు గనక, తమవంటివారి సహాయము వుంటే, ఈ గ్రంథము సులభముగా అవుతున్నది. కాబట్టి, యేతద్విషయమై తమ సన్నిధానమునకు కొద్ది రోజులలోనే రావలెనన్న తాత్పర్యము నాకు వున్నది. ఈ విషయమై నేను తమ సన్నిధియందు వున్నట్టే, నాయందు చాలా అనుగ్రహాము వుంచవలెను. యిందుకు ప్రత్యుత్తరం వ్రాయించి పంపిస్తే పోష్టు ఖాకలు యిక్కడ యిచ్చుకొంటాను. చిత్తగించవలెను; యిదే పదివేల విన్నపములు".

(తెలుగు రీడరు: పుటలు - 202, 208)

ఈ జాబులోని చివరి వాక్యము, లేఖారచయిత బ్రౌనుదొర విషయమున గౌరవము కలవాడేగాని, జీవికకు ఆయనపై ఆధారపడి యున్నవాడు కాడనియు, దొరను పొగడవలసిన పని ఉన్నవాడు కాడనియు, తెలుపును. ఇందు వలన, ఈ జాబునకు ప్రత్యేకమైన విలువ కలదు. బ్రౌనుదొర విషయమున, లేఖారచయిత వెల్లడించిన భావము, నాటి తెలుగువారి కందరికిని కలదు. బ్రౌనుదొర, అధికారి గనుకనే, ఆయన కృషిని పండితులు, పామరులు, మెచ్చుకొనిరని తలంచుటకు వీలులేదు.

తెలుగు రీడరు, ఆంగ్లానువాదమున. ఈ లేఖ ననుసరించు సందర్భమున, బ్రౌనుదొర 'ఫుట్ నోట్', ఇట్లు వ్రాసెను. "The simple soul who wrote this had but poor success in his undertaking"[18] "మల్లపరాజు" గారు తనపనియందు కృతకృత్యుడు కాలేకపోయినను, బ్రౌనుదొరకు ఆతనియందు గౌరవాభిమానము లున్నవని ఈ 'నోట్' తెలియజేయుచున్నది.

గుణవంతులైన పండిత పామరు లందరును నాడు బ్రౌనుదొరయొక్క ఆదరాభిమానములను చూరగొన్నవారే! దేశీయుల ఆచార వ్యవహారములను, సాహిత్య సంస్కృతులను; బాగుగా గ్రహించి, అర్థము చేసికొని, తమ ఉద్యోగ ధర్మములను నిర్వహించుకొనిన నాటి పాశ్చాత్యులలో బ్రౌనుదొరయే అగ్రగణ్యుడు.

పైని చెప్పబడిన, మల్లపరాజుగారే బ్రౌనుదొరకు వ్రాసినలేఖలోని ("శార్వరి నామ సం॥ వైశాఖ బ॥ 12 గురువారము—" 12 మే నెల, 1840.) ఈ క్రింది వాక్యములు ఇందులకు తార్కాణము:

"తమరు ఈ జిల్లాలోనుంచి సీమకు విజయంచేశి, సీమనుంచి తిరిగీ చెన్నపట్నం ప్రవేశించి చాలా దినములు అయినవి. తదారభ్య తమరు నాకు వొక ఉత్తరమైనా వ్రాయించనందున, తమరు నన్ను మరచినారని నిశ్చయించుకొని, నాయందు తమకు జ్ఞాపకం వుండే కొరకు ఈ ఉత్తరం వ్రాసుకోవడమైనది. నేను ఇదివరకు అనేకమంది దొరలతో సాంగత్యము చేసినాను కాని, ఆంధ్ర గీర్వాణ

18. Ibidem; Page - 127.

ముల యందు చాలా ప్రవేశం కలిగినటువంటిన్ని, ఈ దేశస్థుల యొక్క మర్యా దలు బాగా తెలిసినటువంటిన్ని సకల అంశములయందు విశేష ప్రవీణత కలిగిన తమవంటి వారిని యెప్పుడున్ను చూడలేదు. తమరు నీలపల్లికి విజయముచేసి నప్పుడు, తమవద్ద వున్న గ్రంథములు నాకు అగుపరచి, నాకు చేసిన మర్యాద నేను మరిచిపోలేదు. ఇక ముందును మరవను. లోవయినం ఈ వైపున సంభ వించిన గాలి వాన ఉపద్రవం చేత, నేను ముప్పైవేల రూపాయల పర్యంతము నష్టము పొందినాను. కాని, ఈశ్వరకటాక్షము వల్లనున్ను, తమవంటి స్నేహితుల దయవల్లనున్ను, మా యింట్లో పిన్న పెద్దలందరు ఏ విధమైన ఉపద్రవములేకుండా సురక్షితముగా వున్నారు." (తెలుగు రీడరు, పుటలు - 201, 202)

ఈ జాబులోని, "తమవంటి స్నేహితుల దయవల్ల" అనునది, బ్రౌనుదొరకు "మల్లపరాజు"గారికి గల పరిచయమునకు కొలబద్ద. తెలుగువారిని ఎట్లు మర్యాద చేయవలెనో, బ్రౌనుదొరకు తెలియును గనుకనే; "మల్లపరాజు"గారు తనలేఖలో "నాకు చేసిన మర్యాద నేను మరిచిపోలేదు" అని వ్రాయుట సంభవించినది.

ఇట్లు బ్రౌనుదొర, గుణవంతులైన తెలుగు వారందరితోడను స్నేహితునిగ వ్యవహరించినను, ఆయనకు అత్యంతాప్తులైనవారు— ఆయన పండితులు; అంత రంగికులైన తెలుగు ఉద్యోగులు. ఆయనెంత పండిత పక్షపాతియో అంతరంగికు లైన విశ్వాసపాత్రులగు తన క్రింది ఉద్యోగులందును, అంత పక్షపాతము కల వాడు. తనను నమ్మికొని యుండి పనిచేసిన, తెలుగువారి కందరికిని, ఆయన వారి వారి యోగ్యతల ననుసరించి సాహాయ్యము చేసినాడు. ఇట్లని ఆయనను మనము ఆశ్రితపక్షపాతి మాత్రమేయని నిర్ణయింప వీలులేదు. తానెరుగని యోగ్యు లకు పనులనిచ్చినట్లే, తానెరింగిన వారికిని ఇచ్చినాడంతియే. తన్నాశ్రయించినను, ఒక పనికి ఒకరు సమర్థులు కారని తోచినప్పుడు, వారిని ఉపేక్షించి, వారికి తగిన పని వచ్చువరకు వేచియుండుటయును కలదు. ఇది కొందరాశ్రితులకు బాధా కరమై జాబులు వ్రాసికొనుటయు కలదు. ఈ జాబులు, పరోక్షముగ బ్రౌనుదొర సత్ప్రవర్తనమునకు ఉదాహరణము లనవచ్చును. ఇట్టి జాబులలోనుండి గుండ వరపు కృష్ణయ్యగారు వ్రాసికొనిన జాబునుండి కొంతభాగము నుదాహరించు చున్నాను. ఇతడు కొంత కాలము బ్రౌనుదొర దగ్గిర కాపీవ్రాతగానిగా పనిచేసి నాడు. కొంతకాలము ప్లీడరుగా పనిచేసినాడు. కాని వీటిలో దేనియందును

కిట్టుబాటులేక కాబోలు, ఇంకేదైన ఉద్యోగము నిప్పించుడని బ్రౌనుదొరకు వ్రాసికొను సందర్భమున, ఈ క్రింది వాక్యములను వ్రాసెను:

"ఎనిమిది సంవత్సరములనుంచి తమయొక్క అనుగ్రహామునకు పాత్రుణ్ని అయివున్న సంగతి సర్వత్రా తెలిసివున్నందువల్ల, తమరే ఈ గుంటూరు జిల్లా కలెక్టరు వుద్యోగమునకు వచ్చి, అనేకమందికి—అనగా తమ్మును ఆశ్రయించిన వారికిన్ని, ఆశ్రయించని వారికిన్ని, అనేకపనులు దయచేసి, నా విషయములో నిరాదరణ జరిగించడముచేత, నాకు సంభవించిన చిన్నతనము యింతని మనవి వ్రాసుకోచాలను." (20-11-1833)

(తెలుగు రీడరు: పుటలు - 18-)

కృష్ణయ్యగారికి కాలక్రమమున మంచి ఉద్యోగము లభించుటయు బ్రౌను దొర ఆతని ద్వారా "చేబ్రోలులో శంభుదేవరగారి మఠంలో" ఉన్నట్లుగ విన్న 'నవనాధ చరిత్ర' కొరకు ప్రయత్నించుటయు (1841) లేఖల వలన తెలియు చున్నది.

తన ఇంటినే "కాలేజి"[19]గా మార్చిన బ్రౌనుదొర, పండిత పక్షపాతి యన్నచో అతిశయోక్తి కానేరదు. ఇరువది సంవత్సరములు — పండితులను, వ్రాయసగాండ్రను, లిఖిత ప్రతులను సేకరించు వారిని, బ్రౌనుదొర పోషించినా డన్నచో, ఆయన ఆంధ్ర భాషాభిమానము తేటతెల్లమగును.

ఇంచుమించుగా నలుబది సంవత్సరములు (1817-1855) తెలుగు ప్రజల నడుమనున్న బ్రౌనుదొర; వందలకొలది భాషాభిమానులను, పదులకొలది పండితు లను, కవులను కలిసికొని యుండుననుటలో అతిశయోక్తి లేదు. అటులనే, ఆయన వలన కొలదిగనో, గొప్పగనో ఉపకారమును పొందని వ్యక్తియు లేడు. ఇట, ఉద్యోగరీత్యా ఆయనను కలిసికొని,ఉపకారములను పొందినవారిప్రసక్తి చేయలేదు. అట్టివారు లెక్కలేనంత మంది యుందురనుటలో సంశయములేదు. పరిశోధనా దృష్టితో పరిశీలించి చూచినంతవరకు,ఎక్కడను ఆయనవలన యోగ్యునకపకారము

---

19. "The establishment of bramins in my house for twenty years was always called a college" -C. P. Brown.
(424వ పేజీ క్రిందిసూచికలో. Ibidem.) కాలేజినిగురించి పుటలు -432,433.

జరిగినట్లు కన్పట్టలేదు. తెలిసి ఆయనవలన సత్కరింపబడని పండితుడులేడు. జాత్యహంకారముచే ఆయన పరిభవించిన వ్యక్తియులేడు. ఇట్టి సత్ప్రవర్తనము కూడ కలవాడు గనుకనే, పండితులు పామరులు - అందరు ఆయన బదలీ అయి, ఇంకొక జిల్లాకు పోవుచున్నాడన్నంతనే, తమ తమ విచారములను వెలిబుచ్చుచు జాబులు వ్రాసెడివారు. ఆయన తిరిగి తమజిల్లాకు వచ్చుచున్నాడని విని ఆనందించెడివారు. సర్ థామస్ మన్రో (1761-1827) మద్రాసు గవర్నరు (1820-1827) గా ఉన్నప్పుడు ఉద్యోగమున నియమితుడైన బ్రౌనుదొర ; మన్రోదొర యొక్క "మంచి"ని గుర్తించుటయు, అతని ఆదేశములను శిరసావహించుటయు జరిగినది. బ్రౌనుదొర యావజ్జీవితమును ఈ ఆదర్శములనే పాటించెను. ఇందుచేతనే ఆయన తెలుగు వారిని, తెలుగు భాషను అభిమానింప గలిగెను. తెలుగు వారాయనను, స్నేహితునిగా గుర్తించి గౌరవింప గలిగిరి. ఆయన కృషి ఫలవంతమగుట కిదియే కారణము.

బ్రౌనుదొరకు అంతరంగికులైన తెలుగు ఉద్యోగులలో అయోధ్యాపురం కృష్ణారెడ్డి గారు ముఖ్యుడు. సంపన్న కుటుంబమునకు చెందిన ఇతడు బ్రౌనుదొర వలన ఉద్యోగలాభమును పొందుటయేగాక, ఆయనకు సలహాలను కూడ చెప్పజాలిన మిత్రుడైనాడు. కృష్ణారెడ్డిగారి న్యాయదృష్టి, కార్య నిర్వాహణమున గల నేర్పు, స్వార్థరహితమైన పనులు, కల్మషరహితమైన మనస్సు, జంకుగొంకులు లేకుండ తాను సత్యమైనదిగా నమ్మిన విషయమును చెప్పెడి సాహసము ; బ్రౌనుదొరను విశేషముగా ఆకర్షించినవి.

కృష్ణారెడ్డి గారు కడప ప్రాంతమునకు చెందినవాడు. బ్రౌనుదొరకు మొట్టమొదట ఉద్యోగరీత్యా కడపతో పరిచయ మేర్పడినది (1820). ఆయన తెలుగు భాష బాగుగా మాటాడుట మొదలైనవన్నియు — అంతకు పూర్వము మద్రాసు కళాశాలలో తెలుగును కొంతనేర్చి ఉన్నను — కడప యందే ప్రారంభమైనవని చెప్పవచ్చును, ఆయన తరువాతి రచనలనుబట్టి కూడ ; రాయలసీమ మాండలిక మెంత బాగుగా ఆయనకు తెలియునో, మనకు తెలియుచున్నది. బ్రౌనుదొర కడపలో ఉన్నంతకాలము చక్కనితోట నడుమనున్న ఒక బంగాళాలో నుండెడివాడు, ఉద్యోగధర్మము ననుసరించి, కడపను విడిచి మిగిలిన ప్రాంతములకు పోయినను; బ్రౌనుదొర తన భాషా సాహిత్యముల కృషికి కడపలో తానుకొన్న ఇంటిని కేంద్రముగా చేసికొనుటచేతనే ఆ ఇంటికి బ్రౌనుదొర గారి 'కాలేజి' అను

పేరు వచ్చినది. ఆ ఇంటి యొక్క, ఆ తోట యొక్క 'కాలేజి' యొక్క మంచి చెడ్డలను విచారించు పని, స్థానికుడైన కృష్ణారెడ్డి గారి చేతులలో నుండెను ఆ పనిని ఆయన ఎంతశ్రద్ధతో చాకచక్యముతో నిర్వహించుచుండెనో తెలిసికొనుటకు, బ్రౌనుదొర కాతడు వ్రాసిన జాబులలో నుండి కొన్ని భాగముల నెత్తి చూపుచున్నాను.

"తాము నాయందు సంపూర్ణమయిన దయచేత నవంబరు నెల 15 తేది, 16 తేది పంపించిన ఆజ్ఞాపత్రికలు ముట్టి, చదువుకోగా చాలా సంతోషమయినది. తమ యొక్క బంగాళాలోనున్ను బంగాళావసారాలలోనున్ను దరవాజాలలోనున్ను, గచ్చు గుంతలుపడి బెళ్లయెత్తిపోయినదని, వివరగతిగా నేను అర్జీ వ్రాసుకొని వున్నందుకు, తమరు మరమ్మతు నిమిత్తమై రు 50 లకు హుకుము దయచేసినారు .... .... బంగాళా సిండా అలంకారముగా వుండేటందుకుగాను, బంగాళా మేడపయినా నున్ను, బంగాళా వెలిగా గోడలకున్ను స్తంభాలకున్ను, వండుసున్నము పూయించి చక్క చేయించినాను ..."

"అయితే ...... యే యే దినము, యే యే బేలుదారు యే యే కూలిమనిషి యే యే పనిచేసినదిన్ని, వాండ్ల పేళ్లున్ను, వారు వారు చేసిన పనికి యెన్నెన్ని పయిసాలు యివ్వవలసినదిన్ని, వివరగతిగా వొక పుస్తకములో మొదలుపెట్టి, అర అర దినము లెక్కబయావరిగా వ్రాసి, సాయంత్రము కాగానే, కచేరివారి సమక్షములో వారి వారి కూలి వారికి యిచ్చి, అందుకు వాండ్లచేతనున్ను, కచేరీ వారి చేతనున్ను, ఆ పుస్తకములో చేవ్రాలు చేయిస్తూ వచ్చినాను ...... వొకగవ్వ అయినా నిరర్థకము కాకుండా, జాగ్రత చేసివున్నాను..." (12 డిసెంబరు 1828)
(తెలుగు రీడరు: పుటలు - 147, 148, 149.)

"తమయొక్క తోటమాలీలు నిత్యముయేమేమి పనిచేసేదిన్ని, చెయ్యనిదిన్ని, ప్రతిదినము సాయంత్రము పోయి విచారిస్తున్నాను." 13 మే 1829.

(తెలుగు రీడరు; పుట - 173)

వేసవి కాలములో, నీటి ఎద్దడి వలన తోట ఎండిపోకుండుటకై. కూతిని త్రవ్వించిన మంచిదని బ్రౌనుదొరకు కృష్ణారెడ్డి గారు సలహా ఇచ్చి, ఆ పని నేరతయో చాకచక్యముతో నిర్వహించి, దొరయొక్క మెప్పు నాయన పొందెను. కడపలోని

బ్రౌనుదొర ఇంటిలోనున్న సేవకులకు జీతముల నిచ్చుటయు, ఇంటిలో అద్దెకున్న, వారి యొద్దనుండి అద్దె వసూలు చేయుటయు మొదలైన పనుల నెన్నింటినో కృష్ణారెడ్డిగారు నమ్మకముగ, నిర్వహించెను. బ్రౌనుదొర డబ్బును తాను వాడు చున్నందున, మిక్కిలి జాగరూకతతో కృష్ణారెడ్డిగారు వ్యవహరించెడి వారనుటకు, తార్కాణముగా ఆయన వ్రాసిన ఒక లేఖలోని ఈ క్రింది భాగమును గ్రహింప వచ్చును:

"...... నిలిచిన రూపాయలలో, తీసివేసిన నౌకర్లకు యివ్వవలసిన జీతములను గురించి బుడ్డెన్నకు రు. 3 లు, సుబ్బడికి రు. 4 లు, అప్పన్నకు రు. 3 లు, వెంకటాచలానికి రు. 4 లు, వెరశి రు 14 లు, యిచ్చినాను. వొక్క అణా నా దగ్గర చిలుకు వున్నది."

(తెలుగు రీడరు. పుట - 176)

ఇంత "నిజాయితీ" గల వ్యక్తి గనుకనే, కృష్ణారెడ్డి గారిని బ్రౌనుదొర మిక్కిలి అభిమానించినట్లున్నది. మొట్ట మొదట ఆరువరహాల జీతము మీద చిన్న ఉద్యోగిగా నున్న కృష్ణారెడ్డి గారు, క్రమ క్రమముగా కడపజిల్లా కోర్టు నాజరై, తరువాత చనిపోవు నాటికి మునసబుగ నుండెను. ఈ విషయమును గూర్చి బ్రౌనుదొర, తెలుగు రీడరుయొక్క ఆంగ్లానువాదమున, కృష్ణారెడ్డిగారి ప్రసక్తి వచ్చినప్పుడు ఫుట్ నోట్ లో ఇట్లు వ్రాసెను:

"The writer of this letter was the son of a Telugu farmer in the neighbourhood of Kadapa. He subsequently was made a Munsif and died on the 26th March 1844, holding that appointment.[20]

కృష్ణారెడ్డి గారు మధ్యవయస్సులో ఉద్యోగములో నుండగనే చనిపోయెను. బ్రౌనుదొరకు ఈయన యందు నమ్మకము, అభిమానము చాల గలదు. నాటి సంప్రదాయము ననుసరించి, కృష్ణారెడ్డి గారు మిక్కిలి వినయముతో బ్రౌనుదొరకు జాబులు వ్రాసినను, అయన ఎన్నడును తాను నమ్మిన సత్యమును-అది అప్రియమైనను చెప్పుటకు వెనుదీయలేదు. బ్రౌనుదొరయు, ఆయన హృదయ నైర్మల్యము నెరింగిన వాడగుటచే, కృష్ణారెడ్డి గారి మాటలకు కోపగించుకొన్నట్టులేదు. బ్రౌనుదొర యొక్క

20. English Translation of the Telugu Reader - Second Edition; 1865 ; C. P. Brown ; Page - 89

"హితాభిలాషి" గా. కృష్ణారెడ్డి గారు వ్రాసిన క్రింది జాబును చూచినచో, వారిరువురి "స్నేహము" యొక్క "లోతు" తెలియగలదు.

బందరు జిల్లా జడ్జీపని మానివేసి, బ్రౌనుదొర రెసిడెంటు పనిని స్వీకరింప నున్నాడను "వదంతి" ని విని, కృష్ణారెడ్డి గారు దొరకిట్లు కర్తవ్యము నుపదేశించుచు కడప నుండి జాబు వ్రాసెను.

"ఈలో వైనం తమ పేర నాలుగు విజ్ఞాపన పత్రికలు వ్రాసికొనివున్నాను, అవి తమకు చేరినదిన్ని లేనిదిన్ని తెలియ దు, యిప్పుడు తమరు తిరచనాపల్లెలో వుండేదిన్ని, చెన్నపట్టణములో వుండేదిన్ని, తమయొక్క క్షేమసమాచారము వొకటిన్ని తెలియనందున, నాకు నిండావ్యసనముగా వున్నది. గనుక, తాము చిత్త గించి వొక చీటి దయచేయించి, నేను సంతోషాన్ని పొందేటట్లు చెయ్యవలెనని మిక్కిలి తమయొక్క ఘనాన్ని గూర్చి ప్రార్థిస్తున్నాను".

"ఇదిగాక తమరు బందరు జిల్లాలో వుండే రిసీడెంటు పనికిన్ని రిసైడెంటు వారు తమ యొక్క జడ్జీ పనికిన్ని, మార్చుకొంటున్నారని, యిక్కడ వదంతిగా వున్నది. బందరులోనున్న యీ వదంతి వున్నట్లుగా విన్నాను. ఆ రిసైడెంటు పనిలో వున్నవారికి, యెన్నిదినాలకున్ను గొప్ప ఉద్యోగము కాదనిన్ని, అది నిరధి కారమైన వుద్యోగమనిన్ని, ఆ పనిలో వుండేవారు తిరిగి జుడిషియల్ పనికిగాని, రివిన్యూ పనికిగాని, రారనిన్ని చెప్పుతున్నారు. గనుక, చిత్తానకు వేద్యము చేసినాను. యిప్పుడు తమరు వుండే జడ్జీపని రిసైడెంటు పనికంటె విశేషమైనదిన్ని, సర్వాధి కారపు పనిన్ని, అయివున్నది. యీ జడ్జీ పనియందు తమరు అభ్యసించిన తెనుగు విద్యయున్ను, యిందులో గ్రహించిన న్యాయములున్ను, సార్థక్యాన్నిపొంది, తమ యొక్క కీర్తి బహుదూరము వ్యాపిస్తున్నది. అందువల్ల త్వరలో తమకు గొప్ప ప్రభుత్వమున్ను అవుతున్నది. యీ పనిలో తమకు విశేష సావకాశమున్ను దొరుకును, కాలేజీ పనిన్ని బాగా జరిగించవచ్చును. అధికారపు పనిలో వుంటే, తమరు సన్నాహము చేసిన తెనుగు విద్యకు కావలసిన పుస్తకములు మొదలయినవి దొరుకుతవి".

"మరిన్ని, తమ్మున నమ్మిన వాండ్లను కృతార్థులనుచేస్తే, వారు జీవమున్నంత మట్టుకు తమ్మున తలుచుకొంటూ వుండడానకు హేతువు అవుతున్నది. ఆ రిసైడెంటు

పనిలో ప్రవేసించిన తర్వాత, మీరు చింతింప బోదరని తోస్తున్నది. ఒకవేళ బందరు జడ్జీ పనికి పోవడానకు తమకు సమ్మతిలేని పక్షమందు, రిసైడెంటు పనులు మినహా, జుడిషియల్ పనులలోగాని, రివిన్యూ పనులలోగాని, సెక్రెటేరి పనులలోగాని ప్రవేసించడము నిండా వుత్తమముగా వున్నది. నేను నిరంతరము తమ యొక్క క్షేమమున్ను ప్రభుత్వమున్ను, అభివృద్ధి కావలెనని కోరుతుండే వాణ్ని అయినందున, యీ సంగతి మనవి చేసుకొన్నాను ఆ రిసైడెంటు పని తమకు కాకుండా పోయినదని యెప్పుడు వింటునా అని నిరంతరము భగవంతుణ్ని గూర్చి ప్రార్థిస్తున్నాను. తమ యొక్క క్షేమమున్ను గురించిన్ని వుద్యోగమును గురించిన్ని వొక చీటి వ్రాసి, నన్ను కృతార్థుణ్ని చెయ్యవలెనని కోరుచున్నాను"

"కాలేజీవారు జరిగించడానకు పనియేమీ లేదు. బంగాళా తోట చక్కగా వున్నది. చిత్తగించవలెను"

"జనవరి నెల 30 తేది". కృష్ణారెడ్డి వ్రాలు"

(తెలుగు రీడరు; పుటలు – 180. 181.)

19 వ శతాబ్ది పూర్వార్ధమున, ఒక తెలుగువాడు పాలకులైన ఆంగ్లేయుల ప్రతినిధియైన ఒక్క పాశ్చాత్యునకు, ఇట్టి జాబు వ్రాసినాడన్నచో, ఆయనకు ఆ ప్రతినిధి యొద్దగల చనవు, ఆ ప్రతినిధికి ఈ తెలుగువాని హృదయ సౌశీల్యము నందున్న నమ్మకము తెలియుచున్నది.

తెలుగువాడె "తెలుగు విద్యను ప్రపంచించిన కృష్ణారెడ్డిగారు "తెలుగు విద్యను అభ్యసించిన "బ్రౌను దొరకు," అధికారపు పనిలో వుంటే, తమరు సన్నాహముచేసిన తెనుగు విద్యకు కావలసిన పుస్తకములు మొదలయినవి దొరుకుతవి" అని వ్రాయుట ఎంతయు ఉచితముగ నున్నది. బ్రౌనుదొర, భాషాభిమానియైన అధికారి గనుకనే, తెలుగునకు అంత సేవ చేయగలిగెను.

ఈ జాబునకు ఆంగ్లానువాద మిచ్చుచు, ఫుట్‌నోట్‌లో బ్రౌనుదొర; కృష్ణారెడ్డి గారు లిఖిత ప్రతుల సేకరణమున తనకు చేసిన సాహాయ్యమును గురించి ఇట్లు వ్రాసెను:

"In these plans the Zealous writer of this letter was a most able and excellent assistant" 21

బ్రౌనుదొరనుండి ఇట్టి పొగడ్తను పొందిన కృష్ణారెడ్డిగారు తెలుగు సాహిత్యమున కెంతటిసేవలు చేసెనో యూహింపవచ్చును లిఖిత ప్రతుల సేకరణమునసేగాక, తదితరములైన అన్ని పనుల యందును కృష్ణారెడ్డిగారు నిమగ్నులై, బ్రౌనుదొర తలపెట్టిన "తెలుగు విద్య" అభివృద్ధి పొందుటకు సాయపడెను. బ్రౌనుదొర పండితులతో "కొలువుదీర్చి", శుద్ధప్రతుల నిర్మాణమున మునిగియుండగా, కృష్ణారెడ్డి గారు అందులకు కావలసిన "సామగ్రి"ని సేకరించి పెట్టెడి వాడని తోచుచున్నది. 1829 మే నెల 13 వ తేదీని, ఆయన బ్రౌనుదొరకు వ్రాసిన ఈ లేఖలోని భాగమును చూచినచో, ఈ విషయము తెల్లముగును:

"ఇదిగాక 21 దస్తా కాకితాలున్ను 196 పేనాలున్ను తీసుకొని పెద్దబోయి గురువప్ప, అంకాలు, వీరు యిద్దరు యిక్కడికివచ్చి చేరినారు. పట్నానికి యింగిలీషు పుస్తకాలు తీసుకపోవడమునకు కూలివాండ్లనుంచికోదు. గనుక, కూలికి బండ్లు మాట్లాడి నాలుగు దినములలో రవానా చేస్తున్నాను."

(తెలుగు రీడరు : పుట - 173)

ఈ పనులేగాక, బ్రౌనుదొర యొక్క వ్యక్తిగతములైన కార్యముల నిర్వహణమునను, కృష్ణారెడ్డిగారి ప్రసక్తియుండెడిది. కడపలోనున్న "బ్రౌనుదొర ఇల్లు", అద్దెకున్న దొరలకు వాసయోగ్యముగ నుండునట్లు చేయుటలో కృష్ణారెడ్డి గారు పూనుకొని యున్నట్లే: బ్రౌనుదొరకు అనావశ్యకములైన సామానును, యుక్తధనమునకు విక్రయించి, ఆ ధనమును భద్రపరచుట యందును కృష్ణారెడ్డి గారికి ప్రసక్తి కలదు. ఈ విషయమును గూర్చి, ఆయనొక జాబులో ముచ్చటించి యున్నాడు:-

"ఇక్కడవుండే తమ సామానులలో యేదైనా యే దొరగాని ఖరీదుకు అడిగితే యిచ్చేదో, వద్దో, ఆ సంగతి వ్రాయించి దయచేయవలెను".

(తెలుగు రీడరు : పుట - 173 )

---

21. Ibidem; Page – III.

ఇట్లు బ్రౌనుదొరకు లౌకిక కార్యనిర్వహణమున కుడిభుజమై కృష్ణారెడ్డి గారు పనిచేసెను. ఈయనకు - తెలుగు, ఫారసీ, ఇంగ్లీషు భాషలు బాగుగా వచ్చును. ఆ నాటికింకను ఫారసీ, అధికారుల వ్యవహారమున ప్రచారమున నుండెను. కృష్ణా రెడ్డిగారే బ్రౌనుదొరకొక జాబులో, "నేనున్ను హెగ్గుదొరవారికి ఫారసీతో అర్జీవ్రాసి యిచ్చినాను" (తె॥ రీ॥ పుట-171), అని వ్రాసినాడు. తన తమ్ముడైన నారాయణరెడ్డియు ఫారసీ బాగుగా నభ్యసించినట్లు కూడ వ్రాసెను. ఈ విధముగా నాడు తెలుగుదేశములో సంపన్న కుటుంబములకు చెందినవారు, ఆంధ్రాంగ్లాములతోబాటు, ఫారసీ కూడ నేర్చుకొనెడి వారని తెలియుచున్నది.

బ్రౌనుదొర యొక్క "కాలేజీ" పని, ఆయనలేనప్పుడు ఏ విధముగా జరుగు చుండెడిదో, పర్యవేక్షించు పనికూడ కృష్ణారెడ్డి గారు చూచు చుండెడివారు. పండితులు గాని, వ్రాయసగాండ్రుకాని, సేవకులుకాని, పనిలేకుండ ఊరక జీతములు పుచ్చుకొని కూర్చుండుట అయనకు బాధాకరముగ నుండెడిది. బ్రౌనుదొర యొక్క డబ్బు సద్వినియోగము కావలెనని ఆయన పట్టుదల కాబోలు! ఆయన చాల జాబులలో, వారి వారి పనులను గూర్చి వ్రాయునప్పుడు, ఎవరెవరేపనులలో నిమగ్నులై యున్నారో వ్రాయుటతోబాటు, ఫలానావారు పనిలేక "ఊరికే" ఉన్నారని కూడ వ్రాసెడివాడు. ఉదాహరణగా ఒక జాబులోని ఈ క్రింది వాక్యములను గ్రహింప వచ్చును:

"జనవరి నెల ౬ తేదీన వసుచరిత్ర దిద్దుబాటు సమాప్తమైనందుననున్ను, అది మొదలుకొని యేమి పనిలేనందుననున్ను, గరిమెళ్ళ వెంకయ్య అశక్తతవల్ల కచ్చేరికి రానందుననున్ను, యీ మార్చి నెల ౧ తేదివరకు, కచ్చేరివారు యేమిన్ని పని జరిగించలేదు. యిప్పటికిన్ని వెంకయ్య రావడములేదు, వెంకటాచలమున్ను అంకాళున్ను వూరికె వున్నారు".

(తెలుగు రీడరు : పుట - 176.)

ఈ జాబులోని "వూరికె" శబ్దము యొక్క శక్తిని గుర్తించిన బ్రౌనుదొర, ఈ జాబు యొక్క ఆంగ్లానువాదము నిచ్చుచు, ఫుట్‌నోట్‌లో (ఇంగ్లీషువారి కొరకు గనుక) ఇట్లు వ్రాసెను : "Observe the force of the word 'urike'! that is without (employ.)"22

22. Ibidem; Page -107.

కృష్ణారెడ్డి గారు ఇంతటి విశ్వాసపాత్రుడు గనుకనే తనను గురించి బ్రౌనుదొర, "సరకారు వుద్యోగములో నీవు ప్రవేశించవయ్యే నిమిత్తమున్ను, దొరల పరిచయము నీకు కలిగి, దొరలు నిన్ను మంచిపనివాడని చెప్పేనిమిత్తమున్ను ప్రస్తుతం నీకు యీపని యిచ్చినామనిన్ని కొన్నాళ్ళలో సముఖములోకి నిన్ను పిలిపించుకొంటామనిని" చెప్పినట్లుగా వ్రాసినాడు.

అయోధ్యా పురం కృష్ణారెడ్డి గారు బ్రౌనుదొర సాహిత్య కృషిలో ఇంతటి కీలక పాత్రను నిర్వహించినను ఆయనను గురించి విశేషముగ వివరములు తెలియుట లేదు.* ఆయన వ్రాసిన జాబులనుండియు, ఆయన మృతి తరువాత కుటుంబ సభ్యులు బ్రౌనుదొరకు వ్రాసి కొనిన జాబులనుండియు, బ్రౌనుదొర ఆయనను గురించి వ్రాసిన వాక్యములనుండియు విషయములు గ్రహించి కొంతకు కొంత స్థూలముగా ఆయనను గురించి వ్రాయుట జరిగినది.

---

* నేను, 1950లో "తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము" అను విషయముపై డాక్టరేటు పట్టమునకై పరిశోధన ప్రారంభించిన నాటినుండి బ్రౌనుదొరకు సంబంధించిన సామగ్రి సేకరణ జరుగుచునే యుండెను. బ్రౌనుదొరకృషిని స్పృశింపకుండ పందొమ్మిదవ శతాబ్ది తెలుగు భాషా సాహిత్యముల వికాసమును వివరించుట అసాధ్యమగుటయే దీనికి కారణము. ఆనాడే బ్రౌనుదొర జీవిత చరిత్ర వ్రాయవలెనను సంకల్పము కలిగినను, ఆనాటి నా ప్రణాళికలో బ్రౌనుదొర కృషి వివరణకు పరిమిత స్థానము మాత్రమే యుండుటచే, అంతమాత్రమునకే ఆ సిద్ధాంత గ్రంథములో స్థానము లభించినది.

1960 ప్రాంతమున, బ్రౌనుదొర జీవితచరిత్ర వ్రాయుట ప్రారంభించినప్పుడు కృష్ణారెడ్డి గారి పేరు పదే పదే వచ్చుటతో, ఆయనను గురించి ఇంకను వివరములు సేకరింపవలెనని కడప ప్రాంతమున కొంత వాకబు చేసితిని. కాని ఎక్కువ లాభము లేక పోయెను ఆ ప్రాంతము వారికి బ్రౌనుదొర వ్రాయించిన జాబుల సంగతియు నట్లే యుండెను. అనగా ఈ విషయమై పెద్దగా అక్కడ స్పృహలేదు. ఐతిహాసిక విషయములపై మనవారి దృష్టి మొదటి నుండియు నిట్లేయుండెనను విషయము పరిశోధకుల కందరికి తెలిసిన విషయమే గదా!

అయోధ్యా పురం కృష్ణారెడ్డి గారి తండ్రి పేరు శిద్దారెడ్డి. ఈ శిద్దారెడ్డి పెద్ద కుమారుడు చిన్నకృష్ణారెడ్డి. ఈతడు బ్రౌనుదొరకు వ్రాసిన (కృష్ణారెడ్డి గారు చనిపోయిన తరువాత) లేఖను[23] బట్టి వారి కుటుంబవిషయములు కొన్ని తెలియుచున్నవి. ఈ ఉత్తరములోని మొదటి పేరాను బట్టి ఈ కృష్ణారెడ్డి గారికి, కుటుంబములో రామకృష్ణారెడ్డి అని వ్యవహారమున్నట్లు తెలియుచున్నది. ఆయన చేసిన ఉద్యోగములు మొదలైనవన్నియు ఈ జాబులో తెలుపబడినవి :

“కడప జిల్లా రాయచోటి తా॥ హసనా పురం గ్రామం అయోధ్యాపురం శిద్దారెడ్డి పెద్దకుమారుడయిన చిన్న కృష్ణారెడ్డి అనేక సలాములు చేసి అత్యంత వినయ పూర్వకముగా వ్రాసుకొన్న మనవి అర్జియేమంటే. నా తమ్ముడైన రామకృష్ణారెడ్డిని దొరవారు అనేక విధములు పోషణ చేసి జిల్లాకోర్టు గుమాస్తాగా తొలుత నియమించి తర్వాత నాజరుపని యిప్పించడమే కాకుండనే టీ వురిజిస్త్రరుగ నియమింపించి తర్వాత [illegible] కడప

ఈ మధ్యకాలములో! శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము వారి బ్రౌన్ ప్రాజెక్టు క్రింద ఆచార్య జి. ఎన్. రెడ్డి గారి పర్యవేక్షణములో సంశోధన గావించిన “బంగోరె” గారు, అయోధ్యాపురం కృష్ణారెడ్డిగారిని గురించి విశేషములు తెలిసికొనుటకును, బ్రౌనుదొర ఆనాడు వ్రాయించిన జాబుల కొరకును కృషిచేసిరి. ఈ విషయమున ఈ కృషియు అంతఫల ప్రదమైనట్లు కానరాదని ‘బంగోరె’ గారు వ్రాసిన ఈ వాక్యములవలన తెలియుచున్నది: “తెలుగు వారిలో బ్రౌన్ కుదుర్చుకున్న సత్సంబంధాలకు సూచీభూదాహరణ యీ జాబులు. ఈ పుస్తకంలోని మొత్తం జాబుల్లో అయిదింట నాలుగువంతులు యీ కృష్ణారెడ్డివే.”

“ఇందరు వ్రాసిన జాబుల్ని బ్రౌన్ కాపీచేయించి పెట్టాడుగానీ బ్రౌన్ వీళ్లకు వ్రాసిన జాబుల్లో కొన్నయినా వీళ్ల వంశీకులు భద్రపరచకపోతారా ప్రయత్నించి చూద్దామని యిటీవల అయోధ్యాపురం కృష్ణారెడ్డి సంబంధీకులను విచారించడానికి హసనాపురం చుట్టుప్రక్కల గ్రామాలైన చిట్లూరు, నల్లగుంటపల్లె, నరసపల్లె, యెర్ర

23 Ibidem ; పుటలు — 58 67

జిల్లాలో చేరిన మారకాపురం వగైరా తాలూకాలకు మునసపు పనికి మహారాజశ్రీ సరికోర్టు క్యాషుమేజరు దొరగారికి దేవరవారు శిఫారసు చేశిన్ని ఆ తాలూకా మునసపు పనిలో వుండగా కొద్ది రోజులకు కదిరి తాలూకా వగైరా తాలూకాల మునసపు పనికి పర్గుచేశి మా తండ్రి అయిన శిద్దారెడ్డికి నేను వగైరా మా అన్నతమ్ములకు దర్బారులో మాన్యత కలగజేశి ఆ రామకృష్ణారెడ్డి వల్ల మా యావత్తు మందిక్కి జీవనోపాయం చేయించివుండి వున్నందుకు దేవరవారి యొక్క కటాక్ష వీక్షణముచేత మేము బహు మంది జీవనం చేస్తూవుంటిమి။ ।

"మా దురదృష్టము వల్ల నా తమ్ముడయిన రామకృష్ణా రెడ్డి నా తండ్రి అయిన శిద్దారెడ్డి గతించి వున్నారు.— ...."

ఈ జాబు వల్లనే, కృష్ణారెడ్డి గారికి నారాయణరెడ్డి, నరసింహారెడ్డి, అనువారు తమ్ములనియు తెలియుచున్నది. ఈ నారాయణరెడ్డి ప్రస్తావన తాను బ్రౌనుదొరకు వ్రాసిన జాబులో కృష్ణారెడ్డిగారు కూడ చేసియుండెను. ఈతడు బ్రౌనుదొర పెట్టించిన బడిలో ఫార్సీకూడ చదివెను. (ఈ పుస్తకములో పుట - 195) కృష్ణారెడ్డిగారు బ్రౌనుదొరకు వ్రాసిన జాబులను విశ్లేషించి చూచినచో వాటిలో నాలుగు ముఖ్య విషయములు గోచరించును. మొదటిది - బ్రౌనుదొర కడప బంగళాకు సంబంధించిన విషయము; రెండవది - పుస్తకముల, పండితుల విషయము; మూడవది బ్రౌనుదొర ఉద్యోగమునకు - అప్పుడప్పుడు తన (రెడ్డిగారి) ఉద్యోగము

---

య్యెరబల్లె. -యీ వూళ్ళకు వెళ్లాను. అయోధ్యాపురం యింటి పేరు గల్గిన వాళ్లు యీ గ్రామాలకు మున్సబులుగా సర్పంచ్‌లుగా కరణాలుగా వుంటున్నారు గానీ - వాళ్ళను విచారిస్తే యెవర్లోనూ ఆ బ్రౌన్ స్ఫ్రుహవున్నట్లుగా కనపళ్లేదు. ఫలితం బ్రౌన్‌జాబు వొక్కటికూడా వారినుండి సేకరించడం సాధ్యంకాలేదు ... ఇప్పుడైనా యీ దృష్టితో అయోధ్యాపురం వారి యిళ్లుగాలిస్తే యేమైనా సత్ఫలితంవుండొచ్చుననే ఆశలేక పోలేదు." (బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు ; కడప జాబుల సంకలనం, పర్యవేక్షణ : జి. యన్. రెడ్డి: సంశోధన : బంగోరె ; పుటలు - 74, 75. శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి : డిసెంబరు, 1977)

వకు – సంబంధించిన విషయము; నాలుగవది – బ్రౌనుదొరకు వ్యక్తిగతముగా ఇచ్చు సలహాలకు సంబంధించిన విషయము. ఈ ఉత్తరములను చదివినప్పుడు మనకు కృష్ణారెడ్డిగారి వ్యక్తిత్వము, బ్రౌనుదొర దగ్గర అతని కున్న చనువు, బ్రౌను దొరకాతని యందున్న నమ్మకము మొదలైనవి స్పష్టముగా తెలియును. ఆ నాటి పరిస్థితులను, మర్యాదలనుబట్టి బ్రౌనుదొరకు కృష్ణారెడ్డిగారు వ్రాసిన లేఖలలో వినయ విధేయతలు ఉట్టిపడుచున్నను, వ్యక్తిగతముగా ఆతడు చాల ఆత్మగౌరవముగల వాడనియు, ధనము కంటె మానమున కెక్కువ ప్రాముఖ్యమిచ్చు వ్యక్తి అనియు వాటి వలన స్పష్టమగును. ఇతరోద్యోగులైన దొరలను గూర్చి వ్రాసినప్పుడు ఈ విషయ ములు వ్యక్తమగును. ఉదాహరణగా "సెప్టెంబరు 1830 సం॥" నాటి జాబు లోని క్రింది వాక్యాలు గ్రహించవచ్చును:

"స్త్రంబంధారవారే తిరిగీ యీ జిల్లాకు పొయింటు కావడం నాయొక్క గ్రహ చారంయేమని చెప్పవలశినది ... ... యంత భయభక్తితో యంతజాగ్రత్తగా నడుచు కున్నాగాని వారు యితర వుద్యోగస్తులకు చేశేరీతి చూస్తే నాకు యే మాత్రం నమ్మికె లేకుండా వున్నది. మానం మాకు దొరకనేరదు అని ఆవునమ్మిక చాత యీ కొలువులో వుండడం నాకు యంతమాత్రం సమ్మతి లేకుండా వున్నది. యెందుకంటె మానానికంటె నాకు కొలువు గొప్పలేదు. యెక్కడ అన్నము సంపాయించుకోలేని వాండ్లు వకవేళ వుంటే వుండవచ్చును గాని నా యింట్లో వున్నప్పటికిన్ని నా స్వంత క్షేమానికి యీ కొలువులో వుండే దానికంటే యేమిన్ని తక్కువ లేదు ..." ...... ... ... తమరు ఆలస్యంచేసి పరామరికె తప్పితె ఆ దొర వారి దగ్గర అవుమానం పొందిన తరువాత తమరు యెంతగొప్ప చేసినా మానం తిరిగి రానేరాదు ... ..."

కడపలో బ్రౌనుదొర కొని దొరలకు అద్దెకు ఇచ్చిన బంగాళా యొక్కయు పండితులు పనిచేయుటకు ఏర్పాటయిన "కాలేజి" అనిపేరు పొందిన భాగముయొక్కయు బాగోగులను కృష్ణారెడ్డిగారు ఎట్లు పర్యవేక్షించుచు ఆయన బ్రౌనుదొరకు వ్రాసిన ప్రతిజాబులోను వచ్చినదియు కన్పట్టును. (ఈ పుస్తకములో పుట —)

పండితులు సరిగవేళకు వచ్చి పనిచేయుచున్నారో లేదో, ఎవరెంతెంత పని చేసినారో, పనిని బట్టి ఎవరెవరికి ఎంతెంత జీతము రూపమున ముట్ట జెప్పవలెనో కృష్ణారెడ్డి గారు బ్రౌనుదొరకు జాబుల మూలమున తెలుపుచు, దొర ఈ విషయమై

ఇచ్చెడి అజ్ఞలను పాటించెడివాడు. దీనికిని అనేకములైన ఉదాహరణలున్నవి. సేవకులుగా నియమితులై వారు ఏయేపనులను ఏయేవిధముగా చేయుచుండిరో వారికెంత ఈయవలెనో, తానెంత ఇచ్చెనో తెలుపుచు వ్రాసిన జాబులును చాలగలవు.

బ్రౌనుదొర చేయుచున్న ఉద్యోగములలో ఏయే ఉద్యోగముల వలన తెలుగు భాషాసాహిత్యముల సేవకు విశేషముగా అవకాశములుండునో; ఏ ఉద్యోగములను ఆయన స్వీకరించిన ఆయనకుగాని, భాషా సాహిత్యములకు గాని లాభముండదో కూడ లౌకిక ప్రజ్ఞ గల-కృష్ణారెడ్డిగారు సూచించుటకలదు. తనకు గూడ ఉద్యోగరీత్యా బ్రౌనుదొరవలన కలుగవలసిన అభివృద్ధి ఎట్లు ఏ ఉద్యోగమువలన కలుగునో కూడ-నిస్సంకోచముగ - తనజాబులలో వ్రాయుటకలదు.

బ్రౌనుదొరకు వ్యక్తిగతముగా నున్న లావా దేవీలలో (అప్పులు మొదలైన వాటిలో) కృష్ణారెడ్డి గారు సలహా లిచ్చుటయు, కర్తవ్యమునుపదేశించుటయు కూడ ఈయన వ్రాసిన జాబులలో కనబడును. (ఈ పుస్తకములో పుట - 84)

ఇంక, పుస్తకముల విషయమై - బ్రౌనుదొర చేసిన సేకరణ కృషిలో - కృష్ణా రెడ్డి గారికి కూడా భాగమున్నదన వచ్చును. "గ్రంథ సేకరణ - సంస్కరణ - ముద్రణ" అధ్యాయము ఈ కృషిలో రెడ్డిగారి పాత్ర ఆతని లేఖల ద్వారా వివరించుట జరిగెను. (ఈ పుస్తకములో పుటలు -174, 175). ఇదిగాక, బ్రౌనుదొర దగ్గర ఉన్న తెలుగు పుస్తకములుగాని, ఇంగ్లీషు పుస్తకములు గాని కావలసి వచ్చినప్పుడు ఎవరికి పంపమని ఆజ్ఞఅయిన, వారికి పంపుట మొదలైన పనులన్నియును జాగరూకుడై కృష్ణారెడ్డిగారు నిర్వహించుచుండెను.*24

---

24* (బ్రౌన్ కడప జాబులు - శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రచురణ. తిరుపతి 1977, డిసెంబరు)

ఈ ఉత్తరముల వలననే బ్రౌనుదొర కడప బంగాళాను 1,000 వరహాలకు కొన్నట్లు తెలియుచున్నది. ("పూర్వం మా ధొరగారు ఆ బంగాళాగా గ 1,000 వరహాలకు కొని వుండగా యిప్పట్లో తిరిగి మా ధొరగారు ఆ బంగాళా నిమిత్తం వ్రయం చేయడంవల్ల నిండా నష్టం సంభవించును ....."-14 జూన్ 1834 జాబు) ఈ జాబులోని, "ఆ దొరగారు (మెస్తరు శీ. పి. స్కెలటన్) బంగళా కరీదుకు తీసు కోవడాన్కి యంతమాత్రంశక్తి చాలదు అనీన్ని బాడిగెకు అయితె వుంటామనిన్ని తమరు వ్రాయించిన వుత్తరంలో బంగాళా కరీదుకు తీసుకోని పక్షమందు బాడిగెకు యివ్వడం సమ్మతిలేనట్టు పరిష్కారంగా వ్రాశివున్నారు గనుక నున్ను యిందున్నగురించి మేము వేరే బంగాళాలో చేరుతామని తమ బంగాళా విడిచి జూన్ నెల 12 తేద్ని వేరేవక బంగాళాలో చేరినారు ..."

---

"...... కాలేజీ వారి నిమిత్తము తమరు అప్పగించేటందుకు పంపించమని వ్రాసిన గ్రంథాలు యీవత్తుంను కంభంలోనె వుంనందున తమ హుకుం చేరిన 18 తేదీన యందు సదరు గ్రంథాలు త్వరగా అంపించేది అని కోదండ్రామయ్యా పేరిట వుత్తరం వ్రాసి అంపించి వుంనాను" (పుట - 71) (అన 1828 డిశంబరు 26 తేది.)

"... ... యింగిలీషు పుస్తకాలు పట్నానికి అంపించే దాన్కి కూలి వాండ్లనుంచి కాదు. కూలికి బండ్లు మాట్లాడి నాల్గుదినములలో రవానా చేస్తూ వున్నాను...." (పుట-78)
(18 మే.1829 సం॥)

"హజరతు మెస్తరు కెపటన్ కిలి ధొరవారి సముఖానకు-

అర్జిదాస్తు ఫిదివి జిల్లాకోర్టు గుమాస్తా క్రిష్టా రెడ్డి సలాములు చేశి వ్రాసుకున్న మన్వి అర్జియేమంటె మహారాజశ్రీ సి.పి. బ్రౌన్‌దొరవారియొక్క బంగాళాలో వుండబడ్ని వారి యింగిలీషు బొక్కులు తమతావుకు అంపించుమని నా పేరిట ఆ ధొరవారు హుకుం వ్రాయించి పంపించి నందున వారి వుత్తర్వు ప్రకారం యింగిలీషు బొక్కులు 275 రెండుతోలు పెద్ద పెట్టెలలో నున్ను వొక యెదురుపెట్టెలో నున్న జుమలా మూడు పెట్టెలలో వేయించి, మైనము గుడ్డ వగైరా పెట్టెలు పయ్ని వేయించిబండిమీద అంకాళు అనేవాణ్ని వెంబడి సముఖానకు పంపించి వున్నాను." (పుట-81) (1829 సం॥ జూను నెల 12 తేది).

ఈ ఉత్తరములోనే, బంగాళా కొనుటకు తగిన శక్తి కలవారెవ్వరు లేరనియు, ఖాళీగా ఉన్నచో బంగాళా చెడి పోవుననియు, కనుక ఎవరికైనను బాడుగకు ఇచ్చుట మంచిదనియు కృష్ణారెడ్డి గారు ఇట్లు సలహా చెప్పెను:

"..... యిందునిమిత్తం సున్వి చేయడం యేమంటే ప్రస్తుతం యిక్కడ వుండే ధొరగారు బంగాళా ఖరీదుకు తీసుకోవడానకు శక్తిలేక వేరే చేరేటందుకు నిశ్చయించినారు. యింకా ప్రస్తుతం యిక్కడవుండే ధొరలు క్రయానికి తీసుకోవడానకున్న బాడిగెకు వుండడానికే గాని యవ్వరు లేరు"

"బంగాళా ఖాళీగా వుండడం వల్ల బేపరుస్తు అయి చెడిపోవుట మాత్రమే కాకుండా నౌకర్లు కూలీల జీతాలు ప్రతి నెలకు మీరు యివ్వడంవల్ల నిండా నష్టం సంభవిస్తున్నది."

తన బంగాళాను 'కాలేజి' గా మార్చి పండితులకు స్థావరము కల్పించిన బ్రౌను దొర దానిని అమ్మవలెననుకొనుటకు, 1834లో ఆయన, ఉద్యోగములో వచ్చిన చిక్కులవలన సెలవు తీసికొని లండను పోనెంచుటయే ముఖ్యకారణముగ గ్రహింప వచ్చును. డబ్బునకు సంబంధించిన కష్టనష్టములును ఉన్నవని - "ఖర్చుమనిషి" అయిన బ్రౌనుదొర విషయమున - విశ్వసింప వచ్చును, డిసెంబరు 17వ తేదీన కోరంగిలో ఓడనెక్కి (1834)న బ్రౌనుదొర 1888 జనవరి 7 వ తేదీని మద్రాసులో కాలుపెట్టెను. ఈ మూడు సంవత్సరముల కాలము, బ్రౌనుదొర బంగాళాను ఇతర విషయములైన మంచి చెడ్డలను కృష్ణారెడ్డి గారు చూచు చుండెను.

ఇందువలననే, బ్రౌనుదొర జనవరి 7 వ తేదీని మద్రాసులో అడుగుపెట్టిన తరువాత రెండురోజులకె, 9వ తేదీని కృష్ణారెడ్డి గారికి జాబు వ్రాసెను. దానికి సమాధానముగా జనవరి 20 వ తేదీని రెడ్డిగారు వ్రాసిన జాబువలన, ఆ ఇరువురి నడుమ నున్న గౌరవాభిమానములు తెలియును. బ్రౌనుదొర తన గొడవలలో తానుండియు కూడ లండను పోవుటకు ముందు కృష్ణారెడ్డి గారికి మంచి ఉద్యోగమునకై సిఫార్సు చేయుటకు వ్యవధి చూచుకొనెను. ఈ జాబులోని కొన్ని ముఖ్యాంశములు: 25*

25* Ibidem. పుట - 57, 58

523* "మహారాజరాజశ్రీ మేస్తరు సి పి. బ్రౌన్ యిస్కోయరు ధొరవారి సముఖానకు-

తమ ఆజ్ఞాధారకుడయిన కదిరి మునసిపు అయోధ్యాపురం కృష్ణారెడ్డి అనేక సలాములుచేసి వ్రాసుకున్న అర్జీయేమంటె, యేలినవారు యీ నెల 9 తారీఖున వ్రాయ బడిన ఆజ్ఞా పత్రికె యీ దినం పగలు 7 ఘంటల వేళ నాకు చేరినందున తాము శీమకు పోయినట్టు వర్తమానం తెలిసిన దారభ్యం యీ దినం వరకు తమయొక్క క్షేమ సమాచారం యేమిన్ని తెలియకుండా వుండి నందున నగు॥ అహర్నిశం నాకు కలిగివుండే. అత్యంతమైన వ్యసనం యీ దినంతోటి పరిహారమై విశేషమైన సంతోషాన్ని పొంది యున్నాను. మరిన్ని తాము శీమకు విజయం చేశేటప్పుడు నాకు యీ జిల్లాలో చేరిన మారకాపురం మునసపు పనికి మహారాజ ॥ కాష్మీజరు ధొరగారికి శిఫార్సు చేసిన ప్రకారం సదరు మునసపు పని నాకు అయి 1834 సం॥ డిశంబరు నెల మొదలుకొని 1837 సం॥ మార్చి నెల వర్కు మారకాపురంలో వుండివుంటిని. సదరు మార్చి నెలలో యీ జిల్లాలో చేరిన కదిరి గ్రామం కడపకున్ను నా స్వంత గ్రామానికిన్ని సమీపమై నందున యీ కదిరి మొకాం పనివర్గు అయి వచ్చి వున్నాను. యిప్పట్లో కదిరిమొకాం మునసపు పనిలో కదిరి గ్రామంలో వుండి వున్నాను."

"తమరు వ్రాయించిన అజ్ఞ ప్రకారం తాము శీమకు విజయం చేసిన దినం మొదలు యీ దినం వరకు తమయొక్క బంగళా అద్దె సమ్మంధం లెఖ్ఖయావత్తున్ను వివరగతిగా నాలుగైదు దినములలో సముఖములోకి పంపిస్తున్నాను,........"

1829లో ఆరు వరహాల జీతముమీద ("నేను (హెగ్గుదొరవారికి) ఫారసీతో అర్జీవ్రాసి యిచ్చివుండగా. నా అర్జీ కింద నాజరుపనికి పైంటు చేస్తాము అని తన స్వహస్తూరి వ్రాసి వుద్యోగపు చేవ్రాలు చేసి అర్జీనాకు వాపసున్ను యిచ్చివున్నారు. నాకు వుండే ఆరు వరహాల గుమాస్తాగిరి సుబ్బారావు అనే అతనికిన్ని అతని 5 వరహాల పని రామ బ్రహ్మము అనే అతనికిన్ని యిస్తాము అని దస్తావేజు వ్రాసియిచ్చి వున్నారు...."
—13 మే 1829 సం॥) ఉద్యోగములో నున్న కృష్ణారెడ్డిగారు క్రమ క్రమముగా కష్టపడి పనిచేసి అందరి మన్ననలను పొంది నేటివ్ రిజిస్టరుగా మునసపుగా అభి వృద్ధికి వచ్చినాడు. ఈతనికి బ్రౌనుదొరయందు ప్రత్యేక గౌరవాభిమానములున్నను ఇతరోద్యోగులయిన దొరలను కూడ తనపనిచేత మెప్పించి వారి యందు సముచితమైన గౌరవమును చూపుచునే యుండెను. బ్రౌనుదొరకును ఈతనికిని నడుమ పరస్పరము

ఆదరాభిమానములున్న హృదయములు కలిసిన సంబంధము అనుటలో సంశయములేదు

బ్రౌనుదొర కడపలో కొన్న బంగళాను, తోటను మంచిస్థితిలో ఉంచుటకు. దానిని కొన్ననాటి నుండియు కృష్ణారెడ్డి గారు శ్రమించుచునేయుండెను. బంగాళాను అద్దెకు ఇచ్చు విషయమున, అది ఖాళీగా ఉన్నప్పుడు చెదలు పట్టకుండ బాగుచేయించు విషయమున, గచ్చు మొదలైనవి పోయినప్పుడు మరమ్మత్తు చేయించు విషయమున, రెడ్డిగారు పడిన శ్రమలన్నియు జాబులలో కలవు. మామిడితోట విషయమున ద్రాక్ష తీగల విషయమున కూడ ప్రత్యేక శ్రద్ధవహించెను ఏటినుండి (బంగాళాకు సమీపమున పారు ఏరు) బంగాళా తోటవరకు కాలువతీసి అట్లు పారిన ఏటినీటిని తోటలో నున్న "భావి గుంతకు నిండించిన తర్వాత ఆ భావి కపిలె నీళ్లవల్ల తోటకు నీళ్ళు పారడం తోట మార్జితం కావడం" గురించి, వేసవిలో ఏటిలో నీటిపారుదల లేనప్పుడు భావిని లోతుగా తవ్వించి రాతి కట్టడము కట్టించుటను గురించి జాబులలో వ్రాసెను. భావి లోతుగా త్రవ్వుటకు 40 రూపాయలు పట్టుననియు, రాతికట్టడమునకు సుమారు 200 రూపాయలు పట్టుననియు, తనవద్దనున్న బాడిగె "అయివజు రు. 150 -- చిల్లర" తో పని ప్రారంభించి చేయించు చున్నట్లును, తొందరగా "తమ ఉత్తర్వు దయచేయించ వలెనని కోరుతూ" 1832 లో ఆగస్టు 26 వతేదీని జాబు వ్రాసెను. ఈ పనులన్నియు చేయించుట బంగాళాను పరిశుభ్రముగానుంచుట, తోటలో కపిల తోడుట (చివరకు ఎడ్లకు మేతవరకు) మొదలైన పనులన్నింటిని చేయుంచుట కూలీలను నౌకరులను పెట్టి ఇంచు మించుగా పదునైదు సంవత్సరములు కృష్ణారెడ్డి గారు తన బాధ్యతగా భావించిచేసెను. లెక్కల నన్నింటిని అణా పైసలతో (ఖాళీ సారాసీసాలు అమ్మగా వచ్చిన రూపాయలు కూడ) వ్రాసి దొరకు చూపించి మెప్పు పొందెను పండితులు మొదలైనవారు పని చేయుటకు తగిన వసతులు సమకూర్చుటలో, వారు ఎప్పు డెప్పుడెంత పని చేయుచున్నది పరిశీలించుటలో రెడ్డిగారి "చేయి" యున్నది. ఈ పనుల కన్నింటికి బ్రౌనుదొర సొంతముగా కృష్ణారెడ్డిగారికి ఇచ్చిన దేదియులేదు. ఆనాడు - ఆనాడేమి, ఈనాడు మాత్రముకాదా? ఆశితుల కందరికి అధికారులు సాయము చేసినట్లే, ఉద్యోగ విషయమున బ్రౌనుదొర సాయము రెడ్డిగారికి లభించినది.

బ్రౌనుదొరకు కూడ డబ్బునకు ఇబ్బందిపడు చుండిన విషయము, (అప్పులున్న విషయము) రెడ్డిగారికి తెలియనిది కాదు. అప్పుడప్పుడు పండితులకు, బంగాళాలో

పనిచేయుచున్న నౌకరులకు, కూలీలకు ఆయన జీతము లిచ్చుట ఆలస్యమగుటయు దానికి ఆయన చింతించుటయు ఆ సందర్భములతో కృష్ణారెడ్డిగారు బ్రౌనుదొరను ఊరడించుచు జాబులు వ్రాయుటయు కలదు. అట్టి జాబులలో నుండి కొంత భాగమును క్రిందనిచ్చుచున్నాను:[26]

"......తమరు నాయందు సంపూర్ణమైన దయవల్ల యీ నెం 6. 13 తేదీల యందు వ్రాయించిన అగ్గ పత్రికలు చేరి అపరిమితమైన సంతోషాన్ని పొందినాను. యీలో వైనం యిక్కడ వుండే తమ నవుకర్లు వగైరాలకు చారవలశ్ని లెఖ్ఖ సం॥ రూపాయిలు అంపించనందువల్ల అగ్గ పత్రికె వ్రాయడానికి సంకోచం అయింది అని వ్రాయించినారు అయితే తమ క్షేమనుంచి జీవనము చేశే మాబోటి వార్కి తమయొక్క క్షేమంతోనే మాకు ముఖ్యమైన అభిప్రాయంగాని కడమదేనికీ విచారంలేదు. బహుదినాలనుంచి సంరక్షణ చేశే ప్రభువులకు సమయంకొలదికి వకవేళ యిక్కట్టు వస్తే అందు నిమిత్తము యే విషయములోనైనా వ్యసనపడవలశినది లేదు........"

బ్రౌనుదొర ఎప్పుడైనను, ఉద్యోగవిషయములలో గాక ఇతరవిధముగ సాయ పడవలెనని యత్నించినను కృష్ణారెడ్డి గారు ఆ సాయమును మర్యాదగా నిరాకరించు టయుకలదు. 1832 ఫిబ్రవరి 22వ తేదీని రెడ్డిగారు వ్రాసిన లేఖలోని ఈ భాగము దానిని తెలుపును:

"......ముసిలి యెద్దును నా స్వంతానకు తీసుకునే లాగ్నునన్ను మంచి యెద్దును బంగాళాలో కొని వుంచేలాగ్ను ఆజ్ఞ అయివున్నది. యిప్పుడు వున్న ముసిలి యెద్దును అమ్మేవేశి అందుల క్రయం యిప్పుడు కొనబొయ్యే యెద్దు క్రమంలో చెల్లు పెట్టి తతిమ్మా రూకలు లెఖ్ఖ కింద ఖర్చువ్రాస్తాను కాని నా స్వంతానికి కావలశినవి యేమి అన్నిటికి తమదయ వుండడమే పదిలక్షల వరహాలు వున్నట్టు యెంచుకుని సంతోషిస్తున్నాను ......"

మొదటి నుండియు తన్నభిమానించు చుండెనను గౌరవము, కృతజ్ఞతా భావము బ్రౌనుదొరయందు కృష్ణారెడ్డి గారికి కలదు. తన జాబులలో ఈ విషయమును చాల

26. Ibidem ; పుట - 42

సొర్థ వ్రాయుచుండును. 1830 లో సెప్టెంబరు 21 వ తేదీని ;వాసిన లేఖలో తనకు హొగ్గు, వ్రుబం తామసు గేగను మొదలైన కొందరు దొరలు సాయము చేయుదుము అని చెప్పినను - వారి దగ్గర తాను అప్పుడప్పుడు పని చేయుచుండినను-వారి సాయమును కోరకుండుటకు కారణము, వారి దగ్గర ఉద్యోగము చేయుటకంటె బ్రౌనుదొరదగ్గర పని చేయుట తన కిష్టమను విషయము నిట్లుచెప్పెను:

"......వారు (తామసు గేగను) శెల్వు యిచ్చినారు. -నీవు మా దగ్గెర కానా కష్టపడినావు గనుక్కు నిన్ను మేము కనిపెట్టుతాము అని శెల్వుయిచ్చినారు. యిదిన్నిగ్గా వారిగుండా - యిక్కడ ఉండే దొరలకు శిఫారషు చేశేటందుకు నేను మన్వి చేషుకుంటే వారు అగత్యం చేతురు......బాల్యంనుంచి తమదయవల్ల తరిబియ్యత్తు అయి తమ కటాక్షాన్కి పాత్రుణ్ణి అయినందువల్ల యీ మమత చాతతమస ముఖంలో వుండి తమ ప్రభుత్వం చూడవలెను అనిన్ని తమ యదుట వుండే నవుకరి చాయవలెను అనిన్ని తమ సముఖంలో గొప్పగా వుండవలెను అని నాకు వుండే కోరికె యీ దేశం నా స్వదేశం అయినప్పటికి యిక్కడ నేను గొప్ప నవుకరీ సంపాదించుకునేటందుకు చెయ్యతగ్గ ప్రయత్నములుకు అభ్యంతర పరుస్తున్నది......"

అవసరము వచ్చినప్పుడు కొంచెము కటువుగా కూడ వ్రాయగలిగిన ఆత్మాభిమానము, దొర అపార్థము చేసికొనునేమో అను భయము లేనంతగా చనువు కృష్ణారెడ్డిగారికి కలదని లేఖలవలన తెలియును. 1830లో సెప్టెంబరు 5వ తేదీని వ్రాసిన జాబులో ఈ వాక్యములున్నవి

"లోగడ నుంచి తమదయ నిమిత్తము యీ కొంచెం కొలువులో వుండడానుకు కారణం అయినవి గాని లేకపోతే వక నిమిషం వుండడం నాకు సమ్మతి లేదు. వక వేళ నా యిల్లు విడిచి నప్పటికిన్ని తమ దయవల్ల నేనుపొందిన తరు బియ్యత్తు నుంచి కొందరు ధొరలు పరిచయం కలిగి వున్నారు. వారి దగ్గెర దయ సంపాయించుకుని నవుకరీ సంపాయించుకునేటందుకు శక్తి కలిగివున్నది. అయితే తమరిని విడిచి అన్యత్రా ధొరతావుకు పోవడం నాకు యంతమాత్రం సమ్మతిలేదు......"

బ్రౌనుదొర గుంటూరులో నుండగనే కరువు పరిస్థితులు దుర్భరముగ నుండుటయు ఆ విషయమై ఆయన మద్రాసులోని గవర్నరుగారికి వ్రాయుటయు

అక్కడనుండి మందలింపుతో లేఖవచ్చుటయు తెలిసికొనియే యున్నాము. (ఈ గ్రంథములో పుటలు - 106, 107, 108). ఆనాడు ఈ కరువు ఇంచుమించుగా తెలుగు ప్రాంతము నంతటిని బాధించెను. ప్రభుత్వమువారు బ్రౌనుదొరను గుంటూరు నుండి చిత్తూరునకు బదిలీ చేసిరి. గుంటూరు కరువును గూర్చి ప్రత్యక్షానుభవమున్న బ్రౌనుదొర, కడప సంగతి ప్రశ్నింపుచు జాబు వ్రాయగా దానికి కృష్ణారెడ్డి గారు వ్రాసిన జవాబువలన పేదవారికి సాయపడుటలో ఆతని సంసిద్ధత తెలియుచున్నది. మార్చినెల 25 వ తేదీని (1833) వ్రాసిన దానిలో కొంత భాగము:

"యీ కడపలో బీదవాండ్లను గురించి యిక్కడ వుండే జనం యేరీతిగా యేర్పరచిన దిన్ని వాండ్లకు నిత్యం యేమి ఖర్చు తగిలేదెన్ని యిందుల వివరం వాసి పంపించేలాగున ఆజ్ఞాపించి వున్నారు. ఆయితే దిన్ని యిందుల వివరం వ్రాసిపంపించే లాగున అజ్ఞాపించి వున్నారు. అయితే యీ వూళ్లో రు. 1కి శే. 13 బియ్యమున్ను రు. 1 కి జొన్నలు శే. 1 8 యీ ప్రకారం ధారణవున్నది. బీదవాండ్లు విస్తారం జనం వుండి అన్నంపెట్టేవాండ్లు లేనందున మిక్కిలి జీవశ్రమను పొందుతూ వున్నారు వర్షం లేనందున మంచినీళ్లు దొరకక వాటికిన్ని శానా శ్రమపడుతూవున్నారు. యిక్కడ వుండే కల్కటరు మేస్తరు లేకన్ దొరవారు వక ధర్మపట్టి యేర్పరచి ప్రతి నెలకు యెవరైనా బీదవాండ్లకు సహాయము చేసేవాండ్లు ఆ పట్టీలో వేయవలసినది అని నిర్ధారణ చేసి తానునెల 1 కి రు. 10లు యిస్తామని వేసినారు. దాని కింద కొంతమంది దొరలున్ను యింకా కొంతమంది నల్ల జనమున్ను తమ శక్తిమాత్రం వేసివున్నారు. ఆ అయివజు నెల 1 కి రు. 50 లు జమ అవును. యిందుకు లంగరు ఖానా వకటి మేర్పరచి బీదవాండ్లకు 30, 40 మంది జనాన్ని వక జాబితా వ్రాసి, ఆ జాబితాలో వ్రాసిన జనానికి వారానికి వకదినంనాడు సదరు ప్రకారం నెలకు రాబడె అయివజుకు తగుమాత్రం ఖర్చుచేస్తూవున్నారు. అదృష్టవశాత్తు ఆ జాబితాలో దాఖలు కాబడిన జనంగాక విశేషంగా వుండబడిన బీదవాండ్లకు ఆ లంగరుఖానా నుంచి యేమి ఉపయోగంలేదు."

"........యీ పట్నంలో బహుజనం నిరాధారంగా అన్నంలేక బహు ప్రయాస పడుతూవున్నారు, భాగ్యవంతులైన వారికిన్ని ప్రభువులైన వారికిన్ని వాండ్లమీద కరుణవుంచి జీవనానికి సహాయము చెయ్యవలెననె బుద్ధిలేనందువల్లనున్ను వాండ్లకు

సహాయపరచవలెనని బుద్ధి కలిగినవాండ్లకు సదరు జనాన్ని సంరక్షణచేసేశక్తి లేనందున వాండ్ల కోరిక ప్రయోజనం లేకపోవుటచేతనున్ను బహుజనం అత్యంతమైన ప్రయాసపడుతూవున్నారు.......”

“ఆ ఖైరుకు నిత్యం రు. 4, 5 రూపాయీలు మాత్రం ఖర్చుచేసి అన్నం పెట్టించినా బహుజనం జీవనం నిమిత్తం మిక్కిలి శ్రమపడేవాండ్లకు శానా సహాయ పరుస్తున్నది. ఆ ప్రకారం వ్రయంచేసి వాండ్లను సంరక్షణచేయడం తమకు సంతోషంగా ఉన్న పక్షమందున తమయొక్క ద్రవ్యం నిరర్థకంగా వ్రయంకాకుండా జాగ్రతపెట్టి జరూరుగా కావలసిన అన్నపేదలకు అన్నం పెట్టించే విషయంలో నన్నుంచి అయ్యే ప్రయాసలు వెలితిలేకుండా జరిగించడానికి నాకు చాలా సంతోషంగా ఉన్నది. ఆ సంగతి వివరంగా తమకు తెలియడానికి నెలనెలకు అందుల వివరగతి లెక్క కూడా పంపిస్తున్నాను. గన్క వున్న సంగతి చిత్తానకు వేద్యంచేసినాను.27 ”*

ఇట్టి విషయములలో బ్రౌనుదొర దయార్ద్రహృదయుడని తెలిసియే కృష్ణారెడ్డి గారు ఇట్లు వ్రాసెను. బ్రౌనుదొర చేసిన దానధర్మములను గూర్చి కొంత తెలిసి కొనియే యున్నాము. (ఈ గ్రంథములో పుట - 84). దుర్భరమైన ఆనాటి కరువు (గుంటూరు కరువని, నందన సంవత్సరపు కరువని దానిపేళ్లు) ప్రభావము మద్రాసున కూడ కనబడినదనుటకు ఏనుగుల వీరాస్వామయ్యగారు, ఆ సందర్భమునచేసిన సాంఘిక సేవను గూర్చి కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళగారు వ్రాసిన వాక్యములు తెలుపుచున్నవి (ఈ గ్రంథములో పుటలు-108, 109). ప్రత్యేకముగా కడప పరిస్థితులను గురించిన వివరములు అక్కడ మిషనరీగా ఉన్న డబ్లియు. హావెల్ వ్రాతల వలన కూడ తెలియుచున్నవి. (ఈ గ్రంథములో పుటలు-109, 110)

ఆనాడు తాను ఉద్యోగరీత్యా చేయవలసిన కోర్టుపనులలో (“నేను వారి మర్జీనికని పెట్టి వాగ్మూలాలు వ్రాయడం సునావణీ చెయ్యడం యీ మొదలయ్ని పనులయందు జాగ్రత్తకల్గి జరిగించి వున్నాను వారిపని అంతా అయ్నితర్వాత నా తారీపు శానా చేసినారు. నా పూర్వోత్తరం విచారించినారు. వారై (థామస్ గేగన్ దొర) నాకు వక క్యారకటరు యిచ్చినారు.— “బ్రౌనుదొరకు 21-9-1830 నాడు వ్రాసిన జాబుతో.), లౌకిక కార్య వ్యవహారములలో; జనులను — వారు పండితులైనను పామరులైనను —

27* Ibidem ; పుటలు - 11, 12, 13.

వారి వారి పనులలో నిమగ్నులగునట్లు చేసి;- ఏవరికి తగిన మర్యాద వారికిచ్చుచు, నడిపించుటలో కృష్ణారెడ్డి గారు చాల దక్షులని తెలియుచున్నది. ఈతడు విశ్వాస పాత్రుడు, సమర్థుడు, నీతిమంతుడు గనుకనే బ్రౌనుదొర ఈతనిని నమ్మి తన బంగాళా ఆతని చేతిలో పెట్టి 1834 లో లండను వెళ్ళగలిగెను. పండితులు పని చేయు చున్న తన "కాలేజి" నిర్వహణ బాధ్యత — వారి వారి పనుల ననుసరించి జీతము లిచ్చుట మొదలైన పనులు ("నీ వుత్తరం వచ్చేవరకే నీదగ్గిర నిలవ వుండే రూపాయలలో నుంచి వంగీపురం నరసింహ్వాచార్యులకు డెభై రూపాయలు యిప్పించ వలశ్నిదని నీ పేర వుత్తరం వ్రాయించడమయ్నుది......" బ్రౌనుదొరజాబు — 5-9-1832" కాలేజి కచేరివారు జరిగించ డానకు పనియేమి ని లేే సంగతికి ధొర వారికి విజ్ఞాపన చేశేవున్నాను.

ప్రస్తుతం బుచ్చన్న శాస్త్రుర్ల వారు చేసిన టీక మొకాబిలా చేస్తూవున్నారు. వారు యిక మీదట యేమిపని జరిగించడానకు తెలియలేదు.. వారు అందరు వక స్థళంలో కచెరి చేస్తేనే గాని యెవరు యెవ్పుడు వచ్చేదిన్ని యేమి పని చేశేదిన్ని తెలియ న్యారదు. యిద్దరు ముగ్గురు కూడినా గాని పని జరగడానకు వసతిలేకుండా వున్నది, తమకు బహుదినాలనుంచి జీతాలు రాలేదు, అన్నానకు లేక చస్తూవున్నాము అని చెప్తుతూ వున్నారు — 21-2-1830. దొరలకు బంగాళా అద్దెకిచ్చు ఏర్పాటులు మొదలైన పన్నియు కృష్ణారెడ్డిగారు నిర్వహించుచుండెను. ఒక విధముగా చెప్పవలెనన్న బ్రౌనుదొరయొక్క ఉద్యోగేతరములైన బాధ్యతలనన్నింటిని కృష్ణారెడ్డి గారు స్వీకరించి నిర్వహించుచువచ్చినాడనుట సత్యదూరము కాదనవచ్చును.

ఇన్నివిధములుగా బ్రౌనుదొరకు చేదోడు వాదోడుగా నున్న కృష్ణారెడ్డి గారు "విషమ జాడ్యము" వలన చనిపోయినట్లు 1844 లో ఏప్రెల్ 12 వ తేదీని ధర్మపురం సుబ్బన్న (ఈ జాబువ్రాయునాటికి ఇతడు "ముప్తి సదరమన్ వారి కోర్టులో రెండో గుమాస్తా." బ్రౌనుదొరకు కడపలోను, చుట్టుపట్ల గ్రామములలోను తెలుగు పుస్తకముల కొరకు ప్రయత్నించినవాడు. భానుమద్విజయము, ప్రభులింగ లీలలు, చంద్రాంగద చరిత్ర మొదలైన వాటికొరకు ప్రయత్నించినవాడు) జాబువ్రాసెను;

"నొసం మునసపుగా వున్న అయోధ్యాపురం కృష్ణారెడ్డి మార్చినెల 15 తేది సాయంత్రం విషమ జాడ్యంవల్ల నొసంలో కాలంచేశినాడు. జ్యోతిరాజప్ప మదనపల్లె

మునసఫుగా వుండి యీ కడపకు వచ్చి వుబ్బసపు జాడ్యం నిండా ప్రబలించి చనిపోయినాడు. లోవయినమే తమ నవుకరయిన ముశిలిమడుగు గురవప్ప చనిపోయి నాడు. యీ సంగతి చిత్తానకు వేద్యం కాగలందులకై శృతపరచినాను."

ఈ జాబు తెచ్చిన వార్త బ్రౌనుదొరకు చాల బాధకలిగించి యుండుననుటలో సంశయములేదు. కృష్ణారెడ్డి గారు మార్చి 25 న గాక మార్చి 26 న చనిపోయినట్లు బ్రౌనుదొర వ్రాసెను. ("......He subsequently was made a Munsif and died on the 26th March 1844, holding that appointment.")
బ్రౌనుదొర కొరకు తాను ఏరువుగా తెచ్చియిచ్చిన బసవపురాణ చంద్రాంగద చరిత్రలు తిరిగి వాటి యజమానులకు ఇచ్చివేయవలెనుగనుక వాటిని ప్రతులు సిద్ధము చేయించుట ముగిసినచో - దయచేయించవలసినదని "నౌసంతాలూకు మున్సపు కోర్టు గుమస్తా అయిన" అవధానం అప్పయ్య 1844లో జూన్ 20 తేదీన వ్రాసికొనిన జాబులో 1844 సంవత్సరము మార్చి 26వ తేదీన కృష్ణారెడ్డి గారు కాలము చేసినట్లున్నది గనుక 1844 లో మార్చి26 తేదీని కృష్ణారెడ్డిగారు మరణించినట్లు గ్రహించవచ్చును. ఈతని మరణము, కడపలో తనబంగాళా కేంద్రముగా బ్రౌనుదొర నిర్వహించుచున్న తెలుగు భాషాసాహిత్యముల కృషిని గొడ్డలిపెట్టయిన దనుటలో అతిశయోక్తి లేదు. ఈ ఇరువురి సన్నిహిత సంబంధము మనభాషా సాహిత్యములకు చాల సాయపడెను.

ధర్మవరం సుబ్బన్న జాబులో, ముశిలిమడుగు గురవప్ప చనిపోయినట్లు కూడ నున్నది. చాల విశ్వాసముతో బ్రౌనుదొర బంగాళాను కాపాడుచు వచ్చిన నవుకరు ఆతడు, కృష్ణారెడ్డి గారు తన జాబులలో ఈతని విశ్వాసపాత్రతను గూర్చి చాలచోట్ల వ్రాసెను. ఈతనిని గురించి సిఫార్సు చేయుచున్నట్లుగా గ్రహింపవద్దని బ్రౌనుదొరకు వ్రాయుచునే కృష్ణారెడ్డిగారు ఈతనిని కడపలోనే ఉంచుట మంచిదని సిఫార్సు చేసెను. 1830 అక్టోబరు 14 వ తేదీన వ్రాసిన జాబులో రెడ్డిగారు ఇట్లు వ్రాసెను :

......తమరు యీ నెల 4 రోజ్ను దయ చేయించిన అజ్ఞప్రకారం పెద్దబోయి గురువప్ప యీ రోజ్ను వుదయాన యిక్కడ నుంచి సముఖానకు వచ్చివున్నాడు... అందరి నౌకర్లకంటె యెక్కువగా ష్షున్నూ నమ్మికెగానున్ను తమయొక్క కార్యాల యందు ప్రవర్తిస్తూ వచ్చియున్నారు. యిక్కడ బంగాళా ఖబరుదారీ పన్కిగాని మరమతుపనిలోగాని యితణ్ని యిక్కడ వుంచుకోవడం నాకు నిండా సమ్మతిగనుక్క

తమకు అక్కడ వుండబడ్డి అగత్యమయ్ని కార్యాలు తీరిపోయి అక్కడ యితనినుంచి పనిలేని పక్షమందు అక్కడ యేదొక నవుకరి ఆసామిలో దాఖలు చేశితిరి యిక్కడికి పంపిచే లాగ్ను చేయవలెను. అట్లా అయ్నిట్టు అయితె యితనికి జాతీ కాబడ్ని అక్కడి జీతం సాధారణంగా ముట్టుతూ వున్నది. యిక్కడ తమయొక్క కార్యాలలో వుపయోగంగా వుంటూ వున్నాడు. చిత్తానకు రావలెను."

"యితణ్ని గురించి నేను శిఫారసు చెయ్యలేదు గాని నడుమ విద్యమానం విజ్ఞాపన చేశినాను......"

ఈ సిఫార్సును, బ్రౌనుదొర గుర్తించి జ్ఞాపకముంచుకొనుటకు వీలుగా లేఖల సంపుటి సూచిక పుటలో "కృష్ణారెడ్డ about Gurapa" అని వ్రాసికొనినాడు.

కృష్ణారెడ్డి గారి జాబులలోని భాష ఆనాటి విద్యావంతుల భాష. ఆ భాషలో పదులకొలది ఉర్దూ, ఫార్సీ పదాలున్నాయి, యింకను అంత ఎక్కువగా ఇంగ్లీషు మాటలు రాలేదు, ఫార్సీకున్న ప్రాముఖ్యమింకను పూర్తిగా పోలేదు అను విషయము తెలియుచున్నది, చక్కని నుడికారములో ఈ జాబులున్నవి. ఈ నుడికారమును మెచ్చుకొనుచు (ఆయన మెచ్చిన వాక్యము. "తమ పనులలో లేనివారికిన్ని తమరిని కొంచెంగా నమ్మినవారికిన్ని యిదివరకు అనేక మందికి గొప్పపన్లు దొరికి (వారు కృతార్థులు అయినారు.") ఆయన ఇట్లు వ్రాసెను:" Let the reader observe the elegant style in which the Telugu sentence is framed. It is hard to turn these expressions into English without losing the beauty of phrase." తరువాత ఈ వాక్యాన్ని ఇంగ్లీషులోనికి ఇట్లు అనువాదము చేసెను;" Men who are not engaged in your honour's business, men who have but slightly relied on you, have already by your patronage obtained high employ and their desires are fulfilled."

తెలుగు రీడరులో ఇంగ్లీషు అనువాదముతో అచ్చయిన జాబులలో భాష, విషయము కూడ కొంతమారినట్లు కనబడును భాష విషయములో మూలములోనున్న మాటలు కొన్ని మార్పుట జరిగినిది. ఉదాహరణగా కృష్ణారెడ్డి గారు బ్రౌనుదొరకు వ్రాసిన ఉత్తరములోని ఓక వాక్యము గ్రహింతుము :

**మూలలేఖ :** "....ఆ రశీదెంటు పనిలోవున్న వారికి మెన్నిదినాలుకు అయినా రేంకి బడాయించదు అనిన్ని నిరాధికారమైన వ్యాపారపు వుద్యోగము అనిన్ని ఆపనిలోవుండే

అతను తిర్గి జూ.డైశాలు పనికిగాని రివిన్యూపనికిగాని రాడు అనిన్ని చెప్పతూ వున్నారు."

**తెలుగురీడరు లేఖ :** "ఆ రిసైడెంటు పనిలో వున్నవారికి యెన్ని దినాలకున్ను గొప్పవుద్యోగముకాదనిన్ని, అది నిరధికారమైన వుద్యోగమనిన్ని ఆ పనిలోవుండే వారు తిరిగి జుడీషియల్ పనికిగాని, రివిన్యూపనికిగాని, రారనిన్ని చెప్పుతున్నారు"

చూచిన వెంటనే భాషలో మార్పుతేట తెల్లమగుచునే యుండెను. ఈ జాబు కృష్ణారెడ్డిగారు 1830 ప్రాంతములో వ్రాసినది. తెలుగురీడరు (ఇంగ్లీషు అనువాదము) 1852లో అచ్చయినది. రీడరు అచ్చు పనిని చూచినవారుగాని లేదా బ్రౌనుదొర గాని (ఈ రెండింటికి నడుమ ఇరువది సంవత్సరములకంటె అధికముగనే వ్యవధి ఉన్నది గనుక) ఈ మార్పులు చేసి యుండవచ్చును. ఇట్లేవిషయమునకు సంబంధించిన మార్పులును కొన్ని గలవు. అవి వ్యక్తిగతవిషయముల తొలగింపునకు సంబంధించినవి.

**మూలలేఖ :** "వోబళరావు దగ్గెర తమరు రెండు మూడు మారులు అయివజు తీసుకొని పత్రాలు వ్రాశియిచ్చివున్నారు" "...తమయొక్క సామాను పైకి చీన చిప్పలు మొదలయ్నువిన్ని సాహాయిన్ని కొంచరు దొరలుకావలెనని చెప్పుతూవున్నారు..." (18మే, 1829)

"కంభంనుంచి తెచ్చిన కాలి సీసాలుపైకి లోగడ అమ్ముడుపోయిన సీసాలుగాక చాలివుండబడిన సీసాలు పలిగిపోతూవున్నందువల్ల వాజిబిధారణ ప్రకారం డజను 1కి ముక్కాలు రూపాయి ప్రకారం అమ్మినందువల్ల రు. 7½ వసూలు అయ్నిది. అవి నా వశ్నా వున్నవి." (మార్చి. 1830)

వ్యక్తిగతముతైన ఇటువంటి విషయములకు సంబంధించిన ఈ వాక్యములు అచ్చుపుస్తకములో లేవు. అనగా, తెలుగు రీడరు అచ్చువేయునప్పుడు బ్రౌనుదొర విషయమునంతటిని జాగరూకుడై పరీక్షించెనన్నమాట !

తాను వ్రాసిన ఒక జాబులో కృష్ణారెడ్డిగారు బ్రౌనుదొరను గురించి, "అన్నిటికి నా యొక్క తల్లి దండ్రిని విడిచి తమరె తల్లిదండ్రీ అని నమ్మివున్నాను." అని వ్రాసెను. ఈ వాక్యము దగ్గిర బ్రౌనుదొర (చిరునవ్వుతో అని మనమూహించుకోవ

వచ్చును.)" This is a mere figure of Rhetoric. The writer was than living in the midst of his friends, and flourishing as a wealthy famer" అని వ్రాసెను.

తెలుగు వారిలో పండితులు బ్రౌనుదొర సాహిత్య జీవితమునకు సన్నిహితులు కాగా కృష్ణారెడ్డిగారు ఆయన వ్యక్తిగత జీవితమునకు సన్నిహితుడాయెను. ఇట్లనుట వలన, రెడ్డిగారు బ్రౌనుదొరకు గ్రంథసేకరణాది విషయమున, పండితుల పనికొలాది కమును విస్మరించితిమని కాదు. స్థూలముగా చెప్పవలెనన్న, పండితులు బ్రౌనుగారి బుద్ధికి, రెడ్డిగారు ఆయన హృదయమునకు కూర్చువార్తరి అనవచ్చును.

బ్రౌనుదొర కృషికి తెలుగునాడు కార్యరంగమగుట వలన తెలుగు భాషా సాహిత్యములు అభివృద్ధికి వచ్చెను. ఆయన ఉద్యోగము మన ప్రాంతమునగాక, ఇంకొక భాషాప్రాంతమయినచో ఆయన సేవ ఆ ప్రాంతీయ సాహిత్యములకు లభించి యుండెడిది. తెలుగు భాషాతోబాటు మొదట ఆయన చదివిన మరాఠి ("After I had acquired a little Telugu, I was desired to read Marathi") ప్రాంతమున ఆయనకు ఉద్యోగమువచ్చినను, తమిళ ప్రాంతమున వచ్చినను ఆయా భాషలను అభివృద్ధి చేసెడివారు. ఇది ఆయన తత్త్వము. ప్రవృత్తి బాల్యముననే ఆయన తండ్రి డేవిడ్ బ్రౌన్ భాషల విషయమున తన కుమారునిచే చేయించిన కృషి (ఈ గ్రంథములో పుటలు — 50 51.52 అధస్సూచికలు) తరువాత ఫలించినది. అనాడు మద్రాసునకు గవర్నరుగా ఉన్న మన్రో వాక్యములు (ఈ గ్రంథములో పుట — 59) బ్రౌనుదొరను ఉత్తేజపరచెను. ఇందువల్లనే 1817లో ఆయన మద్రాసులో అడుగుపెట్టు వరకు తెలుగు అను ఒక భాష ఉన్నదను విషయమే వినని వాడు ("I never had even heard of Telugu") తెలుగు ప్రాంతమున ఉద్యోగిగానే తెలుగు నందంత శ్రద్ధవహించి దానిని నేర్చెను. కంపెనీ ఉద్యోగులు ప్రాంతీయ భాషలను నేర్చుకొనవలెనన్నదే, మన్రో సందేశము.

బ్రౌనుదొర కలకత్తాలో పుట్టిపెరిగినా, ఆనాటి ఆయన పరిసర వాతావరణమున హిందూస్తానికి విశేషప్రాముఖ్య ముండుటవలన, భారతీయ భాషలలో దానితోడనే ఆయనకు ప్రారంభ దశలో విశేష పరిచయముండెను. బెంగాలీ లిపిని దేవనాగరి లిపిని కూడ తరువాత చాల సంవత్సరములకు ప్రయత్నపూర్వకముగ నేర్చుకొనెను

(ఈ గ్రంథములో పుట—66. అదస్సూచిక) ఈ పరిస్థితులలో ఆయన బాల్యమున తెలుగు అను పేరుకూడ వినలేదనుటలో ఆశ్చర్యములేదు. కాని, ఆయన తండ్రియైన రివరెండు డేవిడ్ బ్రౌనునకు తెలుగుభాష ఉనికిని గూర్చి తెలియునని చెప్పుటకు అవకాశమున్నది. ఆయనకలకత్తాలో ఛాప్లిన్ (Chaplain) గా ఉన్నకాలము (1786-1812)లో క్రైస్తవమత ప్రచారమునకు క్రైస్తవ మిషనుల అభివృద్ధికి చాల కృషిచేయుటయేగాక "కలకత్తా బైబిలు సొసైటీ"ని కూడ స్థాపించెను. ఇందువలన ఈయనకు భారతదేశములో వివిధ ప్రాంతములలో నున్న మిషనులతో మిషనరీలతో ఉత్తర ప్రత్యుత్తరములుండెడివి. ఆకాలమున విశాఖపట్టణములో తనను క్రైస్తవ బ్రాహ్మణునిగా అభివర్ణించుకొనిన లండన్ మిషన్ సొసైటీ మిషనరీ ఏడెస్ గ్రాంజెస్ (Desgranges, A : 1780-1810) అను నాయన యుండెను. ఈయన క్రాన్ (Cran) సుబ్బరాయరు, ఆనందరాయరు అను వారల సాయముతో బైబిలును తెలుగులోనికి (Gospels of Mathew and Luke) అనువాదమున చేసెను. బైబిలును తెలుగులోనికి అనువాదము చేసిన ప్రథములలో ఈయన కూడ కలరు. ఈ అనువాదము 1812లో శ్రీరామపురములో అచ్చయినది. ఈ అనువాదము ఈయనకు సాయపడిన ఆనందరాయరు తెలుగులో రివరెండు డేవిడ్ బ్రౌనునకు జాబులు-బైబిలు అనువాదమునకు సంబంధించి-వ్రాసియున్నట్లు తెలియుచున్నది.

విధి ప్రేరణమున బ్రౌనుదొరకు తెలుగునాటితో సంబంధము-ఉద్యోగరీత్యా-ఏర్పడి ఆయన ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు పూర్తిగా తెలుగునకు లభించినవి. ఆనాటి పరిస్థితుల ననుసరించి కంపెనీ ఉద్యోగులు తెలుగు ప్రజలకు-తెలుగు ప్రజలకేకాదు, ఏప్రాంతపు ప్రజలకైనను-చేయగలిగిన లేదా చేయనెంచిన-అదియు వారు సహృదయులు, సంస్కృతి పరాయణులు అయినచో-సాయము భాషాసాహిత్యరంగములకే పరిమితమై యుండుననుట ఐతిహాసిక సత్యము. ఎవనెడ, పాలకులైనవారు పాలితుల విషయమై దయతో ఉదారముగ నుండుటయు-పరిపాలనారంగమున-కనంబడు చున్నది. ఇంతకంటె మనదేశమును పాలించిలాభములు పొందనెంచి వచ్చినవారు-విప్లవాత్మకముగ వ్యవహరింతురని ఊహించుటకును వీలులేదు. ఈ మాత్రమైనను చేసినవారుగాని చేయనెంచినవారు గాని లేకపోవుటచే - పాలకులుగా వచ్చిన విదేశీయులకు వారికి చేయవలసిన అవశ్యకము కూడ లేదు గనుక బ్రౌనుదొర మొదలైనవారి కృషికి విలువకట్టలేనంత విలువ వచ్చినది. రాజకీయముగగాని, ఆర్థికముగగాని విప్లవాత్మక

కార్యాచరణమునకు కంపెనీ ఉద్యోగులు పూనుకొనుట నాడు జరిగెడి పని కాదు. బ్రౌనుదొర వంటివారి కృషిని మనము శ్లాఘించుచున్నప్పుడు ఇవన్నియు మనస్సునందు లేవని కాదు సాయము చేయవలసినవాడు చేసిన సాయమునకున్న విలువకంటె, సాయము చేయనక్కరలేని వారు చేసిన సాయమునకున విలువ ఎక్కువ అను విషయము సర్వులకు తెలిసినదేగదా!

తాను తలపెట్టిన కార్యమునకు పండితుల, తాళపత్ర గ్రంథములున్న వ్యక్తుల గ్రంథాలయముల సాయము అనివార్యమని ప్రథమముననే గుర్తించిన బ్రౌనుదొర (ఈ గ్రంథములో పుటలు 143, 144) ఆ పండితులకు స్నేహితుడు, పోషకుడు అయినాడు ఆనాడు, ఆ పండితుల నాదరించెడి వారు కరువగుటతో ఆ పండితులకు బ్రౌనుదొర "దేవుడు" అయినాడు. ఒక విధముగా "పరస్పరంభావయంతః" అన్నట్లయినది. పండితుల తరువాత, ఉద్యోగులైన తెలుగువారు, తెలుగు వ్రాయను చదువను వచ్చిన వ్రాయసగాండ్రు, తాళపత్ర గ్రంథములను సంపాదించుటకు సాయపడు సామాన్యులు. తాను చేయుచున్న పనులతో సానుభూతియున్న తెలుగువారు ముద్రాపకులు మొదలైన వారందరు ఆయనకు సన్నిహితులైరి ఆయన తలపెట్టిన తెలుగు భాషాసాహిత్యముల కృషికి ప్రత్యక్షముగగాని పరోక్షముగగాని సాయపడని వ్యక్తులతో ఆయనకు ఉద్యోగ సంబంధమైన పరిచయము మాత్రమే ఉండెడిది.

కాని, తన కృషికి సాయపడుచున్న వారియందు ఆయనకున్న పక్షపాతము అపారము. జీతముల రూపమున, గ్రంథసేకరణాదికమున, ముద్రణమున తన సంపాదన నంతటిని వినియోగించిన బ్రౌనుదొర తనకున్న పలుకుబడిని ఉపయోగించి వారికి సాయము చేయుచునే యుండెను. తాను అప్పులలో పడిపోయి అయినను తన పోష్యవర్గమును ఆదుకొనుచునే యుండెను. వారి యందు తనకొక గురుతర బాధ్యత ఉన్నదని ఆయన భావించుటలోనే బ్రౌనుదొర ప్రత్యేకత ఉన్నది.

పండిత పక్షపాతియైన బ్రౌనుదొర వారి పాండిత్యమును వినయ విధేయతలను అనేక స్థలములలో పేర్కొనెను, వారి దుస్థితికి విచారించెను. మనము మన సేవలకు ("**Menials**") ఇచ్చునంతటి తక్కువ జీతమునకు కూడ పండితులు లభింతురని (ఈ గ్రంథములో పుట - 135. అధస్సూచిక) ఆయన చెప్పినప్పుడు వారియందాయ

నకు గౌరవములేదని కాదు ఈ మాటలు ఆనాటి పండితుల ఆర్థిక స్థితిని తలయి జేయుటకై ఆయన వ్రాసినవి. విచారముతో వ్రాసినవి. కాని ఆనాడు ఆ మాత్రమైనను వారియందు సానుభూతి చూపువారు లేకుండుటచే వారను "ఆయన పండితులు" అనుటకు ఆనందముతో అంగీకరించిరి శక్తివంచన లేక సేవచేసిరి. ఈ సేవలో వారికి ఆనందమును కలదు. తమ భాషాసాహిత్యముల పునరుజ్జీవనమునకు తాము సాయపడుచుంటిమి అని వారు సంతోషించిరి.

ఆంధ్రభాషా సాహిత్యసముద్ధరణ పండితుడైన బ్రౌనుదొరకు సాయ పడిన తెలుగు ప్రజలలో — పండితులుండిరి, పామరులుండిరి; జమీందారు లుండిరి, గ్రామకరణములుండిరి, కంపెనీ ఉద్యోగులుండిరి, సామాన్య సేవకు లుండిరి, సొంతముగా ఆయన దగ్గర జీతములు తీసికొని పనిచేయువారుండిరి, జీవనోపాధి ఉండి ఆయనకు సాయపడిన వారుండిరి, అన్ని తరగతులవారు నుండిరి. కోర్టు వ్యవహారములతో సంబంధమున్న పండితులు (పత్యం వారు మొదలైనవారు), ఉన్నతోద్యోగులైన పండిత మిత్రులు (ఏనుగుల వీరాస్వామయ్యగారు మొదలైనవారు), ప్రభుత్వ విద్యాలయ పండితులు (రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారి వంటివారు), విద్యావంతులై సొంతముగా ముద్రణాది వృత్తులను చేపట్టి బ్రౌనుదొర సాయమును పొందుచుండెడివారు. (వర్తమాన తరంగిణి ప్రొప్రైటరు పువ్వాడ వేంకటరావుగారి వంటి వారు) బ్రౌనుదొర దగ్గర జీతములు తీసికొని తెలుగు కావ్యాదులకు వ్యాఖ్యా నములు వ్రాసెడి మహావిద్వాంసులు (జూలూరి అప్పయ్య శాస్త్రులవంటి వారు), తరు వాతి కాలమున వైయాకరణ సార్వభౌమునిగ కీర్తిపొంది నాటినుండి నేటివరకు గ్రాంధికాంధ్రమును శాసించుచున్న పరవస్తు చిన్నయసూరి గారి వంటి విద్వాంసులు. విద్వచ్ఛిఖామణులైనను హాస్యప్రియులైన తిరుపతి తాతాచార్యులు గారి వంటి వారు, గ్రంథసేకరణమున సాయపడిన గుండవరం కృష్ణయ్యగారువంటి వారు, అంకాలుగారి వంటి వ్రాయసగాండ్రు; బ్రౌనుదొర పండితులను, పనివారిని, సంబంధమున్న ఇతరు లను, ఆయన ఆస్తిపాస్తులను, అప్పుసప్పులను - అందరిని, అన్నింటిని ఉచితరీతిని పర్యవేక్షించుచు, దొరకు తలలోపలి నాలుకవలె వ్యవహరించిన కార్యనిర్వాహణ దక్షు డైన అయోధ్యాపురం కృష్ణారెడ్డిగారు వంటివారు - ఎందరో బ్రౌనుదొరకు సమీప వర్తులై యుండిరి, వీరందరు లేకపోయినచో ఆయన పనిచేయలేకపోయెడివాడు.

ఎప్పుడును ఉన్న వీరందరును బ్రౌనుదొర నాయకత్వము లేకున్న నిర్వ్యాపారులు నిష్క్రియులు అయిపోయెడివారు. ఆయనకు సాయముచేసిన వారిలో చాల మందిని గురించి మనకెక్కువ తెలియదు. చాలమంది పేరులు ఆయనతో వారికున్న సంబంధ మును బట్టియే నేటికిని నిలిచియున్నవి. వీరిలో ప్రముఖులైనవారిలో కొందరిని గురించి కొంత తెలిసికొనుటకు ప్రయత్నింతము.

బ్రౌనుదొరకు తెలుగు అక్షరములు నేర్పిన (1817) ఘనత వెలగపూడి కోదండరామయ్య పంతులుగారిది. ఈతనిని గురించి మనకు విశేషముగా తెలియక పోయినను, అక్షరాభ్యాసము చేసిన గురువు గనుక మొదట ఈ పంతులును స్మరించుట ఉచితముగదా ! కోదండరామయ్యగారి చేతి చలువవల్ల వేదండము నెక్కినంత కీర్తి బ్రౌనుదొరకు లభించినది. ఆ ప్రారంభదినములలో గురుశిష్యు లిరువురును దీని నూహించియుండరని మనమూహించుటలో తప్పులేదు. ఈతనికి కాలాంతరమున పోలీసుశాఖలో బ్రౌనుదొర ఉద్యోగమిప్పించి తన గురు ఋణమును తీర్చుకొనెనన వచ్చును ఈ విషయము బ్రౌనుదొర చెప్పుటచేతనే (ఈ గ్రంథములో పుట – 54) మనకీతని పేరు, వారి సంబంధము ఈనాడు మనకు తెలిసినది.

ఈ పంతులుగారి తరువాత, బ్రౌనుదొరకు శిక్షాగురువులు – తిప్పాభట్ల వెంకట శివశాస్త్రి, వఠ్యం అద్వైత బ్రహ్మయ్యశాస్త్రి గారలు. వీరి దగ్గర తాను–భాష, వ్యాకర ణము, ఛందస్సు అధ్యయనముచేసినట్లు బ్రౌనుదొర "వేమన పద్యములు" అను తన పుస్తకమునకు వ్రాసిన పీఠికలో తెలిపెను. (ఈ గ్రంథములో పుట–232) ఈ పండితులిరువురును మచిలీపట్టణమునకు చెందినవారే. నిఘంటు నిర్మాత అయిన బ్రౌను దొర శబ్దార్థముల నిర్ణయ విషయమున సంశయములు కలిగినప్పుడు తన పండితు లను సంప్రసించెడివాడు, వారికి లేఖలు వ్రాసి సమాధానములు పొందెడివాడు. అంత మాత్రమున ప్రతి సమాధానమును వారిచ్చిన అర్థ విశేషములను అంగీకరించినాడని కాదు, చాలసార్లు తన పండితులిచ్చిన అర్థములను తిరస్కరించి తానాలోచించి అర్థ ముల నిచ్చుట కలదు. పండితులు ఆయా పదములకు చెప్పిన అర్థములు కుదురునా లేదా అని ఆలోచించెడివాడు.

ఆయన నిఘంటువులు ఆయన పాండిత్యమువలెనే దినదినాభివృద్ధి పొందినవే గాని ఆకస్మికముగా అవతరించినవి కావు. ఆయన తెలుగు చదువు ప్రారంభించిన

నాటి నుండి కష్టమైన మాటలకు పండితులిచ్చుచు వచ్చిన అర్థములను వ్రాసికొనుచు పోయి తన ఉపయోగమునకు ఒక నిఘంటువు లిఖిత ప్రతిని సిద్ధముచేసికొనెను దీనికి పునాదిగా కాంబెల్ నిఘంటువును చేసికొనినట్లు ఆయనయే ఇట్లు తెలిపెను.

**"While studying Vemana I procured an interleaved, Copy of Campbell's Telugu English Dictionary : in which I daily noted down such words or meanings as came to light. In eight years I swelled this dictionary to fourfold its original extent: and afterwards kept no account but added many thousand expressions; most of which were based on quotations made from Telugu poems ....."**

అనగా బ్రౌనుదొర 1824 నుండి (వేమన పద్యములు చదువుట ప్రారంభించి నాడని స్థూలముగా చెప్పవచ్చును. ఇంకను సూక్ష్మముగపోయి పరిశీలించినచో; ఆయన 1822 లో మచిలీపట్టణమునకు బదిలీ అయినప్పటినుండి మాటలను, పద బంధములను వేరుగా వ్రాసి ఉంచుకొనెడి వాడని తెలియుచున్నది :

**"In the end of 1822 I was appointed to be Assistant Judge at Masulipatanm where Telugu is the language of the people. But still I did not study Telugu beyond keeping a running memorandum of such words or phrases as occured in business".**

తెలుగు భాషాధ్యయనము ఒక మూల చేయుచునే పండితులు చెప్పెడి అర్థములు వ్రాసికొనుచునే మానసికముగా నిఘంటువు నిర్మాణ కార్యక్రమమునకు సిద్ధమగుచునే యుండెను. ఇందులకు మొదట ఇంగ్లీషు - తెలుగు నిఘంటు నిర్మాణము ఉచితమని తలంచెను. తెలుగు నేర్చుకొనుచున్న ఇంగ్లీషువాడు మొట్టమొదట ఇట్లాలోచించుటలో ఆశ్చర్యము లేదుగదా ! కాని ఆ మార్గములో అంతకు పూర్వమే జె. సి మారిస్ కృషిచేయు చున్నట్లు తెలిసికొని ఆ పనిని మానివేసి తెలుగు - ఇంగ్లీషు నిఘంటు కార్యక్రమమును చేపట్టెను. ఈ మార్పును గురించి బ్రౌనుదొరయే ఇట్లు వ్రాసెను:

**"I originally attempted writing an English Telugu Dictionary in 1823. That plan was soon laid aside because I found that Morris had undertaken the work. I therefore undertook the Telugu English Dictionary in March.1824. This went on**

**steadily untill the end of 1830 - but I continually added fresh words and meanings for ten years after".**

ఇంగ్లీషు - తెలుగు నిఘంటువును ప్రారంభింపవలెననుకొన్న ఆ తొలినాళ్ళలో బుద్ధిమంతుడైన ఒక పండితుని మాటప్రకారము. అప్పటికి అచ్చయి (1821) ఉన్న కాంబెల్ తెలుగు - ఇంగ్లీషు నిఘంటువును వ్యత్యస్తము చేసి వ్రాయ సంకల్పించి నట్లును, ఆ కార్యము కొనసాగనట్లును ఆయనయే వ్రాసెను:

**"Mr. Campbell's Dictionary was printed — and in 1821 a clever Telugu Bramin offered to assist me in reversing it – we found this task more than we prepared for; neither of us having sufficient, command of both languages."**

ఈ కృషులన్నింటిలోను పండితుల సాయమున్నను వారి పాండిత్యమును గ్రుడ్డిగా నమ్మి "వారు చెప్పినంతయు "ఒప్పు"గా గ్రహింపక తన విజ్ఞానమును, విమర్శదృష్టిని కూడ వినియోగించి తన మార్గము నేర్పర్చుకొనెనని చెప్పుటకే నిఘంటు విషయమింత వ్రాయవలసి వచ్చెను. కావ్యముల సముద్ధరణ విషయము నందాయన అవలంబించిన స్వాతంత్ర్యమును గ్రహించియే యుంటిమి. నిఘంటువునకు కావలసిన శబ్దార్థముల విషయమునను ఈ వైఖరియే అవలంబించెను. [28] ఉదాహరణగా "మేటి కోలు" శబ్దమును గ్రహింపవచ్చును. దీని అర్థమును తెలుపవలసినదని తనకు గురుస్థానీయులైన తిప్పాభట్ల వెంకట శివశాస్త్రి. వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి గారలకు 1824 లో వ్రాయగా వారిలో ఒకరు; తిప్పాభట్లవారు: "సముదాయము మీద సమముగా చూచుకొనుట, పరస్పరము కనిపెట్టుట, యీ రెండు అర్థములు మేటి కోలు అను మాటకు చెల్లుతవి. మేటికోలు అనేమాట ఆభాసాంధ్రము యెట్లాగైనదంటే మేటి యనగా తెనుగుమాట, కోలు అనగా తురకమాట. యీ రెండు మాటలనున్నూ వ్యవహారమందు కలిపివాడినారు గనక "ఆభాసాంధ్రమైనది" అని వ్రాసినాడు.

రెండవవారైన వఠ్యంవారు సుదీర్ఘమైన జాబు వ్రాసి. "మేటికోలు అనే మాట తెలుగుభాషలో దేశ్యమయిన తెలుగుమాట. మేటీ అనే శబ్దంబునకు గొప్ప యధికారి అని అర్థము. మేటికోలనే శబ్దంబునకు గ్రామస్థులయ్యిరహియితులు అందరు

---

28. బ్రౌన్ లేఖలు-పరిశోధన: బంగోరె; పర్యవేక్షణ: జి ఎన్ రెడ్డి; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి-1977; పుటలు - 97, 98.

జరిగించెడి కార్యములలో ఒకరిని ఒక అధికారివలె కనుపెట్టుట... ..." అని ఏవేవో వ్రాసినాడు.

ఈ అర్థములు బ్రౌనుదొరకు నచ్చక (ఇంకను చాలమందిని అడిగి యుండ వచ్చును।) క్రిందివిధముగా "నోటుచేసికొన్నాడు:"...... మేటికోరు is infact మేడియొక్క పాలు, the share given to ploughman......"

తన నిఘంటువులో ఈ "మేటి కొరు" ను గురించి అర్థవివరణ ఇట్లు చేసెను:

"మేటి (infl. of మేడి) Of the plough - stilt. మేటి పాలు or మేటి కొరు the farmers share, Some derive this from మేటి a lord, thus మేటికోరు is the same as స్వామిభాగము (not భోగము?) some spell it మేడి but others say the two are different. మేడిపాలు is a phrase even used by salt makers."

"మేడి plu. మేడ్లు n. s. A plough staff or plough tail. మేడి తలకిందుగా పాతుట పాతి పెట్టుట To bury a plough staff upside down, as a signal (of దురాయి) to warn people that the land is under ban. మేడికర్ర n. s. The pole or shaft of a plough, మేడికోరు, మేడిపాలు the farmer's share of the crop. మేడితాడు The plough bands. మేడితోక The plough tail. మేడిసీల The nail or pin which fastens the plough to the handle. మేడిసోగ The plough tail."

(Telugu - English Dictionary: Page-837 )

"మేడి n. s. (add.) మేడిపాలికియిచ్చెను he gave me his field on plough stilt tenure: this means that the land lord and the tenant each took half or else that the landlord gets two thirds." (Appendix to the Telugu - English Dictionary, Page - 1309)

పై వాటిలో, వర్యంవారు చెప్పిన అధికారి అను అర్థమును కొంత ("Some derive this from a lord..... ") గ్రహించినట్లున్నను వివరణ అంతయు తనకుతోచినట్లు తెలిసిన విధముగా బ్రౌనుదొర చేసినాడనవచ్చును గదా!

ఇదే విధముగా, రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారిని 1827 లో "అలవోక-దావాలు" అను శబ్దముల అర్థవివరణను కోరెను. (ఈ గ్రంథములో పుట - 347) అలవోక శబ్దమునకు "ఆయన - స్వేచ్ఛ. అనిచ్ఛ అప్రయత్నము, ఆశ్రమము, కారణము" అని నానార్థములు ఇచ్చెను. ఈ శబ్దములు "కొంతవరకు" అర్థవివరణ చేయుచున్నను బ్రౌనుదొర కవి నచ్చక తన నిఘంటువులో "అలవోక" శబ్దమునకు అర్థవివరణ ఇట్లు చేసెను:

"అలవోక", అలవోకగా or అలవోకవలె adv. Sportively, amusingly playfully, easily, carelessly. వేడుకగా, విలాసముగా, ఆట్లాటగా, అవలీలగా అలక్ష్యముగా, అసడ్డగా, O G says ప్రౌఢపోక. Vish , 6.19. అలవోకగా వచ్చి యప్పటప్పటికి సమేలంపు మాటల మేలమాడు N . 9. 149. అలవోక రెప్పవేయక జూచుచును దెల్పె. భామయోర్తు సురానుభావ పటిమ టీ, విలాసముగా Naish. 3.97. అలవోకయనువోలె నాకస్మికంబైన యంగాంగ సంస్పర్శమబ్బుకతన. B.X. Part . 2 1257. ఉల్లసచ్ఛరమరిబోసి కార్ముక విశారదుడై యలవోకబోలె కరచర మగు మీనమున్ దునిమె అలవోక బోలె ఆట్లాటగా, Sanscrit chapter 83. భగవాన్ ధనురాదాయ సజ్జం కృత్వాధలీలయా తస్మిన్ సంధాయ విశిఖం మత్స్యం వీక్ష్య సకృజ్జలే B X. Uttara chapter 63 verse 18. కురుచ తిన్నని వాడికొమ్ముల జిమ్మిన బ్రహ్మాండ భాండ కర్పరము బగుల, నలవోకవలె ఖణిల్లున రంకె వైచిన రోదసీ కుహరంబు భేదిలంగ. N. 7.87 వలసి వల్లములుగా వా తె ర యా ను ట, నలవోకగా గుబ్బలంటుటయును టీ॥ తాత్సారముగా. T· 2. 107. బలుకోకపులవీకనలవోక గెల్చునీకల్కి చన్గవ బట్టుకరము కరము. Vish. 7.185. అనవుడు కొంతసేపు జలజాయతలోచను దూరనుండి గ్రక్కున నలవోకగా బ్రణయ కోపముగైకొని. Vicra Marka. 3.41 కై చేసి చెలువ నాకడునల్లె నిలిచిన నంగజ శ్రీ చూరలాడ జూతు, నలవోకయువిద నన్నరకంట చూచిన నీరేడు జగముల నేలచూతు అలవోక, ఉపేక్షగా,"(పుట-72)

ఇది చూచిన వారికి బ్రౌనుదొర పరిశ్రమ, పాండిత్యము కొంత అర్థమగును. సంస్కృత శ్లోకమును కూడ నిచ్చి తెలుగు పద్యములోని "అలవోక" శబ్దమునకు సమానముగా సంస్కృత శ్లోకములో "లీలయా" కలదని చూపి అర్థమును చెప్పకయే బ్రౌనుదొర చెప్పెను. ఈ వివరణలో ఎక్కడను రావిపాటి వారిచ్చిన మాటలే రాలేదు.

ఇంక "డాబాలు" అను మాటను వివరించుచు రావిపాటి వారు "డాబాలు అనేది డాబా అనే దానికి బహువచనాంతము. డాబా అనగా వెండితో గాని బంగారుతో గాని చేసిన మొలత్రాడు యొక్క బిళ్ళ ......" మొదలుగా వ్రాసి "...... డాబా మొలత్రాడు అని చెప్పబడుచున్నది." అని తెలిపినారు.

బ్రౌనుదొర నిఘంటువులో "డాబా" అను మాటకు : "డాబా **n. s. The, Cornice of a pillar, the projecting gallery round the top of a tower: the crest of a bastion=** మిద్దె ఉన్నతముగా కట్ట బడ్డ గృహ విశేషము" (పుట-403) అని కలదు.

ఈ మాటకు రావిపాటి వారిచ్చిన అర్థమును తన "మూల" నిఘంటువు నందు గాని దాని అనుబంధము (**"Every dictionary when first printed is liable to errors and oversights. I have therfore given in the Supple-ment such emendations or improvements as occurred" – Telugu Engilsh Dictionary, Preface.)** నందు గా వాడుకొన లేదు కాని, తన మిశ్రభాషా నిఘంటువు"లో "డాబు" అను మాటకు అర్థవివరణ చేయునప్పుడు ఇట్లు తెలిపెను:

"డాబు **n. s. A list or, catalogue, A physiciain's recipe : a female's Zone,** పట్టీ, డాబా మొలతాడు, **a broad belt"(Page – 41)**

శబ్దములకు తన పండితులిచ్చిన అర్థములను విచక్షణా రహితముగ గ్రహింప నట్లే, గ్రహించిన సందర్భము లందుకూడ వాటి నెక్కడ వాడు కొనవలెనో అక్కడనే వాడుకొని తన స్వేచ్ఛను, అవగాహనను కాపాడు కొనెను.

తిప్పాభొట్లు వెంకట శివశాస్త్రి గారు బ్రౌనుదొరకు ఛందస్సు వ్యాకరణము మొదలైనవి చెప్పుటయేగాక - వేమన పద్యములకు (ఈ గ్రంథములో పుట - 282) వివరణ వ్రాయుటలోను, కవిజనాశ్రయమును (ఈ గ్రంథములో పుట - 257) తీర్చి దిద్దుటలోను కూడ సాయపడినట్లు తెలియు చున్నది. బందరు వాస్తవ్యుడైన ఈతడు బ్రౌనుదొరకు 1822 నుండి (బ్రౌనుదొర మచిలీ పట్టణములోని జిల్లా కోర్టులో అసిస్టెంటు జడ్జి (రిజిస్ట్రారు)గా చేరిన సంవత్సర మిది) తెలియునని మనము గ్రహింప వచ్చును.

"మేటి (డి) కోరు (అు)" శబ్దార్థములకు సంబంధించి ఈ పండితుడు 1824 లో బ్రౌనుదొరకు వ్రాసిన జాబునుబట్టి 1824 నాటికి వీరిరువురకు పరిచయ మున్నదని రుజువగుచునే యున్నదిగదా!

వఠ్యం అద్వైత బ్రహ్మ (య్య) శాస్త్రిగారు బ్రౌనుదొరకు అత్యంత సన్నిహితుడు. మచిలీ బందరు కోర్టులో ఈయన కూడ బ్రౌనుదొర అక్కడ ఉన్నప్పుడే పనిలో నుండెను, ఈ విషయమును బ్రౌనుదొరయే "...... Advyta Brahmia, the Pandit belonging to the Court in which I have the honour of being assistant judge" అని వ్రాసెను. ఈతడు గుంటూరు జిల్లాలో ఆనాడు రేపల్లె తాలూకాలో చేరియున్న కారుమూరు గ్రామవాస్తవ్యుడని తెలియు చున్నది, మంచి పండితుడు అయిన ఈతడు మచిలీ పట్టణములో "సదరు కోర్టు పండితుని" గా ప్రారంభించి కాలక్రమమున మద్రాసులోని "అదాలతు కోర్టు పండితుని" గా అభివృద్ధి పొందెను. (ఈ గ్రంథములో పుట - 145)

బ్రౌనుదొరకు - గురువుగా; ఆప్త మిత్రునిగా; లిఖిత ప్రతులను సేకరించుటలో, వివిధ భారతీయ లిపులలో నున్న సంస్కృత గ్రంథములను తెలుగు లిపిలో వ్రాయించి (ఈ గ్రంథములో పుటలు - 138, 139) దొరకు అందజేయుటలో సహాయకునిగ; బ్రౌనుదొర ముద్రించు చుండెడి గ్రంథముల ముద్రణ పర్యవేక్షకునిగా (ఈ గ్రంథములో పుటలు - 153, 154, 155); గ్రంథముల (శశాంక విజయ దశావతార చరిత్రల) పరిష్కర్తగ; ఇంకను ఎన్నియో విధములుగ (ఆనంద తంత్ర పరిష్కర్తగ ఈ గ్రంథములో పుట - 173) బ్రహ్మయ్యశాస్త్రి గారు వ్యవహరించెను. ఈతనిని బ్రౌనుదొర "......my very learned friend Bramhiya ......" అని పలుమార్లు పేర్కొనెను "చదివితే (వింటే) భారతమే చదవాలి (వినాలి)" అని ఈతడు పదే పదే బ్రౌనుదొరకు చెప్పుచు వచ్చినట్లు, దొర వ్రాసిన" ..... Bramhia begs me to read the Bharatam first ...," అను దాని వలన తెలియుచున్నది. ఈ వఠ్యంవారి కుటుంబములో నున్న ఇతర శాస్త్రులు అందరితో

కూడ-29 కృష్ణశాస్త్రి, 30 రామలింగ శాస్త్రి, 31 సీతారామ శాస్త్రి - బ్రౌనుదొరకు సంబంధముండెనని తెలియు చున్నది. వారికి బ్రౌనుదొరకు, వారుచాల సాయపడిరని చెప్పవచ్చును. వఠ్యం అద్వైత బ్రహ్మయ్య శాస్త్రిలు "శకటరేఫ సాధురేఫల నిర్ణయము"ను చేయుటకు పనికివచ్చు రచన నొకదానిని బ్రౌనుదొర ప్రేరణమున - మన విద్వాంసులకు కూడ సంశయము కలిగించు భాగమిది అయినప్పుడు విదేశీయుల విషయమై వేరుగా చెప్పనక్కరలేదు గదా! - చేసి నట్లున్నది. కొందరు దీనిని బ్రౌనుదొర రచనయనుకొనిరి. కాని దీని ప్రస్తావన, 1827 లో అచ్చయిన "ఆంధ్ర గీర్వాణచ్ఛందము" లో బ్రౌను దొర చేయుటవలన (పుట - 76), ఈ రచన అప్పటికే జరిగినదని చెప్ప వచ్చును. బ్రౌనుదొరవలె తెలుగు నేర్చుకొను వారికిని, తనకును (సంశయము కలిగి నప్పుడు) పనికివచ్చునను నుద్దేశముతో దీనిని వఠ్యంవారు చేసియుండి రనవచ్చును. (ఈ గ్రంథములో పుట - 289) బ్రహ్మయ్య శాస్త్రిగారి

---

29 "ఆజ్ఞా ధారకుడైన గుండవరపు కృష్ణయ్య సలాములుచేసి వ్రాసుకొన్న అర్జీ విన్నపం ...... 1826 సంవత్సరములో నేనువఠ్యం కృష్ణశాస్త్రిం వద్దవుండి, తమయొక్క గ్రంథములు వ్రాస్తూవుండ వలసినదని తాము కడపనుంచి నా పేర మా గ్రామానకు ఆజ్ఞ వ్రాయించినారు ......" (20-11-1834) (తెలుగు రీడరు, పుట183)

30 "...... కూరపాటి తాజా అమీనుపని చిరంజీవి రామలింగ శాస్త్రులకు దయచేయించి కుటుంబ పోషణ చెయ్యవలెనని మిక్కిలి వినయ పూర్వకముగా తమయొక్క ఘనాన్ని ప్రార్థిస్తున్నాను. బ్రహ్మయ్య శాస్త్రిగారి జాబు: (తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము;కొత్తపల్లి వీరభద్రరావు ద్వితీయ ముద్రణ 1986 ; పుట - 384)

**31 ...... " Sita Rama Sastri his younger brother at 18 is a superior genius and poet – superior to his 2nd brother Ramalinga sastri - with whom however he advised me to begin." (C. P. Brown.)**

ప్రస్తావన వచ్చినప్పుడు "learned" అను విశేషణమును వేయకుండ నుండడు బ్రౌనుదొర. దొరకు ఈ పండితునియందంత గౌరవము: వసు చరిత్ర ముద్రణమును వఠ్యంవారి పర్యవేక్షణమున మదరాసులో కొనసాగించుచున్న బ్రౌనుదొర, ఆయన తన స్వాంతమునకు అనారోగ్య కారణమున పోయి ఎంత కును, తిరిగి రాక పోవుటవలన దిగులుపడి 1840, జనవరి 31వ తేదీన వ్రాయించిన జాబు, పండితునియందు దొరకున్న గౌరవాభిమానములను తెలుపునదై యున్నది. (ఈ గ్రంథములోపుటలు - 154, 155, ఎఠ్యం అద్వైత బ్రహ్మ (య్య) శాస్త్రి గారు 1840లో కీర్తిశేషులై యుండుదురు

ఆనాడు ఈ కుటుంబములోని విద్యావంతులకు కంపెనీ ఉద్యోగుల ఆశ్రయము పుష్కలముగా లభించినదనుటకు, బ్రహ్మయ్యశాస్త్రిగారి తరువాత ప్రభుత్వము వారి ఆదరమును పొందిన వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రిగారు వ్రాసిన "జూన్ ఫ్రైయ థామ స్మ్యాపాలీయము" అను "వ్యవహార దర్పణము" తార్కాణము. ఈతడు బ్రౌను దొరమీద చాల శ్లోకములు పద్యములు వ్రాసెను. సంస్కృతములోనున్న వివిధ ధర్మశాస్త్ర గ్రంథముల సారమిది. కంపెనీ ఉద్యోగి అయిన **The Hon' ble John Fryer Thomas** గారికిది అంకితమై 1851 లో ముద్రితమై వారి పేర వెలసినది.

(తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము; కొత్తపల్లి వీరభద్రరావు ద్వితీయముద్రణ, 1985 పుటలు - 236, 237, 238,)

ఈ పండిత కుటుంబమున ఆనాడు చాలమంది విద్వాంసులుదయించిరి. వఠ్యం అద్వైత(బ్రహ్మయ్య) శాస్త్రి గారికి బ్రౌనుదొర మొదలైన పాశ్చాత్యులతో (ఇంగ్లీషు వారితో) కలిగిన సంపర్క ప్రభావము, వారి తరువాతి తరముపై ఇంగ్లీషు భాషా సాహిత్యముల ప్రభావముగా పరిణమించి వారి దౌహిత్రులైన వావిలాల వాసుదేవశాస్త్రి గారు (1851-1897) బి. ఏ. పట్టమును పొందుటయు, ఇంగ్లీషులో చూపిన ప్రతిభకు అతనికి "మాక్డొనాల్డు" బంగారు పతకము లభించుటయు, అపుడు ఇంగ్లీషు;

నాటకమును తెలుగులోని కనువదించిన ప్రప్రథముడగుటయు (జూలియస్ సీజర్ - 1875) జరిగినదన వచ్చును. 1875 నాటికింకను బ్రౌనుదొర (లండనులోనున్నను) జీవించియే యుండెను. తన గురువైన వఠ్యంవారి దౌహిత్రుడు షేక్స్పియరు వ్రాసిన "జూలియస్ సీజర్" నాటకమును తెలుగులోనికనువదించి ముద్రించినాడని వినియున్నచో ఆ దొర ఎంతయో సంతోషించియుండును (వినియుండుటకు గ్రంథమును చూచియుండుటకు కూడ అవకాశమున్నది,) వావిలాలవారు వఠ్యంవారి తృతీయ పుత్రికయైన మహాలక్ష్మమ్మగారి కుమారుడు,

బ్రౌనుదొర గౌరవమర్యాదలను పొందిన ఇంకొక పండితుడు రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు (1770-1836) వఠ్యం వారివలె ఈతడు కోర్టు పండితుడుకాడు. సంపాదించిన పాండిత్యముతో లభించిన అధ్యాపక వృత్తిని జీవితాంతము నిర్వహించుకొనిన కాలేజి పండితుడు. కంపెనీ ప్రభుత్వము స్థాపించిన ఫోర్టుసెయింటు జార్జి కళాశాలలో తెలుగు పండితునిగ 1816 లో చేరి, 1820లో తెలుగు ప్రధానోపాధ్యాయుడై 1835 లో దివంగతుడగువరకు పనిచేసెను. గురుమూర్తిగా కళాశాలలో చేరిన ఈతడు గురుమూర్తిశాస్త్రియై అందరి మన్ననలను పొందెను. (ఈ గ్రంథములో పుటలు- 135, 284, 346)

పాశ్చాత్యులు ప్రవేశబెట్టిన విద్యావిధానము ననుసరించి వచనరచనలుచేసి వ్యాకరణము రచించి తరువాతి తరమువారికి మార్గదర్శకుడయ్యెను. ఈతడు రచించి ముద్రించిన (1819) విక్రమార్కుని కథలు "ద్వాత్రింశత్సాల భంజిక" ననుసరించి వచనరూపమున వ్రాసినవి. అప్పటికి అతడు "చెన్న పట్టణ పాఠశాలలో దెలుగు భాషకు రెండవ యుపాధ్యాయుడు." ఇది 1828, 1850, 1858 సంవత్సరములలో కూడ ముద్రణపొందెను. దీని ప్రతులు 450, ఆనాటి యుద్యోగుల నిమిత్తము ఇంగ్లండునకు పంపినారట: దీని తరువాత వీరు 1834 లో రచించి ప్రకటించిన "సంస్కృతమున విష్ణుశర్మకృత పంచతంత్రమునకు వచనానువాదము." ఈ పుస్తకములు రెండును. "కాలేజి ప్రెస్సు"లో అచ్చయినవి. తెలుగు పంచతంత్రము-1834, 1842, 1848, 1864, 1869 సంవత్సరములలో అయిదుసార్లు అచ్చయ్యెను. తరువాత గ్రాంథిక భాషకు పట్టుకొమ్మగా పేరుపొందిన పరవస్తు చిన్నయసూరిగారు తాను పండితపదవి నలంకరించిన ప్రారంభదశలో ఈ వ్యావహారిక భాషలో నున్న కథల

పుస్తకములను పాఠములు చెప్పెనట; ఇందువల్లనే కాబోలు; తరువాత గ్రాంథిక భాషలో నీతి చంద్రిక వ్రాసి ముద్రించినది (1853) సూరిగారికి వ్యావహారిక భాష నచ్చి ఉండదని వేరుగా చెప్పనక్కరలేదు.

రావిపాటివారి కాకాలమందు పేరు తెచ్చినది అతడు వ్రాసిన తెనుఁగు వ్యాకరణము. ఇది "మహారాజశ్రీ యే. డి కేమిల్ దొరగారి పేర" అంకితమై 1836 "చర్చిమిస్సయాన్ ప్రెస్సులో అచ్చువేయించఁ బడ్డది." దీనిలోని వ్రాతను బట్టి ఆనాడు "కాంబెల్" పేరును "కేమిల్" గా ఉచ్చరించుచుండినట్లు తెలియు చున్నది. కంపెనీ శబ్దమును "కుంఫిణీ" అనుటమనకు తెలిసినదే! ఇది పరవస్తు వారి వ్యాకరణముకంటె ముందు వచ్చిన "ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము", "లఘు వ్యాకరణము" ల కోవకు చెందినది. వ్యావహారిక రూపములకు గతి కల్పించుట ఈ వ్యాకరణములోని విశేషము దీనిలో అక్షర లక్షణ ప్రకరణము, సంధిప్రకరణము, విశేష్యప్రకరణము, విశేషణప్రకరణము, సమాస ప్రకరణము, క్రియా ప్రకరణము అను ఆరు ప్రకరణములు కలవు. గ్రామ్య రూపములను పేరనాడు వాడుకలోనుండిన దీవించు తున్నాను, దీవించుతాను, దీవింతాము, దీవించడము మొదలైన రూపముల నిచ్చుటయేగాక; దీవిస్తున్నాను, దీవిస్తాను మొదలైన రూపములకును. "ఈ తరగతి లో గ్రామ్యభాషయందు - చు - చి అనువర్ణములకు తకారము పరమైనప్పుడు - న్ - అనునది వికల్పముగా వచ్చును - ఈ విషయమునందు చు - చి అనువర్ణములకు పూర్వమునందు అనుస్వారమున్నట్లయితే - అది లోపించును" అని వ్రాసి రావిపాటి వారు గతి కల్పించిరి. వాడుకలోనున్న వివిధ రూపములను (దీవించు తున్నాను, దీవిస్తున్నాను మొదలైనవి) అతడు గుర్తించి అంగీకరించుట నిది తెలుపును.

ఇట్లు వ్యావహారిక భాషకు గల ప్రాముఖ్యమును గుర్తించి ఆ భాషలో వచన రచనలు, వ్యాకరణము వ్రాయుటయేగాక ముద్రణాదికము నందును గురుమూర్తి శాస్త్రి గారు ఆనాటికి ఆధునికమైన పద్ధతుల నంగీకరించిరి. మాటలు, వాక్యములు పాదములు విడివిడిగా వ్రాసినప్పుడు; అట్లే అచ్చువేసినప్పుడు అర్థజ్ఞాన మధికమగునను విషయమున రావిపాటి వారు తనతో ఏకీభవించిరని 1827 నాటికే బ్రౌనుదొర తన "ఆంధ్ర గీర్వాణ చ్ఛందము" నందు తెలిపెను. (ఈ గ్రంథములో పుట 284) ఇన్నివిధములుగా బ్రౌనుదొరకు గౌరవ పాత్రుడు, అభిమాన పాత్రుడు అగుటచేతనే.

గురుమూర్తిశాస్త్రి గారు చనిపోయిన మూడు సంవత్సరములకు వ్రాసిన తన **Essay on Telugu Literature** లో దొర, శాస్త్రిగారి ప్రస్తావన సందర్భమున"... **I mention his name because, his talents, learning and good sense always entitled his judgement and respect"** అని తెలిపెను వీరి మృతితో రావిపాటివారికి దొరలతో సంబంధము ముగియలేదు గురుమూర్తి శాస్త్రి గారి పుత్రుడు రావిపాటి గురుపయ్యగారు కొంతవరకు తండ్రిగారి పేరు నిలువబెట్టి నాడనవచ్చును! ఆ రోజులలో ఈతనిని "రావిపాటి గురుమూర్తి పుత్రుడు" అని ప్రస్తావించెడివారు అయినను ఈతడుకూడ మంచి పండితుడే. సంస్కృతాంధ్రములతో బాటు ఈతనికి ఇంగ్లీషుకూడ వచ్చునని తెలియుచున్నది తండ్రిరచించిన "విక్రమార్కుని కథలు" సరిజూచి నాలుగు భాగములుగ 1858 లో ఈతడు పునర్ముద్రించెను 82

ఆనాటి ప్రముఖులైన తెలుగువారిలో ఏనుగుల వీరాస్వామయ్యగారొకరు. ఉన్నత ప్రభుత్వోద్యోగి, ఆనాటి మద్రాసు సుప్రీంకోర్టులో హెడ్ ఇంటర్‌ప్రెటర్. బహుభాషా కోవిదుడు. తాను చేసిన (1830 - 1831) కాశీ యాత్రను వర్ణించుచు వ్రాసిన లేఖలను ఈతని మిత్రుడు కోమలేశ్వర పురం శ్రీనివాస పిళ్ళైగారు 1838 లో కాశీ యాత్ర చరిత్ర అను పేరు ముద్రించి ప్రచారమునకు తెచ్చెను. బ్రౌనుదొరకు మిత్రుడు ఈతని రచనయైన కాశీయాత్ర చరిత్రనుండి బ్రౌనుదొర తన నిఘంటువు లోనికి కొన్ని ఆకరములను వాటి అర్థములను గ్రహించెను (ఈ గ్రంథములో పుట-(346) బ్రౌనుదొరకు గ్రంథసేకరణమున - ముఖ్యముగా లంగరు పాపయ్య గారి గ్రంథముల సేకరణమున - సాయపడెను. (ఈ గ్రంథములో పుట - 147) 'బ్రౌనుదొరకు వీరాస్వామయ్య గారు ఇంగ్లీషులో లేఖలు వ్రాసెడివాడు. బ్రౌనుదొరన్యు చాలసార్లు కలిసి మాటలాడినారు కాశీయాత్ర తిరుగు ప్రయాణములో మచిలీ బందరులో వీరాస్వామయ్యగారు బ్రౌనుదొరనుకలిసి మాటాడినట్లు - వీరాస్వామయ గారు (1780-1836)వ్రాయకపోయినను బ్రౌనుదొర ఇట్లు వ్రాసెను

---

82 Ibidem పుట - 247.

**Masulipatam ; The author visited me here but dose not mention it'** పుస్తకములో మచిలీ బందరును గూర్చి వీరాస్వామయ్యగారు వ్రాసిన చోట బ్రౌనుదొర ఈ వాక్యము వ్రాసెను. ఏనుగులవారు మచిలీపట్టణములో 1831 లో ఆగస్టు 2 నుండి 16 వరకు ఉండిరి.

ఆనాడు ప్రసిద్ధి కెక్కిన ముద్రాక్షర శాలలలో వర్తమాన తరంగిణి ఒకటి. దీని అధిపతి పువ్వాడ వేంకటరావుగారు. ఈ పేరు తోడనే ఒక పత్రికకూడ ఈతని సంపాదకత్వమున వెలువడు చుండెడిది. 1842 నకు ముందు ఎట్టి పరిస్థితులున్నను ఈ సంవత్సరమునుండి 1877 వరకు పువ్వాడ వారే పత్రికకు సంపాదకులు, ముద్రాక్షర శాలకు యజమానులు అని చెప్పవచ్చును. బ్రౌనుదొర తెలుగు భాషా సాహిత్యముల అభివృద్ధికి కృషిచేయుచుండుటయే గాక, ఉన్నతోద్యోగి అయిన "దొర" కూడగనుక పువ్వాడవారు ఆయనతో సత్సంబంధములనే పెట్టుకొనెను జె, సి. మారిస్ తరువాత 1846 లో (జూన్ 30 వ తేది) బ్రౌనుదొర తెలుగు. ట్రాన్స్లేటరుగా నియుక్తుడైనాడు. లౌకికుడు, విద్యావంతుడు, మద్రాసు నివాసి అయిన పువ్వాడ వేంకటరావుగారు దీనిని గుర్తించి 1847 లో జనవరి 11 తేది) బ్రౌను దొరకు ఒక జాబు వ్రాసికొనినాడు దానిలో, "సమాచార పత్రికలు మహదభివృద్ధిగా జరగవలసి నందుకు హిందూ దేశాభి మానముగల తమవంటి గొప్ప వారందరున్ను సహాయ భూతులైతేనే గాని ఇట్టి కార్యము యోగ్యముగాను పురోభివృద్ధి గాను జరుగుట దుర్లభముగా నుండునని యంచవలసి యున్నది."

"కాబట్టి తమవంటి ప్రభువులతోటి మనవి చేసుకోవడమేమంటే తమరు మా పత్రికయంతభిమానముంచి చందాదారులుగా యుండడమునకు అనుజ్ఞ చేయించడమే గాక, తమవంటి గొప్పప్రభువులకు శిఫారసు చేయుదురని తమ ఘనాన్ని మిక్కిలి కొనియాడుచున్నాను."

"మఱియు తాజా విశేష విజ్ఞాపనము - తమ స్వంత ఆఫీసు తాలూకు తెలుగు పుస్తకములను అచ్చువేయించ తలంచి యున్న పక్షమున అనుజ్ఞ దయచేయిస్తె -విశేష ఖర్చులు తగులుబడి కాకుండా - అచ్చు తయారుచేయించుచున్నాము - ప్రభువు వారి

సమయమైతే యీ సంగతి విజ్ఞాపనము చేసుకోవలెనని చాలా కాలము నుండి కాచి యున్నాను."

ఈ ఇరువురి స్నేహము చాలా కాలము వర్ధిల్లినది. శ్రీమద్భారత ముద్రణమున కూడ పువ్వాడ వారు గణనీయమైన పాత్ర వహించిరి. (ఈ గ్రంథములో పుటలు-199, 200). వర్తమాన తరంగిణి పత్రికల ఫైళ్ళను సేకరించి బ్రౌనుదొర వాటిలోని జాబులకు కాపీలు వ్రాయించి ఉంచెను. 1842 సంవత్సరపు పత్రికల ఫైలును తన దగ్గరనే ఉంచివేసికొనెను. దీనికొరకు వేంకటరావుగారు వ్రాయుచునే యుండెను. తెలుగు వారితో "రాకపోకలు" సామాజిక సంబంధములు సాధారణముగా పెట్టుకొనని బ్రౌనుదొరను కూడ పువ్వాడ వారు కొంత "మంచి" చేసికొనగలిగిరని చెప్పుటకు క్రింది జాబును ఉదాహరణముగ గ్రహింపవచ్చును.

"పువ్వాడ వెంకట్రావు అనేక సలాములు చేసి చేయంగల విజ్ఞాపనము. త॥ విశాఖపట్టణము నుండి నాకు కొన్ని కమలాఫలములు వచ్చియుండుటచేత వాటిలో కొన్ని సముఖమునకు పంపించుకొని యున్నాను. కాబట్టి వాటిని అంగీకరించే గౌరవ మిప్పింతురని విజ్ఞాపన పరిచికొనుటకు మన్నించవలెను." (1852, డిసెంబరు 17)

ఆనాడు ఆంధ్రభారత ముద్రణమును "ముద్రాక్షరాంకనీయాంధ్ర భారత పర్యాలోచన సభ", ఆలూరి వీక్రామ జోస్యుల వారి నాయకత్వమున ప్రారంభించి నప్పుడు, దాని ముద్రణాదికమున పువ్వాడ వారి "హస్తము"ను కలదు. ఇది 1853 లో జరిగినది. పువ్వాడవారి వర్తమాన తరంగిణి పత్రిక ఆనాడు సాహిత్య సేవ చాల చేసినది. మహాభారతాది గ్రంథములలోని పద్యములకు అర్థములు, వ్యాపార ప్రకటనలు మొదలైనవి ఇందుండెడివి. వర్తమాన తరంగిణి ప్రారంభదశలో దీనితో సయ్యదు రహెమతుల్లా సాహెబు గారికి సంబంధముండెను. ఏనుగుల వారి కాశీయాత్ర చరిత్ర ద్వితీయ ముద్రణ పువ్వాడవారి యాజమాన్యముననున్న వర్తమాన తరంగిణి ముద్రాక్షరశాలలో 1869 డిసెంబరులో అచ్చయినది. పువ్వాడ వారు, తిమ్మరాజు లక్ష్మణరాయ కవిగారితో కలిసి రచించిన శ్రీమత్స్య పురాణ సారసంగ్రహము అను

వచన రచన కూడ ఇందే 1877 లో అచ్చయినది. వర్తమాన తరంగిణి ముద్రాక్షర శాల పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధమంతయు (ఇంచుమించుగా) తన కార్యకలాపాదు లను కొనసాగించుచునే యుండె ననవచ్చును. సకాలమున బ్రౌనుదొర ఇచ్చిన ప్రేరణ ప్రోత్సాహములు పువ్వాడ వారిపై గొప్ప ప్రభావము చూపెను *

బ్రౌనుదొర, వర్తమాన తరంగిణి పత్రిక (4-1-1849) నుండి "గిన్నె కాసు" అనుమాటకు అర్థవివరణమును గ్రహించి తన మిశ్రభాషా నిఘంటువులో ఇచ్చెను. ఈ పువ్వాడ వారిని గురించి ఆనాటి ఒక ఇంగ్లీషు ఉద్యోగి ఇట్లు వ్రాసెను :

**'Venkata Row, the proprietor of the Teloogoo newspaper 'Vurthamana Tharunghunee' is generally a respectable man, as far as I have heard him."**

చిన్నయసూరి (1806-1862)గారి పేరు వినని తెలుగు విద్యావంతుడుండడు కాని ఈ సూరిగారు బ్రౌనుదొర నెరుగునని ఆయన పాఠములు చెప్పుచుండెడి తరగతు లను దొరగారు పరీక్షించిరనియు, సూరిగారి అభ్యుదయమునకు కొంతవరకు బ్రౌను దొర సాయమున్నదని యూహించుటకు అవకాశమున్నదనియు చాల మందికి తెలి యదు. ఈయన జీవిత ప్రారంభదశలలో స్వల్పవేతనము మీద ఆప్టన్ మిషను స్కూలు లోను తరువాత పచ్చయప్ప పాఠశాలయందును పనిచేసెను. 1846 లో యూనివర్సిటీ బోర్డువారి హైస్కూలులో తెలుగు అసిస్టెంటు టీచరు పనిలో ప్రవేశించెను. "మద్రాసు అల్మనక్స్"ను బట్టి ఇది తెలియుచున్నది. ఇంతకుముందు పుదూరి సీతారామశాస్త్రి గారు, రామకృష్ణశాస్త్రిగారు అక్కడ పనిచేసిరి. ఆనాడు మద్రాసులో ప్రముఖులైన గాజుల లక్ష్మీనరసింహసెట్టి గారు, కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ళగారు, కలువల పల్లె రంగనాథశాస్త్రి గారు చిన్నయసూరిగారి యందత్యంతాదరము కలవారు. కాలేజి

* ఇంకను ఈ విషయమై తెలిసికొన గోరు వారు, ఈ గ్రంథకర్తయే వ్రాసిన "తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము" (ద్వితీయ ముద్రణ 1986)లో 281 నుండి 288 వరకును, 291, 292 పుటలను చూడవచ్చును

బోర్డులోను, నేటివ్ ఎడ్యుకేషన్ కమిటీలోను బ్రౌనుదొర 1838-1839 లో సభ్యుడు. ఆక్టింగ్ సెక్రటరీగా కూడ పనిచేసెను. మదరాసు యూనివెర్సిటిబోర్డునకు కూడ 1843లో కార్యదర్శి.

చిన్నయసూరి గారికి ఉద్యోగములోచేరిన క్రొత్తలో చిన్నయ్య గారని వ్యవహారము. విద్వాంసునిగా పేరు పొంది మద్రాసులోనే యున్న చిన్నయ్య గారి చేత బ్రౌనుదొర గ్రంథసంస్కరణాదికము చేయించియుండు ననుటలో సంశయము లేదు. గ్రంథసేకరణమున గూడ ఈయన సాయముండి యుండుననుట ఊహింప దగినదే. చిన్నయ్యగారు పచ్చయప్పపాఠశాలలో పనిచేయుచున్న కాలములో చేరిన క్రొత్తలో పచ్చయప్ప పాఠశాల వార్షికోత్సవములలో పచ్చయప్పగారి వదాన్యతను గురించి పద్యములు శ్లోకములు వ్రాయుట కలదు. "ఈతఁడు 1845, 46,47 సంవత్సరములలో రచించిన పద్యములు శ్లోకములు" "పచ్చయప్పయ శోమండనము" అను గ్రంథమున క్రీ.శ. 1850వ సంవత్సరమున ప్రకటింప బడినవి" అని నిడుదవోలు వేంకటరావుగారు తమ 'శ్రీపరవస్తు చిన్నయసూరిఁ జీవితము' అను గ్రంథములో(ముద్రణ19౹3)వ్రాసిరి. (పుట-13)

మద్రాసు యూనివర్సిటీ (ఈ శబ్దమునకు ఆనాటి అర్థమని గుర్తింపవలెను) లోని చదువులను గురించి పరీక్షలను గురించి వార్షిక నివేదికలు అచ్చుగుచుండెను. వాటిలో 1849లో అచ్చయిన దానిలో ("The Eighth Annual Report from the Governors of the Madras University, 1849") యూనివెర్సిటీ నిర్వాహణకు తోడ్పడుచుండిన గవర్నరుల పేళ్ళలో కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళె, కలవలపల్లి రంగనాథ శాస్త్రిగారల పేళ్లున్నవి, నేటివ్ టీచరుల పేళ్ళలో తెలుగు పండితులైన పి చిన్నయసూరి, హయగ్రీవశాస్త్రి గారల పేళ్లు కలవు. బ్రౌను దొర బోర్డుసభ్యుడు గనుక ఆయన వ్రాసినరిపోర్టు (9మార్చి, 1849 పరీక్షకు సంబంధించినది) పై వార్షిక నివేదికలో (తమిళము మొదలైన వాటితో బాటు) అచ్చయినది. (పుట 71-72).

"Report regarding the Examination held in March, 1849, of the pupils in the High School regarding their progress in the Telugu language:"

ఈ పరీక్ష నాలుగు తరగతులకు (ఇవి ఉత్తరోత్తరము ఉన్నత కక్ష్యలు) జరిగినది. ఈ తరగతులలో తెలుగు మాతృభాషగా కలవారు, లేనివారు కూడ నున్నారు. ఈ విద్యార్థులను మొదట దేశీయ విద్వాంసులు, తరువాత బ్రౌనుదొర పరీక్షించినారు. (The four classes were examined in my presence by the tutors (natives) who have been instructing them; and were afterwards xamined b y me") బ్రౌనుదొర దృష్టి, పండితుల దృష్టి భిన్నములైనవి గనుక విద్యార్థుల చదువు దొర కంతగా నచ్చినట్లు లేదు. దేశీయ విద్వాంసులడిగిన వ్యాకరణాంశములను చక్కగా చెప్పగలిగినను, తెలుగు మాతృభాషగా కలవారుకూడ సామాన్యమైన జాబులను పూర్తిగా అర్థము చేసికొనలేక పోయినట్లు దొర వ్రాసెను. ఈ సందర్భమున రిపోర్టులో ఆయన వ్రాసిన వాక్యములు మనము పరిశీలించినచో, కావ్యభాషను వ్యాకరణమును బోధింప వలెనను దృష్టితో పండితాధ్యాపకులు దైనందిన జీవితములో ప్రయుక్తములగు వ్యావహారిక నిర్మాణములను ఉపేక్షించినట్లు కనబడును:

"The Junior, class (containing eleven pupils chiefly East Indians), were laboriously examined in many niceties regardin spelling: which seem to be creditable to their diligence but are useg less. Many of the grammatical questions put by the native tutor are intended merely to astonish the audience they, contain no useful knowledge. Among the East Indian boys not one was able to converse in Telugoo or to compose the briefest translation of common phrases used in talking. I do not observe that this classsi making any progress."

"The next class (seven Hindus) has answered very respectably the various grammatical questions put by the tutors, but had samll

success in reading and construing a common letter written in Telugoo which is the mother tongue of about half the lads"

The third class (twelve lads) is more perfect in grammar, but have again the tutors, proceeding on the native method, prefer that Course which gives the greatest degree of labour and the smallest profit.

"The fourth or highest class (ten pupils) is little superior to the third but have been examined by the native tutors, in Telugoo poetry. The book they select as an exercise is the **Manu Charitra**, a poem peculiarly difficult in style: of this they have read only a few pages and have not construed these in a satisfactory manner."

"The pupils were finally called upon to write translations from Telugoo into English, and vice versa . ....... "

"The result of the examination is not gratifying : but I do no blame the pupils............"

ఈ విధముగ వ్రాయుచు, లోపములున్నవన్నచో వాటికి కారణము విద్యార్థులు కారనియు, నిర్ణీతములయిన పాఠ్యాంశముల, వాటిని బోధించు అధ్యాపకుల లోపమువే అనియు బ్రౌనుదొర తెలిపెను. నిర్ణీతములయిన పాఠ్యాంశములు శ్రమను కలిగించునలే గాని విషయ పరిజ్ఞానమును పెంచునవి కావనియుకూడ ఆయన అభిప్రాయ పడెను. ఇది వ్రాయునాటికి బ్రౌనుదొర – తెలుగులో పరీక్షకుడు; ప్రభుత్వమున అనువాదకుడు. బ్రౌనుదొర వ్రాసిన పైవాక్యములు మద్రాసు విశ్వవిద్యాలయము (ఆనాటి కదే పేరు. దీనికిని 1857నుండి ప్రచారములోనికి వచ్చిన మద్రాసు విశ్వవిద్యాలయము అనుదానికిని పేరులో తప్ప ఇంకెందును పోలిక లేదను విషయము గుర్తించు కొనవలెను.) పాలక మండలివారి అష్టమ వార్షిక నివేదిక (1848-1849) నుండి సంగృహీతము

దశమ. వార్షిక నివేదిక (1850-1851) లోని బ్రౌనుదొర వాక్యములు, అనువాదాదికములో ఆనాటి విద్యార్థుల పరిజ్ఞానమును "కనులకు కట్టినట్లు" చూపజాలి యున్నవి, పరీక్ష తీసికొన్న విద్యార్థులలో తొమ్మిది మందిమాత్రము కొంత అర్హత కలవారనియు, మిగిలిన వారిని వర్గీకరణలో చేర్చుట అనావశ్యక మనియు ఆయన అభిప్రాయపడెను. ("... of the forty seven pupils examined only nine are worth classification. The rest have done nothing") లిఖిత పరీక్షలో-తెలుగునుండి ఇంగ్లీషులోనికి, ఇంగ్లీషునుండి తెలుగులోనికి-అనువాదముఉండెనట! ఇందులో-తెలుగునుండి ఇంగ్లీషులోనికి అనువాదము ముగ్గురు విద్యార్థులు చక్కగా చేసిరనియు, ఇంగ్లీషులో నుండి తెలుగులోనికి చేసిన అనువాదములో అందరు తప్పిరనియు ఆయనవ్రాసెను.(" In translating frcm Englsh nto Telugu all failed. ") తెలుగు వర్ణక్రమములో దోషములున్న వనియు, చాంవసభాషలో వ్రాసిరనియు ఆయన తెల్పెను. మౌఖిక పరీక్షలోకూడ విద్యార్థులు అంత బాగుగ చేయలేదని ఆయన అభిప్రాయపడి, దానికి కారణము – దేశీయపండితులు, విద్యార్థుల చేత క్లిష్టములైన అనావశ్యకములైన సూత్ర విషయములన్నియు కంఠస్థము చేయించి వారి మెదడునకు భారము కలిగించుటయే అని వ్రాసెను (" The boys have been industrious but the tutors continue to burthen the memory with rules very intricate and far from profitable.) ఈ సందర్భమున ఆయన వ్రాసిన వాక్యములు: తెలుగు విద్యార్థులలో చాల మంది ఇంగ్లీషు ధారాళముగా మాటలాడ గలిగి యున్నను, ఇంగ్లీషు నుండి తెలుగులోనికి అనువాదము చేయువిషయమున అసమర్థులుగా ఉన్నారన్నది గమనార్హము. మౌఖిక పరీక్ష నిర్వహించెడి దేశీయ విద్వాంసులు అనావశ్యక విషయములపై విశేషశ్రద్ధ వహింతురని ఆయన అభిప్రాయపడెను.('The native tutors who are unacquainted with English) conduct a part of the viva Voce examination. And they devote their attention chiefly to unprofitable rules of Etymolog which Englishmen in learning Telugu dispense with as mere pedantry)

మన వ్యాకరణ పండితులు రూప సాధన (ప్రక్రియ) కిచ్చిన ప్రాముఖ్యము, పదప్రయోగమున కీయరను విషయము తెలిసిన విషయమే గదా? నాటికి నేటికి కూడ మన తెలుగు పరీక్షలలో "రూపములను సాధించునది" అని ఉన్నన్ని ప్రశ్నలు ఆయా శబ్దములను సొంత వాక్యములలో ఉపయోగించి చూపునది అను ప్రశ్నలుఉండవనునది నిర్వివాదాంశము గదా !

మచ్చా వేంకటకవి గారు (1856-1909; పర్లాకిమిడి కాలేజిలో కొంతకాలము ప్రధాన పండితులు) యొక్క "వైదర్భీ పరిణయము" న, ఆయన తండ్రియైన "గంగయాహ్వాయుడు" బ్రౌనుదొరను కలిసి మాటాడినట్లు, కలదు. పటాలములో నుద్యోగియగు గంగయ్య గారు ఆంధ్ర భాషాభిమానియు, సాహిత్యమును చదివినవాడు నగుటచే, ఈయనకు బ్రౌనుదొరతో పరిచయ మేర్పడి యుండును. "వైదర్భీ పరిణయము" లోని పద్యమిది-

> "సీ. పీ. బ్రౌన్దొరగారు మండలపు జడ్జీ సుప్రమేయంబు నం
> దే పారంజని గంగయాహ్వయుఁడు హాయింగాంచి తానాంధ్ర వి
> ద్యా పాండిత్యము మేటి గ్రంథ పఠనాద్యస్తోక నైపుణ్యమున్
> జూపెన్ రాజమహేంద్ర పట్టణమునన్ సూర్యోత్తముల్ మెచ్చనన్"

ఇట్లే, చాలమంది బ్రౌనుదొరను కలిసికొని యుందురు. ఆయన మెప్పుపొంది యుందురు. కొంత లాభమును గూడ పొంది యుందురన వచ్చును..

---

33. I had no authority except what the tahsildar's timidity pushed upon me . .. I desired that the corpse might be brought out, and the window ... ... came out with her mother and sister ... ... I immediately sent the three women up another street out of sight .. ... and ordered the funeral to be performed forthwith in my presence . ' The Asiatic Journal : London - 1828 ; July to December ; ... Asiatic Intelligence – Miscellaneou ! Page - 615.

సహగమనము క్రూరమైనది గనుక, దానిని అపుట ధర్మమని యెంచి, తన కధికారము లేకున్నను — నాటి సమాజమున తన స్థానమును, పలుకుబడిని గుర్తించిన వాడు గనుక — బ్రౌనుదొర స్వయముగా శ్మశానవాటికకు పోయి,

శవదహనము తన ఎదుట చేయించినాడు. దీనిని గురించి వ్రాసినప్పుడు కూడ: సమకాలికులైన కొందరు పాశ్చాత్యులవలె, భారతీయులను విమర్శించుటయే పనిగా పెట్టుకొనినవాడు కాడు గనుక, బ్రౌనుదొర: "తెలుగు జిల్లాలలో ఇది చాల తక్కువ" అని చెప్పినాడు. ఇది ఆయన సత్యదృష్టికి తార్కాణము.

తెలుగు వారితో కలిసి, ఇంచుమించుగా నాలుగు దశాబ్దులు వ్యవహరించిన బ్రౌనుదొరకు, ప్రజల ఇష్టానిష్టములను గూర్చియు ఆచారవ్యవహారములను గూర్చియు బాగుగా తెలియును. తెలియుటయే గాక తెలిసినవానిని ఆచరణలో పెట్టిన తనతోటి ఇంగ్లీషు ఉద్యోగులు వానిని గ్రహించుటకై హెచ్చరించుటయు కలదు. మన సంప్రదాయములు తెలియని పాశ్చాత్యులకు, తన గ్రంథములలో ప్రాసంగికముగ; తెలుగువారి సంప్రదాయములను గూర్చి బ్రౌనుదొర చెప్పుట గలదు. దీనికి తార్కాణముగా 'ఎంగిలి మాటలు' అను ప్రయోగమును గూర్చి తన 'తెలుగు వ్యాకరణము' యొక్క 'విశేషణ పరిచ్ఛేదము' లో చెప్పుచు, 'ఫుట్ నోట్' లో; "హిందువులు ఎంగిలిని అసహించు కొందురు గనుక, పెన్సిల్ గాని. పెన్ గాని నోటికి తగలనీయరాదు"34 అని వ్రాసిన వాక్యమును గ్రహింపవచ్చును.

ఎవరైనను తమ తమ మతముల ప్రచారమును, ఇతర మతములను, విశ్వాసములను దూషింపకుండ చేసికొనవచ్చునను నమ్మకము బ్రౌనుదొరకు కలదు. ఇది. పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థమున, పాశ్చాత్యులలో ముఖ్యముగ భారతదేశమునకు వచ్చిన వారిలో చాల తక్కువ — నుండెను. వారిలో అధిక సంఖ్యాకులకు అపవాదముగ. కొందరు లేకపోలేదు. అట్టి వారిలో బ్రౌనుదొర ఒకడు క్రైస్తవ మత ధర్మములను గూర్చి తెలుగు పద్యములతో చెప్పు, "నిస్తార రత్నాకరము" అను పుస్తకమును, బ్రౌనుదొర ముద్రించునప్పుడు, అందుగల హిందువుల

ఆరాధనాదికమునకు సంబంధించిన దూషణలకు తొలగించెను. ఆ సందర్భమున ఆయన వ్రాసిన క్రింది వాక్యములు ; పరమత సహనము, సభ్యత కలవారెల్లరు గౌరవించునవియే.

"The Apostles taught Christianity without reviling idols. Why should not modern teachers imitate this courteous method?' [35]

క్రైస్తవుడును, యావజ్జీవితమును క్రైస్తవ మత ప్రచారమునకై శ్రమించిన, శివరెండు, డేవిడ్ బ్రౌన్ కుమారుడును ; అయిన బ్రౌనుదొర వ్రాసిన ఈ వాక్యములు, ఆయన హృదయ వైశాల్యమునకు పతాకాలు. ఇట్టి మానవత్వము కలవాడు గనుకనే నాటి తెలుగువారు — పండితపామరు లందరును — ఆయనను గౌరవించిరి. ఆయన ఎన్నడును మత ప్రచారమునకు గడంగలేదు.[36] అట్లని, ఆయన స్వమతమును విడిచినారనియు కాదు. ఆ రోజులలో సామాన్యముగా — పాశ్చాత్యులలో — కానరాని సహనదృష్టిని ఆయన ప్రదర్శించి, తన ప్రత్యేకతను రుజువు చేసి కొనినాడు. ఇదియే తెలుగువారి హృదయముల నాకర్షించి. ఆయనను వారికి సన్నిహితునిగ చేసినది.

---

34. "The Hindus look upon spittle with disgust and are much gratified if we so far respect their feelings as to avoid touching our mouths in their presence with either the hand, a pen or pencil." (A Grammar of the Telugu language by C P. Brown : 2nd Edition : 1857 ; Page – 182.)

35. Some Account of the Literary Life of C P. Brown.

36. ఆనాడు జిల్లా అధికారులుగ పనిచేసిన వారిలో కొందరు తమ అధికారమును స్వమత ప్రచారమునకును, పరమత దూషణకును వినియోగించిరి. ఈ సందర్భమున : తన స్వార్థరహిత కృషిచే రైతుల హృదయములను చూరగొన్న సర్ థామస్ మన్రో, గవర్నరుగా నుండి బళ్లారి కలక్టరును గూర్చి వ్రాసిన వాక్యములను పరిశీలించినచో, బ్రౌనుదొర యొక్క ఆధిక్యము పొడగట్టును ఇట, నేను, 'జాన్ బ్రాడ్షాదొర' (మద్రాసులో ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్) యొక్క 'సర్ థామస్మన్రో జీవిత చరిత్ర (Ruteris of India Sersies ; Sir Thomas Munro – Oxford : 1894) నుండి ఉదాహరణముగా. బళ్లారి కలక్టరును గూర్చిన వాక్యముల నిచ్చుచున్నాను. Page-182f183 184)

భారతీయులు, ఇంగ్లీషువారు ఒకరి భాష నొకరు నేర్చుకొని, పరస్పరము అర్థము చేసికొనిన గాని, ఇరువురి నడుమ సౌహార్దము పెంపొందదనియు అట్టిర్థము

---

"In 1822 some trouble was caused by the efforts made by a sub-collector in Bellary to convert the natives to christianity; and from Sir Thomas Munro's long and able minute on the subject, the following extracts are worth quoting :-

'Everything in the sub-collector's report is highly commendable, excepting those passages in which he speaks of the character of the natives, and of his having distributed books among them. He evinces strong prejudice against them, and deplores the ignorance of the Rayats, and their uncouth speech ... ... He speaks as if these defects were peculiar to India, and as if all the farmers and labourers of England were well educated and spoke a pure dialect ......,

— — did all that a missienary could have done : he employed his own and the district cutcheries in the work; and he himself both distributed and explained. If he had been a missionary, what more could he have done ? He could not have done so much. He could not have assembled the inhabitants, or employed the cutcheries in distributing moral and religious tracts. No person could have this but a civil servant...yet he cannot in this discover official interference." 'He employs his official authority for missionary purposes ; and when he is told by his superior that he is wrong, he justifies his acts by quotations from Scripture' — —

The agency of collectoro and magistrates, as religious instructors, can effect no possible good .

ఇట్టి పరిస్థితులున్న దినములలో, బ్రౌనుదొర తన అధికారమును దుర్వినియోగము చేయలేదన్నచో, ఆయన వైశిష్ట్యము స్వయంవ్యక్తము గదా !

చేసికొనుటకు తనరచన లేమాత్రము సాయపడినను, తాను కృతార్థత చేందినట్లేయ నియు, బ్రౌనుదొర భావించెను.[37] ఇట్లు భావించుట కూడ నాడు విప్లవాత్మకమైనదే.

బ్రౌనదొర తాను తెలుగు పండితుల వలన లాభమును పొందినట్లే, తానును తెలుగువారు ఇంగ్లీషు నేర్చు కొను విషయమున లాభమును వారికి చేకూర్చెను. చాల మంది, తాము ఇంగ్లీషు నేర్చుకొందుమని ఆయన సాయ మపేక్షించుటయు,[38] వారి కది లభించుటయు జరిగినది. అట్లు నేర్చుకొనుచున్న వారి ఇష్టానిష్టములను గూర్చి వ్రాయుచు వారికి పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్ (Pilgrims Progress) రాబిన్ సన్ క్రూసో (Robinson Crusoe) బైబిల్ The Holy Bible అనునవి సులభ సాధ్యములును, ఆకర్షకములును అని తెలిపెను.[39]

---

37. "Unless we read their books, and have daily communications with the Hindus, what insight can we obtain into the minds of the people ? In like manner the prejudices of Hindus regarding ourselves, can only be removed by a course of English reading".
(A Grammar of the Telugu Language; Preface ; Page – VII)

38. "తిరువళ్ళూరు కాపురస్థుడయిన రామయ్య మిక్కిలి వినయముతో సలాములు చేసి వ్రాసుకొన్న మనవర్జీయేమంటే : నేను విద్యాపేక్షగలవాడనై యిచ్చటికి వచ్చి, అన్న పానాదులకు కూడాలేక, మిక్కిలి శ్రమపడుతున్నాను. ఇంగ్లీషు చదవడమునకు మాత్రము తెలుసుకొని వున్నాను. గనుక, ధర్మ ప్రభువులైన తాము నాయందు మిక్కిలి విశ్వాసము వుంచి, పైన వుదాహరించిన ఇంగ్లీషు చదువును నేను వృద్ధిచేసుకొనే లాగుననున్ను అన్నపానాదులకు జరుపుకొనే లాగుననును యేమయినా దయ చేయించ వలెనని కొరుతున్నాను."
(తెలుగు రీడరు ; పుట – 97.)

39. "Many Brahmans have applied to me for instruction in English, and they have found Bunyan's Pilgrim's Progress . Robinson Crusoe ; and the Holy Bible, the easiest and most attractive books. They have read others with me, but nothing has equalled these three :" (Some Account of the Literary Life of C. P. Brown.)

తెలుగు ప్రజలకు సాయము చేయవలెనను దృష్టి.[40] ఆయనకు మొదటి నుండియు కలదు, ఈ దృష్టితోడనే ఆయన తన గ్రంథములలో చాలభాగము రచించెను. అవి, తెలుగు వారికి ఆంగ్లమును, ఇంగ్లీషు వారికి తెలుగును, నేర్చుకొనుటకు వీలుగ నుండవలెనని ఆయన ఉద్దేశించెను. కనుక నిఘంటువులు మొదలైన వాటిలో పాశ్చాత్యులు పునరుక్తియనిగాని, అనావశ్యకమనిగాని తలంచువానిని, తెలుగు వారికొరకై ఉంచెను[41]. ఇదిగాక, ఆంగ్లము నేర్చుకొనగోరు తెలుగువారికి పనికి వచ్చు భాషాసామగ్రిని గ్రంథారంభమున ముద్రించెను.[42] ముఖ్యముగా తన ఇంగ్లీషు తెలుగు నిఘంటువు, తెలుగువారు ఇంగ్లీషు సాహిత్యమును చదివి ఆనందించుటకు పనికివచ్చునని బ్రౌనుదొర తలంచెను[43]. ఇదిగాక, తెలుగులోనికి సరిగా అనువాదము చేయుటకు వీలుకాని, ఇంగ్లీషు పుస్తకములను తెలుగువారు చదివి అర్థము చేసికొనుటకు కూడ తన ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు పనికివచ్చునని బ్రౌనుదొర ఊహించెను[44].

---

40. "To benefit the Hindus was always my primary object." (Ibid.)

41. "Writing particularly to assist the Hindus, I have given some minute explanations which Englishmen may deem superfluous But to the Hindus they are advantageous." (English–Telugu Dictionery–C. P. Brown, 1852. Page–5. Preface )

42. "At the request of some Telugu friends I have reprinted a system of English pronounciation; which they believe greatly enhances the utility of the Dictionary " (Ibidem.)

43 "This work may render English literature accessible to all the Hindus who fill the Indian Peninsula." (Ibidem )

44. " in writing the English–Telugu Dictionary, one object has been, to provide the Telugus with a means of under-standing some English books which cannot be satisfactorily translated into Telugu." (Ibidem)

ఇట్లు తెలుగువారికి, ఇంగ్లీషు వారికి కూడ పనికివచ్చునట్టి గ్రంథములను వ్రాయుటయే కాక: తెలుగువారికొరకై బడులను కూడ బ్రౌనుదొర స్థాపించెను. ఈ బడులలో ; తెలుగు హిందుస్థానీ, ఫార్సీభాషలు నేర్పబడు చుండెడివి. 1821 లో కడపలో రెండు పాఠశాలలు, 1823 లో మచిలీపట్టణములో రెండును, స్థాపింప బడినవి. 1844లో మదరాసులో ఒక "ధర్మబడి" స్థాపింపబడినది. ఇందు ఇంగ్లీషు, తెలుగు, తమిళ విద్యార్థులు ఎనుబదిమంది వరకు కలరట. 45

ఈ బడులు కొన్ని సంవత్సరములు చక్కగా పనిచేసినవి. తరువాత, తనకు వాటిని జాగరూకతతో పరీక్షించుటకు కాలము కుదరకుండుటచేతను, వాటి నిర్వహణమున కొన్ని లోపములు గోచరించుట చేతను, బ్రౌనుదొర వాటితో తన సంబంధమును వదలించుకొనెను. తరువాతనివి, రెవరెండు క్రిష్టియన్ అరులపెన్ (Rev Christian Arulapen) అనునాతని చేతిక్రిందికి వచ్చినవట.

బ్రౌనుదొర స్థాపించిన ఈ పాఠశాలలు, పేదవారైన వారి పిల్లలు చదువుకొను టకు చాల పనికి వచ్చెను. ముఖ్యముగా, ఇంగ్లీషు చదువుకొన నెంచిన బాలుర కివి చాల సాయపడినవి. ఈ చదువు కొరకు; నాడు బాలురు, వారి బంధువులు ఎంత శ్రమ పడెడివారో, ఎంతదూరము పోయెడివారో, మనకు చక్కగా తెలుపుటకు క్రింది జాబు పనికివచ్చును

"తమ సేవకుడు వోరుగంటి వరదయ్య మిక్కిలి వినయపూర్వకముగా అనేక సలాములు చేసి వ్రాసుకొన్న మనవి యేమంటె .... ... మా తండ్రి ... పరమ పదము ంచేసినాడు. పిమ్మట, మాతల్లి కూలికి దంచి, నన్ను కాపాడుతూ వచ్చెను. నేను చదువుకోవలె నంటే, నాకు బందరులోనే, వొక అయ్యవారికి నెల ౧ కి పావులా

45. "At different times I opened free schools with native masters to teach Telugu and Hindusstani. In 1821 two such began at Kadapa, and two at Masulipatnam in 1823. In 1844 I established a free school at Madras, for about eighty English, Telugu, and Tamil pupils." (Some Account of the Literary life of C. P Brown.)

యిప్పించి, తెనుగు చదువు నేర్పించినది. అటుతర్వాత, యింగ్లీషు నేర్చుకోవలెనంటే చెన్నపట్నములో ధర్మబళ్ళు శానావున్నవని, నన్ను యీ దేశములోకి తీసుకొనివచ్చి, యెళుంబూరిలో వుండే తమ ధర్మబడిలో విడిపించి, ఆమె యెప్పటివలెనే కూలికి పోతూ నన్ను కాపాడుతూ వుండెను." (తెలుగు రీడరు ; పుట - 72).

"ఎళుంబూరు" ను "ఎగ్మూరు" అని ఇంగ్లీషువారు ఉచ్చరింతురని బ్రౌనుదొర ఈలేఖ యొక్క ఆంగ్లానువాదములో వ్రాసెను [46]

బ్రౌనుదొర స్థాపించిన "తెలుగుబళ్ళు" లో, విద్యార్థులకు భోజన వసతి కూడ యుండెడిదని తెలియుచున్నది. కడప, మచిలీపట్టణములోని వీటియందు బాలురు చేరి తెలుగు, హిందూస్థాని, పార్సీ మొదలైన భాషల నభ్యసించెడివారు. ఈ క్రింది జాబు అట్టి బడిలో తనకు ప్రవేశము కల్పింపుడని ఒక విద్యార్థి వ్రాసి కొన్నది. "తమరు నావంటి రిక్తులను చేబట్టి, ధర్మార్థముగా అన్నానకు యిస్తూ, చదువు చెపిస్తూ వున్నారని తెలిసినది గనుక నాయందున్న దాక్షిణ్యము వహించి. నాకున్ను అన్నానకు యిచ్చి, సంరక్షణ చెయ్యవలెనిన్ని, తమరు ధర్మార్థముగా వుంచిన తెలుగు పాఠశాలలో, నన్ను ప్రవేశపెట్టవలెననిన్ని, వినయ పూర్వకముగా ప్రార్థిస్తున్నాను."

(తెలుగు రీడరు ; పుట - 9.)

బ్రౌనుదొర స్థాపించిన బళ్ళలో పార్సీ కూడ చెప్పెడి వారనుటకు నిదర్శనముగా అయోధ్యాపురం కృష్ణారెడ్డి గారు వ్రాసిన లేఖలోనుండి ఉదాహరించు చున్నాను. ఇది ఆతడు బ్రౌనుదొరకు వ్రాసినది.

"తమ సముఖములోకి నన్నురప్పించే ప్రయత్నముచేస్తే, యిక్కడ తమతోట బంగాళా చెడిపోవునని, మీరు ఆలోచింతురేమో, నా తమ్ముడయిన నారాయణ రెడ్డి అనేవాడు, యేమి పనిలేక వూరికె వున్నాడు. ఫారిషిన్ని తమ బడిలో అభ్యసించినాడు, తమ బంగాళానున్ను తోటనున్ను కాపాడేపాటి శక్తిగలవాడై వున్నాడు."

(తెలుగు రీడరు , పుట - 174,275).

---

46. "......which the English pronounce Egmore." (English Translation of the Telugu Reader : Page - 41.)

ఇట్లు పాఠశాలలను స్థాపించియు, తన యొద్ద చదువనెంచిన వారికి ఇంగ్లీషు చెప్పియు, బ్రౌనుదొర తెలుగు వారిలో నూతనతేజము వృద్ధిపొందుటకై కృషి చేసెను. తెలుగు ప్రజలతో విశేషముగా కలిసి మెలిసి తిరుగకున్నను, తన సాయము కావలసిన వారి కెప్పుడును బ్రౌనుదొర అందుబాటులోనే యుండెను. తెలుగు ప్రజలకు బ్రౌను దొరకు నడుమనున్న సంబంధమును సంపూర్ణముగా అర్థము చేసికొనుటకు, ఆయన వాల్యూములుగా సేకరించి పెట్టి పోయిన జాబులు మొదలైన సామగ్రి సాయపడును. అనేకములైన పరిశోధనాంశములకు సరిపోయెడి సామగ్రి అందున్నది. ఈ గ్రంథ రచనోద్దేశము - ముఖ్యముగా ఈ ప్రకరణ రచనోద్దేశము - ఆ సంబంధము దిఙ్మాత్రముగా ప్రదర్శించుటయే గాని దేనిని వివిధ దృక్కోణములనుండి పరిశీలించుట కాదు గనుక అది తగు మాత్రము - బ్రౌనుదొర జీవిత చరిత్రలోని వైశిష్ట్యము స్థూలముగా చూపుటకు తగినంతగా మాత్రమే గ్రహింపబడినది. ఈ పుస్తకములోని ప్రత్యేక ప్రకరణమును (వ్యాకరణ రచన, నిఘంటు నిర్మాణము మొదలైనవి) ఒక్కొక్క గ్రంథమునకు ముఖ్యాంశముగా గ్రహించి గ్రంథములు వ్రాయ వచ్చును. అది ఇతర పరిశోధకులు చేయవలసిన పని బ్రౌనుదొర సమగ్ర కృషిని తెలియజేయు వివిధాంశములకు సంబంధించిన విషయములను కొంతకు కొంత ఇందు చూపించుట జరిగినది. ఉద్యోగధర్మము ననుసరించి, జిల్లాలలో తిరుగుట వలన కూడ, ప్రజల మంచి చెడ్డలను ఆయన బాగుగా గ్రహింప గలిగెను. పండితుల పాండిత్యము యొక్క లోతు గ్రహింపగలిగెను [47] లౌకికులైన తెలుగువారు వేగముగా ఇంగ్లీషును నేర్చుకొను చుండుటను చూచి మెచ్చుకొనెను. తనకు సమకాలికులైన కొందరు పాశ్చాత్యులు

---

47. "While I was engaged in printing the Dictionaries, and translating the Bible, my pandits steadily proceeded in the task of editing the native authors preparing telugu commenteries and indexes, Thus there three separate sets of Brahmans engaged under my roof, which peope called "Brown's College" (Some Account of the Literary Life of C. P. Brown)

భారతీయులను, వారి తెలివి తేటలను హేళన చేసిన సందర్భమున ; ఆ "దొరల"ను హెచ్చరించుచు ఆయన అనిన వాక్యములు, బ్రౌనుదొరకు తెలుగువారి విషయమైగల గౌరవాదరములను వ్యక్తము చేయును.

',I do not undervalue the scholarship of the Hindus : with their limited means they have done excellently. Few of us have a moderate acquaintance with their tongues, while thousands of them have a respectable acquaintance with English. If we possessed their patience and detemination in acquiring knowledge, we should think less lightly of their proficiency."[48]

ఇట్టి సద్భావమే బ్రౌనుదొరను 'ప్రజల మనిషి' గా చేసెను.

---

48, Telugu–English Dictionary : 1852 . Preface. Page–IV

# BIBLIOGRAPHY

BROWN'S WORKS :

Prosody of the Telugu and Sanscrit languages explained - Madras 1827.

The verses of Vemana - Madras, 1829.

A familiar analysis of Sanscrit prosody - London, 1837.

A new Telugu version of the Gospel according to St. Luke - Madras 1838.

A grammar of the Telugu language - Madras, 1840; 1857.

Memoires of Hyder and Tippoo (Translated from Marathi) - Madras 1849.

Cyclic tables of Hindu and Mahomedan chronology, regarding the history of the Telugu and Kannadi countries - Madras, 1850.

An Ephemeris (1751-1650), Madras, 1850.

The Telugu Reader, being a series of letters, private and on business police and revenue matters, with an English translation; notes explaining the grammar and a little lexicon. Madras, 1852.

English translations of the exercises and documents printed in the Telugu Reader. Madras, 1852.

Analysis of the words in the first chapter of the Telugu Reader, Medras, 1852.

A little lexicon - Madras, 1852.

A Catalogue of irregular verbs in the English language - Madras, 1852.

The Telugu—English dictionary - Madras, 1852; 1903.

The English—Telugu dictionary - Madras, 1852; 1895.

The Zillah dictionary - Madras, 1852.

Vakyavaly - Madras, 1852.

Three Treatises on Mirasi rights (Edited) - Madras, 1852.

Dialogues in Telugu and English (Second edition) - Madras, 1853. (The same in Tamil, Kannada and Hindustani).

The wars of the Rajas (Telugu original, with English translation) - Madras, 1858.

Disputations on village business (Telugu originals, with English translation) - Madras, 1855.

Popular Telugu tales - Madras, 1855 - (Telugu original, with English translation).

A Titular memory - London, 1861.

Carnatic chronology - London, 1863.

Sanscrit prosody and numerical symbols explained - London, 1869.

Articles, Notices etc :—

On the proportions of statues'—The Asiatic Journal. London, Nov. 1828. (Page - 596).

Essay on the language and literature of the Telugus - The Madras Journal of Literature and Science (Vol - X) Madras, July - Oct, 1839. (Pages. 43-59, 360-367).

Essay on the Creed, Customs and Literature of the Jangams. (Vol. XI), Madras, 1840. (Also The Journal of the Royal Asiatic Society. Vol - V. N. S. 141 - 146.) London, 1871.

Notices of some Roman Catholic books existing in the Telugu language (Vol. XII. P. 5) Madras, 1840.

On Malabar, Coromandel Quilon. (The Journal of the Royal Asiatic Society - N. S. Vol. V, 1871 - P. 147 - 148).

On the Numerals of Balaam's name. (Page - 732) The Christian Observer, London, 1847 (December).

Notices of Books and Authors mentioned in the Preface to Telugu - English Dictionary - Madras, 1852.

Translation of a Maheratta Document Account of the Tribes of Maharatta Brahmans. No. 851 of the Mackenzie Collection.

In Sanscrit — The Book of Psalms and tha Book of Proverbs in metre. (Reprinted in Telugu character, from originals) Published in Bengal in the Nagari Script.

SOME ACCOUNT OF THE LITERARY LIFE OF C. P. BROWN LONDON, 1866.

Translations done as Persian and Telugu Translator to the Government of the East India Company

OTHER WORkS :

*Arden, A. H.* — A Progressive Grammar of the Telugu language, Madras, 1873.

*Bowrey, Thomas* — Countries round the Bay of Bengal. Cambridge, 1905.

*Bradshaw, John* — Sir Thomas Munro, Oxford, 1894.

*Brown, Hilton* — The Sahibs. London, 1948.

*Brown, William* — A Grammar of the Gentoo language. Madras, 1817.

*Buchanan, Dr. Cladius* — The Star in the East. New York 1809.
Christian Researches in Asia. London, 1840.

*Buchanan, F. H.* — A Journey from Madras. London, 1807.

*Burnell, A. C. and Yule, H.* — A Glossary of Anglo-Indian Colloquial words and phrases. London, 1886.

*Caldwell* — A Comparative Grammar of the Dravidian languages. Madras. 1855, 1875.

*Campbell, A. D.* — A Grammar of the Telugu language. Madras, 1816, 1820, 1849.

*Campbell, Sir George* — Memoirs of my Indian career. London, 1893.

*Campbell, Rev. William*— British India. London, 1858.

*Carey, Dr. William* — A Grammar of the Telinga language. Serampore, 1814.

—Serampore Letters.

*Carey, W. H.* —The good old days of Honorable John Company. Simla, 1882.

*Chesney, Sir G.* —Indian Polity. London, 1894.

Christian Biography (Religious Grace Society)

*Dubois, Abbe J. A.* — Hindu Manners, Customs and Ceremonies, Oxford, 1906.

*Dutt, Romesh* — Economic History of British India. London, 1902.

— India in the Victorian age. London, 1904.

*Elliot, Sir H.M.* — The History of India as told by its own historians (1867-1877).

*Foster, Sir William* — Early English Travellers in India. 1921.
— The English factories in India (1637-1641). 1942.

*Frazer, R. W.* — British Rule in India. New York, 1897.

*Griffiths, Sir Percival* — The British impact on India. London, 1952.

*Hamilton, Captain Alexander* — A new account of the East Indies. Edinburgh, 1727.

*Heber, Dr. Reginald* — Narrative of a Journey. Philadelphia, 1829.

*Howitt, W.* — Colonization and Christianity. London, 1838.

*Hunter, W.W.* — A History of British India. London, 1899.

*Jones, Sir William* — Complete Works (8 Vol.) London, 1799-1801.

*Kaye, Sir J.W.* — Hjstory of Christianity in India. London, 1845.
— The Administration of the East India Company, London, 1853.
— Lives of Indian officers. London, 1904. (New Edition).

*Keith A.B.* — Speeches and documents on Indian policy (1750-1921). London, 1922.

*Kincaid, Dennis* — British Social life in India. London, 1939.

*Leonowens, A.H.* — Life and Travel in India. Philadelphia, 1884.

*Marshman, J.C.* — Life and Times of the Serampore Missionaries. London, 1859.

*Master, Streynsham* — The Diaries. London 1911.

Memorial Sketches of the Rev. David Brown. London 1816.

*Penny, Rev. Frank* — The Church in Madras.

*Prinsep, J.T.* — Essays on Indian Antiquities.

*Roberts, (Miss) Emma* — Scenes and Characteristics of Hindustan. London, 1835.

*Roberts, F.S.R.* — Forty one years in India. London, 1908.

*Sankaranarayana, P.* — An English — Telugu Dictionary. Madras, 1928.

*Shipp, John* — Memoirs, New York, 1890.

*Simeon, Rev. Charles* — Memoirs, New York, 1859.

*Smith (Captian)* — System of Government in India.

The Bible in Everyland, 1860.

The Dictionary of National Biography. London.

*Thomson, E J.* — Rise and fulfilment of British rule in India. London, 1934.

*Thomson, George* — Lectures on British India.

*Wheeler, J.T.* India under British rule. London, 1886.

*Willson, Beckles* — Ledger and Sword. New York. 1903.

*Wilson, Horace Hayman* — A glossary of Judicial and Revenue terms. London, 1855.

*Wilson, R. S.* — The Indirect effect of Chritian Missions in India, 1928.

*Woodall, W. L.* — William Carey of India. New York, 1951.

*Catalogues, Reports, Journals Etc.,*

A Catalogue Raisonnee of Oriental Manuscripts - Madras, 1857.

A Descriptive Catalogue of Mackenzie's Collections, with his life (Second Edition) Madras, 1882.

A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Govt. Oriental Manuscript library - Vol, IX - Madras, 1947.

A Descriptive and Historical Account of the Godavary District in the Presidency of Madras (Henry Morris) - London, 1878.

Gentleman's Magazine - London, 1788.

Imperial Gazetter of India - Provincial Series - Madras I, Madras, 1908.

Journal of the Royal Asiatic Society (London) 1834, 1835, 1836, 1885.

Lord Macaulay's Minute of Dissent (2-2-1835).

Notes on and Extracts from the Goverment Rocords of Fort St. George - 1871.

Report from Select Committee on the affairs of the East India Company - Vol. VI - 1832.

Report (36th) of the British and Foreign Bible Society.

Sir Thomas Munro's —

Minute on the Study of Native Languages (7-11-1823).

Minute on Native Education. (10-3-1826).

Minute on Promotion of Natives (27-4-1827).

The Asiatic Journal (London - 1818, 1821, 1828, 1835, 1837).

The Madras Journal of Literature and Science.

The Madras Journal of Education (1868).

The Madras Goverment Gazette Extraordinary (9 July, 1827).

## తెలుగు పుస్తకములు :

కాశీయాత్ర చరిత్ర — ఏనుగుల వీరాస్వామయ్య (దిగవల్లి వేంకట శివరావుగారి తృతీయ ముద్రణము 1941.)

చాటుపద్యరత్నాకరము

తెలుగు మెఱుగులు — వేటూరి ప్రభాకర శాస్త్రిగారు

తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము — కొత్తపల్లి వీరభద్రరావు

మను చరిత్ర — అల్లసాని పెద్దన (బ్రౌనుదొర ప్రోత్సాహమున జూలూరి అప్పయ పండితుని వ్యాఖ్యతో 1851 లో అచ్చయినది)

ముసలమ్మ మరణము — కట్టమంచి రామలింగా రెడ్డిగారు

లంకా విజయము (రావణ దమ్మీయము) — పిండిప్రోలి లక్షణకవి

వసు చరిత్ర — భట్టుమూర్తి (రామరాజ భూషణుడు) — బ్రౌనుదొర ప్రోత్సాహమున జూలూరి అప్పయ పండితుని వ్యాఖ్యతో 1844 లో అచ్చయినది)

వైదర్భీపరిణయము — మచ్చా వెంకటకవి

పత్రికలు మొదలైనవి :

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (పరీధావి, మార్గశీర్షము)

ప్రతిభ (గిడుగు వేంకట రామమూర్తిగారి స్మారక సంచిక ; సంపుటి - 4)

భారతి, స్రవంతి మొదలైన పత్రికలలోని వివిధ వ్యాసములు.

# అ ను బ ం ధ ము

సి. పి. బ్రౌన్ చిత్రపటము కొరకు చాల ప్రయత్నములు చేసితిని. మన దేశములోను, పాశ్చాత్య దేశములలోను కూడ నది లభింపలేదు. మన దేశము నుండి 1960 లో, బ్రిటిష్ హై కమిషనర్ గారి ద్వారా కూడ ప్రయత్నించితిని. కాని లాభము కలుగలేదు. ఆ సందర్భములోని లేఖలను కొన్నింటి నిట చూపు చున్నాను. అప్పుడు హై కమిషనర్‌గా, ది రైట్ అనరబిల్ మాల్కొలం మేగ్డనాల్డ్ గారున్నారు.

2 King George's Avenue,
New Delhi,
22nd April, 1960.

Dear Dr. Veerabhadra Rao,

Thank you for your very kind letter of April 11th. I enjoyed meeting you the other evening at Gwyer Hall, and hearing about your writings. I was particularly interested to learn of your book about Charles Philip Brown.

I am at once getting on to the job of trying to trace a photograph of him. I may not be successful, but I shall do my best. When I know the result I shall write to you again.

With all good wishes

Yours sincerely,
(Sd.) Malcolm Mac Donald.

దీని తరువాత, 'బ్రిటిష్ ఇన్ఫర్మేషన్ సర్వీసెస్' వారి వద్ద నుండి బ్రౌనుదొర చిత్రపటమునకై ప్రయత్నించుచున్నట్లు జాబు వచ్చినది.

British Information Services,
Office of the U. K. High Commissioner in India,
Chanakyapuri,
New Delhi - 21'
27th April, 1960.

Dear Dr. Rao,

The High Commissioner has asked me to see whether we can obtain for you a picture of Charles Philip Brown.

This is to let you know that we have written to London with a request for a portrait, if one is available.

You will be informed of the outcome of this request as soon as we hear ourselves.

Your's sincerely,
(Sd.) R.W. Boxter.
(Editor-in-Chief)

ఈ జాబు తరువాత కొంత ఆశ కలిగినది. కాని తుదకు లాభము లేకపోయినది.
ఈ విషయమును పై 'సర్వీసెస్' వారు, ఒక లేఖలో నిట్లు తెలిపిరి.

British Information Services,
Office of the U. K. High Commissioner in India.
Chanakyapuri,
New Delhi-21,
30th May, 1960.

Dear Dr. Rao,

With reference to your letter of April 11 and mine of April 27 :

I have just heard from the Central office of Information, London, to the effect that they have tried all likely sources including the Royal Asiatic Society, the India Office Library, various branches of London University and the national Portrait Gallery, but unfortunately have not been able to find any picture of Charles Philip Brown.

I am sorry we have not been able to help.

Yours sfncerely,
(Sd.) R. W. Boxter,
(Editor-in-Chief).

ఈ విధముగా ప్రయత్నము లన్నియు వమ్మైనవి. తరువాత నేను లండను వెళ్ళినప్పుడు ప్రయత్నించితిని. అమెరికాలో ప్రయత్నించితిని. స్థానిక పత్రికలలో దీనిని గూర్చి ప్రకటించితిని. లాభము లేక పోయినది. కాని, బ్రౌనుదొర యొక్క సోదరి సంతతి ఇంకను ఐర్లండులో కొందరున్నట్లు తెలిసినది. అక్కడ కూడ ప్రయత్నించుచున్నాను. ముందు ముందు బ్రౌనుదొర చిత్రపటము దొరకవచ్చునను ఆశ లేకపోలేదు. అంతవరకు, అతని యశఃకాయమే మన కుండునది.

## అ ను బ ం ధ ము II

### బ్రౌనుదొర గ్రంథములు : అచ్చు పుస్తకముల

### ప్రథమ ముద్రణ ముఖ పత్రములు

# A GRAMMAR

OF THE

# TELOOGOO LANGUAGE,

*COMMONLY TERMED THE GENTOO,*

PECULIAR TO THE HINDOOS INHABITING THE NORTH EASTERN PROVINCES

OF THE

INDIAN PENINSULA

***BY A. D. CAMPBELL,***

OF THE

*HONORABLF EAST INDIA CGMPANY'S CIVIL SERVICE*

ON THE

MADRAS ESTABLISHMENT,

*MEMBER OF THE BOARD OF SUPERINTENDENCE*

FOR THE

## COLLEGE OF FORT ST. GEORGE.

MADRAS.

*Printed at the College Press*

*By M. Seshachellum*

1816

# ఆంధ్ర - గీర్వాణ - ఛ్ఛందము

THE

# PROSODY

OF THE

# TELUGU AND SANSCRIT LANGUAGES

EXPLAINED

BY CHARLES PHILIP BROWN,
OF THE MADRAS CIVIL SERVICE.

*MADRAS:*

PRINTED AT THE COLLEGE PRESS,
1827

# A GRAMMAR

OF THE

# TELOOGOO LANGUAGE,

*COMMONLY TERMED THE GENTOO,*

**PECULIAR TO THE HINDOOS INHABITING THE NORTH EASTERN PROVINCES**

OF THE

INDIAN PENINSULA

**_BY A. D. CAMPBELL,_**

OF THE

*HONORABLF EAST INDIA CGMPANY'S CIVIL SERVICE*

ON THE

MADRAS ESTABLISHMENT,

*MEMBER OF THE BOARD OF SUPERINTENDENCE*

FOR THE

## COLLEGE OF FORT ST. GEORGE.

MADRAS.

*Printed at the College Press*

*By M. Seshachellum*

1816

# ఆంధ్ర - గీర్వాణ - ఛందము

THE

# PROSODY

OF THE

# TELUGU AND SANSCRIT LANGUAGES

EXPLAINED

BY CHARLES PHILIP BROWN,
OF THE MADRAS CIVIL SERVICE.

*MADRAS:*

PRINTED AT THE COLLEGE PRESS,
1827

# CYCLIC TABLES

OF

HINDU AND MAHOMEDAN

# CHRONOLOGY

REGARDING THE HISTORY OF

# THE TELUGU AND KANNADI COUNTRIES

TO WHICH ARE ADDED THE
GENEALOGIES OF PARTICULAR HINDU FAMILIES, WITH
ESSAYS ON VARIOUS MATTERS OF ENQUIRY.

PREPARED BY

CHARLES PHILIP BROWN,

Madras Civil Service, Member of the College Board.
Telugu Translator to Government, etc.,

---

MADRAS
Printed By
Reuben Twigg, At the Christian Knowledge Society's Press,
Church Street, Vepery.
1850

# CYCLIC TABLES,

## EXPLAINING THE DATES USED IN

## HINDU AND MAHOMEDAN CHRONOLOGY:

REGARDING THE

## HISTORY OF THE TELUGU AND CANARESE COUNTRIES

PREPARED BY C. P. BROWN,

MADRAS CIVIL SERVICE,

*TELUGU TRANSLATOR TO GOVERNMENT, &c.*

| A. D. | Salivahana Sacam | Title | Notes |
|---|---|---|---|
| Probable | True. Variation | | |
| 967 | 889 | 1. Prabhava | Contractions of Sanscrit epithets used in |
| 968 | 890 | 2. Vibhava | these Tables. |
| 969 | 891 | 3. Sucla | S. Sri *meaning* 'His Grace, |
| 970 | 892 | 4. Pramoduta | D. Deva 'Noble' |
| 971 | 893 | 5. Prajotpatti | M. Maha 'Great' |
| 972 | 894 | 6. Angirasa | R. Raja,Raya,Rayalu 'Prince,King,Baron' |
| 973 | 895 | 7. Srimukha | P. Pratapa 'Illustrious' |
| 974 | 896 | 8. Bhava | N. Nayac 'Lord' |
| 975 | 897 | 9. Yuva | V. Vira 'Honorable' |
| 976 | 898 | 10. Dhatu | Chac. Chacravarthi 'Emperor' |
| 977 | 899 | 11. Iswara | |
| 978 | 900 | 12. Bahudhanya | |
| 979 | 901 | 13. Pramadi | |
| 980 | 902 | 14. Vicrama | Kalachurya Chac. R. Murari-Sovi D. ruler |
| 981 | 903 | 15. Vishu | of Kalyanam, capital of (Soonda) the |
| 982 | 904 | 16. Chitrabhanu | Koontala Desam. |
| 983 | 905 | 17. Swabhanu | |
| 984 | 906 | 18. Tarana | |
| 985 | 907 | 19. Parthiva | Year 4086 of the KALI AERA. |
| 986 | 908 | 20. Vyaya | |
| 987 | 939 | 21. Sarvajit | Year 377 of the HEJIRA. |
| 988 | 910 | 22. Sarvadhari | Banavasi, a city in the Sunda sountry, |
| 989 | 911 | 23. Virodhi | was ruled by Tailapa D, son of VRD, |
| 990 | 912 | 24. Vicriti | who was son of Kama DR. |
| 991 | 913 | 25. Khara | |
| 992 | 914 | 26. Nandana | |
| 993 | 915 | 27. Vijaya | These two Titles frequently change places. |
| 994 | 916/915 | 28. Jaya | Kalachurya Bhuja Bela Chacravarti. |
| 995 | 917 | 29. Manmatha | Murari Sodi DR |
| 996 | 918 | 30. Durmukhi | Note regarding the column of Varia- |
| 997 | 919 | 31. Hevilambi | tions. |
| 998 | 920 | 32. Vilambi | Usually the Titles are quoted correctly, |
| 999 | 921 | 33. Vicari | according to the regular SS.numeral: |
| 1000 | 222 | 34. Sarvari | but occasionally the numeral varies. |
| 1001 | 923 | 35. Plava | Year 100 of the KOLLAM AERA. |

THE

# ZILLAH DICTIONARY,

IN THE

# ROMAN CHARACTER :

## Explaining The Various Words

USED IN BUSINESS

*IN INDIA.*

BY


CHARLES PHILIP BROWN,

Of The Madras Civil Service, Member Of The College Board, Etc.


MADRAS

Printed By D.P.L.C., Connor,
At The Christian Knowledge Society's Press
Church Street, Vepery.

1852

# CARNATIC CHRONOLOGY

THE HINDU AND MAHOMEDAN

## METHODS OF RECKONING TIME

## EXPLAINED :

WITH ESSAYS ON THE SYSTEMS :
SYMBOLS USED FOR NUMERALS, A NEW TITULAR METHOD OF MEMORY, HISTORICAL RECORDS; AND OTHER SUBJECTS.

BY CHARLES PHILIP BROWN,

*Member of the Royal Asiatic Society; late of the Madras Civil Service, Telugu Translator to Government; Senior Member of the College Board, etc., Author of the Telugu Dictionaries and Grammar, etc.*

LONDON :
SOLD BY BERNARD QUARITCH, 15, PICCADILLY.

............

1863

## పుస్తక పరిచయము

తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము రచయిత : ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు ద్వితీయ ముద్రణ, పుటలు XVI + 792.

పాశ్చాత్యుల - ముఖ్యముగా ఇంగ్లీషువారి-సంపర్కము వలన మనలో వచ్చిన మార్పుల కాలమును-స్థూలముగా-ప్రభావఖండము, వికాసఖండము, అని రెండుగా విభజింపవచ్చును. ఈ ప్రభావఖండము ఇరువదవ శతాబ్ది తొలి యుషస్సుల వరకు కొనసాగినది. ఇరువదవ శతాబ్ది ప్రారంభమునుండి వికాస ఖండము కొనసాగు చున్నది. ప్రభావఖండమును తిరిగి: ఉషఃకాలము (16, 17, 18 శతాబ్దులు), బ్రౌణ్యయుగము (19వ శతాబ్ది పూర్వార్థము), వీరేశలింగ యుగము (19వ శతాబ్ది ఉత్తరార్థము) అని విభజింపవచ్చును.

ప్రభావ ఖండములోని ఉషఃకాలమున వాణిజ్యమునకై పాశ్చాత్యుల రాక, వారి రాజ్యస్థాపన ప్రయత్నములు; క్రైస్తవ ధర్మముతో ఆ ధర్మ గ్రంథములతో ప్రజలకు ప్రత్యక్ష సంబంధము, పరోక్ష పరిచయము మొదలైనవాటివలన తెలుగు భాషా సాహిత్యములలో నాగరకతా సంస్కృతులలో వచ్చిన మార్పులు వివరింప బడెను.

బ్రౌణ్యయుగము ప్రారంభించునాటికి ఇంగ్లీషువారు పాలకులుగా స్థిరపడుచు వచ్చిరనవచ్చును. పాశ్చాత్య సభ్యతా సంస్కృతుల ప్రభావము దావక్రింద నీరువలె ప్రాకజొచ్చెను. ఇందువలననే, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థమైన బ్రౌణ్యయుగ మున, మన భాషా సాహిత్యములకు ఆధునికతను తెచ్చిపెట్టిన సర్వ విషయములకు బీజావాపము జరిగెననుట సత్యదూరముకాదు. పాశ్చాత్యుల భాషాసేవ-ముఖ్యముగా బ్రౌనుదొర సేవ-దాని ప్రభావము; ఇంగ్లీషు చదువుల వ్యాప్తివలన దేశీయులైన విద్యావంతులలో పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతుల పరిజ్ఞానమధికమైవచ్చిన మార్పులు: తెలుగు సాహిత్యమును చెదలపాలుకాకుండ రక్షించుటయేగాక, దానిని-ఊహించు టకు కూడ వీలులేనంతగా-ప్రజల కందుబాటులోనికి తెచ్చిన ముద్రణ వ్యాప్తి మొద లైనవన్నియు ఇట విస్తృతముగ సోదాహరణముగా వివరింపబడినవి.

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధము 'వీరేశలింగ యుగము'. ఈ 'ఏబది' సంవత్సరములు మన సమాజ చరిత్రలో, భాషా సాహిత్యముల చరిత్రలో "నభూతో నభవిష్యతి" అనదగిన కాలము, పూర్వార్ధములో బీజావాపము పొందిన ప్రభావముల, ఉద్యమముల, ముద్రణాది సాంకేతిక విషయముల విజృంభణ ఈ కాలమున జరిగెను. ఒక విధముగా ఈ యుగ "స్రష్ట", ఈ యుగ "సృష్టి" కూడ కందుకూరి వీరేశలింగం పంతులుగారే!

ఇంగ్లీషు చదువుల వలన వచ్చిన భావ విప్లవము యుగసంధిలో సాహిత్య పరిణామము; ప్రత్యక్షముగా విస్తృత పరిధిలో ఇంగ్లీషు భాషా సాహిత్యములతో దేశీయులకు కలిగిన సన్నిహితత్వము వలన వచ్చిన మార్పులనన్నింటిని-సాహిత్య ప్రక్రియల ననుసరించి ఇట వివరించుట జరిగినది. ఆంగ్ల సాహిత్య ప్రభావము వీరేశలింగ కవి రచనలపై ఏ విధముగా పడినదో విపులముగా ప్రదర్శితమయ్యెను.

తరువాత "సింహావలోకనము"న, వీరేశలింగ యుగ ప్రాముఖ్యమును గుర్తించి ఆనాటి సామాజిక పరిస్థితులు, వీరేశలింగ కవిపై ప్రభావము నెరపిన (ఆయన చెప్పిన, చెప్పని) వ్యక్తుల, ఉద్యమముల, రచనల, రచయితల చరిత్రలు కూడ యథోచితముగా చర్చింపబడెను. నవ్యాంధ్ర సాహిత్య వికాసమునకు సాహిత్యపరముగనేగాక, సామాజికపరముగా కూడ సుస్థిర నేపథ్యమును సృష్టించినది ఈ 'వీరేశలింగ యుగము' గనుక దీనిలో సామాజిక విప్లవ స్వరూపము కూడ దిఙ్మాత్రముగ ప్రదర్శితమయ్యెను. ఈ విధముగా ఇరువదవ శతాబ్ది ప్రారంభమునాటికి ప్రభావ ఖండము ముగిసి వికాసఖండము-తెలుగు సాహిత్య చరిత్రలో-ప్రారంభమైనది.

"తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము" నంతటిని క్రోడీకరించి సమగ్ర స్వరూపమును ప్రదర్శించు పరిశోధన గ్రంథము తెలుగులో లేదు. ఈ లోపమును పూరించుటకు చేసిన ప్రయత్నమే ఈ ప్రభావ ఖండము.

